కమ్యూనిస్టుల

# ఐక్య సంఘటన

## అన్వేషణ

(ద్వితీయ సంపుటి)

డి. వి. సుబ్బారావు

కాంతిరేఖ ప్రచురణ, చిలుకూరు 522[illegible]2.

కమ్యూనిస్టుల
ఐక్యసంఘటన
అన్వేషణ



వెల : రూ. 90-00

ప్రతులకు :
డి. వి. సుబ్బారావు
చిలుపూరు-522332
దుగ్గిరాల (మండలం)
గుంటూరు (జిల్లా)

ముద్రణ :
శ్రీరామా ప్రింటర్స్
చెరుకుపల్లివారి వీధి
విజయవాడ-2

# పరిచయం

ధర్మక్షేత్రే, కురుక్షేత్రే సమవేతాయుయుత్సవః మామకాః పాండవాశ్చైవ కిమ కుర్వతి సంయః; అని ధృతరాష్ట్రుడు అడుగుతాడు. అప్పుడేమీ వ్రాత పరికరాలున్నట్లు లేదు. రికార్డులు లేవు. గ్రామఫోన్ ప్లేట్లులేవు. క్యాసెట్లులేవు. కంప్యూటర్లు లేవు. మైక్రోచిప్స్ లేవు. వ్యాసభగవానుడు కల్పించిన దివ్యదృష్టితో సంజయుడు కురుక్షేత్రంలో ఎక్కడ ఎవరు ఎవరితో పోట్లాడుతున్నారో, ఏ బాణాలుపయోగించారో ఎవరు విరథులై పారిపోయారో ఎవరు ఎవరితో చంపబడ్డారో అంతాపూసగుచ్చినట్లు చెప్పాడు.

ఇపుడు ఆ అవసరంలేదు అనేక రికార్డులున్నవి. మైక్రోఫిల్ములు తీయబడుతున్నవి. క్యాసెట్లు, కంప్యూటర్లు కోకొల్లలు. అందుకే చరిత్రకారునికి కావలసినంత భోగట్టా లభ్యమవుతున్నది.

నేషనల్ లైబ్రరీ వున్నది. సిద్ధాంతరీత్యా అచ్చువేయబడ్డవన్నీ అక్కడకు పంపబడాలి. అవి అక్కడ నిక్షిప్తం చేయబడతాయి. 30 సంవత్సరాలవరకు అవి ప్రజలకందుబాటులో వుండవు. కాని ఇపుడా పరిస్థితిలేదు. అసంఖ్యాకంగా కరపత్రాలు వేయబడుతున్నవి; పుస్తకాలచ్చవుతున్నవి. పత్రికలు ప్రకటించబడుతున్నవి. అందుచే యిపుడు చరిత్ర అధ్యయనానికి పత్రికలు, ప్రకటనలు, వ్యాసాలు, గ్రంథాలు తోడ్పడుతున్నాయి.

ఏ యుద్ధం ఎందుకు జరిగెనో
ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో
తారీఖులు దస్తావేజులు
ఇవికావోయ్ చరిత్రకర్థం
ఈ రాణీ ప్రేమపురాణం
ఆ ముట్టడికైన ఖర్చులూ
మతలబులూ, కైఫీయతులూ
ఇవికావోయ్ చరిత్రసారం

చరిత్ర అనేది మానవ సమాజపు చరిత్ర.

చరిత్రకారులు చాలామంది వున్నారు. వారు వారి వర్గ దృక్పథం నుండి జరిగిన, జరుగుచున్న సంఘటనలను చూడటం కద్దు. ఒకే సంఘటనను యిరువురు చరిత్రకారులు రెండు విధాలుగా వ్యాఖ్యానించటం జరుగుతుంది. బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా అని చెప్పబడే ఘటనను గురించి విన్‌సెంట్‌స్మిత్ ఘోరాతి ఘోరమైనదిగా వ్రాస్తే, మేజర్ బి.డి.బాసు అసలా విషయం సురాజుద్దౌలాకు తెలియనే తెలియదని వ్రాశాడు. ఒకరిది సామ్రాజ్యవాద దృష్టి, ఒకరిది జాతీయభావ

దృష్టి. ఆ జనాల భావిని గురించి బ్రిటిష్‌చరిత్రకారులుచాలా తక్కువమందే వ్రాశారు. ఎందుకంటే సామ్రాజ్యవాద పైశాచికత్వం తెల్పటం వారికిష్టంలేదు. ఏ గిబ్బనో, ఏ మార్క్సు ఏంగిల్సులో శాస్త్రీయ దృక్పధంతో చరిత్రను విశ్లేషించారు గాని అత్యధిక సంఖ్యాకులది వర్గ దృష్టియే.

వ్రాయబడిన చరిత్ర అంతా వర్గ సంఘర్షణల చరిత్రేనని మార్క్సు అన్నాడు. మానవ సమాజమనుగడకు తిండి, బట్ట, యిల్లు, రక్షణ అత్యవసరం. దానిని వారు ప్రకృతితో పోరాడి సాధించుకుంటారు. అందుకు వారికి పరికరాలు కావాలి. ఈ పరికరాల సహాయంతోనే వారు తమ అవసరాలను తీర్చుకుంటారు. మానవుడు పరికరాలనుపయోగించే జంతువేనని అన్నారు కూడ. ఈ అవసరాలు తీర్చుకోవటంలో సమాజంలోని వ్యక్తులు కొన్ని నిర్ణీతమైన సంబంధాల నేర్పరచుకుంటారు. అవే ఉత్పత్తి సంబంధాలు. ఉత్పత్తి పెరిగినకొలది ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. ఎందుకంటే ఉత్పత్తి శక్తులు అతివేగంగా అభివృద్ధి అవుతాయి. ఆ పెరుగుతున్న ఉత్పత్తి శక్తులకు అనుగుణంగా ఉత్పత్తి సంబంధాలు పెరగవు. సంఘర్షణ అనివార్యమవుతుంది. కొత్త ఉత్పత్తి శక్తులు ఉత్పత్తి సంబంధాలపై తిరుగుబాటు చేస్తాయి. అవే విప్లవాలు. పెరుగుతున్న ఉత్పత్తి శక్తులకు అనుగుణంగా తిరిగి ఉత్పత్తి సంబంధాలు మారతాయి. వీటిపైనే, వీటి కనుగుణంగానే రాజకీయ వ్యవస్థలు, న్యాయశాస్త్రాలు ధర్మశాస్త్రాలు నీతినియమాలు మున్నగునవి ఏర్పడతాయి. మనదేశంలోనే చూడండి. రాజ్యాంగచట్టం వున్నది. అది బూర్జువావర్గ ప్రతినిధులతో తయారు చేయబడ్డది. ఆస్థిహక్కు ప్రాథమిక హక్కుగా చేయబడింది. కాని పనిచేసేహక్కుమాత్రం ప్రాథమికహక్కుగా చేర్చబడలేదు. 23, 24 అధికరణాలు దోపిడి చేయడాన్ని నిషేధించినవి. అయితే లాభంను అదనపు విలువను దోపిడిగా గుర్తించలేదు. 25 నుండి 28 అధికరణం వరకు మతస్వేచ్ఛ యివ్వబడింది. ఈ స్వేచ్ఛ ఏ విధంగా దుర్వినియోగ పర్చబడుతున్నదో మనకు తెలిసిందే. ఎందుకంటె ఇవన్నీ బూర్జువా నీతులు నియమాలు. 100కి 99పాళ్ళు వర్గదృష్టితో వ్రాయబడ్డవే.

కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర యింతవరకు ఎవరూ సమగ్రంగా వ్రాయలేదు. ముజఫర్ అహ్మద్ కమ్యూనిస్టుపార్టీ ప్రాదుర్భావాన్ని గూర్చి వ్రాశాడు. మీరట్ స్కూలులో చెప్పబడిన పాఠాల ఆధారంగా చలసాని వాసుదేవరావు ఒక పుస్తకం వ్రాశాడు. కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) కొంత ప్రయత్నం చేశాడు. పులుపుల వెంకటశివయ్య, వై.వి. కృష్ణారావులు వ్రాసిన గ్రంథాలు కూడ వున్నవి. అయితే అవేవీ సమగ్రమైన చరిత్రకాజాలవు. డాక్టరు అధికారి అధ్వర్యంలో భారత కమ్యూనిస్టుపార్టీ అధికారికంగా ఆరు వాల్యూముల చరిత్రను ప్రచురించి, అనేక డాక్యుమెంట్ల ఆధారంగా అది వ్రాయబడింది." అయితే అందులో కొన్ని ప్రధానమైన

డాక్యుమెంట్లు చేర్చబడలేదు. అందుచే అది సమగ్రం కాలేదు. సమగ్ర కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర రచనకు భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) చేసిన ప్రయత్నమే ముఖ్యమైనది. జ్యోతిబాసు అధ్యక్షతన అనిల్ బిశ్వాస్, శైలేన్ దాస్‌గుప్తా, బుద్ధదేవ్ భట్టాచార్య శాంతిశేఖర్ బోస్‌లతో ఒక కమిటి ఏర్పడి యీ కర్తవ్య నిర్వహణకు పూనుకున్నది. అరుదైన చరిత్రాత్మకమైన డాక్యుమెంట్ల నన్నిటినీ యిది 26 సంపుటాలుగా ప్రచురించింది. మనదేశంలో కార్మికులు, రైతులు. స్త్రీలు, యితర శ్రామిక ప్రజలు మేధావులు జరిపిన వర్గపోరాట చరిత్ర యిది. ఈ డాక్యుమెంట్ల నాధారం చేసుకుని ఆచరణలో కమ్యూనిస్టు ఉద్యమం ఏ విధంగా పురోగమిస్తున్నదో యీ డాకుమెంట్లు ఆధారంగా అర్థం చేసుకునేందుకు భారతకమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) ప్రధాన కార్యదర్శి హరికిషన్‌సింగ్ సూర్జిత్ ఉపోద్ఘాతాలను వ్రాశారు.

ఇటువంటి ప్రయత్నమే డి. వి. సుబ్బారావుగారు కమ్యూనిస్టు ఐక్యసంఘటన అన్వేషణ అనే గ్రంథంలో చేశారు. పార్టీ ఒకటిగా వున్నపుడు జరిపిన సిద్ధాంత పోరాటమే యీ గ్రంధంలోని ఈ రెండవ సంపుటి. వీరు 1963 మధుర పార్టీ కాంగ్రెసునుండి జరిపిన సిద్ధాంత పోరాటం గురించి యీ భాగంలో వివరించారు. అందుకువారు అజయ్‌ఘోష్: డాక్టరు అధికారి, నంబూద్రిపాద్ సుందరయ్య, బసవ పున్నయ్య మున్నగు వారి రచనల నుండి, స్టేట్‌మెంట్ల నుండి అనేక భాగాలను ఉల్లేఖించారు. 1953లోనే జరిగిన యీ మదురై పార్టీ కాంగ్రెస్‌లో బయలుదేరిన వివాదాలు పాల్ఘాట్, అమృతసర్ పార్టీ కాంగ్రెస్‌ల్లో ఎట్లా పొడిగించబడ్డాయో వారు తెలియజేశారు. ఇరు పక్షాల వాదనలను తెలియజేసే కొటేషన్లను యిచ్చారు. చివరకు వారి అభిప్రాయాలను తెలియజేశారు.

ఇది చాలా వినూత్న ప్రక్రియ. వారి వారి వాదనలు కొటేషన్లుగా యివ్వటం ద్వారా యిరు పక్షాల వాదనలు తెలుసుకుంటానికి అర్థంచేసుకుంటానికి వుపయోగపడతాయి. అధ్యాయాలకు పర్వాలని పేరు పెట్టారు. సాగరమధనపర్వం, అమృతపర్వం భిన్నదృక్పధాల సంఘర్షణ పర్వం. బృహద్వివాద పర్వం అన్న 4 అధ్యాయాలు,ఇవి తిరిగి సబ్‌హెడ్డింగులు క్రింద విభజించబడినవి. అయితే అమృతపర్వం అన్నది అంత సబబుగా వున్నదని తోచదు. వివాదాలు మరుగునపడి వున్నాయేగాని సమసిపోలేదు. పైగా తీవ్రమైనాయి. అమృతానికి ముందే హాలాహలం పుట్టింది హాలాహలాన్ని మింగటానికి, ఇప్పుడు శివుడెక్కడా దొరకలేదు. కాబట్టి బడబాగ్నిలాగా ప్రజ్వరిల్లుతూనే వున్నది. వారే యీ విధంగా చెప్పారు కూడ. "పై వివరణల పరిశీలనానంతరం ఒకటి రెండు విషయాలు స్పష్టమవుతాయి. భారత కమ్యూనిస్టుపార్టీలో రెండు ప్రధాన దృక్పధాలు, అనుబంధంగా రెండు గ్రూపులు లేక ప్రొఫనులు మూడోది కేంద్రకమిటి మెజారిటీ అభిప్రాయాన్ని అమలుచేయ ప్రయత్నించే"మధ్యే

మార్గ గ్రూపు", 1953 నాటినుండి వున్నా 1956వ అన్ని హంగులూ కల మూడు స్పష్టమైన గ్రూపులుగా వ్యవహరించుట చారిత్రక వాస్తవంగా" కన్పడుతున్నది." ఇంతేగాక అనేక సిద్ధాంత సమస్యలపై రాజీలేని పోరాటం ప్రారంభమైంది. ఇది అంతర్జాతీయ పరిణామాలకు సంబంధించిన సిద్ధాంత సమస్యలు. చివరి కివి రెండు పార్టీలుగా చీలిపోవటానికి కారణమైనవి.

పాల్ఘాట్ పార్టీ మహాసభను గురించి హరికిషన్ సింగ్ సూర్జిత్ "ఈ సంపుటిలో గల డాక్యుమెంట్లను పరిశీలించితే 1964లో పార్టీ రెండుగా చీలిపోవటానికి గల సైద్ధాంతిక విభేదాలకు గల మూల ప్రాతిపదికలను పాఠకులు అర్థం చేసుకొనగలరు. (భారతదేశంలో కమ్యూనిస్టుఉద్యమ ప్రస్థానం" హరికిషన్ సింగ్ సూర్జిత్. పే. 86.)

ఈ గ్రంధం ద్వితీయ సంపుటి భాగం 1953, 1964 మధ్య కమ్యూనిస్టు ఉద్యమంలో జరిగిన పరిణామాల గూర్చి వ్రాయబడ్డది. ప్రతి ఒక్కరు కూడ చదవాలసిందే. 1964లో పార్టీ చీలి రెండు పార్టీలుగా చీలిపోవటానికి కారణాలేమిటో స్పష్టంగా తెలియ చేస్తుంది.

రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ రెండవ మహాసభలో అనేక సిద్ధాంత విభేదాలు తలెత్తినవి. ఇరుపక్షాలు కూడ సంఘర్షణపడ్డాయి. లెనిన్ వాదం మెజారిటీ సభ్యులు ఆమోదించారు. మర్తోవ్, ఆగ్రిలరాడ్ మొదలగువారు మైనార్టీగా ఏర్పడ్డారు. బొల్షివిక్‌ల (మెజారిటీ వాదుల) మెన్షివిక్‌ల (మైనార్టీవాదుల) పార్టీలుగా చీలిపోయాయి. "ఒక రాజకీయ భావధోరణిగా ఒక రాజకీయ పార్టీగా 1903 నుండి బొల్షివిజం వున్నది." అని లెనిన్ చెప్పాడు. "కార్యాచరణలో ఐక్యత కావాలంటే సంకల్ప ఐక్యత కావాలి. సంకల్ప ఐక్యత కావాలంటే నిర్మాణం వుండాలి. కార్మిక వర్గపు వర్గ చైతన్య దళంగా పార్టీ దాని సంఘ నిర్మాణం ప్రతిరూపంగా వుండాలి. ఘనిష్టమైన ఐక్యత గలిగిన నిర్మాణం ద్వారానే పార్టీ కార్మిక వర్గ పోరాటాన్ని జయప్రదంగా నడుపగలదు" అని బోల్షివిక్ చరిత్ర చెపుతుంది.

"పార్టీ అన్నది మూర్తీభవించిన సంకల్పఐక్యత, ముఠాల ఉనికి ఏమాత్రం అనుమతించబడవు" అని స్టాలిన్ చెపుతాడు.

కాబట్టి మధురై పార్టీ కాంగ్రెసునుంచి బయలుదేరిన విభేదాలు పాల్ఘాట్ కాంగ్రెసు నాటికి ముదిరి చివరకు రెండు పార్టీల ఆవిర్భావానికి కారణమైనవి. ఈ గ్రంధం తెలియజేసేది యిదే.

22-5-1999.

నండూరి ప్రసాదరావు
సి. పి. ఐ. (యం) కేంద్ర కమిటీ సభ్యులు

# రచయిత తొలిపలుకులు

కమ్యూనిస్టుల ఐక్యసంఘటన అన్వేషణ అనే రచన ద్వితీయ సంపుటిలో సాగర మదనపర్వం, అమృతపర్వం, భిన్నదృక్పధాల సంఘర్షణపర్వం, బృహద్వివాద పర్వం అను నాలుగుపర్వాలలో జాతీయ అంతర్జాతీయ కమ్యూనిస్టుఉద్యమంలో చెలరేగుతున్న అంతర్గత సైద్ధాంతిక పోరాటాలలో వివిధ అంశాలపై 1960 దశకంలో జరిగిన చర్చలు వివరించబడ్డాయి.

మొదటి సాగర మదన పర్వరంలో భారత కమ్యూనిస్టుపార్టీలో ప్రప్రధమ బహిరంగ సైద్ధాంతిక అంతర్గత పోరాటంలో స్వాతంత్ర్య సమస్య, ప్రభుత్వ వర్గ స్వభావం, యుద్ధం-శాంతి, ప్రభుత్వ శాంతి విదేశాంగ, ఆర్థిక, పారిశ్రామిక విధానాలపై, వివిధ దృక్కోణాలపై, జరిగిన చర్చలు విపరించబడ్డాయి.

నాడు పార్టీలోని అంతర్గత సైద్ధాంతిక చర్చలపై "మితవాద దృక్కోణాన్నుండి అతివాదంపై, అతివాద దృక్కోణాన్నుండి మితవాదపై పోరాటం "జరిగిందని నంబూద్రిపాద్," ఏదివాదమని, మితవాదమని, నిందా ప్రతినిందలు జరిగాయని అధికారి "ప్రతిసందర్భంలో రెండు పరస్పర వ్యతిరేక తీర్మానములు ముందుకొచ్చేవని" సుందరయ్యలు నాటి పరిస్థితికి అద్దం పట్టినట్లు వ్యాఖ్యానించారు. సత్యాన్వేషణకై జరిగే అంతరంగిక సైద్ధాంతిక పోరాటం, సిద్ధాంత, నిర్మాణ దృక్కోణంతో మితవాద, అతివాదాల రెండింటిపై రాజీలేని శాస్త్రీయ పోరాటంలోని వైఫల్యాలు వివరించబడ్డాయి.

సాగరమధన పర్వంలో, మన విప్లవం ప్రజాస్వామ్య విప్లవదశగా, సామ్రాజ్యవాదం, వారితో పొత్తునెరవుతున్న గుత్తపెట్టుబడిదారి భూస్వాములు వర్గాలకు వ్యతిరేకంగా అన్నివర్గాల ప్రజా ఐక్య సంఘటన పోరాట ఆయుధంగా,యిది కార్మిక, కర్షక ఐక్యతా పునాదిపై ఐక్య పోరాటాలద్వారా నిర్మించబడుతుందని వివరించబడింది.

బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వానికి ప్రత్యామ్నాయంగా, ఐక్యసంఘటనకు అనుబంధంగా ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వం లక్ష్యంగా, ప్రజాస్వామ్య పక్షాలు, వామపక్ష పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు భాగస్వాములుగ యేర్పడే ప్రభుత్వంగా వివరించబడింది.

విప్లవదశ కాలానంతటికి వర్గాల ప్రాతిపదికపై, దీర్ఘకాల ప్రధాన రాజకీయ, ఆర్థిక విధానాలకై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై పోరాట సాధనాలుగ వ్యూహాత్మక

ఐక్య సంఘటనలు, తాత్కాలిక రాజకీయ. ఆర్థిక రక్షణ కోర్కెలకై పోరాట సాథనాలుగ ఎత్తుగడల ఐక్యసంఘటనలు, ఐక్యపోరాట ఫ్యాక్టరీ కమిటీల నుండి, విస్తృత ప్రాంత పోరాట ఐక్యసంఘటనలు వివరించబడ్డాయి.

హైదరాబాద్ సంస్థానంలో ఐక్యసంఘటనా (పి.డి.యఫ్) నిర్మాణయత్నాలలో ఎదురైన ఐక్యసంఘటనా సైద్ధాంతిక సమస్యల చర్చలలో విస్తృతి చెందిన అవగాహనలు, అనుభవాలు సమిష్టి సైద్ధాంతిక స్థాయి పార్టీలో పెరుగుట, స్పష్టత చేకూరుట వివరించబడింది.

ఈ ద్వితీయ సంపుటిలోని అమృతపర్వంలో భారత కమ్యూనిస్టుపార్టీ పాల్ఘాట్, అమృతసర్ రెండు పార్టీ కాంగ్రెసులలో చేబట్టిన రాజకీయ విధానాలు వివరించబడ్డాయి.

పాల్ఘాట్ పార్టీ కాంగ్రెసులో అతివాద, మితవాద, మధ్యేమార్గవాద మూడు దృక్పథాలు అవగాహనలు సంఘర్షించాయి. పార్టీ కాంగ్రెసు, భారత ప్రభుత్వ శాంతి సహజీవన, పంచశీల సూత్రాల విదేశాంగ విధానాన్ని బలపరుస్తూనే, రక్షణ ప్రజా సమస్యలపై ఐక్యకార్యాచరణ, ప్రజాపోరాటాలు సాగిస్తుంది. ప్రజాస్వామ్య పక్షాలలో, వివిధ వర్గాలలో, ప్రజలలోగల అనైక్యతను అధిగమించుటకు విస్తృత ఐక్య సంఘటనా నిర్మాణం ప్రధాన వ్యూహ కర్తవ్యంగా పార్టీ కాంగ్రెసు నిర్ణయం వివరించబడింది.

భారత బూర్జువా వర్గాలు వారి "సోషలిస్టిక్ నమూనా" అభివృద్ధి విధానానికి, సోవియటు రచయిత రూబెన్‌స్టెయిన్ వ్యాసం యిచ్చిన మద్దతుతో ప్రారంభించిన సైద్ధాంతిక దాడిని భారత కమ్యూనిస్టు పార్టీ త్రిప్పికొట్టుట వివరించబడింది.

నాటి చారిత్రిక పరిస్థితులలో అంతర్యుద్ధ పరిస్థితులను రూపొందించి దేశాలను రక్తపాతంలో ముంచెత్తదలచిన పాలకవర్గాల ప్రయత్నాలను వమ్ముచేసి అనేక దేశాలలో శాంతియుత మార్గాలలో సోషలిజాన్ని నెలకొల్పే అవకాశాలు వాస్తవంగా వున్నవని సోషలిజం ధ్యేయంగాకల పార్టీలు, వర్గాలుకలసి పార్లమెంటులో మెజారిటీ సంపాదించి, అభివృద్ధి నిరోధక వర్గాల ప్రతిఘటనను ఐక్యప్రజాకార్యాచరణతో అధిగమించే అవకాశాలున్నవని, మనదేశంలో గల యీ అవకాశాలను వాస్తవం చేయుటకు పార్టీ శక్తినంతా వినియోగిస్తుందని రాజకీయ విధానం ప్రకటించింది. ఈ సంస్కరణవాద అవగాహనలకు మౌలిక ప్రేరణలు అంతర్జాతీయ కమ్యూనిస్టు

ఉద్యమంలోని మితవాద సంస్కరణవాద అవగాహనలు పునాదులుగ వివరించ బడ్డాయి.

ఈ మితవాద సంస్కరణవాదం భారతకమ్యూనిస్టుపార్టీ అమృత్‌సర్ పార్టీ కాంగ్రెసులో, పార్టీ నిర్మాణ సూత్రాలలో అతి ముఖ్యమైనపార్టీ పార్టీధ్యేయం లక్ష్యా లకు సంబంధించిన ప్రారంభపేరాలలో ఉద్దేశాలలో "పార్టీ ప్రజాస్వామ్యాన్ని సోష లిజాన్ని శాంతియుత పద్ధతులలో సాధించుటకు అన్నివిధాల ప్రయత్నిస్తుందని" ప్రకటించుటయేగాక, యిది పార్టీ తక్షణ ఎత్తుగడకాదు, దీర్ఘకాల వ్యూహముకాదు అని స్పష్టం చేయుట, వివరించబడింది.

భారత-చైనా టిబెట్ పురాతన చారిత్రిక వ్యాపార మార్గాలపై తిష్ట వేసు కొన్న బ్రిటిష్ సామ్రాజ్యవాదపు విధానాన్ని భారతదేశం స్వాతంత్ర్యంతోపాటు వార సత్వంగా పొందింది బ్రిటిష్ కుట్రలు కుతంత్రాలు, పోర్జరీ పత్రాలతో వ్యూహాత్మక ప్రాంతాల చారిత్రిక వూబిలో భారత ప్రభుత్వం పడిపోయింది. భారత్-టిబెట్‌లమధ్య ఏప్రిల్ 1954లో జరిగిన ఒడంబడికలో టిబెట్ చైనాలో భాగంగా గుర్తించింది. ఐక్యరాజ్యసమితిలో చైనా స్థానాన్ని పునరుద్ధరించుటకు సామ్రాజ్యవాద దేశాలతో పోరాడుతున్నది. భారతసరిహద్దులపై 1950లోనే భారతప్రధాని స్పష్టమైన అధికార ప్రకటన చేసారు. చైనా ప్రభుత్వం 1954లో సరిహద్దు సమస్యను లేవనెత్తకపోగా భారతదేశ ప్రాదేశికత్వాన్ని, సార్వభౌమాధికారాన్ని గౌరవించగలమని వాగ్దానం చేసింది. చైనా ప్రధాని చౌయెన్‌లై జూన్ 1954లో పంచశీల సూత్రాలను పునరు ద్ఘాటించుతు సంయుక్త ప్రకటనను భారత ప్రధానితో కలసి చేసారు. ఈ పరిణా మాలు భిన్న దృక్పధాల సంఘర్షణపర్వంలో వివరించబడ్డాయి.

భారతదేశంలో 1951 నుండి "అటవిడుపుల"తో అంతర్గత సిద్ధాంతపోరాటం పార్టీలో సాగుతు, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని సిద్ధాంతపోరాటాల ప్రకంపనలకు గురియగుతు, విజయవాడ పార్టీ కాంగ్రెసులో సిద్ధాంత పోరాటం గాడి తప్పి చీలికల బెదరింపుల వరకు పోవుట, విదేశీ సౌహార్ద ప్రతినిధుల సలహాలు, ఎన్ని కల ఏజండా ముందుండుటలో తాత్కాలికంగా వాయిదా పడుట ఈ పర్వంలో వివరించ బడ్డాయి.

విజయవాడపార్టీ కాంగ్రెసులో మెజారిటీ జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా విధానాలను ఆమోదించుట, మైనారిటీ జనతా ప్రజాస్వామ్య, సంఘటనా విధానాలను ఆమోదించుట, మైనారిటీ జనతా ప్రజాస్వామ్య సంఘటన విధానాన్ని ప్రతిపాదించి

తీవ్ర సైద్ధాంతిక పోరాటాన్ని జరిపింది. అంచేతనే, "మితవాద, అతివాద పక్షాలు హోరాహోరిగా సైద్ధాంతిక పోరాటం జరిపిన కాంగ్రెసుగా, విజయవాడపార్టీ కాంగ్రెసు చరిత్రలో పేర్కొనబడింది. కాంగ్రెసులో జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా సమస్య చర్చించబడి, మార్గదర్శకాంశాలు వివరించబడ్డాయి. సంఘటన కార్మిక, కర్షక, పెటీ బూర్జువా, జాతీయ బూర్జువావర్గాల ఐక్యకూటమియని, దీనికి కార్మిక, కర్షక ఐక్యత మౌలిక పునాదియేగాక యిరుసులాంటిదని కాంగ్రెసులో వివరించబడింది. ఐక్యసంఘటనపై కాంగ్రెసులో అజయ్‌ఘోష్ ప్రత్యేక వివరణ, వివిధ ధోరణులు యీ పర్వంలో వివరించబడ్డాయి.

ఈ సంపుటిలో చివరి "బృహద్వివాద పర్వం"లో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సోవియట్ యూనియన్-చైనా ప్రజారిపబ్లిక్‌ల మధ్య జరిగిన సైద్ధాంతిక చర్చలు, అంతర్గతచర్చల పరిమితులను దాటి బహిరంగ వాగ్వివాదాలయ్యాయి. సైద్ధాంతిక పోరాటంగా ప్రారంభమై ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమంపై నాయకత్వ సమస్య పోరాటంగా పరిణామమొంది, రెండుపక్షాలు అనేక సిద్ధాంత పత్రాలు, బహిరంగ రేడియో, పత్రికా ప్రకటనలతో చెలరేగిన వాగ్వివాదాల వివిధాంశాలు వివరించబడ్డాయి.

లావోస్ సమస్యపై జెనీవా సమావేశంలో అమెరికా ప్రతినిధివర్గ నాయకుడు అవెరల్ హారిమన్ "చైనాతో పట్టు-విడుపుల విధానాన్ని" అనుసరించగలమనే సదభిప్రాయాన్ని చైనా ప్రతినిధి వర్గానికి కలిగించిన ఫలితంగా చైనా విదేశాంగమంత్రి చెన్ యీ "తైవాన్, తైవాన్ జలాలనుండి అమెరికా తన సైన్యాలను ఉపసంహరించుకొనిన సమస్య శాంతియుతంగా పరిష్కారమగుతుందని జెనీవాలో పలుసార్లు ప్రకటించాడు. అమెరికా చైనా-రష్యాల యెడల భిన్నవైఖరులు అవలంబించుతు వారి అభిప్రాయభేదాలను పెంచి, వినియోగించుకొనే ప్రయత్నమే, చైనా యెడల సదభిప్రాయ సూచనలు. కమ్యూనిస్టు ప్రపంచంలో రష్యా ఏకచ్ఛత్రాధిపత్యాన్ని కోల్పోయింది. ఈ స్థితిలో అమెరికా "చైనా తురుపు ముక్కను" రష్యాకు వ్యతిరేకంగా వినియోగించ ప్రయత్నించుటలో వింతలేదు. తృతీయ ప్రపంచంలో చైనా, రష్యా, అమెరికా విధానాల జయాపజయాలు తేల్చబడగలవనే అభిప్రాయం. కైరోలో జరిగిన ఆఫ్రో-ఏషియన్ రచయితల సమావేశానంతరం ప్రచురణ యీ పర్వంలో వివరించబడింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సైద్ధాంతిక చర్చలలో భారతకమ్యూనిస్టు ఉద్యమంలోని భిన్నదృక్పథాలవారు చర్చలలో తమ వాదనలకు ఆధారాలుగ భారత

అధ్యయనాలను పేర్కొనుట గాక రష్యా, చైనా అధ్యయన పత్రాల అభిప్రాయాలనే ఉదహరించక, తమ సైద్ధాంతిక అభిప్రాయాలుగ చేబట్టారు. వివిధ పర్వాల అధ్యయనాలు దీనినే తెల్పుతూ, స్వతంత్ర అధ్యయనాల ఆవస్యకత వివరించబడింది.

ఈ రచనలోని అవగాహనలు మాత్రమే సరియైనవని రచయిత తలచుటలేదు. పాఠకుల అభిప్రాయాలకు స్వాగతం చెబుతూ, ముద్రణలో దొరలిన పొరపాటులకు మన్నించ ప్రార్థన.

అనేక వొత్తిడి పనులలో మునిగి యున్నా, నాకోరిక మన్నించి "పరిచయం" వ్రాసిన కా. నండూరి ప్రసాదరావుగారికి నా కృతజ్ఞతాభివందనాలు రచనాకాలంలో నన్ను ప్రోత్సహించిన, 1942 లోనే నాకు రాజకీయ గురువైన కా. మోటూరి హనుమంతరావుగారికి నా కృతజ్ఞతాభివందనాలు సమర్పించుకొంటున్నాను.

ముద్రణలో పూర్తి సహకారాన్నిచ్చిన శ్రీ ఘంటసాల శివలింగము, వారి బృందానికి, కవరుడిజైను చేసిన చిరంజీవి ఆమర్‌కు నా కృతజ్ఞతాభివందనాలు.

చిలువూరు
20-5-1999

డి. వి. సుబ్బారావు

## విషయసూచిక

# 6

# సాగర మథన పర్వం

## 1

## అంతర్గత సిద్ధాంత పోరాటం ప్రారంభం

మధురై కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసులో నూతన రాజకీయ విధానాన్ని రూపొందించునపుడు తిరిగి అభిప్రాయ భేదాలు 'సహజంగానే వచ్చాయి. నూతన అంతర్జాతీయ పరిస్థితిని, సోషలిస్టు వ్యవస్థను, జాతీయ విముక్తి ఉద్యమాల విప్లవ శక్తులకు, మరోవైపు సామ్రాజ్యవాద పెట్టుబడి దారి వర్గాల శక్తుల బలాబలాలను, సమతూకాన్ని బేరిజువేయునపుడు ముఖ్యంగా యీ అభిప్రాయ భేదాలు తలెత్తాయి. ఈ అభిప్రాయ బేధాలు 1) ప్రభుత్వపాలనలో జరుగుతున్న రాజకీయ ఆర్థికాభివృద్ధి జాతీయ బూర్జువాలపాత్ర 2) అభివృద్ధి కార్యక్రమాలు కార్మిక, కర్షక, యితర బడుగువర్గాల కనుగుణంగా మార్చుటకై అనుసరించవలసిన పోరాట పంథాలపై కేంద్రీకరించబడ్డాయి. దీనిర్థం గత అవగాహనలోని ప్రశ్నించరాని అంశాలు అను కొన్న కొన్నింటిని, నేటి వాస్తవ పరిస్థితుల కనుగుణంగా లేనివాటిని వదలుకొని, నూతన పరిస్థితులలో నూతన పంథా, నూతన పోరాట వివాదాలతో రూపొందించవలసి వుంది. పాత అవగాహనలనుండి వైదొలగుటకు తీవ్ర వ్యతిరేకత అడ్డుగావుంది. నూతన అవగాహనలకు అనుగుణంగా నూతన పంథా అన్వేషణకు కాలవ్యవధి ఎక్కువ అవుతుంది. పిడివాదం, సంస్కరణవాదం అని నింద ప్రతినిందలు మధురై కాంగ్రెసు తీవ్ర అంతర్గత చర్చలలో వినవచ్చాయి. నంబూద్రిపాద్ "అతివాద సెక్టేరియన్ దృక్పథాన్ని ఏకపక్షంగా పోరాడుటయేగాని, ఒకేకాలంలో సంస్కరణ వాదాన్ని, పిడివాదాన్ని రెండింటిని పోరాడి,ఓడించుట కాద"న్నారు. జాతీయోద్యమం, జాతీయ బూర్జువావర్గనాయకత్వంలో కొనసాగిన దేశాలలో కూడ రాజకీయ స్వాతం త్ర్యాన్ని సామ్రాజ్యవాదం నుండి సైనిక, సైనికేతర పోరాటాలలో పొందవచ్చనే అవగాహనకు కొందరొస్తున్నారు. కారణం నూతన ప్రపంచ పరిస్థితి వలన వ్యవస్థ సంక్షోభంగా నిర్వచించుటయని, తదుపరి దశకంలో వ్యాఖ్యానించారు.

భేదాభిప్రాయాలు ఎందుకువచ్చాయి అనే ప్రశ్నకు 1951 కార్యక్రమ దృక్ప ధము, వాస్తవపరిణామాల అభివృద్ధిక్రమం, ఆచరణ పొసగుట లేదని శాస్త్రీయ

సమాధానం చెప్పుకొనవలసి వుంటుంది. అంటే దృక్పధం, ఆచరణ, వాస్తవం వేరైనవి. వాటి మధ్య సహజంగా వుండవలసిన ఐక్యతలేదు. ప్రధానంగా :
1) విదేశాంగవిధానం-అమెరికా బ్రిటన్‌లలో ఎవరు ప్రధాన శత్రువు 2) భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందా, అనే రెండు ప్రశ్నలపై తీవ్ర రాజకీయ సిద్ధాంతపోరాటం జరిగింది. మధురై తీర్మానం తాత్కాలిక అంగీకారానికి వచ్చి, యేకగ్రీవంగా(?) ఆమోదించారు. మధురై రాజకీయ తీర్మానంతోపాటు 1951 కార్యక్రమాన్ని రెగ్యులర్ పార్టీ కాంగ్రెసు ఆమోదించింది. అయినా అంతర్గతపోరాటం కొనసాగింది.

రాజకీయ సిద్ధాంత భేదాభిప్రాయాలు తీవ్రరూపం దాల్చినది. "1953 నుండి ప్రతి సందర్భంలోనూ రెండు పరస్పర వ్యతిరేకమైన తీర్మానాలు ముందుకొచ్చేవి. చివరకు యేదో రాజీ తీర్మానం వెలువడేది. ఈ తీర్మానం యెలా వుండేదంటే ఎవరికివారు, తమకు నచ్చిన బాష్యం తాము చెప్పుకొనేటట్లుగా వుండేంది" అని సుందరయ్య" విప్లవపథంలో నాపయనం"లో పేర్కొన్నారు. అంతేగాక" ఆ మహాసభలో (మధరై కాంగ్రెసులో) మేము ప్రతిపాదించిన తీర్మానంగాక, కేంద్రకమిటీ తరపున అజయ్‌ఘోష్ ప్రవేశపెట్టిన తీర్మానం, అటువైపున రాజేశ్వరరావు, జోషి కలిసి ప్రవేశపెట్టిన తీర్మానంవున్నా, రాజేశ్వరరావు తీర్మానానికి మూడవవంతు ప్రతినిధుల మద్దతువుంది. మా తీర్మానికి అంతే. ఇక అజయ్‌ఘోష్ ప్రవేశపెట్టిన తీర్మానానికి అంతేబలం వుంది. ఏ రెండు గ్రూపులైనా కలిస్తే తప్ప మూడో దానిని ఓడించలేని పరిస్థితి.[1] మూడున్నర దశాబ్దాల అనంతరం చేసిన వ్యాఖ్య నాటిపరిస్థితికి అద్దం పట్టుతుంది. భిన్న అభిప్రాయాలు చర్చలలో సమిష్టి అవగాహనకు రాలేకయేరెండు గ్రూపులో కలసి మూడో గ్రూపును వోడించే పరిస్థితి తప్పితే, సహచరులతో హృదయాన్ని విప్పి చర్చించి వివిధ అభిప్రాయాలలోని వాస్తవికతను తీసుకొని, అవాస్తవికతను వూహాగానాన్ని వదలివేయలేని శోచనీయస్థితి. శాస్త్రీయంగా చర్చిసుకొనసాగించి, శాస్త్రీయ నిర్ణయానికి రాలేక, అశాస్త్రీయంగా, యాంత్రికంగా, గ్రూపుల ప్రయోజనాలకై తాత్కాలికంగా కలసి, ముడో గ్రూపును వోడించుట, మరికొంత కాలానికి యీగ్రూపుల కలయిక మరోవిధంగా యేర్పడి మరోగ్రూపును వోడించుట యెంతవరకు శాస్త్రీయ సోషలిజమో అర్థముచేసుకొనుట కష్టము.

1. సుందరయ్య,పుచ్చలపల్లి(1988) విప్లవపథంలో నా పయనం. ....పే. 117-8

## ప్రభుత్వ విధానాలపై అభిప్రాయ భేదాలు :

"భేదాభిప్రాయాల ప్రధాన సమస్య ప్రప్రథమంగా యీ కాలంలో (1952-54) వుద్భవించింది. నెహ్రూ ప్రభుత్వం అభ్యుదయకరమైన విధానాన్ని అవలంభించుచున్నదా లేదా అనే ప్రశ్న ప్రథమంగా విదేశాంగ విధానమునకు సంబంధించి వచ్చింది, క్రమేణా దేశీయ విధానానికి సంబంధించి యీ ప్రశ్న విస్తరించింది[1]"

ఇంకా నంబూద్రిపాద్ "దేశ, అంతర్జాతీయ విధానంలో 1952 తరువాత కనుపించిన నూతన అంశాలను ఆధారం చేసుకొని కొంతమంది కామ్రేడ్స్, 3వ పార్టీ కాంగ్రెసు పూర్వరంగచర్చలతో, కాంగ్రెసులోను, ప్రభుత్వ విదేశాంగ విధానంలోను క్రమేణా అభ్యుదయకరంగా మార్పు చెందిందని వాదించారు. ఇది 3వ, కాంగ్రెసులో యితరులచే తీవ్రంగా వ్యతిరేకించబడింది. అత్యధికులచే నిరాకరించబడింది. ఏమైనా తదుపరిపరిణామాలు ముఖ్యంగా పంచశీల సూత్రాలుగ ప్రసిద్ధి కెక్కినవాటికి ప్రాతిపదికమైన టిబెట్‌పై ఇండియా-చైనాల ఒడంబడిక, విదేశాంగవిధానంపై పార్టీ అవగాహనను మార్చివేసింది. ఇది 4వ, పార్టీ కాంగ్రెసు పూర్వ చర్చలపై కేంద్ర సమితి తయారుచేస్తున్న చిత్తు తీర్మానానికి ప్రధానమైన పొరపాటును దిద్దుకొనుటకుగాను పార్టీ కార్యక్రమమునకు ప్రతిగా చేర్చవలసిన అంశంగా ఆమోదించబడింది.

"అయితే, గతంలో విదేశాంగ విధానంలో మార్పు వచ్చిందని వాదించినవారు అదే విధమైన మార్పు దేశీయాంగ విధానంలోను వచ్చిందన్నారు. విదేశాంగ విధానం ప్రధానంగా అభ్యుదయకరమైనదని, దేశీయాంగ విధానం ప్రధానంగా అభివృద్ధి నిరోధకమైనదని, మెజారిటీ గట్టిగ నిలబడింది. క్రమేణా దేశీయాంగ విధానంలో కూడ నిస్సందేహంగా అభ్యుదయకరమైన అంశాలున్నవని స్పష్టం కాజొచ్చింది."[2]

ఆర్థిక, రాజకీయ సామాజిక స్థితి లేక విడివిడిగా ఆయా పరిస్థితి, స్తబ్ధ-చలనరహిత-దశనుండి చలనస్థితి నొందిన వెంటనే, ప్రారంభ దశ, చలనవృద్ధి పెరిగిన దశ, పరిణామాల వివిధ దశల లక్షణాలు పూర్తి స్వరూపాన్ని పొందకముందే లేక ప్రధాన లక్షణాలు వెల్లడికాకముందే, చలనదశ, లక్షణాలను ముందే నిర్దేశించి, వాటికనుగుణంగానో లేక వ్యతిరేకంగానో ప్రతిచర్య నిర్ణయాలను

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1964) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (ఆగ్లంలో) పే. 71.
2. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1964) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (ఆంగ్లంలో) పేజి 71-3.

చేయుట, అశాస్త్రీయమేగాక మార్క్సిజం, లెనినిజం కాజాలదను విషయం పై ఉదహరింపుల నుండి స్పష్టమౌతుంది.

"రెండు దృక్పథాలు డిశంబరు మధురై 3వ, పార్టి కాంగ్రెసులో సంఘర్షించాయి. సౌహార్థ ప్రతినిధులుగ హాజరైన బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ శక్రటరీ హారీపోలిట్. యిచ్చిన సందేశం, కాంగ్రెసు ప్రభుత్వం యెడల పార్టీ దృక్పథంలో మార్పును కోరే పార్టీ వర్గాలకు ప్రోత్సాహాన్ని యిచ్చింది. ప్రతినిధులలో కొంత భాగంపై ఆ ప్రభావం బాగా పడింది. అయితే మెజారిటీ పోలిట్ సలహాను నిరాకరించారు. కాంగ్రెసు పాలవ దాని వర్గ రాజకీయ విధానాలను వ్యతిరేకించు విదానాన్ని కొనసాగించారు. వలస విధానానికి, యుద్ధానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రపంచ సోషలిస్టు పోరాటాన్ని పెంపొందించే విదేశాంగ విదానాన్ని బలపరిచారు.

"ఈ సందర్భంలో మధురై కాంగ్రెసు ముగిసిన వెంటనే సోవియట్ అకెడిమిషియన్ రుబెన్‌స్టెయిన్ సోవియట్ పార్టీ పత్రికలో నెహ్రూ ప్రభుత్వాన్ని భారత కమ్యూనిస్టు పార్టీ బలపరచవలసిందని వ్రాసిన వ్యాసాన్ని పేర్కొనవలసి వుంది. కొంతమంది కామ్రేడ్స్ దానిని "మన పార్టీకి సోవియట్ సలహాగా" వ్యాఖ్యానించి, కాంగ్రెసు ఆమోదించిన విధానాన్ని తిరగతోడుటకు ప్రయత్నించారు. కేంద్ర సమితివారు యీ కోర్కెను నిరాకరించుటయేగాక జనరల్ శక్రటరీ అజయ్‌ఘోష్ రుబేన్‌స్టేయిన్ అవగాహనను ఖండించుతూ వ్రాసిన వ్యాసాన్ని అదే పత్రికలో ప్రకటించారు.[2]

అధికారి నూతన రాజకీయ విధానాన్ని రూపొందించునపుడు అభిప్రాయ భేదాలు వచ్చుట సహజమేనన్నారు. "రూపొందే నూతన ప్రపంచ పరిస్థితి, సోషలిస్టు వ్యవస్థ, జాతీయ విముక్తి శక్తులు వొకవైపు, ప్రపంచ సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారి విధానం మరోవైపు, నూతన బలాబలాల తూకాన్ని బేరీజు వేయునట్లు చేస్తున్నవి. మొట్టమొదట, జాతీయ బూర్జువా వర్గం, దాని పాలనలోని ఆర్థిక రాజకీయాభివృద్ధి కార్యక్రమాలు; రెండు, కార్మికవర్గం, ప్రజాస్వామ్య వుద్యమం, జరిగే అభివృద్ధి తన కనుకూలంగా రూపొందించుటకై అనుసరించవలసిన పోరాట పంథాను పునర్విచారించవలసిన అవసరముంది. దీనర్థం గతంలో మనం పట్టుకు వ్రేళ్ళాడుతున్న అవగాహనలు, నేటి వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా

2. అదే. (1987) రిమనిసెన్సెస్ ఆఫ్ యాన్ ఇండియన్ కమ్యూనిస్టు. పేజి 149–50.

లేనందున, నూతన పరిస్థితులకు అనుగుణంగా నూతన పంథాను, నినాదాలను, రూపొందించుటలో కాలం గడచిపోతుంది. మధురై పార్టీ కాంగ్రెసులో పిడివాదమని, మితవాదమని నింద ప్రతినిందలు జరగాయి."[1] అని అధికారి వివరించారు.[2]

ఈ క్రింది ప్రశ్నలు చర్చలలో తిరిగి తిరిగి వస్తున్నవని అధికారి వ్రాసారు.

i) సంపూర్ణ స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారాన్ని భారతదేశం పొందిందా? దాని వర్గ ప్రాతిపదిక యెట్టిది?

ii) అధికారాన్ని స్వీకరించిన కాంగ్రెసు ప్రభుత్వ వర్గ లక్షణ మేమిటి? సామ్రాజ్యవాదంతో, బ్రిటన్, అమెరికా, గుత్త పెట్టుబడిదారులు, భూస్వాములతో దానికి గల సంబంధాలు, దృక్పథం యెట్టిది?

iii) ఈ ప్రభుత్వంలో జరిగే పారిశ్రామికీకరణ, వ్యవసాయ సంస్కరణలు, అర్థికాభివృద్ధి, ప్రణాళికలు అంచనా వేయు విధమెట్టిది? పెట్టుబడిదారి విధానంలో జాతీయ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని బలపరచే విధానం అనుసరించబడుతున్నదా? పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి భారతదేశంలో సాధ్యమా? ఆ క్రమంలో జనించే ఘర్షణలు, వైరుధ్యాలు యెట్టివి?

iv) ప్రజాస్వామిక విప్లవాన్ని ముందుకు తీసుకొని వెళ్ళుటకు, జాతీయ పునర్నిర్మాణానికి, జాతీయ బూర్జువా వర్గంతో కలసి జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను నిర్మించాలని కార్యక్రమంలో సరిగానే నిర్దేశించబడింది. పాలక పార్టీయైన కాంగ్రెసు, ప్రతిపక్షాల యెడల యెట్టి దృక్పథాన్ని అవలంబించాలి. సామ్రాజ్యవాదం, ప్రభుత్వం, అభివృద్ధి నిరోధకుల యెడల అవలంబించవలసిన ఎత్తుగడలు ఎట్టివి?

చర్చలలో లేవనెత్తబడిన యీ కీలక ప్రశ్నలకు వివిధ వర్గాలు యిచ్చే సమాధానాలు, వివరణలు అధ్యయనం చేయాలి.

# II

## బృహత్చర్చ

పార్టీలో తీవ్రతరమౌతున్న రాజకీయ వ్యూహ సిద్ధాంత భేదాభిప్రాయాలను జూన్ 1955 కేంద్ర సమితి సమీక్షించి, చర్చించి, పార్టీ అన్ని పక్షాలలో పార్టీ

---

1. అధికారి, జి. (1964) కమ్యూనిస్టు పార్టీ అండ్ ఇండియాస్ పాత్ టు నేషనల్ రీజనరేషన్ అండ్ సోషలిజం (ఆంగ్లంలో) నంబూద్రిపాద్-రివిజనిజం అండ్ డాగ్మాటిజం"కు సమాధానంగా వ్రాసినది. పే. 126-7.

2. అదే. పే. 129.

కాంగ్రెసుకు పూర్వం చర్చల నిమిత్తం చిత్తు తీర్మానాన్ని విడుద చేసింది. దీనితో పాటు దేశ, విదేశ రాజకీయ పరిణామాలను పరిగణనలోనికి తీసుకొని గత సంవత్సరం నుండి జరుగుతున్న తీవ్ర చర్చలను సమీక్షించి పార్టీ 1951 కార్యక్రమానికి కొన్ని సవరణలను కేంద్ర సమితి ప్రతిపాదించుతూ, చర్చల నిమిత్తం సెప్టెంబరు 1955 లో ఒక పత్రాన్ని విడుదల చేసింది. ఈ రెండింటితో పార్టీలో రాజకీయ అంతర్గత సిద్ధాంత, వ్యూహ, కార్యక్రమాలపై బృహత్చర్చ ప్రారంభమైంది. పార్టీ ప్రత్యేకంగా ఘోరం ప్రచురణ ప్రారంభించింది.

**అభిప్రాయభేదాల స్వైఋం :**

"పార్టీలో భేదాభిప్రాయాలు వచ్చాయి, అవి కార్యక్రమములోని అంశాల ప్రాతిపదికపై పరిష్కారమైనవి. ఆ విధంగా అనేక భేదాభిప్రాయాలు పరిష్కారమైనవి. మధురై పార్టీ కాంగ్రెసు తరువాత ప్రధాన రాజకీయ సమస్యలపై వచ్చిన భేదాభిప్రాయాలను కార్యక్రమము (1951) ప్రాతిపదికపై పరిష్కారం సాధ్యం కాలేదు. పరిస్థితులలో వచ్చిన మార్పులను కార్యక్రమంలోని అంశాలు వివరించజాలకపోయాయి. ఈ మార్పులు ప్రభుత్వ విదేశాంగ విధానం, భారతదేశ రాజ్యాంగ స్థితి, కొంతవరకు దేశ అంతర్గత పరిస్థితులకు సంబంధించినవి."[1] అంతేగాక మధురైలో (కాంగ్రెసు) భారత రాజకీయ పరిస్థితిని, ఆర్థిక సంక్షోభం పరిపక్వత చెంది, రాజకీయ సంక్షోభంగా మార్పు చెందే ప్రాథమిక దశ" యని సూత్రీకరించాము. ఆ సూత్రీకరణలో కొంత అతిశయోక్తి కలదు. ఘటనలు పరిస్థితి ఊహించిన విధంగా మారలేదు. అప్పటి వాస్తవ పరిస్థితి అట్టిదని కామ్రేడ్స్ గుర్తించుకొనాలి."[2] అని భేదాభిప్రాయాల తీవ్రతను అజయ్‌ఘోష్ పేర్కొన్నారు. అదే విధంగా జాతీయ అంతర్జాతీయ పరిణామాలు మారిపోయాయి. కార్యక్రమంలో (1951) చేసిన ప్రతిపాదనలకు, జరుగుతున్న రాజకీయ వాస్తవ పరిణామాలకు పొంతన కుదరలేదు. ఆ ప్రతిపాదనలు జాతీయంగా, అంతర్జాతీయంగా మారుతున్న పరిస్థితి నెదుర్కొనే రాజకీయ అవసరాలకు సరిపోలేదని"[3] బసవపున్నయ్య వివరించారు. అందుకే "జూన్ 1955లో జరిగిన కేంద్ర సమితి సమావేశంలో సరైన పార్టీ కార్యక్రమం కోసం, రాజకీయ పంథా కోసం, మరో విడత పార్టీ అంతర్గత పోరాటం చెలరేగింది" అని కూడ అన్నారు.

---

1. అజయ్‌ఘోష్ (1955) ప్రారంభోపన్యాసం, నవంబరు 3, 1955: పశ్చిమ బెంగాల్ రాష్ట్ర కమిటి విస్తృత సమావేశం పే. 2.
2. అదే. పే. 39.
3. బసవపున్నయ్య, మా. (1976 ?) మన పార్టీ కార్యక్రమం. ప్రజాశక్తి ప్రచురణ. పే. 18.

పార్టీ 4వ, కాంగ్రెసు ముందు అంతర్గత పోరాటం అంత తీవ్ర స్థాయికి ఎందుకు వెళ్ళిందో నంబూద్రిపాద్ వివరించారు. "రెండు ప్రధాన దృక్పధాలలో యేదో వొక దృక్పథంవైపు వాదించినవారు మౌలిక వాస్తవాన్ని చూడజాలక పోయారు. నెహ్రూ ప్రభుత్వపు అభ్యుదయకర విధానంపై వాదించేవారు పెక్కు మంది బలపర్చే, సహకార విధానాన్ని, మిగతావారు రాజీలేని పోరాట విధానాన్ని చేబట్టారు. ఇదే 4వ, కాంగ్రెసు చర్చలలో అంతటి వుద్రేకాన్ని కలుగ జేసింది." అంతేగాక "దృక్పధాలు మొత్తంగా వాటిలోనే సంస్కరణవాద, పిడివాద అంశాలను వారి సిద్ధాంత విశ్లేషణలో కలిగి వున్నాయి. అంతేగాక మితవాద, అతివాద, అవకాశవాద అంశాలను ఆచరణలో కలిగి వున్నాయి."[1] అని నంబూద్రిపాద్ తెలిపాడు. "పెట్టుబడిదారి విధాన సాధారణ సంక్షోభపు మూడవ దశను గుర్తించనందున, అంతగా అభివృద్ధి చెందని పెట్టుబడిదారి, ఇండియాలాంటి దేశాలలో సామ్రాజ్యవాదంతో జాతీయ బూర్జువా వర్గం తప్పనిసరిగా సంఘర్షణకు దిగుతుందని, సోషలిస్టు వ్యవస్థ ప్రభావం వలన సామ్రాజ్యవాదానికి మారకపోవుచుండని, సోషలిస్టు వ్యవస్థ వునికి జాతీయ ఆర్థికాభివృద్ధికి, ఫ్యూడలు ఆర్థిక విధానాలను మార్చి, స్వతంత్ర పెట్టుబడిదారి విధానాభివృద్ధికి దోహదపడుటకు దారితీయుగ వివరించారు. అంతేగాక "మరోవైపు ఏకపక్షంగా సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక అంశాలు మాత్రమే గుర్తించుట, సంస్కరణవాద సిద్ధాంత పోకడలను జన్మనిస్తుంది. ఆర్థికంగా, రాజకీయంగా, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేకంగా తన ప్రయోజనాల పరిధిలో, భారత కష్టజీవులపై తన ఆధిక్యతాపేక్షతో బూర్జువా వర్గం పోరాడుతుందనే వాస్తవాన్ని వారు నిర్లక్ష్యం చేసారు." "సంస్కరణవాదం ప్రభుత్వపు విధానాల వర్గ ప్రాతిపదికను వదలివేయుట, దానివి ప్రధాన ఆర్థిక, రాజకీయ సమస్యలలో ప్రజోద్యమాలలో మితవాద, అవకాశ వాదాలవైపు తీసు కెళ్ళింది"[2] అని నంబూద్రిపాద్ వివరించారు.

ఇంతకుముందు చెప్పినట్లు "నూతన రాజకీయ విధానాన్ని రూపొందించునపుడు అభిప్రాయ భేదాలు వుద్భవించుట సహజమే నన్నారు" అధికారి. అంతేగాక "గతంలో మనం పట్టుకొని వ్రేళ్ళాడుతున్న అవగాహనలు నేటి వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా లేనందున, నూతన పరిస్థితులకు తగిన విధంగా నూతన పంథా పోరాట నినాదాలను రూపొందించి పురోగమించవలసి వుంది.... పద్ధతిలో కాంగ్రెసులో పిడివాదమని, రివిజనిజమని నింద, ప్రతినిందలు జరిగాయి" అని అధికారి అన్నారు.

సంక్షిప్తంగా, మారిన పరిస్థితులలో అవగాహనలకు ఆచరణలో పొంతన కుదరనపుడు అభిప్రాయా భేదాలు యేర్పడుట అతి సహజము. నాటి జాతీయ, అంత

1. నంబూద్రిపాద్ (1964) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ సి.పి.ఐ. పే. 74.
2. ............అదే. ........పే. 75.

ర్జాతీయ పరిస్థితులు, రాజకీయ సంస్థలు పార్టీలు, ప్రభుత్వ విధానాలు, ప్రజల వుద్యమాలు, వారి పోరాటాల క్రమంలో యేర్పడిన రాజకీయ అవగాహనల, ఆచరణల పరిశీలన ఫలితమే 1951 కార్యక్రమము. అంతర్జాతీయ పరిస్థితులు, చెప్పుకొనలేనంతగా మారి వాటిప్రభావంతో జాతీయ పరిస్థితులు, ఆర్థిక రాజకీయ విధానాలలో మౌలికమైన మార్పులు వాస్తవంగా వచ్చినపుడు, నూతన రాజకీయ పరిశీలనలనుండి అవగాహన, నూతన పంథా, వ్యూహ పోరాట రూపాలు రూపొందించుకొనవలసిన అవసరముంది. వివిధప్రాంతాల రాజకీయ ఆర్థిక పరిస్థితులు అసమానతలు వాటికి తోడు ఉద్యమాల భౌతిక అసమానతల కారణంగా అవగాహనల అంతరాలు ఎక్కువగా వుండుటసహజం. ఆ కారణంగా కొన్ని ప్రాధమిక అభిప్రాయాలను కమ్యూనిస్టు నిజాయితీతో చర్చించి సరైన సమగ్ర అభిప్రాయాలకు రాకుండా, మితవాదమని, సంస్కరణ వాదమని లేక అవకాశవాదమని 'శంఖుచక్రాంకితాలను' తగిలించి గోరంతలను కొండంతలుగా చేసి నిందా ప్రతినిందలతో పడికట్టు పదాలతో ప్రత్యర్థులను అదిరించి బెదిరించి 'బ్రెయిన్‌వాష్' చేయుట శాస్త్రీయ సిద్ధాంత పోరాటం కాజాలదు. ప్రప్రధమంగా అభిప్రాయ భేదాలను భూత అద్దంలో చూడక బహుజన ఆమోద యోగ్యమైన అంశాలకే ప్రతిదశలో ప్రాధాన్యతనిస్తూ వుద్యమపురోగతిని చూడాలి.

నంబూద్రిపాద్ చెప్పినట్లు వాస్తవ పరిస్థితులను అనగా ఆర్థిక రాజకీయ భౌతిక వాస్తవిక మౌలిక పరిస్థితులను చూడజాలక పోవుట వలన యేదో ఒక దృక్పధంలోనే ఏకపక్షంగా వాదించుటవలననే అభిప్రాయ భేదాలు వుద్రేకాలను కలుగ జేయునంతటి స్థాయికి కాంగ్రెసులో చేరాయన్నారు. దీనికి తోడు వాది ప్రతివాది వాదనలను నిర్లక్ష్యము చేయుట అవగాహన చేసుకొనుటకు ప్రయత్నించక వాదనలను వక్రీకరించి, తదుపరి ఖండనచేయుట వాక్‌యుద్ధ అంగవిన్యాసం అత్యంత తీవ్ర వివాదాంశాలను చెణుకులతో త్రోసివేయుట శాస్త్రీయ అంతర్గత సిద్ధాంత పోరాటానికి తోడ్పడదు.

## స్వాతంత్ర్య సమస్య :

ఈ స్వాతంత్ర్య సమస్య 1947 ఆగస్టు నాటినుండి చర్చనీయాంశమై పార్టీ అంతర్గత సిద్ధాంత పోరాటంలో కీలకాంశమైంది. ఆనాడు ఆగస్టు 15ను ఉత్సవ దినంగా జరుపాలా త్రివర్ణపతాకాన్ని ఆవిష్కరించాలా అనే విషయాలు చర్చనీయాంశాలు అయినవని గుర్తించుకొనాలి.

భారతదేశం సామ్రాజ్యవాదం నుండి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొందలేదు. ఆర్థిక స్వాతంత్ర్యంలేని స్వాతంత్ర్యాన్ని సామ్రాజ్యవాదం యిచ్చినది,సంపూర్ణ స్వాతంత్ర్యం ఎలా అవుతుంది. యుద్ధానికి పూర్వం సామ్రాజ్యవాదం ఈజిప్టు, ఫిలిప్పైన్స్‌లకు సామ్రాజ్యవాదం యిచ్చిన నామమాత్రపు స్వాతంత్ర్యపు వుదాహరణ సామ్రాజ్య వాదం వలసలకు వివిధ రకములైన స్వాతంత్ర్య ప్రధానములుగావించి ఆర్థికంగా

గుప్పిటలలో పెట్టుకొనుటపై లెనిన్ ప్రస్తావన పార్టీ వర్గాలను మరింత సందేహా స్పదుల కావించింది. అజయ్ ఘోష్ యీ సమస్యను యీ క్రింది విధంగా వివరించారు "ప్రపంచంలో రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వంసామ్రాజ్యవాదం ఏకచ్ఛత్రాధికంగా పరిపాలించునపుడు స్వాతంత్ర్యం ఎప్పుడూ సంపూర్ణ స్వాతంత్ర్యం కాజాలదనే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఉదాహరించుతూ "అజయ్ అన్నారు. ఇంకా" అనేక వలసలకు జరిగిన స్వాతంత్ర్య ప్రధానం నామమాత్రపు లక్షణాన్ని కలిగివుందన్నారు. కాని నేడు వెనుకబడ్డ ఆధారిత ఆర్థిక విధానం 'గల దేశం కూడ సర్వసత్తాతను నిలబెట్టుకొంటూ స్వతంత్ర దేశంగా వ్యవహరించ కలుగుతుంది. కారణం సామ్రాజ్యవాదం బలహీనపడుట, బలమైన సోషలిస్టు ప్రపంచపు వునికి సోషలిస్టు ప్రత్యామ్నాయ మార్కెట్టు కలిగి వుండుట భారతదేశ మొక్కటే యిందుకు వుదాహరణ కాదు. ఈజిప్టు, బర్మాలలో యేమి జరుగుతుందో పరిశీలించండి. గతంలో యిట్టి పరిస్థితి వూహించరానిది. కాని నేడు అట్టివి జరుగుతున్నవి[1]" అని వివరించారు.

అధికారి యిదే సమస్యపై వ్యాఖ్యానించుతూ "వలస ,రాజ్యాలలోని జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక వ్యూడలు వ్యతిరేక విప్లవపోరాటాన్ని విజయవంతంగా కొనసాగించకుండా అధికారంలోకి రాగలిగితే అది రాజకీయ స్వాతంత్ర్యం కాజాలదు. ఇది ఆరవ అంతర్జాతీయ కమ్యూనిస్టు సిద్ధాంతం విశ్లేషణ నుండి రూపొందింది. రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం ఆ అవగాహన అనుసరణీయం. కాని పెట్టుబడిదారి విధానపు సామాన్య సంక్షోభపు నూతన దశలో రెండవ ప్రపంచ యుద్ధంలో సోవియట్ విజయానంతరం, తూర్పు యూరపులో నూతన ప్రజాస్వామ్యాల అవతరణానంతరం నూతన పరిస్థితులు అవతరించాయి" అని అధికారి వాస్తవాన్ని ప్రస్తావించుతూ మరికొంత దూరంలాగి, జూన్ 1947 మౌంట్ బాటన్ సిద్ధాంతాలకు బలంచేకూర్చయత్నించారు. అట్టి అవకాశాలుండుటవేరు. అవి వాస్తవాలగుట వాటి కనువగు పరిస్థితులు యేర్పడుట లేక సృష్టించుట వేరుగా నుండగలగాలి.

"ఈ తప్పుడు అవగాహన 6వ అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసు అవగాహన—అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోను, మన చేతను 1955 ప్రాంతములో సరి చేయబడింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం యిక యే మాత్రం అనుసరణీయం కాని యీ సిద్ధాంత ప్రతిపాదనను పట్టుకొని పిడివాదం విడనాడక పోవుటకు ఉదాహరణ. ఇది జాతీయ పరిస్థితిని తప్పుడుగా అవగాహన చేసుకొనుటకు దారి తీసింది. ఆ భూమికపై జాతీయ స్వాతంత్ర్యాన్ని స్థిరీకరించుటకై కార్మిక

వర్గ నాయకత్వాన్ని నెలకొల్పుటకు తగిన పోరాట ఎత్తుగడలను రూపొందించలేక పోవుట జరిగింది" [1] అని అధికారి అన్నారు.

సామ్రాజ్యవాదం బలహీనపడుట, సోషలిజం, ప్రజాస్వామ్యపక్షం, శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యాలవైపు మహోన్నతంగా పురోగమించిన కారణంగా "భారతదేశం సర్వసత్తాకతను బలవత్తర మొనర్చుకొంటూ రాజకీయ స్వాతంత్ర్య స్థితిని పొందింది". ఏమైనా యీ స్వాతంత్ర్యం అస్థిర పునాదిపై వుంది. బ్రిటీష్ సామ్రాజ్యవాదం వనరుల, శ్రమశక్తి దోపిడీకీ స్వస్తి చెప్పబడలేదు. ఫ్యూడలు, భూస్వామ్యవర్గాలు రైతాంగంపై జరిపే దోపిడికి ముగింపు జరగలేదు. ఈ విధమైన సామ్రాజ్యవాద, భూస్వామ్య వర్గాల దోపిడి, వెనుకబడిన మన ఆర్థిక ఆధారితా తత్వాన్ని, అర్థవలస లక్షణాన్ని శాశ్వతం చేస్తుంది". [2]

అంతేగాక "జాతీయ స్వాతంత్ర్యం" అనే భాగంలో "భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించినప్పటికి, మన ఆర్థిక విధానంలో బ్రిటీష్ సామ్రాజ్యవాదం శక్తివంతమైన స్థానాన్ని కలిగి వుంది....ఆర్థిక జీవితంపైగల ఈ శక్తి బంధనాలతో, బడా బూర్జువావర్గంతో గల భాగస్వామ్యంతో, వారి మిలాఖత్‌తో బ్రిటీష్ సామ్రాజ్యవాదం మన పారిశ్రామికాభివృద్ధిని అడ్డుకొంటూ, మన దారిద్ర్యాన్ని సుస్థిరం చేస్తున్నది."

"మన స్వాతంత్ర్య బంధనాలన్నిటి విముక్తికై, బ్రిటీష్ పెట్టుబడి ఆధిక్యతను ఛేదించుటకు, ఆర్థిక విధానం, సైన్యంలోని బ్రిటీష్ ప్రభావాన్నుండి బయటపడుటకు, బ్రిటీష్ కామన్‌వెల్తు బంధనాలను భారతదేశం ఛేదించవలసి వుంది.

అందుకు కమ్యూనిస్టుపార్టీ 1) బ్రిటీష్ కామన్‌వెల్తును విడనాడుట, 2) బ్రిటీష్ పరిశ్రమలను, బ్యాంకులు, ఇన్స్యూరెన్సు, తోటలు, రవాణా, గనులు జాతీయం చేయుట 3) బ్రిటీష్ వర్గాలను అన్ని ఉద్యోగాలనుండి తొలగించుట, అట్టి బంధనాలను ఛేదించుటకు ముఖ్యంగా పరిగణించాలి అని అంటున్నది. [3]

ఒక్క మాటలో "భారతదేశం సర్వసత్తాకతను, రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందిందని" అయినా "ఆర్థిక ఆధారితను, అర్థవలస లక్షణాన్ని" కలిగి వుందని,

---

1. అధికారి జి. [1964] కమ్యూనిస్టుపార్టీ అండ్ ఇండియన్ పాత్ టు నేషనల్ రీజనరేషన్‌లో. పే. 132.
2. భారత కమ్యూనిస్టుపార్టీ, సెప్టెంబరు 1955 కేంద్ర సమితి, కార్యక్రమానికి ఆమోదించిన సవరణల ప్రతిపాదనలు [ఆంగ్లంలో] పి. పి. హెచ్. పే. 1.
3. ........అదే........ పే. 9-10.

ఇంకా వున్న అన్ని బ్రిటీష్ బంధనాలను ఛేదించి బయట పడుటకు "కామన్‌వెల్తు నుండి బయటపడుట" బ్రిటీష్ అన్ని పరిశ్రమలను, ఆర్థిక ప్రయోజనాలను "స్వాధీనము చేసుకొని జాతీయం చేయుట" "బ్రిటీష్ వారిని అన్ని ఉద్యోగాల నుండి తొలగించాలనే" మెజారిటి అభిప్రాయాన్ని కేంద్ర సమితి స్పష్టం చేసింది. అయితే ప్రతిపాదించిన సవరణలలోని స్పష్టత 4వ కాంగ్రెసుకు ప్రతిపాదించిన చిత్తు తీర్మానంలో లేదు. కేంద్ర సమితి మెజారిటి సభ్యులలో తదుపరి వచ్చిన స్పష్టతయే ప్రతిబింబించి వుంటుంది.

## మైనారిటీ సభ్యుల అవగాహన :

కేంద్రసమితి జూన్ 1955 తీర్మానంపై భిన్నాభిప్రాయాల విషయమై ప్రస్తావిస్తూ "నెహ్రూ ప్రభుత్వ వర్గ స్వభావాన్ని మరచి, జనతా ప్రజాస్వామిక విప్లవ గమ్యాన్ని నిర్లక్ష్యం చేసింది." ఈ తీర్మానానికి మైనారిటీగ వున్న మేము ప్రత్యామ్నాయ ముసాయిదాను, వివరణ పత్రాన్ని తయారు చేసారు"[1] అని హనుమంతరావు తెలిపారు. ఆ పత్రాలలోని ముఖ్యాంశాల సారాంశం యీ విధంగా వుంది.

పార్టీ కార్యక్రమం (1951) సవరణలకు పూర్వం "ఆసియాలో బానిసత్వం, దోపిడి, విదేశాల ఆధిక్యానికి గురి కాబడుతున్న, ఆధారిత, అర్ధ వలస చిట్టచివరి విశాల దేశం భారతదేశం" అని తెలిపింది. సవరించిన దానిలో "ఆధారిత, అర్థ వలస" అను మాటలు తీసివేయబడి, వాటి స్థానంలో "అర్థ వలస, ఆర్థిక విధానం" అని చేర్చబడింది.[2]

అంతేగాక, "భారతదేశానికి స్వాతంత్ర్యం" అనే సవరించబడని కార్యక్రమ భాగంలో "మన స్వాతంత్ర్యంలో ప్రధాన భాగం సామ్రాజ్యవాదపు చేతులలోనే వుంది" కాన "భారతదేశం వాస్తవంగా స్వతంత్ర రాజ్యాంగం అగుటకు" కొన్ని ప్రత్యేక కర్తవ్యాలను నిర్వహించాలి. ఇంకా కార్యక్రమం చివర భాగంలో వర్గ వ్యూహం, ప్రజాస్వామ్య సంఘటనను ప్రస్తావించుటతో పాటు "మన దేశం స్వాతంత్ర్యం పొందుటకు" వగైరా వుదహరించబడింది. సవరించబడిన కార్యక్రమంలో "సంపూర్ణ స్వాతంత్ర్యం", "నిజమైన స్వాతంత్ర్యం" అను పదాలు తొలగించబడి "మన స్వతంత్రానికి గల అన్ని అడ్డంకులను తొలగించుట" మన

1. హనుమంతరావు, యం. (1992) ప్రజాశక్తి, ఆదివారం 26-4-1992 పే. 6-7.

2. సుందరయ్య, బసవపున్నయ్య, సూర్జిత్, ప్రసాదరావు, హనుమంతరావు (1955) నేటి పరిస్థితి మన కర్తవ్యాలు (ఆంగ్లంలో) చిత్తు రాజకీయ తీర్మానం, నవంబరు, 1955. ఫోరం : అనుబంధం. సవరించబడిన కార్యక్రమం పే. 29.

స్వాతంత్ర్యం "అనిశ్చిత పునాదులపై" ఆధారపడి వుండుట లాంటి పదాలు చేర్చ బడినవి.[1] అంటే ఒక్కమాటలో లభించినది సంపూర్ణ స్వాతంత్ర్యం కాదని, 195్చ కార్యక్రమము స్పష్టం చేస్తుండగా, కేంద్రసమితి సవరణలు అది నిజమైన రాజకీయ స్వాతంత్ర్యమని, ఆర్థిక పరిమితులకు లోనై వుందనే విషయాన్ని స్పష్టం చేస్తున్నది.

అంతేగాక "అతి ఆశ్చర్యకరమైన విషయం", అర్ధవలస, ఆధారిత లక్షణాలు అనే అవగాహనను విడనాడి, దాని ప్రాతిపదికపై ఆధారపడి నిర్ణయించిన కర్తవ్యా లను, బ్రిటిష్ కామన్‌వెల్తు నుండి విడిపోవుట, బ్రిటిష్ పెట్టుబడిని స్వాధీనం చేసు కొని జాతీయం చేయుట, బ్రిటన్‌పై సైనిక, ఆధారిత తత్వాన్ని రొలగించుటాది ఆచరణ కర్తవ్యాలను అలాగే వుంచుట."[2] కార్యక్రమ పత్రంలో అస్పష్టతను ప్రవేశపెట్టుట తప్ప మరొకటి గాదు.

"ఒక ప్రత్యేక పరిస్థితిలో భారత ప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసుకొనుట, కొలమానంచేసి నేటి భారత ప్రభుత్వ వర్గ మౌలిక లక్షణాన్ని మరుగు పడునట్లు చేయజాలము. ఒక దేశపు ఆర్థిక విధానాన్ని అర్ధవలస ఆధారితంగా నిర్వచించి, అదే కాలంలో ఆదేశాన్ని, ప్రభుత్వాన్ని అర్ధవలస ఆధారితంగా చెప్పుట తప్పనుట అనూహ్యమైనది"[3] అని సిద్ధాంత సమస్య లేవనెత్తబడింది.

కేంద్ర సమితికి ప్రతిపాదించిన తమ సవరణలు త్రోసివేయబడుటతో, మైనారిటీ వర్గపు నిర్ధారణలు యీ క్రింది విధంగా వున్నవి.

"సవరణలతో కూడిన కార్యక్రమము, విప్లవదశ, వ్యూహం, అవగాహన లను రూపొందించిన రెండు ప్రధానాంశాలను ఒకటి, భారత ప్రభుత్వపు మౌలిక స్వైజాన్ని, స్థాయి స్థితిని, రెండు: ప్రభుత్వపు వర్గ లక్షణాన్ని, పాత్రను స్పష్టంగా నీరుగార్చుటకు దారితీస్తుంది."[4]

"రాజకీయ తీర్మానానికి ప్రతిపాదించిన సవరణను సమగ్రంగా లేదని నిరాక రించి, పార్టీ కార్యక్రమంలో 1947 నాటి రాజకీయ దశకు ప్రత్యేకంగా భిన్నమై నప్పటికి చేర్చుట, కేంద్ర సమితి మెజారిటీ మన జాతీయ విముక్తి కర్తవ్యం ప్రధానంగానో లేక దగ్గర దగ్గరగానో పూర్తి అయినదనే నిర్ధారణకు వచ్చినట్లుగా, నెంచవలసి వస్తుంది."

"మా సవరణ వెనుకబడిన ఆధారిత ఆర్థిక విధానపు రాజకీయ ప్రాధాన్య తను వెలుగులోనికి తెచ్చుటకు వుద్దేశించబడింది. అంటే దేశం యింకా అర్ధవలస,

1. ........అదే........ పే. 29.
2. సుందరయ్య తదితరులు (1955) చిత్తు రాజకీయ తీర్మానం పేజి. 29.
3. ........అదే ....... పే. 29.
4. ........అదే........ పే. 31

ఆధారితంగా వుంది." కేంద్ర సమితి సవరణలు "బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో మిలాఖత్" విషయంగాక "బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో గల లింకు" [1] ను గురించి మాత్రమే చెప్పుతున్నది. అంటే అర్థం భారత ప్రభుత్వం బడా బూర్జువాల మిలాఖత్‌ను బలపరుస్తున్నది. కాని అది మాత్రం మిలాఖత్ కాలేదు.

"మన విదేశాంగ విధానంపై బ్రిటిష్ సామ్రాజ్యవాదపు మరే యితర విదేశీయ ప్రభావం బలంగా లేదని, ప్రధానంగా స్వతంత్ర విధానమని సి. సి. సవరణలు సూచించుతున్నవి....మన ఆర్థిక విధానంపై బ్రిటిష్ సామ్రాజ్యవాదపు ప్రయోజనాలు 'పీక నులిమి' వేస్తున్న అంశాన్ని సి. సి. సవరణలు తెలియజేయవు .. ఇంకా సి. సి. సవరణలు భారత ప్రభుత్వపు, బ్రిటిష్ సామ్రాజ్యవాదపు "బ్రహ్మముడి" విషయమై ప్రస్తావించవు".[2]

"కేంద్ర సమితి సవరణలు అర్థవలస ఆర్థికతను మాత్రమే పేర్కొంటూ దాని రాజకీయ ప్రాధాన్యతను నీరుగార్చుట, మనదేశపు రాజకీయ వైఖరి లక్షణాలను త్రోసివేస్తున్నాయి." [3]

ప్రధాన చర్చనీయాంశం భారత ప్రభుత్వ యంత్రాంగం అర్థవలస, ఆధారిత ప్రభుత్వమా? స్వతంత్ర్య రాజ్యాంగమా? భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమాధికారాన్ని, సర్వసత్తాకతను సాధించినదా? లేదా? పార్టీ కార్యక్రమం (1951) అర్థవలస, ఆధారిత రాజ్యంగా చేసిన నిర్వచనం వర్తిస్తుందా లేదా? అనే ప్రశ్నలు లేవనెత్తి వివరించారు. అనుబంధంగా స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు మార్క్సిస్టు కొలమాన మెట్టిదనే ప్రశ్న లేవనెత్తారు, పార్టీ జనరల్ సెక్రటరీ ఆర్థికాంశాల ప్రాతిపదికపై స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను నిర్ణయించుటను, అదే విధంగా పార్టీ సాహిత్యంలో "స్వాతంత్ర్యానికై పోరాటం", "జాతీయ విముక్తి కర్తవ్యాలు" అనే సమాసాలు విడనాడాలన్నారు. "ఇది పూర్తిగా సంస్కరణవాదం, ఆర్థికాంశాలను పూర్తిగ వదలివేసి, మార్క్సిస్టు లెవ్వరూ స్వేచ్ఛా, స్వాతంత్ర్య సమస్యను నిర్ణయించజాలరు. ఇక్కడ మన దేశం 1947 వరకు బ్రిటిష్ సామ్రాజ్య వాదపు వలస, యింకా బ్రిటిష్ కామన్‌వెల్తు పరిధిలోనే వుంటున్న దానికిగల స్వేచ్ఛా స్వాతంత్ర్యం మనం చర్చిస్తున్న సమస్య. భారతదేశానికి లభించిన స్వాతంత్ర్యాన్ని

1. ........అదే........ పే. 33.
2. సుందరయ్య తదితరులు [1955] చిత్తు రాజకీయ తీర్మానం [ప్రత్యామ్నాయ] పోరం, నవంబరు 1955. పే. 34.
3. ........అదే........పే. 36.

దాని నైజాన్ని, లక్షణాన్ని, పరిమితిని, భారత ప్రభుత్వం బ్రిటిష్ సామ్రాజ్యవాదముతో ఏర్పరచుకొన్న ఆర్థిక, ద్రవ్య, రాజకీయ సంబంధాలను ప్రధానంగా పరిగణలోనికి తీసుకోనకుండా నిర్ణయించుట పూర్తి తప్పుడు విధానం". [1]

అంతేగాక సామ్రాజ్యవాదపు ద్రవ్య పెట్టుబడి దోపిడి విధానంలో ఎట్టి మార్పు రాలేదని, భారతదేశంలో పారిశ్రామిక, వ్యాపార సంస్థలలో బ్రిటిష్ పెట్టుబడి 20-97 శాతము వుండుట, మన జాతీయ ఆర్థిక విధానంలో గల, 'బలమైన పిడికిలి' పట్టును తెలియజేస్తుందని, దీనికి తోడు దేశీయ పరిశ్రమలపై యాజమాన్యపు ఏజన్సీల ద్వారా 150 కోట్లకు మించిన దోపిడి జరుగుచున్నదని, భారీ యంత్ర పరిశ్రమలు లేని కారణంగా పారిశ్రామికీకరణకు కావలసిన యంత్రాలు, సైనిక సరఫరాలు అన్నీ వారి గుప్పిటలోనే వున్నాయని, భారత నావికాదళం బ్రిటిష్ నావికాదళంలో భాగంగా వుండుట, స్టాండరైజేషన్ పేరుతో భారత సైన్య ఆయుధీకరణ, సామాన్య వ్యూహమనే పేరుతో కామన్‌వెల్తు పొత్తు, సహకారం, సంబంధాలపై "మేము బ్రిటిష్ సామ్రాజ్యం-జాతుల కామన్‌వెల్తు, అనే వ్యాపార సంస్థల పేర్లను అందరి "అభిరుచులకు" అనుగుణంగా వుంచుతామని" అన్న చర్చిలు వ్యాఖ్యను పామిదత్తు "బ్రిటన్, బ్రిటిష్ సామ్రాజ్యంలో సంక్షోభం" అన్న గ్రంథంలోని ఉదహరింపును పేర్కొన్నారు. [2]

"జాతీయ, వలసల సమస్య"పై లెనిన్ చిత్తు సిద్ధాంతం నుండి సంక్షిప్తంగా 1) చారిత్రిక, ఆర్థిక వాస్తవ పరిస్థితి 2) అణచబడే వర్గాల ప్రయోజనాలు, అణచే, పాలక వర్గాల ప్రయోజనాల నుండి స్పష్టంగా వేరు చేయుట 3) అదే విధంగా అణచబడే ఆధారిత జాతులనుండి, అణచే, దోపిడిచేసే స్వతంత్ర, స్వేచ్ఛా, సర్వసత్తాక జాతులను వేరుచేసి చూడాలి. వలస, ఆర్థిక బానిసత్వాలలో అత్యధిక ప్రజా సామాన్యాన్ని అత్యల్ప ధనిక, ఆధునిక ద్రవ్య పెట్టుబడి, సామ్రాజ్యవాద దేశాలు అణచుటను బూర్జువా ప్రజాస్వామ్యాలు రంగులలో చిత్రించుటను వేరుచేసి చూడాలి" అని వుటంకించారు. [3]

"పైన ఉదహరించిన, యితర అంశాలను బట్టి, మేము భారత రాజ్యాంగ యంత్రాన్ని" అర్ధవలస, ఆధారిత రాజ్యాంగంగా నిర్వచించి తత్సంబంధ నిర్దిష్ట

---

1. సుందరయ్య, బసవపున్నయ్య, హనుమంతరావులు. ఫోరం నం. 2. పే. 2–3.
2. సుందరయ్య, బసవపున్నయ్య, హనుమంతరావు [1955] ఫోరం నం. 2 పే 4-5.
3. అదే........అదే........పే. 2-3.

పార్టీ కర్తవ్యాలను, వాస్తవ రాజ్యాంగంగా చేయుటకై నిర్ధారించాము"[1] అని మైనారిటీ వర్గం స్పష్టం చేసింది.

క్లుప్తంగా, 1) స్వేచ్ఛా, స్వాతంత్ర్యం, సర్వసత్తాకతలపై మార్క్సిస్టు—లెనినిస్టు ఆర్థిక కొలమానాన్ని నవరించుట పొరపాటు 2) మౌలిక అంశాలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, భారత ప్రభుత్వానికి గల ఆర్థిక, సైనిక, ద్రవ్య సంబంధాలలో ఎట్టి మార్పులేదు 3) నేడు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి భారత బూర్జువా వర్గానికి గల భేదాభిప్రాయాలు, వైరుధ్యాలు, తగవులు ప్రధాన నిర్ణయాత్మక అంశాలు కాదని చెప్పాలి. నిర్ణయాత్మక పాత్ర రెండు వర్గాల మధ్యగల పొత్తు. కాన బ్రిటిష్ సామ్రాజ్యవాదం, దాని దేశీయ పొత్తుదారులకు వ్యతిరేకంగా సంపూర్ణ స్వాతంత్ర్యానికి, విముక్తికి పోరాట భారత విప్లవపు మౌలిక కర్తవ్యం."[2] ఇదీ స్వాతంత్ర్య సమస్యపై మైనారిటి వర్గపు అవగాహన.

కేంద్ర సమితి చిత్తు తీర్మానానికి మొత్తంమీద తమ ఆమోదాన్ని తెలియ జేస్తూ, వివాదగ్రస్థ విషయాలను ప్రస్తుతానికి వదలివేసి, ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోని వొక భాగం, "భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యం సాధించి, సర్వసత్తాక స్వతంత్ర్య రిపబ్లిక్ అయింద"ని యిది "ఆమోదించబడిందని" అన్నారు. అయితే "విప్లవదశ మారిందనే అవగాహనతో తాము అంగీకరించ జాలమని" అన్నారు. అంతేగాక "భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించుట, సర్వసత్తాక స్వతంత్ర్య రిపబ్లిక్ అగుట, వాస్తవమే అయినా, ప్రజాస్వామిక విప్లవంలోని ప్రధాన మౌలిక కర్తవ్యాలు పూర్తి కానంత వరకు మన విప్లవదశ, జనతా ప్రజా స్వామ్య విప్లవంలోని ప్రథమ దశగానే వుంటుందని"[3] వివరించారు.

కేంద్ర సమితి తామే లేవనెత్తిన ప్రశ్నలకు సమాధానం నేరుగా యివ్వక గందరగోళాన్ని యెక్కువ చేసిందని "భారతదేశం దేశీయ, విదేశీయ సంబంధాలలో సామ్రాజ్యవాదంతో తన స్వాతంత్ర్యాన్ని పటిష్టం చేసుకొంటున్నది.... దేశీయ అంతర్గత సంబంధాలలో సామ్రాజ్యవాదంతో తన స్వాతంత్ర్యాన్ని పటిష్ఠత చేసు కొంటుదని" జగన్నాధ సర్కార్ అన్నారు. ఇంక "దేశీయ అంతర్గత విధానా లలో భారతదేశం పెట్టుబడిదారి మార్గంలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు శక్తులు తలెత్తకుండా, ఫ్యూడలు సంబంధాలను బూర్జువా సంబంధాలుగ చేస్తున్నది." "భారత దేశంలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు శక్తుల నరికట్టే ప్రయత్నాలు పైపై మెరుగు

---

1. ........అదే........పే. 4-5.
2. ........అదే........పే. 5.
3. సత్యనారాయణ, టి. తదితరులు (1955) డిశంబరు 1955 ఫోరం.

లని, ప్రభుత్వం ప్రధానంగా సామ్రాజ్యవాద, ఫ్యూడలు ప్రయోజనాల కెట్టి దెబ్బ తగలని విధానాలు కొనసాగిస్తుందని తలంచుట పొరపాటు" అని, అదే నిజమైతే "భారత స్వాతంత్ర్యం గురించి మాట్లాడుట అసంగతమైన"[1] దన్నారు.

డాంగే, చర్చలకై ఫోరంలో ప్రకటించిన నోట్‌కు ఉపోద్ఘాతంలో "నేను ప్రధానంగా సి. సి. తీర్మాన పంథాను ఆమోదించుచున్నాను." అంటూ "బ్రిటిష్ ప్రభుత్వంచే వెనుకబడ్డ దేశంగా వుంచబడ్డామని అందరికి తెలుసు. నేడు మనం రాజకీయ స్వాతంత్ర్యాన్ని, సర్వసత్తాకతను కలిగి వున్నాం. కాని ఆర్థికంగా పశ్చిమ దేశాల పారిశ్రామికపేత్తలపై ఆధారపడి వున్నాం. ఆ కారణంగా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించుట కర్తవ్యం. దాని అర్థం, పారిశ్రామికీకరణ, ప్రత్యేకంగా ఉక్కు, భారీ యంత్ర ఇంజనీరింగు పరిశ్రమలను నిర్మించాలి"[2] అని తెలిపారు. అంతేగాక "నేడు మనకు రాజకీయ స్వాతంత్ర్యం, సర్వసత్తాకతగల ప్రభుత్వం వుంది. కాని, భూస్వామ్య, బూర్జువా వర్గ వుత్పత్తి సంబంధాలను నిలబెట్టేదని, కార్మిక, కర్షకులు శ్రమను దోచేదని"[3] అన్నారు.

డాంగే "విదేశాంగ విధానం భారత రిపబ్లిక్ సర్వ స్వతంత్ర, సార్వభౌమాధికారం, సర్వసత్తాకతగలదని, వాస్తవంగా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాద వ్యతిరేక విధానం అవలంభించుట స్పష్టం చేస్తున్నది. ఆసియాలో 1950-54 లలో సామ్రాజ్యవాదులు పొందిన అపజయాలు, సోషలిస్టు వ్యవస్థ బలపడుట, వలస ప్రజోద్యమం బలవత్తరమైనదగుటచే, స్వతంత్రతను, సార్వభౌమాధికారాన్ని, సర్వసత్తాకతను అమలు చేయగలిగింది. ఆ విధంగా 1947 ఆగస్టు స్వాతంత్ర్యం పైకెదిగింది. ప్రజల దృష్టిలో రిపబ్లిక్ బలబడి, పైకెదిగింది, జాగృతిని కలిగించి, ప్రజాభిమానాన్ని పొందగలిగిందని" యిది వాస్తవ పరిస్థితి అన్నారు.

అంతేగాక "బూర్జువాలచే ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాభివృద్ధి, భారీ పారిశ్రామికాభివృద్ధి, వుత్పత్తి పెంపును ప్రభుత్వ, వ్యక్తి యాజమాన్యాల రెండింటిలో చేయగలుగుతుంది. నిరుద్యోగాన్ని కూడ తగ్గించ గలుగుతుంది. కాని అది మాత్రమే జనతా ప్రజాస్వామ్యాన్ని, సోషలిస్టు తరహా సంక్షేమ రాజ్యాన్నికాని, కార్మిక వర్గం ప్రభుత్వ యంత్రాంగాన్ని చేబట్టనంత వరకు లేదా ప్రభుత్వంలో నిర్ణయాత్మక పాత్ర వహించనంత వరకు జరుగదని"[4] వివరించారు.

---

1. సర్కార్. జగన్నాద్ (1955) భారత విప్లవపు మౌలిక పుద్దేశ్యాలు, వ్యూహం, నవంబరు, 1955 ఫోరం. పే. 17.
2. డాంగె. యస్. ఎ. (1955) ఫోరం. జనవరి 1956. పే. 14.
3. ........ అదే ........ పే. 20.
4. డాంగే, ఎస్.ఎ. (1955) ఫోరం. జనవరి 1956. పేజి. 21.

"స్వాతంత్ర్యాన్ని. సార్వభౌమాధికారాన్ని సంపాదించుటతో భారత ప్రజలకు స్వేచ్ఛ, స్వాతంత్ర మార్గంలో అభివృద్ధికి తలుపులు తెరువబడ్డాయి. భారత పారిశ్రామికాభివృద్ధితో స్వాతంత్ర్యాన్ని విస్తరించి బలవత్తర మొనర్చుటకు నేడు అవకాశం లభించిందని" సోమనాధ లాహిరి స్పష్టం చేస్తూ "స్వాతంత్ర్య విజయం జాతీయ చైతన్యాన్ని ఎంతో ముందుకు తీసుకొని పోయి ... యుద్ధ వ్యతిరేక, సామ్రాజ్యవాదవ్యతిరేక భావాలను, సౌభ్రాతృత్వాన్ని, ఐక్యతను పెంపొందించి, గోవా విముక్తి పోరాటాల వంటి వాటికి ప్రోత్సాహం లభించుటయేగాక, జాతీయ భారీ పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడిందని" [1] వివరించారు.

స్వాతంత్ర్య చర్చలు దీర్ఘకాలికంగా వున్నదైనా సి.సి. దానిని చారిత్రిక విధాన క్రమంలో పరిశీలించలేక పోయిందని "వలస పాలన 15 ఆగస్టు 1947 న అంతమై, అధికారికంగా సర్వసత్తాక స్వతంత్ర్య రిపబ్లిక్‌గా 26 జనవరి 1950 న నూతన రాజ్యాంగంతో రూపొందింది. సర్వసత్తాక రిపబ్లిక్ అధికారికంగా రాజకీయ స్వాతంత్ర్యం కలది. వాస్తవానికి ఆధారిత దేశమని యు. పి. నాయకులు శుక్లా తదితరులు వ్యక్తం చేసారు. లెనిన్ "అధికారికంగా రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొంది, ఆర్థికంగా, విదేశ సంబంధాలు వలలో కూరుకొని పోయిన దేశాలలో వివిధ రకాల ఆధారిత దేశాల" గురించి మనకు తెలిపారని పేర్కొన్నారు. అధికారికంగా చెప్పాలంటే భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యం పొందింది. ఈ ఆశయం మరచుట జరిగింది ఫలితంగా, నిజ జీవితంలో దేశ స్వతంత్ర అభివృద్ధి పంధాలోని పురోగమనాన్ని పరిమితంగానైనా చూడలేక పోయాము." [2]

రాజకీయ స్వాతంత్ర్యం పొందామని సి.సి. సరిగానే చెప్పినా, ఆధారిత అంశం కొనసాగుతుందని, సంపూర్ణ, ఆర్థిక స్వాతంత్ర్యం పొందవలసివుందని బ్రిటిష్ ఆధిక్యత యొక్క ఆధారిత ఆర్థిక విధానంపైనే గాక, రాజకీయ స్వాతంత్ర్యంపైనా ప్రభావాన్ని కలిగి వుంది. బ్రిటిష్ కామన్‌వెల్తులో సభ్యత్వం, సైనికంగా ఆధారపడి వుండుట స్వాతంత్ర్యంపై గల పరిమితులను చెప్పుతుంది. మా అభిప్రాయంలో గత సంవత్సరాలలో సంపూర్ణ స్వాతంత్ర్య మార్గంలో పురోగమించినా, సాధించవలసి వున్నది" [3] అని శుక్లా తదితరులు స్పష్టం చేశారు.

"భారతీయుల చేతులలోని రాజకీయాధికార మార్పిడి, సామ్రాజ్యవాదులు యే వుద్దేశ్యంతో చేసినప్పటికీ, ఆర్థికాధిపత్యాన్ని గతంలో వలె కొనసాగించజాలరు. అదే కారణంగా, గతంలో సామ్రాజ్యవాదం రక్షణ వున్న ప్యూడలు వ్యవస్థ, ఆ జే

1. సోమనాద లాహిరి (1955) పోరం. పే. 28-30.
2. శుక్లా తదితరములు (1955) పోరం 9. సెప్టెంబరు 1955 పే. 7.
3. శుక్లా తదితరులు (1955) పోరం. సెప్టెంబరు 9, 1955 పే. 9.

రూపంలో యింకే మాత్రం మనజాలదు. బూర్జువావర్గ రాజకీయాధికారంలోనికి వచ్చి, సంస్థానాలను ఇండియన్ యూనియన్‌లో కలిపివేయుట, జమీందారీ. జాగీర్దారీలను రద్దుచేసి, భూ సంస్కరణలను వ్యవసాయంలో పెట్టుబడిదారి విధానాన్ని పెంపొందించుటకు చేసినా, భూ్యడలు సామాజిక చక్రాన్ని కొంతవరకు బ్రద్దలు కొట్టింది" [1] అని బాలచంద్రమీనన్ తెలియజేసారు.

సునిల్‌సేన్ "సి.సి. తీర్మానం కొన్ని మౌలికమైన సూత్రీకరణలు చేసిందని, అవి కార్యక్రమానికి (1951) భిన్నంగా వున్నాయని" తెలుపుతూ "భారతదేశం సార్వభౌమాధికారంగల స్వతంత్ర దేశం" [2] అని పేర్కొన్నారు. అదే విధంగా "కొద్దికాలం క్రింద జరిగిన ఘటనలు వివాదగ్రస్థమైన కొన్ని సమస్యలకు స్పష్టత చేకూర్చాయ"ని ఇంద్రజిత్‌గుప్తా "భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందుట విజయంగా" పేర్కొంటూ "4వ, కాంగ్రెసు నిర్వహించవలసిన కర్తవ్యాలు తేలిక అగునట్లు చేసాయని" [3] తెలియజేసారు.

అజయ్‌ఘోష్ బెంగాల్ కమ్యూనిస్టు పార్టీ రాష్ట్రీ కమిటి విస్తృత సమావేశంలో "తమ దృక్పథాలను పడివాదంగా పట్టుకొని వుండక, వొకరి నొకరు అర్థం చేసుకొనుట, వొకరి నుండి మరొకరు నేర్చుకొను ప్రయత్నం చేయుటలోనే ఐక్య అవగాహనకు వచ్చుట సాధ్యమని" చర్చల సరళిపై "కామ్రేడ్స్, పూర్తి పరిస్థితిని, వాస్తవికతను, అంశాలను గాక, పాక్షిక పరిస్థితిని వాస్తవికతను, కొన్ని అంశాలను మాత్రమే పూర్తి చిత్రంగా ప్రదర్శించుట" చేస్తున్నారన్నారు. అంతేగాక "నేటి ప్రభుత్వం పోరాటం–రాజీ ఫలితంగా యేర్పడింది. పోరాట బూర్జువా నాయకత్వంలో జరిగినందున రాజీ జరిగింది. ఈ ప్రభుత్వం బ్రిటిష్ వారిచే యేర్పాటు చేయబడ లేదు". ఈ ప్రభుత్వం బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం, బ్రిటిష్ సామ్రాజ్య వాదంతో సంబంధం గల బడా బూర్జువా నాయకత్వం వహించుతున్నారు." అని అజయ్ స్పష్టం చేసారు.

ఇంద్రజిత్‌గుప్తా "భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించిందని" ఎన్ని పరిమితులకు లోనైవున్నా "పొందిన రాజకీయ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుట విదేశాంగ విధానంలోని ప్రధానంగా అభ్యుదయకర విధానాన్ని, స్వతంత్ర ఆర్థికాభి వృద్ధిని, పారిశ్రామిక పునాది అభివృద్ధి సమస్యల యెడల ఉపేక్ష భావం, వ్యతిరేక భావం పార్టీకి వుండజాలదని" [4]అన్నారు.

---

1. మీనన్, బాలచంద్ర (1955) పోరం, డిశంబరు, 1955 పే. 14.
2. సేన్, సునిల్ (1955) పోరం, సెప్టెంబరు, 1955. పే. 19.
3. గుప్తా, ఇంద్రజిత్ (1955) పోరం, అక్టోబరు, 1955. పే. 1.
4. గుప్తా, ఇంద్రజిత్ (1955) సి. సి. తీర్మానం, ఎత్తుగడల దృక్పధం, పోరం, అక్టోబరు, 1955 పే. 1-2.

"రాజకీయ అర్థంలో భారతదేశం స్వతంత్ర్యం, సర్వసత్తాత కలది, కాని ఆర్థికంగా ఆధారితమైనది, ఆధారిత నామమాత్రపు లక్షణాలు, రాజకీయ పుపరితలపు కామన్‌వెల్తు సభ్యత్వంలో కన్పించుతున్నా, ప్రధానంగా ఆధారితతత్వం ఆర్థిక విధానంలో లేరూని వుంది" అని పంజాబ్ పెప్సూ కమిటి అవగాహన. కేంద్ర సమితి తీర్మానం భారతదేశం వాస్తవంగా సంపూర్ణ స్వాతంత్ర్యం పొందిందనే అవగాహనతో పాటు, అజయ్ "శాంతి పోరాటం తీవ్రమవుతుందని, మన స్వాతంత్ర్యం అనేక పరిస్థితులతో సంబంధం లేకుండా సంపూర్ణమైనదనే నిర్ణయానికి దారి తీసిందనుట" శాము అంగీకరించజాలమని పంజాబ్ పెప్సూ కమిటి స్పష్టం చేసింది.

అంతేగాక "ఆర్థిక పునాది మారుపు చేయకుండిన ప్రత్యేకంగా మన పరిస్థితులలో ఫ్యూడలిజం, బ్రిటిష్ 'ఆర్థికపట్టు' నిర్మూలించకుండిన మన స్వాతంత్ర్యం సంపూర్ణం, వాస్తవమైనది కాజాలదని గట్టి నమ్మకం....సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక రెండు కర్తవ్యాలు నిర్వహించకపోతే మన స్వాతంత్ర్యం, వాస్తం, సంపూర్ణం కాదని పార్టీ కార్యక్రమ (1951) లో స్పష్టంగా వుంది" [1] అని కార్యక్రమం మార్పు చేయరాదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

స్వాతంత్ర్య సమస్యపై జరిగిన పార్టీ అంతరంగిక చర్చలలో మూడు ధోరణులు వ్యక్తమైనాయి. అవి సక్షిప్తంగా యీ క్రింది విధంగా చెప్పుకొనవచ్చును.

కేంద్ర సమితి జూన్ 1955 తీర్మాన అవగాహనలను 4వ పార్టీ కాంగ్రెసు నిర్మాణ నివేదికలో చెప్పబడిన విధంగా ఒక వర్గం "అతివాద" దృక్కోణాన్నుండి మరోవర్గం మితవాదదృక్కోణాన్నుండి దాడిచేశాయి. అయితే "మితవాద", "అతివాద" రెండు ధోరణులు మైనారిటి ధోరణులు. కేంద్ర సమితిలో మెజారిటి సభ్యులు "మధ్యేమార్గ" ధోరణిపైపు మొగ్గు చూపారని చెప్పవచ్చు. ఈ అవగాహన అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ పైఖరికి దగ్గరిగా వుందని కూడ చెప్పవచ్చును.

అతివాదులుగ నాడు పేర్కొనబడివారు, స్వేచ్ఛా, స్వాతంత్ర్య సార్వభౌటమాకార, సర్వసత్తాకలపై మార్క్సిస్టు-లెనిస్టు సిద్ధాంత ఆర్థిక కొలమానాన్ని సవరించుట తప్పని, అది వర్తిస్తుందని ఆర్థిక, ద్రవ్య, సైనిక సంబంధాలలో బ్రిటిష్ సామ్రాజ్య వాదంతో గల 'బ్రహ్మముడి'యేగాక, కామన్ వెల్తు బంధనాలు విడిపడలేదని, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, భారత బూర్జువావర్గానికి గల భేదాభిప్రాయాలు, వైరుధ్యం, తగవులు ప్రధాన నిర్ణయాత్మక అంశం కాదని, రెండింటి మధ్యగల "పొత్తు" నిర్ణయాత్మక పాత్ర వహించుతున్నదని. ఆకారణంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదం, దాని దేశీయపొత్తుదారులకు వ్యతిరేకంగా "పూర్తి విముక్తి, సంపూర్ణస్వా

1. పంజాబ్-పెప్సూ కమిటి (1955) సి. పి. తీర్మానం. కార్యక్రమమునకు ప్రతిపాదించిన సవరణలపై నోట్సు. భోరం. అక్టోబరు 11, 1956 పేజి. 27.

తంత్ర్యానికై పోరాడుట భారత విప్లవమౌలిక కర్తవ్యమని" వాదించారు. కొన్నేళ్ళ తరువాత పై అవగాహన "అతివాద పొరపాటుగ" బర్ద్వాన్ ప్లీనంలేఖలో సరిచేసు కొన్నారు.

మితవాదులుగ నాడు పిలువబడినవారు భారతదేశం స్వాతంత్ర్య సార్వభౌమాధికారం గల, సర్వసత్తాక రిపబ్లిక్, విదేశీయ సంబంధాలలో సామ్రాజ్యవాద వ్యతిరేకంగా శాంతి, స్వాతంత్ర్యాలను పటిష్ఠం చేసుకొంటున్నది. దేశీయ విధానాలలో పెట్టుబడిదారి మార్గాభివృద్ధిలో సామ్రాజ్యవాద, భూడలు శక్తులకు వ్యతిరేకంగా భూస్వాడలు సంబంధాలను మార్పుచేయచూస్తున్నది. అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగుతున్నా పార్టీ వొక పార్శ్వాన్నే నొక్కి చెప్తూ, భారత నిజ జీవితంలోని స్వతంత్ర పంథాలోని పురోగమనాన్ని సమగ్రంగా చూడలేకపోయింది. రాజకీయ స్వాతంత్ర్యాన్ని బలపరచుట, పరిరక్షించుట, విదేశాంగ విధానంలోని అభ్యుదయకర మార్గాన్ని, స్వతంత్ర ఆర్థిక, పారిశ్రామిక పునాది, అభివృద్ధి సమస్యల యెడల ఉపేక్షా భావం, వ్యతిరేక భావం పార్టీ వహించుట సరికాదన్నారు. మితవాదులలోని కొన్ని వర్గాలు కాంగ్రెసుతో కొయలీషన్ ప్రభుత్వాల వరకు ఆలోచించుట ఎంత అసంగతమో ట్రావెంకూర్, కొచ్చిన్, ఆంధ్ర ఎన్నికలు, తదనంతర ఘటనలో చరిత్ర స్పష్టం చేసింది.

ఈ ఉభయ 'అతివాద', 'మితవాద' దాడులను తట్టుకొంటూ వాటిని సమన్వయం చేసుకొంటూ, వొక రాజకీయ విధానాన్ని, తక్షణ ఆచరణ కార్యక్రమాన్ని రూపొందించి, మారుతున్న పరిస్థితులలో దేశ ఆర్థిక పారిశ్రామిక, వ్యవసాయక మార్పుల అవగాహనతో "మధ్యేమార్గ వాదం", పురోగమించవలసి వచ్చింది. అనేక సమస్యలపై ప్రజలను కదిలించి, సమీకరించి వివిధ పోరాటాలు నడుపవలసి వచ్చింది. పార్టీ అనైక్యతను అధిగమించి అస్థిత్వాన్ని కాపాడవలసి వచ్చింది. పాక్షిక విజయాన్ని సాధించింది. సహజంగానే యీ మధ్యేమార్గ వర్గం వూగిసలాటలకు, బలహీనతలకు లోనైంది.

మధ్యేమార్గవాదం, భారతదేశం స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను, సార్వభౌమాధికారాన్ని పొందిందని, కాని అర్ధవలస, అర్థిక ఆధారితగ వుంది. బ్రిటిష్ కామన్వెల్తు బంధనాలను ఛేదించి, బ్రిటిష్ అన్ని పరిశ్రమలను అర్థిక ప్రయోజనాలను స్వాధీనం చేసుకొని జాతీయం చేయవలసి వుంది అనే అవగాహనను చేబట్టి రెండు వర్గాలను సంతృప్తిపరచ జూసింది. ఎవరినీ సంతృప్తిపరచలేకపోయింది. దైనందిన సమస్యలపై సమీకరించగలిగింది. పార్టీని విచ్ఛిన్నానుండి కాపాడి కొంత పురోగమనాన్ని సాధించింది.

ఈ విధంగా ఆగస్టు 1947 స్వాతంత్ర్య సమస్యపై 4స, పార్టీ కాంగ్రెసు ముందు చర్చలలో మూడు ధోరణులు పరస్పరం సంఘర్షించాయి.

## ప్రభుత్వ వర్గ స్వభావం :

పార్టీ అంతర్గత చర్చల్లో యిది రెండో ముఖ్య సమస్య, రెండవ కాంగ్రెసు నుండి మూడవ కాంగ్రెసులో ఆమోదించబడిన 1951 కార్యక్రమం వరకు, కాంగ్రెసు యేర్పాటు చేసిన జాతీయ ప్రభుత్వపు వర్గ విశ్లేషణ వివిధ రకాలుగ నిర్వచించాము. "వలస వ్యవస్థను పరిరక్షించే మైనరు భాగస్వామి" యని "బూర్జువా నాయకత్వం వహించే సామ్రాజ్యవాద, బూర్జువా, భూస్వాముల కూటమి" యని, జూన్ 1950లో "సామ్రాజ్యవాదంతో రాజీపడిన, బడా బూర్జువా, భూస్వాముల ప్రభుత్వమని, 1951 కార్యక్రమంలో "సామ్రాజ్యవాదంతో రాజీపడిన బడా బూర్జువా, భూస్వాముల, రాకుమారుల ప్రభుత్వమని" నిర్వచించాము. ఈ నిర్వచనాల సామాన్య లక్షణం సామ్రాజ్యవాదంతో ప్రత్యేకంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో రాజీపడినదని, స్వతంత్ర విదేశాంగ విధానాన్ని, పారిశ్రామికీకరణను, వ్యవసాయ సంస్కరణలను చేసి స్వతంత్ర్యాన్ని సుస్థిరం చేయజాలదని స్పష్టం చేసాము.

మధురై పార్టీ కాంగ్రెసులో మన విదేశాంగ విధానం ప్రపంచ యుద్ధ వ్యతిరేక శాంతి పోరాటానికి దోహదపడుటను చూచాము. రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రాతిపదిక చట్రం ప్రభుత్వం రూపొందించబడుటతో ప్రభుత్వ వర్గ విశ్లేషణను మరోసారి పునఃపరిశీలించ ప్రారంభించాము. అజయ్‌ఘోష్ కేంద్రసమితి అవగాహనను వివరింపుతూ, ఆరవ అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసు మౌలిక విశ్లేషణను గుర్తు చేస్తూ, కాంగ్రెసు నాయకత్వంలోని ప్రభుత్వం, జాతీయ బూర్జువా ప్రభుత్వం అందులోనే బడా బూర్జువా వర్గం కలిసి వుందన్నారు. "బూర్జువా వర్గంలోని యే భాగం సామ్రాజ్యవాదంపైపు వెళ్ళిందని చెప్పజాలమని, కొందరు వ్యక్తులు వెళ్ళి వుండవచ్చుని" అన్నారు. ఇంకా సామ్రాజ్యవాదానికి, బూర్జువా వర్గ మొత్తానికి మధ్యనున్న వైరుధ్యం కొనసాగుతున్నదని, యీ అర్థంలో భారత బూర్జువా వర్గంలో యే భాగానికి వలస విధానాన్ని అలాగే కొనసాగించుటలో శ్రద్ధలేదని" అన్నారు. అంతేగాక జాతీయ బూర్జువా వర్గ ద్వంద్వ వైఖరిని నొక్కి చెప్తూ "అది తన స్థానాన్ని బలపరచుకొనుటకు సామ్రాజ్యవాదంతో పోరాట విధానాన్ని, రాజీ విధానాన్ని కొనసాగించుతుంది" అని అజయ్ అభిప్రాయాన్ని అధికారి వివరించారు. [1]

కాంగ్రెసు ప్రభుత్వ వర్గ స్వభావ, నైజాలపై 4వ, పార్టీ కాంగ్రెసు పూర్వ

1. అధికారి, జి. (1964) కమ్యూనిస్టు పార్టీ అండ్ ఇండియన్ పాత్ టు నేషనల్ రీజనరేషన్ అండ్ సోషలిజం (ఆంగ్లంలో) పే. 133.

రంగంలో జూన్ 1955 చిత్తు రాజకీయ తీర్మానం, సెప్టెంబరు 1956లో కార్యక్రమానికి (1951) సవరణల ప్రతిపాదనలను పరిశీలించిన, కేంద్ర సమితి మెజారిటీ సభ్యుల అవగాహన తెలియగలదు.

చిత్తు రాజకీయ తీర్మానం (జూన్ 1955) "భారత ప్రభుత్వం బడా బూర్జువా నాయకత్వంలో వుంది." సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలను "నిర్వహించుటను వ్యతిరేకించుటయేగాక విదేశ పెట్టుబడికి, భూస్వాములకు రాయితీలను యిస్తుంది." ఈ కర్తవ్యాలకై ప్రజోద్యమం "ప్రభుత్వపు దేశీయ విధానాలకు వ్యతిరేకంగా పోరాడవలసి వుంటుంది" అని అసందిగ్ధంగా తెలిపింది.

ప్రభుత్వ వర్గ స్వభావాన్ని కేంద్రసమితి సవరణలు "బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వమని, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పొత్తు (లింక్) గలిగిన బడా బూర్జువా వర్గం నాయకత్వం వహించుతున్నదని" [1] ప్రజలకు పోలీసుల లాఠీల నుండి, వడ్డీ వ్యాపారుల దోపిడి నుండి రక్షణ కల్పించక పోగా, భూస్వాములకు, జమీందారులకు, రాజకుమారులకు, సామ్రాజ్యవాదులకు వారి హక్కులకు, రాయితీలకు రాజ్యాంగ చట్టంలో గ్యారంటీలు కలుగజేసిందని వివరించింది.

బెంగాల్ రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ నవంబరు 1955 ప్లీనంలో అజయ్‌ఘోష్ ఉపన్యసించుతూ "ఈ ప్రభుత్వం బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వం, బడా బూర్జువా వర్గం నాయకత్వం వహించుచున్నది, దానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పొత్తు (లింక్) కలిగివుంది" అదే కాలంలో "భారత బడా బూర్జువా వర్గం బ్రిటిష్ పెట్టుబడితో పొత్తు కొనసాగించుతున్నా, పెట్టుబడిదారీ విధానాభివృద్ధి అవసరాలకు, బ్రిటిష్ పెట్టుబడి ప్రయోజనాలకు మధ్య వైరుధ్యం పెరుగుట కారణంగా బడా బూర్జువాయేగాక, భారత బూర్జువా వర్గం మొత్తంగా, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో వైరుధ్యాన్ని, సమస్యలపై సంఘర్షణలను కలిగివుంది. అదే విధంగా పెట్టుబడిదారి విధానాభివృద్ధికి, అర్ధ ఫ్యూడలు వ్యవసాయ సంబంధాలకు గల వైరుధ్యం పెరుగుతూ వుంది" [2] అని తీర్మానంలో లేని స్పష్టతను అజయ్ యిచ్చారు.

సుందరయ్య తదితరులు ప్రత్యామ్నాయ తీర్మానంలో కేంద్ర సమితిలో అందరూ "తోలు బొమ్మ ప్రభుత్వం"; బ్రిటిష్ సామ్రాజ్యవాదంచే యేర్పాటు చేయబడిన ప్రభుత్వం", బ్రిటిష్ సామ్రాజ్యవాదుల రథచక్రాలకు ముడి వేయబడిన

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ, సెప్టెంబరు 1955 కేంద్రసమితి కార్యక్రమ సవరణ పత్రం నుండి.
2. అజయ్‌ఘోష్ (1955) బెంగాల్ రాష్ట్ర కమిటి నవంబరు 1955 ప్లీనం సమావేశంలోని ఉపన్యాసం. పే. 13.

ప్రభుత్వం" లాంటి పదాలను తొలగించుటయేగాక "తోలుబొమ్మ ప్రభుత్వం" అనుట తప్పిదమని అంగీకరించారు, అని తెలిపారు. అయితే సి.సి. అక్కడితో ఆగలేదని ప్రభుత్వం దగ్గరదగ్గరగా స్వతంత్రప్రభుత్వమని బ్రిటిష్‌సామ్రాజ్యవాదంతో మిలాఖత్ కాలేదని, దానిని అనుసరించుట మాత్రమే చేస్తుంతని", "ప్రభుత్వం మిలాఖత్ కాకుండా మిలాఖత్ అయిన బడా బూర్జువాలను బలపరుస్తున్నదని" పరస్పర విరుద్ధ అభిప్రాయాలను రాజకీయ తీర్మానం కలిగివున్నది. ఇది కార్యక్రమంలోని పొరపాట్లను సరిచేయుటగాక, ప్రభుత్వ అభివృద్ధి నిరోధక మిలాఖత్ స్వైజాన్ని త్రోసివేసి ప్రభుత్వ వ్యతిరేకతను నీరుగార్చి, దానిపై దాడిని మొద్దుబార్చుట అవుతుందని" తమ అవగాహనను స్పష్టం చేసారు.

అంతేగాక సి. సి, మిలాఖత్ (కొలాబరేషన్) అను మాట వున్న చోటల్లా" రాజీ "అను మాటతో నివరించుతూ", ప్రభుత్వం, భారత బడా బూర్జువా వర్గం బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో మిలాఖత్‌ను, సంబంధాలను త్రెంచుకొన నిరాకరించుచున్నది"[1] అని తమ వ్యతిరేకతను తెలిపారు. ప్రభుత్వం బడా బూర్జువా నాయకత్వంలో వుంది. రాజీ విధానాన్ని అవలంభించుతున్న కారణంగా వూగిసలాటలేని పోరాటాన్ని సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా కొనసాగించలేదు. కార్యక్రమంలో (1951) యీ ప్రభుత్వాన్ని తొలగించి జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పరచాలనే నినాదం యివ్వబడింది. ఈ నినాదం, ప్రభుత్వపు వూగిసలాట కారణంగా కాక, ప్రధానంగా బూర్జువా ప్రభుత్వం సామ్రాజ్యవాదంతో మిలాఖత్ అయినందున, సామ్రాజ్యవాద, భూస్వామ్య ప్రయోజనాలకు రక్షణ కల్పించుచున్నందున యివ్వబడింది. ప్రభుత్వం ఎంత వూగిసలాటదైనా సామ్రాజ్యవాద, ప్యూడలు వ్యతిరేక పాత్ర గలదనే అవగాహన, ఆ పాత్ర అంతం అయ్యే వరకు దానితో ఐక్య సంఘటనా విధానాన్ని అవలంభించవలసి వుంటుంది. అప్పుడు జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వ నినాదం, తప్పు, సేద్దేరియనిజం లేక హొందెత్తు పోకడ అగుతుందని" వివరిస్తూ సుందరయ్య తదితరులు చిత్తు తీర్మానానికి (జూన్ 1955) వ్యతిరేకతను వ్యక్తీకరించారు.[2]

పంజాబ్-పెప్సూ కమిటీ "ప్రభుత్వం బూర్జువా, భూస్వాములని పొత్తు నెరపుతున్న బడా బూర్జువా నాయకత్వంలో వుందని" ప్రభుత్వ స్వైజాన్ని తెలిపింది. కేంద్ర సమితి తీర్మానంలో పొత్తు పాత్ర నీరు గార్చబడి, ఆ మాటలను తొలగించి "బలమైన సంబంధాలను" బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో కలిగియుండుటగ మార్చారు...

1. సుందరయ్య, తదితరులు (1955) ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానం. ఫోరం నం. 4. పే. 30.
2. ........అదే........పే. 31.

మన దేశంలో బడా బూర్జువా వర్గం మొత్తంగా సామ్రాజ్యవాదంతో బలమైన సంబంధాలను కలిగియుండుట వేరు, పొత్తు సంబంధం దానికి మించినది. సి. సి. చేసిన విధంగా రెండూ మిశితం చేయరాదు, "పొత్తు సంబంధం అంటే ప్రయోజనాలు అవగాహన పూర్తి సారూప్యత కాదని మేము అంగీకరించుతాము. పొత్తు సంబంధాల పరిధిలో వైరుధ్యాలకు స్థానముందని, తీవ్రతరమవుతుందని, బడా బూర్జువావర్గంలో ఏ భాగం పొత్తులో లేదని యిప్పుడు తలచినా, ఆ అవగాహన తప్పు కాగలదు. ఏ భాగం పొత్తు నెరపుతున్నది, ఏది నెరపుటలేనిది చెప్పుట కష్టము. వైరుధ్యాలు తీవ్రమైన కొలది, ప్రజాస్వామ్య శక్తులు బలమైన కొలది బూర్జువా శక్తులలో భేదాలు, వేర్పాటు స్పష్టమగుతుంది. పొత్తు సంబంధాలతో సైన్యం, పోలీసు, పరిపాలనా యంత్రాంగంలో, కీలక స్థానాల్లో రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలలో ఫ్యూడలు శక్తుల పాత్ర తక్కువగా అంచనా వేయరాదు. [1]

అదే రాష్ట్రపు లాయెల్లాపురి తదితరులు "ప్రభుత్వం భూస్వామ్య, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పొత్తుదారులైన అభివృద్ధి నిరోధక బడాబూర్జువాలది, సి.సి. తన నిర్వచనంలో 'పొత్తు' అనేమాటను వదలి 'సంబంధాలు' అనేమాటను, ఉపయోగించినా భారత బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతో పొత్తు కలిగి వుండుటను నిరాకరించలేదు. మా ఉద్దేశ్యంలో జాతీయ బూర్జువా వర్గం కూడ రాజ్యాధికారంలో వుంది. ఫ్యూడలిజానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రభుత్వం తీసుకొన్న చర్యలలో జాతీయ బూర్జువావర్గ పాత్ర తక్కువగా అంచనా వేయరాదు. మన పార్టీ కార్యక్రమంలోవి ప్రభుత్వవర్గ నైజాన్ని సమర్థించుతు, అది భూస్వామ్య బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పొత్తులోని అభివృద్ధి నిరోధక బడా బూర్జువా ప్రభుత్వమని చెప్పింది. అధికారంలో జాతీయ బూర్జువా వర్గం వుంటే, ఆ ప్రభుత్వాన్ని తొలగించుటలో అది మనతో కలవదు. అప్పుడు ప్రభుత్వంలో వున్న జాతీయ బూర్జువా వర్గంతో సంకీర్ణ ప్రభుత్వాన్ని ప్రతిపాదించవలసి వుంటుంది. కాని సి. సి. తీర్మానం సంకీర్ణ ప్రభుత్వపుటాలోచనను నిరాకరించుతున్నది, అయితే కాంగ్రెసు సంస్థతో సంయుక్త అవగాహనను కోరుచున్నది." [2]

"ప్రభుత్వం భూస్వామ్య, బూర్జువా వర్గాలది. ప్రభుత్వ యంత్రాంగంలో బూర్జువా, అర్ధ ఫ్యూడలు శక్తుల వైరుధ్యాల కారణంగా క్రమేణా బూర్జువా శక్తుల చేతులలో కేంద్రీకరించబడింది. ముఖ్యంగా కేంద్ర ప్రభుత్వ అధికారం; ఇదే కొంత తక్కువమోతాదులలో రాష్ట్ర ప్రభుత్వాలలోను జరిగింది."[3] అని ప్రభుత్వపక్ష నిర్మా

1. పంజాబ్-పెప్సూ కమిటీ (1955) నోట్సు, ఫోరం. అక్టోబరు 1955 పే. 21.
2. అయెల్లాపురి తదితరులు (1955) సప్లిమెంటరీ నోట్సు. పే. 7-10.
3. డాంగే (1955) నోటు. ఫోరం. జనవరి 1956 పే. 20.

ణము మాత్రమేగాక, ఆచరణలో ఆ వర్గాల మధ్య భేదాల ఫలితంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో యెవరి ప్రాబల్యం ఏ విధంగా వున్నది డాంగే వివరించారు. అంతే గాక "మనకు యిప్పుడు రాజకీయంగా స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారం వుంది, రాజ్యాంగ సవరణలు కాని, భూసంస్కరణల చట్టాలుగాని, కాంగ్రెసు తీర్మానాలు గాని, ఎన్నికలు గాని ప్రభుత్వాన్ని లేక దేశాన్ని బూర్జువా ప్రజాస్వామ్యంగా కాని జనతా ప్రజాస్వామ్యంగా కాని చేయలేక పోయాయి, అని డాంగే అభిప్రాయం.

భవానిసేన్, జోషి తదితరులు, కాంగ్రెసు ప్రభుత్వ దేశీయ అంతర్గత విధానము ప్రధానంగా భూస్వామ్య సామ్రాజ్యవాద వ్యతిరేక, అభ్యుదయకర మార్గంలో మార్పు చెందిందని, కాంగ్రెసులో అభ్యుదయకాముల అభ్యుదయ నిరోధకులకు మధ్య గల వైరుధ్యం ప్రధాన వైరుధ్యమైందని, ఆ కారణంగా కమ్యూనిస్టుల కర్తవ్యం, అభ్యుదయకర మార్గంలో జరిగే దేశీయ అంతర్గత మార్పులను బలపరుస్తూ, అభ్యుదయ నిరోధక శక్తులను వేరు చేస్తూ, ప్రజాస్వామ్య సంకీర్ణ ప్రభుత్వ నినాదం వైపు పయనించాలని అన్నారు.

సునిల్ సేన్ "నేటి సి. సి. తీర్మానం, కార్యక్రమానికి భిన్నమైన మౌలిక సూత్రీకరణలు చేసింది. 1) భారతదేశం సార్వభౌమాధికారం గల స్వతంత్ర్య రాజ్యం 2) భూస్వామ్య పెట్టుబడిదారీ ప్రభుత్వం, బడా బూర్జువావర్గ నాయకత్వం వుంది 3) విదేశాంగ విధానం ప్రధానంగా అభ్యుదయకరమైనది 4) ప్రణాళికా చట్రం, భారీ పరిశ్రమల ప్రత్యేక నిర్మాణం ద్వారా త్వరితంగా పారిశ్రామికీకరణ ప్రతిపాదించుచున్నది 5) వ్యవసాయంలో భూస్వామ్య భూస్వామ్య విధానాన్ని రద్దు చేయుట ప్రధానమైనది, సరియైనది. అనేక జాతీయ రాజకీయ సమస్యలలో 1953-55 లలో పార్టీ ప్రతిస్పందించుటకు మధురై తీర్మానం ప్రతిబంధకమైందని గుర్తించ నిరాకరించే ధోరణి వుంది." [1] అని తన వైఖరి వివరించారు.

బాలచంద్రమీనన్ "భారతీయుల చేతులలోనికి అధికార మార్పిడి అంటే మన దేశంలోని వర్గ సంబంధాలలో వాస్తవమైన మార్పు. స్వాతంత్ర్య పోరాటంలో జాతీయ బూర్జువా వర్గం ప్రధానశక్తి, ప్రధాన పాత్ర వహించిన బూర్జువా వర్గం అధికారంలోనికి వచ్చింది. అధికారంలోనికి వచ్చిన తరువాత భూస్వాములు రాచరిక శక్తుల వెన్నువిరిగే సంస్కరణలు, చర్యలు చేపట్టింది. భూస్వాములు, రాచరిక సంస్థానాలను ఇండియన్ యూనియన్‌లో కలిపి వేసింది. జమిందారీ విధానాన్ని నష్టపరిహారంతో రద్దు చేసింది" అని తెలియజేశారు. "ప్రాథమికమైన అభిప్రాయ [illegible]

1. సునిల్ సేన్ (1955) ఫోరం. సెప్టెంబరు 1955 పే. 19.

ప్రాయాలున్నాయి కనుక ప్రభుత్వ విధానాలకు సాధారణ మద్దతు యిచ్చే ప్రశ్నే ఉదయించదు" [1] అని అన్నారు.

ప్రభుత్వవర్గ స్వభావంపై వెలిబుచ్చబడిన వివిధ అభిప్రాయాలు సంక్షిప్తంగా యీ క్రింది విధంగా వున్నవి.

జూన్ 1955 చిత్తు తీర్మానం "భారత ప్రభుత్వం బడా బూర్జువా నాయకత్వములో వుందని" చెప్పింది. సెప్టెంబరు కేంద్ర సమితి కార్యక్రమానికి సవరణలు ప్రతిపాదించుతూ, దానినే కొంత విస్తరించి" బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వమని బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో సంబంధం కలిగి, బడా బూర్జువా నాయకత్వంలో వున్నదని" స్పష్టం చేసింది.

సుందరయ్య తదితరులు "బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో సంబంధం కాక "మిలాఖత్" అయిన బడా బూర్జువావర్గ నాయకత్వంలో యీ బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వముందనే అభిప్రాయాన్ని వెలిబుచ్చి వివరించారు. జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన మార్పులతో 1951 కార్యక్రమంలో కొన్ని సవరణలు ఆమోదించినా, అన్ని మౌలిక విషయాలలో దానినే పునరుద్ఘాటించి, జూన్ 1955 చిత్తు రాజకీయ తీర్మానాన్ని వ్యతిరేకించి ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానాన్ని ప్రతిపాదించారు. బడా బూర్జువావర్గం మొత్తంగా సామ్రాజ్యవాదంతో బలమైన సంబంధాలను కలిగి వుంది, కాని పొత్తు సంబంధం దానికి మించినది. రెంటిని స. సి. పరె మిళితము చేయరాదు అన్నారు.

"ప్రభుత్వం భూస్వామ్య, బూర్జువా వర్గాలదని" కాని ప్రభుత్వ యంత్రాంగంలో రెంటికి గల వైరుధ్యాల ఫలితంగా క్రమేణా బూర్జువా వర్గ శక్తులతో కేంద్రీకరించబడిందని, రాష్ట్రాలలో వొకే మాదిరిగా లేదని" డాంగే అన్నారు. భవానీసేన్ తదితరులు ప్రభుత్వ దేశీయ విధానం ప్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేకంగా అభ్యుదయకర మార్గంలో వుందని, కమ్యూనిస్టులు ప్రజాస్వామ్య సంకీర్ణ ప్రభుత్వ పథంలో పురోగమించాలన్నారు. మన స్వాతంత్ర్య పోరాటంలో జాతీయ బూర్జువా వర్గం నాయకత్వం వహించిందని, అదే ప్రభుత్వంలో ప్రధాన శక్తిపై ప్యూడలు శక్తులను నిర్వీర్యం చేసిందన్నారు.

ప్రభుత్వం బూర్జువా, భూస్వామ్య వర్గాలదని వివిధాభిప్రాయాలు అంగీకరించినా, నాయకత్వ విషయంలో బడా బూర్జువా వర్గమా లేక జాతీయ బూర్జువా వర్గమా అనేదే ప్రధాన భేదాభిప్రాయం. పెక్కుమంది బడా బూర్జువా వర్గమని అంగీకరించినా, బడా బూర్జువా వర్గం మొత్తంగా కాదని, కొన్ని శాఖలు లేక వ్యక్తులనే అనే అభిప్రాయ భేదాలు వెల్లడయ్యాయి. అదే విధంగా బడా బూర్జువా వర్గం

---

1. బాలచంద్రమీనన్ (1955) ఫోరం, 30 అక్టోబరు 1955. పే. 14-17.

సామ్రాజ్యవాదంతో గల సంబంధాల విషయంలో "పొత్తు" "సంబంధం" లను వేరు వేరుగ పరిగణించుటలోనూ భేదాభిప్రాయాలు వెల్లడైనాయి.

**విదేశాంగ విధానం, శాంతి పోరాటం :**

కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి జూన్ 1955 రాజకీయ తీర్మానం ప్రపంచ రాజకీయ పరిణామాలపై, భారత ప్రభుత్వ యుద్ధ వ్యతిరేక ప్రపంచ శాంతి సమస్యలతో పాటు, వలస దేశాలలోని పోరాటాల యెడల తీసుకొన్న వైఖరి. ప్రపంచంలోని అన్ని దేశాలతో స్నేహ, సహకార, వ్యాపార సంబంధాలను సమాన ప్రాతిపదికపై విస్తరించే చర్యలపై పార్టీ వైఖరిని తెల్పుతుంది.

1) సోవియట్ రష్యా, చైనా, తూర్పు యూరపు దేశాలు, వియత్నాం సోషలిస్టు పథంలో పయనించుట, వలసలు, అర్థవలసలలోని 900 మిలియనుల ప్రజానీకం విముక్తి యగుటతో ప్రపంచ శక్తుల బలాబలాలతో సోషలిజం, ప్రజాస్వామ్య శక్తులకు అనుకూలంగా, బలం పెరిగిందని. పరిస్థితులు మారాయని తీర్మానం స్పష్టం చేసింది.

ఈ సూత్రీకరణ ఏకగ్రీవామోదం పొందినట్లు కన్పించుతున్నా కేంద్ర సమితిలో గాని, తదుపరి చర్యలలోగాని దీనికి భిన్నమైన అభిప్రాయం వచ్చినట్లు కన్పించదు.

2) యుద్ధోన్మాదుల కారణాన ప్రపంచశాంతి సమస్య కేంద్ర సమస్య అయింది. జాతుల స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య పరిరక్షణ, శాంతి రక్షణలోనే యిమిడి వుంది. తీర్మానాన్ని వ్యతిరేకిస్తున్న పొకవర్గం, యీ సూత్రీకరణకు భిన్నంగా వలసల, అర్థవలసల విముక్తి పోరాటాల విజయాలలోనే జాతుల స్వాతంత్ర్యం, ప్రజాస్వామికాల పరిరక్షణ వుందనే గాఢాభిప్రాయాన్ని కలిగి వుంది. దానినే వారి ప్రత్యామ్నాయ తీర్మానంలో వెల్లడించారు. మిగతా వర్గాలు, వ్యక్తులు మాటలు వేరువేరుగా వాదినా మొత్తంమీద కేంద్ర సమితి తీర్మాన అవగాహనతో ప్రాథమికంగా ఆమోదించారు.

"భారత బూర్జువా వర్గం యుద్ధాన్ని కోరుటలేదు. తన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొంటూ, తన వర్గ ప్రయోజనాలకు అనుకూలంగా వున్న, ప్రభుత్వ విదేశాంగ, శాంతి విధానాన్ని అవలంభించింది. సామ్రాజ్యవాద వ్యతిరేక, ఆసియా ఐక్యత, ప్రజాస్వామ్యాన్ని పెంపొందించే శాంతి మార్గంలో విదేశాంగ విధానం రూపొందుటను, దానిలో నెహ్రూ పాత్రను గుర్తించాలి. పంచశీల, ఆసియా ఐక్యత సోషలిస్టు, ప్రజాస్వామ్య దేశాలతో సన్నిహిత సత్సంబంధాలు, నెలకొల్పుటతో పాటు, అటం బాంబును నిషేధించాలని, శాంతికై ప్రజా వుద్యమాన్ని పెంపొందిం

చాలి. శాంతి, స్వాతతంత్ర్యం, ప్రజాస్వామ్యాలకై కార్మిక, కర్షకులను సమీకరించి ప్రపంచశాంతి వుద్యమంలో భారతదేశం ప్రముఖ పాత్ర వహించునట్లు చేయాలని" [1] తీర్మానం ప్రభుత్వ విదేశాంగ విధానానికి పూర్తి సహకారాన్ని వివరించింది.

"శక్తివంతమైన సోషలిస్టు, ప్రజాస్వామ్య పక్షం, ప్రపంచ మార్కెట్టు, ఆసియాలో పోరాటాల పునర్జీవనం, దేశంలో ప్రజాస్వామ్య శాంతి వుద్యమాల అభివృద్ధి, భారత ఆర్థిక స్థితి కొన్ని అంశాలలో అభివృద్ధి, సామ్రాజ్యవాదుల శిబిరంలో వైరుధ్యాలు తీవ్రత చెందుట, ఫలితంగా శాశ్వతంగా బలహీన పడుట, భారత బూర్జువా వర్గం సామ్రాజ్యవాదుల మధ్య సంఘర్షణాభివృద్ధి, యివన్నీ భారత ప్రభుత్వం, స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారం పటిష్టం చేసుకొనుట సాధ్యమగునట్లు చేసాయి" [2] విదేశాంగ విధానంపై కేంద్ర సమితి యిచ్చిన అవగాహన యిది.

3) బాండుంగు సమావేశం ఆసియా సమైక్యతా చిహ్నం, ఇండో-సోవియట్ మైత్రి, నెహ్రూ, చౌయెన్‌పై పంచశీల ప్రకటన. జూన్ 1954 నెహ్రూ-బల్గానిన్ ప్రకటన ప్రపంచశాంతి వుద్యమాన్ని బలోపేతం చేసాయి. దీనిని తిరుగుముఖం పట్టించుటకు కొన్ని శక్తులు పని చేస్తున్నాయి. పార్టీ శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యాలకై కార్మిక, కర్షకులను సమీకరించి ప్రపంచశాంతి వుద్యమంలో భారత దేశం ప్రముఖ పాత్ర వహించునట్లు చేయాలి అనే కేంద్ర సమితి అభిప్రాయాన్ని పెక్కురు సమర్థించారు.

4) ప్రత్యామ్నాయ తీర్మాన వాదులు 1947 నుండి భారత ప్రభుత్వం "అలీన విధానాన్ని", "చైతన్య తటస్థత" విధానాల క్రమాన్ని, ఐక్యరాజ్య సమితిలో ఇండియా, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల కనుకూలంగా, ఉత్తరకొరియాను దురాక్రమణ దారుగ పేర్కొనుటను వోటు చేయబడుట ప్రస్తావించారు ప్రపంచ సోషలిస్టు, ప్రజాస్వామ్య వ్యవస్థ బలపడుటతో అమెరికా ఆశల అపజయం, దేశంలో ప్రజాస్వామ్య శక్తులు ఎన్నికలలో బలపడుట, ఫలితంగా ఇండియా శాంతి మార్గంలో సామ్రాజ్యవాదుల శక్తులకు వ్యతిరేకంగా ముందుకు వచ్చుటకు తోడ్పడినవి.[3]

భారత ప్రభుత్వం ప్రధానంగా బ్రిటిష్ సామ్రాజ్యవాద విదేశాంగ విధానాన్ని

---

1. చిత్తు రాజకీయ తీర్మానం, జూన్ 1955. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర-అధికార పత్రాలు. పే. 4.
2. ........ అదే ........ పే. 4.
3. సుందరయ్య తదితరులు (1955) ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానం. ఫోర్థం.. పే. 4.

అనుసరించిందని చెప్పుట పొరపాటు, వాస్తవానికి భారత ప్రభుత్వ విదేశాంగ విధానము ఆ ప్రభుత్వంలో నాయకత్వం వహించే బడా బూర్జువావర్గ ప్రయోజనాల దృష్టితో రూపొందించింది. అది యుద్ధం, శాంతి శిబిరాల మధ్యగల వైరుధ్యాలను వుపయోగించుకొంటూ, బ్రిటన్—అమెరికాల మధ్య గల భేదాభిప్రాయాలను తన ప్రయోజనాలకు వినియోగించుకొంటూ బ్రిటిష్ సామ్రాజ్యం యొక్క బలమైన ప్రభావాలకు లోనగుతూ వచ్చింది,"

ఆత్మవిమర్శనా పూర్వకమైన పై నూతన అవగాహనతో పాటు ప్రత్యామ్నాయ తీర్మానం "విదేశాంగ విధానంలోని నేటి యీ మార్పు ప్రపంచ శాంతి పరిరక్షణ పోరాటానికి సహాయాన్నందించుటయే గాక, మన జాతీయ స్వాతంత్ర్య పరిరక్షణకు, బలపరచుటకు తోడ్పడుతుంది. అది భారత బూర్జువావర్గ ప్రయోజనాలను మాత్రమేగాక, కార్మిక కర్షక ప్రజానీకమంతటికి ప్రయోజనాలను పంచిని అందించి వుంది." [1] అని వివరణతో కూడిన స్పష్టతనిచ్చి, విదేశాంగ విధానాన్ని హర్షించక తప్పలేదు.

5) నెహ్రూ ప్రభుత్వ విదేశాంగ విధానం, ప్రధానంగా శాంత విధానంగా కేంద్ర సమితి తీర్మానం పేర్కొనుట సరైనదని అంటూ పంజాబ్-పెప్సూ కమిటీ తీర్మానంలో "మార్పు గణనీయమైనదని" పేర్కొనగా అటుపై వివరణ పత్రంలో "గుణాత్మకమైన మార్పుగ" పేర్కొన్నారు. ఆ విధమైన సూత్రీకరణ నెహ్రూ విదేశాంగ విధానాన్ని జనతా ప్రజాస్వామ్య దేశాల విదేశాంగ విధానంతో సమానం చేయుట, నెహ్రూ విదేశాంగ విధానంలోని బలహీనతలను వూగిసలాటలను సరిగా ఎత్తి చూపలేదని విమర్శించింది. అంతేగాక "విదేశాంగ విధానంలోని మౌలికమైన మార్పును అంగీకరిస్తామని" కాని అది "గుణాత్మకమైన మార్పుగ అంగీకరించజాలమని అంగీకరించజాలమని" అన్నది. "దీనినే మరికొంత వివరించుతూ" గుణాత్మకమైన మార్పు "సిద్ధాంతరీత్యా" దాని మౌలిక గుణంలోని మార్పుని" తన పూర్వరూపాన్ని కోల్పోవటమే గాక "నైజం-లేక-గుణాలు లేక లక్షణాలలో కూడ మార్పు వస్తుందని, రాసిలో మార్పు పెరుగుదల లేక తరుగుదలే కాని రూపంలో కాని, లక్షణాలలో గాని మార్పుండదని పెప్సూ కమిటీ తెలిపింది. శాస్త్రీయ వివరణ అది. అంతేగాక "నేటి ప్రభుత్వవర్గ నైజం మౌలికంగా అర్థవలస, ఆధారిత ఆర్థిక విధానం నేటి రాజకీయ ఉపరితలానికి మూలమైనపుడు, గుణాత్మకమైన మార్పు అసాధ్యమని "సిద్ధాంత వివరణ యిస్తూ గుణాత్మక మార్పు అంటే వూగిసలాటలు, బలహీనతలు లేనిదని వివరించారు.

సిద్ధాంత చర్చలు అప్రస్తుతం కాని ఒక ప్రశ్న, మార్క్సిస్టు, తత్వశాస్త్రంలో రూపాంతరం లేక మార్పు సిద్ధాంతం, రాశి గుణాత్మకంగా మార్పు చెందుట, గుణా

---

1. సుందరయ్య పి. ప్రత్యామ్నాయ తీర్మానం. పే. 6.

త్మకానంతరం రాశిగాను మార్పు చెందుట" అనే సిద్ధాంత సూత్రం యేమైనది? కనీసం రాశిలో వచ్చిన మార్పు గుణాత్మకమైన మార్పును తెచ్చేటంతటి విస్తృతిలో లేదనిన దానిని అర్థం చేసుకోగలం. రాశి, గుణాత్మకంగా మారదని నేరుగా చెప్పుట శాస్త్రీయ సోషలిజం, మార్క్సిజం కాదు.

6) కేంద్ర సమితి తీర్మానం "శాంతి, స్వాతంత్ర్యం, ఆసియా ఐక్యతలకై బ్రిటిష్ కామన్‌వెల్తు నుండి వైదొలగుట, సైనిక, రాజకీయ సంబంధాలను తెగ తెంపులు చేసుకొనాలని" స్పష్టం చేసింది. అన్ని వర్గాలు యీ విషయంలో ఏకాభి ప్రాయాన్నే కలిగి వున్నారు.

7) దేశ, విదేశాంగ విధానాలలో వచ్చిన మార్పులు కారణంగా కార్య క్రమంలో (1951) మార్పులు చేయుటకు కేంద్ర సమితి సవరణల ప్రతిపాదనలను వేరుగా ప్రతిపాదించింది. ప్రత్యామ్నాయ వాదుల ప్రతిపాదనలు కూడ 1951 నాటి కార్యక్రమంలో మార్పులు, చేర్పులు ప్రతిపాదనలను, అంగీకరించినా, సవరణ లలో భేదించి, తమ సవరణలను ప్రత్యేకంగా ప్రతిపాదించారు. కార్యక్రమంలో సవరణలకు వ్యతిరేకంగా డాంగే ప్రత్యేకంగా వొక తీర్మానం ఆమోదించిన సరిపో తుందని తెలుపుట, సమస్యలను పరిష్కరించుటలో సౌలభ్యాన్ని చేకూర్చకపోగా జటిలం చేసి, గందరగోళాన్ని మరింత యెక్కువ చేయు అవకాశాలే యెక్కువగ వున్నవనుట స్పష్టం.

భారత ప్రభుత్వ విదేశాంగ విధానాన్ని, పంచశీల, ప్రపంచశాంతి విధానాలను బలపరచాలనే కేంద్ర సమితి అవగాహనతో ప్రత్యామ్నాయ తీర్మాన ప్రతి పాదకులు ఆమోదించుతునే, స్వతంత్ర పునాది లేకుండా శాంతి వుద్యమాన్ని నెహ్రూ, నెహ్రూ ప్రభుత్వ కేంద్రంగా నిర్మించుటను ఆమోదించజాలమని, అది శాంతి వుద్యమాన్ని పరిమితులతో కుదించుటయై, సంపూర్ణ స్వాతంత్ర్యం, ప్రజా స్వామ్య పోరాటాలకు నష్టదాయకమౌతుందని, శాంతి వుద్యమంలో చొరవను ప్రజలు చేపట్టినపుడే ప్రజాబలం యినుమడించుతుందన్నారు. [1]

శాంతి వుద్యమంలో సృజనాత్మకంగా ప్రజా సమీకరణతో పాల్గొనుట జరిగి నపుడే, వుద్యమ చొరవ ప్రభుత్వ చేతుల నుండి ఆ పోరాట క్రమంలోనే ప్రజల చేతులలోనికి వస్తుంది. దీనికి భిన్నంగా జరిగిన ప్రజల శాంతి పోరాటం నుండి వేరుపడిపోయే ప్రమాదం వుందని తెలిపారు. వాస్తవానికి అదే జరిగింది.

"జాతీయ బూర్జువా వర్గం పంచశీల విధానాన్ని చేబట్టి, కొరియా యుద్ధంలో ప్రదర్శితమైన సామ్రాజ్యవాద బలహీనతనాధారంగా తన స్థానాన్ని బలపరచుకొనుట

1. సుందరయ్య తదితరులు (1955) ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానం. పోరం. పే. 7-8.

మొదలిడింది. ఇది అత్యంత ప్రాముఖ్యతగల పరిస్థితుల పరిణామాల క్రమము. సోవియట్ రష్యా, చైనాలతో శాంతి, స్నేహ సంబంధాలు సామ్రాజ్యవాద వ్యతిరేకతతో కొంత పురోగమించి ఆసియా నాయకుడుగా ముందుకు వచ్చే ప్రయత్నం చేస్తున్నది. దీనికి సోషలిస్టు శిబిర బలం, ప్రపంచ పరిస్థితులలో నిర్ణయాత్మకమైనదిగా అగుట, భారత జాతీయ బూర్జువా వర్గం, తన స్వాతంత్ర్యానికి ప్రమాదకారులైె యుద్ధోన్మాదులకు దూరంగా, చైనా, సోవియట్ రష్యాలతో స్నేహ సంబంధాలను, పంచశీలను ప్రకటించునట్లు చేసింది. అంతర్జాతీయ పరిణామలలో వచ్చిన మార్పును భారత బూర్జువా వర్గం గుర్తించి పరిస్థితులను తనకు అనుకూలంగా చేసుకొనుటకు తన విధానాన్ని రూపొందించుకొన్నది. దీనిని గుర్తించుటలో కమ్యూనిస్టుపార్టీ వెనుకబడింది. సెప్టెంబరు కేంద్ర సమితి సమావేశంలో యీ పరిణామాలు చూడ జాలక పోవుట ఫలితం ఆంధ్ర ఎన్నికలలో అపజయాలు. [1]

సోమనాదలాహిరి "విదేశాంగ విధానంలోని నూతనాంశం, స్వతంత్ర విదేశీ విధానం యింకే మాత్రం బ్రిటిష్ సామ్రాజ్యవాదంపై ఆధారపడక, శాంతి పరిరక్షణ ధ్యేయంగా, సామ్రాజ్యవాద శక్తుల దురాక్రమణకు వారధిగా ముందుకొచ్చింది. గతంలో భారత పాలక వర్గాల విదేశాంగ విధానం సామ్రాజ్యవాదంవైపు మొగ్గుగా వుండేది. కాని నేడు వూగిసలాటలున్నా శాంతి శిబిరంవైపు మొగ్గు చూపుచున్నది. ఈ మౌలికమైన మార్పు అభ్యుదయకర లక్షణం" [2] అని వ్యాఖ్యానించారు.

సత్యనారాయణ తదితర ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులు భారత విదేశాంగ విధానంలో క్రమక్రమంగా వచ్చిన మార్పులను వివరించి, శాంతి, యుద్ధ వ్యతిరేక మార్గాన్ని చేబట్టుట, గోవా తదితర వలసలపై సామ్రాజ్యవాద వ్యతిరేకంగా గట్టి చర్యలు గైకొనుట, పరిగణనలోనికి తీసుకొని ప్రభుత్వ శాంతి, సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాలను బలపరచుటకు ప్రజోద్యమాలను నిర్మించాలని ప్రభుత్వ విదేశాంగ విధానమునకు పూర్తి మద్దతు స్పష్టం చేశారు. [3] పంజాబ్-పెప్సూ కమిటీ నెహ్రూ విదేశాంగ విధానంలోని మౌలికమైన మార్పును గుర్తించుతామని, అయితే అది గుణాత్మకమైన మార్పుగ అంగీకరించలేమన్నారు, [4] అంతేగాక గుణాత్మక మార్పు సిద్ధాంతాన్ని ఆమోదించి, ప్రభుత్వం స్వాతంత్ర్యం, ఆసియా ఐక్యతను శాంతిని చేబట్టిందనే అవగాహన శాంతి ఉద్యమ పాత్రను, దానిలో కార్మికవర్గ పాత్రను బలహీనం చేస్తుందని వివరించింది పెప్సూ కమిటీ.

1. డాంగే (1956) నోట్సు. ఫోరం. జనవరి 1956. పే. 3–7.
2. సోమనాథ్ లాహిరి (1955) ఫోరం. అక్టోబరు 1955. పే 26.
3. సత్యనారాయణ (1955) తదితరులు. నోట్సు. ఫోరం. డిసెంబరు 1955. పే. 51.
4. పంజాబ్-పెప్సూకమిటీ (1955) నోట్సు. ఫోరం. అక్టోబరు 1955 పే. 25.

శుక్లా తదితర యు.పి. నాయకులు, "శాంతి సహజీవనాభివృద్ధి, తటస్థ అలీనోద్యమాభివృద్ధి ప్రపంచ శక్తులలో శాంతికి అనుకూలత, నెహ్రూ విదేశాంగ శాంతి విధానంలోని యీ మార్పును ప్రత్యేక భారత లక్షణంగా" భారతదేశానికే వర్తించే పరిణామ క్రమంగా మాత్రమే తలచే విధానం ప్రబలింది. అన్ని నూతన స్వాతంత్ర్య దేశాలకు వర్తించే క్రమాన్ని వొక్క భారతదేశానికి మాత్రమే సంబంధించిన పరిణామంగా నెంచే పొరపాటు సి.సి. చేసిందని వివరించారు.[1]

ప్రపంచ శాంతి, పంచశీల వేదిక, ఆసియా ఐక్యత, సోవియట్ రష్యా, చైనా, సోషలిస్టు దేశాలతో మైత్రి సూత్ర బద్ధంగా రూపొందించబడిన ప్రభుత్వ విదేశాంగ విధానం, ఏక కాలంలో యుద్ధ వ్యతిరేకతను, సామ్రాజ్య వ్యతిరేకతను ప్రతిబింబించుటతో పట్టణ మధ్యతరగతి ప్రజాస్వామ్యాన్ని, నూతన దేశభక్త మేధావి వర్గాలను, పాలకవర్గ నాయకత్వం సమీకరించగలిగిందని డాంగే వ్యాఖ్యానించుటలో అతిశయోక్తి లేదనిపిస్తుంది. అంతేగాక ఆంధ్ర ఎన్నికల ఫలితాలకు ప్రధాన కారణాలలో వొకటిగా చెప్పి, జాతీయ బూర్జువా వర్గంలో అత్యంత అభివృద్ధి నిరోధక గుత్త పెట్టుబడిదారులకు తన విధానమే కమ్యూనిస్టు వ్యాప్తిని అరికట్టగలదని, అమెరికన్ ప్రభావానికి లోనైన శక్తులను సమీకరించగల అవకాశం ప్రభుత్వానికి లభించిందనుటలో అసంగతమేమీలేదు.

## పారిశ్రామిక, వ్యవసాయ, ఆర్థిక విధానాలు :

భారత పారిశ్రామిక, ఆర్థిక, ద్రవ్య విధానాలు ప్రధానంగా బ్రిటిష్ పెట్టుబడి, దేశ, విదేశీయ పెట్టుబడిదారుల ఆధిక్యతలో, పరాధీనంగాను ఫ్యూడలిజం, ఫ్యూడలు అవశేషాలపై ఆధారపడిన కారణంగా అతి బలహీన పునాదులపై వుంది. విదేశీయ పెట్టుబడులను ముఖ్యంగా బ్రిటిష్ పెట్టుబడిని జాతీయం చేసి, ఫ్యూడలిజాన్ని నష్ట పరిహారం లేకుండా వ్యవసాయంలో రద్దు చేయుట ద్వారా దేశ పునాదిని ఆర్థికంగా బలీయం చేయగలమని కేంద్ర సమితి తీర్మానం స్పష్టం చేసింది. భిన్నాభిప్రాయాలున్న వివిధ వర్గాలు యీ అవగాహనను ఏకగ్రీవంగానే ఆమోదించాయి.

అదే విధంగా భారత గుత్త పెట్టుబడిదారుల ప్రయోజనాలను ప్రత్యేకంగా దృష్టిలో వుంచుకొని, వారి ఆధ్వర్యంలో ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు రూపొందించబడ్డాయి అనే అభిప్రాయం కూడ ఏకాగ్రీవామోదాన్ని పొందింది. అంతేగాక ప్రథమ పంచవర్ష ప్రణాళిక అధికోత్పత్తిని, జనపనార, ప్రత్తి అధికోత్పత్తిని గానించి ముడి సరుకుల లోటును భర్తీ చేసింది. దేశ విభజనతో జనపనార, ప్రత్తి పండించే భాగాలు ప్రధానంగా పాకిస్తాన్‌లోనికి, మిల్లులు భారతదేశంలో వుండిపోయినవని గుర్తుచేసుకొనిన, యీ విధాన ప్రాముఖ్యత అర్థం కాగలదు. ఈ విధంగా విదేశ వ్యాపారంలోని లోటు తగ్గించి, స్టెర్లింగ్ నిల్వలను ప్రవాహంగా

1. శుక్లా (1955) ఫోరం. 9 సెప్టెంబరు, 1955 పే. 4.

పారిశ్రామికీకరణకై వినియోగించుటకు బూర్జువావర్గం జాగ్రత్త పడింది. బ్రిటన్, అమెరికాలు రెండూ పారిశ్రామికీకరణకు సహాయపడగలవని వేసిన బూర్జువా అంచనాలు తలక్రిందులగుటతో, వ్యవసాయరంగంలో కన్పించిన, అభివృద్ధి పారిశ్రామిక రంగంలో కన్పించలేదు. వివిధ వర్గాలు యిదే విధమైన అవగాహన కలిగి వున్నాయి. ప్రభుత్వ లక్ష్యం పెట్టుబడిదారీ విధానాన్ని పెంపొందించే మార్గంలో పారిశ్రామిక, ఆర్థిక, ద్రవ్య, వ్యవసాయ విధానాలన్నీ యీ ఏకైక లక్ష్యాన్నే అనుసరించే వున్నవనే అవగాహనలో కూడ భిన్నాభిప్రాయం లేదు.

వ్యవసాయ సంస్కరణలను చేపట్టి, దేశీయ మార్కెట్టును అభివృద్ధి చేయక, దేశీయ గుత్త పెట్టుబడిదారీ వర్గం బ్రిటిష్ పెట్టుబడి పొత్తులో కొనసాగించ ప్రయత్నించుటతో చెప్పుకొన తగిన పారిశ్రామికీకరణ జరుగలేదు. ఈ అవగాహన అన్ని వర్గాలు ఆమోదించినది. అభిప్రాయ భేదంలేదు.

భారత పాలకవర్గం ప్రధమ ప్రణాళిక అనుభవంతో ప్రభుత్వ యాజమాన్యములో సోవియట్ తదితర సోషలిస్టు దేశాలతో ఒప్పందాల ద్వారా ఉక్కు తదితర భారీ పరిశ్రమల నిర్మాణానికి పూనుకొనుట సాంకేతిక పరిజ్ఞానాన్ని యాంత్రిక పెట్టుబడిని దిగుమతి చేసుకొనుట పేర్కొనదగిన మార్పు అని, అన్ని వర్గాల ఆమోదాన్ని పొందింది.

ప్రణాళికలు ప్రపంచ పెట్టుబడిదారీ వర్గ మార్కెట్టు సంబంధాలకు ముడివేయబడిన కారణంగా, ప్రపంచ పెట్టుబడిదారీ వర్గం ఆర్థిక సంక్షోభంలో పడినందున ఆ భారాన్ని మోయవలసి వుండుటయే గాక దాని ఆటుపోటు లన్నిటికి గురి కావలసి వుంది. ఈ అవగాహనను అన్ని వర్గాలు ఆమోదించాయి.

పారిశ్రామికీకరణ భారాన్నంతా ప్రజలపై మోపబడింది. గుత్త పెట్టుబడిదారులకు లాభాలు పొందే పూర్తి స్వేచ్ఛ యివ్వబడింది. అదుపు ఏమీలేదు. ప్రభుత్వ వర్గ స్వభావం కారణంగా, లోటు బడ్జెట్టు, ద్రవ్యోల్బణం అధిక పన్నుల రూపంలో యీ భారం ప్రజలపై మోపబడింది. ఈ సర్వసాధారణ విషయంలో అన్ని వర్గాలు యిదే అవగాహనలో వున్నారు. ఎట్టి భేదం లేదు.

కేంద్ర సమితి పై అవగాహనల నుండి భారతదేశంలో పారిశ్రామికీకరణ విషయంలో తోతుగా పాతుకొనిపోయి వున్న బ్రిటిష్ పెట్టుబడులతోను, వ్యవసాయ రంగంలో ఫ్యూడలు శక్తులతోను బూర్జువావర్గం తీవ్రగా సంఘర్షించవలసి వస్తుంది. తత్ఫలితంగా తన బలాన్ని పెంపొందించుకొనుటకైనా బ్రిటిష్ పెట్టుబడిదారులకు గుత్త పెట్టుబడిదారులకు ఫ్యూడలు శక్తులకు వ్యతిరేకంగా కొన్ని పరిమిత చర్యలను గైకొనవలసిన అవసరమొస్తుంది. గుత్త పెట్టుబడిదారులు, ఫ్యూడలు శక్తులు అభివృద్ధి నిరోధకులు, విదేశీయ పెట్టుబడిదారి వర్గాలు ప్రభుత్వ వ్యతిరేకంగా

పన్నాగాలు కొనసాగించుతారు. వీరి పన్నాగాలను వమ్ముచేయుటకు, ప్రభుత్వం అభ్యుదయకర చర్యలను కమ్యూనిస్టు పార్టీ తప్పనిసరిగా బలపరచాలి. అదే కాలంలో ప్రభుత్వపు ప్రజావ్యతిరేక, కార్మికవర్గ వ్యతిరేక చర్యలను ప్రతిఘటించాలి. ఈ అవగాహనను కేంద్ర సమితిలోని మెజారిటీ వర్గం ఆమోదించినా బలమైన మైనారిటీ వర్గం తిరస్కరించుచున్నది.

అభ్యుదయ, శాంతి విదేశాంగ విధానం, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ కారణంగా భారత బూర్జువా వర్గం స్వతంత్ర పారిశ్రామికీకరణ చేబట్టుటకు తగిన అవకాశాలు యేర్పడినవని, రెండవ ప్రణాళికా లక్ష్యాలు సాధ్యమని యెంచుట, "వాస్తవికతపై ఆధారపడ" లేదని ప్రథమ ప్రణాళిక ఫలితాలు, రెండవ ప్రణాళిక చట్రాన్ని జాగ్రత్తగా పరిశీలించిన తెలుస్తుందని ఆ కారణంగా పాలక వర్గాల ప్రణాళికను నిర్దిష్ట ప్రత్యామ్నాయ ప్రతిపాదనలతో ప్రజల ప్రయోజనాలకై విమర్శనాత్మకంగా వ్యతిరేకించాలని మైనారిటి వర్గం నిర్ధారణ చేసింది.

ప్రథమ ప్రణాళిక "పరిమిత పురోగతిని సాధించిందని" కాని జాతీయ ఆదాయాన్ని యుద్ధానికి పూర్వమున్న లక్ష్యానికి చేరువగా పెంపొందించాలని లక్ష్యం కాగా, 1955 కి చేరజాలకపోయింది. అదే విధంగా ఆహార ధాన్యాలు, 12 మిలియను టన్ను వరకు పెరిగిననా మన ప్రజలందరికీ ఆహారాన్ని అందించుట కవసరమైన 30 మిలియనుల టన్నుల లక్ష్యాన్ని రెండవ ప్రణాళికలోనైనా పెట్టుకొనలేదు. పారిశ్రమికోత్పత్తి 1946 కంటె పెరిగినా 1943-44 లో పోల్చిచే తక్కువగానే వుందని విమర్శించారు. సామ్రాజ్యవాదుల అధికృత బొగ్గు, మాంగనీసు, జనపనార, టీ, పెట్రోలియం, యంత్ర ఇంజనీరింగు పరిశ్రమలలో కొనసాగుతూనే వుంది. వ్యవసాయ సంస్కరణలు ప్రధానంగా పెట్టుబడిదారి విధానాన్ని పెంపొందించి, ఉత్పత్తిని పెంచే విధంగా వున్నదని గుర్తించుటలో విఫలమయ్యాము. అదే ఆత్మ విమర్శనాధోరణలో పారిశ్రామిక' వ్యవసాయ రంగాలలో పరిమిత, అధికోత్పత్తికి గల అవకాశాలను గుర్తించుటలోను విఫలమయ్యాము. కేంద్ర సమితి పూ్యడలు వ్యతిరేక చర్యలను, పెట్టుబడిదారి విధానంలో సాధించిన పరిమిత అభివృద్ధిని అతిగా అంచనావేసి, నేటి ప్రభుత్వంలో పారిశ్రామికీకరణ ద్రిమేదా పరిష్కార మౌతుందనే భ్రమలను కల్పించుతున్నది. ప్రణాళిక అభివృద్ధి నిరోధక అంశాలను బహిరంగ పరుస్తూ పోరాటం కొనసాగించాలని మైనారిటీ వర్గం కేంద్ర సమితి తీర్మానంలో రూపొందించి బలపరచే సామాన్య పంథా తప్పని స్పష్టం చేసింది.

జాతీయ బూర్జువా వర్గం నెహూ్రి నాయకత్వంలో 1955 లో "సోషలిస్టు

నమూనా", "భారతీయ సోషలిజం" అనే సిద్ధాంత భ్రమలను కల్పించుతున్నదని డాంగే అంటూనే, మరో వైపున నెహ్రూ ఆర్థిక విధానాన్ని బూటకపు సోషలిజంగా త్రోసి వేయరాదని, దానిలో కొన్ని "ప్రధాన సుముఖ లక్షణాలు" వున్నవన్నారు. ఆ ప్రాతిపదికపై జాతీయ బూర్జువావర్గం దేశం మొత్తంగా కొంత ముందుకు పురోగమించగలదన్నారు. ఈ పురోగమనం శ్రామికవర్గాలకు బరువు భారం కాకుండా మన పాత్ర మనం నిర్వహించాలనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

జాతీయ బూర్జువావర్గం ఫ్యూడలు వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక, జాతి వ్యతిరేక శక్తులను అణచివేయుట లేక నిర్వీర్యం చేయు చర్యలన్నిటిని బలపరుస్తాం అని స్పష్టం చేస్తూ, అయితే బూర్జువావర్గం కార్మికరంగంలో కలుగజేయు భ్రమలను తొలగించుతామన్నారు. ప్రభుత్వ పారిశ్రామిక రంగాన్ని, ఇంపీరియల్ బ్యాంకు జాతీయకరణను వ్యతిరేకించే గుత్త పెట్టుబడిదారీ వర్గాలకు వ్యతిరేకంగా పార్టీ స్వతంత్ర సమీకరణతో ఆచరణలో పోరాటం సాగించాలి.

అదే విధంగా పార్టీ శక్తికొలది ప్రభుత్వ ప్రణాళికలకు మద్దతు నిస్తూనే కష్టజీవుల ప్రయోజనాలకు అదే కాలంలో పోరాడాలి, అని డాంగే తన దృక్పథాన్ని వివరించారు. ఒక విధంగా ప్రభుత్వ కార్యకలాపాలకు, విధానాలకు సాధారణ మద్దతునిచ్చే విధానాన్ని ప్రతిపాదించారు.

సోమనాథ్ లాహిరి రెండవ ప్రణాళికా అమలు భారతదేశ పారిశ్రామిక శక్తిని గణనీయంగా పెంచుతుందని, సామ్రాజ్యవాదపు పిడికిలి సడలి పోతుందని, పారిశ్రామికీకరణ మార్గమని, దానిని బలపరచుట మన కర్తవ్యమన్నాడు.

స్థూలంగా కేంద్ర సమితి మెజారిటీ తీర్మానం ప్రభుత్వ విధానాలకు విమర్శనాత్మక మద్దతును మధ్యేమార్గంగా సూచించగా, మైనారిటీ ప్రత్యామ్నాయ తీర్మానవాదులు ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకతను స్పష్టం చేశారు. డాంగే మరికొందరు పరిమితులులేని సాధారణ మద్దతును, సహకారాన్ని ప్రకటించారు.

కమ్యూనిస్టుపార్టీలో అంతర్గత సిద్ధాంత చర్చలు, రాజకీయ విధాన పరిశీలనలలో, స్వాతంత్ర్య సమస్యపై వివిధ వర్గాల అవగాహనలు, భారత ప్రభుత్వంలో వివిధ వర్గాలు పొందిక, ప్రభుత్వ స్వభావం లేక నైజములపై వివిధ దృక్పథాలు, అవగాహనలు, మన దేశ విదేశాంగ విధానము, యుద్ధోన్మాదుల ప్రయత్నాలు, శాంతి సహజీవనములపై వివిధ వైఖరులు, అవగాహనలతో పాటు ప్రభుత్వ పారిశ్రామిక వ్యవసాయ, ఆర్థిక విధానాలపై పార్టీలో వివిధ అభిప్రాయాలు స్థూలంగా తెలుసుకొన్నాం. ఐక్య సంఘటనా సమస్యను వివరంగా అధ్యయనం చేయవలసి వుంది.

III

# ఐక్య సంఘటనా సమస్యలు

సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పోరాటాన్ని అన్ని వర్గాలు, వాటికి ప్రాతినిధ్యం వహించే వివిధ పార్టీలు, వ్యక్తులు కనీస కార్యక్రమముపై ఐక్య సంఘటనగా యేర్పడి పాలకవర్గ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, ప్రజా సమస్యల పరిష్కారానికై పార్లమెంటులో, బయట కొనసాగించుటకు ప్రజా సమీకరణ కావించి పోరాడుట ప్రజల కర్తవ్యమైనది. వాస్తవానికి ఐక్య కార్యాచరణ పోరాటాల క్రమంలోనే ఐక్య సంఘటనా ప్రజావుద్యమం యేర్పడుతుంది. ఈ పోరాటాలు ప్రజా సమస్యలపై కావచ్చు. ఎన్నికల పోరాటాలు కావచ్చు. పోరాట స్వభావాన్ని బట్టి వివిధ రూపాలలో ఐక్య సంఘటన యేర్పడుతుంది. వీటిలో ప్రజలపాత్ర ప్రధానంగా వుంటుంది.

**అనైక్యత నుండి ఐక్యత :**

కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి జూన్ 1955, నాటి జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిస్థితి పరిశీలించి రాజకీయ విధాన చిత్తు, తీర్మానాన్ని ఆమోదించింది. తీర్మానం ప్రజాస్వామ్య పక్షాల అనైక్యత ప్రజాసమస్యలపై పోరాటాలకు ప్రతిబంధకమై ప్రజావుద్యమాల పురోగమనానికి అత్యవసరంగా ఐక్య కార్యాచరణ, తద్వారా ఐక్య సంఘటనా నిర్మాణం చేయవలసిన అవశ్యకతను, అవగాహనను వివరించింది.

కాంగ్రెసు ప్రజా సామాన్యంలోని సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాస్వామ్య వ్యతిరేక, జాతి పునర్నిర్మాణ ఆశయాల ఉధృతి ప్రాతిపదికగా వివిధ వర్గాలలో అవగాహన పెంపొందించి తన స్థానాన్ని బలపరచుకొని పదిలం చేసుకొంటున్నది. కాంగ్రెసు వ్యతిరేక శక్తులు స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసులో చేరి దానిని బలపరచుటను పరిగణలోనికి తీసుకొనాలి. ప్రధమ ప్రణాళికలో సాధించిన పరిమిత ఆర్థికాభివృద్ధి, అధికాహారోత్పత్తితో తేలికపైన ఆహార పరిస్థితి, పారిశ్రామికీకరణకు ప్రతిపాదనలు ముఖ్యంగా రెండవ పంచవర్ష ప్రణాళిక, సోషలిస్టు సమూనా అవిడి ప్రకటనలు ప్రజలలో ఆశలను, భ్రమలను కల్పించాయి. విదేశాంగ శాంతి, యుద్ధ వ్యతిరేక విధానంతో పోరాడిన అంతర్జాతీయ ఖ్యాతిని, కాంగ్రెసు తనను బలపరచుకొనుటకు సహజంగానే ఉపయోగించుకొంది.

ఆంధ్ర, ట్రావంకూర్–కొచ్చిన్ ఎన్నికలలో, పార్లమెంటు బై ఎలక్షనులలో రాష్ట్ర అసెంబ్లీలు, జిల్లాబోర్డులు, మున్సిపాలిటీలు, పంచాయితీల ఎన్నికలలో పోరైన

వోట్లతీరు, స్వతంత్రులు, ప్యూడలు మత పార్టీల నాయకులు పెక్కురు కాంగ్రెసులో చేరి దాని బలాన్ని పెంచారు. ఈ పెరిగిన బలం ముఖ్యంగా స్వతంత్రులు, మత పార్టీల నాయకుల వోటమితో లభించింది, కాంగ్రెసును వ్యతిరేకించే వామపక్ష పార్టీలైన ప్రజా సోషలిస్టుపార్టీ, కమ్యూనిస్టుపార్టీలు ముఖ్యమైనవి. సాధారణ ఎన్నికలలో కన్నా ఎక్కువ శాతం వోట్లు సంపాదించినవి. కమ్యూనిస్టుపార్టీ రాష్ట్రి అసెంబ్లీల పై ఎలక్షనులలో డిశంబరు 1954 వరకు 6.8 నుండి 12.2 శాతమునకు జనరలు ఎన్నికల కన్నా పెంచుకొనగలిగింది. అయినా వామపక్షాలు పెంచుకొన్న బలం కన్నా కాంగ్రెసు తన బలాన్ని యెక్కువగా పెంచుకొనగలిగింది. కారణం వామపక్షాల అనైక్యత, ప్రతిపక్షాల బలహీనత, ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ జాతీయ రాజకీయ సమస్యలపై ప్రజలను సమీకరించుటలో వైఫల్యము.

ఐక్య సంఘటనా నిర్మాణానికి ప్రాథమిక చర్యగా చేయవలసినది ఆచరణలో ప్రజా ఐక్యతా నిర్మాణం. ఈ కర్తవ్య నిర్వహణలో బహుళ సంఖ్యాకులైన ప్రజా స్వామ్యవాదులు కాంగ్రెసులోను, కాంగ్రెసు ప్రభావంలోను వున్నారని గుర్తించుకొనవలసి వుంది. భారత సమాజంలోని ప్రతి వర్గంలో కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యం, ప్రజాస్వామ్య ప్రతిపక్షాలను అనుసరించే ప్రజాసామాన్యంగా ప్రధాన చీలిక ఏర్పడింది. అయినా ఐక్యతా నిర్మాణ అవకాశాలు రోజురోజుకు ఎక్కువగుతున్నవి.

ప్రభుత్వపు ప్రజావ్యతిరేక విధానాలతో కాంగ్రెసును అనుసరించే ప్రజా సామాన్యం, కాంగ్రెసులోని కొన్ని వర్గాలు ప్రభుత్వ విధానాలను తీవ్రంగా విమర్శించుతున్నారనే విషయం వాస్తవం. అనేకచోట్ల ప్రభుత్వ నిర్బంధ చర్యలను వ్యతిరేకించుతు, కార్మిక. కర్షక పోరాటాలను బలపరుస్తున్నారు. రాష్ట్ర అసెంబ్లీలలో కేంద్ర పార్లమెంటులో ప్రభుత్వపు ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యలను ఖండించుతు, వేగంగా సంస్కరణలు చేయాలని కోరుతున్నారు. ఈ అభివృద్ధికర పరిణామాలకు పార్టీ స్వాగతం చెప్పుతుంది. కాంగ్రెసు ప్రభావంలోని ప్రజాసామాన్యంతో కలిసి ఉమ్మడి సమస్యలపై కార్యాచరణకు పార్టీ సంసిద్ధంగా వుంది. ఆ విధమైన సమిష్టి కార్యాచరణ కాంగ్రెసు, కాంగ్రేసేతర ప్రజాసామాన్యంలో ఏర్పడిన చీలికను అధిగమించుటలో ప్రముఖ పాత్ర వహించగలదు.

కమ్యూనిస్టుపార్టీ తరువాత అఖిల భారత అతివాద పార్టీలలో ప్రజా సోషలిస్టు పార్టీ ప్రధానమైనది. ఆ పార్టీ శాఖలతో, సభ్యులు, ప్రజాసామాన్యంతో ఆచరణ ఐక్యతను నిర్మించుట అత్యంత ప్రాముఖ్యతగల కర్తవ్యం. ప్రపంచ శాంతి, ఆసియా ఐక్యత, సోవియట్-చైనాలతో స్నేహ సంబంధాల స్ఫూర్తితో ట్రావెంకూర్-కొచ్చిన్‌లలో ప్రజాస్వామ్య ఐక్యతను ఆ పార్టీ అగ్ర నాయకత్వం విచ్ఛిన్నం చేయుట, ఆ పార్టీలో రాజకీయ సంక్షోభాన్ని కలుగజేసింది. ఈ వైఫల్యాలను ఆ పార్టీలో సభ్యులు గుర్తించుటతో విభేదాలు తీవ్రమగుట, ప్రస్తుతం కాంగ్రెసు

బలపడుటకే తోడ్పడుతుంది. కాని ప్రతిపక్ష పార్టీలలో ఐక్యతా అవగాహన, ప్రజాస్వామ్య ఉద్యమాలకు బలాన్ని చేకూర్చుతుంది. ఈ ఐక్యతావాంఛ అనేక ఐక్య కార్మిక పోరాటాలలోను, ప్రత్యేకంగా గోవా విముక్తి పోరాటంలోను స్పష్టంగా వ్యక్తమైంది. పార్టీ యిట్టి సమీకరణతో యీ క్రమాన్ని ముందుకు తీసుకొని పోయేందుకు తన శక్తినంతా వినియోగిస్తుందని చిత్తు తీర్మానం తెలిపింది.

"ప్రజాస్వామ్య వామపక్షాలతో, ముఖ్యంగా ప్రజోద్యమాలలో పాత్రగల వారితో, అభ్యుదయకర వ్యక్తులతో సమిష్టిగా ఐక్య సంఘటన నిర్మాణానికి పార్టీ ప్రతి సమస్యపై ప్రయత్నిస్తుంది".

"ప్రజలను మత ప్రాతిపదికపై చీల్చే జనసంఘం, హిందూ మహాసభ రామరాజ్య పరిషత్, ముస్లింలీగ్, అకాలీ పార్టీ లాంటి మతతత్వ పార్టీల విధానాలపై రాజీలేని పోరాటాన్ని, వారి విచ్ఛిన్నకర విధానాలను, ఎత్తుగడలను, వారి సిద్ధాంత పునాదిని, నగ్నంగా బహిర్గతం చేస్తూ, ఎదిరించి పార్టీ పోరాడుతుంది. పార్టీ వారితో ఐక్య సంఘటనా నిర్మాణం కొనసాగించదు. అదే కాలంలో ఆ పార్టీల వెనుకనున్న ప్రజాసామాన్యాన్ని, వ్యక్తులను, సమిష్టి పోరాటాలలోనికి, ఐక్య కార్యాచరణలోనికి తీసుకొని వచ్చుటకు ప్రయత్నిస్తుంది." [1]

ప్రభుత్వ అభివృద్ధి నిరోధక చర్యలపై, ప్రజల జీవన ప్రయోజనాల రక్షణకై ప్రజోద్యమాన్ని, పోరాటాన్ని నడుపుటయే ప్రధానాంశంగ జీవన ప్రమాణాలపై ప్రభుత్వ దాడిని, ప్రజా ప్రతిఘటనలతో, పౌరహక్కులకై ఐక్య సానుభూతి పోరాటాలను నడుపు ప్రత్యేకతను సంతరించుకుంటుంది. అట్టి పోరాటాలలో ప్రజల తక్షణ కోర్కెల పోరాటాలకు రక్షణ కలిగించి, వారి ఐక్యతను పెంపొందించుటయేగాక, మన ఆర్థిక విధానాన్ని అభివృద్ధి చేయాలనే కాంగ్రెసులోని శక్తులకు, బలాన్ని చేకూర్చింది. ఈ కర్తవ్యం బ్రిటిష్ పెట్టుబడిని, భూస్వామ్య విధానాన్ని, గుత్త పెట్టుబడిదారుల స్థానాన్ని పోరాట రంగంగా చేయుట వలన జరుగుతుంది.

ఈ ప్రజా పోరాటాలు ప్రభుత్వపు వ్యవసాయ, కార్మిక, పౌరహక్కుల, పన్నుల విధాన సమస్యలను ముందుకు తీసుకొస్తాయి. ప్రభుత్వ అభివృద్ధి నిరోధక వ్యతిరేక ఉద్యమానికి బలాన్ని చేకూర్చి, అభ్యుదయకర విధానాలను అమలు చేయునట్లు చేయగల ప్రజా ఐక్యతా నిర్మాణంలో బలోపేతం అగుటకు తోడ్పడుతుంది.

ఈ పాక్షిక పోరాటాలను i) విశాల శాంతి, ఆసియా ఐక్యతా ఉద్యమంతోను, ii) పార్టీ సూచించిన ప్రత్యామ్నాయ విధానాలకై జరిపే ఉద్యమాలతోను,

---

1. జూన్ 1955 చిత్తు తీర్మానం. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర. అధికార పత్రాలు. 1977. (ఆంగ్లంలో) వా VIII పే. 431.

iii) ప్రజోద్యమాలలోని చీలికలను అధిగమించగల సరియైన ఐక్య సంఘటనా ఎత్తుగడలతో, iv) ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వాములయ్యే వివిధ వర్గాల, పార్టీల, సంస్థల మధ్య ఐక్యతా పునాదిని బలపరచుటకై సరియైన ఎత్తుగడలతో, v) ప్రభుత్వ ప్రణాళికల నుండి ప్రజలు అత్యధిక ప్రయోజనాన్ని పొందుటకై అన్ని రంగాలలో అవిరామ ప్రజా కార్యాచరణ పెంపొందించుట, vi) ప్రజా సంఘాలను బలపరచి, విస్తృత పరచుట, viii) కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం వంటి ఐక్య కార్యాచరణోద్యమాలతో సంధానపరచవలసి వుంటుంది. [1]

ఈ కర్తవ్యాల వైఫల్యంతో పాక్షిక పోరాటాలు, స్థానిక, ప్రత్యేక వర్గ పోరాటాలుగ వుండిపోవుచున్నవి. కాని ప్రజాస్వామ్య వుద్యమాన్ని మొత్తంగా విస్తృతపరచి, బలమైన ప్రభావాన్ని కలుగజేయజాలక పోవుట జరుగుచున్నది.

**సంఘటనను విస్తృత పరచి, బలపరచుట :**

కమ్యూనిస్టు పార్టీ తక్షణ ప్రజా కోర్కెలపై పోరాడుట అతి ప్రధాన కర్తవ్యం. అదే ప్రజా ఐక్యతను రూపొందించుటకు యేకైక మార్గం. వివిధ పార్టీల ప్రజాసామాన్యం యీ పోరాటాల ద్వారానే యేకమౌతారు. ఐక్యతా చైతన్య ప్రభావితులై కోర్కెలను సాధించుకొంటారు. నైతిక బలం పెరుగుతుంది. ఫలితంగా ప్రజా సానుభూతిని పొంది, అభివృద్ధి నిరోధకుల, ప్రభుత్వ దాడులను త్రిప్పికొట్ట గలుగుతారు. ఐక్య ప్రజా సంఘాల నిర్మాణాలకు అనువగు పరిస్థితులను సృష్టిస్తాయి, ప్రజా వుద్యమాన్ని విస్తృతపరచుటకు, బలపరచుటకు యీ పోరాటాలు ప్రాణప్రదమైనవి. విస్తృత ఐక్య సమితులు (కమిటీలు), సాధ్యమైన, అవసరమైన చోట్ల నిర్మించి ప్రజా పోరాటాలను కొనసాగించి, ప్రజా కార్యాచరణ, పోరాట ఐక్యతను నిర్మించాలి.

పారిశ్రామిక కార్మికవర్గం ప్రత్యర్థి ట్రేడుయూనియనులలో చీల్చబడి, అనైక్యంగా వుండుట ఐక్య ప్రజా కార్యాచరణకు, ప్రజాస్వామ్య సంఘట నిర్మాణ, పోరాటాలకు "పెద్ద చైనా అడ్డుగోడ", తీవ్రమైన బలహీనతయింది. మరో బల హీనత పార్టీ కార్మికవర్గంలో రాజకీయ వర్గ చైతన్యాన్ని కలిగించలేకపోవుట. విస్తృత ప్రజాస్వామ్య సమస్యలైన శాంతి, పౌరహక్కులు, రైతు తదితర వర్గాల కోర్కెలకై కూడ కనీస ఆచరణ ఐక్యతనైనా సాధించలేకపోవుట. రైతులచే దళుర్లు, తొలగింపులు, అధిక పన్నులు, తగినధరల విషయమై చెప్పనక్కరనేలేదు. అదే విధంగా వ్యవసాయ కూలీల వేతనాల విషయమై కూడ చెప్పుకొనవచ్చును. ప్రజల జీవన పరిస్థితులు వేగంగా దిగజారిపోతూ, నేడు రైతు, వ్యవసాయ కూలి సంఘాల నిర్మాణం, విస్తరణ ప్రత్యేక ప్రధాన కర్తవ్యం. మధ్యతరగతి మొదల యిట్టి కర్తవ్యాన్నే చేపట్టవలసి వుంది.

---

1. జూన్ 1955చిత్తుతీర్మానం. భారతకమ్యూనిస్టుపార్టీచరిత్ర(1977)వాVIIIపే.430.

సంఘటన తీర్మాణం నేటి పరిస్థితులలో అతి క్లిష్ట సమస్య. ప్రభుత్వ విధానాలు ఒకవైపు ప్రజల పరిస్థితిని మరింత దిగజార్చుతు, మరోవైపు శక్తివంతమైన ప్రచారంతో ఆశలను, భ్రమలను పెంపొందించాయి. అదే విధంగా ఒక ప్రజలపై అధికారాన్ని మోపుట, మరోవైపు పరిమిత సౌలభ్యాలను కలుగజేయుట ప్రభుత్వం చేస్తున్నది. ఇవి ప్రజల కోర్కెలు, హక్కుల రక్షణకై పోరాటానికి సమాయత్తమగుటను అరికట్టలేవు. ప్రజల తక్షణ కోర్కెలపై ఐక్య కార్యాచరణ సాధ్యమే కాక శక్తివంతమైన ప్రజోద్యమ నిర్మాణం కూడ సుసాధ్యం.

పార్టీ, కార్మికుల, వ్యవసాయకూలీల, బీద, మధ్యతరగతి రైతుల, చేతిపనివారల, నగర మధ్యతరగతి, యితర బడుగు వర్గాల ప్రయోజనాల రక్షణకై కాంగ్రెసు ప్రభుత్వంతో మెజారిటీ ప్రజల పక్షాన పోరాడాలి. ఈ మెజారిటీ ప్రజా సామాన్యమే ప్రజాస్వామ్య ఉద్యమ అన్ని దశలలో ప్రధానశక్తిగ వుంటుంది. అదే కాలంలో ధనిక రైతుల, చిన్న వ్యాపారుల, పారిశ్రామికులు అయిన జాతీయ బూర్జువావర్గపు కోర్కెలు బలపరచుటయే గాక అన్ని వర్గాల ఐక్యపరచే నినాదాలతో ఉద్యమాలను, పోరాటాలను కొనసాగించాలి. పౌరహక్కులు, జాతీయ పరిశ్రమల రక్షణ విదేశీ పోటీదారుల నుండి రక్షించాలి. ప్రజా ప్రయోజనాల దృష్ట్యా ప్రణాళికలకు నిర్దిష్ట ప్రతిపాదనలతో పోరాడాలి.

ప్రభుత్వ ప్రాజెక్టుల యెడల దూరంగా వుండే దృక్పధం విడనాడాలి. వాటిలో చురుకుగా పాల్గొంటూ లంచగొండితనానికి, అసమర్ధత,బురాక్రటిక్ విధానాలకు వ్యతిరేకంగా పోరాడాలి.

సంక్షిప్తంగా, పార్టీ ధ్యేయాలు, విధానాలు, ప్రజల, దేశ ప్రయోజనాల ననుసరించి వున్నవి. కాన అన్ని వర్గాల, పార్టీల, వ్యక్తుల ప్రజాసామాన్యాన్ని తక్షణ కార్యక్రమాలపై ఐక్యపరచి, జాతీయ కర్తవ్య నిర్వహణలో అన్ని దేశభక్తి విప్లవ వర్గాల సహకారం లభించగలదని పార్టీ విశ్వాసము.

**ఐక్య సంఘటన, అజయ్‌ఘోష్ వివరణ :**

పశ్చిమ బెంగాల్ కమ్యూనిస్టు పార్టీ, 3 నవంబరు 1955 సమావేశంలో ఐక్య సంఘటనపై "జాతి పురోగమనానికి విశాల ప్రజా ఐక్య కార్యాచరణ విధానాన్ని రూపొందించుట ద్వారా ప్రజా ప్రయోజనాలను కాపాడగలమని, సహచర మిత్రులను పొందగలమని, పాక్షిక పోరాటాలు గూడ విస్తృత ప్రజాసామాన్యం నుండి వేరుపడిపోయే ప్రమాదముందని, ఫలితంగా ప్రభుత్వంచే అణచివేయబడే అవకాశముందని" అజయ్ అన్నారు. అంతేగాక "సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక విస్తృత ఐక్య సంఘటనను నిర్మించే ఎత్తుగడ: ప్రధాన శత్రువు, దానికి రాజీ వాదులైన దాని మిత్రులపై దాడిని కేంద్రీకరించే దృక్పధాన్ని, విధానాన్ని

అవలంభించుతూ, అభ్యుదయకర విధానాలను, చర్యలను బలపరచుట చేయాలి.. ఈ ఎత్తుగడకు రెండవ ప్రజాళిక చట్రంపై సరియైన దృక్పధం అవసరం". [1]

అజయ్‌ఘోష్ అదే సమావేశంలో ముగింపు ఉపన్యాసంలో ఐక్య సంఘటనపై వివరణ యిస్తూ, జాతీయ ఐక్యతా సమస్యగా వున్నత శిఖరాలకు లేవనెత్తారు" కమ్యూనిస్టు పార్టీ ప్రతి నూతన పరిణామాంశాన్ని, తమననుసరించే ప్రజాసామాన్యాన్ని, యితర ప్రజాస్వామ్య పార్టీల ననుసరించే ప్రజాసామాన్యాన్ని ఐక్య పరచేందుకు సాధ్యమైనంత యెక్కువగా వుపయోగించగలందులకు, పరిగణనలోనికి తీసుకొనవలసి వుంటుంది. నూటికి నూరుపాళ్ళు పార్టీ వేదికపై చేయుట మంచిదే అయినా ఆ విధంగా చేయజాలము. అది ఐక్యతకు భూమికగా తోడ్పడదు. అభ్యుదయ పరిణామాంశాలు కొన్ని వున్నప్పుడు, వాటిని ఆచరణలో పెట్టుటకు వాటిని చేబట్టి బాగా వెలుగులోనికి తెచ్చే ఆచరణ అవసరమని, అది ప్రజాస్వామ్య పరిణామాలని, రావలసినవని, అదే విధంగా ఆ మార్గంలో వున్న అడ్డంకులను తొలగించాలని" వివరించారు.

ఆ వివరణలో భాగంగానే ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణం, దానిలో కార్మికవర్గ నాయకత్వం పెంపొందించే నిర్దిష్ట పోరాటం సాగించుటకు యిదే యేకైక మార్గం.

"దీనిని నిర్వహించకుండుట అంటే అర్థం బూర్జువాల తోకపట్టుకొని పోవుట లేక జాతీయ ఐక్యతా నిర్మాణానికై పోరాటాన్ని విడనాడుట అగుతుంది. రెండిటి వాస్తవ ఫలితం వొక్కటే" అని స్పష్టం చేశారు.

"జనతా ప్రజాస్వామ్య పోరాటానికి, జాతీయ అర్థికత్వాన్ని బలపరచుటకు, జాతీయ ఐక్యత నిర్మాణానికి, ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణానికై పోరాటం. యివి ప్రత్యేక పోరాటాలు గావు, ఒకటి యీ రోజున, మరొకటి మరో రోజు జరిపే పోరాటాలు గావు. దానికి విరుద్ధంగా అన్నింటికి ఒకే ఒక పోరాటం" [2] అని అజయ్ వివరించారు.

ట్రావెంకూర్-కొచ్చిన్ మలబార్ రాష్ట్రి కమిటీల సంయుక్త సమావేశంలో 30 నవంబరు 1955 న "పార్టీ మూడు బలహీనతలను పేర్కొంటూ "ద్వితీయంగా ప్రజాస్వామ్య శక్తుల అనైక్యత, అన్నిటికంటె ముఖ్యంగా కాంగ్రెసును అనున

1. అజయ్‌ఘోష్ (1955) బెంగాల్ రాష్ట్రి పార్టీ ప్లీనరీ సమావేశంలో 3, నవంబరు 1955 న చేసిన ఉపన్యాసం. పే. 37.

2. అజయ్‌ఘోష్ (1955) బెంగాల్ ప్లీనరీ సమావేశంలో 3, నవంబరు 1955 ఉపన్యాసం. పి.పి.హెచ్. పబ్లికేషన్ (పి.పి.హెచ్.) 3 నవంబరు ఉపన్యాసం. పే. 63-64.

శించే ప్రజాసామాన్యానికి మరోవైపు కమ్యూనిస్టు పార్టీని వామపక్షాలను అనుస రించే ప్రజాసామాన్యానికి గల చీలికలు ప్రధానమైనవి. ప్రజాస్వామ్య సంఘటనను ప్రధానంగా కాంగ్రెసేతర శక్తుల ఐక్య సంఘటనగా సంకుచిత సెక్టేరియన్ లేక చొంచెత్తు అవగాహనలో వున్నాం. ఈ అవగాహన సహజంగానే మన నినాదాలను, వైఖరిని కలుషితం చేసింది" [1] అని అజయ్ వుపన్యాసం ముగించారు.

## ప్రత్యామ్నాయివాదుల ఐక్య సంఘటనా దృక్పథం :

కేంద్రసమితి జూన్ 1955 చిత్తు తీర్మానాన్ని ఆమోదించని మైనారిటీ వర్గం ప్రత్యామ్నాయ తీర్మానం, వివరణ పత్రం చర్చలకు సమర్పించారు. వారి ఐక్య సంఘటనా దృక్పథం ప్రత్యేకతను సంతరించుకొన్నది. దానిని తెలుసుకొందాము.

1. కార్యక్రమం (1951) ఐక్య ప్రజాస్వామ్య సంఘటన కార్మిక, కర్షక, మధ్యతరగతి మేదావి వర్గాలు, జాతీయ బూర్జువా వర్గాలతో కలసి యేర్పాటు చేయా లని తెలియజేస్తున్నది.

జాతీయ బూర్జువా వర్గం అంటే వారి దృష్టిలో మొత్తం బూర్జువా వర్గం, బడా బూర్జువా వర్గంతోపాటు మధ్యతరగతి బూర్జువా వర్గం కూడ కలసే వుంది. జనత ప్రజాస్వామ్య విప్లవంలో మిత్రులుగ వుండే బూర్జువా వర్గం సామ్రాజ్య వాదానికి, దాని పొత్తుదారులకు వ్యతిరేకంగా పోరాడేది. ఆ విధంగా జాతీయ బూర్జువా వర్గం మధ్యతరగతి బూర్జువా వర్గం మాత్రమేగాక బడా బూర్జువా వర్గం లోని అత్యధిక భాగం కూడ కలసి ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వామి. పాత్ర ధారి జరుగుచున్నది.

"నేడు వాస్తవంగా బడా బూర్జువా వర్గం మొత్తంగాను, మధ్యతరగతి బూర్జువా వర్గం, ప్రభుత్వాధికారంలో వుండి బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో సహకార రాజీ విధానాన్ని బలపరుస్తున్నది. ప్రపంచ పెట్టుబడిదారి విధాన సంక్షోభం తీవ్ర మైనకొలది జాతీయ బూర్జువా వర్గానికి సామ్రాజ్య వాదానికి మధ్య సంఘర్షణలు, వైరుధ్యం తీవ్రమైనకొలది విప్లవ పోరాటాలు పురోగమించి తీవ్రమైనకొలది బడా బూర్జువా వర్గంలో అధికార నాయకత్వం వహించే ప్రభుత్వంలో చీలిక యేర్పడి అత్యధిక భాగం విదేశ సామ్రాజ్యవాదంతో పొత్తు రాజీ విధానాన్ని వ్యతిరేకిస్తూ, తటస్థంగానో లేక ఐక్య సంఘటనలో భాగంగానో వుంటుందని మా అవగాహన." అయితే అట్టి పరిస్థితులు నేడు లేవని వివరించి "జాతీయ బూర్జువా వర్గమని, అత్య ధిక భాగం సంఘటనలోనికి వస్తుంధనే సాకుతో బ్రిటిష్ పెట్టుబడితో పొత్తు సహ కారం నెరపుతున్న బడా బూర్జువా వర్గంతో ఐక్య సంఘటనను ఏర్పాటు చేయుటకు

1. అజయ్‌ఘోష్ (1955) బెంగాల్ ప్లీనరీ సమావేశంలో 3, నవంబరు 1955 వుపన్యాసం. పే. 14.

ప్రయత్నించుట తప్పు అగుతుంది. ఆ విధమైన పొరపాటు "సాధ్యమైన" దానిని "వాస్తవమైన" దానిగాచేసి, రాజీ పొత్తు నెరపే బూర్జువా దాని విధానాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని నీరు గార్చుటయే అగుతుంది." [1]

అంతేగాక "కార్యక్రమంలో సూచించబడిన ప్రజాస్వామ్య సంఘటన, వివిధ వర్గాల దీర్ఘకాల వ్యూహాత్మక ప్రజాస్వామ్య సంఘటన. దీనిని నేడు వివిధ వామ పక్షాల, గ్రూపులతో ఏర్పరచే ఐక్య సంఘటనతో గందరగోళ పరచరాదు. కారణం అట్టి నేటి సంఘటన యేర్పరచుటలో విజయాన్ని సాధించినా అది వివిధ వర్గాల ఐక్యత నేర్పరచుటలో సోపానం మాత్రమే అగుతుంది" అని "వ్యూహాత్మక" ఐక్య సంఘటన, బహుశా, తక్షణ పోరాటాలలో "ఎత్తుగడల" ఐక్య సంఘటనలను వేరుగ చూపారు.

2) ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణం ఎట్టి పరిస్థితులలో సాధ్యమో చెప్పారు. i) తక్షణ ప్రజా కోర్కెలపై వివిధ పార్టీల, గ్రూపుల, వర్గాలతో విస్తృత ప్రజా కార్యాచరణ అభివృద్ధిపరచి ప్రజా ఉద్యమాలను నిర్మించుట, ii) ఐక్య ప్రజా సంఘాలను నిర్మించుట, iii) పార్టీ నినాదాలు, ప్రజా నినాదాలుగ చేయుట, ఫ్యూడలిజానికి సామ్రాజ్యవాదానికి, వారి పొత్తుదారులైన గుత్త పెట్టుబడిదారులకు వ్యతిరేకముగ కార్మిక ఐక్యతా ప్రాతిపదికగా, వివిధ వర్గాల ఐక్య సంఘటనకు నాయకత్వం వహించగలిగిన ప్రజా కమ్యూనిస్టు పార్టీని నిర్మించగలిగినపుడే సంఘటనా నిర్మాణం సాధ్యమని స్పష్టం చేసారు.

ఆచరణలో వాస్తవంగా వ్యూహాత్మక ప్రజాస్వామ్య సంఘటనను ఎన్నికల ఒప్పందాలు, మిత్రత్వాలు, కూటములు, సంఘటనలు 1952 జనరలు ఎన్నికల ముందు తరువాత యేర్పాటుచేసిన వాటితో గందరగోళ పరచబడ్డాయి.

3) ప్రతి రాష్ట్రంలో ఎన్నికలలో అంగీకృత ఉమ్మడి కనీస కార్యక్రమం ప్రాతిపదికగా ఐక్య ప్రజాస్వామ్య సంఘటనలను నిర్మించ ప్రయత్నించారు. వివిధ పక్షాలు అట్టి సంఘటనలలో చేరుట సాధ్యము కానపుడు ఎన్నికల మిత్రత్వాన్ని, సర్దుబాటులు ప్రయత్నించారు.

హైదరాబాద్, ట్రావెంకూర్ కొచ్చిన్‌లలో జనతా ప్రజాస్వామ్య సంఘటనను, ఐక్య వామపక్ష సంఘటనలను నిర్మించారు. అప్పుడు పార్టీ రహస్యంగానే వుందని గుర్తుంచుకోవాలి. మలబారులో కిసాన్‌మజ్దూర్ ప్రజా పార్టీతో ఎన్నికల వొప్పందం మాత్రం జరిగింది.

ఆంధ్రలో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీతోగాని, క్రిషీకార్ లోక్ పార్టీతోగాని

1. సుందరయ్య తదితరులు (1955) అభిప్రాయాల వివరణ పత్రం. ఫోరం నం. 5 పే. 67.

ఎట్టి ఎన్నికల వొప్పందానికి కమ్యూనిస్టు పార్టీ రాజాలకపోయింది. అయినా కాంగ్రెసు అగ్రనాయకులు పోటీ చేసిన స్థానాలలో యీ పార్టీల అభ్యర్థులను ఏకపక్ష నిర్ణయంగా పార్టీ బలపరచింది. ధ్యేయం వొకటే కాంగ్రెసు అభ్యర్థులను వోడించుట.

బెంగాలులో కమ్యూనిస్టు పార్టీ, కాంగ్రెసుకు వ్యతిరేకంగా మార్క్సిస్టు ఫార్వర్డుబ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, తదితర వామపక్ష గ్రూపులతోను, మరోవైపు కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీతో బలమైన తన స్థానాలను కొన్ని వదలి ఐక్య సంఘటనను నిర్మించ శక్తికొలది ప్రయత్నించింది. ఎన్నికల తరువాత ఆహార, ఉపాధ్యాయుల, ట్రాంపే టిక్కెట్ల ధరలు సమస్యలపై ఐక్య పోరాట సమితులను, యేర్పాటు చేసింది. ఈ సమితులను యేర్పాటు చేయునపుడు, పార్టీ లేక గ్రూపు ఎంత చిన్నదైనా సమాన ప్రాతిపదిక, ప్రాతినిధ్యంపై నిర్మించబడింది. నిర్ణయాలు గైకొనే ప్రశ్న ఉదయించినపుడు, కమ్యూనిస్టు పార్టీ ఆమోదించ నప్పుడు, అత్యధికుల మెజారిటీ నిర్ణయాన్ని కమ్యూనిస్టు పార్టీ ఆమోదించలేదని తదితర పార్టీలు ప్రజలముందుకు తీసుకెళ్ళాయి. అనేక బై ఎలక్షనులలో అనేక యితర పర్యాయములు ప్రజా సోషలిస్టు పార్టీ, రివల్యూషనరి సోషలిస్టు పార్టీ, మార్క్సిస్టు ఫార్వర్డు బ్లాక్, కనీసం కాంగ్రెసుకు వ్యతిరేకంగా సంయుక్త సంఘట నగా పోరాడుటకు అంగీకరించలేదు. పార్టీ గెలిచే అవకాశాలు ఎక్కువగా వున్నా, బలంగావున్నా కమ్యూనిస్టు పార్టీయే అన్నిచోట్ల, యెల్లప్పుడూ త్యాగం చేయాలని వారి కోర్కెగా వుంది.

బొంబాయిలో పీజెంట్సు అండ్ వర్కర్సు పార్టీలో వొక మాదిరి ఎన్నికల వొప్పందం జరిగింది. షెడ్యూల్డ్‌కాస్ట్ ఫెడరేషన్‌తో జరిగిన సంబాషణలు విఫల మయ్యాయి.

పంజాబులో అకాలీలతో కమ్యూనిస్టుల ఎన్నికల సర్దుబాట్లు కొనసాగించుటకై రాష్ట్రీ కమ్యూనిస్టు కమిటీలో విరుద్ధ అభిప్రాయాలున్నవి. మత పార్టీలతో ఎట్టి పొత్తు వుండరాదనే భావనతో అకాలీలతో సర్దుబాటు త్రోసి వేయబడింది.

తమిళనాడులో కమ్యూనిస్టు పార్టీ ద్రవిడ కజగం మద్దతును స్వీకరించి, ఎన్నికల వొప్పందానికి రాగలిగింది.

యు. పి లో మునిసిపలు ఎన్నికలలో అనేక నగరాలలో పౌర సంఘటనలు యేర్పడి అనేకచోట్ల కాంగ్రెసు ఓడిపోవుటకు కారణమయ్యాయి.

ట్రావెంకూర్-కొచ్చిన్ సంస్థానంలో సంయుక్త ఎన్నికల ప్రజాళిక, అసెంబ్లీలో బయట ఐక్య వామపక్ష సంఘటన కమిటీలు పనిచేయుటకు ఆమోదిం చారు. అసెంబ్లీలో ఐక్య వామపక్ష సంఘటన పక్షంగా యేర్పడి పనిచేసారు. బయట అట్టి కమిటీల యేర్పాటుకు ప్రజల ఆదరణ లభించింది. అదే కాలంలో

మూడు పార్టీలు, కమ్యూనిస్టు పార్టీ, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీ తమ స్వతంత్ర కార్యక్రమాన్ని కొనసాగించారు.

ఎన్నికలలో విజయానంతరం పార్టీ టి.టి.యన్.సి., ఆర్.యస్.పి., కె.యస్.పి. లతో కలసి విస్తృత ప్రాతిపదికపై ప్రభుత్వాన్ని యేర్పరచ తలచగా, కె.యస్.పి. వ్యతిరేకించింది. సోషలిస్టు ప్రభుత్వాన్ని మాత్రమే ఏర్పరచాలని, ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వం కాదన్నది టి.టి.యన్.సి. బూర్జువా వర్గంలో వొక భాగమన్నది. కమ్యూనిస్టు పార్టీ స్వతంత్రంగా అటువంటి ప్రభుత్వం ఏర్పాటు చేయుటకై ప్రచార, ఆందోళన ప్రారంభించింది. దీనితో ఐక్య వామపక్ష సంఘటన విచ్ఛిన్న దశకు చేరింది. విస్తృత ప్రజాస్పందన వారిని తమ అభిప్రాయాన్ని మార్చుకొనునట్లు చేసింది.

అనేక సమస్యలపై రివల్యూనరీ సోషలిస్టు పార్టీ పంచాయితీ ఎన్నికలలో యితర పార్టీల వలెనె స్వతంత్రంగానే పోటీ చేసాయి. కమ్యూనిస్టు పార్టీకి 400, రివల్యూషనరీ పార్టీకి 100, కేరళ సోషలిస్టు పార్టీకి 4 మాత్రమే స్థానాలు లభించాయి.

మద్రాసులోనూ ఎన్నికలు అయిన వెంటనే కమ్యూనిస్టు పార్టీతో, కాంగ్రేసేతర పార్టీలు ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటుకు సంసిద్ధమైనట్లైతే, అట్టి అవకాశాలకు మార్గమేర్పడేది. ప్రజలు అట్టి ప్రభుత్వాన్ని కోరుతున్నారు. వివిధ పార్టీలను, గ్రూపులను కలుపుకొని ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయగల అవకాశాలను శోధించవలసిన కర్తవ్యం కమ్యూనిస్టు పార్టీపైబడింది.

కమ్యూనిస్టులు, పార్టీ బలపరచిన స్వతంత్రులు 75 మంది, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ, అభ్యుదయ స్వతంత్రులు కలసి ఐక్య ప్రజాస్వామ్య సంఘటనగా ఏర్పడ్డారు. ప్రజా సోషలిస్టు పార్టీ ఐక్య సంఘటనలో చేరి ప్రకాశం పంతులు మంత్రివర్గంలో చేర నిరాకరించింది. క్రిషికార్ లోక్ పార్టీ, ముస్లింలీగు, స్వతంత్రులు కలసి చెట్టినాడు కుమార్ రాజా ఆధ్వర్యంలో కాంగ్రెసుకు మద్దతునిచ్చారు. కాంగ్రెసు గవర్నరు శ్రీ రాజాను ప్రభుత్వ ఏర్పాటు చేయమని కోరారు.

ఐక్య సంఘటన మద్రాసులో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయజాలకపోయినా ఐక్య ప్రజాస్వామ్య సంఘటన అసెంబ్లీలో శ్రీ తెన్నేటి విశ్వనాధం నాయకత్వంలో ప్రతిపక్షంగా కొనసాగింది. ఈ సందర్భంలో సంఘటనా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుట సాధ్యం కానిచో అసెంబ్లీలో కమ్యూనిస్టు పార్టీ సభ్యులు అదే పార్టీ పేరుతో స్వతంత్ర పార్టీగ వ్యవహరించాలని, అసెంబ్లీలో బయట పనిని సమన్వయం పరచుటకై ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేసుకొనాలని మార్చి 1952లో కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి తీర్మానం చేసివుందనేది గుర్తు వుంచుకొనాలి. ఒకసారి పార్టీ ఐక్య సంఘటనా ప్రభుత్వం కొరకు ప్రజాందోళన కావించి, ప్రభుత్వాన్ని ఏర్పాటు

చేసినా అందుకై అసెంబ్లీ ఐక్య ప్రజాస్వామ్య సంఘటన పక్షాన్ని యేర్పాటు గావించి, విఫలమైనంతనే ఐక్య ప్రజాస్వామ్య సంఘటన ఆచరణ నుండి వెనుకాడి, స్వతంత్ర పార్టీగ వ్యవహరించిన ప్రజా సామాన్యం ఐక్య సంఘటనా విచ్ఛిన్నకర చర్యగా యెంచుతుంది, ఎత్తుగడల రీత్యా పొరపాటు అగుతుంది. అంతేగాక, అసెంబ్లీలోని బలాబలాల తూకం కారణంగా ఏ క్షణంలోనైనా ప్రభుత్వం పడిపోగల స్థితి, ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఐక్య సంఘటన ఏర్పాటుచేయు అవకాశాలు స్పష్టంగా వుంది. అందువల్లనే ఐక్య సంఘటనను అసెంబ్లీ పార్టీగ 'దాని నాయకుడు ఉపనాయకుడు కొనసాగాలి. అందువలన కేంద్రసమితి నిర్ణయాన్ని మార్చుకొనుట జరిగింది.

కాంగ్రెసు గవర్నర్లను అసెంబ్లీలలో అత్యధిక స్థానాలను, 375లో, 155 సంపాదించిన సంఘటన నాయకుని ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుటకు ఆహ్వానించాలని వొత్తిడి చేయుటకు సరియైనదని వారి నమ్మకం. అసెంబ్లీలలో మెజారిటీ బలపరచుటకు లేకపోయినప్పటికి పిలవాలి. అత్యధిక అసెంబ్లీ సభ్యులుగల పార్టీ లేక సంఘటనయైన తప్పనిసరిగా పిలవాలి. కాంగ్రెసు గవర్నరు వామపక్షాల అవగాహనను అంగీకరించలేదు.

ట్రావెంకూర్-కొచ్చిన్ హైదరాబాద్ సంస్థానాలవలె, ఏప్పైనప్పటికి ఐక్య సంఘటనా కమిటీలు బయట ఏర్పాటు కాలేదు. అసెంబ్లీలలో వివిధ పక్షాలు స్వతంత్రంగానే వ్యవహరించ మొదలిడినాయి. ఐక్య ప్రజాస్వామ్య సంఘటన అసెంబ్లీలలో కొనసాగినా, అనేక సమస్యలపై వివిధ పార్టీలు స్వతంత్ర భాషణ, ఆచరణ సాగించాయి. కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీ బయట సోషలిస్టు వారితో కలసిపోయినా, అసెబ్లీలో ఐక్య ప్రజాస్వామ్య సంఘటనలోనే కొనసాగింది. మునిసిపల్ ఎన్నికలు రాగా ప్రకాశంపంతులు కమ్యూనిస్టులతో ఎట్టి ఐక్య సంఘటనైనా వ్యతిరేకించారు, నిషేధించారు. తమిళనాడులో ఆదిత్యన్ ఐక్య సంఘటనలో చేరినపుడు, ఐక్య ప్రజాస్వామ్య సంఘటన నుండి అతని గ్రూపును తొలగించాలని పట్టుబట్టారు. ఆ కారణంగా కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీ అసెంబ్లీ ఐక్య ప్రజాస్వామ్య సంఘటన నుండి వైదొలగిపోయింది.

కేంద్రంలో లోక్‌సభ, రాజ్యసభలలో ఐక్య సంఘటనా ఏర్పాటులు, ప్రయత్నాలు జరిగాయి. ప్రజా సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీతో ఐక్య సంఘటనా ఏర్పాటును వ్యతిరేకించింది. కమ్యూనిస్టు పార్టీ జనసంఘు హిందూ మహాసభలతో ఐక్య సంఘటనను వ్యతిరేకించింది. కమ్యూనిస్టు పార్టీ తనంతట తానుగా కేరళ సోషలిస్టు పార్టీ, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, పీజంట్సు అండ్ వర్కర్సు పార్టీ, మార్క్సిస్టు ఫార్వర్డు బ్లాకులతో, మరికొందరి వ్యక్తులతో కలసి, కూటాని, పార్లమెంటరీ వ్యవహారాల పని నిమిత్తం పనిచేసింది. ప్రతి పార్టీ స్వతంత్రంగా

విశాల సమన్వయంతో పనిచేశాయి. అనేక సమస్యలపై వోటింగులో ఎప్పటికప్పుడు ఒడంబడికలు జరిగాయి. కమ్యూనిస్టులు, సానుభూతిపరులు కమ్యూనిస్టు బ్లాకుగా వ్యవహరిస్తూ, సర్వసభ్య సమావేశాలు జరిపి నిర్ణయాలు తీసుకొన్నారు.

అసెంబ్లీలో బయట ఐక్య ప్రజాస్వామ్య సంఘటనల నేర్పాటు చేయుటలో పార్టీ ఎత్తుగడల మొదటిదశ ముగిసిందని, ఎత్తుగడల విధానమంతా మార్చి 1952 కేంద్ర సమితి తీర్మానాన్ని అనుసరించిందని మైనారిటీ పర్గం స్పష్టం చేసింది. కేంద్ర సమితి తీర్మాన ముఖ్యాంశాలను యింతకుముందు తెల్పి వున్నందున, పునఃశ్చరణ అనవసరము.

## ట్రావెంకూర్-కొచ్చిన్ సంస్థాన అనుభవాలు :

సంస్థాన అసెంబ్లీ 1954 లో రద్దు చేయబడినపుడు, రాష్ట్రింలో ప్రజా చైతన్యం వెల్లువై, కాంగ్రెసును మరింత స్పష్టంగా ఓడించే ప్రత్యామ్నాయ ప్రభుత్వ నిర్మాణాన్ని చేయాలనే తపన వెల్లడైంది.

ప్రజా సోషలిస్టు పార్టీ కమ్యూనిస్టులతో ఎట్టి సంబంధాన్నైనా పెట్టుకొన నిరాకరించి ఎన్నికలలో కుప్పకూలిన అనుభవంతో కమ్యూనిస్టులతో ఏవిధంగానైనా ఎన్నికల ఒప్పందం కుదిర్చుకొని సాధ్యమైనన్ని ఎక్కువ సీట్లను సంపాదించాలనే ఆతురతతో వుంది. దేశమంతా తెలిసినట్లు పట్టంతాను పిళ్ళే నాయకత్వంలో ఐక్య ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వ మేర్పాటుకు ఎత్తుగడగా పార్టీ శాఖ ఆమోదించింది. అయితే పట్టంతాను పిళ్ళే మాత్రం వ్రాతపూర్వకంగా కమ్యూనిస్టులతో కలసి ఐక్య ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వాన్ని యేర్పాటు చొప్పందంకుగాని, విస్తృత వామపక్ష ఐక్యసంఘటన ఏర్పాటు ఒప్పందానికిగాని అంగీకరించలేదు. కాని ప్రజాస్వామ్య శక్తులు విజయం పొంది మెజారిటీ సంపాదిస్తే, ఐక్య వామపక్ష సంఘటనతో కలసి మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేయగలనని బహిరంగ సభలలో ప్రకటించాడు. కమ్యూనిస్టులు యీ నోటిమాట భరోసాతో వారి బలమైన స్థానాలలోగూడ, ప్రజా సోషలిస్టు పార్టీ అభ్యర్థులను నిలబెట్టుటకు అంగీకరించారు. రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీలతో సర్దుబాటులతో యేర్పడిన ప్రతిష్ఠంభన కూడ, కమ్యూనిస్టు పార్టీ బలమైన స్థానాలను త్యాగం చేయుటతో అధిగమించారు. పార్టీ ప్రత్యేకంగా ఎలక్షను ప్రణాళికను ప్రకటించింది కాని ఎన్నికల ప్రచారోద్యమంలో ఐక్య వామపక్ష సంఘటన, ప్రజాసోషలిస్టు పార్టీల మధ్య ఐక్యతను నొక్కి వొక్కాణించింది.

ఎన్నికలలో కమ్యూనిస్టులు, వారి అనుబంధీయులు 28 మంది రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ 9 మంది, కేరళ సోషలిస్టు పార్టీ 3, ప్రజా సోషలిస్టు పార్టీ 19 మంది గెలిచారు. నామినేటెడ్ సభ్యునితో కలసి కాంగ్రెసుకు 46 స్థానాలు లభించాయి. స్వతంత్రులుగా వొక్కరు, 118 మంది సభ్యులుగల శాసనసభలో గెలిచారు.

స్థానిక ప్రజా సోషలిస్టు పార్టీలో అత్యధికులు వామపక్ష సంఘటనతో కలసి మంత్రి వర్గాన్ని యేర్పాటు చేయుటకు సుముఖులు. కాని జాతీయ కార్యవర్గం కాంగ్రెసు నుండి లభించిన వాగ్దానాల బలంతో, పట్టంతాను పిళ్ళేను ప్రజా సోషలిస్టు పార్టీ మంత్రివర్గాన్ని యేర్పరచమని ఆదేశించింది. బహిరంగ సభలలో తాను చేసిన, ఐక్యవామపక్ష సంఘటనతో కలసి మంత్రివర్గాన్ని యేర్పాటు చేయగలనని చేసిన ఉపన్యాసాలను వమ్ముచేసి, ప్రజా సోషలిస్టు పార్టీ మంత్రివర్గాన్ని, కాంగ్రెసు బలంతో ఏర్పాటు గావించాడు.

కమ్యూనిస్టు పార్టీ ప్రతిపక్షమైంది. రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ స్వతంత్రంగా పనిచేయ మొదలిడి, కౌన్సిలు ఎన్నికలలో ఆ పార్టీ అభ్యర్థిని బలపరచలేదనే సాకుతో సంఘటన నుండి బయటకు పోయింది. అసలు కారణం కమ్యూనిస్టులు ప్రజా సోషలిస్టు మంత్రివర్గాన్ని బలపరచాలనే వారి కోరికను కమ్యూనిస్టులు నిరాకరించారు.

ఇక్కడ మరో విషయాన్ని గుర్తుంచుకోవాలి. అది ప్రజాస్వామ్య ప్రభుత్వ అవగాహనకు చాల ముఖ్యమైనది. ప్రజా సోషలిస్టు పార్టీ తన వాగ్దానాలను త్రోసి వేయకముందు మంత్రివర్గ మేర్పాటు సంభాషణలలో పట్టంతాను పిళ్ళేను యీ క్రింది మూడు కోర్కెలను ఆమోదించమని పార్టీ కోరింది.

1) ప్రజా సోషలిస్టు పార్టీ, ఐక్య వామపక్ష సంఘటనతో ట్రావెంకూర్-కొచ్చిన్ సమస్యపై రాష్ట్రంలోని తమిళ ప్రాంతాన్ని తమిళనాడులో కలుపు విషయమై, ప్రొహిబిషన్ విషయాన్ని ప్రభుత్వ సమస్యగాను, ప్రభుత్వంపై విశ్వాసం సమస్యగా మార్చక, ఆయా ప్రాంతాలలో వారు ఐచ్ఛికంగా వారి అభిప్రాయాలను ప్రకటించుటకు ప్రాధాన్యతనిచ్చే సాధారణ సమైక్య విధానాన్ని ఆమోదించాలి.

2) సాధారణంగా ఏకగ్రీవ నిర్ణయాలు తీసుకొనాలి. కొన్ని సమస్యలపై భేదాభిప్రాయాలున్నపుడు మూడింట రెండువంతుల జనరల్‌బాడి మెజారిటీతో నిర్ణయాలు గైకొనాలి. ప్రభుత్వాన్ని బలపరచే అన్ని పార్టీల, గ్రూపుల అట్టి నిర్ణయానికి అందరూ కట్టుబడి వుండాలి.

3) మంత్రివర్గంలో అన్ని పార్టీల ప్రతినిధులు వుండాలి. కాబినెట్‌లో ప్రజా సోషలిస్టు పార్టీ మెజారిటీ వుండుటకు కమ్యూనిస్టు పార్టీ ఆమోదించింది. ముఖ్యమంత్రి ప్రజాసోషలిస్టు పార్టీకి చెంది వుండాలి. మంత్రివర్గంలో కమ్యూనిస్టు పార్టీకి కనీసం రెండు ప్రధానశాఖలు యివ్వాలి. రెవెన్యూ, కార్మిక శాఖలనివ్వాలి. రోజు వారు ప్రభుత్వ పాలనను శక్తివంతంగా ప్రభావితం చేయుటకు ప్రజలకు నిర్దిష్టంగా కొంత సేవ చేయుటకు అవి అవసరము.

ప్రజాసోషలిస్టు పార్టీ విద్రోహం తరువాత కేంద్రసమితి, స్థానిక కమ్యూనిస్టు పార్టీ శాఖ "ప్రజాసోషలిస్టు పార్టీ తోకపట్టుకొని అనుసరించిందని" సమస్యను ప్రజలలోనికి ముందుకు తీసుకొనివెళ్ళిన, ప్రజా వొత్తిడి మరింత యెక్కువై ప్రాత

పూర్వకంగా ఆ పార్టీని నొప్పించకలిగే వారమని విమర్శించింది అవసరమైనదాని కంటె అధికస్థానాలను ఆపార్టీకి తన బలమైన స్థానాలను వదలివుండవలసిందికాదని విమర్శించింది.

ఈ విషయింలో ఆంధ్రా అనుభవాల తరువాత ఐక్యవామపక్ష సంఘటనను నిర్మించాలనే బలమైన కోరికను, ఆతురతను ఆ శాఖ చూపించుట అన్నివిధాల సరియైనదేనని ఆమోదించగలము, సీట్లవిషయంలో ఆ పరిస్థితులలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఐక్యసంఘటనను యేర్పాటు చేయుట. త్యాగంచేయుట అన్నివిధాల సరియైనదే, ఎంతత్యాగం చేయవలసింది నిర్ణయించవలసింది ఆ రాష్ట్రశాఖయే. పార్టీసీట్ల విషయంలో అట్టి త్యాగంచేయకుండిన ఏ. యస్. పి; ఆర్. యస్. పి ; కె. యస్.; పీలు ఘోరపరాజయాన్ని పొందేవి. కమ్యూనిస్టుపార్టీ గూడ యింతకంటె అధిక సీట్లను సంపాదించకలిగి వుండేది కాదు. కాంగ్రెను మెజారిటీ సంపాదించగలిగేది. ప్రజాస్వామ్య వుద్యమం, పి. యస్. పి. విద్రోహం కన్నా మరెన్నోరెట్లు పరాజయం పొందేది.

ట్రావెంకూర్ కొచ్చిన్ కమిటీ, ఐక్యసంఘటనా విధానంలో పి. యస్. పి. తోకపట్టుని అనుసరించిందని, భవిష్యత్తులో స్థానిక పార్టీశాఖలతో ఐక్యసంఘటన, వాటి అఖిల భారత నాయకత్వపు ఆమోదంతోనే యేర్పడాలనే పాఠాన్ని మొత్తం పార్టీనేర్చుకొంది. స్థానిక ప్రజాసోషలిస్టు పార్టీశాఖ నాయకత్వం ఎంతవరకు వారి అఖిల భారత నాయకత్వాన్నుండి, కమ్యూనిస్టు వ్యతిరేకతను విడనాడిందనే వాస్తవ కొలహనంతో నిర్ణయింపబడాలనే అవగాహనకు పార్టీ వచ్చింది.

కొన్నిమాసాల తరువాత మలబార్ జిల్లా బోర్డు ఎన్నికలు జరిగాయి. కమ్యూనిస్టులు వారు బలపరచిన స్వతంత్రులు. కాంగ్రెసు, ప్రజాసోషలిస్టుపార్టీ, ముస్లిం లీగులపై మైజారిటీ సంపాదించారు. కాంగ్రెసు, ముస్లింలీగుల మధ్య ఎట్టి వొప్పందం లేదు. అది జరిగి వుంటే పార్టీ కొన్నిస్థానాలలో ఘోరపరాజయం పొందేది. అంతేగాక, దామోదరమీనన్ గ్రూపు ముగ్గురు కమ్యూనిస్టుపార్టీ బలపరచిన స్వతంత్రులను బలపరచింది.

## ఆంధ్ర ఎన్నికల గుణపాఠాలు

ఆంధ్రరాష్ట్రం యేర్పడిన నాటి నుండి కమ్యూనిస్టుపార్టీ, కృషికార్ లోక పార్టీ, ప్రజాపార్టీ, ప్రజాసోషలిస్టు పార్టీలతో, స్వతంత్రులతో కలసి ఐక్యసంఘటనను, కాంగ్రెసుప్రత్యామ్నాయ మంత్రి వర్గాన్ని యేర్పాటు చేయప్రయత్నించింది. ప్రజాపార్టీ ప్రకాశం పంతులు నాయకత్వంలో కాంగ్రెసుతో మైత్రి సహకారం

సాగించింది. కృషీకార్ లోక్ పార్టీ కాంగ్రెసు అనుబంధ సభ్యులుగ చేరాడు. ప్రజా సోషలిస్టుపార్టీ కమ్యూనిస్టుపార్టీతో ఎట్టి సంబంధాన్ని పెట్టుకొనక నిరాకరించింది. ఫలితంగా కాంగ్రెసు మంత్రి వర్గాన్ని యేర్పాటు చేయగలిగింది.

కమ్యూనిస్టు పార్టీ కొనసాగించిన బ్రహ్మాండమైన ప్రచారఫలితంగా కొన్ని సమస్యలపై క్రిషీకార్ లోకపార్టీ, ప్రజాసోషలిస్టుపార్టీ, కొంతమంది స్వతంత్రుల సహకారంతో మంత్రి వర్గాన్ని అస్థిరత్వంలో పడవేయగలిగింది. మంత్రివర్గం పడిపోయినపుడు తిరిగి పార్టీ ఐక్యసంఘటన మంత్రివర్గాలను యేర్పాటు చేయప్రయత్నించింది. క్రిషీకార్ లోక్‌పార్టీ, ప్రజాసోషలిస్టుపార్టీ కమ్యూనిస్టులతో కలసి మంత్రివర్గాన్ని యేర్పరచుటకు నిరాకరించారు. అసెంబ్లీ రద్దు చేయబడింది, ఎన్నికలు ప్రకటించారు.

ఈ అనుభవంతోపాటు, ట్రావెంకూర్ కొచ్చిన్‌ల అనుభవాలలో ఎన్నికలలో ఐక్యసంఘటన యేర్పాటుకు ఎన్నికల అనంతరం క్రిషీకార్ లోక్‌పార్టీ, ప్రజాసోషలిస్టు పార్టీ కమ్యూనిస్టులతో సహకరించాలనే షరతు పెట్టబడింది. అందుకు రెండు పార్టీలు నిరాకరించాయి. క్రిషీకార్ లోక్‌పార్టీ కాంగ్రెసుతో ఒప్పందానికి ప్రయత్నించింది.

కమ్యూనిస్టులు, కమ్యూనిస్టుపార్టీ టికెట్టు, చిహ్నాన్ని ఆమోదించే స్వతంత్రులతో కలసి యేర్పడిన కమ్యూనిస్టుకూటమి-బ్లాకు,మూడింట రెండువంతుల మెజారిటీ, కనీసం మెజారిటీ సంపాదించగలదని కమ్యూనిస్టుపార్టీ రాష్ట్ర కమిటీ యేకగ్రీవంగా తప్పుడు అంచెనా వేసింది. ముందుచూపుతో ఘోర పరాజయాన్ని చూడజాలకపోయింది.

ఆంధ్రలో భూస్వామ్య, బూర్జువావర్గం, కమ్యూనిస్టుబ్లాక్ విజయంతో అధికార వర్గానికి వచ్చేముప్పుకు భయపడి, కాంగ్రెసు, ప్రజాపార్టీ, కృషీకార్ లోక్‌లు కలసి ఐక్యకాంగ్రేసు పార్టీలుగ అవతరించాయి.

ఎలక్షను ఫలితాలు దేశాని కంతటికి 'పిడుగుపాటు' అయింది. అంతటి విజయాన్ని కాంగ్రెసు ఊహించలేదు. కాంగ్రెసుకు 148, కమ్యూనిస్టుపార్టీకి 15, ప్రజాసోషలిస్టుపార్టీకి 13, స్వతంత్రులకు 20 అసెంబ్లీ స్థానాలు లభించాయి. కమ్యూనిస్టు పార్టీ వోట్ల బలాన్ని 25 శాతం నుండి 31 శాతానికి 1952లో కంటె పెంచుకొనగలిగింది. ఐక్యకాంగ్రెసు 1952లో 54.3 శాతం, 1955లో 51 శాతం వోట్లు పొందగలిగింది. ప్రజా సోషలిస్టుపార్టీ 1952లో 6 శాతం, 1955లో 5శాతం,స్వతంత్రులు 13 శాతం వోట్లు పొందగలిగారు. స్వతంత్రులలోని అందరూ దాదాపు కాంగ్రెసులోని భూస్వాములకన్నా పెద్ద భూస్వాములు, కాంగ్రెసు టిక్కెట్టురాని కారణంగా స్వతంత్రులుగ పోటీచేసి గెలచారు.

కమ్యూనిస్టుపార్టీ, క్రిషీకార్ లోక్‌పార్టీ ప్రజాసోషలిస్టు పార్టీలతో ఐక్యసంఘ

టన సాధ్యం కాకపోయినా కనీసం ఎన్నికల వొప్పందం సర్దుబాటులకై ప్రయత్నించవలసింది కాదా? ఆ పార్టీలు కాంగ్రెసు వోడించుటకై సంఘటనను అంగీకరించి బహిరంగ ప్రకటనను నిరాకరించారు, కాని ఎన్నికల సర్దుబాటులకు సిద్ధంగా వున్నారు. అంటే ప్రజాసోషలిస్టు పార్టీతో విజయనగరంలో, మరికొన్ని సీట్లు రాయసీమలో పార్టీ బలహీనంగా వున్న ప్రాంతాలలో పోటీ చేయకుండా వుండుట, ఈ సీట్లను, మరికొన్ని బలంలేని స్థానాలలో కమ్యూనిస్టు పార్టీపోటీచేసి వుండవలసింది కాదు.

కీలకాంశం, 'కమ్యూనిస్టుపార్టీ తన బలమైన స్థానాలలో క్రిషీకార్ లోక్ పార్టీ, ప్రజాపార్టీలతో ఎన్నికల సర్దుబాటులు, వొప్పందాలు చేసుకొనగలగేది కాదా? వారు కాంగ్రెసుతో కలుపకుండునట్లు చేయగలిగేది కాదా? ప్రయత్నించి వుండవలసింది. విజయం పొందగలిగేది. అందుకు పూర్తి భిన్నమైన రాజకీయ, అవగాహన, పార్టీ బలాన్ని అతిగా, కాంగ్రెసు బలాన్ని అత్యల్పంగా, తదితరపార్టీల ప్రభావాలను, పూర్తి తప్పుగా అంచెనాలు వేయుటయేగాక, ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వం అనేపేరుతో కమ్యూనిస్టు బ్లాక్ ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో ప్రభుత్వం అసాధ్యమనే వాస్తవాన్ని చూడజాలకపోవుటతో, కాంగ్రేసేతర శక్తులన్నిటిని ఐక్యపరచుటలో విజయాన్ని పొందకపోగా, పాలకవర్గాలను చీల్చే ప్రయత్నం చేయకపోగా, కమ్యూనిస్టు బ్లాకు ప్రభుత్వం యేర్పాటు చేస్తామనే ప్రకటన, కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకంగా అందరూ కలియుటకు పరోక్షంగా తోడ్పడింది.

## ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వ నినాదం:

ప్రజాపోరాటాలు దిలోపేతమై అత్యున్నత దశకు చేరి నపుడే జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వ మేర్పడగలదని, అది జాతీయ బూర్జువావర్గంకూడగల వివిధ వర్గాల ప్రభుత్వమని మౌలికమైన సంస్కరణలను ప్రవేశపెట్టి, సోషలిజంకై ప్రజోద్యమాలను అభివృద్ధిపరచే ప్రభుత్వం అని మైనారిటీ పక్షం స్పష్టపరచింది.

మధురై పార్టీ కాంగ్రెసులో ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వ నినాదాన్ని చర్చించునపుడు, జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వానికి మరో విధంగా చెప్పుటయేయని, భేదముల్లా, జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం విప్లవపోరాటాల అనంతరం సాధ్యం, ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వం, పోరాటాలు క్రింది స్థాయిలో జరిగినపుడు సాధ్యమగుతుందని స్పష్టం చేయబడింది. అయితే, ప్రజాస్వామ్యఐక్యత ప్రభుత్వం తాత్కాలికదశ ప్రభుత్వంగా నవదలు ప్రతిపాదించగా నిరాకరించారు. ట్రావెన్కూర్-కొచ్చిన్, ఆంధ్రలోవలె ప్రజోద్యమం అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వస్థాపన సాధ్యమని అంగీకరించబడింది. కేంద్రంలో అసాధ్యమని స్పష్టం చేయబడింది.

"ట్రావెన్కూర్-కొచ్చిన్ పరిణామ అనుభవాలు, ఆంధ్ర ఎన్నికలలో ఘోర పరాజయం తరువాత, ప్రజాస్వామ్య ఐక్యతప్రభుత్వ నినాదమిచ్చుట కమ్యూనిస్టు నాయకత్వంలో అనే అర్థంలో తప్పని అంగీకరించకతప్పదు. దానికి బదులు ప్రత్యామ్నాయ ప్రభుత్వం లేక ప్రజాసామ్య ఐక్యతా ప్రభుత్వమనే నినాదాన్ని యివ్వవలసింది కమ్యూనిస్టుపార్టీ పాల్గొన్నాపాల్గొనకపోయినా ప్రజలకు సహాయానికి తక్షణ సంస్కరణలు చేబట్టగల'నని వాగ్దానం చేసిన ప్రభుత్వాన్ని పార్టీ బలపరస్తుందని స్పష్టం చేయవలసింది.

"ప్రభుత్వంలో కమ్యూనిస్టు పార్టీ చేరకుంటే పాలకవర్గాలలోని మరోభాగపు రకం బూర్జువా ప్రభుత్వమగుతుందేకాని, మరో వర్గాల కలయిక ప్రత్యామ్నాయ ప్రభుత్వం కాజాలదు." [1]

అంతేగాక "కమ్యూనిస్టు పార్టీ, యితర ప్రజాస్వామ్య పార్టీల, వ్యక్తుల ప్రత్యామ్నాయ ప్రభుత్వ నినాదం ఆంధ్రలో, ట్రావెన్కూర్-కొచ్చిన్‌లలో ఇచ్చుట సరియైనది. ఆంధ్ర, కేరళలలో తగినంత అభివృద్ధి చెందిన ప్రజావుద్యమాలు కలిగి వున్నందున, ప్రజలలో అట్టి ప్రభుత్వం సాధ్యమనే అభిప్రాయం కలిగి వున్నందున, ప్రజలలో వుత్సాహాన్ని పెంపొందించి దానిని సాధించుటకు ఆ నినాదం అవసరం".

"కాని కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వ మనే నినాద మిచ్చుట, రాష్ట్ర లేక కేంద్ర స్థాయిలోగాని ఆ పరిస్థితులలో యిచ్చుట తప్పు. బూర్జువా పాలక వర్గంలోని భాగాలు కొన్ని చీలి, మనతో కలసినప్పుడే, వారి మతాల తగవులవలనగాక, ఆర్థిక ప్రయోజనాల కారణంగా చీలి వచ్చినపుడే అది సాధ్యము. అంతేగాక ప్రజావుద్యమం బలోపేతమై, ప్రత్యామ్నాయ శక్తియని అనేక రాష్ట్రాలలో, తమ ప్రయోజనాల కొరకు వారిపై ఆధారపడవచ్చనే విశ్వాసం కలుగజేయుటకు పరిస్థితులు సృష్టింపబడాలి.

"అట్టి పరిస్థితులు నేడు లేవు, ట్రావెన్కూర్-కొచ్చిన్, ఆంధ్రా ఎన్నికలప్పుడు లేవు. వాస్తవానికి 1942-47 లలో జాతీయ విముక్తి ఉద్యమాలలో నాయకత్వం వహించి నడపుటలో కమ్యూనిస్టు పార్టీ విఫలమైన నాటినుండి భారత రాజకీయ పరిస్థితి అట్టి దశకు ఎప్పుడూ చేరలేదు. సామ్రాజ్యవాదపు ఆధిపత్యాన్నుండి విముక్తి ప్రదాతలుగా ప్రజలముందుకు బూర్జువాలు వచ్చుటకు అవకాశాన్నిచ్చింది. ఆ కారణంగానే ట్రావెన్కూర్-కొచ్చిన్‌లలో ప్రజా సోషలిస్టు పార్టీ వాగ్దానాలను భగ్నంచేసి మనతో కలవకుండా కాంగ్రెసుతో కలువగలిగింది. అదే

1. సుందరయ్య తదితరులు (1955) అభిప్రాయాల వివరణ పత్రం. పోరం. సం.5 పే. 80

విధంగా క్రిషీకార్ లోక్ పార్టీ, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ, తదితర పార్టీలు గ్రూపులు చేయగలిగాయి. బూర్జువా, భూస్వామ్య వర్గాలు కమ్యూనిస్టులతో కలియుటకు సిద్ధంగాలేవు. ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటకు సిద్ధంగాలేవు. అట్టి పరిస్థితులలో రాయితీలనిచ్చినా ఐక్య ప్రజా సంఘటనలోనికి, మనతో కలసి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుటకు; అధికార కాంగ్రెసు పార్టీకి వ్యతిరేకంగా తీసుకొనిరాజాలము" అని సుందరయ్య తదితర మైనారిటీ వర్గ నాయకులు స్పష్టం చేసారు.

**ఐక్యప్రజాస్వామ్య సంఘటన, ఎత్తుగడలు :**

విజయవంతంగా ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుటకు, ఐక్య ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణం ముందు నిర్వహించవలసిన కర్తవ్యమైతే సహజంగానే దానిని కార్మికవర్గం, పాలక బూర్జువా వర్గంలోని భాగాలు వ్యూహాత్మక వర్గాల సంఘటనా దృక్పథంలో అర్థం చేసుకొనవలసి వుంటుంది. ఒక సంస్థను నిర్మాణం చేసి దానిని ఐక్య ప్రజా సంఘటనగా పేర్కొన్నంత మాత్రాన సరిపోదు. ప్రతి దశలో ప్రతి సమస్యపై సాధ్యమైనంత విస్తృత ప్రజా సమీకరణ, వివిధ పార్టీలు, గ్రూపులు సమిష్టి కార్యాచరణలో పాల్గొంటూ, ప్రజోద్యమాలను పెంపొందించినపుడే అది సాధ్యమౌతుంది.

ఆంధ్రలో పాలక వర్గాలలోని భాగాలను ఐక్య ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటలో సహకరించునట్లు కమ్యూనిస్టులు చేయగల బలం లేనపుడు, కాంగ్రెసు పాలనను ప్రశ్నించగల శక్తి మాత్రమే వున్నప్పుడు, పాలక వర్గాలు వారి శక్తులను, భాగాలనన్నిటిని ఐక్యపరచి కమ్యూనిస్టులతో పోరాటానికి సిద్ధపడుతున్నపుడు, పాలక వర్గాలను చీల్చే ఎత్తుగడలను అవలంభించి, పాలక వర్గాన్ని లేక వర్గాలను కమ్యూనిస్టులు తమ శక్తికొలది చీలి వుండునట్లు చేయగల అవకాశాలన్నిటిని అనుసరించవలసినది.

"కమ్యూనిస్టు పార్టీ ప్రజలముందుకు ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వ నినాదంతో రావలసింది, అదే ప్రజలకు కొన్ని రాయితీలను కలుగజేస్తుంది. కనీస కార్యక్రమాన్ని ఆమోదించినవారు కొద్దిమంది అయినా కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వం ఏర్పాటు చేయుటకు, యితరులు ఏర్పాటుచేసిన ప్రభుత్వంలో చేరుటకు సంసిద్ధతను వెల్లడించవలసినది. పార్టీకి, క్రిషీకార్ లోక్ పార్టీగాని, ప్రజా పార్టీగాని కమ్యూనిస్టులను చేర్చుకొని మంత్రి వర్గాలను ఏర్పాటు చేయుటకు సిద్ధంగా లేవని తెలుసు. పైగా కాంగ్రెసుతోనే పొత్తుందానికి వస్తారని తెలుసు. అది విఫలమైతే పార్టీ మద్దతును మాత్రమే కోరుతారని, కమ్యూనిస్టులను మంత్రివర్గంలో చేరమని కోరరని తెలుసు. అట్టి పరిస్థితులలో పార్టీ వారికి మద్దతునిస్తూ ప్రజలకు వీలైనన్ని రాయితీలను, కష్టజీవుల ప్రయోజనాలను రాబట్టవలసింది.

అనిశ్చితలు, చీలికలుగల పాలకవర్గం నుండి రాయితీలను, స్థిరత్వం, ఐక్యతగల పాలకవర్గం నుండి కంటె ప్రజలు రాయితీలను తేలికగా పొందవచ్చు.

అట్టి పరిస్థితులలో ఐక్య ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణం సాధ్యపడదు, కాని పాలక వర్గాలలోని చీలిక కొనసాగేది.

కాన సంక్షిప్తంగా ఐక్య ప్రజాస్వామ్య సంఘటనను ఏర్పరచుటకు ఈ క్రింది ఎత్తుగడలను అవలంభించాలని మైనారిటీ వర్గం తెలిపింది.

1) కాంగ్రెసు, తదితర పార్టీల ప్రభావంలోని అన్ని వర్గాల ప్రజాసామాన్యాన్ని సమీకరించి ప్రజా పోరాటాల నభివృద్ధి పరచాలి. సమస్య తరువాత సమస్యకు తాత్కాలిక ఐక్య కమిటీలను ఏర్పరచాలి.

2) శాశ్వత ప్రజాస్వామ్య సంఘటన కమిటీలనుగాని, ఏ సంస్థనుగాని, ఏ స్థాయిలోగాని ఏర్పాటు చేయక, అన్ని పార్టీలు, గ్రూపులతో దగ్గర సంబంధాలు, సమన్వయం కొరకై శక్తినంత ఉపయోగించి ప్రయత్నించాలి.

3) సాధారణంగా ఐక్య ప్రజాస్వామ్య సంఘటనా అసెంబ్లీ బ్లాకు యేర్పాటు చేయరాదు. ప్రతి పార్టీ స్వతంత్రంగా పనిచేయాలి. అయితే ఒక సమన్వయ కమిటీ ఏర్పరచాలి. ప్రత్యేక పరిస్థితులలో సంఘటన బ్లాకు యేర్పాటును పూర్తిగ త్రోసి వేయరాదు.

4) పౌర సంఘటనలు స్థానిక బోర్డుల ఎన్నికలలో పాల్గొనుటకై ఏర్పాటు చేయుట ఆహ్వానించ తగినది. అట్టి పరిస్థితులలో గూడ పార్టీ అభ్యర్థులు పార్టీ పేరుమీద పౌర సంఘటన అభ్యర్థులుగ పోటీ చేయాలి. రోజువారి కార్యక్రమంలో భేదాభిప్రాయాలు వచ్చినపుడు, ఒప్పందానికి రాజాలనపుడు, మన దృక్పధంతో మనం ముందుకు రావాలి".

"మన ప్రధాన దాడి పాలకవర్గ ప్రాతినిధ్య సంస్థయైన కాంగ్రెసుపైనే కేంద్రీకరించాలి. కాంగ్రెసును అన్ని ఎన్నికలలో ఓడించుటకు ప్రయత్నించాలి. బలహీనపడిన, చీలికలైన పాలకవర్గం ప్రజా ఒత్తిడికి యెక్కువ రాయితీలనిస్తుంది. ఇందుకై ఐక్య సంఘటన లేక ఎన్నికల ఒప్పందాలను, సర్దుబాటులను ప్రజా బలం గల పార్టీలు, గ్రూపులతో చేసుకొనాలి. కాంగ్రెసుకు వ్యతిరేకంగా స్వతంత్రులను బలపరచినపుడు, పార్టీ అప్రతిష్టపాలు కాకుండా చూచుకొనాలి. ప్రజలను దూషించే వారిని బలపరచి, ప్రజాస్వామ్య ఉద్యమం వెనుకంజ వేయునట్లు చేయరాదు.

ఈ విధంగా, మైనారిటీ వర్గం ఐక్య సంఘటనా నిర్మాణ సమస్యలపై ప్రధాన ఆచరణాంశాలతో పాటు సిద్ధాంతాంశాలను వివరించి అనేక అంశాలలో స్పష్టత చేకూర్చింది. సిద్ధాంతాల అవగాహన, ఆచరణానుభవాల మధ్యగల అంతరాన్ని తొలగించి వేయగలగాలి. స్వీయ, దేశీయ అనుభవాలు ప్రాముఖ్యత ప్రధమైనవి.

డాంగే, కార్యక్రమంలో (1951) వివరించిన వర్గ సంబంధాలలో, ప్రభుత్వ నైజంలో మార్పు లేకుంటే కార్యక్రమాన్ని, వ్యూహాన్ని, ఎత్తుగడలను మార్పు చేయవలసిన అవసరముండదన్నారు. రాజ్యాంగ పాలక శక్తుల బలాబలాలలో మార్పులు, రాజ్యాంగ యంత్రాగంలో మార్పులు వచ్చిన,అవి ప్రజాస్వామిక ఐక్యత ప్రభుత్వ నినాదాన్ని మార్చవలసినంతటి మౌలిక మార్పులు కావు. ఆ నినాదాన్ని వదలివేయుట అంటే భూస్వామ్య, బూర్జువా వర్గాల, పాలక పార్టీలో జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వంగా పరిణామం చెందిందని అర్థంకాదు, లేక యుద్ధోన్మాదుల కారణంగా జాతీయ ఎమర్జెన్సీ అవసరమైందని అర్థంకాదు అని, పరిస్థితులలో అటువంటి అంశాలు లేవని డాంగే వివరించారు

"పాలక వర్గాలలో సంఘర్షణ, వివిధ గుత్త పెట్టుబడిదారి వర్గాల మధ్య వున్నదని, బూర్జువా వర్గానికి అభ్యుదయ నిరోధక భూస్వామ్య వర్గానికి మధ్యవున్న వైరుధ్యం వాస్తవం. ఈ సంఘర్షణలో నెహూ్రి నాయకత్వంలోని జాతీయ బూర్జువా వర్గం, అభ్యుదయకర మార్గాలు చేబట్టుట, శాంతి, స్వాతంత్ర్యాభివృద్ధికి తోడ్పడుతుందనుట, బూర్జువాల జాతీయ ఆర్థికాభివృద్ధికి సహకారి అగుట స్పష్టం."

"పరిస్థితులు ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వ నినాదాన్ని ఎజెండాలో చేర్చవలసినంత పరిపక్వమయ్యాయా అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఈ విషయంలో గత సంవత్సరం కంటె పరిస్థితులు మారాయి. గత ఎన్నికల అనంతరం ప్రజాస్వామ్య ఐక్య సంఘటన మెజారిటీ వచ్చే అవకాశాలు మద్రాసు అసెంబ్లీలో, ట్రావెన్కూర్-కొచ్చిన్ శాసనసభలలో, ఊగిసలాడే బూర్జువా కాంగ్రెసు వర్గాలు కొన్ని హైదరాబాద్ అసెంబ్లీలో వేగంగా మారుతున్న అనేక రాష్ట్రి అసెంబ్లీ పార్టీలలో మార్పులు తాత్కాలిక ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వ నినాదం, నేటి అసెంబ్లీలలో ఆచరణ సాధ్య నినాదం, వెంటనే అవకాశాలున్నవి. కాంగ్రెసు నుండి చెప్పుకోనదగిన వర్గాలు బయటకి వెళ్ళుటతో ఈ దృక్పథానికి బలం వచ్చింది."

అంతేగాక "సంయుక్త ప్రజాస్వామ్య ప్రభుత్వమనే పేరుతో పార్టీని. కార్మిక వర్గాన్ని కాంగ్రెసు కౌగిలిలోనికి త్రోసివేయు బలమైన పోకడవుంది. దానినే ఐక్య జాతీయ సంఘటన అనే పేరున అంటున్నారు. అభివృద్ధి నిరోధకుల కౌగిలినుండి "నెహూ్రిని రక్షించాలనే" నినాదంతో నెహూ్రి నాయకత్వంలో శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యాలను ముందుకు తీసుకొని పోవాలనే విధానం, చాలామంది మనస్సులను ఆకట్టుకొంటుంది, బలాన్ని సంపాదిస్తు వుంది. అట్టి విధానం పార్టీని, కార్మిక వర్గాన్ని, ప్రజలను అఘాతంలోనికి త్రోస్తుందని, నేను అనుకొంటున్నాను" [1] అని డాంగే వివరించారు.

ఇంద్రజిత్ గుప్తా కేంద్రసమితి తీర్మానం ఐక్య సంఘటనల ఎత్తుగడలపై

---

1. డాంగే (1955) నోటు. ఫోరం, జనవరి 1956. పే. 27.

ఏ విధానాన్ని, దృక్పధాన్ని యివ్వజాలకపోయిందని, యాంత్రికంగా, పేలవంగా పేర్కొన్నదని" విమర్శించారు. అంతేగాక "అభివృద్ధి చెందుతున్న ఆర్థిక, రాజకీయాంశాలపై ఆధారపడజాలకపోయింది. స్వీయ మానసిక తత్వంతో బడా బూర్జువా వర్గాన్ని తప్పుగా అభ్యుదయకర, అభ్యుదయ నిరోధక రెండు భాగాలుగా విభజించింది". బూర్జువా వర్గం ఐక్యత, స్థిరత్వాన్ని కలిగివుందనే పిడివాద అవగాహనతో ఐక్య సంఘటనా అవకాశాలను కుదించుట తప్పు కాగలదు. నేటి వాస్తవాన్ని మించి, దూరదృష్టిని సారించి యేమీ చూడజాలము" అని విమర్శనను వివరించారు.

"పార్టీ తప్పనిసరిగా స్పష్టంగా ఐక్య జాతీయ సంఘటనా నినాదాన్ని ముందుకు తీసుకొనిరావాలి. 'జాతీయ' అనే పదాన్ని యిక్కడ కొంతమంది కామ్రేడ్స్ వ్యతిరేకించుట విశేషంగా వుంది. దాని అర్ధం బూర్జువా వర్గాన్ని బలపరచుటగా తలంచుతున్నారు. నూతన ప్రపంచంలో పరివర్తన చెందిన కమ్యూనిస్టు పార్టీలు, జాతీయ అనే మాటపై పోరాడుటకు మొహమాటపడుట, బాల్యదశ పురిటి కంపును పట్టుకొని వ్రేళ్ళాడుటయే. ఇండియా లాంటి పరిస్థితులు గల దేశాలలో కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కర్తవ్యం, నిజమైన జాతీయ, దేశభక్త శక్తులన్నిటి ఐక్యతావాదిగా, నాయకుడుగా ముందుకొచ్చి, సామ్రాజ్యవాద, ఫ్యూడలు అడ్డుగోడలను, స్వతంత్ర జాతీయాభివృద్ధి పధం నుండి తొలగించుటగా నెంచాలి. సరిగా యీ అర్థంలోనే ఐక్య జాతీయ సంఘటనా నినాదాన్ని అర్థంచేసుకొని ముందుదు తీసుకొనిరావాలి. జాతీయ అంటే ఏమిటి అంటే స్పష్టమైన ప్రత్యామ్నాయ కార్యక్రమ విధానాలు, నినాదాలు, ప్రతిపాదనలు, అనే సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్యాన్ని పదిలపరచి, ప్రజల ప్రయోజనాలకై పునర్నిర్మాణం గావించుట. ఐక్య జాతీయ సంఘటనకు నాయకత్వం కార్మికవర్గం వహించేది, బూర్జువా వర్గం కాదు"[1] అని జాతీయ ఐక్య సంఘటనా దృక్పధాన్ని వివరించారు.

అంతేగాక "ఐక్య జాతీయ సంఘటన కార్యక్రమం, సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక నినాదాలను మాత్రమే కలిగియుండుట, ఏమైనా అవి వాస్తవంగా దాని వర్గప్రయోజనాల దృష్ట్యా ఆమోదయోగ్యమైనవేగాక, గుత్త పెట్టుబడిదారి వ్యతిరేక నినాదాలను, నేరుగా బడా బూర్జువాలకు నష్టదాయకమైన, డివిడెండ్లపై సీలింగు, స్టేటు ట్రేడింగ్, కార్మికవర్గ హక్కులు కలిగి వుండవు. ఐక్య జాతీయ సంఘటన కార్యక్రమముపై ఆ విధమైన ఎట్టి నిబంధనలు అయినా తప్పనిసరిగా అవకాశవాద మగుతుంది. ఎందువలననగా, సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక పోరాటం, అదే కాలంలో బడా బూర్జువా విధానాలకు, కాపిటలిజం అభివృద్ధి

1. గుప్తా, ఇంద్రజిత్ (1955) కేంద్రసమితి తీర్మానం, ఎత్తుగడల దృక్పధం. ఫోరం, 18 నవంబరు, 1955, పే. 4.

చేయుటకు, పన్నుల భారాన్ని పెంచకుండా, రేషనలైజేషన్, రిట్రెంచిమెంటు విధానాలకు వ్యతిరేకంగా పోరాడకుండా, కొనసాగించజాలము".

దీనర్థం స్పష్టంగా ఐక్యజాతీయ సంఘటనా కార్యక్రమపు వివిధ అంశాలు మూడు ముఖ్య విస్తృత తరగతులుగా వున్నాయి.

i) ఇప్పటికీ బూర్జువావర్గాలకు, ప్రజలకు, సమిష్టివేదిక అంశాలుస్పష్టంగా వున్నవి. (ఉ॥ విదేశాంగ సమస్యలు)

ii) బూర్జువాలు, లేక బూర్జువాలలో కొన్ని వర్గాలు విస్తృత ప్రజావుద్యమ వొత్తిడిలో ఆమోదించేవి, ఐక్య జాతీయ సంఘటనాభివృద్ధిని ముందుకు తీసుకొని పోయేవి, బ్రిటిష్‌పెట్టుబడి వ్యతిరేక చర్యలు, భూస్వాములకు నష్టపరిహారాన్ని వాయిదా వేయుట, తెలంగాణానికి సహాయం వగైరా,

iii) జాతికి, అత్యధిక ప్రజాసామాన్యానికి ప్రయోజనకరమైనవి, బడాబూర్జువాల తక్షణ ప్రయోజనాలకు వ్యతిరేకమైనవి, ఫలితంగా రెంటిమధ్య తీవ్ర సంఘర్షణకు దారి తీసేవి, గుత్త పెట్టుబడిదారి వ్యతిరేక చర్యలు.

ఈ విధంగా,చారిత్రికంగా ఐక్యజాతీయసంఘటన కార్మికవర్గం నుండి,జాతీయ బూర్జువావర్గంలోని గ్రూపులకు విస్తరించి నిర్మించబడి, అదే కాలంలో ఐక్యత, పోరాటం రెండూ బూర్జువాలతో సాగిస్తూ, బూర్జువాలస్థానం, వర్గసారూప్యతలతో ఐక్యజాతీయ సంఘటనా కార్యక్రమ వివాదాంశాలు నేడు, రేపు పరిణామాల ననుసరించి మార్పు చెందుతాయి.

రాజకీయ ఆర్థిక పరిస్థితి అంతర్జాతీయంగా, జాతీయంగా పరిపక్వతచెంది, వివిధ అంతర్గతవైరుధ్యాలు అభివృద్ధి చెంది సాధారణ ప్రపంచ సామ్రాజ్యవాద సంక్షోభవంగా తీవ్రమై, సోషలిస్టు మార్కెట్టు విప్లవ ప్రత్యేకత మరింతగా రోజు రోజుకు ప్రస్ఫుటమగుతుంది. భారత బడా బూర్జువావర్గం సామ్రాజ్యవాద బంధనాలను తన మార్గంలో ఛేదించుకొంటూ, పెట్టుబడిదారివర్గపు లాభాలను ప్రజలు తాము భరించుటను రోజు రోజుకు తీవ్రంగా ప్రతిఘటించుటతో ప్రజాకార్యాచరణపాత్ర, ప్రజాపోరాటాలు, ఐక్యజాతీయ సంఘటన నిర్ణయాత్మక విప్లవోద్యమంగా రూపొందుతాయి"[1].

సోమనాద్‌లాహిరి, స్వాతంత్ర్యాన్ని సార్వభౌమాధికారాన్ని పొందుట, ప్రపంచ సోషలిస్టు శిబిరం, వనరులు, సోషలిస్టు మార్కెట్టు వుండుట, యీ రెండు భౌతిక పునాదుల కారణంగా స్వతంత్ర్య జాతీయాభివృద్ధి లక్ష్యాన్ని చేరుట సుసాధ్యం,

---

1. గుప్తా, ఇంద్రజిత్ (1555) కేంద్రసమితి తీర్మానం, ఎత్తుగడల దక్పథము పోరం. 18 నవంబరు 1955. పే. 5-6,

అందుకు నేడు అన్నివర్గాల జాతీయ ఐక్య సంఘటనా నినాదాన్ని యిచ్చే అవసరం, సాధ్యం అయి వున్నదని వివరించారు. పార్టీ కార్యక్రమం యీసాధ్యాన్ని వాస్తవంగా చూడగలిగింది. దానిని సుసాధ్యం చేయు అవకాశముందన్నారు.

"ఈ ఐక్యసంఘటన కొన్ని పరిస్థితులలో కొంతకాలం వరకు బడా బూర్జువా వర్గాలకు లేక దానిలోని కొన్ని వర్గాలకు విస్తరించి వుండుట చరిత్రలో కొత్తయేమీ కాదని" చైనాలో మావో నాయకత్వంలో యేర్పడిన జాతీయ ఐక్యసంఘటనను వుదహరించారు లాహిరి. అట్టి ఐక్యసంఘటన యేర్పడుటకు "అమెరికా-పాకిస్తాన్ పొడంబడిక భారత స్వాతంత్ర్యంపై సామ్రాజ్యవాదపు దురాక్రమణ ప్రమాదం" మరింత చేరువైందని, కృష్ణమీనన్ రక్షణమంత్రి, యీ విషయమై సామ్రాజ్యవాదంచే భారతదేశం చుట్టు ముట్టబడిందని పేర్కొన్నారని తెల్పారు. అంతేగాక భారత బడా బూర్జువా వర్గంలోని చాల కొద్ది మందిమాత్రమే "కంప్రెడరీ" స్వభావాన్ని కలిగి వున్న కారణంగా సామ్రాజ్యవాదంతో వారికి వైరుధ్యం బలమైనదని, అందువలన సామ్రాజ్య వాదంపై కేంద్రీకరించి పోరాడునపుడు వారి మద్దతును పొందుట సుసాధ్యమన్నారు. జాతీయ ఐక్యసంఘటనా నినాదం, బూర్జువాల నుండి చొరవను మనం పొందు అవకాశాలను సృష్టిస్తుందన్నారు[1]".

బూర్జువా విధానాలకు, ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుటలోనే జాతీయ ఐక్యతా పోరాటం యిమిడివుంది. ఐక్యజాతీయ సంఘటనా నినాదపు అర్థం అదే కాలంలో కార్మికులను, కర్షకులను, ప్రజాసామాన్యాన్ని ఐక్యపరచి, పోరాటాల ద్వారా ప్రభుత్వ విధానాలను ప్రజలు మార్పించే ప్రయత్నమది. నేటి పరిస్థితులలో జాతీయ ఐక్యతా నినాదం జాగృతిని కలిగించే నినాదం. అన్ని వర్గాలు ఆమోదించే పారిశ్రామికీకరణ, యుద్ధ ప్రయత్నాలకు వ్యతిరేకత, శాంతి, రక్షణ, స్వాతంత్ర్య పునాదులను సుస్థిరం చేయుట వంటి సమస్యలపై ఐక్యకార్యాచరణను రూపొందించుటతో ప్రారంభమగుతుంది. అయితే పోరాటం యీ పరిమితులకు మాత్రమే జరిగితే అది బూర్జువాలకు లొంగి బలపరచే విధానమే అవుతుంది. అదే ఐక్యప్రజాసామాన్యం బూర్జువావర్గపు లాభాలను యెక్కువ జేసే రేషనలైజేషన్‌కు, అధిక పన్నులకు, నిరుద్యోగానికి వ్యతిరేకంగా, పౌరహక్కుల కొరకు పోరాడుతుంది.

ఐక్య జాతీయ సంఘటన అవగాహనను అంగీకరించని వారి నినాదాలైన ప్రభుత్వవిధానాలు, ఆశయాలు అభివృద్ధి నిరోధకాలైనందున, ప్రభుత్వంలో, దాని నాయకులైన బూర్జువాలతో ఐక్యసంఘటనా ప్రతిపాదన అవాస్తవమైనదని, మన యెత్తుగడలు ప్రధానంగా ప్రభుత్వ వ్యతిరేకంగా వుండాలని. కాంగ్రెసుతో ఐక్య

---

1. సోమనాధ లాహిరి (1955) తక్షణ కర్తవ్యాలు, ఐక్యజాతీయ సంఘటనా నినాదం. ఫోరం. డిశంబరు 1955. పే. 29.

సంఘటన అర్థం లేనిదనే వాదనలను ఖండిచుతూ లాహిరి తనవాదనను వివరించారు. ఆశయాలు అభివృద్ధి నిరోధకమైనవే అనుకొందాం, ప్రజలు చైతన్యంతో ఆశయాలను మొదట అర్థం చేసుకొనునట్లు చేయాలి. అట్లుగాక, ఆశయాలు అభ్యుదయకరమైనవైతే జాతీయ ఐక్యతా నిర్మాణంలో ప్రజల విశ్వాసాన్ని మనం పొందగలుగుతాము. ప్రజల విశ్వాసాన్ని ఆ విధంగా పొందుటతో సరియైన విధానాలకై జరిగే పోరాటంలో వివరించి ప్రజలను సమీకరించగలుగుతాము.

అట్లుగాక, ఆశయాల సాధనకై ఐక్యతా పిలుపు నివ్వక, ప్రభుత్వం అనుసరించే విధానాలపై పోరాటాన్ని కేంద్రీకరించితే, ఆశయాలకు మాటలలో మాత్రం సానుభూతి వెలిబుచ్చితే, ప్రజలు మనం ఆశయాల యెడల శ్రద్ధవహించుటలేదని, ప్రతిపక్ష వ్యతిరేక పాత్రనే చేబట్టామని తలంచుతారు. కాంగ్రెసు, బూర్జువా వర్గాలే పారిశ్రామికీకరణకు చొరవ తీసుకొన్నారని ప్రజలు తలంచుతారు.

ఆ విధంగా పొక్క ప్రభుత్వ వ్యతిరేకతాకోణంనుండే పార్టీ ఆచరణలో దిగితే ముఖ్యమైన ఆశయాలు, లక్ష్యాలపై శ్రద్ధవహించుటలో విఫలత అగుతుంది. అందుకే అజయ్‌ఘోష్ "ప్రణాళికా చట్టాన్ని అభివృద్ధి నిరోధక మార్గం పట్టించుటకు ప్రభుత్వానికి సాధ్యమైంది. మనం బహిరంగపరచి ప్రజలను సమీకరించ జాలకపోయాము." అని అన్నారు. నేడు ప్రజలఅభిమానాన్ని ప్రభుత్వ వ్యతిరేక మార్గాన్ని అవలంభించుట మాత్రం చేతనే పొందజాలమని తెలిపారు.

జాతి పునర్నిర్మాణానికి, స్వాతంత్ర్యాన్ని విస్తరించి, రక్షించి, ఐక్యజాతీయ సంఘటన నిర్మించకుండా. పార్టీ ప్రజలను చైతన్యమార్గంలో నడిపి, భాగస్వామి కాజాలదు. ఉత్సాహపరిచే అన్ని వర్గాల జాతీయ ఐక్యతాపిలుపు ఐక్యతాపోరాటానికి నాంది కావాలి, యిదే నేటి, భవిష్యత్తులో ప్రధాన ఎత్తుగడగా కావాలి. ఈ అవగాహనతో అజయ్‌ఘోష్. జాతీయ ఐక్యతకై ప్రధాన ఎత్తుగడగా కాంగ్రెసుకు పిలుపు నివ్వదని వివరించారు.

ఐక్యసంఘటనా ప్రాథమికసూత్రాలు, నిర్మాణపోరాటం ఆశయాలు, సమస్యలపై ఐక్యతతో ప్రారంభమౌతుందని, వివిధ రాజకీయ పార్టీలపై ప్రజలకు గల విశ్వాసాన్ని ప్రశ్నించవు. కాంగ్రెసును ఐక్యసంఘటనలో భాగస్వామిగ చేగకుండా కాంగ్రెసు వాదులను, అనుచరులను అందులో చేర్చే ప్రయత్నం సాఫల్యంకాదు. కాంగ్రెసువాదులకు సంస్థపై గల విశ్వాసం వలన వారి సమస్యల నుండి కూడ అభివృద్ధి నిరోధక నాయకత్వం దూరం చేస్తుంది. నాయకత్వం అభివృద్ధి నిరోధకమైనంత మాత్రాన సంస్థను ఐక్యసంఘటనలోకి ఆహ్వానించక పోవుటలో అర్థంలేదు. ఐక్యసంఘటనా ఎత్తుగడల సారం అభివృద్ధి నిరోధ నాయకత్వాలు, ఆయాసంస్థలపై ప్రజలకు గల విశ్వాసాల నంటిపెట్టుకొని ప్రజలను ఆకట్టుకొని వుండాలనే వారి ప్రయత్నాలను వమ్ము చేయుట ధ్యేయముగా కలిగినవి.

బూర్జువావర్గంలోని వైరుధ్యాలు, ఆ వర్గ పరిధిలో పరిష్కారం కానంతటి తీవ్రదశకు యింకా చేరలేదు. సంఘర్షణలు అభివృద్ధికర,అభివృద్ధి నిరోధక శక్తులను వేరువేరుగ చూడగలిగినంతటి పరిపక్వత చెందలేదు. ఆ కారణంగా యేప్రత్యేక గ్రూపుతో, ప్రభుత్వంతో మిత్ర సహకారాన్ని పార్టీ నెరపే ప్రశ్నలేదు.

"ఐక్యజాతీయ సంఘటనకై పిలుపు జాతీయ లేక సంకీర్ణ ప్రభుత్వం యేర్పర చుటకు పిలుపుగాదు. ఐక్యతకై పోరాటం ప్రారంభమైన యీదశలో అట్టి ప్రభుత్వానికై పిలుపు, బూర్జువావర్గం తన ప్రభుత్వాన్ని కొన్ని మార్పులతో కొనసాగించమని కోరుటమే అవుతుంది. కార్మికవర్గానికిగాని ప్రజలకుగాని అట్టి నినాదంలో ఆశలు లేవు.

"కాని ఐక్యత చెప్పుకొన తగినంతగా అభివృద్ధి చెంది, ప్రజలపై ప్రగాఢ ప్రభావాన్ని కలిగించినపుడు, బలాబలాల మార్పు వచ్చినపుడు చొరవ కార్మికవర్గపు చేతులలో వున్నపుడు, ప్రభుత్వ ప్రశ్న తప్పని సరిగ ఎదురౌతుంది. అప్పుడు ప్రభుత్వం సహజంగానే ఐక్యజాతీయ సంఘటనలోగల శక్తుల బలాబలాలను ప్రతిబింబించుతుంది[1]".

సత్యనారాయణ, తదితర ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులు" పాలక పార్టీ అయిన కాంగ్రెసు నేడు అభ్యుదయకర, అభ్యుదయ నిరోధక ప్రభుత్వ విధానాల రెండింటికి ప్రాతినిధ్యం వహించుచున్నది. దీని అర్థం అభ్యుదయకర విధానాలు అభ్యుదయ శక్తులచే, అభివృద్ధి నిరోధకర విధానాలు అభివృద్ధి నిరోధక శక్తులచే ప్రాతినిధ్యం వహించుచున్నవనిగాదు, కారణం అట్టి విభజన యింకా జరిగి వుండలేదు. నేటి అభ్యుదయకర విధానాలను ప్రభుత్వం విడనాడుటకై సామ్రాజ్యవాదం తప్పని సరిగా వొత్తిడి తీసుకొని వస్తుంది. అప్పుడు బూర్జువా వర్గాలలో యేయేవిభాగాలు అభ్యుదయకర విధానాలను అంటిపెట్టుకొని వుండేది, యేయేవిభాగాలు సామ్రాజ్యవాదుల వొత్తిడికి లొంగి జారిపోయేది తెలుస్తుంది" అని బూర్జువా ప్రభుత్వవర్గాలుపై తమ అభిప్రాయాన్ని వెల్లడించారు[2].

దేశంలో వివిధ రాజకీయ పార్టీలనైజాన్ని అవి అవలంబించు విధానాలను వివరించారు. కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీల తరువాత అఖిల భారత ప్రాముఖ్యత గలిగిన పార్టీ, ప్రజాసోషలిస్టుపార్టీ. అది నేడు ప్రజాసోషలిస్టుపార్టీగా, సోషలిస్టు పార్టీగ రెండుగా చీలిపోయింది. ఈ పార్టీల జాతీయనాయకత్వాలు సోవియట్ వ్యతిరేక, కమ్యూనిస్టు వ్యతిరేక విధానాలను అనుసరించుచున్నవి. అయితే యీ పార్టీలు

---

1. లాహిరి, సోమనాద్ (1955) తక్షణ కర్తవ్యాలు, ఐక్యజాతీయ సంఘటన ఫోరం. డిశంబరు 1955. పే. 36-7.

2. సత్యనారాయణ, టి. (1955) తదితరులు, నేటి పరిస్థితి మన కర్తవ్యాలు ఫోరం డిశంబరు, 1955. పే. 52.

పాలక పార్టీ అయిన కాంగ్రెసు అనుసరించే ప్రజావ్యతిరేక విధానాల కారణంగా యేర్పడినవని మరువరాదు. వీరి ననుసరించే ప్రజాసామాన్యం సోషలిస్టు, ప్రజాస్వామ్య భావాలు గలవారు. ఆకారణంగా కనీస కార్యక్రమంపై వారితో ఐక్యమగుట పార్టి కర్తవ్యం, అదే కాలంలో నాయకత్వం వహించే అవకాశవాదాన్ని బహిరంగ పరచాలి.

హిందూ మహాసభ, జనసంఘాలు, మతతత్వ అభివృద్ధినిరోధక పార్టీలు,వాటిని గురించి వివరించనక్కరలేదు.

వివిధ రాష్ట్రాలలో వామపక్షశక్తులు అనేక పార్టీలు, గ్రూపులుగ చీలికలై వున్నవి. కొన్ని మార్క్సిజాన్ని ఆమోదించి కమ్యూనిస్టు పార్టితో కలిసాయి. మిగిలిన పార్టీలు, గ్రూపులు వాస్తవంగా సోషలిజంలో విశ్వాసం వున్న వర్గాలున్నవి, కాని కొన్నిటి నాయకత్వాలు అవకాశవాదులై ఐక్యసంఘటనా నిర్మాణానికి అడ్డంగా వున్నారు. కాన ఆయాపార్టీలను; గ్రూపులను, అధ్యయనం చేసి,వారి యెడల కమ్యూనిస్టుపార్టి వైఖరి నిర్ణయించే, ఐక్యసంఘటన, ఐక్యకార్యాచరణలోనికి తీసుకొని రావాలి.

కమ్యూనిస్టుపార్టి అభ్యుదయకరశక్తులన్నిటితో ఐక్యమగుతూ, వాటిని అఖిలభారతస్థాయిలో ఐక్యసంఘటనలో ఐక్యపరచాలి. అయితే పరిస్థితి కాంగ్రెసులో స్పష్టమైన భిన్నభావాలు రూపొందని కారణంగా, ఆదశకు చేరలేదు. కాన వెంటనే ఐక్యసంఘటనా నినాదాన్ని కాంగ్రెసుతో సంయుక్త ప్రభుత్వ (కొయలిషన్) నినాద మిచ్చుట తప్పుకాగలదు. గతంలోవలె కాంగ్రెసు వ్యతిరేకశక్తులతో మాత్రమే ఐక్యమగుట నేటి పరిస్థితులలో చాలదు. అది ఐక్యసంఘటనా విధానాన్ని కుదించి వేస్తుంది.

కాన పార్టీ తక్షణ కర్తవ్యం అన్ని ప్రజాస్వామ్య, అభ్యుదయకరశక్తులతో కనీస కార్యక్రమంలో అభ్యుదయకర విధానాలకై ఐక్యమగుట ప్రజలు ఎదుర్కొనే సమస్యలపై ప్రజాస్వామ్యశక్తులనైక్యపరచుటకై ప్రయత్నించాలి. ప్రజాస్వామ్య శక్తులను ఐక్యపరచే అట్టి పోరాటమే కాంగ్రెసులో అభ్యుదయశక్తుల, అభ్యుదయ విరోధకశక్తుల మాధ్యస్పష్టతను చేకూర్చి, సమస్యలపై ఐక్యకార్యాచరణ, తద్వారా ఐక్యసంఘటన యేర్పడుట జరుగుతుంది. కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసులో విధానాల యెడల స్పష్టమైన అట్టివిభాగాలు రూపొందిన, ప్రత్యామ్నాయప్రభుత్వమేర్పాటు నినాదాన్ని యివ్వవచ్చు.

అదేవిధంగా స్థానికసంస్థల ఎన్నికలలో స్థానిక ఐక్యసంఘటలను అన్ని పార్టీల, గ్రూపుల, వ్యక్తులతో యేర్పాటు చేయునపుడు పరిస్థితులను బట్టి కాంగ్రెసు ముఠాలను చేర్చుకొనుటో, చేర్చుకొనకపోవుటో చేయాలి. అవి ఐక్యసంఘటనల

యెడల తమ దృక్పథాన్ని వివరించి, 16 అంశాల కనీస కార్యక్రమానికి సూచనలు యిచ్చారు [1].

ముగింపుగా "కమ్యూనిస్టుపార్టీ ప్రధానకర్తవ్యం, కాంగ్రెసులోని, బయట వున్న అభ్యుదయకరశక్తులన్నిటిని కనీసకార్యక్రమముపై సమీకరించి, ఐక్యపోరాటోద్యమాన్ని నిర్మించి, వారి కోర్కెలసాధనకై పోరాటానికి ప్రభుత్వ ప్రణాళికలు అమలులో చొరవతో వాటిని ప్రజలకు యెక్కువప్రయోజనకారి యగునట్లు కృషి చేయాలి. ఇది అభ్యుదయకరశక్తులు రూపొందునట్లు చేయగలుగుతుంది. అంతేగాక అవి బలపడుటకు, పొకనిర్మాణ రూపాన్ని చేబట్టి ఐక్యసంఘటనలో పాత్రధారులగుటకు తోడ్పడుతుంది, విస్తృత ఐక్యసంఘటన యేర్పడుటకు మార్గం సుగమం అవుతుంది. ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలైన సామ్రాజ్యవాదశక్తుల ప్రభావాన్ని ఫ్యూడలిజాన్ని రూపుమాపుట, దున్నేవానికే భూమినిచ్చుట జరుగుతుంది[2]" అని వివరించారు.

పంజాబ్-పెప్సూ కమ్యునిస్టుపార్టి కమిటి ఐక్యసంఘటనా నిర్మాణ సమస్యపై "విస్తార ప్రజాసామాన్యం యింకా కాంగ్రెసునే అనుసరించుతున్నారనేది వాస్తవం. ఇన్ని సంవత్సరాలు యీ ప్రజాసామాన్యాన్ని అలక్ష్యం చేయుటో లేక సెక్టేరియన్ వొంటెత్తు వైఖరి అనుసరించుటో చేసాము" అని ఆత్మ విమర్శగా తెలిపారు. ఇంకా "నేటి పరిస్థితులలో యీ ప్రజాసామాన్యంతో ఐక్యత అమూల్యమైన ప్రాముఖ్యత గలదని అంగీకరించాము. కారణం ఎక్కడైతే కాంగ్రెసును అనుసరించే ప్రజలు సమిష్టి పోరాటాలలో సమీకరించబడ్డారో, అక్కడ యీ వుద్యమం నూతన వేగోధృతిని పొందింది[3].

"ఈ ప్రధాన కర్తవ్యాన్ని నొక్కిచెప్పకుండా, కేంద్ర సమితి తీర్మానం యాంత్రికంగా ప్రజాస్వామ్య ప్రతిపక్షాలను అనుసరించే ప్రజలని కాంగ్రెసును అనుసరించే ప్రజలని రెండు ప్రధాన విభాగాలుగ చేసి, తప్పుచేసింది. ఈ విధమైన సూత్రీకరణ తప్పుదారిని పట్టించి, కాంగ్రెసు విధానాల తోకను పట్టుకొని అనుసరించే దారికి తీస్తుంది, ఐక్యసంఘటన, యితరపార్టీలు, వ్యక్తుల యెడల తప్పుడు దృక్పథమౌతుంది.

అంతేగాక "పునాది ప్రజాసామాన్యాన్ని వారివర్గ, ప్రజాసంఘాలలో ఐక్యపరచుట, ఐక్యసంఘటనా నిర్మాణానికి, బలపరచుటకు, స్థిరీకరించుటకు ప్రధానాంశ

---

1. సత్యనారాయణ, టి. తదితరలు (1955) నేటి పరిస్థితి మన కర్తవ్యాలు. ఫోరం. డిశంబరు, 1955. పే. 54-5
2. సత్యనారాయణ, టి. నేటి పరిస్థితి మన కర్తవ్యాలు.
3. పంజాబ్-పెప్సూకమిటి(1955) భారత విప్లవపు మౌలిక ఉద్దేశ్యాలు, వ్యూహం. ఫోరం. నవంబరు 1955. పే. 15-18.

మని తీర్మానం తగురీతి నొక్కి చెప్పింది. కార్మిక, కర్షక వర్గాల ఐక్యతానిర్మాణం, ప్రజాసంఘాలను 'బలపరచుట ప్రధానకర్తవ్యమని స్పష్టీకరించి, నొక్కిసరిగా చెప్పాలి[1]" అని సంక్షిప్తంగా ప్రధాన విషయాలను స్పష్టంచేసారు.

శుక్లా తదితర యు. పి. నాయకులు ఐక్యసంఘటనా సమస్యను నేరుగా లేవ నెత్తకపోయినా, ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వ నినాదం యేవిధంగా తప్పో వివ రించారు. అట్టి ప్రభుత్వం రాజకీయసంక్షోభకాలంలోనే సాధ్యం కాబట్టి, అట్టి పరిస్థి తులలోనే ఆ నినాదాన్ని యివ్వాలని డిమిట్రావ్‌ను వుదహరించుతు తెలిపారు. నేడు సంక్షోభ పరిస్థితి లేదని, అటువంటి ప్రభుత్వం కాంగ్రెసు ఆధిక్యతాధిపత్యంలో వుంటుందని, అది విస్తరించబడిన కాంగ్రెసు ప్రభుత్వం అగుతుంది కాని, ప్రజా స్వామ్య ఐక్యత ప్రభుత్వం కాజాలదన్నారు.

కాంగ్రెసు, పాలక పైవర్గాల నుండి వేరుపడనందున కాంగ్రెసు బయటగల ప్రజాస్వామ్యశక్తులు, కాంగ్రెసు అభివృద్ధి నిరోధక వర్గాలకు వ్యతిరేకంగా చొరవతో వుద్యమాలు నిర్వహించుతారు, కాని కాంగ్రెసులోని అభివృద్ధికరశక్తులు ప్రజాకార్యా చరణకు యిష్టపడక, వెనుకాడుతవని, ఏొకవేళ దైనందిన సమస్యలపై ప్రజాపోరా టాన్ని బలపరచినా, కాంగ్రేసేతర ప్రజాస్వామ్యశక్తులు సరియైన ఐక్యసంఘటనా ఎత్తుగడల నవలంభించిన విస్తృత ప్రజాసామాన్యాన్ని వుద్యమంలో సమీకరించగలుగు తుంది. అయినా నాయకత్వంపై వారికి బ్రదుబున్నాయి కాన వుద్యమంలో పాల్గొన నిరాకరించుతారు. అందుచే కాంగ్రెసులోని ప్రజాసామ్యవాదులు, నేటి ప్రభుత్వాన్ని తొలగించి, ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వాన్ని యేర్పరచే వుద్యమాన్ని బలపర చరు. వారి మద్దతును సంపాదించే ప్రయత్నం, వినాదాన్ని పెడదారి పట్టించి, ఆచ రణలో విస్తరించబడిన కాంగ్రెసు ప్రభుత్వం నేటిపైతరగతుల నాయకత్వంలో యేర్పడుతుంది. ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వవినాదాన్ని అవకాశవాద వక్రీకరణకు గురిచేస్తుందని వివరించారు[2].

—:o:—

1. పంజాబ్-పెప్సూకమిటి (1955) భారత విప్లవపు మౌలిక ఉద్దేశ్యాలు, వ్యూహం పోరం. నవంబరు, 1955. పే. 31.

2. శుక్లా తదితరులు (1955) పార్టీ విధానంలో మౌలిక దృక్పధం. పోరం. సెప్టెంబరు 1955. పే. 15-18.

# IV

# సమీక్ష కొన్ని ముఖ్యాంశాలు

## (1)

1. భారత రిపబ్లిక్ అవతరణ అనంతరం 1952 ఎన్నికలలో బలీయమైన కాంగ్రెసును ఎదుర్కొనుటకు వివిధ పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు కలసి ఒకే వేదికపై పోరాడవలసిన వాస్తవ పరిస్థితి, ఐక్య సంఘటనా నిర్మాణ సమస్యను ముందుకు తెచ్చింది. ఐక్య ప్రజా కార్యాచరణ, ఐక్య పోరాటాల ద్వారా ముందుకు వచ్చింది కాదు. పార్లమెంటరీ పోరాటాల సమస్యగా ముందుకొచ్చింది.

కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీ, జనసంఘాలు మాత్రమే దేశవ్యాప్తిని గలిగిన పార్టీలు. కాంగ్రెసు మినహా మిగతా పార్టీలు అసమాన వ్యాప్తిని, కలిగి దేశమంతటా పోటీ చేయాజాలని స్థితిలో ఉన్నవి. ఎన్నికలలో ఈ పార్టీలు ప్రధానంగా రాజకీయ, ఆర్థిక సమస్యలపైగాక వాస్తవంగా ప్రాంతీయ సమస్యలపై కేంద్రీకరించాయి.

వామపక్షాల అనైక్యత, కమ్యూనిస్టు పార్టీ జాతీయ ప్రధాన స్రవంతి నుండి వేరుపడిపోయినందున ఎన్నికలలో తాత్కాలికంగానైనా అఖిల భారత స్థాయిలో ఐక్య సంఘటనగా యేర్పడి పోరాడే స్థితిలేకుండా పోయింది. రాష్ట్రాలలో స్థానిక సోషలిస్టులు, యితర వామపక్షాలతో కొన్ని రాష్ట్రాలలో పరిమితంగానైనా ఐక్య సంఘటనలను ఏర్పరచి కమ్యూనిస్టు పార్టీ గణనీయ విజయాన్ని సాధించింది.

హైదరాబాద్ సంస్థానంలో దేశంలో మొట్టమొదటగా అక్టోబరు 1951 లోనే కమ్యూనిస్టు పార్టీ, పీపిల్సు డెమోక్రటిక్ పార్టీ, కిసాన్‌కాంగార్ పక్షం, సోషలిస్టు వర్కర్సులీగ్, కొందరు ప్రముఖ వ్యక్తులు కలసి పీపిల్సు డెమోక్రటిక్ ఫ్రంటు నేర్పరచారు. కేరళలో ఆదేవిధంగా రివల్యూషనరి సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీలు కలసి ఐక్య సంఘటనగా యేర్పడినారు. ఇవి కనీస కార్యక్రమ ప్రాతిపదికగా ఎన్నికలలో యేకంగా పోరాడినవి. బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో, మార్క్సిస్టు ఫార్వర్డు బ్లాకుతో పూర్తి ఎన్నికల అవగాహన ఒప్పందం కుదిరింది. మహారాష్ట్ర, హైదరాబాద్‌లలో మరాట్వాడాలలో పెక్కుచోట్ల కిసాన్ కాంగార్ పార్టీ, పీజెంట్సు అండ్ వర్కర్సు పార్టీలతో సీట్ల సర్దుబాటు ఎన్నిక ఒప్పందాలు కుదిరాయి. ఉత్తరప్రదేశ్‌లో రివల్యూషనరీ సోషలిస్టు పార్టీతోను, పంజాబ్‌లో లాల్ కమ్యూనిస్టు పార్టీతోను, ఎన్నికల ఒప్పందాలు కుదిరాయి. తమిళనాడులో ద్రవిడకజగంతో, టాయిలర్సు పార్టీతో ఎన్నికల ఒప్పందాలు కుదిరాయి. ఆంధ్రలో

కిసాన్‌మజ్దూర్ పార్టీ, క్రిషిక్‌లోక్ పార్టీలతో ఒప్పందం కుదరకపోయినా వారి 11 మంది అభ్యర్థుల గెలుపుకు కమ్యూనిస్టు పార్టీ మద్దతు కారణమైంది. ఐక్య సంఘటనా నిర్మాణంలో కొన్ని ప్రాథమిక విజయాలను సాధించుటతో, కాంగ్రెసును వోడించుటకు అన్ని అభ్యుదయ శక్తులు 'ఐక్యమవ్వాలనే జాగృతి' కలిగించుట జరిగింది. పార్టీ గతంలోని హెచ్చుతగ్గులు, సరియైన ఐక్య సంఘటనా దృక్పథం లేకపోవుట స్పష్టంగా విదితమైంది. కమ్యూనిస్టు పార్టీ బలంగా వున్న రాష్ట్రాలు, ప్రాంతాలలోనే ఐక్య సంఘటనా నిర్మాణ ప్రాథమిక, పాక్షిక విజయాలు లభించుట, బలమైన పార్టీ ఆవస్యకతను, ప్రాముఖ్యతను తెలియజేస్తుంది.

పార్టీ ఐక్య సంఘటనా నిర్మాణ ప్రయత్నాలలో ముఖ్యంగా హైదరాబాద్‌లో నిర్మాణ సమస్యలతో పాటు, సిద్ధాంత సమస్యలు లేవనెత్తబడినందున, వాటి అధ్యయనంతో సిద్ధాంత పరిజ్ఞానాన్ని విస్తృతపరచుకొనగలిగింది, భవిష్యత్తు కవసరమైన పునాది యేర్పడింది.

2) కాంగ్రెసు గ్రామీణ ప్రాంతాలలో తమ పునాదులను కదలిపోవుటను, భూస్వామ్య వర్గాలు పాలకవర్గాలను మరెంతో కాలం రక్షించజాలవని, నూతన వర్గ ప్రాతిపదికపై తమ బలాన్ని పెంపొందించుకొనాలని మేధావి వర్గాలు యిచ్చిన సలహాపై, నూతన ధనికరైతువర్గాన్ని సృష్టించి, బలపరచుకొను లక్ష్యంతో వివిధ రాష్ట్రాలలో, ముఖ్యంగా హైదరాబాద్‌లో 1949 లోను, యితర రాష్ట్రాల కొన్నిటిలో 1952 సాధారణ ఎన్నికలకు ముందుగానే జాగీర్దారీ, జమీందారీ రద్దు చట్టాలను, తరువరి 1954 వరకు అనేక భూసంస్కరణ చట్టాలు రాష్ట్రాలు చేయునట్లు కేంద్రం చేసింది. కాంగ్రెసు ఎన్నికలలో వాగ్దానం చేసినట్లుగా జాగీర్దారీ, జమీందారీ విధానాలను రద్దు చేసినట్లు విస్తృత ప్రచారం కావించుకొంది. వాస్తవానికి భూస్వాముల ప్రత్యక్ష దోపిడిని, పరోక్షపు దోపిడిగా చేసింది. భూస్వామ్య వర్గాలు మిలియన్లకొలది రైతాంగాన్ని భూముల నుండి తొలగించుటను పరోక్షంగా తోడ్పడింది. భూస్వాములు ధనిక రైతులుగ, పెట్టుబడిదారులుగ, పారిశ్రామికులుగ రూపొందారు. నష్టపరిహారంతో పాటు మారిన దోపిడి రూపంలో మార్కెట్టులో రైతాంగపు దోపిడి ఎక్కువైంది. మరోవైపు భూదాన, గ్రామదాన ఉద్యమాలు, కర్మసిద్ధాంతం దేశంలో "ఈ మానవతావాద సిద్ధాంతం" ప్రచారంతో బూర్జువా వర్గం నూతన భ్రమలను కలుగజేయుటకు తోడ్పడింది. భూమికొరకై రైతాంగం సాయుధ గెరిల్లా పోరాటాలు జరిపి, లక్షల ఎకరాల భూమిని పంపకం చేసిన తెలంగాణాలోనే ఈ ఉద్యమం ఉద్భవించుట గమనార్హము. ఈ భ్రమలు అచిరకాలంలోనే తొలగిపోయాయి.

సోషలిస్టు వర్గాలు కాంగ్రెసు నుండి విడిపోవుట, డిశంబరు 1950లో సర్దార్

పటేల్ మరణంతో కాంగ్రెసులో అటు మితవాద వర్గాలు, యిటు అతివాద వర్గాలు రెండూ బలహీనపడ్డాయి. ఫలితంగా మధ్యేమార్గాన్ని అనుసరించే నెహ్రూ వర్గం ఆధిక్యత వహించింది. కాని టాండన్ నాయకత్వంలో మితవాద వర్గాల సమీకరణ కొనసాగుతూనే వుంది.

విదేశాంగ విధానంలో రెండు కూటముల యెడ "ఆలీన తటస్థ విధానాన్ని" చేబట్టి, ప్రపంచశాంతి "సుముఖ తటస్థ విధాన" సిద్ధాంతం రూపొందించుకొని, పశ్చిమ దేశాలు తీవ్రంగా వ్యతిరేకించిన 'పూగిసలాటకు' లోనగుతూ, దేశీయ విధానాలలో వ్యూడలు జాగిర్దారీ, జమీందారి విధానాన్ని రద్దు చేస్తూ ఆ విధానంలో 'పూగిసలాట మధ్యేమార్గాన్ని' అవలంభించుతు, ఆ వ్యూడలు వర్గాలను పెట్టుబడిదారి ధనిక రైతులుగ, పారిశ్రామికులుగా రూపొందించే ద్వంద్వ వైఖరిని అవలంభించుతు అదే వైఖరిని ఆర్థిక పారిశ్రామిక రంగాలలో "మిశ్రమ ఆర్థిక పారిశ్రామిక విధాన సిద్ధాంతాన్ని" చేబట్టి, ఒకవైపు వ్యక్తి యాజమాన్యంలో పారిశ్రామికాభివృద్ధి, మరో వైపు ప్రభుత్వ యాజమాన్యంలో భారీ పారిశ్రామికాభివృద్ధి, విధానాలు అన్నీ ప్రభుత్వం పెట్టుబడిదారీ విధానాన్ని పెంపొందించే ప్రయత్నాలని ఆనాడు, అందరికి అంత స్పష్టంగా విశదం కాకపోయినా నేడు అందరికీ స్పష్టమైంది. వలస, అర్థవలస ఆర్థిక, వ్యూడలు సమాజంలో ఇరవైవ శతాబ్దపు చివర అర్థభాగంలో పారిశ్రామికీ కరణకై పెనుగులాడుతున్న భారత బూర్జువా వర్గం పూగిసలాడుతు, ద్వంద్వవైఖరి అవలంభించుటలో ఆశ్చర్యం లేదు. దీనిని పరిగణలోనికి తీసుకొనకుండా కార్మిక వర్గ పార్టీ తమ విధానాలను, వ్యూహరచన గావించుటయే కొంత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

3) కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం చిన్నాభిన్నమై వుంది. రాజకీయ విధానం, వ్యూహం, ఎత్తుగడలపై భేదాభిప్రాయాలు ఎక్కువై పార్టీలో అంతర్గత పోరాటం తీవ్రరూపం దాల్చింది. ఎన్నికల పోరాటంలో తాత్కాలికంగా కలసి పనిచేసినా, ఎన్నికల ఫలితాలను వివిధ దృక్పథ వాదులు తమ తమ రాజకీయ ధోరణులకు అనుకూలంగా వ్యాఖ్యానించుకొంటూ, అభిప్రాయ భేదాలను యినుమడింపజేసు కొంటున్నారు. నిర్మాణ రంగంలోను యిదే జరిగింది.

"మనలో ఏ వొక్కరం ప్రధాన చర్చనీయాంశాలపైన రాజకీయంగా కరెక్టుగా వున్నామనుట సరియైనది కాదు. ఆ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని చర్చలు సాగించితే ఐక్యతను సులభంగా సాధించగలం. ప్రతి వొక్కరం పాక్షిక సత్యాన్ని మాత్రమే చూస్తూ వచ్చాం" అని అజయ్‌ఘోష్ తెలంగాణా పార్టీ ముఖ్యుల సమావేశంలో అన్నారు. ఇంకా "విశాలమైన పార్టీలో భేదాభిప్రాయాలు, భిన్న దృక్పధాలు, వైఖరులు సహజం. చర్చించి, పరస్పరం వొప్పించుకొనే విధానమే పరిష్కార మార్గం. మెజారిటి నిర్ణయాలకు మైనారిటీ కట్టబడి వుండాలి. మెజారిటీ,

మైనారిటి అభిప్రాయాలను గౌరవించాలి. ఈ విధాన క్రమంలో చర్చలు, నిర్ణయాలు, వాటిని అమలుపర్చే శిక్షణ పార్టీకి ప్రాణం. ఇది లేకుంటే పార్టీయే లేదని" పార్టీలో నాటి తీవ్ర పరిస్థితిపై అజయ్ వ్యాఖ్యానించారు.

అక్టోబరు 1951, అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ కాన్ఫరెన్సు తరువాత కేంద్ర సమితి, రాష్ట్ర కమిటీల సభ్యుల విస్తృత ప్లీనరీ సమావేశం 30, డిశంబరు 1952 నుండి 10, జనవరి 1953 వరకు జరిగింది. సమావేశం ముఖ్య రాజకీయ పరిణామాలను సమీక్షించింది. అంతర్జాతీయ శాంతి పరిరక్షణ, ఇండో-సోవియట్, ఇండో-చైనా మిత్ర సంఘాలను గ్రామ, ఫ్యాక్టరీ స్థాయితో ఏర్పాటుచేసి బలపరచాలని తీర్మానించింది. కార్మిక, కర్షక, విద్యార్థి, మధ్యతరగతి ప్రజల తక్షణ సమస్యలపై వివిధ తీర్మానాలను ఆమోదించింది. పార్టీ పునర్నిర్మాణం, పటిష్టం చేయు ప్రయత్నంగా కొన్ని ముఖ్య సూచనలు చేసింది.

పార్టీని, ఐక్యతను, క్రమశిక్షణను, పునరుద్ధరించుట తప్పుడు విధానాలకు, సిద్ధాంతాలకు, ఎత్తుగడలకు వ్యతిరేకంగా పార్టీలో అంతర్గత పోరాటానికి ముడిపడి వుంది. వాస్తవం, స్థిరమైన పార్టీ ఐక్యత, నిజమైన కార్మికవర్గ క్రమశిక్షణ, సూత్రబద్ధం, క్రమబద్ధమైన పార్టీ అంతర్గత పోరాటం వలననే ఏర్పడి, ఆచరించుట జరుగుతుంది. కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధికి యిదే మూల సిద్ధాంత సూత్రమని స్టాలిన్ పదే పదే నొక్కి చెప్పుటను కేంద్రసమితి విస్తృ ప్లీనరీ సమావేశము పునరుద్ఘాటించింది.

"పార్టీ అన్ని స్థాయిల నాయకత్వం, ముఖ్యంగా కేంద్రసమితి నాయకత్వం, కేంద్ర నాయకత్వంపై, క్రమబద్ధంగా, విమర్శ, ఆత్మవిమర్శను ప్రయత్నపూర్వకంగా, నిర్మాణయుతంగా కొనసాగించే గురుతర బాధ్యత వారి భుజస్కంధాలపై వుంది. నామమాత్రంగా పార్టీ వర్గాలు వారి అభిప్రాయాలను వెలిబుచ్చుటను మాత్రమేగాక, వారి అభిప్రాయాలను స్వేచ్ఛగా, నిర్భయంగా వెలిబుచ్చునట్లు ప్రోత్సహించుటయే గాక, వారి సూచనలు, ఫిర్యాదులను, విమర్శలను నాయకత్వం పార్టీ రాజకీయ విధానం, ఎత్తుగడలు, పని విధానం మెరుగుపరచుటకై ప్రత్యేకించి పరిగణనలోనికి తీసుకొనవలసిన అవసరముందని" చివర పేరాలో వివరించింది.

పార్టీ కాంగ్రెసు చిత్తు తీర్మానాన్ని, డిశంబరు 1952 విస్తృత ప్లీనరీ సమావేశంలో చర్చించి, వివిధ స్థాయి పార్టీ కాన్ఫరెన్సులలో చర్చల నిమిత్తం, జనవరి 1953 లో విడుదల చేసింది. మధురై కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు ముందున్న పరిస్థితిని ముఖ్యంగా 1951 కార్యక్రమముపై పార్టీ అంతర్గత చర్చల తీవ్రస్థాయిని "కార్యక్రమం ఏమైనా, మౌలికంగా పిడివాద దృక్పథంతో నిండివుందని" నంబూద్రిపాద్, "పిడివాదం, సంస్కరణ వాదం అని వాద ప్రతివాదనలు జరిగాయి" అని అధికారి 1960 దశకంలో వ్యాఖ్యానించారు.

4) కొరియా యుద్ధంలో వీరకొరియా సైనికులు, చైనీస్ వలంటీర్లు అమెరికా ఆశలను అడియాశలు చేసారు. ఫలితంగా సామ్రాజ్యవాదుల పక్షంలో, ముఖ్యంగా ఇంగ్లో-అమెరికను సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలు తీవ్రమైనాయి. అటం, హైడ్రోజన్ బాంబుల అమెరికా గుత్తాధిపత్యాన్ని రష్యా బ్రద్దలు చేసింది. బ్రిటన్, ఫ్రాన్స్ యితర సామ్రాజ్యవాదులు ఆసియా నుండి నిష్క్రమించుటతో అమెరికా ఆ శూన్యాన్ని ఆక్రమించే ప్రయత్నాలలో భాగంగా ఇండోనేషియా, వియత్నాం, ఇండోచైనా, మలయా, బర్మాలలో శేష సామ్రాజ్యవాద శక్తులు కాలూని బలపడుటకు ఆర్థిక, సైనిక సహాయాన్నందిస్తూ సైనిక కూటములను ఏర్పరుస్తున్నది. కాశ్మీరులో జోక్యం చేసుకొని పాకిస్తాన్‌తో సైనిక కూటమి మంతనాలు చేస్తూ, భారతదేశాన్ని ప్రమాదంలోనికి తోస్తున్నది. ఆసియాలో వలస, అర్ధవలస దేశాలలో ప్రజా పోరాటాలు వెల్లువగా విజృంభించాయి. ప్రపంచశాంతి, యుద్ధ వ్యతిరేక ఉద్యమం బలీయమై ప్రపంచ ప్రజల నాకర్షించింది. కాన కమ్యూనిస్టు పార్టీ అమెరికా పన్నాగాలను ప్రజలలో బట్టబయలు చేసి దేశభక్తులలో విస్తృత ఐక్యతను నిర్మించి, సామ్రాజ్యవాదాల క్రింద అణగారిపోతున్న, గోవా, పుదుచ్చేరి, చంద్రనగర్, యానాం తదితర ప్రజల విముక్తికై ప్రజా పోరాటాలు కొనసాగించాలి ఇది మధురై పార్టీ కాంగ్రెసు యిచ్చిన అంతర్జాతీయ రాజకీయ అవగాహన, చేబట్టిన కర్తవ్యం.

భారత ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధి, వ్యాపార సంబంధాలు బ్రిటన్‌తో బ్రహ్మముడి కారణంగా, అసమాన వ్యాపార సంబంధాలు, ఎగుమతి దిగుమతుల అంతరాలు, ధరల కుంభకోణాలు, లోటు వ్యాపారం, మన స్టెర్లింగు నిల్వలను కరి మింగిన 'వెలగపండు' చందం చేసాయి. వ్యవసాయ, పారిశ్రామిక వస్తువుల మధ్యగల అంతరంతో ప్రజల కొనుగోలు శక్తి పూర్తిగ పడిపోయి 'అధికోత్పత్తి సంక్షోభం' ముఖ్యంగా పంచదార, గుడ్డల మిల్లులలో సంభవించింది. అదిక పారిశ్రామికోత్పత్తి సంక్షోభానికి' మూలకారణం. "ఆహారోత్పత్తి పడిపోయినందున ఏర్పడిన 'వ్యవసాయ' సంక్షోభం" అని ప్రణాళికా సంఘం పేర్కొంది. వ్యాపార పంటల ధరలు పడిపోయాయి. గ్రామీణ పరిశ్రమలు క్షీణించుటతో కరవు పరిస్థితులు ఏర్పడినవి. ఆహార కొరత, పరిశ్రమలకు ముడిపదార్థాల కొరతతో వ్యవసాయ సంక్షోభం, జాతి సంక్షోభమైంది. విదేశాలపై ఆధారపడుటతో జాతి స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారాలకు ప్రమాదం ఏర్పడింది. భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, రైతులకు అధికోత్పత్తి ప్రోత్సాహాన్నిచ్చి, పరిశ్రమలకు ముడిసరుకులు, పంటల ధరలు పెంచి ప్రజల కొనుగోలు శక్తిని పెంచుట మినహా ప్రభుత్వానికి మరో మార్గంలేదు. దీనితో పాటు బ్రిటిష్ పరిశ్రమలను జాతీయం చేసి, ప్రభుత్వరంగాన్ని విస్తరించి, సామ్రాజ్యవాదుల నుండి భారత పారిశ్రామిక విధానాన్ని రక్షించాలి.

ప్రభుత్వం గుత్త పెట్టుబడిదారి, భూస్వామ్య వర్గాల విధానాలకు వ్యతిరేకంగా రెండు సంవత్సరాలుగ ప్రతిఘటన వేగంగా పెరుగుచున్నది. ఆర్థిక సంక్షోభంతో ధరలు పెరిగి ప్రజల జీవితం దుర్భరమైంది. ప్రతిఘటన వివిధ రూపాలలో వెల్లడైంది. ఈ పోరాటాలలో ప్రత్యేకంగా గమనించవలసింది, ఐక్య కార్యాచరణ, ఐక్య పోరాట సమితుల నిర్మాణ ఉద్వేగం, ఐక్యతా వాంఛ, విచ్ఛిన్న గ్రూపుల, నాయకత్వాలకు వ్యతిరేకంగా ఐక్యతా మార్గాన, ఐక్య పోరాట సమితుల ద్వారా పోరాడే జాగృతి పెంపొందుచున్నది. బరన్‌పూర్ రక్షణ కార్మికుల, అస్సాం తేయాకు కార్మికుల ఉజ్వల పోరాటాలలోను, ట్రాంవే ఛార్జీల పెంపుకు వ్యతిరేకంగా కలకత్తాలో, బెంగాల్ ఆహార పోరాటాలలోను యీ ఐక్యతా వుద్వేగ వాంఛ కన్పడు తున్నది. బీజ ప్రాయంగా వున్న యీ పోకడ, విస్తృతి పొంది సామాన్య లక్షణంగా అభివృద్ధి చెందినప్పుడే దానికి నిర్ణయాత్మక ప్రాధాన్యత నివ్వవలసి వుంటుంది.

విస్తృత ఐక్య కార్మిక, కర్షక ప్రజా పోరాటాల ఫలితంగా కాంగ్రెసులో అంతర్గత వైరుధ్యాలు తీవ్రతరమై కాంగ్రెసు కమిటీలు, మంత్రి వర్గాలు యుద్ధ రంగాలైనవి. కాంగ్రేసు అసెంబ్లీ పార్టీలలో అంతర్గత కలహాలు తీవ్రరూపం ధరించాయి. కాంగ్రెసు బలహీనంగా వున్న రాష్ట్రాలలో దానికి, దాని మిత్రులు మధ్య సంఘర్షణలు తీవ్రమై ప్రభుత్వాల, మంత్రి వర్గాల సంక్షోభానికి దారితీస్తున్నాయి. "ఇవన్నీ నేడు మనం చూస్తున్నది ఆర్థిక సంక్షోభపు పరిపక్వత మాత్రమే కాదని, దానితోపాటు రాజకీయ సంక్షోభపు అభివృద్ధి ప్రాథమిక దశలని నిస్సందేహంగా స్పష్టమైంది. ఎన్నికల ఫలితాలు నేటి ప్రభుత్వంపై ప్రజల విశ్వాసం సడలుట మాత్రమేగాక, ప్రజలు దానిని శత్రువుగ నెంచే విధానక్రమం ప్రారంభమైందని కాంగ్రెసు మైనారిటీ పార్టీగ అసెంబ్లీలలో వుండుటయేగాక, రాజకీయ సంక్షోభం వుప్పెనలాగ లేచే అవకాశముందనుట స్పష్టం. ఆర్థిక సంక్షోభం తీవ్రమగుటతో అవకాశం వాస్తవమగుట, ప్రభుత్వ ఆర్థిక రాజకీయ విధానాలపై వైఫల్యంతోపాటు ప్రజోద్యమాల వెల్లువ విజృంభించుట చూడగలము". కాంగ్రెసు నాయకత్వంలోని కొన్ని వర్గాలు ఈ పరిస్థితి నెదుర్కొనుటకు, ప్రజా సోషలిస్టు పార్టీతో కొయలీషన్ ప్రయత్నాలు మొదలిడినా విజయాన్ని పొందలేదు. నెహ్రూ ప్రయత్నించినా సోషలిస్టు పార్టీ కార్యకర్తలలో మధ్యంతర నాయకత్వంలో వ్యతిరేకత ప్రబలుటతో సాధ్యం కాలేదు. సంక్షిప్తంగా మధురై పార్టీ కాంగ్రెసు యిచ్చిన అవగాహన యిది.

5) రాజకీయ సిద్ధాంత భేదాభిప్రాయాలు తీవ్రరూపం దాల్చినవి. "1953 నుండి ప్రతి సందర్భంలోనూ రెండు పరస్పర వ్యతిరేకమైన తీర్మానాలు ముందు

కొచ్చేవి" అని సుందరయ్య, "రెండు దృక్పథాలు మధురై 3వ, పార్టీ కాంగ్రెసులో సంఘర్షించాయి" అని నంబూద్రిపాద్, "హరీ పోలిట్ సలహాను నిరాకరించి, కాంగ్రెసు పాలన దాని వర్గ రాజకీయ విధానాలను వ్యతిరేకించు విధానాన్ని కొన సాగించారు" అని వ్యాఖ్యానించారు. "నూతన రాజకీయ విధానాన్ని రూపొందించు నపుడు అభిప్రాయ భేదాలు వచ్చుట సహజమేనని" అధికారి అన్నారు. అంతేకాక "మధురై పార్టీ కాంగ్రెసులో పిడివాదమని, మితవాదమని నింద ప్రతినిందలు జరిగాయి" అని వివరించారు. అయితే యీ రాజకీయ విధానాలపై సిద్ధాంత చర్చలు ఎలా పరిణామం చెందుతున్నది సుందరయ్య "చివరకు యేదో రాజీ తీర్మానం వెలువడేది. ఈ తీర్మానం యెలా వుండేదంటే ఎవరికివారు తమకు నచ్చిన భాష్యం తాము చెప్పుకొనేటట్లుగా వుండేది. ఆ మహాసభలో మేము ప్రతిపాదించిన తీర్మానంగాక, కేంద్రకమిటి తరపున అజయ్‌ఘోష్ ప్రవేశపెట్టిన తీర్మానం, అటు వైపున రాజేశ్వరరావు, జోషి కలసి ప్రవేశపెట్టిన తీర్మానం వున్నా, రాజేశ్వరరావు తీర్మానానికి మూడోవంతు మద్దతు వుంది. మా తీర్మానానికి అంతే. ఇక అజయ్‌ఘోష్ ప్రవేశపెట్టిన తీర్మానానికి అంతే బలం వుంది. ఏ రెండు గ్రూపులైనా కలిస్తే తప్ప మూడో దానిని ఓడించలేని పరిస్థితి"ని అద్దంపట్టినట్టు వివరించారు. రాజేశ్వరరావు, జోషిల తీర్మానం వీగిపోయింది. ఒక రాజీ తీర్మానం కాంగ్రెసు మెజారిటీ ఆమోదాన్ని పొందింది. ఆ తీర్మానం సుందరయ్య చెప్పినట్లు వివిధ దృక్పథాలవారు, తతతమ దృక్పథాలకు అనుకూలంగా వ్యాఖ్యానించుటకు వీలుగా వుంది. ఆచరణలో ఎవరి మార్గాన్ని వారు అనుసరించారు. అవగాహనలు వేరు, ఆచరణ విధానాలు వేరు, అనుభవాలు వేరు, వీటికి తోడు ఉద్యమాల అనమానతల కారణంగా రెండు పరస్పర విరుద్ధ దృక్పథాలు రూపొంద నారంభించాయి.

ఈ విధంగా రెండు దృక్పథాల కర్తలు తమ తమ దృక్పథాలకు అనుకూలంగా వ్యాఖ్యానించుకొనుట వీలుగా వున్న చిత్తు తీర్మానం, రాజకీయ సిద్ధాంత ఐక్యత, నిర్మాణ ఐక్యత పార్టీ కోల్పోయి వున్న దశలో, కేంద్రం యీ రెండిటి విషయంలో మార్గదర్శిక సూత్రాలను యివ్వజాలని స్థితి, ఆత్మ విమర్శనను వాయిదా వేసి, పార్టీలో అన్ని స్థాయిల నాయకత్వాలపై కార్యకర్తలు వారి అభిప్రాయాలను వెలిబుచ్చుటయేగాక స్వేచ్ఛగా, నిర్భయంగా. విమర్శలను, ఫిర్యాదులను ప్రోత్సహించాలనే సూచనలను కేంద్రసమితి విస్తృత సమావేశం యిచ్చింది. ఫలితంగా క్రింది స్థాయినుండి పైస్థాయి వరకు నాయకత్వాలపై తీవ్ర విమర్శలతోపాటు, నిర్మాణ, ఆచరణతోపాటు విశృంఖలంగా కొనసాగి, నింద ప్రతినిందల స్థితికి జారిపోయి పార్టీలో అంతర్గత సిద్ధాంత బృహత్చర్చతోపాటు, ఆత్మ విమర్శనలేని విమర్శనా కార్యక్రమము, పార్టీ విధానాల గాడిని వప్పి జరిగింది. అన్ని స్థాయిలలో పార్టీ నాయకత్వాలపై విశ్వాశం సడలిపోయింది. పార్టీ పుక్కు శిక్షణ ఓటలువారి

చిన్నాభిన్నమైంది. "ఇటీవల మన పార్టీలో జరిగిన చర్చల పద్ధతి ఒక గాడి తప్పిన పద్ధతి. ఇలాంటి చర్చలు ప్రపంచంలో ఏ పార్టీలో జరగలేదు. మన అంతరంగిక చర్చలు పార్టీ నిర్మాణ సూత్రాలను దాటిపోయాయి" అని అజయ్‌ఘోష్ వాస్తవికతను ప్రతిబింబించే వ్యాఖ్యానం చేసారు.

## (2)

6) కమ్యూనిస్టు పార్టీలో తీవ్రతరమౌతున్న భేదాభిప్రాయాలను జూన్ 1955 కేంద్రసమితి సమీక్షించి, పార్టీ కాంగ్రెసు పూర్వ చర్చలకై చిత్తు రాజకీయ తీర్మానాన్ని, పార్టీ 1951 కార్యక్రమానికి కొన్ని సవరణలను ప్రతిపాదించుతూ కేంద్రసమితి చర్చల నిమిత్తం సెప్టెంబరు 1955 లో మరో పత్రాన్ని విడుదల చేసింది. వీటితో పార్టీలో అంతర్గత రాజకీయ సిద్ధాంత, వ్యూహ, కార్యక్రమాలపై బృహత్చర్చ ప్రారంభమైంది.

i) స్వాతంత్ర్య సమస్యపై పార్టీ అంతరంగిక చర్చలలో మూడు ధోరణులు వ్యక్తమైనాయి.

కేంద్ర సమితి జూన్ 1955 తీర్మాన అవగాహనలను 4వ, పార్టీ కాంగ్రెసు నిర్మాణ నివేదికలో చెప్పబడిన విధంగా ఒకవర్గం "అతివాద" దృక్కోణాన్నుండి, మరోవర్గం "మితవాద" దృక్కోణాన్నుండి దాడిచేసాయి. అయితే యీ "అతివాద" "మితవాద" రెండు ధోరణులు మైనారిటి ధోరణలే. కేంద్ర సమితిలో మెజారిటి సభ్యులు "మధ్యేమార్గ" ధోరణికి మొగ్గు చూపారు. ఈ అవగాహన అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమవైఖరికి దగ్గరగా వుంది.

అతివాదులు స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారాలపై మార్క్సిస్టు ఆర్థిక కొలమానాన్ని నవరించుట తప్పని, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో గల ఆర్థిక, ద్రవ్య, సైనిక సంబంధాలతో పాటు గల కామన్‌వెల్తు 'బ్రహ్మముడి' విడిపడలేదని, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి భారత బూర్జువావర్గానికి గల వైరుధ్యం నిర్ణయాత్మక అంశం కాదని, రెండిటికి గల "పొత్తు" నిర్ణయాత్మక పాత్ర వహించుచున్నందున బ్రిటిష్ సామ్రాజ్యవాదం దాని దేశీయ పొత్తు దారులకు వ్యతిరేకంగా సంపూర్ణస్వాతంత్ర్యానికై పోరాడుట భారతవిప్లవ మౌలిక కర్తవ్యమని వాదించారు. కొన్నేళ్ళ తరువాత పై అవగాహన "అతివాద పొరపాటుగ "బర్ద్వాన్‌ప్లీనం లేఖలో సరిచేసుకొన్నారు.

మితవాదులు భారతదేశం స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారంగల,సర్వసత్తాక రిపబ్లిక్, శాంతి, ప్రపంచయుద్ధ వ్యతిరేక విదేశాంగ విధానంతో స్వాతంత్రాన్ని పటిష్టం చేసుకొంటున్నది. దేశీయార్థిక విధానాలను సామ్రాజ్యవాద, భూస్వాములు వ్యతిరేక, పెట్టుబడిదారి మార్గాభివృద్ధిలో సాగిస్తున్నది. భారత నిజజీవితంలోని అభివృద్ధి కార్యక్రమాలను, స్వతంత్ర పందాలోవి పురోగమనాన్ని పరిగణించి, రాజకీయ

స్వాతంత్ర్యాన్ని బలపరచక, పరిరక్షించక, ఆర్థిక, విదేశాంగ విధానాలలోని అభ్యుదయకరవిధానాలను, స్వతంత్ర ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధిని వుపేక్షించుట, వ్యతిరేకించుట సరికాదన్నారు. మితవాదులలోని కొన్ని వర్గాలు కాంగ్రెసుతో కొయలీషన్ ప్రభుత్వాలవరకు ఆలోచించుట ఎంత అసంగతమో ట్రావెన్కూర్-కొచ్చిన్, ఆంధ్ర ఎన్నికల, తదనంతర ఘటనల చరిత్ర స్పష్టం చేసింది.

ఈ ఉభయ 'అతివా', మితవాద దాడులను తట్టుకొంటూ, వాటిని సమన్వయం చేసుకొంటూ, వొక రాజకీయవిధానాన్ని తక్షణ ఆచరణ కార్యక్రమాన్ని రూపొందించి, మారుతున్న పరిస్థితులలో దేశ ఆర్థిక, పారిశ్రామిక, వ్యవసాయ మార్పుల అవగాహనతో "మధ్యేమార్గవాదం" పురోగమించవలసి వచ్చింది. సహజంగానే యీ మధ్యేమార్గం బలహీనత, వూగిసలాటలకు లోనైనా ప్రజాపోరాటాలు వడిపి పాక్షికవిజయాలను సాధించింది. మధ్యేమార్గవాదం భారతదేశం స్వేచ్ఛ, స్వాతంత్ర్య, సార్వభౌమాధికారాలను పొందిందని, కాని అర్థవలస, ఆధారిత ఆర్థిక విధానంలో వుందని బ్రిటిష్‌కామన్‌వెల్తు బంధనాల నుండి బయటపడి, వారి అన్ని పరిశ్రమలను, ఆర్థికప్రయోజనాలను జాతీయంచేసి, స్వతంత్ర ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధి కావించి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొందవలసి వుందనే అవగాహన చేబట్టి, పార్టీని విచ్ఛిన్నంనుండి కాపాడి చారిత్రక పురోగమనాన్ని కొంత సాధించింది.

ii) ప్రభుత్వ వర్గ స్వభావం పార్టీ అంతర్గత చర్చల్లో| యిది రెండో ముఖ్య సమస్య. ఈ సమస్యపై వెలువడిన వివిధ అభిప్రాయాల వాదనలు సంక్షిప్తంగా యీ క్రింది విధంగా వున్నవి.

రాజకీయ విధానపు జూన్ 1955 చిత్తు తీర్మానం "భారత ప్రభుత్వం బడా బూర్జువా నాయకత్వం"లో వుందని చెప్పింది. సెప్టెంబరుకే కేంద్ర సమితి కార్యక్రమానికి సవరణలు ప్రతిపాదించుతూ దానినే కొంత విస్తరించి "బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వమని బ్రిటిష్ సామ్రాజ్యంతో సంబంధం కలిగిన బడా బూర్జువా నాయకత్వంలో వుందని" స్పష్టం చేసింది.

అతివాదులు "బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో సంబంధంకాక 'మిలాఖత్' అయిన బడా బూర్జువా వర్గనాయకత్వంలో యీ బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వముందనే అభిప్రాయాన్ని వెలిబుచ్చి వివరించారు. జాతీయ అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన మార్పులతో 1951 కార్యక్రమంలో కొన్ని సవరణలు ఆమోదించినా, అన్నిమౌలిక విషయాలలో దానినే పునరుద్ఘాటించింది. జూన్ 1955 చిత్తురాజకీయ తీర్మానాన్ని వ్యతిరేకించి ప్రత్యామ్నాయ తీర్మానాన్ని ప్రతిపాదించారు. బడా బూర్జువావర్గం మొత్తంగా సామ్రాజ్యవాదంతో బలమైన సంబంధాలను కలిగివుంది, కాని పొత్తు సంబంధం దానికి మించినది, రెండింటిని కేంద్ర సమితివలె మిళితం చేయరాదన్నారు.

"ప్రభుత్వం భూస్వామ్య, బూర్జువావర్గాలదని" కాని ప్రభుత్వయంత్రాంగంలో రెంటికి గల వైరుధ్యాల ఫలితంగా క్రమేణా బూర్జువా వర్గశక్తులతో కేంద్రీకరించ బడిందని, రాష్ట్రాలలో పొకే మాదిరిగా లేదని" డాంగే అన్నారు. భవానీసేన్ తదితరులు ప్రభుత్వదేశీయ విధానం ప్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేకంగా అభ్యుదయ మార్గంలో వుందని, కమ్యూనిస్టులు, ప్రజాస్వామ్యశక్తుల సంయుక్త ప్రభుత్వపథంలో పురోగమించాలన్నారు. మీనన్ స్వాతంత్ర్యపోరాటంలో జాతీయ బూర్జువా వర్గంనాయకత్వం వహించిందని, అదే ప్రభుత్వంలో ప్రధానశక్తియై ప్యూడలు శక్తులను నిర్వీర్యం చేసిందన్నారు.

ప్రభుత్వం బూర్జువా,భూస్వామ్యవర్గాలదని వివిధాభిప్రాయాలు అంగీకరించినా, నాయకత్వం విషయంలో; బడా బూర్జువా వర్గమా లేక జాతీయబూర్జువావర్గం వహించుచున్నదా అనేదే ప్రధాన భేదాభిప్రాయం. పెక్కుమంది బడా బూర్జువా వర్గం నాయకత్వం వహించుచున్నదని అంగికరించినా, బడా బూర్జువా వర్గం మొత్తంగానా లేక కొన్ని శాఖలా లేక వ్యక్తులా అనే భేదాభిప్రాయాలు కూడ వివరాలలో వెల్లడైనాయి. అదే విధంగా బడా బూర్జువావర్గానికి సామ్రాజ్యవాదానికి గల సంబంధాలలో "పొత్తు" "సంబంధాల"ను పేరుపేరుగ పరిగణించుటలోను, భేదాభిప్రాయాలు వెల్లడైనాయి.

3) భారత ప్రభుత్వ విదేశాంగ విధానంపై కమ్యూనిస్టుపార్టీలోని వివిధ వర్గాలు ప్రధానంగా మౌలిక అంశాలపై ఆమోదాభిప్రాయాలను కలిగియున్నట్లు కన్పించుతుంది. కాని వివరాలలో భేదాభిప్రాయాలు లేకపోలేదు.

సోవియట్ రష్యా, చైనా, తూర్పుయూరపు, తదితర సోషలిస్టు దేశాలు అభివృద్ధికర మార్గాలలో పయనించుట, అనేక వలసలు, అర్థవలసలు విముక్తి అగుటతో ప్రపంచ శక్తుల బలాబలాలలో, సోషలిజం, ప్రజాస్వామ్య శక్తులకు అనుకూలంగా మార్పు వచ్చిందనే చిత్తు కేంద్రసమితి అవగాహనను కమ్యూనిస్టుపార్టీ అన్నివర్గాలు ఆమోదించినట్లు కన్పించుతున్నది. భిన్నాభిప్రాయం వ్యక్తం కాలేదు.

ప్రపంచ యుద్ధప్రమాదం, యుద్ధోన్మాదుల చర్యతో ప్రపంచశాంతి సమస్య కేంద్ర సమస్యఅయిందని, జాతుల స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య పరిరక్షణ శాంతి రక్షణతోనే యిమిడి వుందనే చిత్తు తీర్మాన అవగాహనను అతివాద వర్గం వ్యతిరేకిస్తూ వలసల, అర్థవలసల విముక్తి పోరాటాలు కేంద్రసమస్య అయిందని, వాటి విజయంలోనే జాతుల స్వాతంత్ర్యం,ప్రజాస్వామ్య రక్షణ శాంతి రక్షణతోనే యిమిడి వుందనే అవగాహన కలిగివుంది. పార్టీలోని మిగతా అందరూ మాటలు పేరుపేరుగా వాడినా ప్రధానంగా కేంద్ర సమితి అవగాహనతో యేకీభవించారు.

భారత బూర్జువావర్గం, తనవర్గ ప్రయోజనాలకై యుద్ధ వ్యతిరేక, శాంతి, ఆసియా ఐక్యత మార్గంలో నెహ్రూ విదేశాంగ విధానం సోషలిస్టు దేశాలతో సన్నిహిత సత్సంబంధాలను నెలకొల్పుట, అటంబాంబు నిషేధించాలని, శాంతి వుద్యమాన్ని నిర్మించాలనే ప్రభుత్వ విధానాలకు పూర్తి మద్దతునిస్తూ, ప్రజలను సమీకరించి, భారతదేశం ప్రపంచశాంతివుద్యమంలో ప్రముఖపాత్ర వహించునట్లు చేయాలన్నది తీర్మానం.

అతివాదులు 1947 నుండి భారత ప్రభుత్వ "అలీనవిధానాన్ని", "చైతన్య తటస్థత"ల విధానాలక్రమాభివృద్ధిని, ప్రపంచ సోషలిస్టు, ప్రజాస్వామ్య వ్యవస్థ బలపడుట, అమెరికా ఆశలు కొరియాలో వమ్ము అగుట, భారతపారిశ్రామికీకరణకు బ్రిటన్, అమెరికాలు మొండిచెయ్యిచూపుటతో, వర్గ ప్రయోజనాలకై యీ నూతన శాంతి, సోషలిస్టుదేశాలతో సహకార విదేశాంగ విధానం రూపొందించబడిందన్నారు. "విదేశాంగ విధానంలోని నేటి యీ మార్పు ప్రపంచ శాంతి పరిరక్షణ, పోరాట సహాయాన్నందించుటయేగాక, మన జాతీయస్వాతంత్ర్య పరిరక్షణ బలపడుట కెంతో తోడ్పతుంది. భారత బూర్జువాల ప్రయోజనాలకేగాక, ప్రజానీకమంతటి ప్రయోజనాలను ఆశించివుందనే" వివరణ యిస్తూ, విదేశాంగ విధానాన్ని హర్షించక తప్ప లేదు.

నెహ్రూ ప్రభుత్వ విదేశాంగ విధానం ప్రధానంగా శాంతి విధానమని కేంద్ర సమితి తీర్మానం సరియైనదని పంజాబ్-పెప్సూకమిటి అంటూ,తీర్మానంలో విదేశాంగ విధానంలో "మార్పుగణనీయమైనదని" పేర్కొనగా అజయ్ వివరణ పత్రంలో "గుణాత్మకమైన మార్పుగ" పేర్కొనుటను వ్యతిరేకించింది, రెండిటికిగల శాస్త్రీయ భేదాన్ని వివరించింది.

శాంతి, సహజీవన, తటస్థ అలీనోద్యమాన్ని "భారతదేశప్రత్యేక లక్షణంగా" కేంద్రసమితి తీర్మానం పేర్కొనుట ఆమోదించజాలమని, అన్నినూతనస్వాతంత్ర్య దేశాలకు వర్తిస్తుందని శుక్లా తదితరులు వివరించారు.

ప్రభుత్వ శాంతి, సహజీవన, పంచశీల, తటస్థ అలీన విదేశాంగ విధానం, ఆసియా ఐక్యత, సోషలిస్టు దేశాలతో స్నేహ, సహజీవన విధానంతో పాటు, సామ్రాజ్యవాద, ప్రపంచయుద్ధ, అణుబాంబు వ్యతిరేకత భారత ప్రజనాకర్షించి, దీనిని గుర్తించని కారణంగా కమ్యూనిస్టులు ఆంధ్రలో ఘోరపరాజయం పొందుట జరిగింది.

4) భారత పారిశ్రామిక, ఆర్థిక, ద్రవ్యవిధానాలు ప్రధానంగా బ్రిటిష్ పెట్టుబడి, దేశ, విదేశీయ పెట్టుబడిదారుల ఆధిపత్యంలో పరాధీనంగాను, ఫ్యూడలిజం, ఫ్యూడలు అవశేషాలపై ఆధారపడిన కారణంగా అతి బలహీన పునాదులపై వున్నవి.

బ్రిటిష్ పెట్టుబడిని జాతీయం చేసి, ఫ్యూడలిజాన్ని నష్ట పరిహారం లేకుండా వ్యవసాయంలో రద్దుచేయుటద్వారా దేశపునాదిని ఆర్థికంగా జాతీయం చేయగలమని కేంద్ర సమితి తీర్మానం తెల్పుతుంది. భిన్నాభిప్రాయాలున్న వివిధ వర్గాలు యీ అవగాహనను ఆమోదించాయి

భారత గుత్తపెట్టుబడిదారుల ప్రయోజనాల దృష్టిలోనే ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు రూపొందించబడ్డాయి, అనే అవగాహనను పార్టీలోని అన్ని వర్గాలు ఆమోదించాయి. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో అధికాహారోత్పత్తిని. పరిశ్రమలకు కావలసిన జనపనార, ప్రత్తి అధికోత్పత్తిని సాధించి లోటును భర్తీ చేసింది. సోషలిస్టు దేశాల వొప్పందాలతో ఉక్కు, తదితర భారీ యంత్ర పరిశ్రమల నిర్మాణానికి పూనుకొనుట, సాంకేతిక పరిజ్ఞానాన్ని పొందుట పార్టీలోని అన్నివర్గాల ఆమోదాన్ని పొందింది.

వ్యవసాయ సంస్కరణలను చేబట్టి ఫ్యూడలు, భూస్వామ్య విధానాలను రద్దుచేసి భూములు రైతులకు పంచి, అధికోత్పత్తితో దేశీయ మార్కెట్టును అభివృద్ధి చేసిన పారిశ్రామికాభివృద్ధికి సుస్థిర పునాది యేర్పడగలదు. అట్లుచేయక ఫ్యూడలు, అర్ధఫ్యూడలు భూస్వాములను, పెట్టుబడిదారి ధనిక రైతులుగ, పారిశ్రామికులుగ పరిణామం పొందుటకు వీలుగ నష్టపరిహారాలను, వివిధ సౌకర్యాల అవకాశాలను ప్రభుత్వం కలుగజేయుటను పార్టీలోని అన్ని వర్గాలు గర్హించుతున్నారు.

అతివాదులు, రెండవ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలు సాధ్యమని యెంచుట "వాస్తవికతపై ఆధారపడిన" అంచనా కాదని "ప్రణాళికా చట్రాన్ని పరిశీలించిన తెలుస్తుందని, ఆ కారణంగా పాలక వర్గాల ప్రణాళికను నిర్దిష్ట ప్రత్యామ్నాయ ప్రతిపాదనలతో ప్రజల ప్రయోజనాలకై విమర్శనాత్మకంగా వ్యతిరేకించాలని మైనారిటీ వర్గం నిర్ధారణ చేసింది. అయితే మైనారిటి వర్గమైన అతివాదులు వ్యవసాయ సంస్కరణలు ప్రధానంగా పెట్టుబడిదారి మార్గంలో అధికోత్పత్తిని పెంచే విధానంగా వుండుటను గుర్తించలేకపోయామని ఆమోదించారు.

సామ్రాజ్యవాదుల ఆధిక్యత బొగ్గు, మాంగనీసు, జనపనార, టీ, పెట్రోలియం, రవాణా, యంత్ర, ఇంజనీరింగు పరిశ్రమల కొనసాగుటను గుర్తించలేక పోయామన్నారు.

జాతీయ బూర్జువా వర్గం నెహ్రూ నాయకత్వంలో 1955 లో "సోషలిస్టు నమూనా", "భారతీయ సోషలిజం" అనే సిద్ధాంత భ్రమలను కల్పించుతున్నదని, డాంగే అంటూనే, మరోవైపున నెహ్రూ ఆర్థిక విధానాన్ని బూటకపు సోషలిజంగా త్రోసిపేయరాదని, దానిలో కొన్ని "సుముఖ ప్రధాన లక్షణాలు" వున్నవన్నారు. ఆ ప్రాతిపదికపై జాతీయ బూర్జువా వర్గం దేశంలో మొత్తంగా కొంత పురోగమించ

గలదన్నారు. ఈ పురోగమనం శ్రామికవర్గాలకు బరువు భారం కాకుండా మన పాత్రను మనం నిర్వహించాలనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. పార్టీ శక్తికొలది ప్రభుత్వ ప్రణాళికలకు మద్దతునిస్తూనే శ్రామికుల ప్రయోజనాలకై పోరాడాలని తన అభిప్రాయాన్ని డాంగే వివరించారు. ఒక విధంగా ప్రభుత్వ ప్రణాళికలకు విధానాలకు సాధారణ మద్దతు ప్రకటించారు. సోమనాథ్‌లాహిరి ప్రణాళికా పద్ధతులలో పారిశ్రామికీకరణను బలపరచుట మన కర్తవ్యమన్నారు.

స్థూలంగా కేంద్రసమితి మెజారిటీ తీర్మానం ప్రభుత్వ విధానాలకు, విమర్శనాత్మక మద్దతును, మధ్యేమార్గంగా సూచించగా, మైనారిటీ అతివాద ప్రత్యామ్నాయ తీర్మానవాదులు ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకతను స్పష్టం చేసారు. డాంగే మరి కొందరు పరిమితిలేని సాధారణ మద్దతును, సహకారాన్ని ప్రకటించారు.

(3)

7. ఐక్య సంఘటనా సమస్య, దాని ప్రాముఖ్యత రీత్యా ప్రత్యేకంగా తెలుసుకొనవలసి వుంది. జూన్ 1955 చిత్తు తీర్మానంలోని ఐక్య సంఘటనా ముఖ్యాంశాలు యీ క్రింది విధంగా వున్నవి.

1) కాంగ్రెసు ప్రథమ పంచవర్ష ప్రణాళికతో పరిమిత అభివృద్ధి ముఖ్యంగా ఆహారపదార్థాల అధికోత్పత్తి, శాంతి, యుద్ధ వ్యతిరేకత, పంచశీల పంథాలో విదేశాంగ విధానంతో వివిధ వర్గాల ప్రజలలో తన స్థానాన్ని బలపరచుకొనగలిగింది. ద్వితీయ ప్రణాళికలో పారిశ్రామికీకరణ, అందరికి ఉద్యోగాలు, ఆవడి సోషలిస్టు నమూనా సమాజం అనే ప్రచారంతో మధ్యతరగతి వర్గాలలో మరింత బలపడింది.

ఐక్య సంఘటనా నిర్మాణ ప్రయత్నాలలో ప్రాథమిక చర్య ప్రజా ఐక్యతా నిర్మాణం. ఈ కర్తవ్య నిర్వహణా ప్రయత్నంలో ప్రజాస్వామిక వాదులు కాంగ్రెసులోను, కాంగ్రెసు ప్రభావంలోను అధిక సంఖ్యాకులున్నారని గుర్తుంచుకొనాలి. కాంగ్రెసు ప్రజాసామాన్యం, కాంగ్రెసేతర ప్రజాసామాన్యం మధ్య ఏర్పడిన చీలిక ఐక్య కార్యాచరణ ద్వారానే నివారింపబడగలదు.

వామపక్ష పార్టీలలో కమ్యూనిస్టు పార్టీ తరువాత ప్రజా సోషలిస్టు పార్టీ ముఖ్యమైనది. అనేక ఐక్య కార్మిక పోరాటాలలోను, గోవా విముక్తి పోరాటాలలోనూ, ఈ పార్టీ క్రింది వర్గాలలోని ఐక్యతా వాంఛ స్పష్టమైంది. పార్టీ అగ్ర నాయకత్వం సోవియట్, చైనా, కమ్యూనిస్టు వ్యతిరేకతను అంతర్జాతీయ సోషలిస్టు పార్టీ ప్రభావాలకు లోనై కొనసాగించుటను మరువరాదు.

ప్రజలను మత ప్రాతిపదికపై చీల్చే జనసంఘం, రామరాజ్య పరిషత్, హిందూ మహాసభలతో ఐక్య సంఘటనా నిర్మాణానికి కమ్యూనిస్టు పార్టీ ప్రయత్నించదు. ఆ పార్టీల వెనుకనున్న ప్రజా సామాన్యంతో ఐక్య ప్రజా కార్యాచరణకు ప్రయత్నిస్తుంది.

అన్ని వర్గాల ముఖ్యంగా కార్మిక, కర్షక పాక్షిక పోరాటాలలో ప్రధానంగా ప్రజలలోగల చీలికలను అధిగమించి. యీ పోరాటాలు ప్రత్యేక వర్గపోరాట దశ నుండి, రాష్ట్ర, దేశవ్యాపిత విస్తృత పోరాటాలుగ పెంపొందించి, దేశవ్యాపిత ప్రజోద్యమాన్ని నిర్మించ కమ్యూనిస్టు పార్టీ ప్రయత్నిస్తుంది. దేశ రాజకీయ శక్తుల బలాబలాలలో మార్పుకు ప్రయత్నిస్తుంది.

పార్టీ తక్షణ ప్రజా కోర్కెలపై జరిపే పోరాటాలు అతి ప్రధాలమైనవి, అవే ప్రజాచైతన్యాన్ని పెంపొందించు మార్గాలు, ప్రజలు చైతన్యవంతులు, నైతికంగా పెరిగి పోరాడుతారు. ప్రజా సానుభూతిని పొందగలుగుతారు. ఈ పోరాటాలే ఐక్య ప్రజా సంఘాల నిర్మాణానికి దారితీస్తాయి. ఇవే ప్రజాస్వామ్య వుద్యమానికి ప్రాణప్రదమైనవి. ఇవి ఐక్య కార్యాచరణ, ఐక్య ప్రజా పోరాటాలుగ రూపొంది, ఐక్య సంఘటనా నిర్మాణానికి తగిన పరిస్థితులను సృష్టిస్తాయి.

కార్మికవర్గం ప్రత్యర్థి ట్రేడుయూనియన్లలో చీల్చబడి వుండుట, కార్మికులలో వర్గ చైతన్యం శూన్యమగుట, విస్తృత ప్రజాస్వామ్య సమస్యలైన శాంతి, పౌరహక్కులు, రైతులు తదితర వర్గాల కోర్కెలపై కనీస ఆచరణ ఐక్యతనైనా సాధించజాలక పోవుట ప్రజాస్వామ్య ఐక్య సంఘటనా నిర్మాణానికి ప్రధాన బలహీనత యని కేంద్రసమితి జూన్ 1955 తీర్మానం స్పష్టం చేసింది.

నేటి పరిస్థితులలో ప్రజాస్వామ్య సంఘటన అతిక్లిష్ట సమస్యయైనా, ప్రజా తక్షణ సమస్యలపై ఐక్య ప్రజాకార్యాచరణ సాధ్యమగుటయేగాక, శక్తివంతమైన ప్రజోద్యమ నిర్మాణంతోపాటు సంఘటనా నిర్మాణం సుసాధ్యం. ప్రజా సామాన్యమే ప్రజా ఉద్యమ ప్రధానశక్తి. అది బూర్జువా వర్గపు కోర్కెలను బలపరచుటయేగాక, విదేశీ పోటీదారులనుండి జాతీయ పరిశ్రమలను కాపాడుతుంది.

కాంగ్రెసు ప్రభావంలోని ప్రజా సామాన్యంతో కలపి, సమిష్టి సమస్యలపై ఐక్య కార్యాచరణకు కమ్యూనిస్టు పార్టీ సంసిద్ధతను స్పష్టం చేసింది. ప్రభుత్వ ప్లానులకు ప్రణాళికలకు మద్దతునిస్తూ, లంచగొండితనానికి. అసమర్ధత, బురాక్రటిక్ అధికార తత్వానికి వ్యతిరేకంగా పోరాడాలి.

ఐక్య కార్యాచరణలో ప్రజోద్యమాల విజృంభణ, ఐక్య ప్రజాసంఘాలు ఏర్పడి, నిలబడి కొన్ని రాష్ట్రాలలోనైనా ఐక్య సంఘటన ఏర్పాటై, పోరాటాల విజయం ఫలితంగా సంయుక్త లేక ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వం ఏర్పాటుకు అవకాశాలు కలుగవచ్చు.

కమ్యూనిస్టు పార్టీ ధ్యేయాలు, విధానాలు, ప్రజల దేశ ప్రయోజనాలననుసరించియే వున్నవి. ఈ వాసవ జాతీయ కర్తవ్య నిర్వహణతో అన్ని దేశభక్త విప్లవ వర్గాల సహకారం లభించగలదనే విశ్వాసం పార్టీకి వుందని తీర్మానం తెలిపింది.

అజయ్‌ఘోష్ "జనత ప్రజాస్వామ్య పోరాటానికి, జాతీయ ఆర్థిక విధానాన్ని బలపరచుటకు, జాతీయ ఐక్యతా నిర్మాణానికి, ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణానికి ఒకే ఒక మహత్తర పోరాటం" అని అన్నారు. అంతేగాక ప్రజాస్వామ్య సంఘటనలో కార్మికవర్గ నాయకత్వ నిర్మాణానికి గూడ అదే పోరాటం". పోరాటం ఒక్కటే ఫలితాలు అనేకం.

ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతకై, కాంగ్రెసును అనుసరించే ప్రజా సామాన్యానికి, ప్రజాస్వామ్య శక్తులను కమ్యూనిస్టు పార్టీని మొత్తం వామపక్ష శక్తుల ననుసరించే ప్రజా సామాన్యానికి మధ్యగల చీలికలు ప్రధానమైనవి. వీటిని అధిగమించుట ప్రథమ కర్తవ్యం.

భారత విదేశాంగ విధానం స్పష్టంగా సామ్రాజ్యవాద యుద్ధవ్యతిరేక, శాంతి, పంచశీల విధానం, దేశీయవిధానం బ్రిటిష్ వ్యతిరేక, భూగిసలాట విధానం, భూస్వాములు వ్యతిరేక పెట్టుబడిదారి వ్యవసాయాభివృద్ధి విధానము.

తక్షణ కర్తవ్యం ఆచరణలో విస్తృత ఐక్య కార్యాచరణను, అన్ని పార్టీల, కాంగ్రెసుతో సహా, అనుసరించే ప్రజాసామాన్య కోర్కెల కొరకై ప్రజోద్యమాన్ని నిర్మించుట, అభ్యుదయ విధానాలకై ఆందోళన గావించుట. జనత ప్రజాస్వామ్య నిర్మాణావసరాన్ని నొక్కి తెలియజేయుట ధ్యేయం.

పార్టీ కార్మిక, కర్షక, మధ్యతరగతి కోర్కెలతోపాటు ధనికరైతుల, జాతీయ బూర్జువా వర్గ, చిన్న పరిశ్రమల కోర్కెలకై ఆందోళన జరుపుతుంది.

పార్టీ ప్రజాస్వామ్య సంఘటన, ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వం అనగా కేంద్రసమితి అవగాహనలో ప్రజాస్వామ్య పార్టీల సంయుక్త సంఘటన, అట్టి సంఘటనా ప్రభుత్వం ఏర్పాటు చేయ ప్రయత్నిస్తుంది.

మొత్తంమీద ఐక్య సంఘటన, ఏ ఏ వర్గాల సంఘటన అనే వివరణ, అదే విధంగా ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వం, ప్రజాస్వామ్య పార్టీల సంయుక్త ప్రభుత్వం అనే అస్పష్టతలు చోటు చేసుకొన్నాయి.

2) కమ్యూనిస్టు పార్టీలోని అతివాదులు జూన్ 1955 కేంద్రసమితి రాజకీయ తీర్మానంపై తమ అభిప్రాయాలను వివరణ పత్రం; ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానాలలో వివరించారు. క్లుప్తంగా ఐక్య సంఘటనపై వారి అవగాహన ఈ క్రింది విధంగా వుంది.

పార్టీలోని 'అతివాదులు' జాతీయ బూర్జువా వర్గం, మధ్యతరగతి బూర్జువా వర్గం మాత్రమేగాక బడా బూర్జువా వర్గంలోని అత్యధిక భాగం, కార్మిక, కర్షకులు, మధ్యతరగతి వర్గాలతో కలసి జనత ప్రజాస్వామ్య సంఘటనను ఏర్పాటు చేయాలని స్పష్టం చేసారు. కారణం సంక్షోభం, సంఘర్షణలు, వైరుధ్యం, పెరిగినకొలది, జాతీయ బూర్జువా వర్గానికి సామ్రాజ్యవాదానికి మధ్య సంఘర్షణలు వైరుధ్యం తీవ్ర

మైనకొలది, విప్లవ పోరాటాల పురోగమనంతో బడా బూర్జువా వర్గంలో అధికార నాయకత్వం వహించే ప్రభుత్వంలో చీలికలేర్పడి, అత్యధిక భాగం విదేశ సామ్రాజ్య వాదంతో పొత్తును వ్యతిరేకిస్తూ తటస్థంగానో లేక ఐక్య సంఘటనలో భాగస్వామి గానో వుంటుంది.

ఐక్య సంఘటనలలో దీర్ఘకాల లక్ష్యంతో వ్యూహాత్మక ఐక్య సంఘటన, తక్షణ సమస్యల పోరాటాలలో "ఎత్తుగడల ఐక్య సంఘటన" అని రెండు సంఘటన లను వివరించారు. కార్యక్రమంలో సూచించబడినది విప్లవదశ కంతటికి సంబం ధించినది, వ్యూహాత్మక ఐక్య సంఘటన వివిధ వర్గాల దీర్ఘకాల సంఘటన. నేడు తక్షణ సమస్యలపై ప్రజా ఐక్య కార్యాచరణ ద్వారా యేర్పడే ఐక్య సంఘటనలు తాత్కాలికమైనవేగాక యేవొక్క వర్గ ఐక్యసంఘటనమైనా కావచ్చు, అది ఆ పోరాటంలో అవలంబించవలసిన ఎత్తుగడలలో భాగమైన ఐక్యసంఘటన లేక వివిధ వర్గాలు ఆ ప్రత్యేకపోరాటానికై యేర్పరచే ఎత్తుగడల ఐక్యసంఘటన కావచ్చు అని వివరించారు.

ఆచరణలో వాస్తవంగా దీర్ఘకాల, విప్లవదశకంతటికి సంబంధించిన వ్యూహా త్మక ఐక్యసంఘటనను తక్షణ సమస్యలపై లేక ఎన్నికల పోరాటానికై యేర్పరచే ఒప్పందాల ఐక్యసంఘటనలను కలగాపులగం చేసి గతంలో గందరగోళ పరచారు. దానికి స్పష్టత చేకూర్చారు.

వివిధ రాష్ట్రాలలో ఎన్నికలలో యేర్పడిన ఐక్యసంఘటనలు ప్రధానంగా కాంగ్రెసును వోడించుటకుగాను యేర్పడినవి. స్థానిక సంస్థలలో పౌరసంఘటనలు యేర్పడినవి. వీటితోపాటు సంఘటనలకు అవకాశం లేనపుడు ఎన్నికల ఒప్పందాలు, స్థానాల సర్దుబాటులు జరిగాయి.

ట్రావెన్కూర్-కొచ్చిన్లలో ఎన్నికల అనంతరం, ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని యేర్పాటు చేయ కమ్యూనిస్టుపార్టి ప్రయత్నించగా, కేరళసోషలిస్టుపార్టి వొక్కసోష లిస్టు ప్రభుత్వాన్ని యేర్పాటు గావించాలని వ్యతిరేకించింది.

పార్టీలోని 'అతివాదులు' ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని కమ్యూనిస్టుపార్టి నాయకత్వంలోనే, అవకాశం వున్నచోట్ల యేర్పాటు చేయాలని, అవకాశం లేనిచోట్ల మార్చి 1952 కేంద్ర సమితి, నిర్ణయానుసారం, కమ్యూనిస్టుపార్టి అసెంబ్లీలలో స్వతంత్ర ప్రతిపక్షపార్టీగ వ్యవహరించాలన్నారు. అయితే ఒకసారి ఐక్యసంఘ టనా ప్రభుత్వం యేర్పాటుకు పార్టీ ప్రయత్నించి విఫలమైన వెంటనే, అసెంబ్లీ ఐక్య సంఘటనా పార్టీనుండి విడిపోయి స్వతంత్ర పార్టీగ వ్యవహరించిన ప్రజలు ఐక్య సంఘటనను పార్టి విచ్ఛిన్నం చేసినదిగా యెంచుతారు, ఎత్తుగడలరీత్యా పొరపాటు అగుతుందని వివరించారు. అంతేగాక అసెంబ్లీలలో పాలకవర్గాలు, ప్రతిపక్షాల బలా బలాలతూకం మార్పులకు లోనగుతు, ప్రభుత్వం పడిపోవు పరిస్థితులు యేర్పడు

అవకాశాలున్నప్పుడు ఐక్య సంఘటనను కొనసాగించవలసిన అవసరముంటుంది. ఆ కారణంగా మార్చి 1952 కేంద్ర సమితి నిర్ణయాన్ని మార్చుకొనుట జరిగిందని వివరించారు.

కేంద్రంలో లోక్‌సభ, రాజ్యసభలలో ఐక్య సంఘటనా ప్రయత్నాలు అది సాధ్యం కానప్పుడు ఎప్పటికప్పుడు సమస్యలపై ఒప్పందాలతో కమ్యూనిస్టులు సానుభూతిపరులతో యేర్పడిన కమ్యూనిస్టు బ్లాక్ పనిచేసిన తీరు వివరించారు.

3) ప్రజా సోషలిస్టు పార్టీ 1952 లో కమ్యూనిస్టులతో యే విధమైన సంబంధాన్ని పెట్టుకొన నిరాకరించి ఘోరంగా ఓడిపోయిన దృష్ట్యా 1954 లో ఏ విధంగానైనా ఎన్నికలలో ఒప్పందం కుదుర్చుకొని సాధ్యమైనన్ని ఎక్కువ సీట్లు సంపాదించ ప్రయత్నించింది. ప్రజాస్వామ్య ఐక్య సంఘటనా పెత్తుగడగా కమ్యూనిస్టు పార్టీ పట్టంతాను పిళ్ళే నాయకత్వంలో ఐక్య సంఘటన ప్రభుత్వ నిర్మాణానికి సంసిద్ధతను ప్రకటించింది. పిళ్ళే మాత్రం విస్తృత ఐక్య వామపక్ష సంఘటనలో చేరుటకుగాని, గెలచిన కమ్యూనిస్టులతో కలసి ప్రభుత్వమేర్పాటు చేయుటకుగాని, వ్రాతపూర్వకంగా అంగీకారం తెలుపలేదు. కాని తదుపరి ప్రజా స్వామ్య శక్తులు విజయం పొంది మెజారిటీ సంపాదిస్తే కమ్యూనిస్టులతో కలసి వామపక్ష సంఘటనా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగలనని ఎన్నికల బహిరంగ సభలో స్పష్టం చేసారు. ఫలితంగా కమ్యూనిస్టులు తమ బలమైన అనేక స్థానాలను త్యాగంచేసి, ప్రజా సోషలిస్టు పార్టీ అభ్యర్థులను నిలబెట్టుటకు అంగీకరించారు. అదే విధంగా రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీ అభ్యర్థుల విషయంలో వ్యవహరించారు.

ఎన్నికలలో 118 సభ్యులుగల అసెంబ్లీలో కాంగ్రెసు 46 స్థానాలను మాత్రమే పొందింది. ప్రజాస్వామ్య వామపక్షాల ఐక్య సంఘటనా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుటకు పట్టంతాను పిళ్ళేకు మంచి అవకాశాలున్నవి. కాని కేంద్ర ప్రజా సోషలిస్టు పార్టీ నాయకత్వం కాంగ్రెసు నుండి వచ్చిన వాగ్దాన బలంతో పట్టంతాను పిళ్ళేను ప్రజా సోషలిస్టు పార్టీ మంత్రి వర్గాన్ని మాత్రమే యేర్పరచ మని ఆదేశించింది. పిళ్ళే ఎన్నికల సభలో చేసిన వాగ్దానం గాలిలో కలసి పోయింది.

ఇక్కడ గుర్తు పెట్టుకొనవలసిన విషయ మొకటి వుంది. మంత్రి వర్గం ఏర్పాటు సంభాషణలలో పార్టీ పిళ్ళేను మూడు కోర్కెలు ఆమోదించమని కోరింది. అవి : 1) ట్రావన్కూర్-కొచ్చిన్ రాష్ట్రంలోని తమిళ ప్రాంతాలను ఆయా రాష్ట్రంలో కలుపు విషయమై ప్రజల ఇచ్ఛాభిప్రాయానికి ప్రాధాన్యతివ్వాలి. 2) సాధారణంగా ఏకగ్రీవంగా నిర్ణయాలు లేక మూడింట రెండువంతుల మెజారిటీ నిర్ణయాలు గైకొనాలి. 3) మంత్రి వర్గంలో అన్ని పార్టీల ప్రతినిధులు వుండాలి

కాబినెట్‌లో ప్రజా సోషలిస్టు మెజారిటీ వుంటుంది. ముఖ్యమంత్రి ప్రజా సోషలిస్టు పార్టీకి చెంది వుండాలి. రెండు రెవెన్యూ, లేబరు ప్రధానశాఖలు కమ్యూనిస్టు పార్టీకి యివ్వాలి.

ప్రజా సోషలిస్టు పార్టీ విద్రోహ అనంతరం, కమ్యూనిస్టు పార్టీ ప్రతిపక్ష పార్టీ అయింది.

కేంద్ర సమితి, కమ్యూనిస్టు పార్టీ ప్రజాసోషలిస్టు పార్టీ తోకపట్టుకు పోయిందని, మొదటినుండి సమస్యలను ప్రజల ముందుకు తీసుకొనివెళ్ళిన, ప్రజా వొత్తిడి యెక్కువైై అంత తేలికగా ద్రోహం జరిగేది కాదని విమర్శించింది. అయితే, ఆంధ్రా అనుభవాల తరువాత ఐక్య ప్రజాస్వామ్య వామపక్ష సంఘటనను నిర్మించుటలో ఆ పార్టీ చూపిన ఆతురత సీట్ల విషయంలో చేసిన త్యాగాలు సరియైనవని ఆమోదించగలము. ఎంత త్యాగం చేయాలని నిర్ణయించవలసింది స్థానిక కమిటీలే యని ఆ సంఘటన ఏర్పడకుండిన కమ్యూనిస్టు పార్టీ గూడ యిన్ని సీట్లను సంపాదించగలిగేది కాదని స్పష్టం చేసారు.

అంతేగాక కేంద్ర సమితి ఎన్నికల సమీక్ష సరిగా చేయలేదని, పాఠాలు నేర్చుకొనలేదని, ఐక్య సంఘటనల ఎత్తుగడలపైగాని, ఐక్య సంఘటనా ప్రభుత్వ నిర్మాణ విషయమైగాని, తదితర విషయాలపై కేంద్రం అధ్యయనం చేయలేదు, సూచన లివ్వలేదని విమర్శించారు.

ఐక్య సంఘటనా నిర్మాణాలు, భవిష్యత్తులో ఆయా పార్టీల అఖిల భారత కేంద్రాల ఆమోదం పొందకుండా చేబట్టరాదనే పాఠం పార్టీ నేర్చుకొనుట జరిగింది.

4) కమ్యూనిస్టు పార్టీతో కలసి, ఆంధ్ర రాష్ట్రం యేర్పడిన నాటినుండి, మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయుటకు కృషికార్ లోక్ పార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీ ముందుకు రాని అనుభవంతోను, కేరళలో ప్రజాసోషలిస్టు పార్టీ నాయకుడైన పట్టం విద్రోహ అనుభవంతోను, ఎన్నికలలో ఐక్య సంఘటన ఏర్పాటుకు, ఎన్నికల అనంతరం సంఘటనతోను, కమ్యూనిస్టులతో కలసి మంత్రివర్గం ఏర్పాటు చేయుటకు వ్రాత ఆమోదం వుండాలని పార్టీ షరతు పెట్టగా, ఆ పార్టీలు ఆంధ్రలో నిరాకరించాయి.

కమ్యూనిస్టులు, బలపరచిన అభ్యర్థులు కలసిన కమ్యూనిస్టు బ్లాకు మూడింట రెండువంతులు మెజారిటీ, కనీసం మెజారిటీ సంపాదించగలమని పార్టీ రాష్ట్ర కమిటీ ఏకగ్రీవంగా తప్పుడు అంచనా వేసి, ఘోర పరాజయాన్ని పొందింది.

ఆంధ్రలో భూస్వామ్య, బూర్జువా వర్గాలు కమ్యూనిస్టు బ్లాక్ విజయంతో, అధికార పర్గానికి వచ్చే ముప్పుకు భయపడి, కాంగ్రెసు, ప్రజాపార్టీ కృషికార్ లోక్

పార్టీలు అన్నీ కలసి ఐక్య కాంగ్రెసు పార్టీగ అవతరించాయి. కాంగ్రెసు ప్రతిపక్ష ప్రత్యామ్నాయ సంఘటనను ఏర్పాటు చేయుటతో పార్టీ విఫలమైంది.

కృషీకార్ లోక్ పార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీతో కలసి కమ్యూనిస్టు పార్టీ ఐక్య సంఘటనను ఏర్పరచజాలక పోయినా కనీసం ఎన్నికల సర్దుబాటుల ఒప్పందానైనా చేసుకొనవలసింది. కీలకాంశ మేమంటే ఆ అవగాహన వుంటె ఎన్నికల ఒప్పందాలనైనా చేసుకొని, కనీసం ఆ పార్టీలు కాంగ్రెసుతో కలువకుండా చేయగలిగేది.

ప్రజా పోరాటాలు బలపడి అత్యున్నత దశకు చేరినపుడే జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడగలదని స్పష్టం. అది కార్మిక, కర్షక, మధ్యతరగతి, జాతీయ బూర్జువా వర్గాలుగల వివిధ వర్గాల ప్రభుత్వం. ప్రజల కొరకై మౌలిక సంస్కరణలను ప్రవేశపెట్టి, సోషలిజం కొరకై ప్రజోద్యమాలను అభివృద్ధిపరచే ప్రభుత్వం.

ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వం అంటే జనత ప్రజాస్వామ్య ప్రభుత్వానికి మరోపేరని, అయితే మొదటిది ప్రాథమికదశలో తాత్కాలికమైనదని, ఈ విషయం మధురై కాంగ్రెసులో స్పష్టం చేయబడిందన్నారు. అంతేగాక ఈ నినాదాన్ని ప్రజోద్యమాలు అభివృద్ధి చెందిన ఆంధ్రలో యివ్వదగినదనీ, కేంద్రంలో అసాధ్యమని స్పష్టం చేయబడింది.

అంతేగాక అట్టి ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోనే ఏర్పడాలనుట తప్పనిగూడ అంగీకరించబడింది. దానికి బదులు కాంగ్రెసుకు ప్రత్యామ్నాయ ప్రభుత్వ నినాద మిచ్చుట సమంజసమన్నారు. ప్రభుత్వంలో కమ్యూనిస్టు పార్టీ చేరకుండా వుంటే, పాలక వర్గాలలో మరో భాగపు బూర్జువా ప్రభుత్వ మగుతుంది కాని, మరో వర్గాల కలయిక ప్రత్యామ్నాయ ప్రభుత్వం కాజాలదని స్పష్టంచేసారు. ఆంధ్ర, కేరళలలో ఈ ప్రత్యామ్నాయ ప్రభుత్వ నినాదమిచ్చుట అక్కడవున్న ప్రజోద్యమాల బలాన్ననుసరించి సమంజసమేనన్నారు. అయితే కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో అట్టి ప్రభుత్వ మేర్పడాలనుట తప్పు.

కమ్యూనిస్టు పార్టీ 1942-47 లలో జాతీయ విముక్తి ఉద్యమాలలో నాయకత్వం వహించి నడుపుటలో విఫలమైన నాటినుండి, భారత రాజకీయ పరిస్థితి అట్టి దశకు తిరిగి మళ్ళీ చేరలేదు. బూర్జువా వర్గం, సామ్రాజ్యవాదం నుండి విముక్తి ప్రదాతలుగ ప్రజలముందుకు వచ్చుటకు అవకాశం కలిగింది. ఆ కారణంగానే కేరళలో ప్రజా సోషలిస్టు పార్టీ వాగ్దానాలను భగ్నంచేసి కాంగ్రెసుతో కలువగలిగింది. అదే విధంగా ఆంధ్రలో క్రిషీకార్ లోక్ పార్టీ, కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ, తదితర పార్టీలు, గ్రూపులు చేయగలిగాయి.

అధికార కాంగ్రెసు పార్టీకి వ్యతిరేకంగా, బూర్జువా, భూస్వామ్య పార్టీలు

ఎన్ని రాయితీలు యిచ్చినా ఐక్య సంఘటనలోనికి, కమ్యూనిస్టు పార్టీతో కలసి ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటకు ముందుకురావు. అత్యంత బలోపేతమైన ప్రజా వుద్యమ వొత్తిడితో వచ్చినా; వుద్యమం చల్లబడినంతనే ద్రోహం తలపెట్టుటలో వింతలేదు.

5. ప్రతి దశలో వివిధ సమస్యలపై విస్తృత ప్రజా సమీకరణ, వారి పార్టీల, గ్రూపుల, సమిష్టి కార్యాచరణ, ప్రజోద్యమాలను పెంపొందించినపుడే, ఐక్య సంఘటనా నిర్మాణం, పోరాటాల ఫలితంగా ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వ మేర్పాటు సాధ్యమౌతుంది.

ఆంధ్రలో పాలకవర్గాలలోని గ్రూపులు, కమ్యూనిస్టు పార్టీతో కలసి ఐక్య సంఘటనా ప్రభుత్వం యేర్పాటు చేయుటకు వొత్తిడి చేయగలిగిన బలమైన ప్రజో ద్యమాలు లేనపుడు, బూర్జువాపాలనను ప్రశ్నించగలిగిన శక్తి మాత్రమే వున్న పుడు, బూర్జువా పార్టీయైన కాంగ్రెసు తనస్థితి నెరిగి అన్ని గ్రుపులతో రాజీపడి, వాటిని ఐక్యపరచి పార్టీపై దాడిచేయుటకు సిద్ధపడుతున్నపుడు పాలక వర్గాలను చీల్చే ఎత్తుగడలను అవలంబించివుండవలసింది. కాంగ్రెసు పతనానికి అంత ఆరాటపడవల సిందికాదు. కాంగ్రెసు వోటమి అనంతరం, క్రిషీకార్ లోక్‌పార్టికి, ప్రజాపార్టీకి రాష్ట్రపు మధ్యభాగంలో మన బలమైన ప్రాంతాలలో సైతం మొత్తం మెజారిటీసీట్లను కాంగ్రెసును వోడించుటకై యిచ్చి మనం బలపరచి, పార్టీ 100 సీట్లు దగ్గరదగ్గరిగా పోటీచేసి వుండవలసింది.

కృషీకార్ లోక్‌పార్టీగాని, ప్రజాపార్టీగాని కమ్యూనిస్టులుగల ప్రభుత్వాన్ని యేర్పాటు చేయవని స్పష్టమే. వారు కాంగ్రెసుతోనే వర్గరీత్యా వొప్పందానికి వస్తా రనుట హేతుబద్ధం. అది విఫలమైతేనే కమ్యూనిస్టుపార్టీ మద్దతు మాత్రమే కోర తారు, వారు కమ్యూనిస్టులను మంత్రివర్గంలో చేరమని అనరనుట స్పష్టం. అట్టి పరి స్థితులలో పార్టీ మద్దతునిస్తూ ప్రజలకు పీలైనన్ని రాయితీలను రాబట్టవలసింది.

సంక్షిప్తంగా : 1) వివిధ సమస్యలపై పోరాట ఐక్యకమిటీలను యేర్పరచి అన్నిపార్టీల ప్రజాసామాన్యాన్ని, వర్గాలను, సమీకరించి పోరాటాలు నడపాలి. 2) అసెంబ్లీలలో ప్రతిపార్టీ స్వతంత్రంగా పనిచేస్తూ సమన్వయ కమిటీలు యేర్పరచి పనిచేయాలి. ప్రత్యేక పరిస్థితులలో సంఘటన బ్లాక్ నేర్పరచుట త్రోసిపేయరాదు. 3) శాశ్వత ప్రజాస్వామ్య సంఘటనా కమిటిని యేర్పాటు చేయరాదు. అన్నిపార్టీల గ్రూపుల సమన్వయ కమిటీల నేర్పాటు చేయాలి 4) స్థానిక సంస్థల ఎన్నికలలో కోర సంఘటన కమిటీల నేర్పరచి పార్టీ పేరున పౌరసంఘటన బ్లాకు అభ్యర్థిగా పోటీ చేయాలి.

పైన వుదహరించిన ఎతుగడలనవలంభించుతూ, ప్రధానదాడిని పాలకవర్గం దాని పార్టీయైన కాంగ్రెసుపైనే కేంద్రీకరించాలి. కాంగ్రెసు అన్ని ఎన్నికలలో

వోడించ ప్రయత్నించాలి. బలహీనపడిన కాంగ్రెసు ప్రజలకు రాయితీలను ఎక్కువగా యిస్తుంది.

ఇదీ అతివాదుల ఐక్యసంఘటన అవగాహన, వారు ప్రతిపాదించిన వ్యూహం, ఎత్తుగలు. అయితే యివి ప్రాధానంగా పార్లమెంటరీ ఎన్నికల పోరాటాలకుమాత్రమే పరిమితమైనవనే విషయం స్పష్టం. కార్మిక, కర్షక, మధ్యతరగతి వర్గాల తక్షణ సమస్యలపై జరిపే పోరాటాలలో అనుసరించవలసిన ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటన వ్యూహం, ఎత్తుగడలపై యింతటి అనుభవసహిత వివరణలు యివ్వకుండుట, అట్టి పోరాటాలు, అనుభవాలు లేకుండుటయే అనుకొనవలసి వుంటుంది. కమ్యూనిస్టు పార్టీ మొత్తానికే అట్టి అనుభవం చాలతక్కువగా వుంది. కారణం ఐక్యసంఘటనా నినాదం ప్రచారనినాదంగానే వుండిపోయింది కాని, పోరాటనినాదం కాలేదు. అందువలనే, అనుభవాల శూన్యత అయినా కావాలి లేదా అనుభవాల క్రోడీకరణ జరగకపోవచ్చును.

6. కార్యక్రమం వివరించిన వర్గ సంబంధాలలో, ప్రభుత్వనైజంలో మార్పు లేనపుడు, కార్యక్రమం, వ్యూహం, ఎత్తుగడలు మార్పు చేయవలసిన అవసరంలేదన్నారు డాంగే. ఇంకా, యితరత్రావచ్చిన మార్పులు ప్రజాస్వామిక ఐక్యత ప్రభుత్వ నినాదాన్ని మార్చవలసిన మౌలిక మార్పులు కావన్నారు.

పాలకవర్గాల సంఘర్షణలలో, జాతీయ బూర్జువావర్గం నెహ్రూ నాయకత్వంలో అభ్యుదయ మార్గాన శాంతి, స్వాతంత్ర్యం, జాతీయ ఆర్థికాభివృద్ధికి తోడ్పడుట స్పష్టం.

పరిస్థితులు ప్రజాస్వామ్య ఐక్యత నినాదాన్ని యిచ్చేటంతటి పరిపక్వతకు చేరాయా అనే ప్రశ్న వస్తుంది. గతంలో కంటె మద్రాసు, ట్రావెన్కూర్-కొచ్చిన్ అసెంబ్లీలలో ప్రజాస్వామ్య సంఘటన మెజారిటీ పొందే అవకాశాలు ఎక్కువయ్యాయి. తాత్కాలిక ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వ నినాదం ఆచరణ సాధ్య నినాదం.

సంయుక్త ప్రజాస్వామ్య ప్రభుత్వమనే పేరుతో పార్టీని, కార్మికవర్గాన్ని కాంగ్రెసు కౌగలిలోనికి త్రోసివేయు పోకడ వుంది. దానిని ఐక్యజాతీయ సంఘటన అని కూడ అంటున్నారు. అభివృద్ధి నిరోధకుల కౌగిలినుండి "నెహ్రూని రక్షించాలి, నెహ్రూ నాయకత్వంలో శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం ముందుకు తీసుకొనిపోవాలనే ప్రచారంవుంది. అట్టి విధానం పార్టీని అఘాతంలోనికి నెట్టుతుందని తన విశ్వాసం, అని అన్నారు డాంగే.

7. ఇంద్రజిత్ గుప్తా కేంద్రసమితి తీర్మానం ఐక్యసంఘటనా ఎత్తుగడలు యేవిధానాన్ని, దృక్పధాన్ని యివ్వక యాంత్రికంగా, పేలవంగా పేర్కొందని విమర్శించారు. స్వీయమానసిక ధోరణిలో బడా బూర్జువా వర్గన్ని అభివృద్ధికరమైనది, అభివృద్ధి నిరోధకమైనదని రెండుగా విభజించిందని విమర్శ కొనసాగించారు.

కమ్యూనిస్టుపార్టీ తప్పనిసరిగా, స్పష్టంగా ఐక్యజాతీయ సంఘటనా నినాదాన్నియివ్వాలి. భారతదేశపరిస్థితులు లాంటివి వున్న దేశాలలో నిజమైన దేశభక్తశక్తులన్నిటిని ఐక్యతావాదిగా, నాయకుడుగా, కమ్యూనిస్టుపార్టీ ముందుకు వచ్చి, సామ్రాజ్యవాద, ఫ్యూడలు అడ్డుగోడలను తొలగించి స్వతంత్ర జాతీయాభివృద్ధికి తోడ్పడాలి. సరిగా యీ అర్థంలో ఐక్యజాతీయ సంఘటనా విధానాన్ని ముందుకు తీసుకొని పోవాలి. సంపూర్ణస్వాతంత్ర్యాన్ని పదిలపరచి, పునర్నిర్మాణాన్ని కావించాలి. ఐక్యజాతీయ సంఘటనకు నాయకత్వం వహించేది కార్మికవర్గమే బూర్జువా వర్గం కాదు.

ఐక్యజాతీయ సంఘటనలోని "జాతీయ" అనే పదానికి కొంతమంది వ్యతిరేకించుట వింతగా వుంది. దాని అర్థం బూర్జువావర్గానికి తోక అగుటగా విమర్శించారు. పరిపక్వత చెందిన కమ్యూనిస్టుపార్టీలున్న నేటి ప్రపంచంలో "జాతీయ" పదాన్ని 'వెగటు'గా చూచుట, బాల్యారిష్ట రోజుల పురిటి అవశిష్టంగా ఎంచవలసి వుంటుంది. ఏమిటి 'జాతీయత' అంటే ప్రత్యామ్నాయ విధానాలు, నినాదాలు, ప్రతిపాదనలు, కార్యక్రమాలు, సంపూర్ణ జాతిస్వాతంత్ర్య పరిరక్షణ పునర్నిర్మాణానికి,ప్రజాప్రయోజనాలకు పార్టీ ఐక్యశక్తిగా ముందుకు రావాలి.

సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక పోరాటం అదే కాలంలో బడా బూర్జువావర్గ విధానాలకు, అధిక పన్నులకు, రేషనలైజేషన్, రిట్రెంచిమెంటులకు వ్యతిరేకంగా పోరాడకుండా ఐక్యజాతీయ సంఘటన వుండజాలదు.

ఐక్యజాతీయ సంఘటన చారిత్రికంగా కార్మికవర్గంనుండి, జాతీయ బూర్జువా వర్గంలోని గ్రూపులకు విస్తరించి, ఏకకాలంలో "ఐక్యత," "పోరాటం" రెండూ బూర్జువాలతో కొనసాగిస్తుంది.

వైరుధ్యాలతో సాధారణ ప్రపంచ సంక్షోభం తీవ్రమైనపుడు రాజకీయ ఆర్థిక పరిస్థితి పరిపక్వత చెందినపుడు సోషలిస్టు మార్కెట్టు ప్రత్యేకత మరింత స్పష్టమౌతుంది. ప్రజాపోరాటాలతో ఐక్య జాతీయ సంఘటన నిర్ణయాత్మక విప్లవోద్యమంగా రూపొందుతుందని గుప్తా వివరించారు.

8. భారతదేశం స్వాతంత్ర్యం పొందుట, ప్రపంచ సోషలిస్టు శిబిరం, వనరులు, సోషలిస్టు మార్కెట్టుల భౌతిక పునాదుల కారణంగా స్వతంత్ర ఆర్థికాభివృద్ధి సుసాధ్యం. అందుకు నేడు అన్ని వర్గాల ఐక్య జాతీయ సంఘటనా నినాదం అవసరమన్నారు. పార్టీ కార్యక్రమం దీనిని చూడగలిగిందన్నారు సోమనాథ్‌లాహిరి.

ఈ ఐక్య సంఘటన బడా బూర్జువాలకు లేక వారిలోని కొన్ని వర్గాలకు విస్తరించి వుండుట చరిత్రలో క్రొత్తకాదని మావో చైనాను ఉదహరించారు. అమెరికా-పాకిస్తాన్ ఒడంబడిక; సామ్రాజ్యవాద దురాక్రమణ ప్రమాదం, ఐక్య జాతీయ సంఘటనకు మరింత అనువగు పరిస్థితులను సృష్టించాయని, కృష్ణమీనన్ భారత

దేశం సామ్రాజ్యవాద దేశాలతో చుట్టుముట్టివేయబడి వుందని చెప్పుటను గుర్తు చేసారు.

అంతేగాక, భారత బడా బూర్జువా వర్గంలో "కంప్రెడరీ" నైజాన్ని కలిగిన బూర్జువాలు కొద్దిమంది మాత్రమేనని, ఆ కారణంగా సామ్రాజ్యవాదంతో వారికి గల వైరుధ్యం ప్రధానమైనదని, బలమైనదని, అందుచే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ఐక్య సంఘటనలో వారు చేరుట సుసాధ్యమని, ఐక్య జాతీయ సఘంటన నినాదం బూర్జువాల నుండి చొరవను మనం తీసుకొనుటను సుగమం చేస్తుందన్నారు. మరికొంత వివరంగా కాంగ్రెసుతో ఐక్య సంఘటన ఏమిటని వాదించే వాదనలను ఖండించి సమర్థించారు.

ప్రజలకు వివిధ రాజకీయ పార్టీలపైగల విశ్వాసాన్ని ఐక్య సంఘటన ప్రశ్నించదని, కాంగ్రెసును ఐక్య సంఘటలో భాగస్వామిగ చేయకుండా కాంగ్రెసువాదులు, అనుచరులు చేరే ప్రశ్న వుదయించదు. కాంగ్రెసుపై అనుచరులకుగల విశ్వాసాన్ని అభివృద్ధి నిరోధకులు సమస్యల నుండి దూరం చేయగలుగుతున్నారు. నాయకత్వం అభివృద్ధి నిరోధకమైనంత మాత్రాన సంస్థను ఐక్య సంఘటనలోనికి ఆహ్వానించక పోవుటలో అర్థంలేదు. ఐక్య సంఘటనా ఎత్తుగడల సారం, అభివృద్ధి నిరోధక నాయకత్వాలు ఆయా సంస్థలపై ప్రజలకు గల విశ్వాసాలను అంటిపెట్టుకొని ప్రజలను ఆకట్టుకొని వుండాలనే వారి ప్రయత్నాలను వమ్ము చేయాలి.

9. పాలక పార్టీయైన కాంగ్రెసు నేడు అభ్యుదయకర, అభివృద్ధి నిరోధక విధానాల రెండింటిని ఆచరించుచున్నది. అయినా కాంగ్రెసు రెండుగా యింకా చీల లేదు. అభ్యుదయకర విధానాలను విడనాడమని సామ్రాజ్యవాదం వొత్తిడి తీసుకొని వచ్చినపుడు చీలుటకుగల అవకాశాలు బహిర్గతమౌతవని సత్యనారాయణ తదితర ఆంధ్ర నాయకులు తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు.

పాలక పార్టీయైన కాంగ్రెసు ప్రజా వ్యతిరేక విధానాలను అనుసరించుచున్నందున విడిపోయి ఏర్పడిన ప్రజా సోషలిస్టు పార్టీ, దాని కార్యకర్తలు అనుసరించే విధానాలకు, నాయకత్వాలు చేసే ఆలోచనా విదానాలకు ఆచరణకు అంతరాలు పెరిగినందున, ప్రజా సోషలిస్టు పార్టీగ, సోషలిస్టు పార్టీగా చీలిపోయింది. ఈ పార్టీల నాయకత్వాలు సోవియట్, చైనా, కమ్యూనిస్టు వ్యతిరేక భావాలు కలిగివున్నా, వీరి ననుసరించే ప్రజా సామాన్యం సోషలిస్టు, ప్రజాస్వామ్య భావాలు గలవారని మరువరాదు. కనీస కార్యక్రమంపై వారితో ఐక్యమయ్యే ప్రయత్నం చేస్తూనే, వారి నాయకత్వ అవకాశవాద విధానాలను తీవ్రంగా విమర్శించాలి.

వివిధ రాష్ట్రాలలో చీలిన గ్రూపులు అనేకం, వామపక్ష శక్తులుగ వున్నవి. కొన్ని మార్క్సిజం, సోషలిజంలపై వాస్తవంగా విశ్వాసంగలవి వున్నవి. నాయక

త్వాలు అవకాశవాదులైవున్నా ఆయా ప్రజాసామాన్యాన్ని ఐక్య సంఘటనా కార్య క్రమంలో సమీకరించే ప్రయత్నం చేయాలి.

కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కర్తవ్యం కాంగ్రెసులోని, బయటా వున్న అన్ని అభ్యుదయకర శక్తులను కనీస కార్యక్రమంపై ఐక్య కార్యాచరణకై సమీకరించి, పోరాటాల ద్వారా ఐక్య సంఘటనను నిర్మించాలి. ప్రభుత్వ ప్రణాళికల అమలులో చొరవను ప్రదర్శించి, అవి ప్రజలకు ఉపయోగపడునట్లు చేయాలి. విస్తృత ఐక్య సంఘటనను ఏర్పరచి, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలైన సామ్రాజ్యవాద, ఫ్యూడలు అవశేషాలను రూపుమాపి, దున్నేవానికే భూమిని యివ్వాలని ఆంధ్ర నాయకులు స్పష్టం చేసారు.

10. పంజాబ్-పెప్సూ కమిటి, ప్రజాస్వామ్య ప్రజానీకంలోని అత్యధికులు కాంగ్రెసునే అనుసరించుతున్నారనే వాస్తవాన్ని పార్టీ, సెక్రేటరియట్ పొంగబెత్తు వైఖరితో నిర్లక్ష్యం చేసిందన్నది. నేడు వీరితో ఐక్యత అమూల్యమైనది. ఎక్కడ సమిష్టి పోరాటాలలో కాంగ్రెసు అనుచర ప్రజాసామాన్యం సమీకరించబడినదో అక్కడ ప్రజా వుద్యమం, విస్తరించి, వేగోధృతిని, పోరాట పటిమను సంతరించు కొంది.

కేంద్రసమితి చిత్తు తీర్మానం యాంత్రికంగా ప్రజాస్వామ్య ప్రతిపక్షాలను అనుసరించే ప్రజలని, కాంగ్రెసును అనుసరించే ప్రజలని తప్పుగా ప్రజలను రెండు విభాగాలు చేసింది. ఈ సూత్రీకరణ తప్పుదారిని పట్టించి కాంగ్రెసు తోకపట్టుకొని వెళ్ళే విధానానికి దారితీస్తుంది.

తీర్మానం వర్గ ప్రజా సంఘాలలో పునాది ప్రజాసామాన్యాన్ని ఐక్యపరచుట, ఐక్య కార్యాచరణ తత్ఫలితంగా ఐక్య సంఘటనా నిర్మాణం, అన్ని విధాల ప్రధా నాంశమని నొక్కి చెప్పుటలో విఫలమైందని అన్నారు. ఇదే నేటి ప్రధాన కర్తవ్య మని కమిటీ వివరించింది.

11. శుక్లా తదితర యు.పి. నాయకులు ఐక్య సంఘటనా సమస్యను నేరుగా లేవనెత్తకపోయినా, ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వం డిమిట్రాన్ చెప్పినట్లు రాజ కీయ సంక్షోభ కాలంలోనే సాధ్యమని, పైగా అట్టి సంక్షోభ పరిస్థితి నేడు లేదని అటువంటి ప్రభుత్వం విస్తరించబడిన కాంగ్రెసు ప్రభుత్వం అగుతుంది కాని ప్రజా స్వామ్య ఐక్యతా ప్రభుత్వం కాజాలదన్నారు.

## నిర్ధారణలు

కార్మిక, రైతు, మధ్యతరగతి వర్గాల ఐక్యతలు, ఐక్య సంఘటన నిర్మా ణానికి మౌలికాంశాలని అందరూ ఆమోదించారు. అంతేగాక కనీస కార్యక్రమంపై అన్ని వర్గాల ఐక్య కార్యాచరణ, ఐక్య పోరాటాల ద్వారా ఐక్య సంఘటన ఏర్పడు తుందనే అవగాహన అందరిలో ప్రతిబింబించింది.

ఆచరణలో అన్నివర్గాల ఐక్య కార్యాచరణ, ఐక్య సంఘటన, అన్ని ప్రజాస్వామ్య పార్టీల, ప్రజా సంఘాల, గ్రూపుల, వ్యక్తులు కలిసి ఏర్పడినదిగా వివరించునపుడు, పాలక పార్టీయైన కాంగ్రెసు సంఘటనలో భాగస్వామి అవుతుందా అనే విషయంలో భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. అదే విధంగా అన్ని వర్గాల సంఘటన అనగా గుత్త పెట్టుబడిదారీ వర్గం, అందులో ముఖ్యంగా సామ్రాజ్య వాదంతో పొత్తు నెరపుతున్న వర్గానికి ఐక్య సంఘటనలో గల స్థానం విషయంలోను అభిప్రాయ భేదాలు వ్యక్తమైనాయి.

ఐక్య సంఘటనలో కాంగ్రెసు భాగస్వామ్యంపై, కాంగ్రెసు లోపల, బయట వున్న కాంగ్రెసు ప్రజాస్వామిక వాదులతో ఐక్య సంఘటన అని బహుజనాభిప్రాయంగా వున్నా, ఆ సంస్థపై విశ్వాసం వున్న అశేష కాంగ్రెసు ప్రజాసామాన్యం, కాంగ్రెసులేని ఐక్య సంఘటనలోనికి ఎంతవరకు ఆకర్షితులగుతారనే విషయంలో అభిప్రాయ భేదాలు వ్యక్తమయ్యాయి. కాంగ్రెసును సంఘటనలోనికి ఆహ్వానించి నపుడే కాంగ్రెసుపై విశ్వాసంగల అశేష ప్రజాసామాన్యాన్ని సంఘటనలో సమీకరించగల అవకాశాలు ఏర్పడగలవని, కాంగ్రెసుపై విశ్వాసంగల అశేష ప్రజాసామాన్యాన్ని, కాంగ్రెసుకు నాయకత్వం వహించే అభివృద్ధి నిరోధకులను వేరువేరుగా చూడాలనే బలమైన అభిప్రాయమున్నది.

కాంగ్రెసు, ఒకవైపు ప్రభుత్వంలో పాలకవర్గంగా, మరోవైపు ఐక్య సంఘటనలో భాగస్వామిగా వున్నపుడు పోరాటం ఎవరిపైన అనే ప్రశ్న వుదయించుతుంది. ఈ దశలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు శక్తులపై పోరాటాన్ని కేంద్రీకరించి, ప్రధానంగా బ్రిటిష్ పారిశ్రామిక, ఆర్థిక, ద్రవ్య పెట్టుబడులను జాతీయం చేయుట, ఫ్యూడలిజాన్ని, దాని అవశేషాలను రద్దు చేయుటకై పోరాడాలి. ఈ కార్యక్రమంలో బూర్జువావర్గం మొత్తంగా, దాని ప్రయోజనాలు యిమిడివున్న కారణంగా పాల్గొనే అవకాశముంది. సిద్ధాంత రీత్యా మొత్తం బూర్జువావర్గం పాల్గొనాలి. అయితే సామ్రాజ్యవాదంతో పొత్తుగల బడా లేక గుత్త పెట్టుబడిదారీ వర్గాలతో సహా సంఘటనా అనే ప్రశ్నకు, బడా బూర్జువా వర్గాలలోవి మెజారిటీ భాగం, ప్రధానంగా సంక్షోభంలో "ఐక్యసంఘటన"లోనికి వస్తుందని యీ ఆలోచనాపరులు వివరించారు.

ఐక్య సంఘటనకు అనుబంధంగా యిచ్చే ప్రభుత్వ నినాదమెట్టిది. ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వం, సంఘటన ధ్యేయమని పెక్కురు అంటున్నారు. కాంగ్రెసు నాయకత్వంలో ఐక్య జాతీయ ప్రభుత్వం అనే అభిప్రాయం లేకపోలేదు. సాధారణంగా సంక్షోభంలో తప్పితే బూర్జువావర్గం యెప్పుడూ అధికారంలో భాగస్వామ్యాన్ని ఆమోదించదు. ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వం సాధారణ ఐక్య సంఘటనా నినాదం కాదని, బలమైన ప్రజావుద్యమాలుగల కేరళ, ఆంధ్రలలో సరియైన నినాదమని పెక్కురు ఆమోదించారు. అయితే యిది కూడ శాస్త్రీయ

వినాదమని ప్రాథమిక దశలో యివ్వబడుతుందని వివరణ లభించింది. ఉన్నత దశలో వినాదంగా పేర్కొనబడుతున్న జనత ప్రజాస్వామ్య ప్రభుత్వం కార్మికవర్గ నాయకత్వంలో అనే విషయం వేరుగ చెప్పనవసరం లేదు. క్లుప్తంగా ప్రజాస్వామ్య ఐక్యత ప్రభుత్వం అంటే ప్రజాస్వామ్య పార్టీలు, పక్షాలు, గ్రూపులు, కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధులుగల, అందరు భాగస్వాములైన ప్రభుత్వమని చెప్పుకొనవచ్చు. అందరికి ఆమోదమైన విధానాలను అమలుచేస్తూ, కొన్ని తప్పనిసరి నిర్ణయాలను భేదాభిప్రాయాలున్నా చేయవలసిన పరిస్థితులలో మూడింట రెండు వంతుల మెజారిటితో నిర్ణయాలు తీసుకొనబడతవి. నాయకత్వంలో అన్ని పార్టీలు సమాన భాగస్వాములు.

మరో ముఖ్య సిద్ధాంత సమస్య, ఐక్య సంఘటనలో ప్రజాస్వామ్య సోషలిస్టులు, అట్టి భావాలనే కలిగిన కాంగ్రెసులోని అతివాదుల యెడల అవలంభించవలసిన వైఖరి. వారు సోషలిజం, ప్రణాళికలు, ప్రభుత్వ యాజమాన్యంలో పరిశ్రమలు, ప్రజాస్వామ్య సోషలిజం అని ప్రజలలో భ్రమలను కలుగజేస్తున్నారు. వీరే వామపక్ష ప్రజాస్వామ్యవాదులకు, కమ్యూనిస్టులకు ప్రధాన శత్రువులు, వీరికి ఐక్య సంఘటనలో స్థానంలేదు. వీరి విధానాలను నిర్దాక్షిణ్యంగా విమర్శించి ప్రజలనుండి వేరు చేయాలి. ఇదే కమ్యూనిస్టుల ప్రథమ కర్తవ్యమంటున్న శక్తులు లేకపోలేదు. వీరు అతివాద, సెక్టేరియన్, స్టాలినిస్టు పిడివాదులు. ఐక్య కార్యాచరణ తద్వారా ఐక్య సంఘటనా నిర్మాణం కనీస కార్యక్రమ ప్రాతిపదికపై అనే అవగాహన వాదం! ఎంతవరకు యీ పిడివాద సిద్ధాంతాన్ని వోడించగలదో ఆ మేరకే ఐక్య కార్యాచరణ, ఐక్య సంఘటన పెంపొందించుట సాధ్యమవుతుంది.

ఐక్య పోరాటంలో మరో సిద్ధాంత సమస్య, వ్యూహాత్మక ఐక్య సంఘటన లేక శాశ్వత ఐక్య సంఘటనా అవగాహన, తక్షణ వివిధ సమస్యలపై వివిధ వర్గాలు విడివిడిగా లేక కలసి జరిపే పోరాటాలకై ఏర్పరచే ప్యాక్టరీ ఐక్య కమిటీలు పౌర సంఘటనలు, సంఘటనలు లేక ఎన్నికల పోరాటాలకే ఏర్పడు వివిధ పార్టీల ఐక్య సంఘటనలు తాత్కాలిక ఐక్య సంఘటనలుగా లేక ఎత్తుగడల ఐక్య సంఘటనలుగా స్పష్టత లభించింది. అంచేత యీ సమస్యపైగల గందరగోళం ముగిసి వివరణ లభించింది.

ఆచరణలో వాస్తవంగా తక్షణ సమస్యల ఐక్య పోరాటాలుగానో, సీట్ల పంపకము, సర్దుబాటులనుండి కలసి ఒకే ఐక్య సంఘటనా వేదికనుండి జరిపే ఎన్నికల పోరాటాలుగానో, పాలకపార్టీకి వ్యతిరేకంగా ఐక్య సంఘటనలు ఏర్పడుట చూస్తున్నాం. స్థానిక సమస్యలపై గ్రామ, ఫ్యాక్టరీ, మండల,జిల్లా, రాష్ట్ర వివిధ స్థాయిలలో పోరాట, అవసరాలనుబట్టి ఐక్య పోరాట కమిటీలు సహజంగా యేర్పడి యాదృచ్ఛికంగా పోరాటాలు తీవ్ర స్థాయినందుకొనుట చూస్తున్నాం. కొన్ని ఎట్టి నిర్మాణం

లేకుండా ఐక్య పోరాటాలుగ అభివృద్ధి చెందుట చూస్తున్నాం. స్థానిక సమస్యల నుండి ఉద్భవించే సాధారణ సమస్యపై జరిగే ఐక్య కార్యాచరణను విస్తృతపరుస్తూ, జిల్లా లేక ప్రాంతీయ లేక రాష్ట్ర సమస్యగా సాధారణీకరణ సమస్య పెంపొందించి ఐక్య కార్యాచరణ పోరాటంగా అభివృద్ధిపరచుటకు వివిధ స్థాయిలలో నాయకత్వాలకు అట్టి అవగాహన, స్థానిక సమస్యల అధ్యయనం, వాటిని ఎన్నుకొనుట, వాటి విస్తృతి, వేగోధృతికి గల అవకాశాలను పరిశీలించగలగాలి. స్థానిక సమస్యలు విస్తృతి పొంది రాష్ట్ర సమస్యలుగా ఆగుటయేగాక, కొన్ని ఆర్థిక సమస్యలు విస్తృతి పొందుటతో రాజకీయ సమస్యలుగా ముందుకొస్తవి. అట్టి సంపూర్తి అధ్యయనం, అవగాహన వుండాలి. అవి తక్షణ సమస్యలుగా వున్నకాలం వృధాకాకుండా వాటిని అభివృద్ధిపరచి తగిన పోరాట రూపాలను, నాయకత్వం యివ్వగలిగిన శిక్షణ, అనుభవంగల వారికి లభించాలి. తాత్కాలిక ఎత్తుగడల ఐక్యసంఘటనలు అట్టి నాయకత్వంచే రూపుదిద్దుకొంటవి. అవే దీర్ఘకాల వ్యూహ ఎత్తుగడల ఐక్య సంఘటనలకు సోపానాలవుతాయి.

ఐక్య కార్యాచరణకుగాని తద్వారా ఐక్య సంఘటనా నిర్మాణ ప్రాతిపదికను రూపొందించు విషయంలో కార్మిక, కర్షక, విద్యార్థి మధ్యతరగతుల సంఘటనలను, వివిధ పార్టీల అనుబంధ సంఘాల దశనుండి ఐక్య ప్రజాసంఘాలుగ రూపొందించే విజయంపైనే ప్రధానంగా ఆధారపడి వుంటుంది. దేశంలో కార్మికవర్గం, రైతులు, విద్యార్థులు వివిధ రాజకీయ పార్టీల ఆధ్వర్యంలోని వివిధ సంఘాలలో చీల్చబడి వున్నారు. ఈ చీలికలన్నీ వారి వారి వర్గ ప్రయోజనాలకెంత వరకు ఉపయోగపడినవో చెప్పలేకపోయినా, వారి వర్గ అనైక్యతకు, వారి బలహీనతకు, వారి పోరాట శక్తిహీనతకు దారితీశాయని అందరూ అంగీకరించే విషయం. వివిధ వర్గాలు వారి సమస్యలపై పోరాడునపుడు సహజంగానే వారి ఆలోచనలు విశాలమై వర్గ ఐక్యత యెంత అవసరమో వారి స్వానుభవం తెల్పుతుంది. బూర్జువా నాయకత్వాలు, మధ్యతరగతి స్వార్థపరుల నాయకత్వాలు మాత్రమే వారిని విడివిడిగా తమ రాజకీయ ప్రయోజనాలకై వారిని చీల్చి వుంచుతున్నారు. ఒక ప్రజాసంఘం వారి వర్గ కోర్కెల సాధనకై ప్రప్రథమంగా ఎంతవరకు ఆ పోరాటాన్ని సమిష్టి పోరాటంగా చేయప్రయత్నించిందనే విషయం దగ్గర నుండి, వివిధ రాజకీయ పార్టీల ఆధ్వర్యంలో వి ప్రజా సంఘాలు ఎంతవరకు సహకరించాయో అన్న విషయాన్ని ఆలోచించవలసి ఉంటుంది పోరాట కోర్కెలు అందరికి సంబంధించినపుడు అందరు ఐక్య కార్యాచరణలో పోరాడజాలక పోవుటకు. తమ నాయకత్వాలు ఎక్కడ పోతాయో అన్న భయం తప్ప మరో కారణం కనిపించదు. పాలక పార్టీ సంఘాలు కూడ ఎంతోకాలం ఐక్య కార్యాచరణలో చేరకుండా వుండజాలవు. కార్మికవర్గ ఐక్యత, ఐక్య కార్యాచరణ, తద్వారా ఐక్య సంఘటనా నిర్మాణం ప్రధాన కర్తవ్యం.

—:o:—

# 7

# అమృత పర్వం

## I

## ప్లాట్ మార్గంలో

కమ్యూనిస్టుపార్టీ జూన్ 1955 లో చిత్తు రాజకీయ విధానాన్ని పార్టీ కాంగ్రెసు పూర్వ చర్యల నిమిత్తం విడుదల చేయుటతో పార్టీ తీవ్ర అంతర్గత రాజకీయ సిద్ధాంత చర్చలలో మునిగి పోయింది.

**రాజకీయ పరిణామాలు :**

ప్రపంచ సామ్రాజ్యవాద బంధనాల సంకెళ్ళు అక్టోబరు విప్లవంలో బ్రద్దలై ఫాసిజంపై ప్రజాశక్తుల విజయం, తూర్పు యూరప్‌లో కమ్యూనిస్టు నాయకత్వంలో సోషలిజం ధ్యేయంగా జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఏర్పడుట, ఆసియాలో చైనా, కొరియా, వియత్నాంలలో కమ్యూనిస్టుల నాయకత్వంలో ప్రజాస్వామ్య విప్లవాలు విజయం పొంది ప్రజాతంత్ర ప్రభుత్వాలు ఏర్పడినవి. ప్రపంచంలో వలస విముక్తి విప్లవ పోరాటాలు విజృంభించి నూతన స్వాతంత్ర్య దేశాలు అనేకం ఉద్భవించాయి. సోషలిస్టు దేశాల సహకారంతో స్వతంత్ర అభివృద్ధి పంథాలో పురోగమిస్తున్నవి. ఫలితంగా ప్రపంచ శక్తుల బలాబలాలలో సోషలిస్టు, నూతన స్వతంత్ర దేశాల కనుగుణంగా గణనీయమైన మార్పులు వచ్చి, సామ్రాజ్యవాద ఆధిక్యత అంతమై, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఆవిర్భవించింది.

సోషలిస్టు పురోగమనాన్ని నిరోధించుటకై సామ్రాజ్యవాదం ఎదురు దాడిలో భాగంగా యూరప్‌లో నాటో సైనిక కూటమిని ప్రధానంగా సోవియట్‌పై ఎక్కు పెట్టబడినా ఆసియాలో వలస విముక్తి విప్లవ పోరాటాలను రక్తపుటేరులలో ముంచుటకు, కూలిపోతున్న సామ్రాజ్యవాద దేశాలకు అమెరికా ఆర్థిక, సైనిక సహాయాన్ని అందించుటయేగాక ప్రత్యక్షంగా దురాక్రమణ యుద్ధాలను ప్రారంభించింది. సామ్రాజ్యవాదం, ఆసియాలోని ప్రజాకంటక ప్రభుత్వాలతో కలిసి నాటోకు అనుబంధంగా బాగ్దాద్, సీటో సైనిక కూటములను వలస దేశాలలో విముక్తి విప్లవ పోరాటాలను అణచే ప్రయత్నాలు కొనసాగిస్తున్నది. బాగ్దాద్ కూటమిలో భాగస్వామియైన పాకిస్తాన్‌ను సామ్రాజ్యవాద దేశాలు రెచ్చగొట్టుతు, సైనిక సహాయా

న్నిస్తూ భారతదేశంపై ఒత్తిడి, కాశ్మీర్‌లో కలుగజేసుకొంటూ దాడిని ప్రారంభించాయి.

ఈ నేపథ్యంలో నెహూ-చౌయెన్‌లైల 1954 పంచశీల ప్రకటన చారిత్రిక ప్రాముఖ్యత కలదైనది. పంచశీల సూత్రాలు, శాంతి సహజీవనం, యుద్ధ ఆటంబాంబు వ్యతిరేక, విదేశాల అంతరంగిక విషయాలలో జోక్యం కలుగజేసుకొనకుండుట, పరస్పర సహకార సమాన సంబంధాలు, వివాదాంశాలను సంప్రదింపుల ద్వారా శాంతి మార్గాన పరిష్కరించుకొనుట, సామ్రాజ్యవాద వ్యతిరేకత ఆసియా ఐక్యతకు ప్రాతిపదికలై బాండుంగు సమావేశంలో ఆమోదించబడినవి. ఆసియా ప్రజల ఆశాజ్యోతులైనవి. సోవియట్ యూనియన్, తూర్పు యూరపు సోషలిస్టు దేశాలు పంచశీల సూత్రాలను ఆమోదించుటతో ప్రపంచ శాంతి ఉద్యమం, వలస స్వాతంత్రోద్యమాలు బలపడినవి. సోవియట్ యూనియన్, సోషలిస్టు దేశాలు నూతన స్వాతంత్ర్య దేశాలకు ఆర్థిక, రాజకీయ, సాంకేతిక, పారిశ్రామిక సహాయాన్నిచ్చుటతో, యీ దేశాల పురోగతిలో నూతన దశ ఆరంభమైంది.

### గోవా విముక్తి పోరాటం :

పాలక పార్టీయైన కాంగ్రెసు గోవా విముక్తి సమస్యను జాతీయ ఐక్యతా సమస్యగా నెంచక, ప్రజలే వారి విముక్తిని సంపాదించుకొంటారని మిన్నకుంది. ఈ పరిస్థితి అన్ని రాజకీయ పార్టీలను ఆందోళన పరుస్తున్నది. ఫలితంగా అన్ని రాజకీయ పార్టీలు కలసి "అఖిలపక్ష గోవా విముక్తి సహాయ సమితిని" మహారాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షునినే, సమితి అధ్యక్షుని ఆధ్వర్యంలో పోరాట సాధనంగా ఏర్పాటు చేశాయి. సమితిలో ప్రత్యేకంగా పేర్కొనతగిన పాత్రను కమ్యూనిస్టు పార్టీ వహించింది. ఆగస్టు 15, 1955 న సరిహద్దును బాండా వద్ద కమ్యూనిస్టు చిటాలె నాయకత్వంలో 600 మంది సత్యాగ్రహులు దాట ప్రయత్నించారు. పోర్చుగీసు ముష్కరులు కాల్పులు జరుపగా 21 మంది చనిపోయారు. దీనితో ప్రజలు కోపోద్రిక్తులై 16 న అన్ని నగరాలు, బస్తీలు బంద్ జరిపాయి. మృతవీరులకు గౌరవ చిహ్నంగా జాతీయ జెండాను అనవతం చేయాలని బొంబాయిలో ప్రదర్శకులు కోరారు. కాంగ్రెసు అగ్రనాయకత్వం, ప్రభుత్వం యీ పోరాటాన్ని వ్యతిరేకించుటతో పోర్చుగీసు పోలీసు మరింత రెచ్చిపోయి రక్తపాతం జరిపింది.

ఐక్యపక్ష సమితి సత్యాగ్రహాన్ని ఏదో రూపంలో కొనసాగించాలని, గోవా లోనే బలమైన ప్రతిఘటనను ప్రోత్సహించి, సహాయాన్ని అందించాలని, సమితి ఆశయాలు, నిర్ణయాలు ప్రచారం కావించాలని నిర్ణయించింది.

### రాష్ట్రాల పునర్నిర్మాణోద్యమము :

ఆంధ్రరాష్ట్రం పొట్టి శ్రీరాములు ఆత్మాహుతితో ప్రజ్వరిల్లిన ప్రజాపోరాటం ఫలితంగా మద్రాసు రాష్ట్రాన్ని విడగొట్టి యేర్పాటు గావించబడిన నాటినుండి. భాషా

ప్రయుక్త రాష్ట్రోద్యమాలు వివిధ ప్రాంతాలలో విజృంభించాయి. వాటితోపాటు, వివిధ సంస్థానాలలో వివిధ భాషాప్రజలు చీల్చబడి వుండుటతో వారి భాషా, సంస్కృతుల అభివృద్ధి, సమగ్ర ఆర్థికాభివృద్ధికి ప్రధాన ఆటంకముగా వుండుటతో, సంస్థానాలను రద్దుచేసి విశాలాంధ్ర, ఐక్యకేరళ, విశాలకర్ణాటక, సంయుక్త మహారాష్ట్ర, మహాగుజరాత్‌లను ఏర్పాటు చేయాలనే బలమైన ప్రజోద్యమాలు చెలరేగాయి. విశాలాంధ్ర, ఐక్యకేరళ నినాదాలు ప్రథమ సాధారణ ఎన్నికలలోనే, ఆంధ్ర, కేరళ, తెలంగాణా ప్రాంతాలలో కేంద్ర నినాదాలై కాంగ్రెసు పరాజయాలకు కారణాలయ్యాయి. ఆ ఫలితంగానే 1954 లో కేంద్రం రాష్ట్రాల పునర్నిర్మాణ కమీషన్ యేర్పాటు చేసింది.

కమ్యూనిస్టు పార్టీ కమిషన్‌కు సంస్థానాలన్నిటిని రద్దుచేసి ఐక్యకేరళ, తమిళనాడు, విశాలాంధ్ర, ఐక్యకర్ణాటక్, సంయుక్త మహారాష్ట్ర, మహాగుజరాత్, పంజాబ్, ఒరిస్సా, అస్సాం, రాజస్థాన్, మధ్యభారత్, మధ్యప్రదేశ్, ఢిల్లీ, హిమాచల్‌ప్రదేశ్, ఉత్తరప్రదేశ్, బీహార్, త్రిపుర, మణిపూర్, జమ్మూకాశ్మీర్, పశ్చిమ బెంగాలుగ 19 రాష్ట్రాలుగ పునర్నిర్మించాలని, 1954 మేలో మెమొరాండం సమర్పించింది. కమిషన్ దేశాన్ని భాషా ప్రయుక్త రాష్ట్రాలుగ యేర్పాటును సూత్రప్రాయంగా వ్యతిరేకించి, దక్షిణాదిన బలమైన ప్రజోద్యమాల వొత్తిడితో ఆంధ్ర, కేరళ, కర్ణాటక, తమిళ రాష్ట్రాలను తప్పనిసరిగా అంగీకరించింది. మహారాష్ట్ర, గుజరాత్, పంజాబ్. భాషా రాష్ట్రాలను యేర్పాటును వ్యతిరేకించి, విశాలాంధ్ర నిర్మాణం వుత్తరోత్తరా పరిశీలించవచ్చని తెలిపింది.

కమిషన్ భాషాప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణానికి సంబంధంలేని అనేక యితర సమస్యలను మిళితంచేసి, అవకాశవాద నిర్ణయాలను సూచించింది. ఈ అవకాశాన్ని తీసుకొని కేంద్ర ప్రభుత్వం, కాంగ్రెసు వర్కింగు కమిటీలు, బహు భాషా ప్రాంతాలుగ బెంగాల్, బీహారులను కలిపి ఒక రాష్ట్రంగా, దక్షిణ ప్రదేశ్, పశ్చిమ ప్రదేశ్‌లను ప్రజాస్వామ్య సూత్రాలకు వ్యతిరేకంగా, కాంగ్రెసు 1945 ఎన్నికల ప్రణాళికకు వ్యతిరేకంగా రాష్ట్రాలను కలిపివేసి ప్రాంతీయ ప్రభుత్వాలను యేర్పాటు చేయాలనే కేంద్ర ప్రయత్నాలను ప్రతిఘటించండని కమ్యూనిస్టు పార్టీ ప్రజలకు విజ్ఞప్తి చేసింది. పెట్టుబడిదారి, భూస్వామ్య వర్గాలు ప్రజలను చీల్చివుంచి సామ్రాజ్యవాదం వలె తమ దోపిడిని కొనసాగించుటకు చేయు ప్రయత్నాలను వమ్ము చేయండని ప్రజలను హెచ్చరించి, విజ్ఞప్తి చేసింది. భాషాప్రయుక్త రాష్ట్రోద్యమాలలో ప్రజలొనర్చిన త్యాగాలకు నివాళులర్పించింది. కాంగ్రెసు ప్రభుత్వ ఆలోచనలు దేశాన్ని చిన్నాభిన్నం చేస్తాయని, వాస్తవానికి దేశ ఐక్యతను భాషాప్రయుక్త రాష్ట్రాల విభజన కాపాడుతుందని తమ దృఢ అభిప్రాయాన్ని, తమ ప్రతిఘటనను వ్యక్తంచేసింది. వివిధ రాష్ట్రాలలో విస్తృత ప్రాతి

పధికపై విశాలాంధ్ర, ఐక్యకేరళ, విశాల కర్ణాటక, సంయుక్త మహారాష్ట్ర, మహాగుజరాత్ ఆశయాల సాధన ప్రజోద్యమాలు పోరాట పధంలో పురోగమించాయి.

## చారిత్రాత్మక కృచ్ఛేవ్ పర్యటన :

సోవియట్ నాయకులు కృచ్ఛేవ్, బల్గానిన్‌ల పర్యటన అనేక దశాబ్దాలుగ సామ్రాజ్యవాదపు సోవియట్, కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం కుప్పకూలిపోయింది. సామ్రాజ్యవాదుల వలసదేశాల దోపిడిని, దమననీతిని, సోవియట్ నాయకులు తీవ్రంగా విమర్శించుట, ప్రపంచ శక్తిగా చైనాను గుర్తించుట, కొరియ, ఇండో చైనాలలోని పరిస్థితులపై ప్రపంచానికి ప్రమాదం ముంచుకొస్తున్నదని హెచ్చరించి, అణుబాంబు యుద్ధాన్ని ప్రపంచ ప్రజలు శాంతి వుద్యమ శక్తితో ఆపగలరని స్పష్టం చేయుట ప్రజల నాకర్షించింది. బాగ్దాద్ సైనిక ఒడంబడికపై సోవియట్ నాయకులు వ్యతిరేకతను స్పష్టంచేసి, కాశ్మీర్ సమస్యపై భారతదేశాన్ని బలపరుస్తూ, గోవా విముక్తి వుద్యమాన్ని బలపరచుటయేగాక, సామ్రాజ్యవాద వ్యతిరేకంగా వలస విముక్తి ప్రజోద్యమాలనన్నిటిని బలపరచుట భారతీయుల హృదయాలను స్పందింప జేసింది.

"సోవియట్ నాయకులు కృచ్ఛేవ్, బల్గానిన్‌ల యాత్రా ఫలితంగా భారత-సోవియట్ స్నేహ సంబంధాలు, భారత స్వాతంత్ర్య కాలం నుండి పెరుగుతూ వచ్చినవి. నెహ్రూ సోవియట్ యాత్రతో బలపడి, నేడు యీ యాత్రలో మరింత ధృవపడినవని" [1] అజయ్ వ్యాఖ్యానించారు. యాత్ర ముగింపులో బల్గానిన్ చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖింప తగిన విజయంగా," భారత–సోవియట్ సంబంధాలను పేర్కొన్నారు. ఈ యాత్ర ప్రపంచ జనాభాలో సగంపైగా వున్న భారతదేశాన్ని, సోవియట్ యూనియన్‌లను, చైనాను అతి సన్నిహితులుగ చేసింది. "సహజీవనానికి, ఎవరికైనా ఉదాహరణ కావలసి వస్తే, భారతదేశంతో మా సంబంధాలను చూడవచ్చు. మేము సహజీవనం మాత్రమే చేయుటలేదు, మేము మిత్రులము, అభిప్రాయభేదాలు వుండవచ్చు కాని స్నేహితులము, మా శాంతి పోరాటమే మా స్నేహానికి పునాది" అని కృచ్ఛేవ్ బొంబాయి ఇండో-సోవియట్ సాంస్కృతి సంఘ ఆతిధ్యంలో అన్నారు.

సోవియట్–భారత సంయుక్త ప్రకటనలో నెహ్రూ, కృచ్ఛేవ్, బల్గానిన్‌లు

---

1. అజయ్‌ఘోష్ (1955) చారిత్రిక ప్రాముఖ్యత గలిగిన యాత్ర, భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర. అధికార పత్రాలు (1977) (ఆంగ్లంలో) వా VII. పే. 434.

"అంతర్జాతీయ సంబంధాలు, పంచశీల సూత్రాల పునాదిగా నిర్మించబడాలని నమ్ము తున్నామని వెల్లడించారు. భారత ప్రజల హృదయాలలో భారత-సోవియట్ మిత్రత్వము, పంచశీల, ప్రగాఢ ముద్ర వేసాయి.

## ప్రభుత్వ ప్రజావ్యతిరేక చర్యలు :

భారత ఆర్థిక వ్యవస్థలో నిర్ణయాత్మకపాత్ర యింకా బ్రిటను దైవుంది. లాభాలను ఎగుమతి నిరాకటంకంగా సాగుతూనే వుంది. కార్మిక, కర్షక దైనందిన పోరాటాలను పోలీసు, సైనిక యినుపపాదాలక్రింద గతంలో వలెనె, నిరభ్యంతరంగా కొనసాగుతూనేవుంది. బొంబాయి, అహమ్మదాబాద్‌లలో జరిగిన మారణకాండ ప్రజల మనస్సులలో మెలుగుతూనేవుంది. ప్రివెంటీవ్ డిటెన్షన్ చట్ట వినియోగం సర్వసాధారణమైంది. సంవత్సరాల కొలది వూరేగింపులు, ప్రదర్శనలు కొన్ని ప్రాంతాలలో నిషేదించబడ్డాయి. పౌరహక్కులు అతితేలికగా కాలరాచి వేయబడు తున్నవి. అనేక రాష్ట్రాలలో కార్మిక, కార్షక సంఘాల, ట్రేడుయూనియన్‌ల పని అసాధ్యం చేయబడింది. ప్రకృతిలో సంబధించిన "వరదలు, కరువు కాటకాల సహాయకచర్యలు పాలకపార్టీ తమ పార్టీ ప్రయోజనాలకు వినియోగించుకొంటు న్నారు. అదే విధంగా రాజ్యాంగ యంత్రాన్ని ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తు న్నారు.

భారతదేశం ఆర్థిక ఆధారితదేశంగానేవుంది. నగర, గ్రామీణ నిరుద్యోగం ప్రబలిపోయింది. కార్మికుల రిట్రెంచిమెంటు, ఆధునికీరణ పేరుతో నిరభ్యంతరంగా సాగుతున్నది. మార్కెట్టు దోపిడితో, అధికాహారోత్పత్తి ధరల తగ్గుదలకు తోడ్పడ లేదు.

## బూర్జువావర్గపు సిద్ధాంత దాడి :

జాతీయ కాంగ్రెసు 1952-54 సాధారణ ఎన్నికలలో ముఖ్యంగా ఆంధ్ర, తెలంగాణా, ట్రావెన్కూర్-కొచ్చినలలో పొందిన ఓటమి ప్రభావం రెండవ పంచ వర్ష ప్రణాళికాచక్రపు రచనలో, జనవరి 1955 ఆవడి జాతీయ కాంగ్రెసు 60వ, మహాసభ నిర్ణయాలలో, వుపన్యాసాలలో కానవచ్చింది.

నెహ్రూ "నిన్న పౌకతీర్మానాన్ని ప్రతిపాదించే గౌరవం నాకు లభించింది. ఆ తీర్మానంలో, మనం సోషలిస్టిక్ నమూనా సమాజాన్ని నిర్మించతలచాము. ఈ తీర్మానం, మనం రూపొందించే ఆర్థిక భారతదేశ చిత్రం, సోషలిస్టిక్ నమూనా"లో వుంటుందని స్పష్టంచేసాం" అని అంత్యోపన్యాసంలో పేర్కొన్నారు. అంతేగాక "తీర్మానం ఉత్పత్తి బాగా పెంచవలసిన సమయం వచ్చిందని చెప్పుతున్నది. ప్రజల జీవిత స్థాయిని పెంచుటకు, క్రమేణా నిరుద్యోగాన్ని పది సంవత్సరాలలో నిర్మూ

లించుటకు అది అవసరమంటుంది....పది సంవత్సరాలలో నిరుద్యోగం నిర్మూలించు వలసిన కాలం ఆసన్నమైంది." [1].

"మనం మన సమస్యలను అర్థంచేసుకొనాలి. అమెరికా, ఇంగ్లండు, యుగోస్లోవియా, రష్యా, చైనాలనుండి తప్పనిసరిగా నేర్చుకొనవలసినదే. అదేకాలంలో భారతపరిస్థితులను, వాటి ప్రత్యేకతను మరచిపోరాదు. మనగాంధేయ వారసత్వాన్ని ప్రత్యేకతలను మనం అర్థం చేసుకొనవలసివుంది.

"ఇతర విషయాలను చెప్పేముందు, సంక్షేమరాజ్యం సోషలిస్టిక్ నమూనా ఆర్థికవిధానం ఒకటికాదని చెప్పవలసివుంది· సంక్షేమ రాజ్యానికి, నిజమే, సోషలిస్టిక్ ఆర్థికవిధానం అవసరం, కాని దాని అర్థం సంక్షేమరాజ్యం తప్పనిసరిగా సోషలిస్టిక్ నమూనా సమాజ పునాదిని కలిగి వుండాలని కాదు. ఈ రెండూ వొకటిపై మరొకటి విస్తరించినా భిన్నమైనవే, మేము రెండూ కావాలంటున్నాము. ప్రపంచంలోని సోషలిజమంతా, కమ్యూనిజమంతావున్నా భారతదేశంలో సంక్షేమరాజ్యంకాదు. జాతీయ ఆదాయం అత్యున్నతంగా పెరగాలి. మీరు కోరుకొంటే వున్న సంపద పంపకంలో సోషలిజంలో సోషలిజం, కమ్యూనిజం మీకు సహాయకారికాగలదు. కాని భారతదేశంలో పంపకం చేసుకొనగలిగినంత సంపదలేదు. దారిద్రమే పంపకానికి వుంది. కొద్దిమంది భాగ్యవంతుల సంపద సంపక సమస్యకాదు. మన జాతీయ సంపదలో అది మార్పునుచేకూర్చదు....మనది బీదదేశం. సంపదను వుత్పత్తి చేసి దానిని సమంగా పంపకంచేయాలి[2]." అంతేగాక "ప్రజాస్వామ్యాన్ని, సోషలిజాన్ని, శాంతి, న్యాయబద్ధమార్గాన యేవిధంగా సంలీనం చేయాలన్నదే మనముందున్న ప్రశ్న అని "ఇది జటిలమైన సమస్య అయినా మనం విశ్వాసంతో ప్రయత్నించాలని [3]" అన్నారు.

అజయ్ ఘోష్నెహ్రూ సోషలిజం, "బూటకపు సోషలిజ మం"టూ, బడా బూర్జువాలను అంటుకొనకుండా, ప్రణాళికల వనరులకై విదేశాల పెట్టుబడికై ప్రార్థే యపడవలసి వచ్చుట, ప్రజలపై పన్నుల భారం అధికం చేయుట, లోటు ఆర్థిక

---

1. జవహరి లాల్ నెహ్రూ (1955) సోషలిస్టిక్ నమూనా. 60వ జాతీయ కాంగ్రెసు మహాసభలో 20 జనవరి, 1955న చేసిన ఉపన్యాసం. జవహరిలాల్ నెహ్రూ వుపన్యాసాలు వాల్యూం 3. ఆగస్టు 1958 అంగ్లంలో) పబ్లికేషన్ డివిజన్, న్యూఢిల్లీ. పే. 15-16.
2. జవహరిలాల్నెహ్రూ (1955) సోషలిస్టిక్ నమూనా. 60వ జాతీయ కాంగ్రెసు మహాసభలో 20 జనవరి, 1955న చేసిన ఉపన్యాసం. జవహరిలాల్ నెహ్రూ వుపన్యాసాలు వాల్యూం 3. ఆగస్టు 1958 (అంగ్లంలో)పబ్లికేషన్ డివిజన్. న్యూఢిల్లీ పే. 17-18.
3. జవహరిలాల్నెహ్రూ (1955) జవహరిలాల్నెహ్రూ ఉపన్యాసాలు. వాల్యూం 3. (అంగ్లంలో) పబ్లికేషన్స్ డివిజన్. ఆగస్టు 1958. పే. 53.

విధానాన్ని అనుసరించుట, దేశసార్వభౌమాధికారాన్ని ప్రమాదంలో పడవేయుట తప్ప మరొకటిగాదు. ప్రజల పరిస్థితిని దుర్భరం చేస్తూ ఆ తప్పుడు విధానాలను కప్పిపెట్టుకొనుటకు అసాధ్యమైన వాగ్దానాలు చేస్తూ "మరోవైపు బడా బూర్జువాలకు, భూస్వాములకు సహాయాన్నిచ్చుట,ప్రజలపై నిర్బంధ విధానాన్ని కొనసాగిస్తూ పోరాటాలను అణచివేస్తూ "24 మిలియనుల ఉద్యోగాలను సృష్టించి 10 సంవత్సరాలలో నిరుద్యోగాన్ని నిర్మూలిస్తామని", అంచెలంచెలుగా వ్యవసాయ సంస్కరణలను సాధ్యమైనంత త్వరగా ప్రవేశపెట్టి, ప్రణాళికలో 1000-1200 కోట్ల పెట్టుబడి పెట్టి అభివృద్ధి పనులు చేపట్టి "సోషలిస్టిక్ సమాజంవైపు పురోగమిస్తామని ప్రజలకు నమ్మచెప్పుతున్నారని విమర్శించారు. [1]

## II

# పాల్ఘాట్ 4వ, కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు

పాల్ఘాట్ నాల్గవ కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసులో ప్రతిపాదించబడే చిత్తు రాజకీయ తీర్మానం జూన్ 1955 లోను, 1951 కార్యక్రమానికి కేంద్ర సమితి సవరణల పత్రం సెప్టెంబరు 1955 లోను విడుదల చేయబడిన తదనంతరం, పార్టీలో జరిగిన అంతర్గత సిద్ధాంత పోరాటం, వివిధ అభిప్రాయాల సంఘర్షణ, సుదీర్ఘ చర్చలు యింతకుముందే తెలుసుకొన్నాము. అయినా, పార్టీ కాంగ్రెసులోను అంతర్గత చర్చలు అంత తీవ్రంగానే జరిగాయి.

పార్టీ కాంగ్రెసులో "కార్యక్రమానికి సవరణలు ప్రతిపాదించబడలేదు. అత్యధిక కామ్రేడ్స్, నేటి పరిస్థితులబట్టి అత్యధిక సవరణల లక్ష్యాలు సరియైనవైనా వాటిని రాజకీయ తీర్మానంలో యిమిడ్చి కాంగ్రెసులో ప్రతిపాదించాలని, మౌలిక కార్యక్రమానికి సవరణలుగా కాదని, అందుకై పరిపూర్ణమైన పరిశీలన అవసరమని తలచారు" అని నంబూద్రిపాద్ తెలిపారు. "ఫలితంగా పార్టీలో ఐక్యతను నెలకొల్పుటకు తోడ్పడిన 1951 కార్యక్రమము ఆచరణ నిలిపి వేయబడింది. పార్టీలో కార్యక్రమం లేకుండా పోయింది". "కార్యక్రమం విషయమై అనిశ్చిత పరిస్థితిలో

---

1. అజయ్ ఘోష్ (1955) భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర. అధికార పత్రాలు. (ఆంగ్లంలో) వాల్యూం 7. పే. 358, 411.

పాటు, నాటి పరిస్థితి అంచెనాలలో భేదాభిప్రాయాలు, 4వ, కాంగ్రెసు తీవ్ర అభిప్రాయ భేదాల అంతర్గత పార్టీ పోరాట వేదికగా అయింది. అనేక ప్రధానాంశాలు సూత్రీకరణలు, దైనందిన రాజకీయ సమస్యలు, ఆచరణ వివాదాలు తీవ్ర చర్చనీయాంశాలయ్యాయి" అని వ్యాఖ్యానించుతూ, నంబూద్రిపాద్ ఆ అంశాలలో కొన్నింటిని యీ విధంగా పేర్కొన్నారు. అవి సంక్షిప్తంగా ఇలా వున్నవి.

"—ప్రభుత్వ విదేశాంగ విధానాన్ని ప్రధానంగా శాంతి విధానమని, వలస వ్యతిరేక విధాన లక్షణంగా చెప్పుట సరియైనది. కాని, అంతర్జాతీయాభివృద్ధిలో చారిత్రాత్మక ప్రాధాన్యత కలదని, ప్రపంచ సమస్యలలో భారతదేశపు మార్పు గుణాత్మకమైనదిగా పేర్కొనుట అతిశయోక్తి కాదా?"

"—భారత విదేశాంగ విధానంలో వచ్చిన మార్పు ప్రధానంగా అభ్యుదయ కరమైనది, దేశీయాంగ విధానంలో ప్రధానంగా అభ్యుదయ నిరోధకమైనదనుట సరియైనదా? ప్రభుత్వ విధానంలోని వొక పార్శ్యం విదేశాంగ విధానం అభ్యుదయ కరమైనదని, మరో పార్శ్యం-దేశీయాంగ విధానం అభ్యుదయ నిరోధకం అనుట అసంగతం కాదా?"

"—ప్రజా పోరాటాలను పార్టీ ప్రధానంగా ఏ దిశగా నడపాలి? కాంగ్రెసు, ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య సంఘటనా మార్గంలోనా? కాక కాంగ్రెసు కలసి వచ్చే జాతీయ సంఘటనా మార్గంలోనా?"

"—సోవియట్‌తో ఆర్థిక ఒడంబడికలు, రెండవ ప్రణాళికా మార్గదర్శిక సూత్రాలు, దేశీయాంగ విధానంలో నాందిగా యెంచుట చాల సరియైనది కాదా?"

"—అధికారానికై కేంద్ర పోరాట నినాదమేది? అన్ని ప్రజాస్వామ్య ప్రతిపక్షాలు, వర్గాలు, గ్రూపులు ఐక్యతపై ఆధారపడిన ప్రజాస్వామిక ఐక్యతా ప్రభుత్వమా లేక కాంగ్రెసుతో కలసిన సంయుక్త లేక కొయలిషన్ ప్రభుత్వమా?"

"—కమ్యూనిస్టుపార్టీ రాజకీయ లక్ష్యమేది? ప్రతిపక్షపార్టీ అవునా? కాదా? వగైరా" ప్రశ్నలు కాంగ్రెసులో తీవ్ర చర్చనీయాంశాలైనవని నంబూద్రిపాద్ [1] అన్నారు.

"పార్టీ 4 వ మహాసభ ముందుకు మూడు విభిన్న రాజకీయ పంథాలు వచ్చాయి. మొదటిది, కేంద్ర కమిటిలో అత్యధికులు అనుసరించిన పంథా. రెండవది, పి. సి. జోషి, రాజేశ్వరరావు తదితరులు ప్రతిపాదించిన తీవ్రమైన సంస్కరణవాద పంథా. దీనికి వారు మహాసభలో మూడవ వంతు బలగాన్ని సమకూర్చుకొన్నారు. దీనినే వారు ప్రత్యామ్నాయ పంథాగా పేర్కొన్నారు. మూడవ పంథాను కేంద్ర కమిటి సభ్యులు, కామ్రేడ్స్ పుచ్చలపల్లి సుందరయ్య, మాకినేని బసవపున్నయ్య,

1. నంబూద్రిపాద్ (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ఇండియన్ కమ్యూనిస్టుపార్టీ (ఆంగ్లంలో) పే. 33–34.

సూర్జిత్, మోటూరి హనుమంతరావు, ప్రసాదరావులు ప్రతిపాదించారు. తమ సవరణలు కొన్నిటిని అధికార పంథా ఆమోదించిన తరువాత, ఆ పంథాను సమర్థిస్తూ, తమ ప్రతిపాదనను ఉపసంహరించుకొన్నారు"[1] అని బసవపున్నయ్య పేర్కొన్నారు.

"పార్టీ కాంగ్రెసులో కేంద్ర సమితి ముసాయిదాను పార్టీలో ఒకవర్గం వ్యతిరేకించింది. ప్రత్యామ్నాయ ముసాయిదాని ప్రతిపాదించారు. రెండు ముసాయిదాలపై తీవ్రమైన చర్చ జరిగింది. కేంద్ర సమితి ముసాయిదాతో తీవ్ర భేదాభిప్రాయంగల మరో వర్గం కూడ ప్రత్యామ్నాయ ముసాయిదాను ప్రతిపాదించదలచి, చివరలో ముసాయిదాను ప్రతిపాదించక, సవరణలు ప్రతిపాదించుటతో సరిబుచ్చుకొంది. ఆ విధంగా చివరకు రాజకీయ విధానం అంతర్గత పోరాట ఫలితంగా రూపొందించబడింద"[2] న్నారు నంబూద్రిపాద్. ఇంకా "నాల్గవ కాంగ్రెసు అంత్యనిర్ణయ ఆమోదానికి అభిప్రాయ భేదాలను పై పైన పరిష్కరించింది. అది, ఏమైనా పార్టీని ఐక్యపరచలేక పోయింది. కాంగ్రెసు తరువాత గూడ సైద్ధాంతిక, రాజకీయ భిన్నాభిప్రాయాలు, దృక్పథాలవారు అదే విధంగా కొనసాగారు. మెజారిటి వైఖరిని ఆమోదించని కామ్రేడ్స్ పార్టీ క్రమశిక్షణ రీత్యా మాత్రమే అంగీకరించారు. ఆ కారణంగానే, ఎట్టి నూతన పరిణామాలు సంభవించినా అభిప్రాయ భేదాలు తిరిగి ప్రత్యక్షమయ్యేవి" అని నాటి పార్టీ అంతర్గత పరిస్థితిని నంబూద్రిపాద్ వివరించారు.

పాల్ఘాట్‌లో అంతర్గత సిద్ధాంత పోరాటాన్ని అధికారి ప్రస్తావిస్తూ, అజయ్‌ఘోష్ విజయవాడ కాంగ్రెసులో "జాతీయ బూర్జువా ద్వంద్వ వైఖరి స్పష్టం చేయబడింది. బూర్జువా రాజీ విధానాన్ని తక్కువగా అంచెనా వేయకుండా పాల్ఘాట్ కాంగ్రెసు, సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంలు ఒకవైపున, భారత ఆర్థికాభివృద్ధి అవసరాలు మరోవైపున ఘర్షణలకు, వైరుధ్యాల అభివృద్ధికి లోనగుటను గుర్తించింది. అప్పే భారత ప్రభుత్వం, సామ్రాజ్యవాదాల మధ్య అభివృద్ధి క్రమంలో ఘర్షణలు, వైరుధ్యాలుగ ప్రతిబింబించాయి. పైగా యీ వైరుధ్యం తీవ్రమైంది. ఫలితంగా యింతకు ముందుకంటె, మన జాతీయ స్వాతంత్ర్యం నేడు గట్టి ఆర్థిక పునాదిపై ఆధారపడి వుందని" పేర్కొనుటను అధికారి ఉదహరించారు. "ఇంకా పాల్ఘాట్‌లో యీ నిర్ణయానికి మేము వచ్చుట యెంతో కష్టమైంది. పార్టీ కార్యక్రమంలోని సూత్రీకరణలకు మాలోని కొంతమందిమి చివరవరకు కట్టుబడి వున్నాము". "భారత

---

1. బసవపున్నయ్య (1976) మన పార్టీ కార్యక్రమం. ప్రజాశక్తి ప్రచురణ పే. 19.

2. నంబూద్రిపాద్ (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ఇండియన్ కమ్యూనిస్టు పార్టీ. పి.పి.బి. పబ్లికేషన్. పే. 35.

దేశ ఆర్థిక, ద్రవ్య, సైనిక విధానాలు ప్రధానంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదంపై ఆధారపడివుండుట, భారతదేశం అర్ధవలస, ఆధారిత దేశంగా కొనసాగుతున్నది".... "ప్రభుత్వం పైజాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పొత్తులోని బడా బూర్జువా నాయకత్వంలోని, బూర్జువా, బూస్వామ్య ప్రభుత్వమని పునరుద్ఘాటించుట" జరిగిందని అధికారి ఉదహరించి, "ప్రపంచ పరిస్థితులలో వచ్చిన పరిణామాలు పాత అవగాహనల్లను అసంగతంగా చేసినా, వాటిని విడనాడుటకు తీవ్ర ప్రతిఘటన వలన యీ అఘాతం యేర్పడింది. జాతి రాజకీయ స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యాలకై సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో జాతీయ బూర్జువా వర్గ పాత్ర వుంటుందని మనమెప్పుడూ గుర్తించాము. కాని నూతన ప్రపంచ పరిస్థితుల కారణంగా రాజ్యాధికారాన్ని, జాతీయ స్వాతంత్ర్యాన్ని పటిష్టంచేసి, ఆర్థిక స్వాతంత్ర్యం కొరకు పురోగమించే వాస్తవ పరిస్థితులు ఉద్భవించాయి" అని యింకా "అధికారంలో వున్న జాతీయ బూర్జువావర్గం, తన ప్రయోజనాలకై సామ్రాజ్యవాద అవశేషాలను, విప్లవ మార్గాలలో గాక సంస్కరణ విధానాలతో "ఒత్తిడి" "రాజీ" మార్గాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని కొనసాగిస్తుంటదని"[1] మనం గుర్తించాలని అధికారి వివరించారు.

అంతేగాక "పాల్ఘాట్ దృక్పధం, 1951 అవగాహన నుండి బయట పడుటకు తోడ్పడింది. పెట్టుబడిదారి మార్గంలో ప్రభుత్వం, భారత ఆర్థిక స్వాతంత్ర్యాభివృద్ధిని పెంపొందించే విధానాన్ని అనుసరించుచున్నదనే వాస్తవ అంచనాకు వచ్చుటకు తోడ్పడిందని"[2] అధికారి వ్యాఖ్యానించారు.

పాల్ఘాట్ కాంగ్రెసుపై సుందరయ్య ప్రస్తావిస్తూ" 1953 నుండి ప్రతి సందర్భంలోను రెండు పరస్పర వ్యతిరేక తీర్మానాలు ముందుకొచ్చేవి. చివరకు ఏదో ఒక తీర్మానం వెలువడేది. ఈ తీర్మానం ఎలా వుండేదంటే, ఎవరికి వారు తమకు వచ్చిన భాష్యంతాము చెప్పుకొనేటట్లుగా వుండేది. 1956 పాల్ఘాట్ మహాసభకు వచ్చేసరికి రెండు అభిప్రాయాలు ప్రస్ఫుటంగా బయటపడ్డాయి. నేనూ, బసవపున్నయ్య, సూర్జిత్, ప్రసాదరావు, హనుమంతరావు కేంద్ర కమిటిలో ఒక వైఖరి తీసుకొంటూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టాము....దేవులపల్లి కూడ మా అభిప్రాయాలతోనే వుండేవాడు. ఆ మహాసభలో మేము ప్రతిపాదించిన తీర్మానం గాక, కేంద్ర కమిటి తరపున అజయ్‌ఘోష్ ప్రవేశపెట్టిన తీర్మానం, అటు వైపున రాజేశ్వరరావు, జోషి కలసి ప్రవేశపెట్టిన తీర్మానం వున్నా, రాజేశ్వరరావు తీర్మానానికి మూడవ వంతు ప్రతినిధుల మద్దతు వుంది, మా తీర్మానానికి అంతే. ఇక అజయ్‌ఘోష్ ప్రవేశ

---

1. అధికారి జి. (1964) కమ్యూనిస్టుపార్టీ అండ్ ఇండియాస్ పాత్ టు నేషనల్ రీజనరేషన్ అండ్ సోషలిజం సి.పి.ఐ. పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే. 134,5.
2. ....అదే....పే. 139.

పెట్టిన తీర్మానానికి అంతే వుంది. ఏ రెండు గ్రూపులైన కలిస్తే తప్ప మూడవ దానిని ఓడించలేని పరిస్థితి....ఏదో ఒక రాజీతీర్మానం 1956లో తయారైంది, 1961 లోను అంతే జరిగింది" [1] అని సుందరయ్య తన విప్లవ పథంలో నా పయనంలో వివరించారు.

పై వివరణల పరిశీలనాంతరం ఒకటి రెండు విషయాలు స్పష్టమవుతాయి. భారత కమ్యూనిస్టుపార్టీలో రెండు ప్రధాన దృక్పథాలు, అనుబంధంగా రెండు గ్రూపులు లేక ప్రాక్షనులు, మూడోది కేంద్ర సమితి మెజారిటీ అభిప్రాయాన్ని అమలు చేయ ప్రయత్నించే "మధ్యేమార్గ గ్రూపు", 1953 నాటి నుండి వున్నా 1956 కు అవి అన్ని హంగులు గల మూడు స్పష్టమైన గ్రూపులుగ వ్యవహరించుట చారిత్రిక వాస్తవంగా కన్పడుతున్నది. పాల్ఘాట్ పార్టీ మహాసభలో, జోషి రాజేశ్వరరావుల ప్రత్యామ్నాయ తీర్మానం వీగిపోయిన అనంతరం, కేంద్రసమితి అజయ్ తీర్మానానికి సుందరయ్య తదితరుల సవరణలు ఆమోదించబడుటతో వారు తమ ప్రత్యామ్నాయ తీర్మానాన్ని ఉపసంహరించుకొని, అజయ్ మధ్యేమార్గ తీర్మానానికి ఓటుచేయుటతో సవరించబడిన తీర్మానానికి మెజారిటీ లభించి, ఆమోదించబడింది. సుందరయ్య వ్యాఖ్యానించిన విధంగా "ఏ రెండు గ్రూపులు అయినా కలిస్తేనే మూడోదానిని ఓడించేది". పార్టీ మెజారిటీ సభ్యులలో సిద్ధాంత ఐక్యత నెలకొనకపోయినా, అతివాదులు మితవాదులపై తాత్కాలిక ఎత్తుగడల విజయాన్ని పొందారని చెప్పుకొనవలసి వుంటుంది.

## పాల్ఘాట్ కాంగ్రెసు రాజకీయ తీర్మానం :

కమ్యూనిస్టు పార్టీ, పాల్ఘాట్ 4వ, కాంగ్రెసు మహాసభ ఏప్రియల్ 19-29, 1956 లో జరిగింది. కాంగ్రెసు మెజారిటీ ఆమోదం పొందిన రాజకీయ విధాన తీర్మాన ముఖ్యాంశాలు సంక్షిప్తంగా యీ క్రింది విధంగా వున్నవి. [2]

1) అక్టోబరు విప్లవంతో ప్రపంచ సామ్రాజ్యవాదంలో యేర్పడిన గండి, రెండవ ప్రపంచ యుద్ధంలో పాశిస్టు శక్తుల వోటమితో తూర్పు యూరపులో సోషలిజం పురోగమనం, చైనా ప్రజా రిపబ్లిక్ ఆవిర్భావం, కొరియా, వియత్నాంలో ప్రజారిపబ్లిక్‌ల అవతరణతో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ యేర్పడి, ప్రపంచ శక్తుల బలాబలాలలో సోషలిస్టు శక్తుల కనుకూలంగా మార్పులు సంభవించాయి.

---

1. సుందరయ్య, పుచ్చలపల్లి (1988) విప్లవ పథంలో నా పయనం. ప్రజాశక్తి ప్రచురణ. రెండవ భాగం. పే. 117-118.
2. రాజకీయ తీర్మానం. (1956) కమ్యూనిస్టు పార్టీ 4వ, పాల్ఘాట్ పార్టీ కాంగ్రెసు ఆమోదించినది. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు. (ఆంగ్లంలో) పి.పి.హెచ్. వా. VIII. పే. 523-565.

ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా వలస, అర్థవలస దేశాలలో జాతీయ విముక్తి ఉద్యమాల విజయాలతో సామ్రాజ్యవాదం బాగా బలహీన పడింది. అనేక స్వతంత్ర దేశాలు ఉద్భవించి, సోషలిస్టు రాజ్యాల సహకారంతో స్వతంత్ర ఆర్థికాభి వృద్ధి పంథాను చేబట్టాయి.

సామ్రాజ్యవాదం అమెరికన్ నాయకత్వంలో నాటో, బాగ్దాద్, సీటో సైనిక కూటముల ఒడంబడికలతో, సోషలిస్టు, స్వాతంత్ర్యోద్యమాల పురోగమనానికి చెలియలికట్ట, కట్ట ప్రయత్నిస్తూ, తానే ప్రపంచ రక్షకుడిగా, కమ్యూనిజాన్ని నాశనం చేయుటకు, అటం యుద్ధంతో ప్రపంచాన్ని బెదరించుచున్నది.

భారత ప్రభుత్వ విదేశాంగ విధానం, శాంతి, యుద్ధవ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పంథాగా రూపొందింది. అటంబాంబు వ్యతిరేక, ప్రపంచశాంతి, ఆసియా స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సహకారం, సహజీవనం, స్వతంత్ర పంథాగా పురోగ మించుటను కమ్యూనిస్టు పార్టీ ఆహ్వానించుతూ, బలపరుస్తున్నది. భారత-చైనాల మైత్రితో నెహ్రూ-చౌయెన్‌లైలు ప్రవచించిన పంచశీల ఆశయాలు, ఆసియా, ఆఫ్రికా దేశాల బాండుంగు సమావేశంలో "పంచశీల సూత్రాలుగ" పూర్తి రూపు రేఖలు దిద్దుకొని, ప్రపంచ సోషలిస్టు దేశాల ఆమోదం, ఒప్పందాలతో ప్రపంచ శాంతి ప్రియులందరి ఆమోదాన్ని, మన్ననను పొందాయి.

ప్రపంచశాంతి, యుద్ధ వ్యతిరేక, జాతీయ విముక్తి పోరాటాల పురోగమ నానికి యీ క్రింది ఎనిమిది అంశాల కార్యక్రమాన్ని పార్టీ యిచ్చి, అందుకై దేశ వ్యాప్తంగా ప్రజా ఉద్యమాన్ని నిర్మించుటకు పిలుపు నిచ్చింది.[1] 1) యుద్ధ వ్యతి రేక, అణుబాంబుల నిషేధం, ప్రజానాశనం చేసే మారణాయుధాల నిషేధం, నిరా యుధీకరణ 2) నాటో, సీటో, బాగ్దాద్ సైనిక ఒడంబడికల వ్యతిరేకత 3) ఆసియా ఐక్యతను బలపరచుట, ఆసియా పసిఫిక్ శాంతి ఒప్పందం 4) ఐక్యరాజ్యసమితిలో చైనా స్థానం, ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలలో సోవియట్, చైనాలతో స్నేహ, సహకార, సహజీవన సంబంధాలు 5) వలస సామ్రాజ్యవాద వ్యతిరేక విముక్తి పోరాటాలకు పూర్తి మద్దతు 6) గోవా విముక్తికి దృఢమైన చర్యలు 7) పాకి స్తాన్‌తో సంబంధాలను మెరుగుపరచుట 8) బ్రిటిష్ కామన్‌వెల్తు నుండి విడి వచ్చు టకై ప్రజోద్యమాలను నిర్మించాలి.

2) ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఆవిర్భావంతో నూతన స్వాతంత్ర్య దేశాలు పారిశ్రామిక వెనుకబాటుతనాన్ని, ఆర్థిక ఆధారితను అధిగమించుటకు సామ్రాజ్య వాద దేశాలపై ఆధారపడవలసిన అవసరం అంతమైంది. సోషలిస్టు మార్కెట్టు, ఆర్థిక, ద్రవ్య విధానాలు, పారిశ్రామిక, సాంకేతిక విజ్ఞాన దిగుమతి నూతనావకాశాలు అందుబాటులోనికి వచ్చాయి.

1. రాజకీయ తీర్మానం (1956) భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. అధికారపత్రాలు. (ఇంగ్లీషులో) వా. vii. పే. 530-531.

ప్రథమ ప్రణాళిక మౌలిక భారీ పరిశ్రమల పునాదిని పారిశ్రామికీకరణకు ఉద్దేశించబడినా, ప్రభుత్వం బ్రిటిష్ పెట్టుబడి, ద్రవ్య, ఆర్థిక ప్రయోజనాలను జాతీయము చేయుట ద్వారా పారిశ్రామిక పునాదిని ఏర్పరచక పోగా, యాంత్రిక, సాంకేతిక సహాయానికై సామ్రాజ్యవాదం వైపు ఎదురు తెన్నులు చూసినా ఫలితం శూన్యమైంది. నూతన పారిశ్రామికీకరణ వలన గాక, వున్న పరిశ్రమలనే కార్మికవర్గంపై అధిక భారాన్ని మోపి, తీవ్రతను పెంచుట, యంత్రాలను అతిగా పని చేయించుట ద్వారా అధికోత్పత్తి సాధించబడింది. వాస్తవ వేతనం యుద్ధ పూర్వపు వేతన స్థాయికి మాత్రమే చేరింది, కాని పెరగలేదు. కార్మికుల ఉత్పత్తి సామర్థ్యం 44 శాతం పెరిగింది కాని, వేతనాలు పెరుగలేదు. చిన్న, మధ్య తరగతి పరిశ్రమలను చిన్నచూపు చూచినందున పెద్ద పరిశ్రమలు కొంత అభివృద్ధి చెందాయి.

నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధి, ఎరువుల ఫ్యాక్టరీల నిర్మాణం, ప్రత్తి జనపనారల అధికోత్పత్తి, కమ్యూనిటీ, జాతీయ విస్తరణ పథకాలు జాతీయ ఆర్థిక విధానం బలపడుటకు తోడ్పడినా ప్రజల జీవన పరిస్థితులు ఆవగింజంతయినా మెరుగు పడలేదు. జమిందారీ, జాగీర్దారీ విధానాలు రద్దు చేయబడినా, రైతులకు పంచవలసిన భూమి 'కరి తిన్న వెలగపండు చంద' మైంది. పైగా నష్టపరిహార భారం రైతులపై పడింది. భూకమతాల గరిష్ట పరిమితులు నిర్ణయించ బడనందున, రైతులను భూముల నుండి తొలగించి వేసారు. వారికి ఎట్టి రక్షణలేదు. అభివృద్ధి, నీటి పన్నులు పెంచారు.

పెట్టుబడుల పంపకం, ముడిసరకుల సప్లయి, రవాణాసౌకర్యాలు, ఎగుమతి, దిగుమతులలైసెన్సులు అన్నీ గుత్త పారిశ్రామికుల కనుగుణంగా ప్రభుత్వవిధానాలు నిర్ణయింపబడినవి. లాభాల పెరుగుదల, ఎగుమతి నిరాటంకంగా జరుగుతున్న అభివృద్ధికై మోయలేని భారం ప్రజలపై పడింది. నిరుద్యోగం వ్యక్తి స్థాయిని దాటిపోయి జాతీయ సమస్య అయింది. బ్రిటిష్ పెట్టుబడిని, లాభాలను, ఫ్యూడలిజాన్ని ముట్టకుండా చేయతలపెట్టిన పారిశ్రామికాభివృద్ధి నీరు కారిపోయింది.

ఈచేదువిజాల ఫలితంగా ప్రభుత్వం సోషలిస్టుదేశాలవైపు మళ్ళింది.

3) భారత ప్రభుత్వం, జాతీయస్వాతంత్ర్యాన్ని, ఆర్థికవిధానాన్ని బలోపేతం చేయనెంచినా, ఆచరణలో విదేశీపెట్టుబడులకు, భూస్వాములకు రాయితీలను కూర్చుటకు ప్రయత్నించింది. గుత్త పెట్టుబడిదారుల దోపిడికి పూర్తి స్వేచ్ఛనిచ్చింది. ప్రజాఉద్యమాలను అణచేప్రయత్నం ముమ్మరం చేసింది.

జాతీయ అంతర్జాతీయ పరిణామాలు, స్వాతంత్ర్యోద్యమాల సంస్కరణాభిలాష వొత్తిడి, మరోవైపు భారత బూర్జువా వర్గ అభివృద్ధి, స్వతంత్ర పెట్టుబడిదారి విధానాభివృద్ధి మార్గంలో పారిశ్రామికీకరణ, ప్రథమ పంచవర్ష ప్రణాళిక అనుభవాలతో, భారత ఆర్థికాభివృద్ధి అవసరాలకు పొతవైపు, సామ్రాజ్యవాదం, ఫ్యూడ

లిజం మరోవైపు, మధ్యసంఘర్షణలు, వైరుధ్యాలు పెరిగాయి. ఇవే భారతప్రభుత్వం-సామ్రాజ్యవాదం మధ్య సంఘర్షణలు వైరుధ్యాలుగ పెరిగి ప్రతిబింబించాయి.

జాతీయ ఆర్థిక పరిస్థితి కొంత మెరుగగుట, పారిశ్రామిక, వ్యవసాయవుత్పత్తి పెరిగి, విదేశవ్యాపారంలో లోటుమెరుగు అగుటతో భారత బూర్జువావర్గం బలపడింది. ఇంపీరియల్, స్టేట్ బ్యాంకులను, జీవిత భీమాను జాతీయం చేయుటతో మరింత బలపడింది. నెహ్రూ-బుల్గానిన్ డిశెంబరు 1955 ప్రకటన, పుక్కు-ఫ్యాక్టరీ వొప్పందం, సోవియట్, సోషలిస్టుదేశాలతో పారిశ్రామిక, వ్యాపార సంబంధాల అభివృద్ధి, భారీ యంత్ర, సాంకేతిక, పారిశ్రామికాభివృద్ధికి భూమిక యేర్పడింది. భారత పారిశ్రామికాభివృద్ధి, పునర్నిర్మాణం బ్రిటన్, ఫ్యూడలు ప్రయోజనాలకు స్పష్టి చెప్పనిదే, ప్రపంచ సామ్రాజ్యవాద మార్కెట్టుపై ఆధారపడుట విడనాడనిదే సాధ్యంకాదని, ప్రథమ ప్రణాళిక చేదు అనుభవాలు నిరూపించాయి.

భారతబూర్జువావర్గం, ప్రభుత్వం, రెండవ ప్రణాళికలో "మౌలిక భారీ యంత్ర నిర్మాణ పరిశ్రమల ప్రాధాన్యం, త్వరితంగా పారిశ్రామికీకరణ, ప్రధానధ్యేయంగా" ప్రకటించబడి, స్వతంత్ర పెట్టుబడిదారి పంథా చేపట్టబడింది. బడా బూర్జువావర్గ వొత్తిడితో ప్రణాళికా చట్రంలో మార్పులు చేసినా 691 కోట్లు ప్రభుత్వరంగంలో పెట్టుబడిగా నిర్ణయమైంది. భారత విదేశీ ఆర్థిక ఆధారిత పారిశ్రామికీకరణ బలహీనపడి, చిన్న, మధ్యతరగతి పరిశ్రమల,వినిమయవస్తోత్పత్తి పెరిగి పారిశ్రామికరంగం బలపడుతుంది.

వ్యవసాయ సంస్కరణలు, భూకమతాల గరిష్ట పరిమితి నిర్ణయం అమలు జరిగితే, వినిమయ మార్కెట్టు పెరిగి, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుతుంది. నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రణాళికలు, జాతీయ విస్తరణ సమాజాభివృద్ధి పథకాలు, విద్య, ఆరోగ్య, గృహనిర్మాణ పథకాల అమలుకై పోరాటంలో రైతాంగంలో విస్తృత ఐక్యతను నిర్మించి, సంస్కరణలకై తీవ్ర పోరాటాలకు బలమైన ప్రాతిపదిక యేర్పడుతుంది. కమ్యూనిస్టు పార్టీ యీ విధానాలకు తీర్మానంలో స్వాగతం, బలపరచుట స్పష్టం చేసింది.

4) ప్రణాళికలోని అభ్యుదయ అంశాల అమలు, పరిమితులు, బలహీనతలు, సాధ్యాసాధ్యాలు భారత ప్రభుత్వ నైజాన్నుండి, తలపెట్టబడిన లక్ష్యాల నుండి సంభవించినవి. ప్రభుత్వం బూర్జువా నాయకత్వంలోని బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వం. స్వతంత్ర పెట్టుబడిదారి విధాన మార్గంలో అభివృద్ధి చేయ తలపెట్టింది. ఈ లక్ష్యంతోనే బ్రిటిష్ పెట్టుబడి స్థానాన్ని, ఫ్యూడలు భూస్వాముల శక్తులను బలహీనపరచి తాను విస్తరించి, గ్రామీణ ప్రాంతాలలో బలపడుటకు ప్రభుత్వరంగ పరిశ్రమల విస్తరణ, వ్యవసాయ సంస్కరణలు చేబట్టింది. ఈ లక్ష్యాలు, ఆచరణ తప్పనిసరిగా సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, సంకుచిత బూర్జువా వర్గంతో సంఘర్షణ

పడవలసి వస్తుంది. అందుచేతనే జీవితభీమా జాతీయకరణ, పారిశ్రామిక విధానాలపై వ్యతిరేకతను ఎదుర్కొనవలసి వస్తుంది.

అంచేత బూర్జువావర్గం ధానల ఆర్థిక విధానంపై సామ్రాజ్యవాదానికి గల ఆధిక్యతకు వ్యతిరేకంగా పోరాడుతూనే, మరోవైపు బ్రిటిష్ పెట్టుబడితో గల సంబంధాలను కొనసాగించుతూ, విదేశ పెట్టుబడులకు రాయితీలనిస్తుంది. ఫ్యూడలిజాన్ని బలహీనపరచుటకు వ్యవసాయ సంస్కరణలు చేస్తూ మరోవైపు రాయితీలనిస్తూ, ప్రజాస్వామ్య శక్తులకు వ్యతిరేకంగా వారితో స్నేహసంబంధాలు పెంచుకొంటుంది. పారిశ్రామికీకరణకు ప్రయత్నిస్తూ, ఆ భారాన్ని ప్రజలపై మోపుతుంది. ప్రభుత్వరంగ పారిశ్రామిక విస్తరణ చేస్తు, మరోవైపు గుత్తపెట్టుబడి వర్గాలు బలపడుటకు తోడ్పడుతుంది. ఫలితంగా, అభివృద్ధి కార్యక్రమాలన్నీ 'నత్తనడకను' అనుసరిస్తాయి.

కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వం సామ్రాజ్యవాదానికి, గుత్తపెట్టుబడి, భూస్వామ్య శక్తులను బలహీనపరచే అన్ని చర్యలను బలపరుస్తుంది. అదే కాలంలో ప్రభుత్వం చేబట్టే ప్రజావ్యతిరేక చర్యలను వ్యతిరేకిస్తుంది, ఆ విధంగానే ప్రజా ఉద్యమం బలపడుతుంది.

ఇట్టి పరిస్థితులలో శాంతి, స్వాతంత్ర్య పరిరక్షణ, బలవత్తరం చేయుట, జాతి పునర్నిర్మాణం చాల సంక్లిష్ట కర్తవ్యం. శాంతి, దాని విస్తరణకు ప్రభుత్వం అన్ని విధాల, ఫ్యూడలిజాన్ని బలహీనపరచే ప్రయత్నాలను, గుత్తపెట్టుబడిదారుల వ్యతిరేక చర్యలను, జాతి ఆర్థిక విధానం బలపడే చర్యలను తన శక్తికొలది కమ్యూనిస్టు పార్టీ బలపరచాలి. పారిశ్రామికీకరణ వేగంగా జరుగుటకు ఒత్తిడి చేయవలసి వుంటుంది. ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచుటకు, పెట్టుబడిదారులకు భూస్వాములకు యిచ్చే రాయితీలకు వ్యతిరేకంగా పోరాడవలసి వుంది.

అంతేగాక, ప్రభుత్వ ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలకు, పౌరహక్కుల రక్షణ, విస్తరణలకు, కార్మిక, కర్షక వ్యతిరేక చర్యలను త్రిప్పివెనుక కొట్టుటకు ఐక్య పోరాటాలు కొనసాగించాలి.

ప్రభుత్వం చేబట్టే అన్ని సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక చర్యలను కమ్యూనిస్టు పార్టీ ఎట్టి అరమరికలు లేకుండా బలపరచవలసి వుంది.

5) జనతా ప్రజాస్వామ్యం మౌలికధ్యేయం, దాని నిర్మాణానికై విస్తృత ప్రజా ఐక్యతను, తక్షణ కోర్కెల సాధనకై, అభ్యుదయకర విధానాలకై పోరాట ఐక్యతను పార్టీ నిర్మించాలి. పార్టీ తన ప్రచార, సిద్ధాంత, కార్యాచరణలో, జనతా ప్రజాస్వామ్య మౌలిక వివాదాన్ని, పునాది భూసంస్కరణలను, భూ పంపకాన్ని,

బ్రిటిష్ పెట్టుబడిని జాతీయం చేయాలని, ప్రజాస్వామ్య ప్రభుత్వ అవసరాన్ని ఎడతెగకుండా ప్రచారోద్యమాన్ని కొనసాగిస్తుంది.

భారతదేశ స్వాతంత్ర్యం సంపాదించుట, భారత రాజ్యాంగానికి బూర్జువా వర్గం నాయకత్వం వహించుట, భారత విప్లవ మౌలిక ధ్యేయాన్ని, ప్రధాన వ్యూహాన్ని మార్చదు. అన్ని ప్రజాస్వామ్య వర్గాల, జాతీయ బూర్జువా వర్గంతో సహా, కార్మికవర్గ నాయకత్వంలో జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వ నిర్మాణమే ప్రజాస్వామ్య విప్లవాన్ని సంపూర్తి చేస్తుంది. జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను సంపూర్తి చేయుటయేగాక దేశాన్ని సోషలిజం మార్గంలో పురోగమించునట్లు చేస్తుంది. నేటి యుగంలో అదిఒక్కటే సరియైన మార్గం. అంచేత పార్టీ నేటి పరిస్థితులలో సామాన్యమైన అభ్యుదయానికి పోరాడుతు, జనతా ప్రజాస్వామ్యం, సోషలిజంలకై ప్రజా ప్రచారోద్యమాన్ని కొనసాగిస్తుంది.

6) ప్రజాస్వామ్య పక్షాలలో, ప్రజలలోని అనైక్యతను అధిగమించుటకు విస్తృత ఐక్య సంఘటనా నిర్మాణం ప్రధాన వ్యూహ కర్తవ్యంగా పార్టీ కాంగ్రెసు నిర్ణయించింది. ఈ కర్తవ్యం కొంత వివరంగా తెలుసుకొందాము.

ఐక్య సంఘటన :

కమ్యూనిస్టు పార్టీ జాతీయ స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక విధానాన్ని, ప్రజాస్వామ్య శక్తులను బలపరచుటకు, ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచుటకు తక్షణ కార్యక్రమాన్ని ప్రజల ముందుంచుచున్నది. అది జాతీయ ఐక్యతను బలపరచి, ప్రపంచ సమస్యలలో ముఖ్యపాత్ర వహించునట్లు చేయాలి. అన్ని దేశభక్త, ప్రజాస్వామ్య శక్తుల విస్తృత ఐక్యసంఘటనను నిర్మించి, ఆ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుటకై పోరాటాలు కొనసాగిస్తుంది. అట్టి ఐక్యత అత్యంత అవసరమైనది, దేశంలోని రాజకీయ పరిస్థితి దానిని సాధించుటకు అనుకూలంగా కూడ వుంది.

భారతదేశం ప్రపంచ శక్తిగా రూపొందుట, ప్రపంచ సమస్యలలో దాని పాత్ర, దేశభక్త శక్తులు ప్రతిరంగంలో వలస శేష విధానాలను తుడిచివేసి జాతి పురోగమనాన్ని నిరాటంకంగా సాగించుటకై సాహస చర్యలను గైకొనాలని వుద్వేగంతో కోరుతున్నవి. భారతదేశం బలహీనంగా వుండే స్వాతంత్ర్యానికిగల ప్రమాదం అందరికీ స్పష్టమైంది. ప్రపంచ పరిణామాలు, సోషలిస్టు ప్రపంచంలో అభివృద్ధి, చైనా గణనీయమైన పురోగమనం, మన ప్రజలపై చెరగని ముద్ర వేసాయి. అవి అభ్యుదయ, ప్రజాస్వామ్య, సోషలిస్టు భావాలకు ప్రోత్సహమిస్తున్నవి. ప్రజాస్వామ్య శక్తులు, జాతి పురోగమనానికై ఐక్యపడ్వాలిసిన అవసరాన్ని నొక్కిచెప్పుతున్నవి.

దేశంలో ప్రజాస్వామ్య శక్తులు చీలిపోయి వున్నవి. ప్రధాన చీలిక కాంగ్రెసును అనుసరించే ప్రజాస్వామ్య శక్తులు, ప్రజాస్వామ్య ప్రతిపక్షాలను అనుసరించే ప్రజాస్వామ్య శక్తుల మధ్య ఏర్పడి వుంది. అంతేగాక ప్రజాస్వామ్య ప్రతిపక్షాల లోనే చీలిక వుంది. ప్రధానంగా కమ్యూనిస్టుపార్టీ, ప్రజా సోషలిస్టుపార్టీ, సోషలిస్టు పార్టీలను అనుసరించే ప్రజా సామాన్యం చీలిపోయి వుంది. అంతేగాక ఎవ్వరినీ అనుసరించని అశేష ప్రజా సామాన్యం వుంది. ఈ మధ్య కాలంలో యీ చీలికలను అధిగమించే ప్రయత్నంలో గణనీయమైన పురోగమనం జరిగింది. అమెరికా-పాకిస్తాన్ సైనిక ఒడంబడికకు, సామ్రాజ్యవాద ఎత్తులకు వ్యతిరేకంగా ప్రచారోద్యమంలో, సోవియట్ నాయకులకు పెద్ద ఎత్తున స్వాగతంచెప్పుటలోను, అన్ని పార్టీలను అనుసరించే ప్రజా సామాన్యం ఐక్యతను ప్రదర్శించింది. అందరిలో ప్రగాఢ ఐక్యతావాంఛ, ప్రతిఘటన, అభివృద్ధి నిరోధక శక్తుల వ్యతిరేక పోరాటం, జాతి పునర్నిర్మాణానికి, సంస్కరణలకు, ప్రజాస్వామ్యం కొరకు ప్రభుత్వ వ్యతిరేక ఐక్య పోరాటాల విస్తృతి, తీవ్రత పెరుగుతున్నది.

**పాలక పార్టీ కాంగ్రెసు :**

ప్రజల ప్రజాస్వామ్య, సామ్రాజ్యవాద వ్యతిరేక, అభివృద్ధికర అభిప్రాయాలను ఉపయోగించుకొని తన స్థానాన్ని బలపరచుకొంటున్నది కాంగ్రెసు. అదే విధముగా జాతి పునర్నిర్మాణాన్ని, భూస్వామి వర్గాల వ్యతిరేకతను విడనాడి ఐక్యతను పెంపొందించుకొంటున్నది, గణనీయమైన విజయాన్ని సాధించింది. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో పరిమిత విజయాలను సాధించుట, ఆహారోత్పత్తిలో విజయం, రెండవ ప్రణాళికలో ప్రభుత్వరంగ విస్తరణ, పారిశ్రామికీకరణ, సోషలిస్టు దేశాల సహాయాన్ని పొందుటకు సంసిద్ధత, సోషలిస్టు నమూనా సమాజం అనే ప్రచారం, ఆశలను రేకెత్తించాయి. భారతదేశ విదేశాంగ విధానం పొందిన ఖ్యాతిని కాంగ్రెసు సహజంగానే తనను బలపరచుకొనుటకు వినియోగిస్తున్నది.

కాంగ్రెసు యీ విధంగా బలాన్ని పొందుట, అసమానంగాను, పాక్షికంగాను, అనిశ్చిత పునాదులపై ఆధారపడి వుందని తదనంతర ఘటనలు స్పష్టం చేసాయి. అయినప్పటికి, కాంగ్రెసులో, కాంగ్రెసును అనుసరించే ప్రజా సామాన్యంలో శాంతి, సామ్రాజ్యవాద వ్యతిరేకత, సోవియట్, చైనాలతో స్నేహ సంబంధాల అభివృద్ధి, ప్రజాస్వామ్యం, సోషలిజం, జాతి పునర్నిర్మాణానికి అద్భుతయకర భావాల వ్యాప్తి గణనీయంగా పురోగమించింది.

ఈ నేపథ్యంలో కాంగ్రెసు ఆవడిలో సోషలిజాన్ని గమ్యంగా, సోషలిస్టిక్ నమూనా సమాజ ఆర్థిక విధానాన్ని ప్రకటించుటను, ప్రజలలో అది కలుగజేసిన ప్రభావాన్ని అర్థం చేసుకొనవలసి వుంటుంది. ఒకవైపు బూర్జువా వర్గం తన వాస్తవ

విధానాల లక్షణాలపై ముసుగును కప్పుతూ, మరోవైపు ప్రజలను ప్రక్కదారి పట్టించి, వారి అభ్యుదయకర వాంఛితాలను, తన వర్గ పాలనకు బలాన్ని చేకూర్చుకొనుటకు వినియోగించుకొను ప్రయత్నం చేస్తున్నది. అయితే అది పెరిగే సోషలిజపు శక్తిని, ఆ భావాల ఆకర్షణను, దాని అభివృద్ధిని పాలక పక్షం గుర్తించవలసిన అవశ్యకతను తెలియజేస్తుంది. దానిలో అభ్యుదయం ఇమిడి వుంది. సోషలిజం ధ్యేయంగా ప్రకటించుటలోనే అభ్యుదయీకరణ శక్తిగా పని చేస్తుంది. కాంగ్రెసును, కాంగ్రెసును అనుసరించేవారు, ప్రజలలో వామపక్ష గ్రూపును బలపరచి, ప్రజాస్వామ్య కోర్కెల ఉద్యమాన్ని శక్తివంతం చేస్తుంది. జాతి స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక విధానాన్ని మెరుగుపరచే ప్రభుత్వ విధానాలను కాంగ్రెసు ప్రజా సామాన్యం ఉత్సాహంతో బలపరచుటతో పాటు, ప్రజా వ్యతిరేక, ప్రజాస్వామిక వ్యతిరేక విధానాలను, వాస్తవ ఆచరణ, ప్రకటించిన సోషలిస్టు ధ్యేయాల మధ్య గల అఘాతాన్ని విమర్శించి తెగనాడే స్థితి అభివృద్ధి చెందుట స్పష్టం. అనేక మంది కాంగ్రెసు వాదులు, వారిననుసరించే ప్రజా సామాన్యం ప్రభుత్వ ప్రజాస్వామ్య ఆచరణ వ్యతిరేక ఆచరణ, విధానాలను మాటలలో వ్యతిరేకించుటయే గాక సమిష్టి పోరాటాలలో కాంగ్రేసేతర పార్టీలు, ప్రజలతో కలుస్తున్నారు. గోవా, భాషా ప్రయుక్త ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణ సమస్యలపై. భాషా రాష్ట్రాలను కలిపి విశాల ప్రాంతీయ ప్రభుత్వాలను ఏర్పాటు చేయతలపెట్టిన కేంద్ర ప్రయత్నాలను వ్యతిరేకముగానే గాక, అధిక పన్నులను వ్యతిరేకంగా, పౌరహక్కుల ఐక్య పోరాటాలలో కాంగ్రెసు వాదులు గణనీయమైన పాత్ర వహించారు. అసెంబ్లీలలో, పార్లమెంటులలో జాతి పునర్నిర్మాణానికి సంబంధించిన అనేక సమస్యలపై. కాంగ్రెసువాదులు, ప్రజాస్వామ్య ప్రతిపక్షాలతో తమ గొంతును కలిపారు. కాంగ్రెసు పార్టీ క్రమశిక్షణాదండంతోనే ప్రభుత్వ పక్షాన వోటు చేస్తున్నారు.

**వామపక్ష ఐక్యత :**

ప్రజాస్వామ్య ప్రతిపక్షాలలో కమ్యూనిస్టుపార్టీ, సోషలిస్టుపార్టీ, ప్రజా సోషలిస్టుపార్టీ ముఖ్యమైనవి. ఐక్యతావసర చైతన్యం అభివృద్ధి చెంది ప్రజా ప్రయోజనాల రక్షణకు, పౌరహక్కులు, గోవా విముక్తి, భాషా ప్రయుక్త రాష్ట్రాలు, ఎన్నికలు, అనేక సమస్యలపై ఐక్య పోరాటాలకు దారి తీసింది.

దేశంలోని అన్ని ప్రాంతాలలో ప్రజా పోరాటాలు అభివృద్ధి చెంది, విస్తృత ప్రాంతాలలో ప్రజా ఐక్యతను నిర్మించుతున్నవి. అభ్యుదయ నిరోధక విధానాల వ్యతిరేకతను, ప్రతిఘటనకు స్పష్టమైన రూపాన్నిచ్చే శక్తివంతమైన ప్రజా చైతన్యాన్ని కలుగజేస్తున్నవి. ఐక్యతను బలపరస్తూ, అభ్యుదయ రాజకీయాలకు మార్గమయినవి.

వివిధ సంఘాల కార్మికులు, అసంఘటిత కార్మికులు ఐక్యంగా కలిసి, వారి కోర్కెల కొరకు పెట్టుబడిదారులు, ప్రభుత్వాలకు వ్యతిరేకంగా వారి దమనకాండ వ్యతిరేకించి, అనేక ప్రాంతాలలో విస్తృత ఐక్య పోరాటాలను తాజాగా చూచాము. ఈ పోరాటాల ప్రత్యేకత ఐ. యన్. టి. యు. సి. సంస్థను అనుసరించే కార్మికులు, కొన్ని యూనియనులు పాల్గొనుట. ఈ పోరాటాలు ప్రజల విస్తృత మద్దతును, సహాయాన్ని పొందగలుగుటతో యాజమాన్యాన్నుండి అనేక రాయితీలను పొందుట, కార్మికవర్గ ఐక్యతలోని బలాన్ని స్పష్టం చేస్తుంది. గోవా విముక్తి ఉద్యమంలో, భాషా ప్రయుక్త రాష్ట్రోద్యమంలో పౌరహక్కుల ఉద్యమంలో, కార్మికవర్గం ప్రధాన పాత్ర వహించినందున అన్ని వర్గాలలో గొప్ప ప్రభావాన్ని కలిగించి, ప్రజా ఉద్యమాన్ని విస్తృతం బలోపేతం గావించింది.

ప్రజాస్వామ్య ప్రజలను చీల్చే అడ్డుగోడలు, వివిధ పార్టీలలోని అట్టి శక్తులను క్రమేణా అధిగమించుట జరుగుచున్నది. కమ్యూనిస్టు పార్టీ, ప్రజాసోషలిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీల మధ్య సుముఖ సంబంధాలు, మరోవైపు కాంగ్రెసు, ప్రజాస్వామ్య శక్తులతో సంబంధాలు అభివృద్ధి చెందాయి.

భూముల నుండి భేదఖల్లు, తొలగింపులకు, అధిక భారానికి వ్యతిరేకంగా, భూమికొరకు, అధిక వేతనాల కొరకు రైతుల, కౌలుదారుల, వ్యవసాయ కూలీల పోరాటాలతో పాటు, విస్తృత ప్రజా మద్దతు అనేక విజయాలను సాధ్యం చేయుటయే గాక, కాంగ్రెసులోనే గొప్ప ప్రభావాన్ని కలుగజేసింది. ఇది రెండవ పంచవర్ష ప్రణాళిక భూసంస్కరణల సమితి ప్రతిపాదనలలో ప్రతిబింబించింది.

ఈ పరిణామాలన్నీ ప్రజాస్వామ్య వుద్యమానికి అతి ప్రాముఖ్యమైనవి. భారత ప్రజల విస్తృత ఐక్యతా నిర్మాణానికి తగిన పరిస్థితులను బహుందా కలిగించుతున్నవి. ఈ పరిస్థితులలో ఐక్యత, అభ్యుదయాన్ని కోరే అన్ని పార్టీలలోని దేశభక్త, ప్రజాస్వామ్య శక్తుల ఐక్యతగ రూపొందుతుంది. దీనిని ప్రభుత్వ అభ్యుదయకర విధానాలను బలపరచుటకు, అభివృద్ధి వేగోధృతి పెంచుటకు, దేశీయ విధానాలలో ప్రజా వ్యతిరేక, అప్రజాస్వామిక విధానాలను సవరించు లక్ష్యంతో కొనసాగించాలి. ఈ ఐక్యత మన ప్రజ, దేశం కొరకు ఆచరణ, విధానాల సమన్వయ ఐక్యత, అతివాదంపైపు పురోగమన ఐక్యత కావాలి.

**కమ్యూనిస్టు పార్టీ ఐక్యతా వైఖరి :**

పార్టీ అట్టి ఐక్యతా నిర్మాణానికి ప్రజాబలం గల పార్టీల యెడల సరియైన వైఖరిని అవలంబించుట అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది.

కాంగ్రెసు అశేష ప్రజాస్వామ్య శక్తులతో పాటు, భూస్వామ్య శక్తులను తనలో యిముడ్చుకొంది. సాంప్రదాయక సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులను కలిగి వుంది. నేటి కాంగ్రెసు వాగ్దానాలు, చర్యలు క్షీణించుచున్న తన ప్రజాబలాన్ని

పెంపొందించుకొనుటకు ఉపయోగించింది. అదేకాలంలో అభ్యుదయకర, ప్రజాస్వామ్య భావాలు కాంగ్రెసు, ప్రజలలో వ్యాపించాయి.

కమ్యూనిస్టు వైఖరి యీ వాస్తవాలను పరిగణలోనికి తీసుకోనాలి. నిజాయితీపరులైన కాంగ్రెసు వాదులను ఐక్యతకై ఆకర్షించేదిగా వుండాలి. కాంగ్రెసులో ప్రజాస్వామ్య పోరాటానికి తోడ్పడేదిగా వుండాలి. క్రమేణా అభ్యుదయకర విధానాలను వారు చేబట్టే విధంగా వుండాలి.

భారత జాతీయ కాంగ్రెసు పాలకవర్గ పార్టీ, సామ్రాజ్యవాదంతో, ఫ్యూడలిజంతో రాజీ విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటలలో పోలీసు, బురాక్రెటిక్ ప్రభుత్వ అధికారానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్య విస్తరణకు పోరాడవలసి వుంది. ఈ పరిస్థితులలో కాంగ్రెసుతో సామాన్య ఐక్య సంఘటన ప్రశ్న వుదయించదు.

దీనర్థం ప్రజాస్వామ్య సంఘటన కాంగ్రెసు వ్యతిరేక సంఘటనగా నిర్ధారణ చేయరాదు. ఇది సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలను నిర్వహించవలసి వుండుటవలన మాత్రమేకాదు, ప్రధానంగా కాంగ్రెసులోని వివిధ వర్గాల పొందికయని చెప్పాలి.

సోషలిస్టుపార్టీ, ప్రజా సోషలిస్టుపార్టీలలో వివిధ వర్గాల పొందిక, ఆ పార్టీల నైజము రాష్ట్రి రాష్ట్రానికి భిన్నంగా వుంది. ఏమైనా వాటిని ప్రజాస్వామ్య ప్రతిపక్ష పార్టీలుగ పరిగణించాలి. వారి ప్రజాబలం ప్రజాస్వామ్య ప్రతిపక్షాలుగ ప్రభుత్వ వ్యతిరేక విధానాలను, సోషలిజం పేరుతో సాగించుటలో ఏర్పడింది. ఈ పార్టీల కార్యకర్తలు సోషలిస్టు భావాలు కలిగినవారు.

సోషలిస్టుపార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీల నాయకత్వం నిన్నటి వరకు కాంగ్రెసుతో ఒప్పందానికి వచ్చేందుకు కమ్యూనిస్టు వ్యతిరేకతతో దుయ్యబట్టుతూ, చైనా, సోవియట్ యూనియన్‌ల వ్యతిరేకతతో శాంతి ఉద్యమ వ్యతిరేకతను, కమ్యూనిస్టు వ్యతిరేకత పేరుతో ప్రజాస్వామ్య ఉద్యమ నిర్మాణాన్ని వ్యతిరేకిస్తూ వుండేవి. ఈ తప్పుడు విధానాలు సభ్యులకు స్పష్టమగుటతో 1955 వ సంవత్సరం నుండి ప్రజా సోషలిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీలు తమ విధానాలను మార్చుకొనుట అనేక రాష్ట్రాలలో కొంతవరకు జరిగింది. అనేక సమస్యలపై అనేక ఉద్యమాలలో, పోరాటాలలో యీ పార్టీలు కమ్యూనిస్టు పార్టీ, తదితర ప్రజాస్వామ్య పార్టీలతో చేతులు కలిపాయి. ఈ విధానాన్ని పార్టీ ముందుకు తీసుకొనిపోవుటకు అన్ని ప్రయత్నాలు చేస్తుంది. ప్రజలలోని పురోగామి శక్తులను ఏకం చేయుటకు, అతివాద పార్టీలు సమిష్టి అవగాహనకు వచ్చుటకు యెంతగానో తోడ్పడుతుంది. ఆ పోరాటాలలో, ఎన్నికల పోరాటాలలో ప్రముఖపాత్ర వహించుతుంది.

కమ్యూనిస్టు పార్టీ నిర్మించ ప్రయత్నించేది ప్రజాస్వామ్య ఐక్యత, అంతేకాక ప్రజలను మత ప్రాతిపదికపై చీల్చే మత, అభివృద్ధి నిరోధక పార్టీల యెడల

రాజీలేని రాజకీయ సిద్ధాంత పోరాట పంథా ననుసరిస్తుంది. కమ్యూనిస్టు పార్టీ వారితో ఏ ఎన్నికలలోను, యితరత్రా ఐక్య సంఘటనను నిర్మించదు. ఆ పార్టీలను అనుసరించే ప్రజాసామాన్యాన్ని, వ్యక్తులను సమిష్టి పోరాటాలలో సమీకరించే ప్రయత్నం చేస్తుంది. న్యాయమైన మైనారిటీల హక్కుల వుద్యమాన్ని చేబట్టి వారి రక్షణకై పోరాడుతుంది.

జాతి స్వాతంత్ర్యాన్ని బలపరచుటకు, ప్రజలను సమీకరించుట, వారి జీవన పరిస్థితులను మెరుగుపరచుటకై పోరాటాలు, సౌహార్ద చర్యలు, పౌర, ప్రజా స్వామ్య హక్కులకై పోరాటాలు ప్రత్యేక ప్రాముఖ్యత వహించుతాయి. వాటి వలన ప్రజలకు రక్షణ, వారి నిర్మాణశక్తి బలపడి, బ్రిటిష్ పెట్టుబడి, దేశీయ గుత్తపెట్టు బడిపై దాడి కేంద్రీకరించబడుతుంది. జాతీయ ఆర్థికతను బలపరచే కాంగ్రెసు శక్తులను బలపరుస్తుంది.

ఈ పోరాటాలలో ఆచరణలో చైతన్యంతో ఐక్యతా అవసరాన్ని, దాని శక్తిని గుర్తించి, ఐక్యమై రాయితీలను పొందగలుగుతారు. నైతికబలం పెరిగి, ప్రజల మద్దతు లభించి, ప్రభుత్వ, అభివృద్ధి విరోధకుల దాడులను త్రిప్పికొట్టు గలుగుతారు. ఇట్టి పోరాటాల వలనే ఐక్య ప్రజా సంఘాల నిర్మాణానికి అనువగు పరిస్థితులు రూపొందుట, ప్రజాస్వామ్య శక్తుల సంలీనం జరిగి ఐక్యత ఏర్పడు తుంది. సాధ్యమైనపుడు అట్టి పోరాటాలను విశాల ఐక్య కమిటీల ద్వారా సాగించుట అత్యవసరము.

## ప్రజాపోరాటాల పురోగమనం :

ఐక్య కార్యాచరణ, ఐక్యపోరాటాలు ప్రజాస్వామ్య వుద్యమాల పురోగతికి యెంతో ముఖ్యమైనప్పటికి వాటిని యీ క్రింది కర్తవ్యాలతో జతపరచి పోరాటాలు సాగించినపుడే పూర్తి విజయం లభించుతుంది.

సోషలిస్టు దేశాలతో మైత్రి, ఆసియా ఐక్యత, శాంతి, ప్రజోద్యమాలు విస్తృత పరచుటకై పోరాటం, సైనిక ఒడంబడికలకు వ్యతిరేకంగా, సోషలిస్టు మార్కెట్టుతో సంబంధాలు బలపరచుటకు పోరాటాలు కొనసాగించాలి. జాని పున ర్నిర్మాణానికి ప్రజా విధానాలను అవలంభించుటకై ఎడతెగని దృఢ ప్రజా ఉద్యమం పెంపొందించుట ప్రజాస్వామ్య వుద్యమంలో. కార్మికవర్గంలోని చీలికలను అధిగ మించుటకు సరియైన ఐక్య సంఘటనా ఎత్తుగడల నవలంభించాలి. అన్నిరంగాలలో ఎడతెగని ప్రజా కార్యాచరణతో ప్రభుత్వ ప్రణాళికల, ప్లానుల, కార్యక్రమాల నుండి ప్రజలు అత్యధిక ప్రయోజనాన్ని పొందగలగాలి. స్త్రీలకు సమానహక్కులకై శక్తివంతమైన ప్రయత్నాలు, వైద్య, ఆరోగ్య, సాంస్కృతిక విషయాలలో ఫలితాల నిచ్చే చొరవ, కార్యాచరణ చేబట్టాలి. ప్రజాసంఘాల విస్తరణ, బలరపచుట చేయాలి. ప్రజా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం చేయాలి.

ఈ కర్తవ్యాలన్నీ ఏక కాలంలో నిర్వహించినపుడు మాత్రమే, అట్టి కార్యాచరణలో భాగంగా ప్రజా పోరాటాలు సాగించినపుడు, ప్రజాస్వామ్య సంఘటన విస్తరణ బలపరచుట, ఎడతెగకుండా సాధ్యమగుతుంది. పాక్షిక పోరాటాలను సమన్వయపరచి, ప్రజా వ్యతిరేక ప్రభుత్వ విధానాలను మార్చగలిగినంతటి శక్తివంతమైన ప్రజా రాజకీయోద్యమంగా రూపొందించినపుడు మాత్రమే, ప్రభుత్వం అభ్యుదయకర విధానాలను చేబట్టు సాధ్యము. ఈ కర్తవ్యాలను నిర్వహించుటతో విఫలమైన, తక్షణ పోరాటాలను బలహీనపరచుటయేగాక, పోరాటాలు స్థానిక పరిమితులకు లోనై ఎదగక, ప్రజాస్వామ్య ఉద్యమంపై శక్తివంతమై ప్రభావాన్ని మొత్తం మీద కలుగచేయ జాలవు. ఉద్యమాలు విస్తృతి పొంది బలోపేతమైన ఉద్యమాలుగ అభివృద్ధి చెందవు.

## కొన్ని బలహీనతలు :

ప్రజాస్వామ్య ఉద్యమ ప్రధాన బలహీనతే ప్రజా సంఘాలలో కొనసాగే అనైక్యత, కార్మికవర్గం, అఖిల భారత ప్రతిపక్ష పార్టీల వివిధ కార్మిక సంఘాలుగ చీలిపోయి ఐక్యతను, పోరాట పటిమను కోల్పోయింది. కార్మిక సంఘాల, కార్మిక వర్గ ఐక్యతకై జరిగే పోరాటంలో గణనీయమైన అభివృద్ధి జరిగిందని గుర్తించుకొనాలి. యాజమాన్య దాడికి వ్యతిరేకంగా అభివృద్ధి చెందే కార్మికవర్గ పోరాటాలలో కార్మికవర్గ ఐక్య పోరాటశక్తి బలపడి పెరిగింది.

వివిధ రాజకీయ పార్టీలకు పక్షాలకు అనుబంధ సంస్థలుగ వివిధ రాజకీయాభిప్రాయాలను కలిగి వున్నా అన్ని కార్మిక సంఘాలు అనేక అఖిల భారత ట్రేడు యూనియన్‌ల ఫెడరేషనులుగా ఏర్పడి, ముఖ్య కేంద్రాలలో ప్రత్యక్ష కార్మిక సంఘాలు కలసి, కార్మికుల ప్రయోజనాలు కాపాడుటకై సంయుక్త కమిటీలుగ ఏర్పడుట పెరిగే ఐక్యతా వాంఛకు నిర్దిష్ట రూపం తప్ప మరొకటి కాదు.

భారత-సోవియట్-చైనాల మధ్య అభివృద్ధి చెందుతున్న స్నేహ సంబంధాలు ట్రేడు యూనియన్ ప్రతినిధుల పరస్పర సంబంధాలు అన్నీ కమ్యూనిస్టు వ్యతిరేక దురభిప్రాయాలను అరికట్టుటకు తోడ్పడినవి. ఐక్యతా వాంఛను పెంచుటకు తోడ్పడినవి. ట్రేడు యూనియనుల ఐక్యతను నూతన పైస్థాయికి కొనిపోవుటకు తగిన పరిస్థితులు ఏర్పడినవి.

## ట్రేడుయూనియన్‌ల ఐక్యత :

పాలక వర్గాలు ట్రేడుయూనియనుల ఐక్యతాభివృద్ధిని ఎదుర్కొనుటకు స్వతంత్ర ట్రేడుయూనియన్ వుద్యమాన్ని బలహీనపరచి, రూపుమాపుటకు విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు. ట్రేడుయూనియన్‌ల ఐక్యత అనే ముసుగులో నేడు, చట్టరీత్యా పాలకవర్గాలు వారి ప్రాపకంలో ట్రేడుయూనియనులను ఐక్యంచేసి, తమ

విధానాల ప్రతిఘటనాభివృద్ధికి అడ్డుకట్టలు వేయాలని, కార్మికవర్గం తమ విధానాలను అనుసరించునట్లు చేయాలని ప్రయత్నిస్తున్నది.

మొన్నటి రెండు పక్షాల రైల్వే వర్కర్సు ఫెడరేషనుల ఒప్పందం, పోస్టు అండ్ టెలిగ్రాఫ్ కార్మికులు, రక్షణ కార్మికులు, వుద్యోగులు ఆయా సంఘాల ఒకే ఒక ఫెడరేషనులుగా యేర్పడుట పాలక వర్గాల విధానాలను త్రిప్పికొట్టుటయే అయింది. రైల్వే మెన్స్ ఫెడరేషను, యితర ఫెడరేషనుల ఐక్యత నేటి ట్రేడు యూనియనుల ఐక్యతా పోరాటానికి అనువగు పరిస్థితులను కలుగజేసింది. ఒక పరిశ్రమలో ఒకే యూనియన్ అనే సూత్రం ప్రాతిపదికపై ఆఫీసు కార్యకర్తలను, కమిటీలను ప్రజాస్వామ్య పద్ధతులపై ఎన్నుకొని ఒకే యూనియన్‌గా పని చేయ వచ్చును. అటువంటి ఐక్యతకు విడతెగని ప్రచారాన్ని కొనసాగించాలి. ఐక్యత లేనిదే, కార్మికవర్గంపై రుద్దబడే 'నల్లచట్టాలను' నిరోధించే ప్రతిఘటనా పోరాటాన్ని విజయవంతంగా సాగించజాలదు. అట్టి పోరాటాలలోనే కార్మికవర్గ ఐక్యత నిర్మించ బడుతుంది.

పెట్టుబడిదారుల, ప్రభుత్వ దాడికి వ్యతిరేకంగా జరిగే పోరాటం, జీవన పరిస్థితులు మెరుగుపరచే పోరాటంతో, ప్రజాస్వామ్య ఉద్యమ కర్తవ్యాలతో తప్పనిసరిగా మిళితం చేయాలి. ఇది కార్మికవర్గాన్ని ఐక్యపరచుటయేగాక తన కోరికల పోరాటాలకు మద్దతును చేకూర్చుతుంది. ప్రజలు తమ జీవన పరిస్థితులను మెరుగుపరచుటకు, పౌరహక్కులకు, జాతి పునర్నిర్మాణం కొరకు, జరిగే పోరాటాలలో భాగస్వాములగుదురు. ఐక్యతా పోరాటం, ప్రజాస్వామ్య వుద్యమం యీ దృక్పథంతో చూడగలగాలి ఈ విధంగానే కార్మికవర్గాన్ని చీల్చి, జాతీయ పునర్నిర్మాణమనే పేరుతో ప్రజాసామాన్యాన్ని కార్మికవర్గానికి వ్యతిరేకంగా నిలబెట్ట ప్రయత్నించే ప్రభుత్వ విధానాన్ని వమ్ము చేయగలము. ఐక్య కార్మికవర్గం ప్రభుత్వం, యాజమాన్యాల నుండి ముఖ్య రాయితీలను పొందగలుగుటయేగాక, రాబోవు కాలంలో ప్రజాస్వామ్య వుద్యమానికి అగ్రగామిగా నడువగలుగుతుంది.

ఈ పరిస్థితులలో ట్రేడు యూనియనుల ఐక్యతను నిర్మించుట, అఖిల భారత స్థాయిలో ప్రతి పరిశ్రమలో ఐక్య కేంద్ర ట్రేడు యూనియనుల ఫెడరేషనుల ఏర్పాటు చేయుట, వాటిలో ప్రజాస్వామిక ఆచరణను అమలు చేయుట తక్షణ కర్తవ్యమైంది. అన్ని స్థాయిలలో కార్మిక సంఘాలలో ప్రజాస్వామ్య పద్ధతులలో పని చేయుట అత్యంత ప్రాధాన్యత వహించింది.

పార్టీ కాంగ్రెసు కార్మికోద్యమంలోని ముఖ్య బలహీనతను పేర్కొంది. కార్మిక వర్గంలో రాజకీయ చైతన్యాన్ని పెంపొందించనందున, పార్టీ ప్రభావంలో వున్న క్రింది స్థాయిలో అత్యంత బలహీనంగా వుంది. కావున కాంటి, పొ

హక్కులు వంటి ప్రజాస్వామిక సమస్యలపై పెద్ద ఎత్తున ప్రజా సమీకరణ చేయజాలకపోయింది. కార్మిక వర్గానికి, రైతాంగానికి మధ్య సరియైన, నికరమైన మైత్రి, సహకార సంబంధాలను నెలకొల్పుటలో పార్టీ వైఫల్యత ప్రధానంగా కన్పడుతుంది. కార్మిక వర్గం రైతు సమస్యలు చేబట్టి ఉద్యమాలు నడిపి, కార్మిక, కర్షక మైత్రిని సుస్థిరంగా ఏర్పరచుటలో అదే విధంగా కార్మిక సమ్మె పోరాటాలకు రైతుల సహాయ, సానుభూతి కార్యచరణలను చేబట్టుటలో పార్టీ వైఫల్యత కన్పడుతున్నది. కాన పార్టీ కార్మిక, కర్షక ఐక్యతను నినాదాలలో గాక ఆచరణలో సహాయ, సానుభూతి ఉద్యమాలను నిర్మించుటలో శ్రద్ధాశక్తుల చూపాలి.

రైతుల, వ్యవసాయ కూలీ భేదఖళ్ళు, అధిక పన్నులకు వ్యతిరేకంగా పోరాటాలు, పంటలకు న్యాయమైన ధరలకు, వ్యవసాయ ఋణాలు, జీవన వేతనాలు, భూమికై ఆందోళనలు గణనీయంగా పురోగమించాయి. జీవన పరిస్థితులు దిగజారుటతో మధ్యతరగతి ఉద్యోగులు తమంతట తామే తీవ్ర అసంతృప్తితో సంఘటితులై, యిప్పటి వరకు కార్మిక వర్గానికే ప్రధానంగా పరిమితమైన సమ్మె పోరాటాలను, నూతన పోరాట రూపాలను చేబట్టుతున్నారు. అదే విధంగా విద్యార్థి, యువజన, మహిళా రంగాలలో పోరాటాలు జరుగుతున్నవి.

ప్రభుత్వ ప్రణాళికలు, ప్రాజెక్టులు, స్కీములు దూరంగా వుండే వైఖరి కొనసాగుతూనే వుంది. దీనిని పూర్తిగా విడనాడి, వాటిలో అవినీతి, దుబారా, అసమర్థత, లంచగొండితనం, బ్యూరాక్రటిక్ విధానాలకు వ్యతిరేకంగా పోరాడుతూ, ప్రజలకు సాధ్యమైనన్ని ఎక్కువ ప్రయోజనాలు చేకూర్చవలసి వుంది. స్థానిక సంస్థలలో ప్రజాస్వామ్య విధానాలకై నేడు పోరాడవలసి వుంది.

మత, కుల అభివృద్ధి నిరోధకులు బూటకపు సమస్యలపై ద్వేషాలను పెంచి ప్రజా ఐక్యతను విచ్ఛిన్నం చేయు ప్రయత్నాలను ఎదుర్కొని, పోరాడి ఉద్యమాల ఐక్యతను కాపాడాలి.

**తక్షణ కార్యక్రమము :**

కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు ఆమోదించిన యీ క్రింది తక్షణ కార్యక్రమాన్ని ప్రజల ముందుంచుతున్నది. వీటిని సాధించిన మన జాతి స్వాతంత్ర్యం బలపడి బహుముఖంగా జాతీయ ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతుంది.

1) యుద్ధ ప్రమాద వ్యతిరేకత, ప్రజా వినాశనం కావించే అణ్వాయుధాలు, అటంబాంబులను ధ్వంసం చేయుట, నిరాయుధీకరణ, 2) సైనిక సంఘాలకు సీటో, బాగ్దాద్, నాటో ఒప్పందాలకు వ్యతిరేకత, 3) ఆసియా ఐక్యతను బలపరచుట, ఆసియా-పసిఫిక్ ప్రాంతంలో సమిష్టి శాంతి ఒప్పందం, 4) ఐక్యరాజ్యసమితిలో చైనా స్థానాన్ని పునరుద్ధరించుట, సోవియట్ యూనియన్, చైనాలతో పంచశీల ప్రాతిపదికగా స్నేహ, సహకార, సహజీవన సంబంధాలను పెంపొందాలి.

5) సామ్రాజ్యవాద వ్యతిరేక, వలస విముక్తి పోరాటాలకు పూర్తి మద్దతు, 6) గోవా విముక్తికి పటిష్ఠమైన చర్యలు, 7) పాకిస్తాన్‌తో సంబంధాలను అభివృద్ధిపరచుట, 8) బ్రిటిష్ కామన్‌వెల్తుతో సంబంధాలను త్రెంచుకొనుట-ప్రధాన విదేశాంగ విధానాంశాలుగ చేబట్టాలి.

**జాతి పునర్నిర్మాణం, స్వాతంత్ర్యాన్ని బలపరచుట :**

జాతి పునర్నిర్మాణానికై పారిశ్రామిక, వ్యవసాయ, వనరుల, నీటిపారుదల, విద్యా, వైద్య ఆచరణ కార్యక్రమాలను చేబట్టాలి.

ఎ) పరిశ్రమలు :— 1) భారీ, మౌలిక పరిశ్రమలకు ప్రాధాన్యత, 2) జాతీయ పరిశ్రమలకు విదేశీ పోటీ నుండి రక్షణ, 3) సహజంగా వీలైన ప్రాంతాలలో పరిశ్రమల స్థాపన, వివిధ ప్రాంతాలలో సమాన విస్తరణ 4) ప్రభుత్వ రంగంలో ఆయుధ, విమాన, నావికా పరిశ్రమలు జాతి స్వాతంత్ర్యాన్ని బలపరచే ధ్యేయంలో, 5) భారీ, మౌలిక పరిశ్రమలతోపాటు సాధ్యమైన వినిమయ వస్తోత్పత్తి చిన్న, గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి కొనసాగించాలి.

బి) వనరులు :— 1) జాతి పునర్నిర్మాణానికై, బ్యాంకింగ్, భీమా, బొగ్గు, అల్యూమినియం, మాంగనీసు, రాగి, ఇనుము, ఉక్కు, బంగారుగనులు, బ్రిటిష్ ఆధిపత్యంలోని జనపనార మిల్లులు, తోటలు తక్షణం జాతీయం చేయాలి, 2) లాభాల ఎగుమతిపై పరిమితి, దాటిన తప్పని అప్పుగా స్వాధీనం చేసుకొనుట. 3) అన్ని పెద్దపరిశ్రమలు, వ్యాపార సంస్థల లాభాలపై పరిమితి, మించిన దానిని తప్పనిసరి అప్పుగా తీసుకొనుట. 4) ఇవి, పెద్ద కంపెనీల రిజర్వు నిలువలను జాతీయాభివృద్ధికి ప్రభుత్వ, ప్రవేటు రంగాలలో జాతీయ ప్రయోజనాల దృష్ట్యా వినియోగించుట. 5) విదేశీ వ్యాపారం ప్రభుత్వ గుత్త వ్యాపారంగా వుండాలి. 6) లాభాలపై అధికపన్నులు, వ్యక్తిగత ఆస్తులపన్ను తరగతుల క్రమంలో ఆదాయపుపన్ను, వ్యక్తి, కుటుంబఆదాయ పరిమితుల పన్ను 7) పెద్ద భూస్వాముల నష్ట పరిహారాన్ని వాయిదా వేయుట. 8) సంస్థానాధీశులకు ప్రీవీపర్సుల రద్దు. 9) రాజుల ధనాన్ని నిర్బంధ అప్పుగా స్వీకరించుట. 10) పెద్ద ఉద్యోగుల జీతాల తగ్గింపు 11) ఆదాయపన్ను ఎగవేతదారులపై నిర్బంధ వసూలు. 12) ప్రాజెక్టులలో దుబారాపై నిఘా, తగ్గించుట చేయాలి.

సి) వ్యవసాయం :— 1) తక్షణ వ్యవసాయ సంస్కరణలు, కౌలు బాగా తగ్గించుట. 2) భూగరిష్ఠ పరిమితి నిర్ణయం, మిగులును నష్టపరిహారం లేకుండా స్వాధీనం చేసుకొని వ్యవసాయ కూలి, పేదరైతులకు పంచుట. 3) భూ సంస్కరణల అమలుకు రైతుల, వ్యవసాయ కూలీల కమిటీలను యేర్పాటు చేయుట. 4) సాగుకులాయకైన ప్రభుత్వ బంజరులను పేద రైతులు, వ్యవసాయ కూలీలకు పంచుట 5) రైతుల అప్పుల రద్దు, అప్పుల రాజీ బోర్డుల నిర్మాణం 6) సహకార

ఉద్యమ విస్తరణ. వ్యవసాయ యంత్రాల పనిముట్లు, ఎరువులు అందజేయుట. 7) వ్యవసాయ కూలీల అప్పులు రద్దు చేయుట, కనీస వేతన నిర్ణయం 8) రైతుల పంటలకు న్యాయమైన ధరల నిర్ణయం చేబట్టాలి.

డి) నీటి పారుదల :— ప్రధాన బృహత్ ప్రాజెక్టులతో బాటు అనేక చిన్న, మైనరు ప్రాజెక్టులు చేబట్టాలి. నీట పారుదల ప్రాజెక్టుల పెట్టుబడిపై బ్యాంకు వడ్డీ రేటు గిట్టుబాటు కావాలనే కొలమానాన్ని వదిలివేయాలి. పవరు ప్రాజెక్టులు, ట్యూబులు వెల్సులను ప్రభుత్వమే భరించాలి. నీటి పన్ను తగ్గించాలి.

ఇ) కార్మికవర్గం :— 1) ప్రధాన పరిశ్రమలలో రేషనలైజేషన్ పేరుతో పని తీవ్రతను పెంచి, ఉత్పత్తి పెంచుటను ఆపి వేయాలి 2) వేరు కూలిని పనీభ వించు విధానాన్ని ఆప వేయాలి, జాతి కనీస వేతనాన్ని నేటి ధరకు పెంచాలి 3) పైది జరిగే లోపల 25 శాతం వేతనాలను పెంచాలి 4) ప్రా థమిక బీమా పథ కాన్ని అన్ని పరిశ్రమలకు విస్తరించాలి 5) నిరుద్యోగ జీవనభృతిని చట్టబద్ధం చేయాలి 6) గృహ సమస్యను సమర్థవంతంగా పరిష్కరించాలి 7) బోనస్పై హక్కును గుర్తించాలి.

ఎఫ్) విద్య :— 1) ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యను 14 సంవత్సరాల వయసు వరకు అందించాలి 2) విద్యా విధానాన్ని పునర్నిర్మించాలి 3) విశ్వవిద్యా లయ విద్య వరకు మాతృ భాషలోనే విద్య గరపాలి, హిందీకి ప్రోత్సాహమివ్వాలి 4) విద్యా, ప్రజాస్వామ్యహక్కులు విద్యార్థులకు, ఉపాధ్యాయులకు వుండాలి 5) ఉపాధ్యాయులకు తగిన వేతనాలు యివ్వాలి.

జి) ఆరోగ్యం :— నగర, గ్రామీణ ప్రాంతాలలో తగిన 1) ఆరోగ్య, ప్రసూతి సౌకర్యాలు 2) అన్ని ప్రాంతాలకు త్రాగునీరు అందిచ్చుట చేయాలి.

**ప్రజాస్వామ్య విస్తరణ :**

ప్రజాస్వామ్య విస్తరణలోనే వారి సృజనాత్మక శక్తిని, చొరవను పెంపొం దించగలము. మన ప్రజాశిక్షల బురాక్రటిక్ ఆచలణ, అసమర్థతకు, లంచగొండి తనానికి, దుబారాకు దారి తీస్తున్నవి. వ్యవసాయ సంస్కరణల విద్రోహానికి దారి తీస్తుంది. పౌరహక్కులు, ప్రజాస్వామ్య హక్కులపై దాడి చేస్తూ ప్రజా చొరవను పెంపొందించలేము.

అందువలన యీ క్రింది తక్షణ అవసర చర్యలు చేపట్టాలి.

1) రాజ్యాంగాన్ని ప్రజాస్వామ్య మొనర్చాలి. రాజ్యసభ, కౌన్సిలులను రద్దు చేయాలి, దామాషా నిష్పత్తి ఎన్నికల విధానంలో ప్రతినిధుల ఎన్నిక జరగాలి. రహస్య వోటింగు, తిరిగి వెనుకకు పిలిపించే హక్కు ప్రజలకుండాలి. అన్ని స్థాయి లలో ఉద్యోగులు, ఎన్నికల సంస్థల కంట్రోలులో వుండాలి. యూనియన్ ప్రాంతా

లలో నామినేటెడ్ కౌన్సిలు పరిపాలనలో గాక, ప్రజాస్వామ్య పద్ధతిలో వుండాలి.

2) సంఘంగా ఏర్పడుటకు, సభలు, సమావేశాలు, ఊరేగింపులు, ప్రదర్శనలకు హక్కుల గ్యారంటీ వుండాలి.

3) పోలీసు కోడ్‌ను, వారి అధికారాలను తగ్గిస్తూ తిరిగి వ్రాయాలి.

4) నాటక ప్రదర్శన 1876 చట్టాన్ని రద్దుచేసి, పోలీసుల సెన్సారిషిప్‌ను, షరతులను, ప్రదర్శన హాలును అద్దెకు తీసుకొనుటలో నిర్బంధాలను రద్దుచేయాలి.

5) పై నుంచి దిగుమతి అయ్యే ట్రేడుయూనియనులను ప్రతిఘటించాలి. ఒక పరిశ్రమలో ప్రజాస్వామిక పద్ధతులలో యేర్పడే ఒకే యూనియన్ వుండాలి. వాటి ఐక్యతను పెంపొందించాలి.

6) ట్రేడుయూనియనులను, సమిష్టి కోర్కెల ప్రకటనను గుర్తించాలి.

7) కార్మికులకు ట్రేడుయూనియన్ హక్కులు గ్యారంటీ చేయాలి. దేశ రక్షణ చట్టాల క్రింద విచక్షణారహితంగా కార్మికులను అరెస్టు, నిర్బంధం తొలగించుట రద్దు కావాలి. చిత్తరంజన్, హీరాకుడ్, ప్రాంతాలను విశేష ప్రాంతాలుగ ప్రకటించుట రద్దుకావాలి.

8) కార్మికులకు, ఉద్యోగులకు, పారిశ్రామిక సంస్థల యాజమాన్యంలో, నడపుటలో చురుకైన పాత్ర నివ్వాలి. కార్మికులు, ఉద్యోగులచే ఎన్నికకాబడిన కమిటీల, పాలక యాజమాన్యంతో సమాన అధికారాన్ని, బాధ్యతను కలిగి వుండాలి.

9) ఉద్యోగుల స్టేటు ఇన్సూరెన్సు, యితర సామాజిక సేవా కార్యక్రమాల, స్కీముల యాజమాన్య, అధికార బాధ్యతను ట్రేడుయూనియనులకు అప్పగించాలి.

10) వెనుకబడిన హరిజనులు, షెడ్యూల్డు కాస్టులు, ఆదివాసుల భౌతిక, సాంస్కృతిక అభివృద్ధికి తగినంత మొత్తాలను కేటాయించాలి.

11) స్త్రీలకు సమాన హక్కులు, భూమి హక్కులు, సమాన జీతం, ప్రసూతి శలవులు వగైరా.

12) కాందిశీకులకు పని, పునరావాసం, జీవనం కల్పించాలి.

13) వ్యవసాయ సంస్కరణల అమలులో రైతు, వ్యవసాయ కూలి సంఘాలకు తగినపాత్ర నివ్వాలి.

14) స్థానిక స్వపరిపాలన సంస్థలన్నిటికి, బాధ్యతలు నిర్వహించుటకు అధికారాల నివ్వాలి.

15) స్థానిక అభివృద్ధి కార్యక్రమాలు, కమ్యూనిటి, విస్తరణ కార్యక్రమాలను పంచాయితీలకు అప్పజెప్పి పరిపాలన ఖర్చులు తగ్గించాలి.

16) లంచగొండితనానికి వ్యతిరేకంగా ఉద్యమం కొనసాగించాలి.

17) న్యాయశాఖను, పరిపాలన శాఖనుండి వేరుచేయాలి.

## పాల్ఘాట్ కాంగ్రెసులో అంతర్గత పోరాటం :

"పార్టీ అంతర్గత పోరాటం, వాస్తవంగా వర్గపోరాటం; అనుసరించిన పద్ధతి, విధానాలు వర్గేతరాలు, కాన మార్క్సిజం, లెనినిజం త్రోసిపేస్తుంది. ఒక దేశంలోని లేక ప్రపంచంలోని రాజకీయ శక్తులను "మంచివి", "చెడ్డవి", అభ్యుదయకరమైనవి", "అభ్యుదయ నిరోధకమైనవి" అని ఏకమొత్తంగా విశ్లేషణ చేయు విధానం మార్క్సిజానికి, లెనినిజానికి దూరమైనది. ప్రతిగ్రూపు, వ్యక్తులు, పార్టీల రాజకీయాలు, ఆచరణ. వారు ఏ వర్గ ప్రయోజనాలను చేబట్టారు అనే దానిపై అంచనా వేయాలి". కాని "నాల్గవ, ఐదవ మరింత తీవ్రంగా ఆరవ పార్టీ కాంగ్రెసులలో భారత కార్మికవర్గ పార్టీయైన కమ్యూనిస్టు పార్టీ విప్లవ కర్తవ్యం. పాలకవర్గం పాలకవర్గ ప్రతినిధియైన కాంగ్రెసు ప్రభుత్వంలోని వర్గాలలోని కొంతమంది ఎక్కువ అభ్యుదయకర భాగమని వారితో ఐక్యమగుట సరియైనదా, కాదా అనే ప్రశ్నపై చర్చించారు" [1] యిది మార్క్సిజం లెనినిజం కాజాలదని నంబూద్రిపాద్ విమర్శించారు. ఇంకా "రెండు వైఖరులతో ఏదో ఒక దానిని బలపరచినవారు, యీ మౌలిక వాస్తవికతను మరచారు. నెహూ్రి ప్రభుత్వం అభ్యుదయకరమైనదని వాదించిన వారిలో అత్యధికులు దానిని బలపరచి సహకరించాలనే వైఖరి నవలంబించారు, మిగతావారు రాజీలేని వ్యతిరేక వైఖరి నవలంభించారు. ఇదే ఉద్రేకపూరిత తీవ్ర చర్చలకు దారి తీసిందన్నారు" నంబూద్రిపాద్. "ఈ విధమైన దృక్పధం, దానిలోనే సంస్కరణవాద, పిడివాద బీజాలను వారి సిద్ధాంత విశ్లేషణలో మితవాద, అతివాద, అవకాశవాదాలను అమలు చేయు ఆచరణలో కలిగి వుంది" [2] అని వివరించారు.

ఆర్థికాంశాల, విధానాల పాల్ఘాట్ అంచనాలపై నంబూద్రిపాద్ సుదీర్ఘమైన వాఖ్య, వివరణ చేసారు. నాల్గవ కాంగ్రెసు ఏప్రియల్ 1956 లో కొన్ని మార్పులతో చివరకు ఆమోదించిన, రాజకీయ తీర్మానం, అనేక విషయాలలో అస్పష్టంగా వుందని తరువాత తెలిసింది. తీర్మానం ప్రధమ పంచవర్ష ప్రణాళిక, ఆహారపదార్థాల ప్రత్తి, జనపనార పారిశ్రామిక ముడిసరుకుల అధికోత్పత్తిని, విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని పెంచుటను, కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయ విస్తరణ ప్రాజెక్టుల విజయాలను అభినందించుతూ పై విజయాల వలన జాతి ఆర్థిక పరిస్థితి బహుముఖంగా బలపడలేదని, జీవన ప్రమాణం పెరగలేదని, కమ్యూనిటీ, జాతీయ విస్తరణ కార్యక్రమాల వలన ప్రధానంగా ధనిక రైతులే లాభించారని, ప్రజల పరిస్థితి మెరుగు కాకపోగా

1. నంబూద్రి పాద్, ఇ.యం.యస్. (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్ పే. 72.
2. ............ ఆదే ... ........ పే. 74.

క్షీణించిందని, గుత్త పెట్టుబడిదారులకు అధిక లాభాల ఉత్పత్తి పెరిగిందని, వారితో పాటు బ్రిటిష్ పెట్టుబడి అధిక లాభాలను పొందిందని వివరించారు నంబూద్రిపాద్.[1]

తీర్మానం రెండవపంచవర్ష ప్రణాళిక చిత్తును పరిశీలించి, మొదటి ప్రణాళిక వంటి సుముఖ ప్రతిపాదనలున్నాయని నిర్ధారణ చేసింది. పారిశ్రామిక రంగంలో ప్రణాళికా అమలు విదేశాలపై ఆధారిత ఆర్థిక విధానాన్ని మెరుగుపరుస్తుందని స్వాగత వచనాలుచెప్పింది, భూకమతాల గరిష్ట పరిమితి, స్వంతకమతాల పరిమితి, స్పష్టంగా సరియైన సూచనలున్నవి. కాని వ్యవసాయ సంస్కరణలు ప్రతిపాదనలలో వ్యవసాయ కూలీలకు భూములను పంచేకార్యక్రమంలేదని, ప్రణాళిక వనరుల విధానంలో వైఫల్యం స్పష్టమని విమర్శించారు.

"ప్రథమ ప్రణాళిక ఫలితాలను, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రతిపాదనలను తీర్మానం ఆవిధంగా అంచెనా వేయుట పార్టీ గుడ్డి పిడివాదాన్నుండి బయటపడుటకు మితవాద అవకాశవాదంపై పోరాటాన్ని సాధించుటలో ధృడపడిందని[4]" నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు.

తీర్మానంగాని, తీర్మానానికి ముందు జరిగిన చర్చలుగాని, పార్టీలో చెలరేగుతున్న అంతర్గత రాజకీయ, సిద్ధాంతపోరాటాన్ని, సమన్వయం, నిర్ధారణలు, ముఖ్యంగా పారిశ్రామికీకరణ వేగంగా చేయుటకు, ప్రభుత్వపారిశ్రామికరంగ విస్తరణ ప్రతిపాదనలు, భూసంస్కరణ, భూగరిష్ట పరిమితి ప్రతిపాదనలు రూపొందించునపుడు, చేయజాలకపోవుట వైఫల్యాలలో ప్రధానమైనది. ఒక దృక్పథం ప్రకారం బూర్జువా వర్గం మొత్తంగా ప్రతిపాదనలకు అనుకూలంగా వుందని మరో దృక్పథ ప్రకారం బూర్జువా వర్గంలో ఒక భాగం మాత్రమే అనుకూలంగా వుందని అంటుంది. అయితే బూర్జువా వర్గంలో యేభాగం అనుకూలం, యేభాగం వ్యతిరేకం అనే విషయంలో అభిప్రాయభేదాలున్నాయి. అంతేగాక పాలక వర్గాలలో ఘర్షణలు ప్రారంభమైనపుడు, యేవర్గం త్వరితంగా పారిశ్రామికీకరణకు, భూసంస్కరణలకు, ప్రభుత్వరంగంలో పారిశ్రామికీకరణకు, విస్తరణకు అనుకూలం, యే వర్గం అనుకూలంకాదు అనేచర్చ ప్రతిసారివస్తూనే వుంది. పార్టీలోని వివిధగ్రూపులు, వర్గాలు భిన్నవైఖరులను వెలబుచ్చుతూనే వున్నారు. పార్టీలో సిద్ధాంత పోరాటం పార్టీ పురోగమనానికి బదులు అది మందగించునట్లు చేసిందని నంబూద్రిపాద్ వివరించారు[2].

"కేంద్రసమితి చిత్తు తీర్మానంపై చెలరేగిన, అంతర్గత సిద్ధాంత పోరాటాన్ని పాల్ఘాట్ పార్టీ కాంగ్రెసు సమీక్షించి, నిర్ధారణలు చేయవలసిన కాలంలోనే సోవియట్

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్ (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా (ఆంగ్లంలో) సి. పి. ఐ. పబ్లికేషన్. పే. 72.

3. ........... అదే ........... పే. 72-3.

కమ్యూనిస్టుపార్టీ 20వ, కాంగ్రెసు చిత్తు తీర్మానంలో నూతన పంథా, భారతకమ్యూనిస్టులనేగాక, ప్రపంచ కమ్యూనిస్టులందరిని ఆశ్చర్యంలో ముంచింది. భారత 4వ, పార్టీ కాంగ్రెసు చర్చలలో ప్రగాఢప్రభావాన్నికలుగజేసింది. కేంద్రసమితి విధానాన్ని వ్యతిరేకించే వారికి నూతన ఆత్మవిశ్వాసాన్నిచ్చింది. కేంద్రసమితి చిత్తు తీర్మానంతో మైనరు భేదాభిప్రాయలు గల వర్గాలు, మితవాదం నుండి వచ్చే ప్రమాదాన్ని గమనించి. తమ ప్రత్యామ్నాయ తీర్మానాన్ని ఉపసంహరించుకొని, కేంద్ర సమితి చిత్తు తీర్మానానికి వోటు చేసారు.

"పార్టీకాంగ్రెసులో చర్చలలో, కాంగ్రెసునుండి కమ్యూనిస్టుల వరకు గల అన్నివర్గాల ఐక్యసంఘటనను, సంయుక్త ప్రభుత్వ ఏర్పాటు మార్గంలో నిర్మించాలా? కాదా? అనే సమస్య కేంద్రస్థానాన్ని ఆక్రమించి, చివరకు వోటింగులో సంఘర్షణ తీవ్రమైంది. పార్టీలో మూడవవంతు దానికి వోటువేయటంతో 'మితవాదంవైపు' మొగ్గే ప్రమాదం వాస్తవమైంది. కేంద్రసమితి చిత్తు తీర్మానాన్ని బలపరచేవర్గం, కాంగ్రెసుతో ఐక్యసంఘటనను, సంయుక్త ప్రభుత్వాన్ని వ్యతిరేకించే వర్గం, చిత్తు తీర్మానంతో కొన్ని అభిప్రాయాభేధాభిప్రాయాలున్నా కలసి వోటుచేసి, మితవాద వర్గాన్ని వోడించుట జరిగింది[1]" అనే అభిప్రాయాలను నంబూద్రిపాద్ వెలిబుచ్చారు. స్థూలంగా సుందరయ్య[2] యిదే అభిప్రాలు తెలియజేసారు.

"ఏప్రియల్ 1956లో జరిగిన 4వ పార్టీ కాంగ్రెసు తీర్మానం ప్రకారం 1951 పార్టీ కార్యక్రమం తాత్కాలికంగా ప్రక్కనపెట్టాలని, 4వ, పార్టి కాంగ్రెసు ఆమోదించిన రాజకీయ తీర్మానం మార్గదర్శకం కావాలని నిర్ణయించారు[1]"

అంతేగాక "ఏప్రియల్ 1952పార్టీ కార్యక్రమం తాత్కాలికంగా ప్రక్కన పెట్టాలని, 4వ, పార్టీ కాంగ్రెసు ఆమోదించిన రాజకీయ తీర్మానం మార్గదర్శకం కావాలని నిర్ణయించారు[3]".

అంతేగాక "ఏప్రియల్ 1956లో జరిగిన 4వ, పార్టీ కాంగ్రెసు ముందుకు మూడు విభిన్నమైన రాజకీయ పంథాలు వచ్చాయి. మొదటిది, కేంద్ర సమితిలో అజయ్ నాయకత్వంలో అత్యధికులు అనుసరించిన పంథా: రెండవది, పి. సి. జోషి రాజేశ్వరావు తదితరులు ప్రతిపాదించిన తీవ్ర సంస్కరణవాద పంథా. దీనికి వారు మహాసభలో మూడవవంతు బలాన్ని సమకూర్చుకొన్నారు. దీనినే వారు ప్రత్యామ్నాయ పంథాగా పేర్కొన్నారు. మూడవ పంథాను ఐదుగురు కేంద్ర సమితి

---

1. నంబూద్రిపాద్ (1987) ఒక ఇండియన్ కమ్యూనిస్టు జ్ఞాపకాలు (ఆంగ్లంలో) పే 154-వ
2. సుందరయ్య (1988) విప్లవపథంలో నా పయనం రెండవభాగం. పే. 118.
3. బసవపున్నయ్య, మాకినేని (1978) మన కార్యక్రమము ప్రజాశక్తి ప్రచురణ పే. 17.

సభ్యులు కామ్రేడ్స్ పుచ్చలపల్లి సుందరయ్య, మాకినేని బసవపున్నయ్య, సూర్జిత్, మోటూరి హనుమంతరావు, ప్రసాదరావులు ప్రతిపాదించారు. తమ సవరణలు కొన్ని అధికారపంధా ఆమోదించిన తరువాత, ఆ పంధాను సమర్ధిస్తూ, తమ ప్రత్యామ్నాయ తీర్మాన ప్రతిపాదనను వుపసంహరించుకొన్నారు." [1]

"మన పొల్బ్యూట్ తీర్మానం జాతీయ ఆర్థిక విధానం బలపడుటను స్పష్టం చేసింది. కాని అశేష ప్రజానీకపు జీవితంలో ఎట్టి మార్పును తీసుకొనిరాలేదనే విషయాన్ని కూడ పేర్కొంది. తీర్మానం రెండవ ప్రణాళికా చట్రాన్ని భారీ పరిశ్రమల నిర్మాణాన్ని ప్రభుత్వరంగంలో చేబట్టుటను, వ్యవసాయ సంస్కరణలను ప్రవేశపెట్టుటను పరిశీలించింది.

"అంతకుముందు చెప్పినట్లు మన పొల్బ్యూట్ విధానం 1951 అవగాహనను వదలి వేసి, వాస్తవిక అంచనాలకు వచ్చుటకు తోడ్పడింది. ప్రభుత్వం పెట్టుబడిదారీ మార్గంలో ఆర్థిక స్వాతంత్ర్యాన్ని బలపరస్తుందని, పారిశ్రామికీకరణ విధానం, వ్యవసాయ సంస్కరణలు బలపరచవలసి వుంటుందని, అయితే గుత్త పెట్టుబడిదార్లుకు, భూస్వాములకు రాయితీలను కలుగజేస్తూ, మరోవైపు ఆ భారాన్నంతా ప్రజలపై మోపుతున్నదని, విమర్శించింది. ఈ విశ్లేషణను ఆధారం చేసుకొని, "బలపరచుట—పోరాడుట" అనే ఆదరణ విధానాన్ని ఆర్థిక రంగంలో రూపొందించబడిందని" [2] అధికారి వివరించారు.

## సోవియట్ పార్టీ 20 వ కాంగ్రెస్‌పై పొల్బ్యూట్ వైఖరి :

పార్టీ కార్యదర్శి అజయ్‌ఘోష్, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ కాంగ్రెసుపై నివేదికను, భారత కమ్యూనిస్టుపార్టీ 4 వ కాంగ్రెసులో సమర్పించారు.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20 వ కాంగ్రెసుపై కార్యదర్శి సమర్పించిన నివేదికను ఆమోదించి, అత్యంత ప్రాముఖ్యత గలిగిన విషయంగా, కాంగ్రెసు నిర్ణయాలను ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలన్నీ తీవ్రంగా అధ్యయనం చేయవలసి వుందని, అన్ని పార్టీ కమిటీలు, సభ్యులు, ఆ పత్రాలను అధ్యయనం చర్చలు, కార్యదర్శి నివేదిక సహాయంతో కొనసాగించాలని విజ్ఞప్తి చేస్తూ తీర్మానించింది.

"సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20 వ కాంగ్రెసు అంతర్జాతీయ

---

1. బసవపున్నయ్య, మాకినేని (1978) మన కార్యక్రమము ప్రజాశక్తి ప్రచురణ పే. 17.

2. అధికారి జి. (1964) కమ్యూనిస్టుపార్టీ అండ్ ఇండియాన్ పాత్ ఆఫ్ నేషనల్ రీజనరేషన్ అండ్ సోషలిజం (ఆంగ్లంలో) పే. 139.

కమ్యూనిస్టు ఉద్యమం చరిత్రలో ముఖ్య ఘట్టము. మహోన్నత విజయాల ప్రాతిపదికగా, మరిన్ని విజయాలకు మార్గదర్శికమైంది. పిడివాద సిద్ధాంతాలను త్రోసిపేసి, మార్క్సిజాన్ని లెనినిజాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి చేసి, నేటి సమస్యలను సాహసంతో పరిష్కరించింది. అది యే అవకాశాలు మన ముందున్నవి చూపించి, దేశభక్తి, ప్రజాస్వామ్య, సోషలిస్టు శక్తులన్నిటిని ఏ విధంగా ఐక్యపరచి వాటిని సాధించవచ్చునో, ప్రతి దేశంలో అన్ని రంగాలలో ఏ విధంగా పురోగమించి, ప్రజల కార్మికవర్గ ప్రయోజనాలను పొందుటలో విజయాన్ని పొందవచ్చునో చూపెట్టింది" [1] అని అజయ్‌ఘోష్ తన నివేదికను ముగించారు.

**భాషా ప్రయుక్త రాష్ట్రాలపై తీర్మానం :**

"భారత కమ్యూనిస్టుపార్టీ నాల్గవ కాంగ్రెసు దేశంలోని వివిధ భాషా జాతుల వీరోచిత పోరాటాలు ద్వారా, భాషా ప్రయుక్త రాష్ట్రాలను పొందుటలో సాధించిన విజయాన్ని అభినందించుచున్నది. ఈ పోరాటాలు, విజయాలు, ప్రజాస్వామ్య శక్తులకు, నూతనోత్సాహాన్ని యిచ్చినవి. మన దేశపు మహత్తర ఐక్యతను బలోపేతం చేయుటకు తోడ్పడినవి" అని తీర్మానంలో పేర్కొని, "బొంబాయి, మహారాష్ట్ర, పశ్చిమబెంగాలు ప్రజలు శాంతియుతంగా సత్యాగ్రహ పోరాటాన్ని సాగించుటను అభినందించింది. పార్టీ తన శక్తినంత ఉపయోగించి, వారు బొంబాయిని మహారాష్ట్రములో వుంచుటకు, బెంగాల్-బీహార్‌లను కలిపి ఒకే రాష్ట్రంగా చేయు ప్రయత్నాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటాల లోనికి పూర్తి మద్దతునిచ్చి, ఆ ప్రతిపాదనను ఉపసంహరించుకొనునట్లు చేయుటకు పోరాడుతుందని వాగ్దానం చేస్తూ" [2] తీర్మానం ముగించింది.

పంజాబ్‌లో భాషా ప్రయుక్త ప్రాతిపదికపై పంజాబీ-హిందీ మాట్లాడే ప్రాంతాలను ఏర్పాటు చేయాలని ఆందోళనను కొందరు మత సమస్యగా చేసి, శాంతి భద్రత సమస్యలను సృష్టించు ప్రయత్నాలకు ఆందోళనను వెలిబుచ్చింది. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు సూత్రం చివరకు విజయం పొందుతుందనే విశ్వాసం తనకు కలదని, ప్రజలు సోదర భావంతో ఐక్యతను కొనసాగించాలని విజ్ఞప్తి చేస్తూ విచ్ఛిన్నకర ప్రయత్నాలను ప్రతిఘటించాలని పంజాబీ-హిందీ భాషా రాష్ట్రాల ఏర్పాటుకు మద్దతును ప్రకటించింది.

ముగింపుగా, పార్టీ కాంగ్రెసు సోవియట్ పార్టీ 20వ, కాంగ్రెసు నూతన పంథానుగాని, వ్యక్తి పూజా విధానంపై విమర్శ సమన్వనుగాని, వలస స్వాతంత్ర్య

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు (ఆంగ్లంలో). వా. viii. పే. 572-4.

2. ....అదే....పే.252-4.

పోరాటాల నూతనదశనుగాని, నూతన స్వాతంత్ర్యదేశాలు పెట్టుబడిదారేతరపంథా అంతర్జాతీయంగా వుద్భవించిన సమస్యలనుగాని, ఆ వెలుగులో జాతీయ సమస్యలను ముఖ్యంగా భారతీయ పోరాటపంథా, భారతపారిశ్రామిక, వ్యవసాయ ఆర్థికాభివృద్ధి పంథా, భారత శాంతి, తటస్థ విదేశాంగ, పంచశీల పంథాలను మౌలిక సమస్యలుగా అధ్యయనంగాని, చర్చించుటగాని తీవ్ర అభిప్రాయభేదాలవలన సాధ్యం కాలేదు. అదే విధంగా 1951 కార్యక్రమాన్ని, వాస్తవ పరిస్థితులను ప్రతిబింబించే విధంగా తిరిగి రూపొందించాలని అత్యధికులు ఆమోదించినా, భవిష్యత్తుకే వదలి వేయబడింది. పార్టీ కాంగ్రెసు తక్షణ కార్యక్రమాన్ని మాత్రమే యివ్వగలిగింది.

## iii

# సిద్ధాంత సమస్యలు

సోవియట్ వారపత్రిక "న్యూటైమ్సు" ఆగస్టు 1956లో" అభివృద్ధి చెందని దేశాలకు పెట్టుబడి దారేతర పంథా" అనే శీర్షికలో మోడెస్టెరూబిన్‌స్టేన్ వ్యాసాలు, భారతదేశంలోని ఆర్థికాభివృద్ధి రూపాలను విశ్లేషణ చేయు ప్రయత్నం అందరినీ ముఖ్యంగా కమ్యూనిస్టులను ఆకర్షించింది. కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి, అమెరికా ప్రభుత్వ సమాచారశాఖ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ, కాంగ్రెసులో కృశ్చేవ్ రహస్యనివేదిక పూర్తి పాఠం అంటూ ప్రకటించిన దానిని పరిశీలించవలసిన పరిస్థితి యేర్పడింది. దీనితోపాటు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి జూన్ 1956లో "వ్యక్తి పూజావిధానంపై ఆమోదించిన తీర్మానం సంచలనం కలుగజేసింది. ఈ కాలంలోనే 1956 నవంబరు మొదటివారంలో జయప్రకాశ్‌నారాయణ కృశ్చేవ్ నూతనవిధానం, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ, కాంగ్రెసు స్టాలిన్ వ్యక్తి పూజా విధానాన్ని విమర్శించి తెగనాడుటతో కలిగిన స్ఫూర్తితో, అజయ్‌ఘోష్‌కు పరస్పరం అభిప్రాయాలను తెలుసుకొంటూ, నూతన అవగాహనలకు దృక్పథాలను శోధించే ప్రయత్నంగా వ్రాసిన లేఖతో యేర్పడిన పరిస్థితి, అన్నీ కలసి పార్టీలో చర్చలు ముందుకొచ్చాయి. "పాల్ఘాట్ కాంగ్రెసులో అపజయాన్ని పొందినప్పటికి, సమస్యను కొద్దిమాసాలలోనే తిరుగుతోడుటకు ప్రయత్నించారు. అట్టి అవకాశం, న్యూటైమ్సు ఆగస్టు సంచికలలో మోడెస్టెరూబెన్‌స్టేన్ ప్రకటించిన 1956లోని వ్యాసాలలో లభించింది. ఈ వ్యాసంలో రూబెన్‌స్టేన్, నెహ్రూ ప్రభుత్వం పెట్టుబడిదారేతర మార్గంలో సోషలిజంవైపు పురోగమించే పంథాను అనుసరించుచున్నదనే అవగాహనను విశదీకరించారు. వెంటనే అదే వ్యక్తులు పాల్ఘాట్‌లో ఆమోదించబడిన రాజకీయవిధానాన్ని తిరిగి చర్చించుటకు కేంద్ర సమితి ఆమోదించాలని కోరుతు, రూబెన్‌స్టేన్ అవగా

ఘన మార్గంలో రాజకీయవిధానాన్ని తిరిగి రూపొందించాలన్నారు[1]". ఈ విధంగా పార్టీలో అంతరంగిక చర్చలు అంతులేకుండా కొనసాగాయని చెప్పవచ్చును.

## రూబెన్‌స్టీన్ భారత అభివృద్ధి పంథా

ఆసియా, ఆఫ్రికాలలో స్వతంత్ర దేశాలు చేబట్టబోయే అభివృద్ధి పంథా పశ్చిమ దేశాలలో చర్చనీయాంశమైంది. అమెరికా ప్రభుత్వం, యీ వెనుకబడిన దేశాలు చవకముడి సరుకులు, ఆహార పదార్థాలు పారిశ్రామిక పశ్చిమ దేశాలకు ఎగుమతి చేసేవిగానే వుండిపోతాయనే అభిప్రాయాన్ని కలిగివుంది. ఈ దేశాలు పెట్టుబడి దారి మార్గంలో అభివృద్ధిచెంది, కాపిటలిజం కొత్త రక్తంతో పుంజుకొనునట్లుచేస్తాయి అనే మరో అభిప్రాయాలున్నాయి. కాని యీ రెండూ వాస్తవంగాదు. వెనుకబడిన దేశాలలోని ప్రజ స్వతంత్ర విధానంలో పురోగమించాలనే బలమైన అభిలాషను, ప్రపంచజనాభాలోని మూడవవంతు సోషలిస్టు వ్యవస్థగా పరిణామ మొందిందనే ముఖ్యాంశాలను పరిగణంలోనికి తీసుకొన జాలకపోయారు. ఈ వాస్తవాన్ని, మొత్తం యీ శకానికి సంబంధించిన పరిణామాన్ని ఆచరణాత్మకంగా, మొదట సోవియట్ యూనియన్ పరిశీలించింది.

చైనా సోషలిస్టు పరిణామాలు ప్రపంచంపై చెరగని ముద్రను వేసాయని "ఆసియాలో కళ్ళు తెరచుకొని పర్యటించిన స్పష్టమని" చికాగో యూనివర్శిటి అధిపతి నిపుణుడు హన్స్ జె మోర్గన్ గుర్తించుటను, రూబెన్‌స్టీన్ పేర్కొన్నారు. ఆసియా, ఆఫ్రికాల ముందు, వలసలుగా వుండి పోవుటో, లేక పెట్టుబడిదారి మార్గంలో అభివృద్ధి చెందుటో తప్ప మరో మార్గం లేదనుకొనేవారికి తమ సంకుచిత దృష్టిలో రెండు ఖండాలవారు తమ వెనుకబాటుతనానికి, దశాబ్దాల వలససామ్రాజ్య వాద పెత్తనమని స్పష్టమైన అవగాహనను కలిగివుండుటను చూడజాలకపోతున్నారు. ఈ కారణంగానే ఇండియా, బర్మా ఇండోనేషియా, ఈజిప్టు, సిలోన్ అనేక యితర జాతులు వలససామ్రాజ్యవాదాన్ని అది ఏరూపంలోవున్నా విదేశీయ గుత్తపెట్టుబడిపై అంతటి తీవ్ర, చురుకైన వ్యతిరేకతను కలిగివున్నారు.

ఆసియా, ఆఫ్రికాలలో స్వతంత్రం పొందిన దేశాలు ఆర్థిక, రాజకీయ సామాజిక, సంక్లిష్ట పరిస్థితులను ఎదుర్కొన వలసి వచ్చింది. అవి రాజ్యాంగ నిర్మాణ, ఆర్థిక. సాంస్కృతాభివృద్ధి, జాతుల సమస్య, ఫ్యూడవిధానాన్ని రద్దుచేయు సమస్య కొన్నిదేశాలు పెట్టుబడిదారిమార్గాన్ని, మరికొన్ని సోషలిస్టు నమూనా మార్గాన్ని చేబట్టాయి. యీ రెండిటిలో యే మార్గాన్ని ఆసియా, ఆఫ్రికాలు చేబట్టుతవి' ఆసియాలో పెద్ద దేశాలలో వొకటి అయిన భారతదేశం యీ సమస్య,అర్థికాంశాలు ప్రధా

---

1. రివిజనిజంపై పోరాటం (1965) రాజకీయ నిర్మాణ నివేదిక. భారత కమ్యూనిస్టు పార్టీ (సి. పి. యం) 7వ, కాంగ్రెసులో నవంబరు 1964లో ఆమోదించబడినది.

షంగా యేయే ఆర్థికాభివృద్ధి రూపాలను చేబట్టుతున్నది తన వ్యాసం వివరించుతుందని రూబెన్‌స్టెయిన్ తెల్పారు

**భారతదేశాభివృద్ధి :**

భారతదేశంలోని ఆర్థిక, రాజకీయ, సామాజికాభివృద్ధిలోని ముఖ్యాంశాలు రచయిత వివరించినది క్లుప్తంగా యిలా వుంది.

1) భారత ఆర్థిక విధానంలో విదేశ పెట్టుబడి యింకా బలంగా వుంది. ముఖ్యంగా బొగ్గు, ఆయిలు, జనపనార, టీ, కాఫీ తోటలు, ఇంజనీరింగు, విద్యుచ్ఛక్తి పరిశ్రమలలో నిర్ణయాత్మక పాత్రను కలిగి వుంది. జాతీయ గుత్త పెట్టుబడిదారులు గుడ్డల మిల్లులు, ఇనుము, ఉక్కు, సిమెంటు, ఇంజనీరింగు పరిశ్రమంలో గణనీయంగా వున్నారు.

గుత్త పెట్టుబడిదారులు సోషలిస్టు విధాన పునర్నిర్మాణాన్ని చేబట్టుతారని ఆశించుట అడియాసే అగుతుంది. కాని ఇండియాలో ఒక స్వతంత్ర రాజకీయ, ఆర్థికాభివృద్ధి మార్గంలో పురోగమించుటకు, గుత్తపెట్టుబడి వర్గాల అవిచ్ఛిన్న అభివృద్ధిని అదుపులో పెట్టుటకు, వాస్తవ పరిస్థితులు మెజారిటీ ప్రజా సామాన్యం సోషలిస్టు మార్గాన్ని అనుసరించుటకు అవకాశాలున్నవి.

ఈ మార్గాన్ని నెహూర్రి అనేక దశాబ్దాల నుండి చెప్పుతున్నారు. భారత జాతీయ కాంగ్రెసు 1938 లోనే జాతీయ ప్రణాళికా సంఘాన్ని ఏర్పాటు చేయుట, అతని అధ్యక్షతన పారిశ్రామికీకరణ ప్రధాన లక్ష్యంగా చేబట్టని ఎడల దారిద్ర్యాన్ని నిరుద్యోగాన్ని రూపుమాపి, సరియైన దేశరక్షణ, ఆర్థిక పునర్నిర్మాణాన్ని చేయజాలమని చెప్పబడింది. నెహూర్రి మన ప్రణాళిక ఏదో ఒక రూపంలో తప్పని సరిగా సోషలిస్టు రూపాలకు దారి తీస్తుందని" పేర్కొన్నారు.

2) స్వాతంత్ర్యానంతరం ఆర్థిక వెనుకబాటుతనాన్ని, నిరుద్యోగాన్ని, దారిద్ర్యాన్ని రూపుమాపుటకు సోషలిజమే మార్గంగా కనపడింది. సహజంగానే సోషలిజాకి అనేక నిర్వచనాలు చేయబడ్డాయి. సోషలిస్టు అభిప్రాయాల అభివృద్ధి పార్లమెంటు డిసెంబరు, 1954 లో ఆమోదించిన తీర్మానం "మన ఆర్థికాభివృద్ధి ధ్యేయం సోషలిస్టు నమూనా సమాజాభివృద్ధి, యీ లక్ష్య సాధనకై ఆర్థిక కార్యక్రమాన్ని, ప్రత్యేకంగా పారిశ్రామికాభివృద్ధిని సాధ్యమైనంత వేగోధృతి పొందునట్లు చేయవలసి వుంది" అని పేర్కొంది.

భారత జాతీయ కాంగ్రెసు జనవరి 1955 అవడి మహాసభలో తన మౌలిక ధ్యేయం "సోషలిస్టిక్ నమూనా సమాజాన్ని నిర్మించుట"గా పేర్కొనుటయే గాక ఎ) ప్రధాన ఉత్పత్తి సాధనాలు సామాజిక పరంలోగాని లేక ఆధ్వర్యంలోగాని వుండుట బి) ఉత్పత్తి క్రమేణా పెంచుట సి) జాతీయ సంపదను సమాన ప్రాతిపదికపై పంచుట డి) అందరికి క్రమేణా ఉద్యోగాలు, 10 సంవత్సరాలలో నిరు

ద్యోగ నిర్మూలన అని వివరించింది. ఆవడి తీర్మానాన్ని వివిధ వర్గాలు భిన్న భిన్నముగా నిర్వచించినా, ప్రభుత్వ విధానం పారిశ్రామికీకరణ వేగోద్ధృతిని పెంచుట, యంత్రాలను తయారుచేసే భారీ యంత్ర పరిశ్రమలను ప్రభుత్వరంగంలో నిర్మించుట. అదే రెండవ పంచవర్ష ప్రణాళికతో, పారిశ్రామిక విధానంపై ప్రభుత్వం 30 ఏప్రియల్ 1956 లో పార్ల మెంటులో ప్రతిపాదించిన తీర్మానంలో స్పష్టం చేయబడింది.

3) జాతీయ బూర్జువావర్గం, భారీ పరిశ్రమలను నిర్మించే వనరులుగాని, సాంకేతిక సౌకర్యాలుగాని సాధారణంగా కలిగి లేదు. ఈ వాస్తవ పరిస్థితులన్నిటను బట్టి వెనుకబడి అభివృద్ధికాని దేశాలలో భారీ పరిశ్రమలు ముఖ్యంగా ఇనుము, ఉక్కు, విద్యుచ్ఛక్తి, యంత్ర పరిశ్రమలు, రసాయన పరిశ్రమలు, ప్రభుత్వరంగంలోని పరిశ్రమలుగ మాత్రమే సాధ్యమని నిర్ణయానికి రావచ్చును. ఈ అభిప్రాయం గత కొద్ది సంవత్సరాల అనుభవ నిర్ధారణకు బలాన్ని చేకూర్చింది.

భారత ఆర్థికాభివృద్ధి, పారిశ్రామికాభివృద్ధి విధానాలనే ఆసియా, ఆఫ్రికాలలోని, బర్మా, ఇండోనేషియా, మలయా, సిలోన్‌లు, ఈజిప్టులు అవలంభించుచున్నవని రచయిత, పెట్టుబడిదారేతర మార్గాన్ని అనుసరించే దేశాలుగా ఉదహరించారు.

4) విదేశీయ గుత్త పెట్టుబడిదారులు, వెనుకబడిన దేశాల పారిశ్రామికీకరణపై ఆసక్తి కనబరచలేదు. ముఖ్యంగా భారీ పారిశ్రామికాభివృద్ధిపై అసలే లేదు. ఈ సందర్భంలో అమెరికా కాంగ్రెసుకు హూవర్ కమిషన్ జూన్ 1955 లో అర్పించిన నివేదిక "ఆసియా, ఆఫ్రికాలలో జపాన్ మినహా ఎక్కడా భారీ పరిశ్రమల ప్రాజెక్టులను చేబట్టరాదు. వ్యాపారీత్యా అవసరమైన పదార్థాల ప్రాజెక్టులు తప్ప, చిన్న పరిశ్రమ ప్రాజెక్టులకు మాత్రమే పరిమితమవ్వాలి" అని స్పష్టం చేసింది.

5) క్లుప్తంగా నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు పెట్టుబడిదారేతర మార్గంలో ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధిని, ప్రభుత్వరంగంలో భారీ పారిశ్రామిక వాడలను, పరిశ్రమలను ఏర్పాటు చేస్తూ, సోషలిజం వైపు పురోగమించ వచ్చును. విదేశీయ గుత్త పెట్టుబడిదారి వర్గాలు యీ దేశాల భారీ పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడవు. జాతీయ బూర్జువా వర్గానికి భారీ పరిశ్రమలను స్థాపించే వనరులు సాంకేతిక పరిజ్ఞానం లేదు. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థలోని దేశాలు తోడ్పడుటకు సిద్ధంగా ఉన్నవి. ఇది పెట్టుబడిదారేతర పారిశ్రామికీకరణ, ఆర్థికాభివృద్ధి సిద్ధాంతం అని చెప్పుకొనవచ్చును.

**భారత కమ్యూనిస్టుపార్టీ విమర్శన :**

రూబెన్‌స్టేన్ వ్యాసంలో ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని కమ్యూనిస్టుపార్టీ కేంద్ర

సమితి చర్చించి, నిరాకరించిన ప్రాతిపదికగా అజయ్‌ఘోష్ విమర్శన ప్రకటించారు. అందులోని ముఖ్యాంశాలు, సంక్షిప్తంగా యిలా వున్నవి. [1]

1) నేటి భారతదేశ పరిస్థితులలో ప్రభుత్వ పెట్టుబడి పరిశ్రమలు, పశ్చిమ దేశాలతో పోల్చినపుడు అభ్యుదయకర పాత్ర వహించగలవనే సూత్రీకరణ భారత కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధానంలో స్పష్టంగా వుంది. "ఈ విధానం జవహర్‌లాల్ నెహ్రూచే అనేక సంవత్సరాలుగ చెప్పబడుతున్నదని" రచయిత వ్రాయుట ఆశ్చర్యాన్ని గొల్పుతుంది. కాని, ప్రభుత్వ రంగంలో పరిశ్రమల విస్తరణను పార్టీ ఎప్పుడూ బలపరుస్తునే వుంది.

2) జాతీయ కాంగ్రెసు ఆవడి తీర్మానం నుండి రచయిత ఉదహరించుతు మౌలిక ఆర్థిక సంస్కరణల యెడల పాలక పార్టీ వైఖరిని సమర్థించ ప్రయత్నించారు. కాని, భారత ప్రధాన ఆర్థిక రంగాలైన బొగ్గు, ఆయిలు, జనపనార, టీ, కాఫీతోటలు వాటి ఆర్థిక, రాజకీయ ప్రభావాలను, అవి విదేశీయ పెట్టుబడుల క్రిందనే వుండుట, అధిక లాభాల ఎగుమతులు, భారత ఆర్థిక, రాజకీయ, వాస్తవ పరిస్థితులను రచయిత చూడజాలకపోయారని విమర్శించారు.

3) పాలక పార్టీ, ప్రభుత్వ ప్రకటనలు, ఆచరణలోని వ్యత్యాసాలు, అంతరాలు, పారిశ్రామిక రంగాలలోని నికర ఆదాయాలు, వేతనాలు, ప్రజలపై పరోక్ష ప్రత్యక్ష పన్నులు, భూ సంస్కరణల నష్టపరిహార భారం ఏ ఏ రాష్ట్రంలో ఎంత పడింది సోదాహరణంగా అజయ్ వివరించారు. అంతేగాక, పంచవర్ష ప్రణాళికను ఆవడి సోషలిజాన్ని రూపొందించుచున్నదని కాక, దాని అమలు స్వతంత్ర జాతీయ విధానం బలపడుటకు, ప్రజల జీవన పరిస్థితులు కొంత మెరుగు కాగలవని కమ్యూనిస్టు పార్టీ బలపరుస్తున్నదని స్పష్టంచేసారు. ఆచరణలో ప్రజలపై అధిక భారాన్ని మోపుటను విమర్శించారు.

4) భారత ప్రభుత్వం, సామ్రాజ్యవాదంపై పూర్తిగ ఆధారపడే విధానాన్ని విడనాడి, సోషలిస్టు దేశాలతో ఆర్థిక, వ్యాపార, పారిశ్రామిక సంబంధాలను పెంపొందించుకొనుటయేగాక, శాంతి రక్షణ, యుద్ధ వ్యతిరేక విధానాలకు బలాన్ని చేకూర్చుతుంది. యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా ప్రపంచశాంతికి కృషిచేస్తున్నది. ఈ చర్యలు జాతీయ స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలకు, ప్రపంచ ప్రజల ప్రయోజనాలకు అనుగుణంగానే వున్నవి. కమ్యూనిస్టు పార్టీ వీటిని తన విధానాలుగానే బలపరుస్తున్నది.

భారత ప్రభుత్వానికి సామ్రాజ్యవాదానికి గల వైరుధ్యం; ఫ్యూడలిజానికి బూర్జువావర్గ ప్రభుత్వానికి గల వైరుధ్యం కారణంగా, దేశీయ అంతర్గత విధానాలలో

1. అజయ్‌కుమార్‌ఘోష్ (1956) భారతదేశ అభివృద్ధి పంథా. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర అధికార పత్రాలు (ఆంగ్లంలో) 1977. వా. viii పే. 588-602

సమితి చర్చించి, నిరాకరించిన ప్రాతిపదికగా అజయ్ఘోష్ విమర్శన ప్రకటించారు. అందులోని ముఖ్యాంశాలు, సంక్షిప్తంగా యిలా వున్నవి. [1]

1) నేటి భారతదేశ పరిస్థితులలో ప్రభుత్వ పెట్టుబడి పరిశ్రమలు, పశ్చిమ దేశాలతో పోల్చినపుడు అభ్యుదయకర పాత్ర వహించగలవనే సూత్రీకరణ భారత కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధానంలో స్పష్టంగా వుంది. "ఈ విధానం జవహర్ లాల్ నెహూృచే అనేక సంవత్సరాలుగ చెప్పబడుతున్నదని" రచయిత వ్రాయుట ఆశ్చర్యాన్ని గొల్పుతుంది. కాని, ప్రభుత్వ రంగంలో పరిశ్రమల విస్తరణను పార్టీ ఎప్పుడూ బలపరుస్తునే వుంది.

2) జాతీయ కాంగ్రెసు ఆవడి తీర్మానం నుండి రచయిత ఉదహరించుతు మౌలిక ఆర్థిక సంస్కరణల యెడల పాలక పార్టీ వైఖరిని సమర్థించ ప్రయత్నించారు. కాని, భారత ప్రధాన ఆర్థిక రంగాలైన బొగ్గు, ఆయిలు, జనపనార, టీ, కాఫీతోటలు వాటి ఆర్థిక, రాజకీయ ప్రభావాలను, అవి విదేశీయ పెట్టుబడుల క్రిందనే వుండుట, అధిక లాభాల ఎగుమతులు, భారత ఆర్థిక, రాజకీయ, వాస్తవ పరిస్థితులను రచయిత చూడజాలకపోయారని విమర్శించారు.

3) పాలక పార్టీ, ప్రభుత్వ ప్రకటనలు, ఆచరణలోని వ్యత్యాసాలు, అంతరాలు, పారిశ్రామిక రంగాలలోని నికర ఆదాయాలు, వేతనాలు, ప్రజలపై పరోక్ష ప్రత్యక్ష పన్నులు, భూ సంస్కరణల నష్టపరిహార భారం ఏ ఏ రాష్ట్రంలో ఎంత పడింది సోదాహరణంగా అజయ్ వివరించారు. అంతేగాక, పంచవర్ష ప్రణాళికను ఆవడి సోషలిజాన్ని రూపొందించుచున్నదని కాక, దాని అమలు స్వతంత్ర జాతీయ విధానం బలపడుటకు, ప్రజల జీవన పరిస్థితులు కొంత మెరుగు కాగలవని కమ్యూనిస్టు పార్టీ బలపరుస్తున్నదని స్పష్టంచేసారు. ఆచరణలో ప్రజలపై అధిక భారాన్ని మోపుటను విమర్శించారు.

4) భారత ప్రభుత్వం, సామ్రాజ్యవాదంపై పూర్తిగ ఆధారపడే విధానాన్ని విడనాడి, సోషలిస్టు దేశాలతో ఆర్థిక, వ్యాపార, పారిశ్రామిక సంబంధాలను పెంపొందించుకొనుటయేగాక, శాంతి రక్షణ, యుద్ధ వ్యతిరేక విధానాలకు బలాన్ని చేకూర్చుతుంది. యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా ప్రపంచశాంతికి కృషిచేస్తున్నది. ఈ చర్యలు జాతీయ స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలకు, ప్రపంచ ప్రజల ప్రయోజనాలకు అనుగుణంగానే వున్నవి. కమ్యూనిస్టు పార్టీ వీటిని తన విధానాలుగానే బలపరుస్తున్నది.

భారత ప్రభుత్వానికి సామ్రాజ్యవాదానికి గల వైరుధ్యం; ఫ్యూడలిజానికి బూర్జువావర్గ ప్రభుత్వానికి గల వైరుధ్యం కారణంగా, దేశీయ అంతర్గత విధానాలలో

---

1. అజయ్‌కుమార్ ఘోష్ (1956) భారతదేశ అభివృద్ధి పంధా. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర అధికార పత్రాలు (ఆంగ్లంలో) 1977. వా. viii పే. 588-602

నుద్దేశించి, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20వ, కాంగ్రెసు వివిధ నివేదికలు, తీర్మా నాలు, స్టాలిన్ వ్యక్తి పూజా విధానంపై నివేదిక, తీర్మానం, సమాజం నేటి పరిస్థితులలో సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనావకాశాలు, కార్మికవర్గ నియంతృత్వము, విప్లవ హింసాత్మకం, అహింసాత్మకం ఆది విషయాలపై పునరాలోచించాలని కోరుతూ నవంబరు 1956 లో రాజకీయ లేఖను అజయ్‌ఘోష్‌కు వ్రాసారు.[1] అందులో లేవనెత్తిన సిద్ధాంత సమస్యలను సంగ్రహంగా తెలుసుకొందాము.

1) కృశ్చేవ్ బహిర్గతం చేసిన విషయాలనేకం, గతంలో అనేకమంది చెప్పారు. ఇన్ని దేశాల కమ్యూనిస్టు నాయకులు, యింతకాలం సత్యాలకు దూరంగా చీకటిలో ఎలా వుండిపోయారు. కృశ్చేవ్ బహిర్గతం చేసినవి నిజానికి రహస్యాలు గావు. కమ్యూనిస్టు నాయకత్వాలు నిశ్శబ్దంగా ఎలా వుండిపోయారు. ఈ ప్రశ్నలకు విశ్వసించతగిన సమాధానం యింతవరకు లభించలేదు.

కమ్యూనిస్టులు కృశ్చేవ్ ఎంతవరకు చెప్పాడో అక్కడితోనే ఆగిపోదలచారా, ముందుకు సత్యాన్వేషణకు పోతలచుట లేదా? కృశ్చేవ్ పూర్తిగ చెప్పాడా? కమ్యూనిజం పేరుతో జరిగిన హింసా, దౌర్జన్యకాండను నిరసించాడా? అందులో తన పాత్రను ఆత్మశోధన చేసుకొన్నాడా? కిరోవ్ హత్యద్రోహ చర్య అయితే కామనీవ్, బుఖారిన్‌ల మాటేమిటి? స్టాలిన్ రాజకీయ ప్రత్యర్థులను ప్రజాద్రోహులు. ప్రజాశత్రువులు అని క్రూరాతి క్రూరనిందలతో రూపుమాపుట సత్యం కాదా? అదే నిందను కృశ్చేవ్ బెరియా బృందంపై మోపి, అడ్డు తొలగించుట ఎంతవరకు సోషలిస్టు న్యాయం? ఎంతకాలం కమ్యూనిస్టులు మాస్కో మాటలను నమ్మి, స్వతంత్ర మార్క్సిస్టు దృక్పథంతో ఆలోచించుట మానివేస్తారు?

2) కమ్యూనిస్టులు ఆశించే విలువలు యేమిటి? మానవ స్వాతంత్ర్యం, ఔన్నత్యం, సోదరత్వం, సమానత్వం, శాంతి కాదా? స్వాతంత్ర్య స్వరూపం అంత్య ధ్యేయంగా ప్రభుత్వ యంత్రాంగం క్రమేణా కృశించి, అదృశ్యమౌతుందని చిత్రించుకున్నది ఎంతటి మహోన్నతమైనది. సమాజంలోని "ప్రతివానికి తన శక్తి కొలది నుండి, ప్రతివానికి తన అవసరంకొలది" అనే కమ్యూనిజపు భావన ఎంత మహోన్నతమైనది. విప్లవ దౌర్జన్యం, కార్మికవర్గ నియంతృత్వం, ప్రజాస్వామ్య కేంద్రీకరణ; జాతీయకరణ, సమిష్టీకరణ, అన్నీ ఆ మహోన్నత శిఖరాలను చేరుటకు సాధనాలుగ భావించబడ్డాయి. అవి కనుచూపు మేరలో వున్నవా? రాజ్యాంగ యంత్రం కృశించి, అదృశ్యమగుటకు మారుగ సర్వశక్తిగల రాకాసిగ మారింది. సమానత్వం సుదూర స్వప్నమైంది. అంతర్జాతీయ సోదర భావం నూతన వలస

1. జయప్రకాశ్‌నారాయణ్ (1956).

రూపమైంది. నేడు పోలిష్లు, హంగేరియనులు, యుగోస్లోవియనులు స్వాతంత్ర్యం కొరకు సాహసోపేతంగా పోరు సల్పుతున్నారు. శాంతి యుద్ధసన్నద్ధతకు అర్థంగా అయింది.

3) నా కమ్యూనిస్టు మిత్రులు యీ విషయాలు ఎలా ఆలోచించుతున్నారో ఆశ్చర్యంగా వుంది. గతంలో నా వంటి వారెందరో యీ సత్యాలను చెప్ప ప్రయత్నించి దూషణలకు లోనయ్యారు. నేడు కమ్యూనిస్టులు వారంతట వారే ముసుగు తీసారు. భారత సోషలిస్టులు స్టాలినిజం, సోవియట్ నియంతృత్వాల తీవ్ర విమర్శకులు కాని కమ్యూనిస్టు సూత్రాల వ్యతిరేకులు కారు.

భారత కమ్యూనిస్టులు మాస్కో నుండి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుతారా? నా మిత్రులు మేము ఎల్లప్పుడూ స్వతంత్రలమే అని చెప్పవచ్చు. వారు అలా అంటే నేను పాపం అంటాను. కారణం వారికి తెలుసు. అది అసత్యమని, ఏమైనా వారిని ఎవ్వరూ నమ్మరు. పోలెండు, హంగరీలలోని స్టాలిన్ శిష్యులు ఆలాగే చెప్పారు. ఆ దేశాల ప్రజలు వారిని త్రోసిపారవేసారు. అసత్యాలెప్పుడూ, సత్ఫలితాల నివ్వవని కమ్యూనిస్టులు తెలుసుకొనవలసిన రోజు వచ్చింది.

4) ప్రజలు కమ్యూనిస్టుల నుండి కొన్ని ప్రశ్నలకు సమాధానాలపై ఎదురు చూస్తున్నారు. స్వాతంత్ర్యం, స్వయం నిర్ణయాలకై పోరాడే హంగేరియనులను రష్యా క్రూరంగా అణచివేస్తున్నది. భారత కమ్యూనిస్టుపార్టీ హంగెరీ స్వాతంత్ర్యం వైపు నిలబడుతుందా లేక రష్యావైపా? కమ్యూనిజం భవిష్యత్తు యీ ప్రశ్నకు సమాధానంపై ఆధారపడి వుంది.

నేటి కమ్యూనిస్టు ప్రభుత్వాలన్నీ హింస, భౌతిక హింసల బిడ్డలు. అంతులేని హింసతో రష్యాలో విప్లవం వచ్చిందా? ఆర్థిక విజయాలను మాత్రమే సంపాదిస్తే అది విప్లవమా? పెట్టుబడిదారి విధానం, ఫాశిజంలు ఆర్థిక పారిశ్రామిక విప్లవాలను తెచ్చాయి. సోషలిజం, కమ్యూనిజం సామాజిక జీవన విప్లవం, మానవ విలువల ఔన్నత్యం. కమ్యూనిస్టుల ధ్యేయం మానవాళి మహోన్నత సమసమాజం. అంతటి వున్నతమైన దానిని హింసా, అసత్యాచరణలతో ప్రజలకు అందజేయలేరు. కమ్యూనిస్టులు సత్యశోధనకై ప్రయత్నించాలి.

5) కమ్యూనిస్టు ప్రభుత్వాలు ప్రజా నిర్ణయాన్ని యెప్పుడూ పాటించలేదు. ఎన్నికలు జరిగాయి కాని ప్రతిపక్షాలు, పౌరహక్కులు లేకుండా, హిట్లరు ఎన్నికల లాంటివి. కమ్యూనిస్టులు ఫాశిస్టు ఏకపాలనను ఖండించారు కాని తమ యేక పార్టీ పాలనను, తమ నమూనా ప్రజాస్వామ్యం న్యాయబద్ధం చేసారు. పశ్చిమ దేశాలలో రూపొందిన ప్రజాస్వామ్యం ఆదర్శవంతమైనదికాదు. కాని ఏక పార్టీ విధానం మరీ చెడ్డది. భారత ప్రజలు కమ్యూనిస్టులు ప్రజాస్వామ్యానికా లేక నియంతృత్వానికి కట్టుబడి వుంటారా తెలుసుకొనదలచారు.

నా కమ్యూనిస్టు మిత్రులు వొక్క రాజకీయ సమాధానంతో సరిపెట్టుకోరని ఆశించుతాను. దీనిని తెగనాడే విమర్శనను వ్రాయగలిగిన కమ్యూనిస్టు భావన, అవగాహన, పదజాలం తనకు వుందన్నారు. అది వ్యర్థ ప్రయత్నం. తనపై కొన్ని పాయింట్లను స్కోరు చేయుటకు ప్రయత్నించక తీవ్రంగా ఆలోచించ కోరుతున్నానన్నారు. కొన్ని మాటలు పరుషంగా వున్నా, అవి అత్యంత స్నేహభావ ప్రేరితాలన్నారు.

మూడున్నర దశాబ్దాల క్రితం లేవనెత్తిన ప్రశ్నలు, నేటి సోషలిజం, కమ్యూనిజం సంక్షోభంలో తాజా ప్రశ్నలుగ కన్పడుతున్నవి.

**అజయ్‌ఘోష్ ప్రత్యుత్తరం :**

అజయ్‌ఘోష్, జయప్రకాశ్‌నారాయణ వుత్తరానికి యిచ్చిన సమాధానం, సంక్షిప్తంగా యీ క్రింది విధంగా వుంది.

1) "ఉత్తరానికి సమాధానంలో మీ వాదనలకు ప్రతివాదనల ప్రయత్నం చేయదలచలేదని స్పష్టం చేయదలచుకొన్నాను, మీరన్నట్లు అట్టి ప్రయత్నం వ్యర్థ ప్రయత్నమేగాక, మనలను గమ్యానికి చేర్చదు. మీ లేఖలోని భావనలు, దాని ప్రేరణ మీనుండి ఆశించినదికాదు. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమపు, సోషలిస్టు వ్యవస్థ అంచెనా లోపభూయిష్టము, యేకపక్షము. హృదయపూర్వక స్నేహభావన ప్రేరణతో లేఖ వ్రాస్తున్నానంటూ, మీపై పాయింట్లను స్కోరు చేయు ప్రయత్నం చేయవద్దంటూ అనుకోకుండా మీరు లేఖలో అట్టి ప్రయత్నమే చేసారు. [1] అని అజయ్ లేఖ ప్రారంభంలో పేర్కొన్నారు.

"సత్యశోధన చేయమని మమ్ము కోరారు. మేమూ అదే కోరికను కోరక తప్పలేదు. మీ మాటల ప్రకారం 40 సంవత్సరాలుగ సోవియట్ యూనియన్‌లో మానవ స్వాతంత్ర్యం, మానవ ఔన్నత్యం బురదలో త్రొక్కివేసారు. ఇది ఎంత వరకు సరియైన అంచనా? ఎంతవరకు నిజం?"

"పెట్టుబడిదారి విధానాన్ని మనిషిని మనిషి దోచుకొనే విధానాన్ని రద్దు చేయుట, కార్మిక, కర్షక, శ్రామిక మేధావి వర్గాల ఎన్నికైన ప్రతినిధుల, పాలన అన్ని స్థాయిలతో మీ దృష్టిలో ఏమీ కాదా? సత్యం కాదా? వెనుకబడిన సోవియట్ యూనియన్ బలోపేతమైన పారిశ్రామికశక్తిగా రూపొందిన మహోన్నత విజయం, ఆ దేశం ఎడల తీసుకొనవలసిన వైఖరిని నిర్ణయించుటలో ఎట్టి ప్రత్యేక పాత్ర వహించజాలదా?" అని ప్రశ్నించారు.

---

1. అజయ్‌ఘోష్ (1956) జయప్రకాశ్‌నారాయణ్ వుత్తరానికి అజయ్‌ఘోష్ సమాధానం భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు. (ఆంగ్లంలో) పి.పి.హెచ్. వా VIII పే.

"నేడు ప్రపంచంలో సోషలిస్టు భావన ఆధిక్యత వహించింది. సోవియట్ యూనియన్ ప్రపథంగా సోషలిస్టు సమాజ నిర్మాణం సాగించింది. మానవజాతిని ఫాసిజాన్నుండి కాపాడింది. పొరుగు చైనా, తూర్పుయూరపు జనతా ప్రజాస్వామ్యాలకు ఎనలేని స్నేహ, సౌభ్రాతృత్వ సహాయాన్నిచ్చింది. మీరు అసంబంధాలను "నూతన వలస విధానమనుటలో సత్యమెంత? చైనాకు, యితర వెనుకబడిన దేశాలకు ప్రపంచంలో ఏ దేశమూ చేయనంత సహాయాన్ని వాటి పారిశ్రామికీకరణకు చేసింది, ఇండియా, ఈజిప్టు, ఇండోనేషియాలకు పారిశ్రామికీకరణకు చేసిన సాంకేతిక సహాయాన్ని, నూతన రకపు సోవియట్ వలస విధానమనుట సత్యదూరం కాదా యని ప్రశ్నించారు

సోవియట్‌లో సోషలిస్టు నిర్మాణం ప్రపంచంలో ప్రథమ ప్రయోగం. సహజంగానే తీవ్ర తప్పులు, పొరపాట్లు జరిగాయి. అయినా ప్రపంచంలో ఏ దేశమూ సాధించలేని విజయాలను సాధించిందని నమ్ముతున్నామన్నారు అజయ్. ఆచార్య నరేంద్రదేవ్ 1934 మే, అఖిల భారత సోషలిస్టు పార్టీ నిర్మాణ సమావేశపు అధ్యక్షోపన్యాసంలో యీ అభిప్రాయాన్నే వెలిబుచ్చారు. రవీంద్రనాద్ ఠాగూర్, రోమన్‌రోలాండులు యిట్టి అభిప్రాయాలనే తెలిపారు.

2) సోవియట్ మహత్తర విజయాలను, ప్రపంచంలో వాటి పాత్రను నొక్కి చెప్పుతూ, తప్పులను పొరపాటులను అత్యల్పంగా నెంచలేదు. పొరపాటులు దాని మౌలిక సోషలిస్టు లక్షణాలను మార్చలేదని, ప్రపంచంలో ఎవ్వరూ చేయని విధంగా సోవియట్ నాయకత్వమే సాహసంతో వెల్లడి చేసిందని, పునరాలోచన సంస్కరణలు వారే ప్రారంభించారు. "మీరు పొరపాటులపై కేంద్రీకరించారు, రెండోవైపు చూడజాలక పోయారు" అని అజయ్ వ్రాసారు.

కృశ్చేవ్ వెల్లడించిన వాస్తవాలు ఇంతవరకు భారత కమ్యూనిస్టు నాయకులకు తెలియకుండా వుండుట సాధ్యమా, చీకటిలో వున్నారా అన్న జయప్రకాశ్, ప్రశ్నకు" మాకు వాస్తవంగా, సోవియట్ నాయకత్వం బయటపెట్టే వరకు తెలియదు" అని అజయ్ అన్నారు.

"సోవియట్ యూనియన్ మచ్చలేని నమూనా యని ప్రస్తుతించుట మేము చేసిన పొరపాటే, అయితే మీరు నరిపడని వాస్తవాలను వదలి "అదొక బానిసత్వ నరకమని", దాని రాజకీయ, ఆర్థిక, పారిశ్రామిక, సైనిక, సామాజిక విజయాలను తెగనాడుట, ఎట్టి విప్లవ స్వాతంత్ర్యం, మార్క్సిస్టు వాస్తవికత అగుతుందని అజయ్ ప్రశ్నించారు. కమ్యూనిస్టులను "మాస్కో కీలుబొమ్మలను"ట "యెంత సత్యదూరమో, చైనా విజయాలు, ఫ్రాన్సు, ఇటలీ కమ్యూనిస్టు పార్టీల విజయాలు, మన దేశంలోనే కమ్యూనిస్టు పార్టీ ప్రధాన శక్తిగ అభివృద్ధి చెందుట, యెలా సమసమర్థించుకొని, వివరించగలరు. మీ మాటలలో కమ్యూనిస్టు విజయాలనన్నిటిని

"హింసా, అసత్యాల" వల్లనే అనుట మార్క్సిజాన్ని అపభ్రంశము చేయుటకాదా[1] అన్నారు అజయ్.

"సోవియట్‌లోని ప్రతి విషయాన్ని ఆదర్శవంతంగా చెప్పటలో మేము పొరపాటు చేసాము. సోషలిస్టు కమ్యూనిస్టేతర ప్రజాస్వామ్యవాదులు సోవియట్‌పై చేసే విమర్శనలకు మరింత శ్రద్ధ వహించవలసినది. మాలో, కమ్యూనిస్టు పార్టీలలో సోవియట్ చేసిన ప్రతిదానిని సమర్థించుట, దానిపై విమర్శనను ఖండించి త్రోసివేసే ధోరణి వున్నదని, కమ్యూనిస్టు-సోషలిస్టు ఐక్యతకు అది కలుగజేసిన నష్టాన్ని గుర్తించామని, దానిని సరిచేసుకొనుటకై, దృఢనిశ్చయంతో వున్నామని"[2] ఆత్మ విమర్శనా ధోరణిలో అజయ్ ఆమోదించారు,

3) నేడు 1950 దశకంలో పోలెండు, హంగరీ సమస్యలకు ప్రపంచ సామ్రాజ్యవాదం, ప్రపంచ సోషలిస్టు రెండు శిబిరాలు, కార్మికవర్గ అంతర్జాతీయ సమస్యల నుండి వేరుగా పరిశీలించితే వాస్తవాన్ని చూడజాలము.

"సోవియట్ యూనియన్ మహత్తర ప్రయత్నం వలనే హిట్లరు కబంధ హస్తాలనుండి పోలెండు, హంగరి, మరెన్నో దేశాలు స్వతంత్రాన్ని పొంది, సోషలిస్టు పారిశ్రామికీకరణను చేబట్టుటను మీరు పూర్తిగ వదలివేసారు. సోవియట్ యూనియన్ యీ దేశాలమధ్య జాతుల సమానత్వ సూత్రాన్ని అమలు చేయుటలోని వైఫల్యంతో సంక్షోభం, నష్టం జరిగిందని స్పష్టంగా ఆమోదించబడింది. "ఆ పొరపాట్లను సంస్కరణల ద్వారా నేడు సరిజేసుకొంటున్నారు" అని అజయ్ వ్యాఖ్యానించి "మావలెనె మీరు యీ పరిణామాలకు, ముఖ్యంగా సోషలిస్టు విప్లవ విజయాలను పరిరక్షింపబడుటలో, తప్పనిసరిగా సంతోషిస్తారని అనుకొంటాను. అక్కడ నిర్మింపబడిన సామాజిక వ్యవస్థలోని యీ మౌలిక తప్పు! వున్నదనే మీ సిద్ధాంత ప్రాతిపదికను పునరాలోచించునట్లు ఈ వాస్తవాలు పురిగొల్పుతాయని అనుకొంటాము" అని అజయ్ వివరించారు.

హంగరీ ఘటనపై "మా అభిప్రాయాలను పార్లమెంటులో, తీర్మానాలలో వివరించాము. పదకొండు సంవత్సరాల జనతా ప్రజాస్వామ్యపాలన తదనంతరం యీ పరిస్థితులు యేర్పడుట దురదృష్టకరము. దేశీయ, అంతర్జాతీయ ముఖ్యంగా సోవియట్-హంగరీ సంబంధాలలో పొరపాట్లు, తప్పులు, నేరాలు మితిమీరిన ఫలితమే ఆ ఘటనలు" అనుట స్పష్టం. ప్రజాస్వామ్య సంస్కరణల వుద్యమంలో,

---

1. అజయ్‌ఘోష్ (1956) జయప్రకాశ్‌నారాయణ వుత్తరానికి అజయ్‌ఘోష్ సమాధానం. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు (ఆంగ్లంలో) వా VIII పే. 62.

2. ............ అదే ............ పే. 619.

సామ్రాజ్యవాదం నుండి సహాయాన్ని పొంది అభివృద్ధి విరోధకులు సాయుధ తిరుగుబాటును సోషలిస్టు వ్యవస్థ వ్యతిరేకంగా తీసుకొనివచ్చుట దానికై ప్రభుత్వం సోవియట్టు సహాయాన్ని కోరుట విచారించవలసిన విషయం. అదే రోజులలో అమెరికా బ్రిటన్, ఫ్రాంసులు ఈజిప్టుపై దురాక్రమణ కుట్రను జరిపి ప్రపంచాన్ని మూడో యుద్ధ అఘాతపు అంచునకు కొని వచ్చుట, సోవియట్టు కలుగజేసుకొని నివారించుట హంగరీని నాటో కూటమి వ్యూహ కేంద్రంగా చేసుకొను ప్రయత్నాన్ని వమ్ముచేసి, సోషలిజాన్ని పరిరక్షించుట జరిగిన నగ్న సత్యం. సోవియట్టును వ్యతిరేకించిన టిటో, హంగరీ కోరిన విధంగా సోవియట్టు సహాయ పడుటను సోషలిజాన్ని రక్షించుటగా, నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారించుటగా పేర్కొనుట తప్పనిసరిగా గుర్తు పెట్టుకొనవలసి వుంది. "మా పార్టీ అట్టి పరిస్థితులలో ఎంత కష్టమైనా హంగరి ప్రజల శ్రేయస్సు, సోషలిజం దృష్ట్యా సోవియట్టు చర్య అత్యవసరమని భావించుతుంది. మా చర్య సరియైనది అవునా కదాయని చరిత్ర తీర్పు చెప్పుతుంది" అని అజయ్ వివరించారు.

"మీరు మా అంతర్జాతీయతను తప్పుడు అవగాహనగా విమర్శించారు. అవును మా అవగాహనలో ముఖ్యంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి, యితర కమ్యూనిస్టుపార్టీలకు మధ్య వుండవలసిన సంబంధాలలో కొన్ని తప్పులు దొర్లాయి. ప్రపంచానికి మేము ప్రవచించిన, ఆచరించిన అంతర్జాతీయత నూతనమైనదని అంగీకరించరా ? బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే, ప్రజాస్వామ్య సోషలిజం మా ఆశయం అంటూ లేబరు పార్టీ చేయజాలని పనిని, భారత స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరచింది, ఫ్రాన్సులో అల్జీరియా స్వాతంత్ర్య పోరాటాన్ని ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ బలపరచింది. సోషలిస్టుపార్టీ ప్రభుత్వాన్ని బలపరచింది. సూయజ్ కెనాల్ సంక్షోభంలో అదే జరిగింది. వీటిని మీరేమంటారు. ఆసియా సోషలిస్టు మహాసభ బొంబాయిలో జరిగింది. ఈజిప్టు సమస్యపై ఇజ్రాయిల్ సోషలిస్టు పార్టీ తీసుకొన్న వైఖరి, ఇజ్రాయిల్ కమ్యూనిస్టుపార్టీ తీసుకొన్న వైఖరిని పోల్చి చూడండి. మేము అట్టి అంతర్జాతీయత అంటే సిగ్గుపడవలసినది లేదు. కార్మికవర్గ అంతర్జాతీయతా సూత్రాలనుండి వక్రీకరణలు జరిగాయంటే అది వేరే విషయం. అంతేగాని మేము చెప్పిన ఆచరించిన అంతర్జాతీయత సూత్రబద్ధం కాదని, తప్పుడు విధానమని, సోవియట్ యూనియన్‌కు లొంగి వుండుటకు ఒక ముసుగు అనుట పూర్తి తప్పు మీ అంచనాయని స్పష్టం చేయదలచాము" [1] అని అజయ్ వివరించారు.

4) వ్యక్తి, వ్యవస్థ, మానవ విలువలు, సిద్ధాంతాలు అనే మౌలిక సమస్యలను మీరు ప్రస్తావించారు.

---

1. అజయ్‌ఘోష్ (1956) జయప్రకాశ్ నారాయణ్‌కు అజయ్‌ఘోష్ సమాధానం. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు. వా. viii పే. 423

యుగయుగాల నుండి మానవులలోని మహోన్నత వ్యక్తులను, మానవ బహుముఖ శ్రేయస్సు లక్ష్యం ప్రేరేపించింది. ఈ అధర్మం చరిత్రలో సాధింపబడ లేదని తెలుస్తున్నది. ఈ యుగాల ధ్యేయం వర్గరహిత సమాజంలో సాధ్యమని మార్క్సిజం తెల్పుచున్నది. మానవ ప్రకృతిని మార్చే ప్రయత్నాలతోనే యీ వర్గ సమాజాన్ని మార్చలేమని కూడ చెప్పుతున్నది. కార్మికవర్గ నాయకత్వంలో, నిర్మాణయుతమైన ప్రజాకార్యాచరణే నూతన సమాజవ్యవస్థను సృష్టిస్తుందని వివరించింది.

ఈ మౌలిక మార్క్సిస్టుమూల సూత్రాలను మీరు, సోషలిస్టులు అందరూ ఆమోదించుతారని అనుకొంటాను. అంగీకరించితే మీరు అడిగిన ప్రశ్నల మౌలిక రూపం తప్పని తెలుస్తుంది. మీరు అడిగిన ప్రశ్నలవెనుక మానవుని సంపూర్ణ వికాసానికి రాజకీయసిద్ధాంతాలు, సామాజిక వ్యవస్థలు, ఆర్థికవ్యవస్థలు, నిర్ణయాత్మకం కావని, మానవజాతి అంతా కొన్ని వాస్తవాలను గుర్తించాలనే అవగాహన వుంది. ఈ అవగాహనను ఆమోదించిన నేటి సమాజంలోని చెడును మానవుని మనస్సులో అంటిపెట్టుకొని వున్న "చెడు" కారణమని, మానవ ప్రకృతిలోని ఆ చెడును తొలగించి అతని నైజంలో మార్పు తీసుకొని వచ్చుటకు ప్రయత్నించాలి.

"సామాజిక వ్యవస్థను, సిద్ధాంతాలను, వాటి నుండి మానవుని, మానవ విలువలను వేరుచేయలేము. మానవుని వున్నత శిఖరాలకు చేర్చుట తప్పనిసరి మా ధ్యేయం. ఉత్పత్తి సాధనాలుపై వ్యక్తి యజమాన్యం రద్దు చేసి, మానవుని మానవుడు దోచుట అంతం చేసి, నంక్షోభాన్ని, నిరుద్యోగాన్ని, రూపుమాపి, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని మానవ జీవితప్రమాణాలను పెంచే సమాజంలో మాత్రమే మనం చిత్రించుకునే మానవుని మానవవిలువలకు పెంచేధ్యేయం సాధ్యం. అటువంటి సమాజాన్ని రూపొందించే వుద్యమం, కొన్ని సిద్ధాంతాల మార్గదర్శకత్వంలోనే విజయవంతమౌతుంది. ఆ సిద్ధాంతాలు పిడివాదంగా కాక నిరంతరం పెరుగుతు అభివృద్ధి చెందాలి." అని ముగింపు వాక్యాలుగా అజయ్‌ఘోష్ వ్రాసారు.

5) ప్రతిదేశంలో ఆదేశపు ప్రత్యేకతలు, సాంప్రదాయాలు పరిగణలోనికి తీసుకొని, అందరికి అనువైన సామాన్య సూత్రాలపై ఆధారపడి, సోషలిస్టు ప్రజా వుద్యమం, మార్క్సిజం, లెనినిజాన్ని వాస్తవ పరిస్థితులకు అన్వయం చేసుకొని పురోగమించాలి. వివిధ దేశాలలో సోషలిస్టు పురోగమనంలో పురోగమనంలో వివిధ సోషలిస్టు రూపాలను ఆచరణలో బహిర్గతం కావచ్చును. మనదేశంలో హింస, అంతర్యుద్ధం లేకుండా సోషలిజం వైపు పురోగమన అవకాశాలను వాస్తవం చేయ మాశక్తి కొలదిప్రయత్నం చేస్తున్నామని అనేక ప్రకటనలలో స్పష్టం చేసాము [1].

---

1. అజయ్‌ఘోష్ (1956) జయప్రకాశ్ నారాయణ్‌కు అజయ్‌ఘోష్ సమాధానం. భారతకమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు. వా॥ పే. 630

6) ప్రపంచ విపత్కర పరిస్థితి, నేటి మనదేశ, ప్రజల పరిస్థితులలో సోషలిస్టు ప్రజాస్వామ్యశక్తులన్నీ కలసిపోవాలని కమ్యూనిస్టుపార్టీ విజ్ఞప్తి చేస్తున్నది శాంతి, సామ్రాజ్యవాద, వలన వ్యతిరేక విధానాలతో మనదేశం ముఖ్యస్థానాన్ని పొందింది.

"మనం పరస్పరం మన వైఖరులను, ఆచరణను అర్థం చేసుకొని సమన్వయపరచి అత్యధిక అంశాలపై ఆమోదంతో ఒప్పందానికి రాగలిగిన, భేదాభిప్రాయాలున్నప్పటికి శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాసేవలకై చేతులు కలుపగలమని నేను ఆశించుతున్నాను. మీరు నాతో అంగీకరించగలరని అనుకొంటున్నాను. మన యిద్దరమూ యిక్కడతోనే ఆగిపోమని, వుత్తరప్రత్యుత్తరాలేగాక రెండు పార్టీల నాయకత్వాలు కలసి, అందరికి సంబంధించిన సమస్యలను చర్చించి, పరస్పర అభిప్రాయాలను యిచ్చి పుచ్చుకొని, యీ విధానక్రమంలో సమిష్టి పంథాను రూపొందించగలమని, సాధ్యమైనచోట్ల ఐక్యకార్యాచరణ అమసరిస్తామని నేను ఆశిస్తున్నాను" అని వ్రాశారు అజయ్ ఘోష్.

నాయకుల లేఖలు బహిరంగలేఖల రూపాన్ని పొందిన కారణంగా కావచ్చు. ఆయా పార్టీల, ఆయాపార్టీల కార్యకర్తల, వారిననుసరించే ప్రజాసామాన్యాన్ని దృష్టిలో వుంచుకొనే రచన సాగించాడు తప్ప, వెల్లడించిన ఆశయాలు, లక్ష్యాలు, యిద్దరిమధ్య, పార్టీల మధ్య అవగాహనలను పెంపొందించుటకు మారుగా, భేదాభిప్రాయాలు మరింతలోతుగా అయినట్లు కన్పడుతున్నది. లేఖలు రాజకీయ, ప్రచార సాధనాలుగ ఆచరణలో అయినవి తప్ప ఆశించిన, ఫలితాలను పొందలేదు. బహుశా బహిరంగ లేఖల కంటె, పూర్తి వ్యక్తిగత లేఖలు, వెంటనే వెలుగును చూడని పైనచో పరస్పర అవగాహన పెంపొందుటకు యెక్కువ అవకాశాలున్న పేమోననుకొనవలసివస్తుంది.

## స్టాలిన్ వ్యక్తి పూజా విధానం

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ, కాంగ్రెసు, ఫిబ్రవరి 1956లో జరిగింది. చారిత్రాత్మకమైన కాంగ్రెసు ప్రపంచశక్తుల బలాబలాలో వచ్చిన మార్పులను, ప్రాముఖ్యతను సమీక్షించి, నేటి ప్రపంచ నూతన లక్షణాలను, నూతనావకాశాలను, వాటిని వాస్తవం చేయు విధానాలను రూపొందించింది. సాహస నిర్ణయాలను చేసి పురోగమన పంథాను వెలుగులోనికి తెచ్చింది. అంతేగాక స్టాలిన్ వ్యక్తి పూజావిధానం పైనొక తీర్మానాన్ని ఆమోదించింది. ఈ తీర్మానం స్టాలిన్ చివరిదశకంలో జరిగిన హింసాత్మక చర్యలను వక్రీకరణలను వెలుగులోనికి తెచ్చింది.

వ్యక్తి పూజా విధానాన్ని కొమిన్ఫారం పత్రిక "వ్యక్తికి మానవాతీత అద్భుత శక్తులను, గుణాలను ఆపాదించి ఆకాశానికెత్తి, శిరసావహించి అనుసరిం

...మట'గా నిర్వచించింది[1]". మార్క్సిజం, లెనినిజం ఆమోదించవలెననీ. వారియొక్క ఔన్నత్యాన్ని గుర్తించుటలో తప్పులేదు, అతనికి మానవాతీతశక్తులను ఆపాదించి. తప్పులు చేయని సర్వజ్ఞుడు అనుట తప్పు, అని అజయ్ అన్నారు.

స్టాలిన్ జారిరిజానికి వ్యతిరేకంగాను, అక్టోబరు విప్లవంలో, విప్లవానంతరం ప్రతీఘాతక విప్లవశక్తులకు వ్యతిరేకంగాను, అంతర్యుద్ధంలోను, పెక్కు సామ్రాజ్యవాద దేశాలు, దేశాన్ని చుట్టుముట్టి శైశవ దశలోనే రూపుమాపదలచిన ప్రయత్నాలను వమ్ముచేసి, పార్టీని మితవాద, అతివాద వక్రీకరణలనుండి కాపాడి, వెనుకబడిన దేశాన్ని ప్రపంచంలో రెండవ పారిశ్రామిక, సైనిక శక్తిగా రూపొందించి సోషలిజాన్ని బలోపేతంగా నిరిుంచుటయేగాక, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి ఎనలేని సేవ జేసాడు. చరిత్ర నుండి దీనిని ఎవరూ తొలగించలేరు.

సోషలిస్టు నిర్మాణాన్ని సంక్లిష్ట చారిత్రిక పరిస్థితులతో కొనసాగించుటలో, సిద్ధాంత రంగంలో, సోషలిస్టు న్యాయాన్ని అమలు పరచుటలో, సోషలిస్టు ప్రజాస్వామ్యం అమలులో, దేశంలోని జాతుల మధ్య సంబంధాలలో, సోషలిస్టు దేశాల మధ్య సంబంధాలలో తీవ్రమైన పొరపాట్లు జరిగాయి. స్టాలిన్ జీవితపు చివరకాలంలో యీ పొరపాట్లు మరిన్ని స్పష్టంగా జరిగాయి. వ్యక్తి పూజా వంటిమాగధ విధానం పెరిగినందున యీ విపరీత పరిణామాలకు దారితీసింది. "మహోన్నత విజయాలు, సాధించిన సత్ఫలితాలు, మౌలికంగా సరియైన విధానాల ద్వారా పొందుటయే, ఆచరణలోని తప్పులను ముందుగానే గుర్తించి, ప్రతిఘటించి, సరిచేయుటను కష్టతరం చేసింది".[2]

అనేకమంది 1937-38 కాలంలో తీవ్రమైన చట్టవ్యతిరేక, హింసా పద్ధతులు అనుసరించబడినవని తలంచినా, యుద్ధకాలంలో 'నాజీ ఫిఫ్తుకాలం' మద్దతు కుట్రలలో యూరపులో దేశం తరువాత దేశం హిట్లరు పాదాక్రాంతం అగుట, అట్టిది సోవియట్టులో జరుగకుండుట, ఆ కఠిన చర్యలు న్యాయసమ్మతంగా తలచబడినవి. యుద్ధ, అంతర్యుద్ధ పరిస్థితులలో కఠిన, హింసా చర్యలు తప్పనిసరియని సమర్థనీయమని చెప్పినా, శాంతియుతంగా దేశాభివృద్ధి, పునర్నిర్మాణకాలంలో అట్టి చర్యలు సమర్థనీయం కాజాలవు.

"భారత కమ్యూనిస్టు పార్టీకి తన అనుభవంలో రాజకీయ విధానాలు, అనుస

1. ఫర్ ఎ లాస్టింగ్ పీస్, ఫర్ ఎ పీపిల్స్ డెమోక్రసి, 30 మార్చి, 1956 అజయ్ వుదహరింపు భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు వా VIII. పే. 511.

2. అజయ్‌ఘోష్ (1956) రెండు వ్యవస్థలు. ఫలితాల పరిశీలన (ఆంగ్లంలో) పే. 38.

శించిన పద్ధతులు ఆశించిన ఫలితాన్ని యివ్వక నష్టాన్ని కలుగజేసినపుడు మాత్రమే, విధానాల, పద్ధతులలోని పొరపాటుల అనుభూతిని పొందగలుగుతామని తెలుసు. మహోన్నత విజయాలను సాధించునపుడు, ఆచరణ విధానాన్ని, పద్ధతులను, సిద్ధాంతాలను పునఃపరిశీలనను సర్వసాధారణంగా ప్రతిఘటించుట జరుగుతుంది. [1]

"విచక్షణారహిత అరెస్టులు, నమ్మకమైన పౌరులను, కమ్యూనిస్టులను దౌర్జన్యకాండతో అణచుట, నిర్దోషులను బాధించుట, సోవియట్ న్యాయ చట్టాన్ని, నీతిని వదలి జరిపిన యీ నేరాలు సమర్థనీయంకావు. వాటిని ఖండించవలసిందే. వ్యక్తి పూజ వందిమాగధ విధానం సహించకుండిన, పార్టీ పర్యవేక్షణ తగినట్లు చేసిన, కార్మిక ప్రజాస్వామ్య వక్రీకరణకు వ్యతిరేక దృఢ పోరాటాన్ని సాగించిన వాటిలో చాలాభాగం నివారించబడేవి" అని అజయ్ వివరించారు.

ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలు మార్క్సిజం, లెనినిజంపై విశ్వాసం కలిగినవి, కాన అవే కార్మికవర్గ అంతర్జాతీయతను కాపాడేవి. అవి తమ స్నేహ, సంబంధాలను బలపరచుకొంటూ, అందరి నుండి నేర్చుకొంటూ, తన దేశ పరిస్థితులకు తగిన రాజకీయ విధానం, పద్ధతులు, చర్యలు తానే తన అవగాహనతో నిర్ణయించుకొంటుంది. ఈ సూత్రాలు కొత్తవేమి కావు. కొమింటరన్ రద్దు చేయబడిన నాటి నుండి వివిధ పార్టీలు, దేశాల మధ్య సంబంధాలకు మార్గదర్శికంగా వున్నవి. సోవియట్, తూర్పు యూరపు సోషలిస్టు సంబంధాలలో యీ మార్గదర్శిక సూత్రాలను ఆచరణలో వక్రీకరించుట జరిగింది. దీనికి స్వస్తి చెప్పాలి. కొన్ని మార్గదర్శికపార్టీలని, యితర పార్టీల వారిని అనుసరించాలి అనే సిద్ధాంతాన్ని విడనాడాలి. వివిధ పార్టీల మధ్య సంబంధాలలో సమానత్వం ప్రతిబింబించాలి. ప్రతి పార్టీ స్వతంత్ర్యాన్ని, సార్వభౌమాధికారాన్ని గుర్తించి, గౌరవించి ఆచరించాలి.

భారత కమ్యూనిస్టుపార్టీ పాల్ఘాట్ తీర్మానంలో, వ్యక్తిపూజ వందిమాగధ విధానాన్ని ఖండించి, తమ విధానాన్ని వివరించింది.

సహజంగానే తప్పుడు సిద్ధాంతాలు, తిరిగి తిరిగి ప్రతిపాదించబడినపుడు, వాటిని ఎప్పటి కప్పుడు గుర్తించి వెంటనే సరిచేసుకొనాలి. వ్యక్తిపూజా వందిమాగధ విధానం తప్పులను సరిచేయుటను ప్రతిఘటిస్తుంది. ఒక వ్యక్తికి అమోఘమైన శక్తుల నంటకట్టి, అద్భుతాలు చేస్తాడని, సర్వజ్ఞుడని, అతను చేసే ప్రతిదానిని ఆమోదించే వైఖరి, తప్పులు కొనసాగి కొండంత ఎదిగి శాశ్వత స్థితిని చేరుతవి. వేగంగా తప్పులను సరిచేయుట, వ్యక్తి పూజాతత్వాన్ని రూపుమాపే మార్గం. అభివృద్ధికి పురోగమనానికి మార్గము. గుర్తించి, సరి చేయబడని తప్పులు, నూతన తప్పులకు దారితీసి, తప్పుడు సిద్ధాంతాలను రూపొందించుకొని పురోగమనాభివృద్ధిని అడ్డుకొంటవి.

1 అజయ్‌ఘోష్ పరిశీలన (1956) పే. 39.

"తీవ్రమైన విమర్శన స్టాలిన్‌ను అప్రతిష్ఠపాలు చేయుట కుద్దేశించబడలేదు .... తప్పులు జరిగాయి, అవి వేగంగా సరిచేయబడలేదు. కారణం, వ్యక్తిపూజా విధానం-స్టాలిన్ తప్పులు చేయడనే విశ్వాసం, స్టాలిన్ క్రమేణా పెంపొందించాడు. సమిష్టి నాయకత్వం, నియమానుసారం సమావేశాలు జరుపుటతోనే ఏర్పడదు. ఎవ్వరూ తాను తప్పు చేయను అని అనుకొనరాదు, యిదే సమిష్టి నాయకత్వానికి మౌలికాంశం. సమిష్టి నాయకత్వం ప్రతి ఒక్కరు, ఒకరి నొకరు అర్థం చేసుకొనుట, తప్పులను సరిజేసుకొనుటకు సంసిద్ధతను ప్రదర్శించినపుడే సాధ్యమవుతుంది." [1]

"వ్యక్తిపూజా విధానం పెరిగితే క్రమేణా అంతర్గత ప్రజాస్వామ్యం అడుగంటి, సమిష్టి పనివిధానం మృగ్యమై, నియమానుసారం సాధారణ సమావేశాలు కూడ జరుగవు. పార్టీ తన పనిని వాస్తవికతా దృక్పథంతో సమీక్షించుకొనలేదు, తప్పుల నుండి పాఠాలు నేర్చుకొనలేదు.

"కాన, మహోన్నత విజయాలను, కర్తవ్యాలను మొదట గుర్తించి, కర్తవ్యాల నిర్వహణా క్రమంలో జరిగిన తప్పులను చూడాలి. ఈ పొరపాట్లు వ్యక్తిపూజా వంధిమాగధ విధానం వలన సరిచేయబడనందున, అవి కొనసాగుతు, నూతన పొరపాటులు చేయుట జరిగింది. ఇవన్నీ పార్టీకి, ఉద్యమానికి తీవ్ర నష్టాన్ని కలిగించాయి." [2]

## IV

## పార్లమెంటరీ పోరాటాలు

జాతీయ కాంగ్రెసు ప్రథమ ఎన్నికలలో చేసిన వాగ్దానాలను నెరవేర్చాలని కోరుతూ రాష్ట్రి, కేంద్ర ప్రభుత్వాలపై ప్రజోద్యమాలు ఒత్తిడి కొనసాగిస్తున్నాయి. హక్కులు, వారి ప్రయోజనాలకు, దేశ ప్రయోజనాలకై విరామ మెరుగక పోరాడుతున్నారు. ప్రజలు దోపిడి వర్గాలు చేసే దాడులను ప్రతిఘటించారు, అభివృద్ధి విరోధకుల ఆటలు కట్టించారు. గణనీయమైన విజయాలను సాధించారు.

---

1. సోవియట్ 20 వ, పార్టీ కాంగ్రెసుపై భారత కమ్యూనిస్టుపార్టీ పొల్బ్యూట్ తీర్మానము (1956) భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు (ఆంగ్లంలో) వా. viii పే. 516.
1. సోవియట్ 20 వ, పార్టీ కాంగ్రెసుపై భారత కమ్యూనిస్టుపార్టీ పొల్బ్యూట్ కాంగ్రెసు నివేదిక తీర్మానం (1956) భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు (ఆంగ్లంలో) వా. viii పే. 516.

గోవా విముక్తి ఉద్యమాన్ని అన్ని రాజకీయ పక్షాలు కలిసిన "అఖిలపక్ష గోవా విముక్తి సహాయ సమితి" సత్యాగ్రహ పోరాటాన్ని సాగించింది. కమ్యూనిస్టు పార్టీ ప్రధాన పాత్ర వహించింది. పోర్చుగీసువారి కాల్పులలో 21 మంది ఆత్మార్పణ గావించారు. కాంగ్రెసువాదులు కూడ పాల్గొన్న పోరాటాన్ని ప్రభుత్వం, కాంగ్రెసు అగ్రనాయకత్వం ఖండించింది. ఈ కాలంలోనే జరిగిన పుదుచ్చేరి, చంద్రనగర్, యానాంలోని ప్రజాపోరాటాలు ఫ్రెంచి సామ్రాజ్యవాదం నుండి విముక్తిని సాధించాయి. వీటన్నిట కమ్యూనిస్టుపార్టీ ముఖ్యపాత్ర వహించింది. అసెంబ్లీ, పార్లమెంటులలోని ఆందోళన, బయట ప్రజా పోరాటాల సమన్వయం, పోరాటాలు అన్ని విధాల బలపడునట్లు తోడ్పడింది.

కాంగ్రెసు ప్రభుత్వాలు కొన్ని రాష్ట్రాలలో జమిందారీ, జాగిర్దారీ భూముల రద్దు సంస్కరణ చట్టాలను చేయుటతో రైతుల ప్రధాన పోరాటం, భూముల నుండి తొలగింపులకు వ్యతిరేకంగా పోరాటంగా ముందుకొచ్చింది. రైతాంగ ప్రజా సమావేశాలు ప్రదర్శనలు, పార్లమెంటులో కమ్యూనిస్టులు, ప్రజాస్వామ్య వాదులు బలపరచి, పూర్తిగా ప్రోత్సహించారు. ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాల్, పంజాబ్, బీహారు, అస్సాంలలో రైతుల, భూస్వాముల మధ్య ఘర్షణలు అనేక ప్రాంతాలలో సర్వసాధారణమయ్యాయి. ఫలితంగా అనేక రాష్ట్రాలలో 1954 లో కౌలుదారుల చట్టాలు చేయబడినవి.

మరో రైతాంగ పోరాట రూపం ముఖ్యంగా ట్రావెన్కూర్, కొచ్చిన్, మద్రాసు, ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాలుల " "ప్రభుత్వ బంజరు భూములను రైతాంగ ఆక్రమణ" అనే ఉద్యమం రూపొందింది. రైత్వారీ ప్రాంతాలలో కౌలు తగ్గింపు, వ్యవసాయ కూలి పెరుగుదల పోరాటాలు కొనసాగాయి. ఈ పోరాటాలలో రైతు, కూలీ ఐక్యత ప్రాధాన్యంగా చెప్పబడింది.

కాంగ్రెసు ప్రభుత్వాల వ్యవసాయ భూముల సంస్కరణలతో, రైతాంగంలోని పూర్వపు అన్ని వర్గాల ఐక్యత పోయింది. కారణం నూతన ధనికరైతు వర్గం యేర్పడుట. ఫలితంగా గ్రామసీమలలో కాంగ్రెసు కొంత నూతన బలాన్ని పొందగలిగింది. ఇదే, 1955 లో 10 లక్షల 70 వేల సభ్యత్వంగల అఖిల భారత కిసాన్ సభ, 1959-60 లలో 5 లక్షల 72 వేలకు పడిపోవుటలో చూడగలము. అమృతసర్ ప్రత్యేక పార్టీ కాంగ్రెసు దీనిని గుర్తించిన ఫలితంగా, అక్టోబరు 1958 లో మద్రాసులో జరిగిన కమ్యూనిస్టు కేంద్రసమితి ప్లీనరీ సమావేశం, యీ సమస్యను ప్రత్యేకంగా పరిశీలించి వ్యవసాయ సమస్యపై తీర్మానాన్ని ఆమోదించింది.

స్వాతంత్ర్యానంతరం ఆర్థిక పోరాటాలతోపాటు, ప్రజా ఉద్యమాల రాజకీయ కార్యాచరణ పెరిగి, కార్మికవర్గ రాజకీయ పోరాటాల వృద్ధి పెరిగింది. సంవత్సర సరాసరి సమ్మెలు 1930 దశకంలో కంటె 1950 దశకంలో ఐదురెట్లు పెరిగాయి.

సమ్మెపోరాటాలలో మధ్యతరగతి వర్గాలు, ఉద్యోగులు చురుకుగా పాల్గొన ఆరం భించారు. సమ్మెల స్థానిక, రాష్ట్రస్థాయి; జాతీయ స్థాయి పోరాటాలుగ విస్తృతిని పొందాయి. ఒక్క 1958 లోనే టాటా కార్మికుల జనరలు సమ్మె టీ, కాఫీ తోటల సార్వజనీన సమ్మె, ట్రాంవే కార్మికుల జనరల్ సమ్మె, తదనంతర జనపనార కార్మికుల, బెంగాల్ రాష్ట్ర ఉపాధ్యాయుల సమ్మె, గుడ్డలమిల్లు కార్మికుల జనరల్ సమ్మెలు జరిగాయి. ఇదే కాలంలో కార్మికోద్యమ సభ్యత్వం 35 శాతం పెరిగింది. విస్తరించింది. సోషలిస్టుల ఆధ్వర్యంలోని హింద్ మజ్దూర్ సభ 1956 మధ్యలో కార్మిక సంఘాల ఐక్యతకై పిలుపునిచ్చింది. అఖిల భారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు, యునైటెడ్ ట్రేడుయూనియన్ కాంగ్రెసులు యీ పిలుపుకు స్పందించి అఖిల భారత జాతీయ ఫెడరేషన్‌కు అనుబంధించుటకు ఆమోదించాయి.

బ్రిటిష్ కామన్‌వెల్తులో భారతదేశపు సభ్యత్వం, పారిశ్రామిక, ఆర్థిక, వ్యాపార, ద్రవ్య విధాన రంగాలలో బ్రిటిష్ పెట్టుబడి ఆధిక్యత కొనసాగుతూనే వున్నాయి. అదే విధంగా సంస్థానాధీశులు, సంస్థాన ప్రజానీకం యెంతగా ద్వేషించు తున్నా, మరో రూపంలో రాజప్రముఖులు. గవర్నరులుగ కొనసాగుతూనే ఉన్నారు. కార్మికుల, మధ్యతరగతుల నిరుద్యోగం, పట్టణాలలో, గ్రామసీమలలో వ్యవసాయ కూలీలకు, చేతివృత్తుల వారికి పని లేకపోవుటతో జీవితం దుర్భరమైంది. స్వాతం త్ర్యంతో జీవితం మెరుగౌతుందన్న ప్రజల ఆశలు క్రమేణా నిరాశలవుతున్నాయి.

## రెండవ సాధారణ ఎన్నికలు :

దేశంలో 1950 ప్రథమ భాగంలో, రాజకీయ శక్తుల, సాంఘిక బలాబలాలలో వచ్చిన మార్పులు అసెంబ్లీలకు, పార్లమెంటుకు జరిగిన రెండు సాధారణ ఎన్నిక లలో ప్రతిబింబించాయి. ఆర్థిక స్వాతంత్ర్య పునాదులను బలపరచ నుద్దేశించిన దేశీయాంగ, ఆర్థిక, సాంఘిక, రాజకీయ విధానాలు, సామ్రాజ్యవాద నమూనాలను కొంతవరకు రద్దుచేసినందున జాతీయ కాంగ్రెసు తన ప్రజాబలాన్ని మెరుగుపరచు కొనగలిగింది. దీనికితోడు ఎన్నికలలో అనుభవ, శక్తియుక్తులను ప్రదర్శించుటతో పాలక పార్టీ ఆధిక్యతను సాధించగలిగింది. కొద్ది సంవత్సరాల క్రితం 1952 లో 45 శాతం వోట్లను సంపాదించిన కాంగ్రెసు 1957 లో 47.8 శాతము సంపాదించి లోకసభ, రాష్ట్ర అసెంబ్లీలలో ఎక్కువ మెజారిటి సంపాదించింది. జాతీయ కాంగ్రెసు లోకసభలో ఎక్కువ మెజారిటీ కల పార్టీగ, రాష్ట్ర అసెంబ్లీలలో 65 శాతపు అసెంబ్లీ స్థానాలుగల పార్టీగ అయింది.

ప్రజా సోషలిస్టు పార్టీ, మితవాద సోషలిస్టు వర్గాలు లోకసభ ఎన్నికలలో ఘోరపరాజయాన్ని పొంది, రాష్ట్ర అసెంబ్లీలలో 2901 స్థానాలలో కాంగ్రెసు 1889, ప్రజాసోషలిస్టు పార్టీ 195, కమ్యూనిస్టు పార్టీ 162 స్థానాలు పొందాయి.

జాతీయ కాంగ్రెసు వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ రాజకీయ విధానాన్ని, కార్యక్రమాన్ని ప్రజల ముందుంచుటలో విఫలమైంది. కమ్యూనిస్టు వ్యతిరేక విధానాల వలన అనేక స్థానాలను కోల్పోయింది. ప్రజాసోషలిస్టు పార్టీ ఘోర పరాజయం, సోషలిస్టు వుద్యమంలోని అభిప్రాయభేదాలను, వైరుధ్యాలను తీవ్రతరం చేసింది. దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక విధానాలను నిర్ణయించే పార్లమెంటులో, పాలక పార్టీ కాంగ్రెసుకు ప్రధాన ప్రతిపక్షంగా కమ్యూనిస్టు పార్టీ రూపొందింది.

జాతీయ కాంగ్రెసు బూర్జువా, పెట్టి బూర్జువా వర్గాలలో బలపడుట. ఫ్యూడలు శక్తులు. జమీందారులు, రాజులు, భూస్వామ్య వర్గాలు బలహీన పడుటతో కాంగ్రెసులోని మితవాద-అతివాద వర్గాల మధ్య భేదాభిప్రాయాలు తీవ్రమయ్యాయి. బలాన్ని కోల్పోయిన హిందూ మహాసభ స్థానాన్ని జనసంఘం ఆక్రమించి 4 పార్లమెంటు స్థానాలను, 46 అసెంబ్లీ స్థానాలను సంపాదించింది. జనసంఘం, ప్రధానంగా చిన్న, మధ్యరకపు వ్యాపార వర్గాల బలాన్ని పొందగలిగింది. వీరితోపాటు మత, జాతీయ తత్వంగల మేధావి వర్గాల బలాన్ని కొంత సంపాదించగలిగింది.

ఆర్థిక, రాజకీయ, సామాజికంగా వెనుకబడిన ఒరిస్సా రాష్ట్రంలో సంస్థానాధీశులు, రాజులు, జమీందారుల ఆధిక్యత కొనసాగుతూనే వున్నందున ఫ్యూడలు వర్గాలు తమ రాజకీయ పెత్తందారి తనానికి జాతీయ కాంగ్రెసును పెద్ద ముప్పుగా నెంచాయి. అయినా, జాతీయ కాంగ్రెసు, అభివృద్ధి నిరోధక గణతంత్ర పరిషత్ సంయుక్తంగా మంత్రివర్గాన్ని యేర్పాటు చేసాయి.

వామపక్ష శక్తుల పెరుగుదలను జాతీయ కాంగ్రెసు తన గుత్త రాజకీయ పెత్తనానికి ముప్పుగా నెంచింది. కమ్యూనిస్టుపార్టీ ప్రధానంగా కేరళ, పశ్చిమ బెంగాల్, ఆంధ్రప్రదేశ్‌లలో గణనీయమైన విజయాలను సాధించింది. కమ్యూనిస్టు ఉద్యమ చారిత్రి విజయం 1957 ఏప్రియల్ అసెంబ్లీ ఎన్నికలలో మెజారిటి సంపాదించి, కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వాన్ని కేరళ రాష్ట్రంలో ఏర్పాటు చేయుటతో కలిగింది.

### కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం :

ప్రథమ సాధారణ ఎన్నికలలో ఏర్పడిన ఐక్యసంఘటన విచ్ఛిన్నమైంది, కమ్యూనిస్టుపార్టీ గతంలో నిమలబార్ ప్రాంత ఐక్య సంఘటనా భాగస్వాములు, ట్రావన్కూర్–కొచ్చిన్‌లతో 1953-54 లలో ఏర్పడిన ఐక్య సంఘటనా భాగస్వాములతో 1957 లో కాంగ్రెసును ఓడించుటకు ఎన్నికలలో ఐక్య సంఘటన ఏర్పాటుకై ప్రయత్నించినా రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీ కేరళ సోషలిస్టు పార్టీలు విముఖ వైఖరిని ప్రదర్శించాయి. ఐక్య సంఘటనకై కమ్యూనిస్టుపార్టీ విజ్ఞప్తి చేసి, చేసిన ప్రయత్నాలు ఓటరులలో, ప్రజాసామాన్యంలో

అత్యంత సదభిప్రాయాన్ని కలుగజేసాయి. కమ్యూనిస్టుపార్టీ స్వతంత్రంగా, కొన్ని స్థానాలలో స్వతంత్రులను బలపరచినా, కాంగ్రెసు తదితర పార్టీలతో ద్విముఖ, త్రిముఖ, బహుముఖ పోటీలలో పోరాడవలసి వచ్చింది. ప్రతిపక్షాలు సంఘటనగా ఏర్పడజాలక పోవుటతో, కాంగ్రెసు విజయం తధ్యమనే అభిప్రాయానికి వచ్చుట, అఖిల భారత కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం అట్టి అభిప్రాయాన్నే బహిరంగంగా వెలిబుచ్చుటతో ఎన్నికలలో మునిగి వున్న రాష్ట్రి కమ్యూనిస్టుపార్టీ దానిని ఖండించక తప్పలేదు.

కాంగ్రెసు వ్యతిరేకంగా మలబారులో ప్రజాసోషలిస్టుపార్టీ సహకారమున్న ముస్లింలీగు పరస్పరం బలపరచుకొన్నవి. కొన్ని ప్రత్యేక ప్రదేశాలలో ముఖ్యంగా ముస్లిం వోటరులు అత్యధికులు, మరికొన్ని స్థానాలలో ప్రజాసోషలిస్టుపార్టీ బలంగా వుంది, ఈ సఖ్యత యిద్దరికీ బలాన్ని యిచ్చింది. కాంగ్రెసు బలహీనపడుటకు, పరోక్షంగా కమ్యూనిస్టులు బలపడుట సహాయపడింది.

ట్రావెనూర్-కొచ్చిన్‌లలో క్రిష్టియన్స్ అధికసంఖ్యాకులుగ వున్నారు, వారికి హిందువులతో సఖ్యతలేదు పైగా ప్రత్యర్థులుగ వుండుటతో కాంగ్రెసువోడి పోవుట వారు పట్టించుకొనలేదు. ఈ తత్వం ప్రజాసోషలిస్టు అభ్యర్థులకు బాగా తోడ్పడింది, పరోక్షంగా కమ్యూనిస్టులకు గూడ సహాయపడింది. కమ్యూనిస్టులు ఆ కేంద్రాలలో బలంగానే వుండుట యేకొద్ది ప్రత్యక్ష లేక పరోక్ష బలం లభించినా గెలచే అవకాశాలు యెక్కువగ వున్నవి. అదే జరిగింది. భారతదేశంలో ఎక్కడా లేనంతగా పాలక పార్టీలో చీలికలు, కమ్యూనిస్టుపార్టీ అఖిల భారతనాయకత్వానికి పూర్తిగా తెలియనందున మొదట్లో కాంగ్రెసు విజయం తధ్యమనే పొరపాటు అభిప్రాయాన్ని వెలిబుచ్చుట, రాష్ట్రి కమ్యూనిస్టునాయకత్వం ఖండించుట జరిగింది. ప్రతిపక్షాలు చీలి వున్నందున కాంగ్రెసు విజయం తధ్యమనే నిర్ణయానికి, యితర పరిస్థితులను పరిగణలోనికి తీసుకొననందున వచ్చారు. దామాషా ప్రాతినిధ్య పద్ధతి లేనందున కొద్ది మెజారిటీతో అధిక స్థానాలను పొందగలిగేది. అదే విధానం యీ ఎన్నికలలో కాంగ్రెసు వ్యతిరేక ఫలితాల నిచ్చింది. ప్రతిపక్షం కొద్ది మెజారిటీతోనే అనేక స్థానాలు గెలచింది. పాలక పార్టీలో చీలికల వలన కమ్యూనిస్టుపార్టీ 60 స్థానాలను గెలిచింది, మరో అయిదుగురు స్వతంత్రులు కమ్యూనిస్టుపార్టీని బలపరచారు. మంత్రివర్గం యేర్పాటుకు కమ్యూనిస్టులకు ముగ్గురు బలపరచినా సరిపోతుంది. అందువలనే భారతదేశంలో మొట్టమొదటి కమ్యూనిస్టు రాష్ట్రి ప్రభుత్వాన్ని యేర్పాటు చేసిన గౌరవం కేరళకు లభించింది. ఈ బాధ్యతలను స్వీకరించగలిగిన శక్తిని, నిర్మాణబలాన్ని, ప్రజాసమస్యల అవగాహన, అభివృద్ధి కార్యక్రమాల అనుభవం, అశేష ప్రజాబలాన్ని కమ్యూనిస్టుపార్టీ కలిగివుంది వీటన్నిటికి తోడు, ట్రావెనూర్-

కొచ్చిన్, మలబార్ ప్రాంతాలలో కాంగ్రెసుపాలనలో ప్రజా అసంతృప్తి పెరిగిపోయినందున కాంగ్రెసు వోడిపోయిందని మరువరాదు.

పాలకపార్టీ కాంగ్రెసుకు చెందిన వ్యక్తి గవర్నరుగా నుండి, కమ్యూనిస్టు పార్టీ అసెంబ్లీలో మెజారిటీపార్టీగ ఎన్నికై, మంత్రివర్గాన్ని యేర్పాటు చేయగలదని తెలియపరచినా, ఐదుగురు స్వతంత్రులను, ఇంటర్వ్యూచేసి వారు పూర్తిగ సంతృప్తి చెందువరకు కమ్యూనిస్టులను మంత్రివర్గమేర్పాటు చేయుటకు ఆహ్వానించలేదు. పూర్తి మెజారిటీకి పార్టీకి 3గ్గురు సభ్యులు తక్కువ, కాని 5గురు స్వతంత్రులు కమ్యూనిస్టుపార్టీని బలపరస్తున్నామని బహిరంగ ప్రకటన గావించారు. కాంగ్రెసు బలాన్ని పెంచుటకు ఒక ఆంగ్లోఇండియన్ కాంగ్రెసు వాదిని శాసనసభ సభ్యునిగా నామినేటు చేసారు. పత్రికలు, రేడియో, ప్రచార సంస్థలు "రాష్ట్రంలో అనిశ్చిత పరిస్థితులు" అనే ప్రచారాన్ని ప్రారంభించారు. ప్రధానమంత్రి కాంగ్రెసు ముఖ్యమంత్రులు పాలించే రాష్ట్రాలకు, కాంగ్రేసేతర పార్టీల మంత్రులు పాలించే రాష్ట్రాలకు వేరుగ చూసేదిలేదని పత్రికాముఖంగాను, ఆగస్టు 15వ రాష్ట్ర గవర్నరు "వివిధ రాష్ట్రాలలో వివిధ పార్టీల పాలన సహజీవన విధానానికి, కేరళ నమూనా" కావాలన్నారు. కాని, ప్రతి సమస్యపై కేంద్రం, కేరళ కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వానికి అడ్డంకులు కలుగజేస్తున్నవి. ప్రధానమంత్రి కేరళ ప్రభుత్వానికి సలహాలు, సూచనలు అంటూ చేసే ప్రకటనలు రాష్ట్ర కాంగ్రెసుకు, కమ్యూనిస్టు వ్యతిరేకులకు కావలసినంత ఇంధనాన్ని సమకూర్చాయి.

ఈ వాతావరణాన్ని కాంగ్రెసు అసెంబ్లీ పార్టీ నాయకత్వం, ప్రధానంగా ప్రజాసోషలిస్టుపార్టీ కమ్యూనిస్టు వ్యతిరేకతను ప్రారంభం నుండే రెచ్చగొట్ట ప్రారంభించాయి. ముస్లింలీగు, నాయర్ సేవాసమితులు అసెంబ్లీలో బయట యీ విధానాన్ని అవలంభించలేదు. కాంగ్రెసు తన యెడల యెలా ప్రవర్తిస్తుందనే విషయంలో ముస్లింలీగు వొక అవగాహనకు రాలేదు. నాయర్ సేవాసమితి క్రిస్టియన్ ఆధిక్యతలో గల కాంగ్రెసును విశ్వశించలేదు. ఈ రెండూ కమ్యూనిస్టు వ్యతిరేకమైనవే అయినా, వాటికి కాంగ్రెసు యెడలగల అపగాహనలను అధిగమించగలిగినంత శక్తిని కలిగిలేవు.

నంబూద్రిపాద్ నాయకత్వంలో యేర్పడిన కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వం, దేశంలో ప్రజాస్వామ్య వుద్యమం, జాతీయోద్యమం, ఆశించిన విధంగా కాంగ్రెసు వాగ్దానాలు చేసి, ఆచరణలో పెట్టని సంస్కరణలను చేబట్టుతుందని, అదే తమ ప్రభుత్వ ఆశయమని స్పష్టంగా ప్రకటించింది. ఇది పార్టీయేతర వర్గాలలో ప్రజాసామాన్యంలో సదభిప్రాయాన్ని కలుగజేసింది. ఈ ప్రకటనను అక్షరాలా అమలు చేయుటకు ప్రయత్నించుటయే కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం చేసిన ప్రధాన తప్పిదము.

కమ్యూనిస్టు ప్రభుత్వం వ్యవసాయ సంస్కరణలు ప్రధాన ప్రథమ అంశంగా చేబట్టింది. ఇది సంక్లిష్ట సమస్య. ప్రధాన మూడు ప్రాంతాలైన మలబార్, కొచ్చిన్ ట్రావెన్కూర్‌లలో వివిధ భూ అమరిక విధానాలున్నవి. ఇప్పుడు ఆ మూడు ప్రాంతాలు సంలీనమైనాయి. కేరళ అంతటికి కౌలుదారుల తొలగింపు సమస్య, బడుగువర్గాల ఆక్రమణలో ఇండ్ల స్థలాల సమస్యలు సాధారణ సమస్యలగుట సౌలభ్యంగా వుంది. ప్రభుత్వం అధికారాన్ని స్వీకరించిన వారం రోజులనే ఇండ్ల స్థలాలనుండి, భూములనుండి తొలగించుటను ఆర్డినెన్సు ద్వారా నిషేధించింది. ప్రజాశికా సంఘపు వ్యవసాయ సంస్కరణల సిఫార్సులను భూమికగా తీసుకొని, గ్రామసీమలలో భూస్వాముల దోపిడి, దౌర్జన్యాలకు లోనగుతున్న రైతులకు విముక్తి సహాయ, సంక్షేమాలను చేబట్టే వ్యవసాయ సంస్కరణల చట్టాన్ని రూపొంధించ మొదలుపెట్టింది.

అదే, భూస్వామ్య, తదితర దోపిడి వర్గాలలో కోపాన్ని, ద్వేషాన్ని కలుగ జేయుటతో కమ్యూనిస్టుపార్టీ, దాని ప్రభుత్వం చేబట్టే వ్యవసాయ సంస్కరణల బిల్లుకు వ్యతిరేకంగా పోరాటానికి ప్రజలను రెచ్చగొట్ట ప్రారంభించారు. పారిశ్రామిక వ్యాపార వర్గాలు కమ్యూనిస్టు ప్రభుత్వం, కార్మిక తగాదాలలో తమకు పోలీసు బలగాల మద్దతు నిచ్చుటలేదని వారితో చేరారు. పత్రికలలో "వ్యక్తులకు, ఆస్తులకు రక్షణలేదు", న్యాయం, చట్టం లేకుండా పోయిందని", "పోలీసు రక్షణ వ్యవస్థలో నిరుత్సాహం ప్రబలిందని" స్థానికంగా, దేశంలో బూర్జువా యంత్రాంగం దుష్ప్రచారాన్ని ప్రారంభించింది.

కేరళలో పారిశ్రామికాభివృద్ధి శూన్యానికి దగ్గరిగా వుండుటతో విద్యాధికులు, యితర వర్గాలలో నిరుద్యోగం ప్రబలంగా వుంది. రాష్ట్ర ప్రభుత్వం నూతన పారిశ్రామిక విధానాన్ని ప్రకటించింది. రాష్ట్రంలో వనరులు, కేంద్ర సహాయం పారిశ్రామికీకరణకు లభించక పోవుటతో వ్యక్తి యాజమాన్య రంగంపై ప్రభుత్వం ఆధారపడవలసి వచ్చింది. రాష్ట్రంలో పరిశ్రమలు నెలకొల్పుటకు యితర రాష్ట్రాలలోని పారిశ్రామికులకు ప్రత్యేక సౌకర్యాలు కల్పించే విధానాన్ని చేబట్టింది. కమ్యూనిస్టు వ్యతిరేకులు, పార్టీ వ్యక్తి యాజమాన్యంలో ప్రవేటు రంగాభివృద్ధికి వ్యతిరేకం గాన యీ విధానం తప్పనిసరిగా విఫలమవుతుందని, ప్రచారం ప్రారంభించారు. "న్యాయం, చట్టం, మృగ్యమైన రాష్ట్రంలో పెట్టుబడి పెట్టుట నష్టదాయకమవుతుందనే ప్రచారం కొనసాగించారు. బిర్లాలు రేయన్ ఫ్యాక్టరీ నిర్మాణం ప్రారంభించుటతో యీ ప్రచారం ఎగిరిపోయింది. కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సమితి పారిశ్రామిక ఒడంబడికలోని కొన్ని అంశాలను తీవ్రంగా విమర్శించినా, ప్రజా ప్రోత్సాహం లభించింది. దానితో మరి కొన్ని పరిశ్రమలు స్థాపించుటకు మార్గం ఏర్పడింది.

నూతన విద్యా విధాన బిల్లు అదేవిధంగా ప్రజల నుత్సాహపరచింది. ఉపాధ్యాయ ఉద్యమ అనేక కోరికలను బిల్లు ఆమోదించింది. వ్యక్తి యాజమాన్య పాఠశాలల పాలకవర్గాల పరిమితిలేని అధికారాలకు స్వస్తి చెప్పింది. ఈ చర్య లక్షలాది ఉపాధ్యాయుల మన్ననలను పొందింది. అదే కాలంలో నాయర్ సేవా సమితి, క్రిష్టియన్ సంస్థల పాఠశాలల పాలక వర్గాలు తీవ్రంగా వ్యతిరేకించాయి.

రాష్ట్ర కమ్యూనిస్టు మంత్రివర్గం చేబట్టిన ప్రధాన వ్యవసాయ, పోలీసు, పారిశ్రామిక, విద్యావిధాన సమస్యలపై, కాంగ్రెసు జాతీయ నాయకత్వంగాని, కేంద్ర ప్రభుత్వంగాని, రాష్ట్ర ప్రభుత్వ విధానాలకు ఎట్టి వ్యతిరేకతను ప్రదర్శించ లేదు. కేంద్ర ప్రభుత్వ విధానాలను రాష్ట్ర ప్రభుత్వం అతిక్రమించలేదు. పైగా వాస్తవంగా వాటినే అమలు చేయ ప్రయత్నించింది. రాష్ట్ర కాంగ్రెసు చేబట్టిన కమ్యూనిస్టు ప్రభుత్వ వ్యతిరేక విధానానికి కేంద్ర అగ్ర కాంగ్రెసు నాయకత్వం ఆశీస్సులనిచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం చేబట్టిన నిర్మాణ కార్యక్రమాలకు, ప్రధానంగా కీలక భూసంస్కరణల బిల్లుకు, నూతన విద్యావిధాన బిల్లుకు రాష్ట్రపతి ఆమోదానికి కేంద్రప్రభుత్వం ఆటంకాలను కల్గజేస్తుండగా, రాష్ట్ర కాంగ్రెసు, కేంద్ర కాంగ్రెసు నాయకత్వాలు బిల్లుల వ్యతిరేక, కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలకు నాయకత్వం వహించారు.

ఈ ద్వంద్వ విధానం కాంగ్రెసు అగ్రనాయకత్వానికి, కేంద్ర ప్రభుత్వానికి ఎంత కష్టతరమైనదో చెప్పుతూ, అందుకు కారణాలను నంబూద్రిపాద్ పేర్కొన్నారు. "ప్రప్రథంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఏ ప్రజాస్వామ్య పార్లమెంటరీ విధానంగా ఏర్పడినవో అదే విదంగా కేరళ రాష్ట్ర కమ్యూనిస్టు మంత్రివర్గం చట్టబద్ధంగా యేర్పడింది. కాన యిష్టా అయిష్టాల ప్రాతిపదికగా రాష్ట్ర ప్రభుత్వాన్ని, ప్రజాస్వామ్య పార్లమెంటరీ సూత్రాలను అతిక్రమించకుండా ఆ ప్రభుత్వాన్ని తొలగించ వీలులేదు. రెండవది, కేరళ ప్రభుత్వం భారత రాజ్యాంగ చట్టబద్ధంగాను, సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థగా కాంగ్రెసు రూపొందించిన విస్తృత సామాజిక, ఆర్థిక విధానాలనే 'తూచ' తప్పకుండా అనుసరించుచున్నది. అంచేత రాజ్యాంగ చట్ట అతిక్రమణ జరిగిందని కాని, జాతీయ విధానాలకు వ్యతిరేకంగా భిన్న విధానాలను ఆచరించుచున్నదని కాని, కుంటిసాకులతో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని తొలగించుట సాధ్యంకాదు. [1]

**కమ్యూనిస్టు వ్యతిరేక కూటమి :**

ప్రజాస్వామ్య వర్గాలలో కేరళలో భారత ప్రభుత్వం, జాతీయ కాంగ్రెసు

1. నంబూద్రిపాద్ (1987) రిమనిసెన్సేస్ ఆఫ్ యాన్ ఇండియన్ కమ్యూనిస్టు (ఆంగ్లంలో) నేషనల్ బుక్ సెంటర్, న్యూఢిల్లీ. పే. 174.

చేబట్టిన రాజకీయ విధానం ప్రత్యేక పరిస్థితులలో అనుసరించేదే కాని సాధారణ విధానం కాదనే అపోహ వుంది. కాని వాస్తవం దానికి వ్యతిరేకంగా వుంది.

కాంగ్రెసు ప్రధమ సాధారణ ఎన్నికలలో మైనారిటిగ వచ్చిన మూడు రాష్ట్రాలలో మధ్యంతర ఎన్నికలు యేకో విధంగా జరుపబడ్డాయని గుర్తుంచుకొని వాటి అధ్యయనం, అసలు విషయాన్ని తేటతెల్లం చేయగలదు. ఈ మధ్యంతర ఎన్నికలు కాంగ్రెసును తిరిగి అధికారంలోనికి వచ్చుటకు జరుపబడినవి. ఆంధ్ర, పెప్సూలలో కాంగ్రెసు తిరిగి గెలిచినా, ట్రావెన్కూర్-కొచ్చిన్‌లలో అది సాధ్యం కాలేదు. కాంగ్రెసు దృష్టిలో ప్రమాదకర పరిస్థితి అంటే, కమ్యూనిస్టు, వామపక్షాల సంయుక్త ప్రతినిధుల బలం, కాంగ్రెసును మైనారిటిగ చేయుట. అంచేత కాంగ్రెసు నూతన ఎత్తుగడలు అవలంభించి కమ్యూనిస్టులు వుండే ఐక్యసంఘటనా ప్రభుత్వం కాక కాంగ్రేసేతర ప్రభుత్వం, కమ్యూనిస్టులు లేని ప్రభుత్వం యేర్పడుటకు పరోక్షంగా ప్రోత్సాహమిచ్చింది. ఎన్నికలలో ప్రజా సోషలిస్టు పార్టీ "ఎన్నికలలో మేము కలసి పోరాడుతాం, కలసి పరిపాలించుతాము" అని ప్రచారం చేసింది. ఒకేఒక షరతుపై, కమ్యూనిస్టులు లేని, వారి బలంపై ఆధారపడని ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటకు, కాంగ్రెసు సుముఖత కారణంగా. గవర్నరు ఆహ్వానం, ప్రజా సోషలిస్టు పార్టీ ప్రభుత్వం, కాంగ్రెసు పరోక్ష బలంతో యేర్పడింది. కాంగ్రెసు అసెంబ్లీలో ప్రతిపక్షంగా కూర్చుంది, కాని ప్రజా సోషలిస్టు పార్టీతో కలసి వోటు చేస్తుంది, వాస్తవంగా "తోలుబొమ్మ ప్రభుత్వం" ప్రతిపక్షం చెప్పుచేతులలో 11 మాసాలు కొనసాగించింది.

ప్రజా సోషలిస్టు పార్టీ ప్రభుత్వానికి ప్రతిపక్ష కాంగ్రెసుకు మధ్య క్రమేణా సంఘర్షణలు ప్రారంభమయ్యాయి. వాస్తవ ప్రతిపక్షమైన కమ్యూనిస్టు, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీల అసెంబ్లీ గ్రూపు పోరాటాల ఫలితంగా ప్రజాసోషలిస్టు పార్టీ భూసంస్కరణల చట్టాన్ని ప్రవేశ పెట్టుటతో కాంగ్రెసు ప్రభుత్వ పార్టీకి వ్యతిరేకంగా ప్రచారం ముమ్మరంగా చేసింది. ప్రభుత్వం ట్రావెన్కూర్ దక్షిణ ప్రాంతంలోని తమిళుల వ్యతిరేక వైఖరి నవలంభించుటతో కాంగ్రెసు వారితో కలసి, ప్రజాసోషలిస్టు ప్రభుత్వాన్ని ఓడించి, తాను గద్దెనెక్కింది. కొద్దిరోజులు పాలించి, మధ్యంతర ఎన్నికలు వచ్చునట్లు చేసింది. ఈ విధంగా కాంగ్రెసు, కాంగ్రేసేతర ప్రభుత్వాలను కూలద్రోసే "నమూనా" విధానాన్ని కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం యేర్పడక ముందే రూపొందించింది. కమ్యూనిస్టుల పక్షంలోని 65 మందిలోని వారిని చీల్చుటకు అన్ని ప్రయత్నాలు విఫలమైనందున "కాంగ్రేసేతర ప్రభుత్వాలను కూలద్రోసే, చట్ట వ్యతిరేక నమూనాను" రూపొందించవలసి వచ్చింది. అది ప్రజాస్వామ్య వ్యతిరేక, చట్ట వ్యతిరేక విధానము.

కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం ఆంధ్ర ఎన్నికలలో పనిచేసిన తీరుపై

జాతీయ కాంగ్రెసుకు విశ్వాసం ప్రబలింది. పోలిష్, హంగరీ ఘటనలు కమ్యూనిస్టు వ్యతిరేకోద్యమానికి కావలసినంత మందుగుండును సమకూర్చిందని మరో అంచెనా వేసింది. గతంలోని కమ్యూనిస్టుల వామపక్ష మిత్రులు ఐక్యసంఘటనను వ్యతిరేకించుట మరో అనుకూల అంశంగా నెంచింది. ప్రజాసోషలిస్టుపార్టీ స్పష్టమైన కమ్యూనిస్టు 'వ్యతిరేక విధానాన్ని చేబట్టింది కాంగ్రెసుతో 1954-55 ప్రేమసల్లాపాల అనంతరం కూడ పాఠాలు నేర్చుకొనలేదు. ఆ పార్టీ ముస్లింలీగులతో స్నేహం నెరపుతున్నది మలబారు ప్రజాసోషలిస్టుపార్టీ, కేరళసోషలిస్టు నాయకులు కాంగ్రెసులో చేశారు. రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ. కేరళసోషలిస్టు పార్టీలు గతంలోని ఐక్యసంఘటనను విడనాడి, స్వతంత్రంగానే పోటీ చేసారు. వాస్తవంగా కమ్యూనిస్టులు 1957లో వేరు పడిపోయి, వొంటరిగా పోటీచేసి గెలచిప్రభుత్వాన్ని యేర్పాటు చేసినా, మిత్రులులేని వొంటరివారగుట, కాంగ్రెసు కమ్యూనిస్టు వ్యతిరేక కూటమిని యేర్పాటు చేయుటకు మరింత బలం ప్రోత్సాహం, అవకాశం లభించింది.

కమ్యూనిస్టు ప్రభుత్వం యేర్పడిన వెంటనే, అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి శ్రీమన్నారాయణ్ ప్రజలకు రక్షణలేమిని" కనిపెట్టారు. అఖిలభారతనాయకత్వం చేబట్టిన యీ బాకాను రాష్ట్రి కాంగ్రెసు నాయకత్వం చేగొని అనేకరంగుల రంగుల పులుమిము దుష్టప్రచారాన్ని ముమ్మరంచేసారు. కాంగ్రెసు పాలనలో లంచగొండితనాన్ని, పక్షపాతాన్ని ప్రజావ్యతిరేకతను చవిజూచిన ప్రజాసామాన్యం, కాంగ్రెసు ప్రచారాన్నినమ్మక నిరశించారు. కమ్యూనిస్టు ప్రభుత్వ విధాన ప్రకటనలో, కాంగ్రెసు ఎంతో కాలంగా చెప్పిన విధానాలను ఎన్నికలలో చేసి పాటించని వాగ్దానాలను, కాంగ్రెసు ప్రభుత్వ వివిధ కమిటీలు సూచించిన వ్యవసాయ, తదితర సంస్కరణలు చేబట్టుతామని ప్రకటించుట, కరాచికాంగ్రెసు తీర్మానం ప్రకారం రు500లుదమించి మంత్రులు నెలసరి ప్రతిఫలంగా తీసుకొనరని ప్రకటించింది. వెంటనే కౌలుదారులను, కౌలుదారులను భూముల, ఇండ్లస్థలాలనుండి తొలగించుటను, నందులులేవి ఆర్డినెన్సును ప్రకటించి, బిల్లు తయారుచేయు కార్యక్రమాన్ని మొదలుపెట్టింది. దేశ, విదేశాలలో, మనప్రజలలో మంచి ప్రభావాన్ని కలుగజేసింది.

అది కాంగ్రెసు, ప్రజాసోషలిస్టుపార్టీ, ముస్లిం లీగులలో వంచలవాన్ని కలుగజేసింది. కమ్యూనిస్టు వ్యతిరేక సంఘటనా నిర్మాణానికి రూపమిచ్చునట్లు చేసింది. వార్తా, ప్రచారసాధనాలన్నీ వాస్తవాలను వక్రీకరించుట, అబద్ధాల నిందా ప్రచారాన్ని, కమ్యూనిస్టు రాష్ట్రప్రభుత్వాన్ని అపఖ్యాతిపాలు చేయ నమకట్టాయి. ఈ క్రింది కొన్ని వుదాహరణలు[1] వాటి తీరుతెన్నులను స్పష్టం చేసాయి.

1) కేరళ ఎప్పుడూ ఆహారపదార్థాల తరుగు రాష్ట్రం, కాంగ్రెసు, సోషలిస్టుల

1. నంబూద్రిపాద్ (1967) కేరళ, నిన్న, నేడు, రేపు (ఆంగ్లంలో) నేషనల్ బుక్ ఏజన్సీ, కలకత్తా. పే. 224-8.

ఎవరిపాలనైనా ఆహారపదార్థాలకు కేంద్రంపై ఆధారపడవలసిందే, ఆ సప్లయిలపైనే తీవ్రత ఆధారపడివుంటుంది. అయినా, కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు తదితర పార్టీ లన్నీ రాష్ట్రమంత్రులకు వ్యతిరేకంగా నల్లజెండాల ప్రదర్శనలు మొదలుపెట్టారు. రాష్ట్ర ప్రభుత్వ పరిస్థితి తీవ్రతను గమనించి, వుద్యోగులను ఆహారపదార్థాలను మార్కెట్టురేటు ప్రకారం కొనుగోలు చేయుటకు అందరి రాష్ట్రానికి పంపించింది. అత్యవసర పరిస్థితి దృష్ట్యా, టెండర్సుతో కాలహరణం చేయక మార్కెట్టు రేటుకు కొనుగోలు చేయమని ఆదేశించింది. ఈ అత్యవసరచర్యను కమ్యూనిస్టుమంత్రులు, ఆఫీసర్లు లంచాలు పట్టారంటేనమ్మరని, వ్యాపారస్థులకు యిచ్చినదానికంటె,మార్కెట్టు ధరతక్కువగా వున్నదని, తేడాను పార్టీఫండుకై జమచేసుకొన్నారని నిందాప్రచారాన్ని సాగించారు, కమ్యూనిస్టులు చేసారంటే ప్రజలు నమ్మరని, పార్టీ ప్రయోజనాలకై "నమిష్టిలంచాలు"చేబట్టారని నిందాప్రచారం సాగించారు.

2) ప్రభుత్వ పాలనాయంత్రాంగంలో వివిధ శాఖలవలెనె పోలీసుశాఖ ప్రజాస్వామ్య ప్రభుత్వ సేవలకై వుంది, కాని మిగతా శాఖలవలెనె తమ విధానాల దృక్పధంలో మార్పురావాలని పోలీసు శాఖ నూతన విధానాన్ని రూపొందించింది. ముఖ్యంగా ప్రజల యెడల దృక్పధం మారాలంది. కార్మికులు, పారిశ్రామికులు, రైతులు, భూస్వాముల తగాదాలలో, శాంతికి వాస్తవంగా ప్రమాదం వచ్చినపుడు మాత్రమే కలుగ జేసుకొనాలని స్పష్టం చేసింది. పోలీసుశాఖకు యిచ్చిన యీ సూచనలు ప్రజల మన్నలను పొందినా "ఆస్తులకు, ప్రాణాలకు రక్షణలేదనే "అసత్య, నిందా ప్రచారానికి యిందనమైంది. పోలీసుల నైతికశక్తిని నిర్వీర్యం చేయుటకు కమ్యూనిస్టుల ప్రయత్నంగా నిందా ప్రచారం మొదలుపెట్టారు. వివిధ స్థాయిలలో సలహా ప్రజాసంఘాల సూచనలను సుముఖంగా పరిశీలించి నిర్ణయాలు గైకొనవలసినదిగా సలహా ప్రజా సంఘాల సూచనలను సుముఖంగా పరిశీలించి నిర్ణయాలు గైగొనవలసినదిగా సలహా నిచ్చింది. దీని యింతకు ముందు సహజంగా అనుసరిస్తున్నదే, కాని గతంలో కమ్యూనిస్టుపార్టీని వీటికి దూరంగా వుంచి, మిగతా అన్నిపార్టీలకు అట్టి అవకాశాలనిస్తూ జరుగుచున్నది. ఇప్పుడు, అందరితోపాటు పార్టి ప్రతినిధులకు అట్టి అవకాశం విస్తరించుట జరిగింది. ఫ్యాక్టరీ కూలీల, రైతుల అభిప్రాయాలకు తగిన విలువనిచ్చుట, అగ్రవర్ణాల నాయకుల అహం దెబ్బతినుటగా నెంచారు. ఇది వారికి సహించరానిదైంది. "కమ్యూనిస్టుల నియంతృత్వమని, పరిపాలనాశాఖలను కమ్యూనిస్టు పార్టీ అధికారంలోవుంచుట" అని దుష్ప్రచారాన్ని సాగించారు.

3) ప్రభుత్వోద్యోగాలకు ఎన్నిక చేయబడిన "అభ్యర్థుల పూర్వచరిత్ర" విచారించుటకు పోలీసు శాఖకు కేంద్ర ప్రభుత్వ ఆజ్ఞానుసారం, వుద్యోగానికి ఎన్నిక కాబడినా, కమ్యూనిస్టుపార్టీలోగాని, ప్రజాసంఘాలలోగాని పనిచేసి వున్నయెడల, వుద్యోగానికి అనర్హుడని యిచ్చిన సూచనలు యిక యేమాత్రం అనుసరించరాదని

రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది. ఈ వివక్షతను రద్దు చేసినందుకు ప్రభుత్వ సర్వీసులలో కమ్యూనిస్టుల నింపుటకు చేసారని ప్రజాస్వామ్య వ్యతిరేక, దుష్ప్రచారాన్ని కొనసాగించారు. కాంగ్రేసేతర ప్రభుత్వం కేరళలో వచ్చినప్పుడల్లా కాంగ్రెసు చేసే దుష్ప్రచారమిది.

4) అసెంబ్లీలో ప్రవేశపెట్టిన బిల్లులు చట్టాలైతే దేశంలోని బడుగువర్గాలన్నీ కమ్యూనిస్టుపార్టీ వెనుక చేరుతవని, రాష్ట్ర, కేంద్ర కాంగ్రెసు అగ్రనాయకులు కలత చెందారు. వాస్తవానికి ప్రణాళికాసంఘపు, భూసంస్కరణల సమితి చేసిన అఖిల భారత సూచనలను 'తూచ' తప్పకుండా చేయుటయే కేరళ కమ్యూనిస్టు మంత్రివర్గం చేసిన పొరపాటు. కౌలు కాలనిర్ణయం, కౌలుతగ్గింపు, భూమిని కొనుగోలు హక్కులు చట్టం వ్యవసాయ కూలీలకు యిస్తుంది. అంతేగాక నివాస స్థలాలకు పట్టాలు గ్యారంటీ చేసింది. ఇట్టివి ఏ రాష్ట్రంలో ఏ కాంగ్రెసు ప్రభుత్వం చేసి వుండలేదు. ఈ బిల్లు చట్టమై అమలులోనికి వస్తే కేరళలో కమ్యూనిస్టుపార్టీ స్థిరంగా బలపడి పాతుకొని పోవుటయేగాక, అన్ని రాష్ట్రాలలో యీ రకమైన చట్టాలకై ప్రజాందోళన పెరుగుతుంది. ఈ కారణం చేత, రాజ్యాంగ నిర్మాణేతర పద్ధతుల ద్వారా కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని పడగొటాలని కాంగ్రెసు నాయకత్వంలో కమ్యూనిస్టు వ్యతిరేక కూటమి ఏర్పడి కుట్ర సాగింది. దీనికి కేంద్ర కాంగ్రెసు అగ్ర నాయకత్వపు ఆశీస్సులు, ఆమోద ముద్ర వున్నాయి. రాష్ట్ర, కేంద్ర కాంగ్రెసు నాయకత్వాల ప్రతినిధులు సమిష్టిగా కార్యక్రమాలను తయారు చేసారు. వాటి లక్ష్యం, "రాష్ట్ర ప్రభుత్వాన్ని స్థంభింప చేయుట", కేంద్రంలో కాంగ్రెసు పాలన రాష్ట్రంలో కాంగ్రేసేతర ప్రభుత్వాన్ని సహించరాని స్థితి, "రాష్ట్ర పాలనకు పక్షపాత రోగాన్ని కలిగించుట", కమ్యూనిస్టు వ్యతిరేక పోరాటంలో అన్ని చట్ట వ్యతిరేక చర్యలు అనుసరణీయమే" అనే విధానాలను అవలంభించారు. నెహూౄ ప్రధానమంత్రిగా బహిరంగంగా అనుసరించిన విధానం వేరు, వారి అనుయాయులు అనుసరించిన విధానం వేరు. ఇందిరాగాంధి, దేబరు కాంగ్రెసు అధ్యక్షులుగా వుండి "విముక్తి పోరాటానికి ఆశీస్సులు" యిచ్చారు. నెహూౄ తన పరిపాలనలోని దేశంలో ఒక రాష్ట్రంలో రాజ్యాంగ చట్ట విరుద్ధంగా జరిగే పోరాటం పరిపాలనను స్తంభింపచేయు ప్రయత్నాలను ఖండించజాలని ప్రజాస్వామ్యవాది (?). ప్రభుత్వ వ్యతిరేక "ప్రజా వెల్లువకు", కేరళ ప్రభుత్వానికి మధ్య "వంతెన నిర్మాణానికి" ఆతురతను వెలిబుచ్చుతూ, కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని రాజీనామా చేయమని "సలహా" యిచ్చి, ఎలక్షనులు జరుపమన్నారు. కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం, "సలహా"ను అంగీకరించక, ప్రధానమంత్రిని, "పాలనను స్తంభింపజేయుట", యాదృచ్ఛికం కాదని, ప్లాను ప్రకారం జరుగుతున్న "ప్రజా వెల్లువ"ను అపుటకు తన అధికారాన్ని వినియోగించమని కోరారు. ఈ వెల్లువ ఆశ ప్రధానంగా కేంద్రం కలుగజేసుకొని మంత్రి

వర్గాన్ని మెజారిటీ వున్నా రద్దు చేస్తుందని ధీమాతో కమ్యూనిస్టు వ్యతిరేక కూటమి వున్నది.

కమ్యూనిస్టు మంత్రివర్గపు కోరికకు సమాధానంగా, ప్రధానమంత్రి నెహూర్రి కాంగ్రెసు పార్టీ పాలనా యంత్రాంగనేతగా, రాష్ట్రపతికి కేరళ రాష్ట్రి కమ్యూనిస్టు మంత్రి వర్గాన్ని బర్తరఫ్ చేయవలసిందిగా సలహానిచ్చారు. "ఇది నిస్సందేహంగా కాంగ్రెసు విజయమే, కేరళ కాంగ్రెసు నాయకులకు కోరింది లభించింది. "కాని" ఈ పరిస్థితి కేరళ రాష్ట్రం తిరుగులేని విధంగా, ఎప్పటికీ కాంగ్రెసు చేతులనుండి జారి పోవు మార్గానికి దారి తీసిందని" [1] నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు.

## మాస్కో 1957 కమ్యూనిస్టుపార్టీల ప్రకటన :

యూరపు, ఆసియా 12 పాలక కమ్యూనిస్టుపార్టీలు నవంబరు 1957 లో మాస్కోలో సమావేశమై అంతర్జాతీయ సమస్యలను, శాంతి, సోషలిజపు పోరాటాలు పరస్పర సంబంధాలను చర్చించారు. ప్రకటన రూపొందించునపుడు పెట్టుబడిదారీ దేశాల కమ్యూనిస్టు ప్రతినిధులతో సంప్రదించారు. ప్రకటనలోని ప్రధానాంశాలు సంక్షిప్తంగా క్రింద యివ్వబడినవి.

1) ఈ యుగపు ప్రధాన లక్షణం సమాజం పెట్టుబడిదారి విధానం నుండి సోషలిస్టు విధానంలోనికి పరివర్తనము చెందుట. ఇది అక్టోబరు విప్లవంతో ప్రారంభమై, సోషలిస్టు శక్తుల విస్తృతాభివృద్ధి, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో అనేక వలసలు దాస్య విముక్తి పొందుటతో. సామ్రాజ్యవాదం తన ఆధిక్యతను కోల్పోవుట, సోషలిస్టు, నూతన స్వాతంత్ర దేశాలు నిర్ణయాత్మక పాత్ర వహించుటలతో యేర్పడిన నూతన పరిస్థితులలో యీ పరివర్తనావకాశాలు యినుమడించాయి.

నేటి యుగంలో ప్రపంచాభివృద్ధిని రెండు పరస్పర వ్యతిరేక సమాజాల పోటీ ఫలితాలు నిర్ణయిస్తాయి. సోషలిజం ఆరోహణలో, సామ్రాజ్యవాదం అవరోహణలో వున్నాయి. విముక్తిచెందిన దేశాల శాంతి, ఆర్థిక స్వాతంత్ర్య రక్షణ సోషలిస్టు దేశాల సహాయంతో బలపరచుకొంటున్నాయి.

ప్రపంచ సామ్రాజ్యవాదం ఆర్థికమాంద్యం సంక్షోభాలకు గురియగుతు ఆర్థిక స్థిరత్వాన్ని కోల్పోయింది. కార్మికవర్గం పెరిగే దోపిడికి వ్యతిరేకంగా, జీవన ప్రమాణాలు పడిపోకుండా అధికవేతనాలకై పోరాటాలు సాగించుతున్నది.

అమెరికన్ సామ్రాజ్యవాదం "బలమైన స్థానాన్నుండి" అనే సిద్ధాంతాన్ని చేబట్టి "కమ్యూనిజాన్ని విరోధించుటకు" అనే సాకుతో అనేక దేశాల ప్రజాస్వామ్యాన్ని, స్వాతంత్ర్యాన్ని హరించి తన కబంధహస్తాల క్రిందికి తెచ్చుకొనుటకు

---

1. నంబూద్రిపాద్ (1967) కేరళ. నిన్న, నేడు, రేపు (ఆంగ్లంలో) నేషనల్ బుక్ ఏజన్సీస్ (ప్ర) కలకత్తా. పే. 230.

'నాటో', 'బాగ్దాద్', 'సీటో' సైనిక కూటములను యేర్పరచి శీతల యుద్ధాన్ని కొనసాగించుచున్నది. ప్రతిగా 'వార్సా' రాజ్యాల కూటమి యేర్పడింది. ఫలితంగా ప్రపంచం రెండు పరస్పర వ్యతిరేక పక్షాలుగ చీలిపోయింది. జర్మన్ ఫాసిజానికి తిరిగి ప్రాణ ప్రతిష్ట జరుగుచున్నది.

కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు 20 వ, సోవియట్ పార్టీ కాంగ్రెసు పునరుద్ఘాటించిన 'రెండు పక్షాల' శాంతి, సహజీవన సిద్ధాంత ఆచరణకు పోరాడుతున్నవి. ఇండియా-చైనాలు ప్రవచించిన పంచశీల సూత్రాలకు, బాండుంగు సమావేశంలో ఆసియా, ఆఫ్రికా దేశాల ఆమోదంతో, సోషలిస్టు దేశాలు పంచశీల మార్గాన్ని చేబట్టుటతో ప్రపంచ ప్రజల ధ్యేయం శాంతి, సహజీవనం, 'పంచశీల సూత్రాలు' అయినవి.

2) సోషలిస్టు దేశాల, కమ్యూనిస్టు, కార్మికవర్గ పార్టీల ఐక్యత, సౌభ్రాతృత్వ సహకారం, అంతర్జాతీయ కార్మికవర్గ, జాతీయ విముక్తి వుద్యమాల, ప్రజాస్వామ్య వుద్యమాల ఐక్యత ప్రత్యేక ప్రాముఖ్యత కలిగివుంది.

సోషలిస్టు వ్యవస్థ రూపొందుట, ఆర్థిక, సామాజిక ధ్యేయాలనుండి ఉద్భవించింది. ఎవరికి వ్యతిరేకంగాదు. యుద్ధోన్మాద శక్తుల చర్యల నిరోధిస్తుంది. శాంతి ప్రియులందరికి, యూరపు శాంతి పరిరక్షణకు, ప్రపంచశాంతికి వార్సాశాంతి ఒడంబడిక తోడ్పడుతుంది.

3) మార్క్సిస్టు, లెనినిస్టు మౌలిక సూత్రాలు, సోవియట్, సోషలిస్టు దేశాల అనుభవాలు, వివిధ దేశాలు చారిత్రక ప్రత్యేక పరిస్థితులు, సాంప్రదాయాలు పరిగణలోనికి తీసుకొని, అన్వయించుకొని, పెట్టుబడిదారి విధానాన్ని రద్దు చేసి సోషలిస్టు నిర్మాణాన్ని చేబట్టుటకు మార్గదర్శకమవుతాయి.

లెనిన్ జాతుల స్వయం నిర్ణయ మౌలిక సూత్రాలను, ప్రత్యేక పరిస్థితులను పరిగణించక, వుపేక్షించిన వాస్తవికత, ప్రజల నుండి దూరమై సోషలిజానికి భ్రష్టుపట్టించుట జరుగుతుంది. అదే విధంగా ప్రత్యేకతలను అతిశ్యోక్తిగా చేసిన, జాతి ప్రత్యేకతలు, సాంప్రదాయాలనే పేరుతో చేసే కార్యాచరణ ప్రమాదకారి అవుతుంది.

నేటి దశలో కార్మిక, కమ్యూనిస్టు ఉద్యమాలలో సంస్కరణవాద వ్యతిరేక పోరాటం ప్రత్యేక ప్రాముఖ్యత కలదైనదైంది. మితవాద, పిడివాదాలను దృఢమైన పోరాటాలతో అధిగమించవలసిన ఆవశ్యకతను మాస్కో సమావేశం నొక్కి చెప్పింది. మితవాద, పిడివాదాలు కమ్యూనిస్టుపార్టీలలో వున్న అంతర్జాతీయ దృక్పథ పిడివాదం, సెక్టేరియనిజం మారే పరిస్థితుల కనుగుణ్యంగా మార్క్సిజం, లెనినిజాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి చేయుటను నిరోధించి, పార్టీని ప్రజల, ఉద్యమాల నుండి దూరం చేస్తుంది.

"పిడివాదాన్ని ఖండించుతూ, నేడు ప్రధాన ప్రమాదం సంస్కరణవాదం మండియని నమ్ముతున్నది. పెట్టుబడిదారి విధానాన్ని పునరుద్ధరించి, నిలబెట్టాలనే బూర్జువా సిద్ధాంతాలు కార్మికవర్గ విప్లవశక్తిపై కలుగచేయు ప్రభావ రూపమే మితవాద అవకాశవాదమని మరో మాటలలో చెప్పవచ్చు. ఏమైనా పిడివాదం సెక్టేరియనిజం కూడ పార్టీ అభివృద్ధి దశలలో ముఖ్యమైన ప్రమాదకారి. ప్రతి కమ్యూనిస్టు పార్టీ అప్పటి పరిస్థితులలో ఏది ప్రధాన ప్రమాదకారో నిర్ణయించుకోవాలి.

"సామాజికాభివృద్ధికి మార్క్సిజం-లెనినిజం దాని ప్రత్యేకతను కోల్పోయి 'పాత చింతకాయి పచ్చడి' అయిందని మహా సిద్ధాంతానికి నేటి సంస్కరణవాదము రంగు పూస్తున్నది. మార్క్సిజ విప్లవతత్వంతో కార్మికవర్గం, ప్రజలలోగల విశ్వాసాన్ని దెబ్బతీయుటకు సంస్కరణవాదం ప్రయత్నిస్తుంది. కార్మికవర్గ అంతర్జాతీయతను, విప్లవ చారిత్రిక ఆవశ్యకతను, పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి పరివర్తన దశలో కార్మికవర్గ నియంతృత్వాన్ని, మార్క్సిస్టు, లెనినిస్టు పార్టీ నాయకత్వ పాత్రను వారు ఒప్పుకొనక, పార్టీ నిర్మాణ లెనినిస్టు మూల సూత్రాలను ముఖ్యంగా ప్రజాస్వామిక నియంతృత్వాన్ని త్రోసివేయాలని పిలుపునిస్తూ, విప్లవ చురుకుగల కమ్యూనిస్టుపార్టీని ఒక రకమైన చర్చావేదికగా మార్చ ప్రయత్నిస్తారు." [1]

4) చారిత్రాత్మక కర్తవ్యాలను నిర్వహించుటకై కార్మికవర్గ పార్టీల ఐక్యతకే గాక, మొత్తం కార్మికవర్గ ఐక్యతను నిర్మించి, రైతాంగంతో ఆ ఐక్యతను మరింత దృఢపరచాలి. సామ్రాజ్యవాద వ్యూహాలు వ్యతిరేక సంఘటనను కార్మికులు, కర్షకులు పెట్టీబూర్జువా వర్గాలతోనే గాక జాతీయ బూర్జువావర్గం, యితర దేశభక్త వర్గాలతో కూడిన విస్తృత ఐక్య సంఘటనను ఏర్పరచాలి.

కార్మికవర్గ ప్రధాన పోరాటం, యుద్ధవ్యతిరేక పోరాటం అంటే ఆయుధోత్పత్తి ప్రధానంగా గుత్తపెట్టుబడిదారులే నిర్వహించుటతో వారిపైనే కేంద్రీకరించబడుట సహజము.

"సోషలిజంలోనికి పరివర్తన రూపాలు వివిధ దేశాలకు మారుతాయి. కార్మికవర్గ అగ్రగామి దళమైన కమ్యూనిస్టు పార్టీ సోషలిస్టు విప్లవాన్ని శాంతి మార్గంలోనే సాధించ ప్రయత్నిస్తుంది. అదే కార్మికవర్గ, ప్రజలందరి, దేశ, జాతి ప్రయోజనాలకు

---

1. కమ్యూనిస్టుపార్టీల మాస్కో సమావేశాల (1957, 1960, 1969) ప్రధాన అధికార పత్రాలు (ఆంగ్లంలో) కమ్యూనిస్టుపార్టీ పబ్లికేషన్. నం. 31, డిసెంబరు 1972 (C. 68) పే. 11.

అనుకూలమైనది"[1] అని ప్రకటనచేసి, కార్మికవర్గ ఐక్యత, ఐక్యసంఘటన, అత్యధిక ప్రజాసామాన్యాన్ని ఐక్యపరచుటతో రాజ్యాధికారం లభించే అవకాశాలున్నవంది అంతేగాక పార్లమెంటులలో స్థిరమైన మెజారిటీ సంపాదించి. బూర్జువా అధికార ప్రయోజనాలను కాపాడే పార్లమెంటరీ వ్యవస్థను, శ్రామికవర్గ ప్రయోజనాలకుపయోగపడే వ్యవస్థగా మార్చుటకు పార్లమెంటేతర ప్రజా వుద్యమాలతో అభివృద్ధి నిరోధక పాలకవర్గాల ప్రతిఘటనను రూపుమాపి, సోషలిస్టు విప్లవాన్ని శాంతి మార్గంలో సాధించుట కనువగు పరిస్థితులను రూపొందించుట అవసరమని వివరించింది. అంతేగాక యిది ఎడతెగని వర్గ పోరాటాలు బడా పెట్టుబడికి, అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా కార్మిక, కర్షక, నగర మధ్యతరగతి వర్గాల ఐక్య కార్యాచరణ ద్వారానే సాధ్యమని తెలిపింది.

"పాలక వర్గాలు ప్రజావ్యతిరేక, దౌర్జన్య విధానాల చేబట్టితే, సోషలిజ పరిణామాన్ని శాంతిమార్గేతర పంథాలో సాధ్యమని గుర్తుంచుకొనాలి. పాలక వర్గాలు అధికారాన్ని ఇచ్ఛికంగా వదలిపేయవని లెనినిజం బోధిస్తుంది, అనుభవం నిరూపించింది" అని వివరించి "సోషలిజం ఏ మార్గంలో సాధ్యమనేది ప్రతి దేశపు వాస్తవ నిర్దిష్ట పరిస్థితులపై ఆధారపడి వుంటుందని"[2] మాస్కో ప్రకటన తెల్పింది.

మాస్కో ప్రకటనపై "మనం నివసించే యుగధర్మం, పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి పరివర్తన "యని" స్పుత్నిక్ విశ్వంపై మానవ విజయాన్నే గాక పెట్టుబడిదారి విధానంపై సోషలిజపు విజయాన్ని స్పష్టం చేసిందని, సోవియట్ పారిశ్రామిక ఉత్పత్తిలో అమెరికాను అధిగమించాలని యిచ్చిన నినాదం, వాస్తవ మవుతుందనుటకు రెండు ఉపగ్రహాలను విశ్వాంతరాళాలోనికి పంపుటయే నిదర్శనమన్నారు[3] అజయ్‌ఘోష్. ఈ యుగపు ప్రధాన ప్రశ్నయే వ్యవస్థ విజయాన్ని సాధిస్తుందనేది తేలిపోయిందన్నారు. మాస్కో ప్రకటన శాంతిపై విశ్వాసాన్ని ప్రకటించుట మాత్రమే కాదని, శాంతిని పరిరక్షించుట, యుద్ధాన్ని నివారించుట, ప్రపంచ ప్రజోద్యమాలకు సాధ్యమని తెలిపిందన్నారు.

ప్రపంచ ప్రజాశక్తుల బలాబలాలలో వచ్చిన స్పష్టము, నిర్ణయాత్మకమైన

---

1. మాస్కో సమావేశాల (1957, 1960, 1969) ప్రధాన అధికార పత్రాలు (ఆంగ్లంలో) కమ్యూనిస్టుపార్టీ పబ్లికేషన్, నం. 31. డిసెంబరు 1972 (C 68) పే. 13.
2. ............అదే ............పే. 14.
3. అజయ్‌ఘోష్ (1962) అజయ్‌కుమార్ ఘోష్ వ్యాసాలు, ఉపన్యాసాలు (ఆంగ్లములో) మాస్కో. 1962. పే. 82-83.

మార్పు "అనేక దేశాలలో గతంలో కంటే అనేక విధాల భిన్నమైన శాంతి మార్గాన సోషలిజం విజయాన్ని పొందుట కనువగు పరిస్థితులను కలుగ" జేసిందని వివరించారు. ఈ కారణంగానే సోషలిస్టు వ్యతిరేక శక్తులు "మార్క్సిస్టు, లెనినిస్టు మౌలిక మూల సూత్రాలకు కాలదోషం పట్టిందని, సంక్షోభం, తీవ్ర పోరాటాలు లేకుండా సోషలిస్టు పరివర్తన సాధ్యమని, బూర్జువా ప్రజాస్వామ్యాన్ని, పార్లమెంటరీ కార్యాచరణను అత్యుక్తి చేసి, క్రమ పరిణామ మార్గాన్ని నిర్దేశించారు".[1] కమ్యూనిస్టులు యీ భ్రమలకు లోనై, నిర్విరామ పోరాటాన్ని సాగించుకుంటే, ప్రజా ఉద్యమాలను నీరుగార్చే బూర్జువా ప్రయత్నాలకు సహాయం చేసినవారగుతారని హెచ్చరించారు అజయ్.

"మితవాద అవకాశవాదం, మార్క్సిస్టు-లెనినిస్టు మూల సూత్రాలకు నేరుగా మొరటుగా ఎల్లప్పుడూ వ్యతిరేకతను ప్రదర్శించదని నొక్కి చెప్పుట అవసరం." అంతేగాక "మితవాద అవకాశవాదము ప్రజాసంస్థలలో, నిర్మాణ దృక్పథాలలో, పద్ధతులలో, అస్పష్ట, కుటిల రూపాలలో, ప్రజా పోరాటాలఆచరణలో కన్పడుతుంటుంది. ప్రతి దేశ, ప్రతిపార్టీలో అది కన్పడే ప్రత్యేక రూపాలకు వ్యతిరేకంగా స్పష్టమైన పోరాటాన్ని సాగించవలసి వుంటుంది"[2] అని అజయ్‌ఘోష్ కర్తవ్యాన్ని సూచించారు. అంతేగాక "అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకు గతంలో అవలంభించిన విధానాలు, నేటి చారిత్రిక పరిస్థితులలో సరిపోవు. కాన ఆ రూపాలను పునరుద్ధరించుట తగదు. ఈ విషయాన్ని అన్ని కమ్యూనిస్టుపార్టీలు ఆమోదించాయి" అని అజయ్ తెలిపారు, 1960 దశకంలో రాబోవు తుఫాన్‌లను సూచించారు.

## V

# ప్రత్యేక అమృత్‌సర్ పార్టీ కాంగ్రెస్

### ఎన్నికల అనంతర రాజకీయ పరిణామాలు :

రెండవ సాధారణ ఎన్నికలలో వామపక్షాల విజయం కేరళలో కమ్యూనిస్టు మంత్రివర్గం ఏర్పాటు, దేశంలోని రాజకీయశక్తుల బలాబలాలలో మార్పు వచ్చింది. పాలక పార్టీలో, కరుడుగట్టిన మితవాదవర్గాలు శ్రీ రాజగోపాలాచారి, ఆచార్యరంగా నాయకత్వంలో తదితరులు నూతన మితవాద రాజకీయ స్వతంత్ర పార్టీని ఆగస్టు 1959లో ఏర్పాటుపై పరిణామాల ఫలితంగా జరిగింది. వీరితో పాటు గతంలో మిత

---

1. అజయ్‌ఘోష్ (1962) అజయ్‌కుమార్‌ఘోష్, వ్యాసాలు, ఉపన్యాసాలు (ఆంగ్లములో) మాస్కో. పే. 87.
2. ........... అదే ........... పే. 87.

వాద సోషలిస్టు నాయకుడు మసానీ చేరి, నెహ్రూ అనుసరించుతున్న అభ్యుదయకర చర్యలన్నిటిని, భూసంస్కరణలను, ప్రభుత్వ యాజమాన్యంలో పారిశ్రామికాభి వృద్ధిని వ్యతిరేకించారు. భారత ఆర్థిక జీవితంలో పంచవర్ష ప్రణాళికా సూత్రాలను ప్రవేశపెట్టుటకు వ్యతిరేకంగా వ్యక్తిగత ఆస్తిని, స్వతంత్ర పరిశ్రమల విధానాన్ని బలపరచారు. విదేశాంగ విధానంలో సుముఖ తటస్థ విధానాన్ని తిరగతోడాలన్నారు. బడా బూర్జువా, భూస్వాముల, మాజీ రాజులు, రాణాలు, తదితర అభివృద్ధి నిరోధకులకు స్వతంత్ర పార్టీ రాజకీయ వేదిక అయింది. మితవాదులందరూ యీ విధంగా సమీకరించబడుటతో హిందూ, ముస్లిం మతతత్వవాదులకు ప్రోత్సాహం లభించింది.

హిందూ మతోన్మాదులు, మితవాద వ్యతిరేకులు గోల్వాల్కర్ నాయకత్వంలోని స్వయంసేవక్ సంఘ రాజకీయ వేదికగా 1950 దశకం చివరలో జనసంఘాన్ని ఏర్పాటు చేశారు. మత కలహాల వెల్లువకు, అసహనానికి, హింసా దౌర్జన్యాలకు మార్గమేర్పడింది. భారతదేశం అనుసరించుతున్న ప్రజాస్వామ్య విధానాలను, ఆర్థిక, సాంఘిక, సామాజిక వెనుకబాటుతనాన్ని, నిరక్షరాస్యతను, హిందూమతాభిమానాలను నైపుణ్యంగా వినియోగించుకొంటూ, నిజమైన జాతీయవాదులం తామేనంటూ నెహ్రూ అభ్యుదయకర దేశీయ, విదేశీయ విధానాలను బహిరంగంగా వ్యతిరేకించసాగింది. దీనికి ప్రతిచర్యగా "జమాయత్ ఇ ఇస్లామి హింద్", మజ్లీస్ ఇ ఇత్తెహాదుల్ ముస్లిమిన్" అనే ముస్లిం మత, రాజకీయ సంస్థలు, జనసంఘం వలెనే ప్రభుత్వ ఆర్థిక, పారిశ్రామిక, వ్యవసాయ విధానాలను వ్యతిరేకించసాగాయి.

ఈ విధంగా హిందూ, ముస్లిం మతవాదుల చర్యలు తీవ్రతరమగుటతో కేరళలో క్రిష్టియన్ చర్చి, కేరళ కాథలిక్ క్రిష్టియన్ చర్చి, రాజకీయాలలో కలుగజేసుకొన ప్రారంభించాయి. కేరళ కాథలిక్ కాంగ్రెసు, క్రిష్టియన్ చర్చి సామాజిక రాజకీయ శాఖగా కమ్యూనిస్టు మంత్రివర్గానికి వ్యతిరేకంగా ప్రముఖ పాత్ర వహించింది.

సంఖ్యాధిక్యత, బలాధిక్యత, ధనాధిక్యతగల భూస్వామ్యవర్గాలు పూర్వ ప్రాతిపదిక పోవుటతో కులాల, మతాల నాశ్రయించ మొదలుపెట్టారు. అంతేగాక పాలక పార్టీలలోని వివిధ గ్రూపులు తమ బలాన్ని, ప్రాధాన్యతను, ప్రాతినిధ్యాన్ని పెంచుకొనుటకై కులవాదాలను ఆశ్రయించారు. ఫలితంగా అధికారానికై జరుగు కుమ్ములాటలో యీ గ్రూపులు కులాల నాశ్రయించి, రాజకీయాలలో కుల కార్పణ్యాలు పెరిగిపోవుటకు కారణభూతులయ్యారు.

ఈ మత, కుల దురభిమానాలు, ఘర్షణలు, రైతు, కూలి, వ్యవసాయ కూలి వర్గాలు సామాజిక న్యాయానికి, ఆర్థిక పోరాటాలు ఐక్యతతో సాగించుటను విచ్ఛిన్నము చేయుటకు బూర్జువా వర్గాలు వినియోగించారు. పెంచి పోషించారు. మరో వైపు వీటి నధిగమించి కార్మికులు, కర్షకులు, నగర మధ్యతరగతి, తదితర బడుగు

వర్గాలు అధిక వేతనాలకు, భూములకు, నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదల వ్యతిరేకంగా వర్గ పోరాటాలను యినుమడింప జేసారు. పాలక వర్గాలు ప్రజాశక్తుల లోని అనైక్యతను వినియోగించుకొంటూ, తన బలాన్ని పెంచుకొంటుంది.

## అమృత్‌సర్ 6 వ పార్టీ కాంగ్రెస్ :

అమృత్‌సర్ పార్టీ ప్రత్యేక కాంగ్రెసు దేశంలో ఆసక్తి కలుగజేసింది. పత్రికలలో కార్యక్రమాలు, నిర్ణయాలు విస్తృత వ్యాఖ్యలతో ప్రచురింపబడ్డాయి. "పార్టీ పెద్ద రాజకీయ శక్తిగా దేశంలో ఉద్భవించిందని" [1] టైమ్స్ ఆఫ్ ఇండియా వ్యాఖ్యానించింది. ఇది ఆశ్చర్యాన్ని కలిగించదు. కమ్యూనిస్టుపార్టీ కేరళలో రాష్ట్ర పాలనను చేబట్టింది, బెంగాల్, ఆంధ్రలో ప్రధాన ప్రతిపక్షంగాను, కేంద్ర లోక్‌సభ రాజ్యసభలలో ప్రధాన ప్రతిపక్షంగా, కార్మికవర్గ ప్రధానశక్తిగ, భవిష్యత్తుగల పార్టీగ గుర్తించబడింది. పార్టీ కాంగ్రెసు నిర్ణయాలను మిత్రులు శ్లాఘించారు. వ్యతిరేకులు శ్రీమన్నారాయణ్, దేబరులు కమ్యూనిస్టులు మారలేదని, వారిని నమ్మరాదని అన్నారు. కమ్యూనిస్టులు శాంతి పంథాను చేబట్టుట ఎత్తుగడ కాదు, అది రాజకీయ విధానం. కమ్యూనిస్టులు అవలంబించే విధానాన్ని నిర్భయంగా చెప్పుతారు, ఆచరించుతారు.

పార్టీ కాంగ్రెసు ప్రపంచశాంతి శక్తుల పురోగమనం, దేశంలో ప్రజాస్వామ్య ఉద్యమాల పురోగమనం, మితవాద అభివృద్ధి నిరోధకుల పెరుగుదల, జాతీయ కాంగ్రెసు బలహీనపడుట, ప్రజాశికా సంక్షోభం, అమెరికా అప్పులపై ఆధారపడుట, అభ్యుదయకర విధానాలకై ప్రజల పోరాటాలు, ప్రజా ఉద్యమాలు, ఐక్య సంఘటనా నిర్మాణం, బలపరచుట, ప్రజా కమ్యూనిస్టుపార్టీ నిర్మాణాది విషయాలను చర్చించి నిర్ణయాలు చేసింది. పాల్ఘాట్ కాంగ్రెసులో వ్యవధి చాలనందున వాయిదా వేసిన నిర్మాణ సమస్యలను ప్రధానంగా చర్చించి నిర్ణయాలు చేసింది.

## అంతర్జాతీయ రాజకీయాల అవగాహన :

ప్రపంచశాంతి, జాతీయ విముక్తి, స్వాతంత్ర్య, ప్రజాస్వామ్య, సోషలిజపు శక్తులు మరింత బలపడి సామ్రాజ్యవాదుల కుట్రలను భగ్నం చేయగలిగిన శక్తిని సంతరించుకొన్నాయి. సోవియట్ స్పుత్నిక్ ప్రయోగం అది సాధించిన శాస్త్ర, సాంకేతికాభివృద్ధిని ప్రపంచానికి చాటి చెప్పింది. సోవియట్ యూనియన్ ఏకపక్షంగా ఆటమిక్ ప్రయోగాలను ఆపివేయుట సామ్రాజ్యవాదంలో కలవరం పుట్టించింది.

ఆసియా, ఆఫ్రికాలలో అనేక దేశాలు శాంతి, స్వాతంత్ర్యం, సామ్రాజ్యవాద

1. అజయ్‌ఘోష్ (1958) అజయ్‌కుమార్ ఘోష్, వ్యాసాలు, ఉపన్యాసాలు (ఆంగ్లములో) మాస్కో 1962. అమృత్‌సర్ పార్టీ కాంగ్రెస్‌లోని ఉదహరింపు పే.70.

వ్యతిరేక పంథా చేబట్టుట, ఈజిప్టుపై దాడిని సోవియట్ నాయకత్వంలో ప్రతిఘటించుట, సిరియాలో సామ్రాజ్యవాదుల ప్రయత్నాలను వమ్ము చేయుట పేర్కొనదగినవి. సంయుక్త అరబ్ రిపబ్లిక్‌గా ఈజిప్టు అవతరణ, అరబ్ జాతీయోద్యమాల అభివృద్ధికి ప్రోత్సాహన్నిచ్చింది. కెయిరో సమావేశం ఆఫ్రో-ఏసియన్ ఐక్యత గణనీయమైన ప్రాముఖ్యత సంతరించుకొంది. మలయా, ఘనా, మొరాకో, ట్యునిసియా జాతీయ విముక్తి ఉద్యమాలు విజృంభించాయి. అల్జీరియా జాతీయోద్యమం ఫ్రెంచి సామ్రాజ్యవాద పునాదులను కదిలించి వేస్తున్నది. ఈ పరిణామ క్రమాభివృద్ధి వలస విధానాన్ని సంక్షోభంలో ముంచెత్తి, చరమగీతాన్ని పాడుతున్నది.

సోషలిస్టు శిబిరపు ఐక్యత, ప్రపంచశాంతి, స్వాతంత్ర్య, విమోచనోద్యమాలకు తోడ్పడుతున్నది. మాస్కో ప్రకటన, 64 దేశాల శాంతి మానిఫెస్టో ప్రపంచ పురోగామి శక్తుల నాకర్షించింది. యుద్ధోన్మాద, వలస సామ్రాజ్యవాద శక్తులు సైనిక ఒడంబడికలు, దురాక్రమణలకై "బలాధిక్యత స్థాన" విధానాలను అనుసరించుతున్నవి. మూడో ప్రపంచ యుద్ధానికి సన్నాహాలు చేస్తున్నవి. సోవియట్ ఆటం ప్రయోగాలు ఆపివేయు విధానాలకు స్పందించక అమెరికా నాయకత్వంలో 'నాటో' శక్తులు యుద్ధ, సైనిక ఆటమిక్ ఆయుధ కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నది. బాగ్దాద్, సీటో సైనిక కూటములు సామ్రాజ్యవాద యుద్ధ వ్యూహంలో భాగాలుగ వున్నవి. ఇండోనేషియాలో సామ్రాజ్యవాదపు తాజా ప్రయత్నాలు దీనిని సూచించుతున్నవి. అమెరికన్ సామ్రాజ్యవాదం సుమిత్రాలోని తిరుగుబాటుదారులకు, రిపబ్లిక్ వ్యతిరేకంగా, ఆయుధాలను సరఫరా చేస్తున్నది.

"ప్రపంచ శక్తుల బలాబలాలో సుముఖ మార్పు వచ్చుటకు మన దేశం గణనీయమైన పాత్ర వహించింది. మన దేశం, సోషలిస్టు దేశాలు, ఆఫ్రో-ఏసియన్ దేశాలతో కలసి సైనిక కూటముల విధానాన్ని నిరసించి, ఆటం ఆయుధాల నిషేధాన్ని కోరాయి. సోషలిస్టు, తదితర నూతన స్వాతంత్ర్య దేశాలతో సన్నిహిత ఆర్థిక, వ్యాపార, సాంస్కృతికసంబంధాలను పెంపొందించింది. బలపరచింది. ఆఫ్రో-ఏసియన్ ఐక్యతా విధానాన్ని అవలంభించి ఈజిప్టు, అల్జీరియాల స్వాతంత్ర్య పోరాటాలను బలపరచింది.

"భారత స్వాతంత్ర విదేశాంగ విధానం, సామ్రాజ్యవాదానికి ఆగ్రహాన్ని కలుగజేసింది. మనదేశానికి వ్యతిరేకంగా బాగ్దాద్, సీటో సైనిక కూటముల నేర్పరచి, వొత్తిడిచేయ మొదలుపెట్టాయి. పాకిస్తాన్‌లో అమెరికా ఆయుధాలు గుమ్మరించి, కాశ్మీర్‌లో భారత్-పాకిస్తాన్‌ల ఉద్రేకాన్ని రెచ్చగొట్టుచున్నది. గోవా విముక్తిఉద్యమంలో పోర్చుగీసు పాశిస్టుల హింసాచర్యలను ప్రోత్సహించుచున్నది"[1]

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ 5వ, ప్రత్యేక అమృతసర్ కాంగ్రెసు, ఏప్రియల్ 1958 లో ఆమోదించిన తీర్మానాలు. సి.పి.ఐ. పబ్లికేషన్ (ఆంగ్లంలో) మే 1958. పే. 2-3.

"భారత ప్రభుత్వ విదేశాంగ విధానం నిరాటంకంగా కొనసాగుటకు పార్టీ పూర్తి సహకారాన్నిచ్చి, బలపరుస్తుంది. మన స్వతంత్ర విదేశాంగ విధానానికి వ్యతిరేకంగా, సామ్రాజ్యవాద పన్నాగాలను, దేశంలోని సామ్రాజ్యవాద అనుకూల మితవాద శక్తుల ప్రయత్నాలను బహిరంగపరచి, ప్రజా సమీకరణతో ఎదుర్కోవాలి." 1

అంతేగాక శాంతి వుద్యమంలో పార్టీ బలహీనతలకు లోనైందని, దానిని త్వరగా అధిగమించి, పార్టీ సభ్యులు, శాఖలు, ప్రజాసంఘాలను, విస్తృత ప్రజా సామాన్యాన్ని సమీకరించుటకై తమ శక్తినంతా వినియోగించాలని కోరింది. ఆవిధంగా బలమైన, విస్తృత, ఐక్యశాంతి, ఆసియా-ఆఫ్రికా ఐక్యతా వుద్యమాన్ని నిర్మించాలని కాంగ్రెసు కోరింది.

ప్రజాస్వామ్య వుద్యమం :

పొల్టాట్ పార్టీ కాంగ్రెసు రాజకీయ విశ్లేషణ, రూపొందించిన రాజకీయ విధానం సరియైనవని, తదనంతర పరిణామాలు నిర్ధారణ చేసాయి.

కాంగ్రెసు గుత్త పరిపాలనాధికారానికి కేరళలో కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వ యేర్పాటు గండి కొట్టిందని, యిది ప్రపంచ ప్రజల దృష్టి నాకర్షించిందని. తీర్మానం పేర్కొంది. "మన జాతీయ రాజకీయ జీవితంలో అత్యంత ప్రాముఖ్యత గల పరిణామం." కేరళ విజయం చెదురుగా, యాదృచ్ఛికంగా లభించినది కాదని, ఉత్తర ప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్‌లలో కమ్యూనిస్టు బలం పెరుగుట, యితర రాష్ట్రాలలో వామపక్ష శక్తులు బలపడుటతో స్పష్టం కాగలదు." కమ్యూనిస్టు పార్టీ 12 మిలియనుల వోటరుల అభిమానాన్ని చూరగొని మరింత బలాన్ని పొంది, ప్రధాన ప్రతిపక్షంగా వుద్భవించింది.

ప్రజాస్వామ్య వుద్యమాల పెరుగుదలను, పోస్టల్-టెలిగ్రాఫ్ వుద్యోగుల నాయకత్వంలో కేంద్ర ప్రభుత్వోద్యోగులు, రెండవ పేకమీషన్ యేర్పాటు విషయంలో పొందిన విజయం, అస్సాంలో నూనెశుద్ధి కర్మాగారాల కార్మికుల పోరాటం అందరిని ఐక్యపరచి, కార్మికుల, కర్షకుల, వుపాధ్యాయుల, విద్యార్థుల, ఆఫీసు వుద్యోగుల పోరాటాలలో విజయాలను సాధించుటకు ప్రోత్సాహాన్నిచ్చింది. మార్చి 27, 1958 దేశవ్యాపిత ప్రదర్శనను ఎ.ఐ.టి.యు.సి., హెచ్.యం.యస్., యు.టి.యు.సి. కార్మిక సంస్థలన్నీ సహకరించి పాల్గొనుట వుద్యమ పురోగతిని తెలియజేస్తుంది. కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వ చర్యల యెడల దేశంలో పెంపొందుతున్న సుహృద్భావంలో ప్రజాస్వామ్య వుద్యమాల పురోగతి స్పష్టంగా కానవస్తుంది.

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ 5వ, ప్రత్యేక అమృతసర్ కాంగ్రెసు, ఏప్రియల్ 1958 లో ఆమోదించిన తీర్మానాలు. సి.పి.ఐ. పబ్లికేషన్ (ఆంగ్లంలో) మే 1958. పే. 2-3.

కాం|గెసు అన్నిరాష్ట్రాలలో యింకా విస్తృత ప్రభావాన్ని, బలాన్ని, శక్తిని కలిగి వుంది. కాని ప్రజలలో దానికి గల బలం క్షీణిస్తూ, దాని పునాదులు కదలిపోవు చున్నవి. ముంద్రా కుంబకోణం కాంగ్రెసుపై ప్రజలకు గల విశ్వాసాన్ని దెబ్బతీసింది. పురోగామ ప్రజాస్వామ్య వర్గాలనుండి కాంగ్రెసు వేరువడిపోయి, గ్రూపులు, ముఠా తగాదాలుతో కాంగ్రెసు నైతిక బలాన్ని కోల్పోతూవుంది. అనేక రాష్ట్రాలలో యీ ముఠా తగాదాలు కాంగ్రెసు ప్రభుత్వాల సుస్థిరత్వాన్ని ప్రశ్నించుచున్నవి. అభ్యుద యకర కాంగ్రెసు వర్గాలు తమ అసంతృప్తిని వెల్లడి చేస్తూవేవున్నవి.

ప్రభుత్వంపై అసంతృప్తి పెరుగుదల తంతె, కమ్యూనిస్టు, ప్రజాస్వామ్య శక్తుల అభివృద్ధి తక్కువగా వుంది. మత, స్వార్థపు పార్టీలు, జనసంఘ, అకాలీ పార్టీ, ఒరిస్సా గణతంత్ర పరిషత్, తమిళనాడు ద్రవిడ మున్నేట్ర కజగం లాంటి ఐక్యతా విచ్ఛిన్నకర, అభివృద్ధినిరోధక పార్టీలు బలాన్ని పెంచుకొన్నాయి. కాంగ్రెసు బలాన్ని కోల్పోయిన కొలదీ కాంగ్రెసువాదులు, వ్యతిరేకులు కుల, మతవాదులకు విజ్ఞప్తులు చేస్తూ తమ బలాన్ని నిలుపుకొన ప్రయత్నిస్తున్నారు. ఇది లౌకిక, ప్రజా స్వామ్య ఐక్యతా భావాలకు ప్రమాదకరమైన నూతనాంశము.

ప్రజాస్వామ్య కమ్యూనిస్టు వుద్యమాల పెరుగుదల, ప్రణాళిక వ్యవస్థ యిబ్బందులు యేర్పడుటతో కరుడు కట్టిన మితవాద అభివృద్ధి నిరోధకులు, తమ దుశ్చర్యలను ఎక్కువ చేస్తున్నారు. ప్రభుత్వ, ప్రజారంగాలపై దాడి ప్రారంభించారి. గుత్త వర్గాలకు మరిన్ని రాయితీలు కోరుతున్నారు. విదేశీ పెట్టుబడికి తలుపులు తెర వాలంటున్నారు. సోవియట్ యూనియన్, సోషలిస్టుదేశాలతో ఆర్థిక వ్యాపార, సాంస్కృతి సంబంధాల పెంపును అడ్డుకొంటున్నారు. వారి ప్రయోజనాలకు నేటి లేబరు చట్టాలను మార్చాలంటున్నారు. వ్యవసాయ సంస్కరణలను వ్యతిరేకించుతు, రెండవ ప్రణాళిక చిక్కులలో పడుటతో, అభివృద్ధికర అంశాలపై దాడిచేసి, భగ్నం చేయుటకు ప్రయత్నిస్తున్నారు. ఆ విధంగా జాతీయ ఆర్థిక, రాజకీయ ప్రణాళికా విధానాలను జాతివిద్రోహ, ప్రజాస్వామ్యవ్యతిరేక మార్గం పట్టించ ప్రయత్నిస్తు న్నారు.

## ప్రణాళికా సంక్షోభం, అమెరికాపై ఆధారపడుట

దేశ రాజకీయ పరిస్థితి చాలవరకు ఆర్థికపరిస్థితిపై ఆధారపడి వుంటుంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను ప్రజాస్వామ్యశక్తులు అభినందిచాయి. కమ్యూ నిస్టుపార్టీ పరిమిత మద్దతును ప్రకటించింది. ప్రజలజీవన పరిస్థితులుకొంత మెరుగు పడునని తలచింది. ప్రణాళికా లక్ష్యాల సాధనకై విదేశీ ముఖ్యంగా అమెరికా పెట్టు బడులపై ఆధారపడుట సంక్షోభానికి దారి తీస్తుందని పాల్ఘాట్ కమ్యూనిస్టు కాంగ్రెసు తీర్మానం హెచ్చరించింది. వీటిని పెడచెవిని ప్రభుత్వం పెట్టినా వాస్తవాలను తద నంతర ఘటనలు రుజువుచేసాయి.

ప్రణాళిక మూడవ సంవత్సరంలో అభివృద్ధి కుంటుపడింది. భూసంస్కరణలు ప్రవేశపెట్టుటలోని వైఫల్యం, బేదఖల్కు, భూములనుండి రైతుల తొలగింపు విస్తృతంగా జరుగుటకు తోడ్పడింది. ఆహారకొరతతో దిగుమతి చేసుకొనవలసివచ్చింది. పరిశ్రమలు స్థాపించబడినా పారిశ్రామిక వుత్పత్తిరేటు పడిపోయింది. ప్రజల కొనుగోలుశక్తి పడిపోవుటతో అనేక గుడ్డల మిల్లులు మూసివేయబడుట, నిరుద్యోగం పెరుగుటయేగాక ప్రజావసరాల పరిశ్రమల వుత్పత్తులు పడిపోయాయి. దేశంలో వనరుల సమీకరణ పడిపోయింది. ప్రైవేటు పరిశ్రమల ప్రయోజనాలకై పెరిగిన దిగుమతులతో మారకద్రవ్య సంక్షోభ మేర్పడింది. ప్రభుత్వరంగం వనరుల సంక్షోభంతో కుదించబడుటో లేక ప్రాజెక్టుల కాలపరిమితి పెంచుటో కేంద్రప్రభుత్వ వొత్తిడితో చేయవలసి వచ్చింది. వ్యక్తియాజమాన్యంలోని లాభాలు మాత్రం అంతులేకుండా పెరిగిపోయాయి. ధరలు ఆకాశాన్నంటుటతో ప్రజల పరిస్థితి దుర్భరమైంది.

గుత్తపెట్టుబడిదారీ వర్గపారిశ్రామిక అభివృద్ధికి ప్రభుత్వం మన పారిశ్రామికాభివృద్ధికి ప్రతిబంధకాలైన షరతులకు అంగీకరించి సహాయాన్ని పొందవలసి వచ్చింది. అమెరికా విధించే షరతులన్నీ అంగీకరించితే మన స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమాధికారాన్ని కోల్పోవుటే అవుతుంది. అమెరికా యిచ్చే పెట్టుబడి వడ్డీ, లాభాలు, ఎగుమతి చేసుకొనే సహాయం ప్రత్యేకంగా ప్రైవేటు రంగానికే వుద్దేశించబడింది. మన దేశంలోని అభివృద్ధినిరోధక వర్గాలను బలపరచే విధానము. మాజీ వలసలలో అమెరికా సామ్రాజ్యవాదం వివిధ రూపాలలో విస్తరించి ప్రయత్నిస్తున్నది. దేశంలో యేర్పడిన ఆర్థిక సంక్షోభ భారాన్ని, నిరుద్యోగ భారాన్ని నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలపై త్రోయ ప్రయత్నిస్తున్నది. దేశీయ అభివృద్ధి నిరోధకులతో కలపి, వారు కలిగించగలిగిన ప్రమాదాన్ని తక్కువగా అంచనా వేయరాదు.

జాతి స్వాతంత్ర్యం, సార్వభౌమాధికారాన్ని, ప్రజాస్వామ్యాన్ని, ఆర్థిక ప్రయోజనాల పరిరక్షణకై, కమ్యూనిస్టుపార్టీ దేశీయ, విదేశీయ అభివృద్ధినిరోధకుల కుతంత్రాలను బహిరంగపరచి పోరాడుతుంది. ప్రభుత్వం అట్టి వర్గాలను బలహీనపరచే ఎట్టి చర్యలనైనా బలపరుస్తుంది పార్టీ.

**అభ్యుదయకర విధానాలకు ప్రజా పోరాటాలు :**

అభ్యుదయ నిరోధక శక్తులు కాంగ్రెసు లోపల, బయటా వున్నవి. బయట వున్న యీ శక్తులకు ప్రజాబలం లేదు. కుల, మత ద్వేషాలను రెచ్చగొట్టి సనాతన మూఢాభిప్రాయాలను పెంపొందించి బలాన్ని చేకూర్చుకొంటున్నా, వారికి ప్రధానమైన బలం కాంగ్రెసులో వున్న అభివృద్ధినిరోధక శక్తుల నుండి ఎక్కువగా పరోక్షం

గాను, తరచుగా ప్రత్యక్షంగాను లభిస్తూవుంది. అంచేత కాంగ్రెసులోని అభ్యుదయ నిరోధక శక్తులను వోడించకుండా, బయట వున్న అభ్యుదయ నిరోధక శక్తులను వోడించి, అభ్యుదయకర విధానాలను చేబట్టి జయప్రదం చేయుట జరుగదు.

ఈ అభ్యుదయ నిరోధకశక్తులు రెండూ, రెండవ ప్రణాళిక ప్రధాన ధ్యేయాలైన ప్రభుత్వరంగంలో మౌలిక భారీ పారిశ్రామికాభివృద్ధిని, వ్యవసాయ సంస్కరణలను, ఐక్యంగానే తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. ప్రభుత్వ విధానాలలోని బలహీనతలే యీ రెండు వర్గాలు ధైర్యంగా వ్యతిరేకించుటకు బలాన్ని చేకూర్చుతున్నవి. ప్రైవేటు పెట్టుబడిదారులకు, వ్యవసాయ సంస్కరణలలో భూస్వాములకిచ్చే రాయితీలు, విదేశ పెటుబడిదారులపై అధారపడి ప్రణాళికా రచన చేయుటే వారికి వ్యతిరేకించే శక్తినిచ్చాయి. కాన ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలకు, బయట బడాబూర్జువా, భూస్వామ్యవాద శక్తులకు వ్యతిరేకంగా వొకేకాలంలో ద్విముఖ పోరాటాన్ని నిలకడగా, దృఢంగా సాగించినపుడే ప్రణాళికా లక్ష్యాలను సాధించుట జరుగుతుంది. అందుకు కమ్యూనిస్టు పార్టీ శక్తినంతా వినియోగిస్తుంది. నిర్దిష్టమైన ప్రతిపాదనలను రూపొందించి పోరాడుతుందని పాల్ఘాట్ పార్టీ కాంగ్రెసు తీర్మానం స్పష్టం చేసింది. ప్రభుత్వరంగ విస్తరణ, ప్రజాస్వామిక యాజమాన్యం, కార్మికుల పాత్ర, షెడ్యూల్డు బ్యాంకుల జాతీయకరణ, బొగ్గుగనులు, తోటల జాతీయకరణ, ప్రభుత్వ వ్యాపార సంస్థల విస్తరణ బలపరచుట, భారత-సోషలిస్టు దేశాల పరస్పర ఆర్థిక సంబంధాల విస్తరణాది పాల్ఘాట్ పార్టీ కాంగ్రెసు ప్రతిపాదనలను అమృత్‌సర్ పార్టీ కాంగ్రెసు పునరుద్ఘాటించింది.

భారతదేశం పారిశ్రామికాభివృద్ధికి సోవియట్ యూనియన్, సోషలిస్టు దేశాల సాంకేతిక సహాయాన్ని పొందుటను గతంలో వ్యతిరేకించిన బూర్జువా వర్గాలే సుముఖంగా వుండుటకు ముఖ్యకారణం, మనలను కట్టిపేయు అననుకూల షరతులు లేకుండుట, భారీ పరిశ్రమలకు పశ్చిమ దేశాలు సహాయాన్ని యివ్వ నిరాకరించగా, యీ దేశాలు సంతోషపూర్వకంగా యిచ్చుట, వొప్పందాలలోని అభివృద్ధికర అంశాలనుటలో సందేహం లేదు.

దేశ పునర్నిర్మాణానికై పోరాడుతూనే, బహుముఖ పురోగమనంతోపాటు, ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచుకోవాలనే ఆకాంక్ష నెరవేరుతుందని పార్టీ ఆశించుతున్నది. అభ్యుదయకర విధానాలకై పోరాడుతూ, ప్రజల జీవన ప్రమాణాలపై స్వప్రయోజనపర వర్గాలు, ప్రభుత్వం చేయు దాడులను ప్రతిఘటించుటకై కార్మిక, కర్షక, మధ్యతరగతి వర్గాల పోరాటాలను నిరంతరం కొనసాగించి, జీవన పరిస్థితులు తక్షణం మెరుగుపడుటకు పోరాడుతుంది. స్థానిక పోరాటాలే గాక, విస్తృత అఖిల భారత పోరాటాలు సాగించుతుంది. ఆహార క్లిష్టపరిస్థితి దృష్ట్యా రైతాంగ తక్షణ సమస్యయైన వ్యవసాయ సంస్కరణలకై విస్తృత పోరాటాన్ని జరుపుతుంది.

ప్రభుత్వరంగ పరిశ్రమలలోని కార్మికవర్గం, న్యాయమైన హక్కులకై పోరాటం జరుపుతూ లంచగొండితనం, దుబారాను, అధికార నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాడుటతో పాటు సమర్ధతను, ఉత్పత్తి నాణ్యతను పెంచుటకై పోరాడుతుంది.

ప్రజాశికా కార్యక్రమాలలో ప్రజలు యెక్కువగా పాల్గొని తమ పాత్రను నిర్వహించునట్లు చేయుటకు కృషి చేస్తుంది. స్థానిక సంస్థలు, పురపాలక సంఘాలు, సహకార సంఘాలలో పార్టీ నిర్వహించవలసిన పాత్రకు ప్రత్యేక ప్రాముఖ్యత వుంది. వాటిని ప్రజా సంస్థలుగా, ప్రజాస్వామ్య పాలనా వ్యవస్థలుగా చేయుటకు ప్రజా చైతన్యాన్ని, పైఖరిని పెంపొందించవలసి వుంది.

ఈ కర్తవ్య నిర్వహణకు విస్తృత ప్రజాఐక్యత, ప్రజాసంఘాలను బలంగా నిర్మించి, ప్రజాధారవను పెంపొందించవలసి వుంది. పార్టీ ప్రతి సభ్యుడు, శాఖ, ప్రజా కార్యాచరణపై సమగ్ర, బహుముఖ అవగాహనను పెంపొందించుకొనాలి.

## కిసాన్ సభను విస్తృత ప్రజాసంస్థగా నిర్మించాలి:

ప్రజలలో జాగృతిని, పోరాట శక్తిని, నిర్మాణాన్ని పెంపొందించి, ఉద్యమం పురోగమించుటకు దేశభక్త, ప్రజాస్వామ్య వర్గాలలో విస్తృత ఐక్యత నిర్మించి పోరాటాలు, వుద్యమాలు సాగించాలి.

గ్రామీణ ప్రాంతాలలో దేశమంతటా బలమైన ప్రేళ్ళూనిన కిసాన్ సభల నిర్మాణం, ప్రత్యేక నిర్ణయాత్మక ప్రాముఖ్యతను కలిగివుంది. అనువగు పరిస్థితు లున్నా, బలమైన కిసాన్ సభలను, వ్యవసాయకూలీ సంఘాలను నిర్మించలేకపోవుట ప్రజాస్వామ్య వుద్యమ పెద్ద బలహీనతగా వుంది. ఈ బలహీనతను అధిగమించి విస్తృత రైతు, వ్యవసాయ కూలి, ప్రజాస్వామ్య వుద్యమాలను పార్టీ నిర్మించ జాలనిచో దేశంలో రాజకీయ నిర్ణయాత్మక పాత్రను నిర్వహించుటలో విఫలమగు తుంది.

మొత్తం పార్టీ అవగాహనలో యిది భాగమవ్వాలి. రైతు, వ్యవసాయ కూలీ లలో కార్యనిర్వహణ, కొద్దిమంది ఆయా రంగాలలో పనిచేసే కార్యకర్తల కార్య క్రమంగా నెంచక, మొత్తం పార్టీ విప్లవ కర్తవ్యంగా నెంచాలి. రైతు, వ్యవసాయ కూలీలో పనిని, రైతురంగం, వ్యవసాయకూలి రంగంలోని కార్యక్రమంగా కాక అత్యంత ప్రాముఖ్యతగల పార్టీ ప్రజాకార్యక్రమంగా నెంచాలి.

## సంయుక్త మహారాష్ట్ర, మహాగుజరాత్ వుద్యమాలు :

సంయుక్త మహారాష్ట్ర, మహాగుజరాత్ వుద్యమాలు ప్రజావాంఛగా అసెంబ్లీ, పార్లమెంటు, స్థానిక సంస్థల ఎన్నికలలో నిస్సందేహంగా స్పష్టమైంది. అధికార వర్గం తమ నిర్ణయాలను విస్తృత ప్రజోద్యమ బలమైన వొత్తిడితో తప్ప మార్చు

కొనజాలదని మరోమారు స్పష్టమైంది. ఫలితంగా ప్రజా అసంతృప్తి పెరుగుతున్నది. పార్టీ యీ మహోద్యమాలకు సారధ్యం వహించి సంయుక్త మహారాష్ట్ర సమితి, మహ గుజరాత్ పరిషత్ మధ్యపూర్తి సదవగాహన, సహకారాల ప్రాముఖ్యతను నొక్కి చెప్పింది. రెండు వుద్యమాల సహకార ప్రాతిపదికపై, చొరవతో ప్రజాసమీకరణ వుద్యమాన్ని కొనసాగిస్తుంది. మహారాష్ట్ర, గుజరాత్, పార్టీశాఖలు యీ ఉద్యమంలో ప్రధాన పాత్ర వహించాయి.

## కేరళ మార్గదర్శికత్వం :

కేరళలో కమ్యూనిస్టు నాయకత్వంలో ప్రభుత్వ మేర్పాటు, ప్రజలలో వారి ప్రయోజనాలకు, సేపల నిలబడ గలవారిచే కాంగ్రెసు వోడింపబడగలదని, కష్టజీవుల కోర్కెలను తీర్చగల ప్రభుత్వం యేర్పడగలదని విశ్వాసం కలిగించింది. మంత్రివర్గం చేబట్టి కార్యక్రమాలు దేశమంతటా సదభిప్రాయాన్ని, గొప్ప ప్రభావాన్ని కలుగ జేసి, అందరి సానుభూతిని పొందాయి. కాంగ్రెసులో అభివృద్ధి నిరోధక విధానాలను వ్యతిరేకించే ధైర్యాన్ని కాంగ్రెసువారిలో కలుగజేసింది.

అభివృద్ధి నిరోధకులలో కేరళ భయాన్ని, ద్వేషాన్ని కలుగజేసింది. అశేష ప్రజానీకంలో ఆశాజ్యోతియై వెలుగొందింది.

ప్రజాశక్తులకు ఎన్నికల ఫలితాలు అనుకూలమైనా, స్వార్థపరవర్గాలు తప్పని సరిగా వాటిని గౌరవించకపోవచ్చు. ప్రజాకార్యాచరణతో రక్షించు కొనగలగాలి. కమ్యూనిస్టు పార్టీ రాజ్యాంగ చట్టపరిధిలో ఎన్నికల వాగ్దానాలను నెరవేర్చవలసిన కర్తవ్యం, మహత్తర బాధ్యత వుంది. ప్రణాళికను ప్రజాసమీకరణగావించి, వారి సహకారంతో ఆచరణలో పెట్టుటకు, పరిపాలనను ప్రజలసామీప్యానికి దీసుకొని వచ్చి, లంచగొండితనాన్ని పారద్రోలి అధిక ఆహారోత్పత్తిని, పారిశ్రామికోత్పత్తిని గావించుటతో ప్రభుత్వ రాజ్యాంగ యంత్రం కమ్యూనిస్టు మంత్రివర్గ ఆధ్వర్యంలో పునర్నిర్మాణ కార్యక్రమంలో సమర్థవంతంగా వుపయోగపడగలదని సందేహ నివృత్తి గావించాలి.

కేరళమంత్రివర్గం తన ఆచరణద్వారా దేశప్రజలలో విశ్వాసాన్ని కలుగ జేయాలి. ప్రజలు తమ కోర్కెలు, హక్కులు సాధించుకొనుటకు శాంతియుత పోరాటాలలో యాజమాన్యాల తరపున పోలీసు యంత్రాంగం కలుగజేసుకొనదని చేసిన రాష్ట్రప్రభుత్వ ప్రకటన, విద్యాబిల్లు, ప్రభుత్వ భూముల పంపకాన్ని నిర్దేశించే సూత్రాలను రూపొందించిన వ్యవసాయభూముల సంస్కరణల బిల్లు, వ్యవసాయ కార్మికుల వేతనాల నిర్ణయాలు, ప్రభుత్వ జోక్యంతో అనేక పారిశ్రామిక తగాదాల పరిష్కారం, గ్రామాధికారుల, వుపాధ్యాయుల జీతాలు పెంచుట, మంత్రులు కనీస జీతాలు తీసుకొనుట అన్నీ దేశ ప్రజలలో యెంతో ప్రభావాన్ని కలుగజేశాయి.

కేరళ విజయాలను ప్రజలలో పార్టీ విశేష ప్రచారం కావిస్తుంది, కేరళ పురోగమనం దేశమంతటా ప్రజాస్వామ్య వుద్యమ పురోగతికి ప్రాతిపదిక.

**ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటన :**

వామపక్షాలు, కమ్యూనిస్టు పార్టీ అసెంబ్లీలలో పొందిన విజయాలు, అనేక విధానాలుగ ఐక్యకార్యాచరణోత్సాహ ప్రదర్శన, కాంగ్రెసులోపల ప్రజాస్వామ్య శక్తుల అభివృద్ధి, ప్రజాశక్తుల విజయానికి, ప్రజావుద్యమ పురోగతికి అనేక రంగాలలో విస్తృత అవకాశాలను పెంపొందించాయి.

పరిస్థితి బలమైన ప్రజాసంఘాల పునాదిగా, ప్రచార, పోరాట వుద్యమాల ద్వారా శక్తివంతమైన విస్తృత ఐక్యకార్యాచరణోద్యమాన్ని అభివృద్ధిపరచ వలసిన ఆవశ్యకతను ముందుకు తీసుకొచ్చింది. మితవాద శక్తులను అట్టి వుద్యమం ఒక్కటే ఓడించి, ప్రభుత్వ విధానాలలో వాంఛనీయమైన మార్పులు తీసుకొని రాగలదు. ప్రజాళికా ధ్యేయాన్ని లక్ష్యాలను సాధించి, జాతి బహుముఖ పురోగతిని స్థిరం చేయగలదు.

కమ్యూనిస్టుపార్టీ అట్టి వుద్యమ నిర్మాణానికి అన్ని పార్టీలలోని ప్రజాస్వామ్య శక్తులను ఐక్యపలచుటకు తీవ్ర కృషి చేస్తుంది. ఈ సందర్భంలో వామ పక్షాలు, స్వతంత్ర పురోగామి శక్తుల ఐక్యత ప్రత్యేక ప్రాముఖ్యతను కలిగి వుంది.

కమ్యూనిస్టుపార్టీ, ప్రజాస్వామ్య శక్తులు మొత్తంమీద, ఐక్యమై యీనాటి నుండే ప్రజాకార్యక్రమాలను దీక్షగా చేబట్టితే, కాంగ్రెసు గుత్త పరిపాలనాధికారానికి మరికొన్ని గండ్లు యేర్పడగలవని ఆశించవచ్చు. కేరళలోని ప్రారంభం, మరి కొన్ని రాష్ట్రాలలో ప్రత్యామ్నాయ ప్రజాస్వామిక ప్రభుత్వాలు యేర్పడుటకు పురోగమన మార్గం కాగలదు. ఇట్టి అవకాశాలున్నవి వాటిని వాస్తవాలు చేయగలగాలి.

వామపక్ష ఐక్యతా నిర్మాణం అంత తేలిక పనికాదు. ప్రజాసోషలిస్టు, సోషలిస్టు పార్టీల అగ్రనాయకత్వాలలో అత్యధిక భాగం ప్రజాస్వామ్యంలో అట్టి ఐక్యతను యేర్పడుటను వాంచించక, చీల్చి వుండుటనే కొనసాగిస్తున్నది. వారుతమ కార్యకర్తలను ఐక్యప్రజాకార్యాచరణకు దూరంగా వుంచుతున్నారు. ఆ విధంగా, సమర్థవంతమైన ప్రజాసమీకరణ, ప్రభుత్వ అభివృద్ధి నిరోధక విధానాలకు వ్యతిరేకంగా, ప్రజాజాగృతి పెంపొంది బలపడుటకు మారుగ వామపక్షాల ఐక్యతలేనిచోట, ప్యూడలు, మతశక్తులు బలపడుటకు తోడ్పడుతున్నారు. ఒరిస్సాలో ప్రజాసోషలిస్టు పార్టీ మాజీరాజ్యాల అభివృద్ధి నిరోధక గణతంత్ర పరిషత్‌తో చేతులు కలిపి సహరిస్తున్నది. కేరళలో రోమన్ కేథలిక్ మతోన్మాద వర్గాలు, భూస్వాములతో కలసి ప్రజాసోషలిస్టు పార్టీ నిందా ప్రచారాన్ని చేబట్టి కమ్యూనిస్టు మంత్రివర్గాన్ని పడగొట్టే ప్రయత్నాలు కొనసాగిస్తున్నది. ఈ విచ్ఛిన్నకరకరచర్యలను అనేక వర్గాలు

వ్యతిరేకిస్తున్నవి, చీలికలు యేర్పడుతున్నవి. బెంగాల్, మహారాష్ట్రలలో ప్రజా సోషలిస్టుపార్టీ ఐక్యకార్యాచరణలో పాల్గొనుటతో ప్రజాస్వామికోద్యమం బలపడింది.

వామపక్షపార్టీలతో ఐక్యతర్యాచరణాభివృద్ధికి ప్రయత్నాలను కొనసాగించుతు విచ్ఛిన్నకర పోకడలకు వ్యతిరేకంగా సిద్ధాంతపోరాటాన్ని అట్టి పార్టీలపై కొనసాగించవలసి వుంటుంది. ఐక్యకార్యాచరణవాంఛనీయమేగాక, అనేక ప్రజాపోరాటాలలో వాస్తవ సమస్య అయింది.

వామపక్ష ఐక్యసంఘటన నేడు యెంతటి ప్రాముఖ్యత గలదైనా అట్టి ఐక్యసంఘటనా నిర్మాణానికి పరిమితమైవుండజాలము. అనేక ప్రాంతాలలో అభ్యుదయ స్వతంత్రులు, గతంలో కాంగ్రెసువాదులైన యెందరో ప్రజలలో గణనీయమైన పలుకుబడి, ప్రజాభిమానాన్ని చూరగొన్నవారున్నారు. పార్టీవారిని ఐక్యకార్యాచరణలోనికి, ఎన్నికలకాలంలోనే గాక యితర కార్యక్రమాలలోనికి, ప్రజాసంఘాల కార్యక్రమాలలోనికి ఆకర్షించాలి.

ఐక్యకార్యాచరణకు కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యానికి, పార్టీని అనుసరించే ప్రజాసామాన్యానికి మధ్యకావలసిన ఐక్యప్రాతిపదికవుంది. విదేశాంగ విధానక, పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలసాధన, ప్రణాళికలు, ప్రాజెక్టులలో ప్రజాసామాన్యానికి అత్యంత ప్రయోజనకారియగునట్లు చేయుప్రయత్నాలు ఐక్యకార్యాచరణాంశాలు కాగలవు.

ప్రజలలో అభ్యుదయ భావాల పెరుగుదల కాంగ్రెసుసంస్థలో తీవ్రప్రభావాన్ని కలుగ జేస్తున్నది. ఫ్యూడలు, భూస్వామ్య, యితర స్వార్థ పరవర్గాలు కాంగ్రెసులో చేరుటతో అవాంఛనీయ పరిణామాలు ముఖ్యంగా ప్రభుత్వరంగంలో పరిశ్రమలకు, వ్యవసాయభూముల సంస్కరణలకు వ్యతిరేకత నిజాయితీ కాంగ్రెసువాదులను కలవర పరుస్తున్నది. అసంతృప్తి, ప్రణాళికా లక్ష్యాలపై మితవాద వర్గాలదాడితో రాజకీయ భేదాభిప్రాయాలు అధికమగుతున్నవి. మత, భూస్వామ్య, ఫ్యూడలు వర్గాల పార్టీల పెరుగుదల కలవరపరుస్తున్నది.

కమ్యూనిస్టుపార్టీ ప్రజాస్వామ్య, అభ్యుదయకర పరిణామాలకు స్వాగతమిస్తుంది. వారితో, స్నేహ, సౌభాతృత్వ వైఖరి నవలంబించుతు, దేశ, ప్రజల ప్రయోజనాలకై వారి సహకారాన్ని పొందుటకు ప్రయత్నిస్తుంది.

**జాతీయ కార్యక్రమము :**

కమ్యూనిస్టు పార్టీ అమృతసర్ కాంగ్రెసు, పాల్ఘాటు కాంగ్రెసు కార్యక్రమాన్ని పునరుద్ఘాటించుతు, యీక్రింది తక్షణ ముఖ్య సమస్యలపై జాతీయ వుద్యమాలను చేబట్టాలని ఆశించుతున్నది[1]

---

1. అమృతసర్ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెస్‌కు 1958 తీర్మానాలు (ఇంగ్లీషులో) పి.పి.హెచ్ పబ్లికేషన్. పే. 11-12.

అటంబాంబుల తయారీకి వ్యతిరేకంగా, అమెరికా పెట్టుబడులు చొరబడుటకు వ్యతిరేకంగా, బ్రిటిష్ పెట్టుబడులపై అజమాయిషీ, లాభాలపై పరిమితి, ఎగుమతి నిషేధం ప్రభుత్వం చేపట్టాలని వుద్యమాన్ని సాగించాలి. ఇండోనేషియా, అల్జీరియా స్వాతంత్ర్యపోరాటాలకు మద్దతు, ఆఫ్రో-ఏసియన్ అగ్రనాయక సమావేశం జరపాలని ప్రచారము కావించాలి.

ప్రజాస్వామ్యవిధానాలలో ప్రణాళికా రచన, లక్ష్యాల సాధన, పెద్దబ్యాంకుల, ఆహార పదార్థాలలో టోకు వ్యాపారాన్ని జాతీయంచేయుట, ప్రభుత్వ వ్యాపార విస్తరణ, భారత గుత్త పెట్టుబడులపై అజమాయిషీ, లాభాలపై పరిమితి. జాతీయప్రయోజనాలననుసరించి ప్రభుత్వ కంట్రోలు అభ్యుదయకర వ్యవసాయ సంస్కరణలు, వ్యవసాయ చట్టాలను ప్రజాస్వామిక అమలు, ఆహార సంక్షోభ పరిష్కారానికి ప్రతిపాదనలు ప్రభుత్వం చేబట్టుటకై ఆందోళనోద్యమాలను నిర్మించాలి.

ప్రజాస్వామిక, పౌరహక్కుల విస్తరణ, మితవాద అభివృద్ధి నిరోధకుల పథకాలను బహిరంగ పరచుట, అధిక పన్నులకు, ధరలకు వ్యతిరేకంగా ఆందోళన, లంచగొండితనంపై చర్యలకు ప్రజావుద్యమం, కుల, మత విచక్షణలు, అంటరానితనానికి వ్యతిరేకాందోళన చేబట్టాలి. శరణార్థుల పునరావాసంపై ప్రభుత్వ నత్తనడకకు వ్యతిరేకంగా వుద్యమాలు సాగించాలి.

భాషారాష్ట్రాల సమస్యపై పార్టీ కేంద్ర సమితి అక్టోబరు 1957 తీర్మానప్రాతిపదికపై పరిష్కారానికై ఆందోళన, 27 మార్చి 1958 జాతీయ ట్రేడ్ యూనియనుల సెంటరుల సమావేశం ప్రతిపాదించిన కోర్కెలపై సమిష్టి వొప్పందానికై ప్రచారం చేయాలి.

కేరళ రాష్ట్ర కమ్యూనిస్టు ప్రభుత్వ విజయాలపై విస్తృత ప్రచారం, పార్లమెంటులో కమ్యూనిస్టు పోరాటాల విస్తృత ప్రచారం చేబట్టాలి.

అమృతసర్‌పార్టీ కాంగ్రెస్‌పై సమస్యపై ప్రజావుద్యమాల నిర్మాణానికై పిలుపు నిచ్చింది. ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనా నిర్మాణానికి మార్గమని తెలిపింది.

## సిద్ధాంత పోరాటం

అత్యధిక ప్రజాసామాన్యం బూర్జువా, పెటీ బూర్జువా, ఫ్యూడలు భూస్వామ్య వర్గాల రాజకీయ సిద్ధాంతాల ప్రభావాలకు లోనై వున్నారు. కాంగ్రెసు నాయకత్వం పెట్టుబడిదారి విధానాన్ని రద్దు చేస్తామని, ప్రభుత్వరంగంలో కొన్ని పరిశ్రమలు నిర్మించుట ద్వారా సోషలిజం వైపు పురోగమించుతామని, సంక్షేమ రాజ్యాన్ని నెలకొల్పుతామని ప్రచారం ముమ్మరంగా చేస్తున్నది. అంతేగాక మార్క్సిజం నమూనా

నేడు చెల్లదని, వర్గపోరాటం భారతసాంప్రదాయ విరుద్ధమనే ప్రచారాన్ని కాంగ్రెసు ప్రభుత్వం ప్రచారం జోరుగా సాగుతున్నది.

బూర్జువా వర్గపు యీ సిద్ధాంతదాడిని త్రిప్పికొట్టి, ప్రపంచశాంతి, యుద్ధ వ్యతిరేక, ఆటంబాంబుల వ్యతిరేక, స్వాతంత్ర్యం, సోషలిజపు పోరాటాలలో ప్రజలను సమీకరించాలని పార్టీ కాంగ్రెసు పిలుపునిచ్చింది.

ఈ కర్తవ్య నిర్వహణకు, జాతి పురోగతికి కమ్యూనిస్టు పార్టీ జాతీయ రాజకీయ శక్తిగా, ప్రజాపార్టీగ పెంపొందాలన్నది.

అందుకుగానుపార్టీ నిర్మాణసూత్రాలలో అనేక ముఖ్యమైన మార్పులను పార్టీ కాంగ్రెసు ఆమోదిందించింది.

**అమృత్ సర్ అవగాహనపై అజయ్ వివరణ :**

అమృత్ సర్ కాంగ్రెసు ఏప్రియల్‌లో జరిగింది. అజయ్‌ఘోష్ మే 18, 1958 న న్యూయేజ్‌లో రాజకీయ అవగాహనపై కొన్ని వివరణలు యిచ్చారు.

1) "నేటి చారిత్రిక పరిస్థితులలో అనేక దేశాలలో, అంతర్యుద్ధ పరిస్థితులలో దేశాన్ని ముంచెత్తదలచిన పాలక వర్గాల ప్రయత్నాలను వమ్ముచేసి శాంతియుత మార్గాలలో సోషలిజాన్ని నెలకొల్పే అవకాశాలు వాస్తవంగా వున్నవని మేము అనుకొంటున్నాము. సోషలిజం ధ్యేయంగా కల పార్టీలు, వర్గాలు, పార్లమెంటులలో మెజారిటి సంపాదించి "అభివృద్ధినిరోధక వర్గాల ప్రతిఘటనను ప్రజా కార్యాచరణతో అధిగమించే అవకాశాలున్నవి. "మేము మన దేశంలో యీ అవకాశాలను వాస్తవం చేయుటకు మా శక్తినంతా వినియోగిస్తాము."

"మరో మాటలో శాంతిమార్గాలు మా ఆశ, ఎత్తుగడ కాదు. మా అవగాహన రాజకీయ విధానం[1]."

2) నూతన రాజకీయ పరిస్థితులలోని ముఖ్యాంశాలను అజయ్ వివరించి "అతివేగంగా అభివృద్ధిచెందుతున్న సంక్లిష్ట పరిస్థితిలో పార్టీ ప్రజాస్వామ్య శక్తుల అగ్రగామి దళంగా, ఐక్యతా నిర్మాణ శక్తిగా ఆచరణ యేవిధంగా వుండాలని ప్రశ్న వేసుకొని, "తానే" పార్టీ, దేశంముందు తక్షణ కర్తవ్యం, ప్రణాళికా ధ్యేయాల్ని, లక్ష్యాలను సాధించుటకై దృఢతర పోరాటాన్ని సాగించుట"[2] సమాధానంగా చెప్పారు.

అంతేగాక రైతాంగం వ్యవసాయ సంస్కరణలకై పోరాటాన్ని కొనసాగిస్తూనే, అధికాహారోత్పత్తికి నేడు సాధ్యమైనదంతా చేస్తుందని" కార్మికవర్గం "తన ప్రయోజనాలకై తక్షణ కోర్కెలపై పోరాటాన్ని కొనసాగిస్తూనే, జాతీయకరణ

1. అజయ్‌కుమార్ ఘోష్ (1958) వ్యాసాలు, ఉపన్యాసాలు (ఆంగ్లంలో) మాస్కో ప్రచురణ, 1962. పే. 92.

2. .........అదే......... అదే.........పే. 102.

చేయాలంటూనే, వుత్పత్తి సామర్థ్యాన్ని పెంపొందిస్తూ, జాతీయ ఆర్థిక ప్రయోజనా లకై పోరాడుతుందని[1]" వివరించారు. ప్రజలు, ప్రజోద్యమాలు చొరవతో కలుగ జేసుకొన్ననాడే ప్రణాళికా లక్ష్యాలు నెరవేరుతవన్నారు.

3) కాని మనం ప్రణాళికా అమలుకై పోరాటమన్నపుడు తప్పనిసరిగా ద్విముఖ పోరాటాన్ని: ఒకవైపు ప్రణాళికను వ్యతిరేకించుతూ ఆచరణలో విద్రోహం చేసేవారికి వ్యతిరేకంగా; మరోవైపు తమ విధానాల ద్వారా ప్రణాళికను సంక్షోభంలో పడద్రోస్తూ, విద్రోహానికి తోడ్పడుతున్నవారికి వ్యతిరేకంగా జరుపవలసి వుంటుంది. ఇట్టి ద్విముఖ పోరాటం వలననే పార్టీ, దేశభక్త, ప్రజాస్వామ్య శక్తులను దేశంలో నేడు ఐక్యం చేయగలుగుతుంది."

4) "శక్తివంతమైన ఐక్య ప్రజోద్యమాభివృద్ధికి నేడు అనుకూలంగా పరి స్థితులు మారుతున్నవి· ప్రజలలో కోర్కెలు తీర్చగల అవకాశాలు మెరుగు అగు చున్నవి. రెండవ సాధారణ ఎన్నికపైన రెండు మాసాలలోనే పోస్టల్ - టెలిగ్రాఫ్ కార్మికులు జనరల్ సమ్మెకు విస్తృత ప్రజాదరణ, మద్దతు లభించుటతో ప్రభుత్వం వారి కోర్కెలను ఆమోదించక తప్పలేదు.

"పార్టీ అన్ని ప్రజాస్వామ్య శక్తులను, కాంగ్రెసులోని వారితో సహా అంద రినీ ఐక్యపరచుటకు అవకాశాలు మెరుగయ్యాయి. వామపక్ష శక్తుల, పార్టీల, అభ్యు దయ శక్తుల ఐక్యతా నిర్మాణం, విస్తృత ప్రజాస్వామ్య ఐక్య సంఘటనా నిర్మా ణానికి ప్రధాన ఆయుధ మగుతుంది పార్టీ అట్టి ఐక్యతను నిర్మించుటకు తన ప్రయ త్నాలను ముమ్మరం చేస్తుంది[2]".

5) ఈ సందర్భంలో జాతి పురోగమనం మన పార్టీముందు మూడు ముఖ్య కర్తవ్యాలను నిర్వహించితేనే సాధ్యమౌతుంది; అవి, 1) విస్తృత ప్రజాస్వామ్య ఐక్యతా నిర్మాణం 2) విస్తృత ప్రజా కార్యాచరణ ముఖ్యంగా కార్మిక, కర్షక, ప్రజా సంఘాల నిర్మాణం 3) అన్నింటికి మూలమైన ప్రజా కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం, దాని అభివృద్ధి[3]" అత్యంత ప్రాముఖ్యమైనవని అజయ్ వివరించారు.

అమృతసర్ పార్టీ కాంగ్రెసు పార్టీ నిర్మాణానికి నూతన సూత్రాలను ఆమో దించింది. అతిముఖ్యమైనది పార్టీ ధ్యేయం, లక్ష్యాలకు సంబంధించిన ప్రారంభ పేరాలో కార్యక్రమానికి సంబంధించిన తక్షణ, దీర్ఘకాల ఉద్దేశాలను గూర్చి "పార్టీ

---

1. అజయ్‌కుమార్ ఘోష్ (1958) వ్యాసాలు, ఉపన్యాసాలు (ఆంగ్లంలో) మాస్కో 1962. ప్రచురణ పే. 107
2. ........అదే ........అదే........పే. 103.
3. ........అదే..... ...అదే........పే. 108.

పూర్తి ప్రజాస్వామ్యాన్ని, సోషలిజాన్ని శాంతియుత పద్ధతులలో సాధించుటకు అన్ని విధాల ప్రయత్నిస్తున్నదని" ప్రకటించింది. అంతేగాక యిది పార్టీ తక్షణ ఎత్తుగడ, వ్యూహం కాదని, పార్టీ రాజకీయ సిద్ధాంత విధానమని స్పష్టం చేయబడింది.

ఇది తదనంతర కాలాలలో అత్యంత ప్రాముఖ్యత కల భారత కమ్యూనిస్టు వుద్యమంలో కీలక, చర్చనీయాంశమైందని ప్రస్తుతానికి గుర్తుపెట్టుకొందాము.

# VI

## సమీక్ష కొన్ని ముఖ్యాంశాలు

1. కమ్యూనిస్టు పార్టీ సంధా, ఐక్య సంఘటనా అన్వేషణలో 26 మాసాలలో 3వ, 4వ, 5వ పార్టీ కాంగ్రెసులు తీవ్ర అంతర్గత సిద్ధాంత పోరాటాల మధ్య జరిగాయి. కాని నిర్వివాద నిర్ధారణలకు రాజాలకపోయారు. అంతర్జాతీయ పరిణామాలు, అనుభవాలపై కేంద్రీకరించి, దేశ సామాజిక పరిణామాలపై శాస్త్రీయ అధ్యయనం, పరిశీలన కొరవడిన కారణంగా తోచుచున్నది.

ఆసియా, ఆఫ్రికాలలో వలస వ్యవస్థ శిథిలమై అనేక స్వతంత్ర దేశాలు ఆవిర్భావంతో, సోషలిస్టు వ్యవస్థ స్థిరపడి, ప్రపంచ శక్తుల బలాబలాలలో సోషలిస్టు, ప్రజాస్వామ్య, స్వతంత్రదేశాల కనుగుణంగా పరిస్థితి మారిపోయింది. ప్రపంచ సామ్రాజ్యవాదం నిర్ణయాత్మక పాత్రను, చొరవను, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థకు అనుకూలంగా కోల్పోయింది.

సామ్రాజ్యవాదం 'నాటో', 'బాగ్దాద్', 'సీటో' సైనిక కూటములతో సోషలిస్టు శక్తుల పురోగమనాన్ని అడ్డుకొన ప్రయత్నించింది. సోషలిస్టు వ్యవస్థ వార్సా ఒప్పందాలతో రక్షణ వ్యవస్థను సుస్థిరం చేసుకొనుటతో ప్రపంచం రెండు ప్రత్యర్థి శిబిరాలుగా చీలిపోయింది.

భారత్-చైనాల మైత్రితో మొలకెత్తిన 'పంచశీల', ఆసియా, ఆఫ్రికా దేశాల బాండుంగ్ సమావేశంలో రూపురేఖలు దిద్దుకొని 'పంచశీల సూత్రాలు'గా ప్రపంచ సోషలిస్టు దేశాల పంచశీల ఒడంబడికలతో ప్రపంచ ప్రజల ఆమోదం పొందాయి. ప్రపంచ శాంతి, యుద్ధవ్యతిరేక శక్తులు ఆధిక్యత పొందాయి.

ప్రపంచం రెండు శిబిరాల అవగాహన పోలెండు, హంగరీ, జెకోస్లోవేకియాలలోని అంతర్గత సంఘర్షణలకు ఆర్థిక, రాజకీయ, సామాజిక ప్రాతిపదికను శాస్త్రీయంగా అధ్యయనం చేయని దృష్టిమాంద్యాన్ని కలుగజేసింది.

సోవియట్ 20వ, కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు, అణు ఆయుధాల యుగంలో యుద్ధంతో ప్రపంచం సర్వనాశనమౌతుందని, యుద్ధం అనివార్యం కాదని, ప్రపంచ శక్తుల బలాబలాలలో శాంతి, స్వాతంత్ర్యం, సోషలిజం, ప్రజాస్వామ్య శక్తుల బలాధి

శ్యత ప్రపంచ పెట్టుబడిదారీ విధానంపై పొందినందున, యుద్ధాన్ని నివారించగలిగిన-శక్తిని కలిగి వున్నది. మారిన పరిస్థితులలో కొన్ని దేశాలలో పెట్టుబడిదారీ సమాజం, సోషలిస్టు సమాజంలోనికి శాంతిమార్గంలో పరివర్తన సాధ్యమని నూతన సిద్ధాంతాన్ని రూపొందించింది. పెట్టుబడిదారి విధానం, సోషలిజంల మధ్య యుద్ధం కాక, శాంతి, సహజీవన, ప్రజల జీవనాభివృద్ధి రంగాలలోనే యిక పోటీయని వివరించింది. యూరోపియన్ కమ్యూనిస్టు పార్టీల సమావేశం 1957లో యీ అవగాహననే పునరుద్ఘాటించింది. అందుకు పార్లమెంటరీ విధానం వొక ఆయుధం కావచ్చుని చెప్పింది.

2) గోవా విముక్తికై అన్ని రాజకీయ పార్టీలు కాంగ్రెసుతో కలసి "అఖిలపక్ష గోవా విముక్తి సహాయ సమితి"ని యేర్పాటు చేశాయి. ఈ సమితిలో పేర్కొనతగిన పాత్రను కమ్యూనిస్టు పార్టీ వహించింది. ఆగస్టు 15, 1955న సరిహద్దును బరోదావద్ద కమ్యూనిస్టు చిటాపె నాయకత్వంలో 600మంది సత్యాగ్రహులు దాట ప్రయత్నించారు పోర్చుగీసుముష్కరులు కాల్పులు జరుపగా 21మంది చనిపోయారు. మరుసటిరోజున అన్నినగరాలు, బస్తీలు బందు జరిపారు. ఐక్యపక్షసమితి పోరాటాన్ని మరోరూపంలో కొనసాగించింది.

ప్రథమ ఎన్నికలలోనేవిశాలాంధ్ర, ఐక్య కేరళలను భాషాప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై యేర్పరచాలనే ప్రతి పక్షాల వినాదం, కాంగ్రెసు వోటమికి, కమ్యూనిస్టు పార్టి బలమైన ప్రతిపక్షంగా వుద్భవించుటకు కారణమైంది. ఫలితంగానే 1954లో రాష్ట్రాల పునర్నిర్మాణ కమిషన్‌ను యేర్పాటు చేసింది. 1954లో విశాలాంధ్ర, ఐక్యకేరళ, సంయుక్త మహారాష్ట్ర, విశాల కర్నాటక రాష్ట్రాలు ఏర్పడినవి.

3) కృశ్చేవ్ 1956 భారత పర్యటన చారిత్రాత్మకమైనది, ఫలితంగా "సోవియట్-భారత స్నేహ సంబంధాలు మరింత బలపడినవని" అజయ్‌ఘోష్ పేర్కొన్నారు. సంయుక్త ప్రకటనలో నెహ్రూ, కృశ్చేవ్, బల్గానిన్‌లు "అంతర్జాతీయ సంబంధాలు పంచశీల సూత్రాలు పునాదిగా నిర్మించబడాలని" స్పష్టం చేసారు. భారత ప్రజల హృదయాలలో భారత్-సోవియట్ మిత్రత్వం, పంచశీల సూత్రాలు చెరగని ముద్రవేసాయి.

4) కార్మిక, కర్షక పోరాటాలను పోలీసు, సైనిక ఇనుప పాదాల క్రింద అణచివేయుట, డిటెన్షన్, చట్ట వినియోగం సర్వసాధారణమై, పౌరహక్కులు మృగ్యమయ్యాయి. ప్రజాసంఘాల దైనందిన కార్యాచరణఅసాధ్యమైంది. ప్రభుత్వాధికారాన్ని, రాజ్యాంగ యంత్రాంగాన్ని, ప్రజాధనాల దుర్వినియోగం దినచర్య అయింది.

5) భారత ఆర్థిక వ్యవస్థలో నిర్ణయాత్మక పాత్ర యింకా బ్రిటన్‌దై వున్నది, లాభాల ఎగుమతి సాగుతూనే వుంది. హరప్పానాటి కొయ్యనాగలి వ్యవసాయమే కొనసాగుతున్నది. భారతదేశం ఆర్థిక ఆధారితంగానే వుంది. గ్రామీణ,

నగర నిరుద్యోగం, రిట్రెంచ్‌మెంటు సాగుతూనే వుంది. అధిక ఆహారోత్పత్తి ధరల తగ్గుదలకు తోడ్పడలేదు, మార్కెట్టు యంత్రాంగంతో ధరల తంత్రాంగంతో రైతుల దోపిడికి అంతంలేదు. నిత్యావసరాల వస్తువుల ధరలు ఆకాశాన్నంటాయి

6) కాంగ్రెసు 1952-54లలో ఆంధ్ర, తెలంగాణా, ట్రావెన్కూర్-కొచ్చిన్ లలో పొందిన ఎన్నికల అపజయాల ఫలితంగానే ఆవడి అఖిల భారతజాతీయ కాంగ్రెసుతో, భారతదేశం సోషలిస్టిక్ నమూనా అనుసరించుతుందని తీర్మానం చేసింది. భారతీయ సోషలిస్టిక్ నమూనా సమాజాన్ని నిర్మించుతామని కాంగ్రెసు ప్రజలలో భ్రమలు కలుగజేస్తున్నది. కమ్యూనిస్టు పార్టీ ప్రజలలో యీ భ్రమలను తొలగించుటలో విఫలమగుటయేగాక, పార్టీలోనే యీ భ్రమలు పేరూనినదనుట సత్యదూరంకాదు.

7) పాల్ఘాట్ కాంగ్రెసులో మూడు రాజకీయ దృక్పధాలు వెల్లడైనాయి. మితవాద, అతివాద, మధ్యేమార్గ దృక్పధాలు మూడు సంఘర్షించాయి. మెజారిటి ఆమోదం పొందిన రాజకీయ దృక్పధం సంక్షిప్తంగా యిలా వుంది

అ) అక్టోబరు విప్లవంతో సామ్రాజ్యవాదంలో యేర్పడిన గండి, ఫాశిస్టు వోటమితో పెద్దదై, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా వలసల జాతీయవిముక్తి పోరాటాల విజయంతో ప్రపంచసామ్రాజ్యవాదం ఆధిక్యతను కోల్పోయి, సోవియట్ సోషలిస్టు, నూతన స్వాతంత్ర్య దేశాల ప్రపంచ సోషలిస్టు వ్యవస్థకనుగుణంగా పరిస్థితులలో గుణాత్మకమైన మార్పువచ్చింది.

ప్రపంచయుద్ధం అణుయుద్ధమై ప్రపంచ సర్వనాశనానికి దారితీస్తుంది. ప్రపంచ శాంతిశక్తులు నేడు యుద్ధాన్ని నివారించగల శక్తిని కలిగి వున్నది. కాన యుద్ధం అనివార్యంకాదు. శాంతి, సహజీవనాది పంచశీల సూత్రాలే మార్గదర్శికాలు.

సామ్రాజ్యవాదం అమెరికన్ నాయకత్వంలో నాటోబాగ్దాద్, సీటోసైనికకూటముల నేర్పరచి, సోషలిస్టు నూతన స్వాతంత్ర్య దేశాల పురోగమనానికి అడ్డుగోడగా వుండి, అటం యుద్ధమని ప్రపంచాన్ని బెదిరించుచున్నది. ప్రతిగా వార్సా రక్షణ కూటమిగా సోషలిస్టు రాజ్యాలు యేర్పడటంతో ప్రపంచం రెండుప్రత్యర్థి శిబిరాలుగా చీలింది.

భారత ప్రభుత్వ శాంతి, సహజీవన, పంచశీల సూత్రాల విదేశాంగ విధానాన్ని, ఆహ్వానించి కమ్యూనిస్టుపార్టీ బలపరుస్తుంది.

ఆ) ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఆవిర్భావంతో నూతన స్వాతంత్ర్య దేశాలు పారిశ్రామిక వెనుకబాటుతనాన్ని, ఆర్థిక ఆధారతను అధిగమించుటకు సామ్రాజ్యవాద దేశాలపై ఆధారపడవలసిన అవసరం అంతమై, సోషలిస్టు మార్కెట్టు, పారిశ్రామిక సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోనికి వచ్చుటతో నూతనావకాశాలు యేర్పడినాయి.

ప్రభుత్వ ప్రథమ ప్రణాళిక లక్ష్యాలైన భారీ పరిశ్రమల స్థాపన, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పటిష్ఠతరం చేయుటకై, విదేశీపెట్టుబడులపై ఆధారపడినందున, గుత్త పెట్టుబడిదారులను, భూస్వాములు, భూస్వామి వర్గాలను ముట్టుకొననందున లక్ష్యాలను చేరలేకపోయింది. ఈ చేదు అనుభవాల ఫలితంగానే ప్రభుత్వం సోషలిస్టు దేశాలవైపు మళ్ళింది.

ఇ) పారిశ్రామిక, వ్యవసాయ వుత్పత్తులు పెరిగి, విదేశీ వ్యాపారంలోలోటు మెరుగు అగుటతో భారత బూర్జువా వర్గం కొంత బలపడింది. ఇంపీరియల్, స్టేటు బ్యాంకులను, జీవిత భీమాను జాతీయం చేయుటతో చిన్న మధ్యతరగతి పరిశ్రమల, వినిమయ వస్తోత్పత్తి పెరుగుటతో బూర్జువా వర్గం మరికొంత బలపడింది. నెహ్రూ బల్గానిన్ ప్రకటన, ఉక్కు ఫ్యాక్టరీ వొప్పందం, సోవియట్, సోషలిస్టుదేశాలతో పారిశ్రామిక, వ్యాపార ఒప్పందాలతో భారియంత్ర, సాంకేతిక పారిశ్రామికాభివృద్ధికి భూమిక యేర్పడింది. రెండవ ప్రణాళికలో "మౌలిక భారీయంత్ర నిర్మాణ పరిశ్రమల ప్రాధాన్యత, వేగంగా పారిశ్రామికీకరణ, ప్రధాన ధ్యేయంగా" ప్రకటించబడింది.

వ్యవసాయ సంస్కరణలు, భూకమతాల గరిష్ఠ పరిమితి నిర్ణయం అమలు జరిగితే, వినిమయ మార్కెట్టు పెరిగి, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుతుంది. నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రణాళికలు, జాతీయ విస్తరణ సమూహాభివృద్ధి పథకాలు అమలుకై రైతాంగంలో విస్తృత పోరాట ఐక్యతను నిర్మించి, యీ విధానాలను పార్టీ బలపరుస్తుందని తీర్మానం స్పష్టంచేసింది.

ఈ) బూర్జువావర్గం ఆర్థిక విధానంపై సామ్రాజ్యవాదానికి గల ఆధిక్యతకు వ్యతిరేకంగా పోరాడుతు, మరోవైపు బ్రిటీష్ పెట్టుబడులతో గల సంబంధాలను కొనసాగిస్తూ, విదేశ పెట్టుబడులకు రాయితీల విస్తున్నది. ఫ్యూడలిజాన్ని బలహీన పరచుటకు వ్యవసాయ సంస్కరణలు చేస్తూ, మరోవైపు రాయితీలనిస్తూ, ప్రజాస్వామ్య శక్తులను వ్యతిరేకంగా వారితో సంబంధాలను పెంచుకొంటున్నది. పారిశ్రామికీకరణకు ప్రయత్నిస్తూ, ఆ భారాన్ని ప్రజలపై మోపుతున్నది. ప్రభుత్వరంగ పారిశ్రామికీకరణ విస్తరణచేస్తూ, మరోవైపు గుత్తపెట్టుబడి వర్గాలకు రాయితీలనిచ్చి బలపడుటకు తోడ్పడుతుంది. ఫలితంగా అభివృద్ధి కార్యక్రమాలన్నీ 'నత్తనడక'ను అనుసరిస్తున్నాయి.

కమ్యూనిస్టుపార్టీ ప్రభుత్వం సామ్రాజ్యవాదాన్ని, గుత్తపెట్టుబడిదారి వర్గాన్ని భూస్వామ్య శక్తులను బలహీనపరచే అన్ని చర్యలను బలపరస్తుంది. అదే కాలంలో ప్రభుత్వ ప్రజావ్యతిరేక చర్యలను వ్యతిరేకిస్తుంది. ప్రజావుద్యమం బలపడే మార్గమిది.

ఉ) జనతా ప్రజాస్వామ్యం మౌలికధ్యేయం. దానికై తక్షణ కోర్కెలు, అభ్యుదయకర విధానాలకు విస్తృత పోరాట ప్రజాఐక్యతను నిర్మించుట అవసరం.

వ్యవసాయ సంస్కరణలు, విదేశీపెట్టుబడి జాతీయం చేయాలనే నినాదాలు జనతా ప్రజాస్వామ్యవకాశాలు, పార్టి నిరంతరం ప్రచారం చేస్తుంది. భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించుట, భారతరాజ్యాంగానికి బూర్జువా నాయకత్వం వహించుట, భారత విప్లవ మౌలికధ్యేయాన్ని, ప్రధానవ్యూహాన్ని మార్చదు. జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వమే ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను సంపూర్తిచేసి, సోషలిస్టు మార్గంలో పురోగమించునట్లు చేస్తుంది. అందుకై యీ ప్రచారాన్ని పార్టీ కొనసాగిస్తుంది.

ఊ) ప్రజాస్వామ్య పక్షాలలో, ప్రజలలోని అనైక్యతను అధిగమించుటకు విస్తృత ఐక్య సంఘటనా నిర్మాణం ప్రధాన వ్యూహ కర్తవ్యంగా పార్టి కాంగ్రెసు నిర్ణయించింది.

దేశంలో ప్రజాస్వామ్య శక్తులు చీలిపోయి వున్నవి. కాంగ్రెసును అనుసరించేవి ప్రజాస్వామ్య ప్రతిపక్షాలను అనుసరించేవిగా ప్రధానంగా రెండుగా చీలిపోయి వున్నవి. ప్రజాస్వామ్య పక్షాలలోనేగాక అతివాద వామపక్షాలలోనే చీలికలువున్న కారణంగా వారిననుసరించే ప్రజాస్వామ్య శక్తులు చీలిపోయి వున్నవి. వామపక్ష కమ్యూనిస్టుపార్టి ప్రజాసోషలిస్టుపార్టి, సోషలిస్టు పార్టీలను అనుసరించే ప్రజాసామాన్యం చీలిపోయి వుంది

కాంగ్రెసు అనేక ప్రజాస్వామ్య శక్తులతోపాటు, సాంప్రదాయకసామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులను కలిగి వుంది. కమ్యూనిస్టుల ఐక్యసంఘటనా వైఖరి వాస్తవాన్ని పరిగణలోనికి తీసుకొనాలి. ప్రజావ్యతిరేక విధానాలను కాంగ్రెసు విడనాడలేదు. కాంగ్రెసుతో సామాన్య ఐక్యసంఘటనా ప్రశ్నలేదు, దీనర్థం ఐక్యసంఘటన కాంగ్రెసు వ్యతిరేక సంఘటన కాదు. సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలను నిర్వహించవలసిన సంఘటన, కాన కాంగ్రెసులో వీటినితిరస్కరించేవారి మద్దతుదారులకు వ్యతిరేకపోరాటం అందులోనే యిమిడి వుంది.

వామ పక్షాల ఐక్యత పునాదిగా ఐక్యసంఘటన యేర్పడాలి. కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు, ప్రజాసోషలిస్టు పార్టీలతో ఐక్యకార్యాచరణ, తద్వారా ఐక్యసంఘటనా నిర్మాణప్రయత్నాలను చేస్తుంది. దీనిలో ఆయాపార్టీల ప్రజాసంఘాల ఐక్యకార్యాచరణ ప్రత్యేకప్రాముఖ్యత వహించుతుంది. ఈ విధంగా యేర్పడిన ఐక్యసంఘటన కాంగ్రెసులోని ప్రజాస్వామ్య, సోషలిస్టు నమూనా అభ్యుదయ వాదులను యిముడ్చుకొనగలగాలి.

తక్షణ సమస్యలపై ప్రజాపోరాటాలు, ఐక్యకార్యాచరణ ద్వారా మాత్రమే ఐక్యసంఘటనా నిర్మాణంసాధ్యమౌతుంది. ప్రజాస్వామ్య వుద్యమ బలహీనత ప్రజా సంఘాలలోని అనైక్యత ముఖ్యంగా కార్మికవర్గ అనైక్యతను ప్రజా పోరాటాల ద్వారా అధిగమించనిదే ఐక్యసంఘటన రూపొందదు. కాన ట్రేడు యూనియన్లు

ఐక్యకార్యాణ పెంపొందనిదే, కార్మికవర్గ ఐక్యత, ఐక్యసంఘటనా నిర్మాణాలు తీర్మా నాలలో భద్రంగా మాత్రమే వుంటవి, ఆచరణ శూన్యత ప్రస్ఫుటంగా కానవస్తుంది.

ఎ) పాల్ఘాట్ కాంగ్రెసు పైఅంశాలతోపాటు, సోవియట్ 20 వ, పార్టీ నివే. దిక, తీర్మానాలు, పత్రాలు అధ్యయనం చేయమని అన్నిశాఖలను కోరుతూ, భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికగా అన్ని వ్యూతలు సంస్థానాలను రద్దుచేసి విశాల భాషా రాష్ట్రాలను యేర్పాటు చేయాలని తీర్మానించింది.

8) ఈకాలంలోనే కొన్ని సిద్ధాంత సమస్యలు పైకి వచ్చాయి.

i) రూబెన్‌స్టేన్ సోవియట్ రచయిత నెహ్రూ భారతదేశంలో ప్రవచించు తున్న 'సోషలిస్టిక్ నమూనా', సోషలిస్టు దేశాల సహాయంతో భారీపరిశ్రమల నిర్మాణం, ప్రభుత్వరంగంలో పారిశ్రామిక నిర్మాణానికి ప్రాధాన్యతనిచ్చుట, పెట్టు బడిదారేతర మార్గంలో సోషలిజానికి పురోగమించే నూతన అవకాశాలను కలుగ జేస్తుందని, యిది ఆసియా, ఆఫ్రికాలలో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశా లకు అనుసరణీయమనే నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అజయ్‌ఘోష్, ప్రభు త్వరంగంలో భారిపరిశ్రమల విధానాన్ని, శాంతిపంథాను బలపరచుతు, దానిని పెట్టు బడేతర మార్గంలో సోషలిజంలోనికి పరివర్తన మార్గంగా వాఖ్యానించుటను తీవ్రంగా విమర్శించి వ్యతిరేకించారు.

ii) జయప్రకాశ్‌నారాయణ్, కమ్యూనిస్టు అగ్రనాయక మిత్రులనుద్దేశించి బహిరంగలేఖలో సోవియట్‌పార్టీ 20వ కాంగ్రెసు లేవనెత్తిన సిద్ధాంత సమస్యలను పునరుద్ఘాటించి, ఆ దృష్టిలో భారత కమ్యూనిస్టులు, వ్యక్తి పూజావిధానం, కార్మిక వర్గనియంతృత్వం, హింసాత్మక విప్లవం, అహింసాత్మక విప్లవం, నేటి పరిస్థితు లలో సమాజం శాంతి మార్గంలో సోషలిజంలోనికి పరివర్తనాది సమస్యలను పునరా లోచించమని కోరుతు అజయ్ ఘోష్‌కు రాజకీయ లేఖను వ్రాసారు. అజయ్‌ఘోష్, మనదేశ ప్రత్యేకతలు, సాంప్రదాయాలు పరిగణించి, అందరికి ఆమోద యోగ్య మైన మార్క్సిస్టు, లెనినిస్టు మౌలికసూత్రాలను అన్వయించాలని, ప్రతిదేశంలో వొకే నమూనాలోగాక వేరువేరు రూపాలలో సోషలిజపు పరివర్తన ఆచరణలో బహి ర్గతం కావచ్చని, హింస, అంతర్యుద్ధం తప్పనిసరికాదని, పార్టీ అనేక ప్రకటనలలో స్పష్టం చేసిందన్నారు. మనం పరస్పరం, అవగాహన చేసుకొని శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజంల ఆమోద అంశాలపై వొప్పందాలకు రాగలిగితే, భేదాభిప్రాయాలున్నా, ప్రజాస్వామ్య, సోషలిస్టు, ప్రజా వుద్యమాలు ఎంతో పురోగమిస్తాయని, సాధ్యమైన చోట్ల ఐక్యకార్యాచరణ అనుసరించగలమని ఆశిస్తున్నామని వ్రాసారు.

నాయకుల లేఖలు బహిరంగలేఖల రూపాన్ని పొందిన కారణంగా కాబోలు

యిద్దరూ అనుకొన్న ఆశయాలు, లక్ష్యాలకు అవకాశాలను పెంపొందించుటకు మారుగ, అయా వర్గాల ప్రచారసాధనాలుగ మారిపోయాయి.

iii. భారత కమ్యూనిస్టు పార్టీ పాల్ఘాట్ తీర్మానంలో 'వ్యక్తిపూజ వంది. మాగధ' విధానాన్ని ఖండించి, విమర్శించి, పార్టీ విధానాన్ని వివరించింది. సహజంగా సంభవించే తప్పులను, ఎప్పటికప్పుడు గుర్తించి సరిచేసుకొనుటను, వ్యక్తి పూజా వందిమాగధ విధానం ప్రతిఘటించుతుంది. పైగా అంతర్గత ప్రజాస్వామ్యం, సమిష్టి పనివిధానం అడుగంటి, సాధారణ సమావేశాలు జరుగవు, వాస్తవికతా దృక్ప థంతో సమీక్షించుకొనలేదు, పాఠాలు నేర్చుకొనలేదు. ఇది పార్టీకి, వుద్యమానికి తీవ్ర నష్టాన్ని కలిగించాయి.

8) కమ్యూనిస్టు పార్టీ పార్లమెంటరీ పోరాటాలలో రెండవ సాధారణ ఎన్నికలలో సాధించిన విజయాలకు చారిత్రక, సైద్ధాంతిక ప్రాముఖ్యత వుంది. పార్టీ ప్రధమ ఎన్నికలలో ఐక్యసంఘటనా యేర్పాటులలో పాక్షిక విజయాన్నే సాధించినా, అట్టి ప్రయత్నం కేరళ, ఆంధ్ర ఎన్నికలలో పూర్తి వైఫల్యం పొందిన ఫలితంగా ఆంధ్ర మధ్యంతర ఎన్నికలలో ఘోర అపజయాన్ని చవిచూసింది, కాని కేరళ ఎన్నికలలో మెజారిటీ పార్టీగా ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసింది. పార్టీ ఈ రెండు ఎన్నికలలో ఎట్టి ఐక్యసంఘటనా లేకుండా, ఏకాకిగా స్వతంత్రతతో కొద్దిమందితో మాత్రం కలసి పోటీచేయవలసి వచ్చింది. ఫలితాలు పూర్తిగా భిన్నమైనవి. స్థానిక, రాష్ట్రీ పరిస్థితుల ప్రాముఖ్యత ప్రభావమే కారణము. అఖిల భారత పార్టీల విధానాల ప్రాముఖ్యత పని చేయనట్లు కన్పించుతున్నది. రెండవ కారణంగా, ఎన్నికల విధాన క్రమంలో కమ్యూనిస్టు పార్టీ అవలంబించిన విధానం, పద్ధతి అత్యంత ప్రాముఖ్యత వహించింది. కేరళలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా, ప్రతిపక్షాలు యేదో వొక రకమైన ఎన్నికల వొప్పందాలతో కలసి పోరాడుటకై కమ్యూనిస్టు పార్టీ చేసిన భగీరధ ప్రయత్నం, వోటరులలో అత్యంత సుముఖ ప్రజాభిప్రాయాన్ని రూపొందించింది, విజయానికి తోడ్పడింది. అందుకు విరుద్ధంగా, ఆంధ్రలో పార్టీ అనుసరించిన విధానం, కమ్యూనిస్టేతరులు చీలిపోకుండా, కమ్యూనిస్టు వ్యతిరేక సంఘటనగా (?) సమీకరింపబడుటకు తోడ్పడింది. కమ్యూనిస్టులను ఏకాకులను చేసింది. కమ్యూనిస్టు ఫ్రంటు ప్రభుత్వాన్ని యేర్పాటు చేయబోతున్నామనే అత్యోక్తి ప్రచారం అలీన వోటరు వర్గాలలో భయోత్పాతాన్ని గొలిపింది. బూర్జువా ప్రచారానికి తోడ్పడి కమ్యూనిస్టులు ఏకాకులగునట్లు చేసింది. ఫలితం ఘోర వోటమి.

కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం, కాంగ్రెసు చేసి, నెరవేర్చని వాగ్దానాలను అమలు చేస్తానని, కార్మిక వివాదాలలో ప్రభుత్వం, పోలీసు కలుగజేసుకొనరని, వెన్వెంటనే రైతులను భూముల నుండి తొలగించుటను నిషేధించి, వ్యవసాయ సంస్కరణల బిల్లును, నూతన విద్యావిధాన బిల్లును ప్రవేశపెట్టి, ఆమోదానంతరం,

ప్రెసిడెంటు ఆమోదముద్రకై పంపుట ప్రజాసామాన్యంలో, ప్రజాస్వామ్యవాదులలో మంచి ప్రభావాన్ని కలుగజేసింది. వ్యవసాయ సంస్కరణల బిల్లు, చట్టమై అమలు లోనికి వస్తే కమ్యూనిస్టు పార్టీ స్థిరమైన బలంతో ప్రజలలో పాతుకొనిపోతుందని, దేశమంతటా యిట్టి చట్టానికై ఆందోళన, ప్రజోద్యమాలు విజృంభిస్తాయని కాంగ్రెసు, ప్రభుత్వ అగ్రనాయకత్వం కలత చెందింది.

9) మాస్కో ప్రకటన "యుగధర్మం, పెట్టుబడిదారీ విధానం సోషలిజం లోనికి పరివర్తన" యని, "శాంతిని పరిరక్షించుట, యుద్ధాన్ని నివారించుట ప్రపంచ శాంతి ప్రజోద్యమాలకు సాధ్యమని" స్పష్టం చేసింది. అంతేగాక "అనేక దేశాలలో శాంతిమార్గాన సోషలిజం పరివర్తన సాధ్యానికి" అవకాశాలున్నాయని ప్రకటించింది. ఈ పరివర్తనక్రమంలో, పార్లమెంటరీ వ్యవస్థ పాత్ర సాధనమగుతుందని కూడ సూచించింది. ఈ విధంగా మాస్కో ప్రకటన దేశ, విదేశాలలో నూతన ఆలోచనా విధానాన్ని రేకెత్తించింది. నూతన మార్గాన్ని ప్రతిపాదించింది.

10) పాల్ఘాటు పార్టీ కాంగ్రెసులో అంతర్గత రాజకీయ విధాన సిద్ధాంత చర్చలలో కాలహరణం యెక్కువగా జరిగినందున, పార్టీ నిర్మాణ సమస్యలు పెక్కింటిని వాయిదా వేయక తప్పలేదు. వాటిని ప్రధానంగా 1958లో జరిగిన అమృత్‌సర్ కమ్యూనిస్టు పార్టీ, ప్రత్యేక కాంగ్రెసు చర్చించి నిర్ణయాలు చేసింది.

ప్రపంచశాంతి, జాతీయ విముక్తి, స్వాతంత్ర్య, ప్రజాస్వామ్య, సోషలిస్టు శక్తులు బలపడి సామ్రాజ్యవాదపు కుట్రలను భగ్నంచేసి మరో యుద్ధాన్ని రాకుండా నిరోధించగలిగినంతటి శక్తిని సమకూర్చుకొన్నాయి. ఆసియా, ఆఫ్రికాలలో అనేక దేశాలు స్వాతంత్ర్యాన్ని సంపాదించి, సామ్రాజ్యవాద వ్యతిరేక స్వతంత్ర పంధాను చేబట్టాయి. సోషలిస్టు, స్వతంత్ర దేశాల శిబిరపు ఐక్యత వలన విమోచనోద్యమాలకు తోడ్పడుతుంది. మాస్కో ప్రకటన, 64 ప్రపంచ దేశాల శాంతి సందేశం (మానిఫెస్టో) ప్రపంచ పురాగామి శక్తుల నాకర్షించింది. ప్రపంచ శక్తుల బలాబలాలలో సోషలిస్టు, స్వతంత్ర, ప్రజాస్వామ్య దేశాల కనుగుణంగా, సుముఖమైన మార్పు వచ్చింది. పెట్టుబడిదారీ సమాజం సోషలిస్టు సమాజంలోనికి శాంతిమార్గాన పరివర్తన చెందుటకు అవకాశాలు ఎక్కువయ్యాయి. ఈ పరిణామాలు, మార్పులకు భారతదేశ విదేశాంగ విధానం తన వంతు కర్తవ్యాన్ని నిర్వహించి ప్రపంచ శాంతిప్రియులందరి మన్ననలను పొందింది. కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వ సామ్రాజ్యవాద వ్యతిరేక, శాంతి, యుద్ధవ్యతిరేక, స్వతంత్ర విదేశాంగ విధానానికి పూర్తి సహకారాన్ని అందిస్తుంది

కాంగ్రెసు దేశంలో యింకా విస్తృత ప్రభావాన్ని, బలాన్ని కలిగివుంది. ప్రజలలో గాని బలం క్షీణిస్తూ, పునాదులు కదలిపోతున్నవి. కాంగ్రెసు సంస్థ ముఠా తగాదాలతో ప్రభుత్వాలలో అస్థిరత యేర్పడుతుంది. అభ్యుదయకర కాంగ్రెసు

వర్గాలు తమ అసంతృప్తిని వెల్లడి చేస్తూనే వున్నవి. అయినా ప్రభుత్వంపై పెరిగే అసంతృప్తి కంటె కమ్యూనిస్టు, ప్రజాస్వామ్య శక్తుల అభివృద్ధి పెరుగుదల తక్కువగా వుంది.

ప్రణాళికాభివృద్ధి మూడవ సంవత్సరంలో సంక్షోభంలో పడింది. ఆహార కొరతతో దిగుమతి అవసరం యేర్పడింది. పరిశ్రమలు స్థాపించబడినా వుత్పత్తిరేటు పడిపోయింది. ప్రజల కొనుగోలుశక్తి పడిపోవుటతో అనేక గుడ్డల మిల్లులు మూతపడిపోయాయి. దేశంలోని వనరులు పడిపోవుట, ప్రయివేటు పరిశ్రమల నిర్మాణం, అభివృద్ధి కొరకై దిగుమతులు పెరుగుటతోపాటు ఆహారపదార్థాల దిగుమతితో మారకద్రవ్య సంక్షోభం యేర్పడింది. ప్రణాళికా లక్ష్యాలకై విదేశ పెట్టుబడులపై ఆధారపడుటయే సంక్షోభానికి ముఖ్యకారణంగా కానవస్తున్నది.

అభ్యుదయ నిరోధకశక్తులు కాంగ్రెసులోను, బయటా వున్నవి. బయట వున్న శక్తులు ప్రజాబలాన్ని కలిగిలేవు, అయితే వీరికి ప్రధానమైన బలం, కాంగ్రెసు లోపల వున్న అభివృద్ధినిరోధకుల నుండే లభిస్తున్నది. కాన కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధినిరోధక శక్తులకు వ్యతిరేకంగా ద్విముఖ పోరాటం సాగిస్తుంది.

కిసాన్ సభ, వ్యవసాయకూలీ సంఘాల విస్తృత నిర్మాణాన్ని మొత్తం పార్టీ విప్లవ వ్యూహ కర్తవ్యంగా, ప్రజా కార్యక్రమంగా నెంచాలి. పార్టీ యీ కర్తవ్య నిర్వహణలో విఫలమగుట, పార్టీ దేశంలో రాజకీయ నిర్మాణాత్మక పాత్ర వహించుటలో విఫలతకు దారితీస్తుందని అమృత్‌సర్ తీర్మానం స్పష్టం చేసింది.

సంయుక్త మహారాష్ట్ర, మహా గుజరాత్ ప్రజోద్యమాలకు పార్టీ, శాఖలు చొరవతో ప్రధాన పాత్ర వహించవలసి వుందని తీర్మానించింది.

కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం కార్మిక, యాజమాన్య వివాదాలలో పోలీసు యాజన్యం తరపున కలుగజేసుకొనదని చేసిన ప్రకటన, రాష్ట్ర శాసనసభ ఆమోదించిన వ్యవసాయ సంస్కరణల బిల్లు నూతన విద్యావిధాన బిల్లు, గ్రామాధికారుల, వుపాధ్యాయుల జీతాలను పెంచుట, మార్గదర్శకవిధానాలు దేశప్రజలు గుర్తించునట్లు ప్రచార, ఆందోళనోద్యమాలను చేబట్టాలని పార్టీకాంగ్రెసు కోరింది.

ప్రధానంగా తక్షణ సమస్యలపై ఐక్యకార్యాచరణ ద్వారానే ఐక్యసంఘటనా నిర్మాణావకాశాలు యేర్పడగలవని అమృత్‌సర్ పార్టీకాంగ్రెసు ప్రత్యేకంగా నొక్కిచెప్పింది.

వామపక్ష పార్టీల ఐక్యత ప్రాతిపదికగా ఐక్యసంఘటనా నిర్మాణ ప్రయత్నాన్ని కొనసాగించాలి. విచ్ఛిన్నకర చర్యలకు వ్యతిరేకంగా సిద్ధాంత పోరాటాన్ని అట్టి పార్టీలపై జరుపవలసి వుంటుంది. అభ్యుదయ స్వతంత్రులు, కాంగ్రెసు వాదులలో యెందరో ప్రజాస్వామ్యవాదులు వున్నారు. వారినందరిని ఐక్యసంఘటనలో

పార్టీ వివిధ సమస్యలపై సమీకరించగలిగినప్పుడే ఐక్యసంఘటనా నిర్మాణంలో విజయం సాధ్యం కాగలదు.

కమ్యూనిస్టు పార్టీ అమృత్‌సర్ కాంగ్రెసు, పాల్ఘాట్ పార్టీ కాంగ్రెసు కార్యక్రమాన్ని పునరుద్ఘాటించుతూ, శాంతియుద్ధ వ్యతిరేక, సామ్రాజ్యవాదుల పెట్టుబడి నియమ, నిబంధనలకు అతీతంగా వుండుటకు వ్యతిరేకంగా, వలస విముక్తిపోరాటాలకు పూర్తి మద్దతునిస్తూ, ప్రజాస్వామ్య పద్ధతులలో ప్రజలకొరకై ప్రణాళిక రచన కొరకు, అభ్యుదయ వ్యవసాయ సంస్కరణల కొరకు, ప్రజాస్వామ్య, పౌర హక్కుల కొరకు, భాషాప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికగా సంస్థానాలను రద్దుచేసి విశాల భాషారాష్ట్రాలను యేర్పరచాలనే సమస్యలపై జాతీయ విస్తృత ప్రజోద్యమాలను ఐక్యకార్యాచరణగా నిర్వహించి ఐక్యసంఘటనా నిర్మాణావకాశాలను పెంపొందించాలని అమృత్‌సర్ విధానం స్పష్టం చేసింది. అజయ్‌ఘోష్ అమృతసర్ కాంగ్రెస్ అవగాహనపై వివరణయిస్తూ వివరించారు.

బూర్జువా వర్గాలు ప్రభుత్వరంగంలో పారిశ్రామిక విస్తరణచేస్తూ, సంక్షేమ రాజ్యాన్ని, సోషలిస్టు నమూనాలో సామాజిక నిర్మాణం చేస్తామని, మార్క్సిజం నమూనా నేడు చెల్లదని, వర్గపోరాటం భారత సాంప్రదాయానికి విరుద్ధమనే, పాలక వర్గ సిద్ధాంతదాడిని త్రిప్పికొట్టి, ప్రపంచశాంతి, యుద్ధవ్యతిరేక, అటం ఆయుధ వ్యతిరేక, స్వాతంత్ర్యం, సోషలిజంలకు ప్రజలను సమీకరించాలని అమృత్‌సర్ కాంగ్రెసు పిలుపు నిచ్చింది.

# 8

# భిన్నదృక్పథాల సంఘర్షణపర్వం

## I

## భారతదేశ పరిస్థితి

కాంగ్రెసు పాలక పార్టీ పదునాలుగు సంవత్సరాలుగ రెండు పంచవర్ష ప్రణాళికలు, ఆర్థిక, సామాజికాభివృద్ధిని, అమలుచేయుటలో సాధించిన విజయాలను, అపజయాలను, సంగ్రహంగా పరిశీలించవలసి వుంది. స్వాతంత్ర్య పోరాటకాలంలో దున్నేవానికే భూమి, ప్రతివొక్కనికి ఉద్యోగం, తిండి, బట్ట యితర కనీస అవసరా లను వాగ్దానంచేసి, అధికారంలోనికి వచ్చిన తరువాత వాటిని నెరవేర్చుటలో విఫలమైంది. ఆకలిని, దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని రూపుమాపే సమగ్ర పథకాలను అమలు జరుపనందున, జాతిబహుముఖాభివృద్ధి కొరవడింది.

**విదేశీ దోపిడికొనసాగింది :**

బ్రిటిష్‌పాలన, పాతదౌర్జన్య దోపిడి అంతమైనా, వారి, వారి అమెరికను మిత్రుల "లాభాల గ్రాండ్ దోపిడి" కొనసాగుతున్నది. మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభానికి బ్రిటీష్ పెట్టుబడి రు. 600 కోట్లు, కనీస లాభాల ఎగుమతి రు.52.5 కోట్లు వుండేది. స్వాతంత్ర్యానికి పూర్వం 1945లో కప్పము తదితరంగా మనదేశం నుండి బ్రిటన్‌కు రు. 180 కోట్లు ప్రవహించేది. వారి పెట్టుబడి రు. 872 కోట్లు, లాభం రు 60 కోట్లు ఎగుమతి అయ్యేది. రెండవ ప్రపంచ యుద్ధపు పూర్వపు రెండు సంవత్సరాలలో కప్పంగా 180, 200 కోట్లరూపాయలు బ్రిటన్‌కు వెళ్లేది.[1]

రెండవ ప్రపంచయుద్ధ కాలంలో కరువుకాటకాలుసుగురై తిండి, బట్ట, కనీస అవసరాలకు నోచుకోని భారత ప్రజల కష్టాల ఫలితంగా 70కోట్లుగావున్న స్టెర్లింగు నిల్వలు 1945 చివరకు 1686 కోట్ల రూపాయలైనది. చర్చిల్ భారతదేశానికి యెట్టి హక్కులేదని ప్రకటించగానే 23 సెప్టెంబరు 1945లో అఖిల భారత కాంగ్రెసు కమిటి స్టెర్లింగు నిల్వల సమస్యను పరిష్కరించాలని, వాటిని ప్రణాళికాభివృద్ధి ఆర్థికాభివృద్ధికి భారతదేశం వుపయోగించాలని తీర్మానించాయి. కాని బ్రిటిష్

---

1. భూపేష్‌గుప్తా (1961) దిబిగ్‌లూట్ (ఆంగ్లంలో) సి పి.ఐ. చిరుపుస్తకం. పే.2

ప్రభుత్వం రూపొందించిన స్టెర్లింగు నిల్వల ఒప్పందంపై, రాజీమార్గంలోవున్న కాంగ్రెసు ప్రభుత్వం మాట్లాడకుండా సంతకాలు పెట్టింది. మనం ప్రతి సంవత్సరం వినియోగించుకోగల స్టెర్లింగు నిల్వలపై సీలింగుపెట్టారు. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సంవత్సరానికి 50 కోట్లు చొప్పున 250కోట్లు వినియోగించుకోవచ్చున్నారు. వాస్తవానికి 122 కోట్లకు మించి వినియోగించలేదు. రేసుగుర్రాలు, విస్కీ, కారులు, కాస్మెటిక్స్, పోకెట్ బుక్స్‌కు దుబారా ఖర్చులకు అధిక భాగాన్ని ఖర్చు పెట్టారు. మొదటి ప్రణాళికాంతానికి మన విదేశ వ్యాపారపులోటు 318 కోట్లు, విదేశీ వుద్యోగుల పెన్షనుల నిమిత్తం 224కోట్లు మరో ఖాతా క్రింద పెట్టబడింది. రెండవ ప్రపంచ యుద్ధంలో వాడిన, నిల్వ సైనిక ఆయుధసామాగ్రి జెంక్‌నంతా స్టెర్లింగు నిల్వలు పెట్టికొన్నారు. అన్నిటి ఫలితంగాను, బ్రిటిష్ ఆస్థులను రద్దుచేస్తూ వాటికి స్టెర్లింగు నిల్వలు పెట్టికొనుట జరిగింది. నిల్వలు 50 శాతం తగ్గి 877 కోట్లుమాత్రం మిగిలినవి. మూడవ పంచవర్ష ప్రణాళికారంభానికి వాస్తవంగా 141 కోట్లుమాత్రం వున్నవి. స్టెర్లింగు నిల్వలతో యెంతో పారిశ్రామికాభివృద్ధి తలపెట్టినా, కరిమ్రింగిన వెలగపండులా హరించిపోయాయి.

విదేశీపెట్టుబడులు మే1961 రిజర్వుబ్యాంకు బులెటను ప్రకారం 1948లో 225.83 కోట్లు, 1960కి 655 కోట్ల రూపాయలైనవి. అవి అన్నీ కొత్తపెట్టుబడులు కావు లాభాలను తిరిగి పెట్టుబడి పెట్టగా పెరిగినవి గణనీయంగా వున్నవి. అత్యధిక లాభశాతం లభించే పెట్రోలియం, మాన్యుఫాక్చరింగ్, ప్లాంటేషనులలో యెక్కువ శాతం పెట్టుబడిపెట్టబడింది. దేశీయ అవసరాలు పరిగణలోనికి తీసుకొనబడలేదు.

విదేశీయ పెట్టుబడుల లాభాల, "అన్ని పద్దుల ఎగుమతి సాలుకు రు 100 కోట్లుపైగా వుంటుందని, "భూపేష్‌గుప్తా పేర్కొన్నారు. లోకసభలో 10 ఏప్రిల్ 1961న యిచ్చిన సమాచారం ప్రకారం 1957-59లలో నౌకారవణా దిగుమతి చార్జీలు 236 కోట్లరూపాయలు. పి.యల్ 480, అహారపదార్థాల దిగుమతి చార్జీలు రు 55.4 కోట్లు విదేశీ నావికాకంపెనీలకు, విదేశీ కరెన్సీతో ప్రభుత్వం చెల్లించింది. రెండు ప్రణాళికల అనంతరం మన ఆహార దిగుమతులకు నౌకారవాణా సౌకర్యాలను కలుగజేసుకొనలేదు.

మన ఎగుమతి, దిగుమతులలో 70-75 శాతం విదేశీ కంపెనీల చేతులలో వున్నవి. ఇండియా ఎగుమతి చేయు వుత్పత్తులలో గల వైరుధ్య లక్షణాలను ఐక్యరాజ్య సమితి 1957 నివేదికలో స్పష్టం చేసింది. భారతదేశం చేయు ఎగుమతులు వచ్చే రెండు సంవత్సరాలలో పెరిగే అవకాశం లేదని పేర్కొంది. మనం ఎగుమతి చేయు సరుకుల, వుత్పత్తుల ధరలు నిలకడగా తగ్గిపోయాయి. ఐ.యం.యఫ్ నివేదిక "1954-58 మధ్య సహజవనరుల వ్యాపార షరతులు ప్రతి సంవత్సరం దిగజారిపోతున్నవి. వ్యాపారం తరుగుదల 12 శాతమున్నది. సహజవనరుల ధరల తగ్గుదల

మామూలు తరుగుదల కంటే అధికంగా వున్నదని నివేదిక పేర్కొంది. ఈ 1959 నివేదిక "ఈ దేశాల సంపాదనా శక్తి తక్కువగుట, వారి చెల్లింపుల పరిస్థితులలో యిక్కట్లులను కలుగజేసింది, వారి ఆర్థికాభివృద్ధికి ఆటంకమైంది. ముడిసరుకుల ధరలు 1954-58 మధ్య 8శాతం పడిపోగా, పారిశ్రామిక తయారీ వస్తువుల ధరలు 9శాతం పెరిగాయి. "అని నివేదిక తెలిపింది. ఇది దోపిడి ప్రచ్ఛన్నరూపం తప్ప మరొకటికాదు. భారతదేశపు విదేశ వ్యాపారలోటు 1958-59, 1959-60లలో 1139.72 కోట్లరూపాయలు, యిది మన జాతీయ ఆదాయంలో 10శాతంగా వుంది. మన ఎగుమతి, దిగుమతి వ్యాపారంలో విదేశీ కంపెనీలే ఆధిక్యతను కలిగి వున్నవి. అందులో బ్రిటిష్‌వారి భాగమెక్కువ. విదేశీ కంపెనీల దిదుమతి వ్యాపారం 1956లో 26.7శాతం, 1958లో 32.8 శాతంకు పెరిగింది. మనకు అత్యధిక విదేశీమారక ద్రవ్యాన్ని సంపాదించి పెట్టే తేయాకు వ్యాపారంలో 60 శాతం, పుగాకులో 40 శాతం, జూట్‌లో 30శాతం విదేశీకంపెనీల ఆధ్వర్యంలోనే వుంది. మన ఖనిజాల ఎగుమతిలో80-98 శాతం, ఎలక్ట్రికల్సులో 50-57 శాతం, రసాయనాలలో 38-48 శాతం విదేశీకంపెనీల క్రిందనే వుంది.

బ్రిటిష్, అమెరికన్ ఆయిల్ కంపెనీల లాభాలు ఆశ్చర్యాన్ని గొల్పే అంత ఎక్కువగా వున్నవి. బర్మాషెల్ 1955లో 35; 1956లో30.20; 1957లో 31.62 శాతము పెట్టుబడిపై నిఖర లాభాలు సంపాదించింది. స్టాన్‌వాక్ 1957లో 21.4, కాల్టెక్సు 1954లో 49 1 శాతాలు లాభం గడించాయి. చేంబర్‌ఆఫ్‌కామర్సు ప్రెసిడెంట్ హెచ్ యం.యల్. విలియంస్ ప్రపంచ వ్యాపారవర్గం, భారతపారిశ్రామికాభివృద్ధిలో పెట్టుబడి పెట్టుట ఆకర్షణీయంగా వుందని, ప్రవేటు పెట్టుబడి అధికంగా వస్తున్నదని" వ్యాఖ్యానించుట లాభదాయక నైజాన్ని తెల్పుతున్నది.

ప్రభుత్వం ప్రచారం చేస్తున్న సాంకేతిక, యాజమాన్య భారతీయకరణ వచ్చి బూటకంగా వుంది. విదేశీయులు 1947లో రు 1000లుపైగా వేతన వర్గంలో 5844 మంది వుండగా, 1956లో 6566మంది. అందులో5749మంది బ్రిటిష్, 279మంది అమెరికనులు 108 స్విస్, 71మంది డచ్‌వారు వున్నారు. స్వాతంత్ర్యం వచ్చిన 8 సంవత్సరాల తరువాత కూడ రు 3000లు పైగా వేతనం పొందేవారిలో 90.2శాతం విదేశీయులున్నారు. తక్కువ వేతనవర్గం రు 1000-3000 వారిలోకూడ భారతీయులు 34శాతం మాత్రమే వున్నారు. ఈ అధిక వేతనం పొందే విదేశీయులలో ఎక్కువ మంది ఆయాదేశాలలో 'పనికిరానివారుగా' పని దొరకనివారు.[1]

విదేశీయ కంపెనీలతో కలసి, జాయింటు కంపెనీలుగా 1956-59లమధ్య 99 పారిశ్రామిక సంస్థలు యేర్పడినవి. వీటిలో 40 శాతం అంతకుమించి విదేశీ పెట్టుబడి కలవి 68 వున్నవి. ఇంతేగాక 13 కంపెనీలలో 100 శాతం పెట్టుబడి

1. భూపేష్‌గుప్తా(1961) ది బిగ్‌లూట్ (ఆంగ్లంలో) సి.పి.ఐ. చిరుపుస్తకం. పే.26

విదేశీయులవి వున్నవి. రిజర్వుబ్యాంకు కొలమానం ప్రకారం, జాయింటు 99 కంపెనీలలో 68 కంపెనీలు 40 శాతంకంటె అధిక విదేశీ పెట్టుబడి వున్నందున, విదేశీయుల ఆధ్వర్యం లోనివిగా యెంచబడినవి. ఈ విధంగా వీటిని "జాయింటు కంపెనీలు", "పొత్తుకంపెనీలు" అనుటకంటె "విదేశీకంపెనీలకు లొంగిపోయిన కంపెనీలు" అనటం వాటినైజాన్ని స్పష్టం చేస్తుంది. మాంచెస్టర్ గార్డియన్ పత్రిక సంపాదకులు రిచార్డ్‌పెర్రీ "జాయింటు కంపెనీలలో భాగస్వాములగుటకు కంపెనీలు ప్రవాహంగా వస్తున్నవని, పరిశ్రమాభివృద్ధి బాగా వుందని, బాగా రక్షణ గలిగిన మార్కెట్టు కారణంగా అత్యధిక లాభాలు వస్తున్నాయనీ, జాతీయ ప్రజాశికలు వాటిని సమాజంలో బాగా గౌరవించుతున్నవని" వ్రాసారు.[1]

ప్రభుత్వం వాటిని యెంతగా 'గౌరవించుచున్నది' అనుటకు వొక్క వుదాహరణ: మెస్సర్స్ జార్డెయిన్ హెండర్సన్ 1952-60లలో కష్టమ్స్ చట్టాలను ధిక్కరించి 24 సారులు బంగారం స్మగుల్‌చేస్తే 25.86 లక్షల రూపాయలు అపరాధం వసూ. చేసారే కాని, కంపెనీని స్వాధీనం చేసుకొనుట, విచారించి శిక్షించుట జరుగలేదు.

విదేశ ఆర్థిక, పారిశ్రామిక ఆధిక్యతను నిర్మూలించుటకు, విదేశీ కంపెనీలను జాతీయం చేయుట, వనరులను ప్రభుత్వం చేతులలో వుంచుకొనుటతో దేశ ఆర్థిక విధానం బలవత్తర మౌతుందని భూపేష్ గుప్తా వివరించారు.

**భారత బూర్జువావర్గం, కాంగ్రెసుపాలన :**

కాంగ్రెసు, కాంగ్రెసుపాలన ప్రకటనలకు, ఆచరణకు వున్న అంతరం కారణంగా బడా బూర్జువా-గుత్తపెట్టుబడిదారి వర్గాలు జాతీయ జీవనంలో అభివృద్ధి చెందాయి. అమెరికా, బ్రిటన్,పశ్చిమ జర్మను గుత్తపెట్టుబడి వర్గాలతో పోల్చినపుడు భారతవర్గాలు "మరిగుజ్జులుగా" కన్పించినా, సంఖ్యాబలం కొద్దిదైనా భారతీయ ఆర్థిక జీవనంపై బలమైన పట్టును కలిగి వున్నవి. జాయింటుస్టాక్ కంపెనీలు మొత్తం ఆర్థిక విధానానికంతటికి వ్యాపించివున్నవి.

పునాది కంపెనీలు 88 శాతం 15శాతంపెట్టుబడిని,పైన వున్న 126 కంపెనీలు 4 శాతం కాగా 33.5 శాతం పెట్టుబడిని కలిగి వున్నవి. పై స్థాయి మూడు కంపెనీలు 1 శాతం, 47.8 శాతం పెట్టుబడితో వుత్పత్తి చేస్తున్నవి. ప్రపంచంలో యింతటి తీవ్ర పెట్టుబడి కేంద్రీకరణ మరెక్కడా కానరాదు[2].

ప్రభుత్వ పన్నుల రాయితీ విధానం, 1947-61 లలో గుత్తపెట్టుబడి కేంద్రీకరణ పెరుగుదలకు తోడ్పడింది. యూనియన్ బడ్జెటులో 60 శాతంగా వున్న

1. అజీత్‌రాయ్ (1961) కాంగ్రెసురాజ్యంలో బడా బూర్జువావర్గం (ఆంగ్లంలో) పి. పి. ఎ. పబ్లికేషన్ పే. 3.

2. ........అదే ........అదే........పే. 31.

ప్రత్యక్ష పన్ను 28 శాతంకు పడిపోయింది. పన్నుల రాయితీ పెద్ద కంపెనీలకు అత్యధికంగా తోడ్పడింది. "ఆర్థిక ప్రజాస్వామ్యం," "సోషలిస్టు నమూనా సమాజం" అనే నినాదాల అసలు స్వరూపాన్ని పన్నుల విధానం బహిర్గతం చేస్తున్నది. రిజర్వు బ్యాంకు డిశెంబరు 1960 బులెటిన్ ప్రకారం లాభశాతం చిన్నకంపెనీలకు 3.8 నుండి 4.6 వరకు, పెద్ద, మధ్యతరగతి కంపెనీలకు 4.9 నుండి 2.1 వుందని సూచించింది.

పన్నుల రాయితియేగాక, నేరుగా చేసే ద్రవ్యసహాయం, ఎగుమతులకు చెల్లించవలసిన మొత్తాలకు 100 కోట్ల సహాయం, ప్రభుత్వహామీ, భీమాసంస్థల పెట్టుబడుల వనరులు ప్రవేటు యజమాన్యంలోని పెద్ద కంపెనీలకే లాభించింది.

లోక్‌సభ 123 వ, అంచెనాల నివేదిక, అధికారులు ధరఖాస్తుదారులనుండి, ప్రస్తుతం వారికున్న లైసెన్సుల వివరములు సేకరించకుండా కొత్త లైసెన్సులు యిస్తున్నారు. ఇండియన్ ఆక్సిజన్, ఎ. సి.సి. లకు విచారించకుండానే విస్తరణ కార్యక్రమాలకు ప్రభుత్వ అనుమతి లైసెన్సుల యిచ్చుటయే నిదర్శనము.

కమ్యూనిస్టుపార్టీ పెద్ద కంపెనీల ఆదాయాలపై అధికరేటు పన్నువిధించుట, నేరుగా ద్రవ్యసహాయం, యజమాన్య యేజన్సీలను అన్నిరూపాలలో రద్దుచేయమని, బ్యాంకుల జాతీయంచేసి, ప్రభుత్వపంపిణీవ్యవస్థను యేర్పాటు చేయమని ఆందోళన చేస్తున్నది.

## ఆహార సంక్షోభం, వ్యవసాయసంస్కరణలు :

వ్యవసాయం తొలకరిపై ఆధారపడి పెరుగుదల లేకుండా వుందనేది వాస్తవం. స్వాతంత్ర్యానంతరం 12 సంవత్సరాల తరువాత కూడ వ్యవసాయ వుత్పత్తుల స్తబ్దత, ఆర్థిక పరిస్థితి అవాంఛనీయ పరిణామాలకు గురైంది. ఆహారపదార్థాల దిగుమతి 1948-59 వరకు 14,386 మిలియనుల రూపాయల విలువగల 35.79 మిలియను టన్నులు కొనసాగింది. తృతీయప్రణాళిక,6050 మిలియనుల రూపాయల విలువ గలిగిన 17 మిలియను టన్నుల ఆహార పదార్థాల దిగుమతులు అవసరమన్నది. స్వతంత్ర్యం వచ్చినప్పటినుండి అమెరికా పి. యల్ 480 క్రింద 10,963 మిలియనుల రూపాయల విలువగల ఆహారధాన్యాలదిగుమతి జరుగుతున్నది. పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన విదేశ కరెన్సీ నిల్వలను వీటికి వుపయోగించవలసి వస్తున్నది. ఆహార పదార్థాలే గాక 1958-59, 1959-60 లలో 200 మిలియను రూపాయల ఉన్ని, 215 మి. రు. కొబ్బరి, 149 మి. రు. జీడిమామిడి, 121 మి. రు ముడి రబ్బరు, జూలై 1961 రిజర్వుబ్యాంకు బులెటెన్ ప్రకారం దిగుమతులకు వినియోగించవలసి వస్తున్నది. ఈ విధంగా దేశాభివృద్ధికి వ్యవసాయ పంటల అధికోత్పత్తి ఎంతటి కీలక ప్రాధాన్యత గలదో అర్థమౌతుంది.

ఈ పరిస్థితికి అభ్యుదయకర వ్యవసాయ సంస్కరణ చేసి. వ్యవసాయ వుత్పత్తిశక్తులకు విముక్తి కలిగించుటలోని వైఫల్యమే మౌలిక కారణము. భూసంస్కరణ లక్ష్యాలు : ఒకటి, వారసత్వంగా వున్న వ్యవసాయాభివృద్ధి ఆటంకాలను తొలగించుట, యిది వ్యవసాయ ఆర్థికాన్ని సమర్థతను, వుత్పత్తి శక్తిని పైస్థాయికి పెంచుటకు కావలసిన పరిస్థితులను సృష్టించి, వుత్పత్తి పెంచుతుంది. రెండు, పై దానికి దగ్గరి సంబంధం కలిగిన దోపిడీని, సామాజిక అన్యాయాన్ని వ్యవసాయం నుండి తొలగించి దున్నే వానికి రక్షణ కల్పించుట, సమానస్థాయిని, అవకాశాన్ని గ్రామసీమలలోని అన్నివర్గాలకు కలిగించుట తృతీయ ప్రణాళిక లక్ష్యాలుగ వున్నవి. ఈ లక్ష్యాలను సాధిస్తామని ప్రథమ, ద్వితీయ ప్రణాళికలలో చెప్పినా, తృతీయ పంచవర్ష ప్రణాళిక 14వ ప్రకరణంలో "వ్యవసాయ భూముల అమరికలలోని జమీందారి, జాగీర్దారీ, యీనాందారి విధానాల క్రిందగల 40 శాతంలో చాలభాగం సంస్కరణల క్రిందికి తీసుకొని రాబడినా, కొద్దిభాగంలోని దేవాదాయ, ధర్మాదయ, సర్వీసు యీనాములు చట్టాల పరిధికి రానందున, పూర్వంలు విధానం కొనసాగుతుందనుట స్పష్టం. ఆ భూముల సాగు చేయురైతులకి ఎట్టి హక్కులులేవు, కేవలం కౌలుదారులుగ ఆంధ్రలో చూడగలము.

ప్రథమ ప్రణాళికలో కౌలు పండిన పంటలో 4వ లేక 5వ వంతు వుండాలని ప్రకటించినా, కొన్ని రాష్ట్రాలలో మాత్రం చట్టమైనా, అమలుశూన్యమై, సాంప్రదాయ కౌళ్ళనే వసూలు చేయుట జరుగుచున్నది. కౌలుదారుల రక్షణ చట్టాలు, 11 రాష్ట్రాలలో చేయబడినా "ఆచరణలో అనుకొన్న ఫలితాలు లభించలేదని" ప్రణాళికా సంఘ నివేదికలు తెల్పుతున్నవి. రెండవప్రణాళికలో, ఒకటి కౌలుదారులు భూములను యిచ్ఛాపూర్వకంగా వదలిపేయుటకు, రెవెన్యూఅధికారులచే నమోదు చేయబడనిచో ఆమోదించ తగినవి కావని, రెండు కౌలుదారులు యిచ్ఛాపూర్వకంగా వదలివేసారని భూకామందు వ్యవసాయాన్ని తిరిగి చేబట్టినా, యిది చట్ట పరిమితిలోనే వుండాలని సూచించినా, చట్టము, పాలనాక్రమము, రెండు లక్ష్యాలను అనుసరించలేదు [1].

ఈ విధంగా కొన్ని రాష్ట్రాలలో కౌలుదారులకు రక్షణలేదు. భూస్వాములు భూమి మొత్తాన్ని స్వాధీనం చేసుకొని వ్యవసాయాన్ని సాగించవచ్చును. పంజాబ్‌లో కౌలుభూమినంతటిని స్వాధీనం చేసుకొని వ్యవసాయాన్ని తిరిగి కొనసాగించవచ్చు, ఎక్కడో కొంత భూమిని కౌలుదారుకు యిచ్చుట ప్రభుత్వ బాధ్యతగా చెప్పబడింది, ఇతర రాష్ట్రాలలో తిరిగి వ్యవసాయాన్ని చేబట్టే భూమి పరిమితి చాల

1 ప్రసాదరావు, నండూరి (1961) కాంగ్రెసు పాలనలో వ్యవసాయ సంస్కరణలు (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషను. పే 12లోని వుదహరింపు.

యెక్కువగ వున్నందున, కౌలుదారులు అత్యధిక భాగంభూమిని కోల్పోయారు. నామ మాత్రమే మిగిలింది."[1]

"కౌలుదారుల హక్కులు పరిమితమంది మాత్రమే పొందగలిగారు... ఆంధ్రలో 80 శాతం కౌలుదారులు హక్కులను, చట్టం వచ్చిన తరువాత కోల్పోయారు. బెంగాల్‌లోని "బార్గదారులు", యు.పి.లోని "నాగలిభాగ్‌దారులు", తమిళ నాడులోని "వరందారులు" అనబడే కౌలుదారులు హక్కులను కోల్పోయారు. ఈ విధంగా ప్రణాళికా సంఘ సూచనలను అనేక రాష్ట్రాలు పాటించలేదు[2]."

గరిష్ఠ పరిమితి సంస్కరణల వైఫల్యాన్ని ప్రసాదరావు వివరించుతూ "చట్టాలలోని లోపాలు, కంతలు అంత చిన్నవేమీ కావని, భూస్వాములు చట్టాన్ని నిరుపయోగం చేయగలిగినంత పెద్దవేనని" పేర్కొంటూ వుదాహరణలు యిచ్చారు. ఆంధ్రప్రదేశ్, కాశ్మీరు, ఒరిస్సా, పంజాబ్, యు.పి., బెంగాల్, మధ్యప్రదేశ్‌లలో కుటుంబ మొత్తానికి పరిమితిగా కాక, ప్రతి వొక్కరికి (కుటుంబంలోని) అని వివ రించిన కారణంగా పిల్లలకు, గర్భస్థ శిశువులకు కూడ గరిష్ఠ పరిమిత క్షేత్రాలను వదలినందున, గరిష్ఠ పరిమితినే చాల యెక్కువగా నిర్ణయించినందున, వ్యవసాయ సంస్కరణలు కరి మ్రింగిన వెలగపండు అయింది. ఆంధ్రప్రదేశ్‌లో నీటిపారుదల గల ఒకటో రకపు భూములకు 27, వర్షాధార భూమిని 324 యెకరాలు వ్యక్తి వొక్కంటికి గరిష్ఠ పరిమితిగాను; మధ్యప్రదేశ్‌లో కుటుంబంలో ప్రతి వొక్కరికి 25, మహారాష్ట్రలో నీటి పారుదలక్రింద 18, మెట్ట 126, మైసూర్‌లో 27 యెక రాలు గరిష్ఠ పరిమితిగా నిర్ణయించారు. ఆంధ్రప్రదేశ్‌లో గరిష్ఠ పరిమితికి మించి, పరిమితిలో మూడవ వంతు భూమిని గోభూమిగా వుంచుకొనవచ్చు. పంచదార ఫ్యాక్టరీలు, పండ్ల తోటలు. పశుసంవృద్ధి క్షేత్రాలు, పాల పశు క్షేత్రాలు, ఉన్ని వుత్పత్తి క్షేత్రాలు పేరులతో అనేక మినహాయింపులు యివ్వబడినాయి. బిల్లు చట్టమగు కాలము లోని అన్ని మార్పిడులు ఆమోదించబడినవి. చట్టాల అమలుకు పాలక యంత్రాంగాన్ని నిర్మించలేదు. తృతీయ ప్రణాళిక క్రింది తరగతుల పాలకవర్గం, ఉద్యోగులు, భూస్వాములు 'కుమ్మక్కు' అగుట నిరాటంకంగా సాగిందని పేర్కొంది[3].

## ఆర్థిక పరిస్థితి :

"ఒకే స్థాయి ధరలు ప్రమాణికంగా తలసరి ఆదాయం ప్రణాళికాభివృద్ధిలో రెట్టింపు చేయుటకు మనకు 55 సంవత్సరాలు పడుతుందని" ప్రొఫెసర్ హర్దయాల్

---

1. ప్రసాదరావు, నండూరి (1961) కాంగ్రెసు పాలనలో వ్యవసాయ సంస్కరణలు. పే. 13.
2. ......అదే.................పే. 14.
3. ........అదే ..... ........పే. 18-19.

సింగ్ శేఖర్, గతశతాబ్దంలోని ఆర్థికాభివృద్ధిపై ఎ.ఐ.సి.సి కాంగ్రెసు ఎకనామిక్ రివ్యూలో వ్రాస్తూ పేర్కొన్నారు. ఇంకా ప్రజల జీవన ప్రమాణాలలో వాస్తవాభివృద్ధి"[1] మొదటి దశాబ్దపు ప్రణాళికాభివృద్ధిలో జరుగలేదని స్పష్టం చేశారు. ఈ అవగాహన ప్రాముఖ్యత దృష్ట్యా కొంత వివరంగా తెలుసుకొనుట అవసరము.

జాతీయ ఆదాయం ప్రథమ, ద్వితీయ ప్రణాళికలలో 19.5, 18.4 శాతం, మొత్తం దశాబ్దంలో 41.5 శాతం పెరిగిందని ప్రభుత్వ గణాంకాలు తెల్పుచున్నవి. పెట్టుబడిదారీ విధానాభివృద్ధి క్రమంలో జాతీయ ఆదాయం గుత్త, ద్రవ్య పెట్టుబడిదారులకు అత్యంత అనుకూలంగా పంపకం జరుగుచున్నది. జాతీయ ఆదాయం యే విధంగా పంపకంజరిగింది చూద్దాము.

మన రాజ్యాంగపు "ప్రభుత్వ విధాన ఆదేశక సూత్రాలు, భౌతిక వనరుల యాజమాన్యం, హక్కులు అందరి ప్రయోజనాలను పంపకం చేయుట", "ఆర్థిక విధానం వుత్పత్తి సాధనాల కేంద్రీకరణ జరుగని విధంగా, ప్రజావసరాలకు భిన్నంగా జరుగరాదని", "పిల్లల, యువకుల శ్రమను దోచేవిధంగా వుండరాదని" ఆదేశక సూత్రాలు స్పష్టంగా సూచించుచున్నవి. ద్వితీయ ప్రణాళిక "దేశంలో జీవన ప్రమాణాన్ని పెంచుటకు జాతీయాదాయంలో గణనీయభాగాన్ని వినియోగించుట", "మౌలిక భారీ పారిశ్రామికీకరణ వేగంగా జరుగుటకు", "వుద్యోగావకాశాలను విస్తృతంగా విస్తరించుటకు", "ఆదాయాలలోని అసమానతలను, సంపద, ఆర్థిక, అధికారం సమానంగా పంపకం చేయుట" ప్రధానాంశాలుగా వుదహరించింది. రాజ్యాంగం, ప్రణాళిక స్పష్టంగా అభివృద్ధి పథకాలను వివిధ తరగతుల ప్రజల ప్రయోజనాల కనుకూలంగా ప్రభుత్వం పంపకం చేయుట ప్రభుత్వపు ఆచరణ విధియై యున్నది. ఈ మహదాశయాలనే కాంగ్రెసు, కాంగ్రెసు అగ్రనాయకులు, పరిపాలక నాయకత్వం పదే పదే చాటిచెప్పారు. కాని ఆచరణ పూర్తి భిన్నంగా వుంది.

భారత ప్రజాభిప్రాయ ఇన్‌స్టిట్యూట్ 1959లో చేసిన సర్వేలో, నెలకు రు 100లు కంటె తక్కువ ఆదాయం వచ్చే కుటుంబాలు 30 శాతం వుండగా వారికి 5.12 శాతపు జాతీయాదాయ భాగం నెలకు రు 100 ల కంటె తక్కువ ఆదాయం వచ్చే కుటుంబాలు 30 శాతం వున్నవి. వారికి 5.12 శాతపు జాతీయ ఆదాయ భాగం నెలకు 101-300 వరకు నెలకు తక్కువగా వచ్చే కుటుంబాలు 6.6 శాతం వుండగా వారికి 25.34 శాతపు జాతీయాదాయంలో భాగము, 501 రు. పైగా వచ్చే కుటుంబాలు 8.95 శాతం వుండగా వారికి 23.64 శాతం జాతీయ ఆదాయంలో భాగం లభించిందని వివరించింది.[2]

---

1. మీనన్, కె.పి.యస్. (1961) జాతీయ ఆదాయం (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్
2. మీనన్, కె.పి.యస్ (1961) జాతీయాదాయం ఆంగ్లంలో సి.పి.ఐ. పబ్లికేషన్, పే. 10-11

సంపదకేంద్రీకరణ గుత్త, తదితర పెట్టుబడిదారి వర్గాలలో విపరీతంగా జరిగింది. దేశంలోని 28,000 పరిశ్రమలలోని 28,000 కోట్లలో టాటా, బిర్లా, మఫత్,లాల్ వాల్చంద్, మహేంద్ర, దాల్మియా జైన్స్, మార్టిన్‌బరన్స్‌ల ఆస్తుల విలువ (1958-59లో) 776 కోట్లు, 35 శాతంగా వున్నవి. పెద్ద 100 పైవర్గ కంపెనీల నికర ఆస్తులు పెట్టుబడి 1956లో మొత్తం పారిశ్రామిక పెట్టుబడి మొత్తంలో 66.6 శాతంగా వుంది[1]. ఈ విధంగా ప్రణాళికాభివృద్ధికాలంలో గుత్త పెట్టుబడిదారి వర్గం అత్యధికంగా అభివృద్ధి చెంది, పారిశ్రామిక సామ్రాజ్యాలు, ద్రవ్య నిరంకుశవర్గం యేర్పడింది.

డా.కె.యన్.రాజ్ ప్రకారం, గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయంలోని 1700కోట్ల అదనపు ఆదాయంలో 30 శాతపు భాగాన్ని 3 శాతంగా వున్న పెద్ద భూస్వాములు గత శతాబ్దంలో పొందగలిగారు.[2] వ్యవసాయ కార్మికుల పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. వ్యవసాయ కార్మికుల రెండవ కమిషన్ నివేదిక ప్రకారం సగటు కుటుంబ ఆదాయం 1950-51లో 447 రూపాయలు వున్నది, 1956-57లో రు 437కు పడిపోయింది. అదేకాలంలో వారి అప్పు 1951లో రు 105లు నుండి 1956-57లో రు 136లుకు పెరిగింది, పనిలేని రోజులు 82నుండి 138 రోజులకు అదే కాలంలో పెరిగాయి వ్యవసాయ కూలీల పరిస్థితులలోని మరో ముఖ్యాంశము, బాలకార్మికుల దోపిడి అధికమైంది.[3]

"టోకు ధరల సూచిక 1952-53లో 100 భూమికగా తీసుకొనిన 1959లో 118 6కు పెరిగింది, అంటే ధరలు 18.6శాతం పెరిగాయి. పారిశ్రామిక సెక్యూరిటీలు మారే డివిడెండ్ల ధరలు 61.7 శాతం పెరుగుట, అత్యధిక లాభంగా పంపకంగా డివిడెండ్లు పెట్టుబడి పెరుగుటను సూచిస్తుంది. కార్మికుల వేతనం, రు200లకు తక్కువగా గలవారి వేతనం 1957-58 నాటికి 12.2 శాతం మాత్రమే పెరిగింది. ఈ విధంగా ధనికుల లాభాలు పెరిగినంతగా, పేదల వేతనాలు పెరుగకుండుటను తెలియజేస్తుంది.[3]"

సమాజంలోని అసమానతల కారణంగా ప్రజాస్వామ్యానికి యేర్పడనున్న ప్రమాదాన్ని గూర్చి డా.కె.యన్.రాజ్ యిచ్చిన వివరణ గమనించ తగినది. "ప్రజలలో 4 శాతపు పైవర్గం సగటు 5గురు గల కుటుంబాల ఆదాయం సంవత్సరానికి రు 1150లుగ వున్నది. ఇది క్రింది వర్గాలైన వ్యవసాయ కూలీలకంటె 30రెట్లు అధికంగా వుంది. అలాగాక, 1శాతపుపై వర్గపు సగటు ఆదాయం వ్యవసాయకూలి

---

1. మీనన్, కె.పి.యస్ (1991) జాతీయ "ఆదాయం (ఆంగ్లంలో) సి.పి.ఐ పబ్లికేషన్ పే. 15.
2. .......అదే........పే.........17
3. ........అదే........పే.........20

వర్గం ఆదాయంతో పోల్చిన 80నుండి 100రెట్లు వుంటుంది. ఇట్టి పరిస్థితిని స్పెయిన్ లోనో లాటిన్ అమెరికాలోని ప్రజాస్వామ్యాలని చెప్పుకొనే దేశాలలో మాత్రమే కానవస్తుంది.[1]

మన ప్రజల దారిద్ర్యం చరిత్ర ప్రసిద్ధం, ఎంతటి పేదాంతి కులనైనా సంభ్రమంలో ముంచేయగలదు. జాతీయ శాంపులు సర్వే యీ విధంగా తెలిపింది. రోజుకు 5 అణాలుపై జీవించేవారు 60 మిలియనులున్నారు, 4 అణాలుపై జీవించేవారు 40 మిలియనులున్నారు, 2 అణాలుపై జీవించేవారు 20 మిలియనులున్నారు. ఈ అంకెల అర్థం స్పష్టం, వీరు దారిద్ర్యంలో మునిగిపోవుట వ్యాపార దోపిడి వర్గాలు కోట్లకు పడగలెత్తుట, 'సోషలిస్టు నమూనాలో' పారిశ్రామిక సామ్రాజ్యాలను నిర్మించుట పోల్చి చూడండి. అత్యధిక ప్రజాస్వామ్యమే 'సోషలిస్టునమూనా'యని భ్రమలు ఎంతకాలం నిలువగలదు?

క్లుప్తంగా i) మన అర్థికాభివృద్ధి అతినెమ్మదిగాను అవాంతరాలకులోనవుతూ వుంది. ఈ పెరుగుదల కూడ కొనసాగుతుందనే గ్యారంటీలేదు. నేటి జాతీయ ఆదాయపు పెరుగుదల రేటు, సంవత్సరానికి 3 శాతానికి తక్కువగా, తలసరి ఆదాయం పెరుగుదలరేటు 2 శాతానికి తక్కువగా వుంది. తలసరి ఆదాయంరెట్టింపు చేయుటకు 50 సంవత్సరాల వరకు పట్టుతుంది.

ii) జాతీయ ఆదాయం పెరుగుదలను, అధిక ఆదాయంగల పైవర్గంలోని కొద్దిమంది, పారిశ్రామిక గుత్తపెట్టుబడిదారులు, భూస్వాములు పొందుతున్నారు. ఇది ఆర్థిక అసమానతలు పెరుగుటకు దారి తీసింది. పెద్దపెద్ద పారిశ్రామిక సామ్రాజ్యాలు పెరుగుటకు, మరోపైపు విస్తృత ప్రజాసామాన్యపు దుర్భర దారిద్ర్యం పెరుగుట జరిగింది. అందరికి తెలిసేటట్టు చెప్పాలంటే ధనికులను మరింత ధనికులుగ, పేదలను మరింత పేదలుగ చేసింది.

ఇదే కాలంలో వోడిపోయిన ప్రత్యేక పరిస్థితులలో జర్మనీ, జపాన్‌లు జాతి పునర్నిర్మాణంలో అద్భుతవిజయాలు సాధించారు. అదే విధంగా సోషలిస్టుదేశాలలో 10-12 శాతపు సాలుసరి అభివృద్ధిని సాధించారు. పెట్టుబడిదారి మార్గంలో తలసరి ఆదాయం రెట్టింపు అగుటకు మనకు 50 సంవత్సరాలు పట్టుతుందని స్పష్టమైంది. ఇక వొకేవొక మార్గం పెట్టుదారేతరమార్గం, సోషలిజానికి దారి తీసే మార్గాన్ని చేపట్టవలసి వుంది.

**రాజకీయ పరిస్థితి :**

కాంగ్రెసు ప్రభుత్వం నెహ్రూలా నాయకత్వంలో, ఆయుధ నిరాయుధీకరణకు, ప్రపంచశాంతికి గణనీయమైన సేవజేసి ప్రపంచఖ్యాతి తెచ్చింది. సామ్రాజ్యవాద

---

1. ......ఎఅదే మినస్ కె.వి.యస్. సి.పి ఐ పబ్లికేషన్ పే20.

శక్తులవొత్తిడులను ప్రతిఘటించి, శాంతి, యుద్ధవ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేకా నిరాయుధీకరణ విధానాలను వూగిసలాటలకు లోనగుతున్నా కొనసాగించింది. కాంగో విషయంలో బెల్జియం సామ్రాజ్యవాదాన్ని ఖండించినా హామర్‌స్క్ జోల్డ్ సామ్రాజ్య వాద అనుకూల చర్యలను ఖండించకపోవుట, చట్టబద్ధమైన అంటూనిగిజింగా ప్రభుత్వాన్ని 20దేశాలు గుర్తించినా, భారత దేశపు వూగిసలాట స్పష్టమైంది. ఈ వూగిసలాటను ఆసరాగా తీసుకొని సామ్రాజ్యవాద శక్తులు ముఖ్యంగా అమెరికా భారతదేశ విదేశాంగ విధానాన్ని మార్చుటకై వొత్తిడిని యెక్కువ చేసింది.

దేశప్రజల హృదయాలలో సోషలిజానికి యేర్పడిన స్థానాన్ని ముఖ్యంగా వారి అనుచరులలోనే సోషలిజపు అభిమానం పెరుగుటగాంచిన జాతీయ కాంగ్రెసు, సోషలిజంధ్యేయంగా ప్రకటించింది. సోషలిస్టు భావాలను మేఘావృతంచేసి, శాస్త్రీయ సోషలిజం ప్రజలనుండి, ప్రజాస్వామ్య పోరాటాలకు దూరంగా వుంచుటకు కాంగ్రెసు అనుసరించిన తెలివైన ఎత్తుగడ. పెట్టుబడిదారి విధానం పతన మార్గంలో వుండుటయేగాక, అపఖ్యాతి పాలైంది నేడు, అంచేతనే దాని రాజకీయ ప్రతినిధులు ఆ మాటను పయోగించుటకు వెనుకాడుతూ, సోషలిస్టు పదజాలాన్ని ప్రజలను చేరుటకై వాడుతున్నారు. కాంగ్రెసు సోషలిస్టు నిర్మాణాన్ని చేయుట లేదని, కమ్యూనిస్టులు విమర్శించరు కారణం, పెట్టుబడిదారి విధానాన్ని, కార్మికవర్గ నాయకత్వంలో కూలద్రోసి అధికారాన్ని స్వాధీనం చేసికొన్ననాడే అది సాధ్యమని సోషలిస్టులందరికి తెలుసు.

కమ్యూనిస్టుపార్టీ విమర్శ అంతా "కాంగ్రెసు విస్తృతాధికారాన్ని, అవకాశాలను బ్రిటిష్‌పాలన అవశేషాలను అంతం చేయుటకు, ప్రజాసామాన్య జీవన పరిస్థిలను మెరుగుపరచుటకు, అత్యంత వేగంగా జాతిపురోగమన మార్గంలో దేశాన్ని నడుపుట లేదని[1]" మాత్రమే, సోషలిజపు మార్గంలో నడుపుట లేదని కాదు. కాంగ్రెసు, 200 సంవత్సరాల ఆంగ్లసామ్రాజ్యవాదుల దోపిడి అనుభవం తరువాత ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా, విదేశపెట్టుబడిదారులకు విచక్షణా రహితంగా పరిశ్రమలు పెట్టుకొనుటకు అనుమతినిస్తున్నారు. విదేశీయ గుత్తపెట్టుబడిదారి వర్గంతో కలసి దేశీయ బడా పెట్టుబడిదారివర్గం జాయింటు పరిశ్రమలను నెలకొల్పుట ప్రభుత్వం ఆమోదించుటతో, అమెరికా గుత్తపెట్టుబడిదారి వర్గాలు భారత ప్రణాళికల రక్షిత మార్కెటును, తన అనంతమైన పెట్టుబడి వనరులను అవకాశంగా తీసుకొని, దేశీయ పారిశ్రామిక రంగాన్ని ముఖ్యంగా చిన్న, మధ్యతరగతి పరిశ్రమలను వామరూపాలు లేకుండా హరించివేస్తున్నది.

కాంగ్రెసు కేరళలో మతాతీత(సెక్యులర్) సూత్రాలను విడనాడి ఎన్నికలలో ముస్లింలేగుతోనే చేతులుకలిపి, అసెంబ్లీ ఎన్నికలలో మెజారిటి సంపాదించుటకు

---

1. అఖిల భారత కమ్యూనిస్టుపార్టీ ఎన్నికలప్రణాళిక (ఆంగంలో) 1961. పే. 4.

ప్రయత్నించుచున్నది. ఇవన్నీ అహింస, చట్టబద్ధత, రాజ్యాంగ సూత్రాలను వదలి కాంగ్రెసు మతాతీతప్రవక్తలు అధికారానికై ఎంతగా దిగజారగలరో తెలియజేస్తుంది. కార్పొరేషనులు, జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు అంటే అసహనం ప్రదర్శించుతు, ఏక పక్ష చట్ట వ్యతిరేకచర్యలు చేబట్టుచున్నది. సాంప్రదాయాలకు భిన్నంగా ప్రభుత్వ అధికారాన్ని విచక్షణారహితంగా, స్వప్రయోజనానికి వినియోగించుట, ఎన్నికకాబడిన సంస్థలను తమ అధీనంలో లేని వాటిని రద్దు చేయుట సామాన్యమైపోయింది. కాంగ్రెసుపాలనలో ప్రజాస్వామ్యం వర్ధిల్లదని ప్రజాసామాన్యం తెలుసుకొనుటకు యింకా ఎంతోకాలం పట్టదు.

భారతయూనియన్‌లోని రాష్ట్రాలకు ఫెడరల్ రాజ్యాంగంలో సంక్రమించవలసిన అధికారం, వనరులు, అధికారాలు యివ్వనిరాకరించుతున్నారు. చిన్న విషయాలకు కూడ కేంద్ర ఆమోదానికి ఎదురుచూడవలసి వస్తున్నది. రాష్ట్ర కాంగ్రెసు మంత్రి వర్గాలు కూడ యీ పరిస్థితికి అయిష్టతను తెల్పుచున్నవి. కాంగ్రెసు పాలనలో రాష్ట్ర స్వపరిపాలన, హక్కులు, ప్రయోజనాలు అణగారిపోతున్నవి. పంచాయితీ రాజ్ కబుర్లు ఎన్ని చెపుతున్నా క్రింది స్థాయిలో ప్రజాస్వామ్యం మృగ్యమగుతున్నది ఎన్నిక సంస్థలన్నీ స్వార్ధపరులతో నిండిపోయాయి. స్థానిక ప్లానులు అభివృద్ధి పనులు చేబట్టుటకు ఎట్టి అధికారాలు లేవు.

కాంగ్రెసు చరిత్రను, ధ్యేయాన్ని అధికార పదవులు కాపాడుకొనుటకు, కొనసాగుటకు, నాయకు లనేకమంది మత, కుల ప్రాంతీయ తత్వాలతో విజ్ఞప్తులు చేస్తున్నారు. కాంగ్రెసులో కులప్రాతిపదికపై అనేకసారులు ముఠాలు యేర్పడినవి. అవకాశవాదాన్ని చేబట్టి మతపార్టీలను బలపరచుట, కేరళలో కాంగ్రెసు ముస్లిం లీగుతో కలసి కమ్యూనిస్టు వ్యతిరేక "అపవిత్ర ఐక్యత"ను నెలకొల్పింది. ఫలితంగా ముస్లిం మతతత్వానికి దేశమంతటా ప్రోద్బలం లభించింది. పంజాబులో సిక్కు, హిందూ మతతత్వవాదుల మధ్య కాంగ్రెసు దోబూచులాడుతూ, మరోవైపు పరోక్షంగా జనసంఘ మతత్వవాదులకు మద్దతునిస్తున్నది.

కాంగ్రెసు కేరళలో ప్రజాస్వామ్య వ్యతిరేక, దౌర్జన్యవిధానాలను చేబట్టి ముస్లిం లీగు, క్రిస్టియన్ చర్చి మత సంస్థలతో "కూటమిని" యేర్పరచి, చట్టరీత్యా యేర్పడిన కమ్యూనిస్టు ప్రభుత్వానికి వ్యతిరేకంగా, చట్ట వ్యతిరేకచర్యలను ప్రోత్సహించి అల్లర్లు చెలరేగాయని, అశాంతి ప్రబలిందని, ప్రభుత్వం స్తంభించి పనిచేయజాలని పరిస్థితి యేర్పడిందని, కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాన్ని బర్తరపు చేసింది. అహింసను వల్లించే కాంగ్రెసు "ప్రజావెల్లువ" అంటూ చట్ట వ్యతిరేక పోరాటాన్ని, రాజ్యాంగ పరిధిలో వ్యవసాయ సంస్కరణల, విద్యా విధాన సంస్కరణల బిల్లులను ప్రవేశపెట్టిన ప్రభుత్వ వ్యతిరేక హింసాదౌర్జన్య చర్యలను చేబట్టి అదే సాకుతో కేంద్రప్రభుత్వం కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దు చేయునట్లు చేయుట అంద

రకు తెలిసినదే, అఖిల భారత కాంగ్రెసుకమిటి హైదరాబాద్ సమావేశంలోకాంగ్రెసు మహానేత వొకరు, కేరళలోని "మహమ్మారి" యితర రాష్ట్రాలకు వ్యాపించవచ్చని హెచ్చరించుట అందరకు గుర్తున్నది. దేశ, విదేశాలలోని ప్రజాస్వామ్యశక్తులు రాష్ట్ర కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని రద్దుచేయుటను ఖండించుట జరిగింది.

ఈ ప్రజాస్వామ్యవిద్రోహ చర్యకు కమ్యూనిస్టులు వుద్రేకానికిలోను గాక, పార్లమెంటరీ, చట్టబద్ధ ఆందోళన, ప్రచారం, దేశమంతటా గొప్ప ప్రదర్శనలు జరిపారు. ఇవన్నీ ప్రజలలో రాజకీయ చైతన్యం పెరుగుటను సూచించినా దేశ విస్తృతంగా అవసరం, సాధ్యమైనంతగా ప్రజాస్వామ్య వుద్యమం అభివృద్ధి చెందలేదనుట స్పష్టం. రాష్ట్ర కమ్యూనిస్టు ప్రభుత్వం ప్రజల విశ్వాసాన్ని కోల్పోయినందున రద్దు చేయబడిందని కేంద్ర ప్రభుత్వం చెప్పింది. ఇది ఎంతకుంటిలసాకో, తదనంతర ఎన్నికల (1960)లో కమ్యూనిస్టుపార్టీ దాని మిత్రులు కలసి 1.2 మిలియనుల, 43.8 శాతపు వోటర్ల విశ్వాసాన్ని పొందింది, గత ఎన్నికలలో 40.7 శాతం కన్నా అధికశాతపువోట్లను పొందుట, కాంగ్రెసుప్రభుత్వవాదన వసను తెలియజేస్తుంది. గణనీయమైన ప్రజాసామాన్యం ప్రభుత్వ విధానాలను, ఆచరణలను ఆమోదించక విమర్శించుచున్నప్పటికీ, కాంగ్రెసు వ్యతిరేకపోరాటాలలో, ఆందోళనలో యింకా ముందుకు వచ్చుటలేదను సత్యం స్పష్టమౌతుంది.

కార్మికవర్గం చైతన్యస్థాయిని పెంచుకొనగలిగినపుడే రాజకీయ సమస్యలపై పోరాటాలను వుధృతం చేయగలుగుతుంది. అత్యధిక భాగం కార్మికవర్గం,రైతాంగం యింకా ఎట్టి నిర్మాణాలలోను సమీకరించబడలేదు. కమ్యూనిస్టుపార్టీ బలం అంత విస్తృతంగాను, బలోపేతంగానులేదు. పార్టీ వర్గాలలో రాజకీయ, సైద్ధాంతిక స్థాయి చాలతక్కువగా వుంది. ఇండియా-చైనా సరిహద్దు తగాదా దురదృష్టకరమైనది, దేశంలో కమ్యూనిస్టు వ్యతిరేకశక్తులకు బలమైన వూపునిచ్చింది. భారత పాలక వర్గాలు సమస్యలన్నింటినిప్రక్కదోవలు పట్టించి, ప్రజాస్వామ్యశక్తులలో గందరగోళాన్ని సృష్టించగలిగారు. ప్రజాస్వామ్య వుద్యమాల ప్రయోజనాలు భారత-చైనా సరిహద్దు సమస్య శాంతియుత పరిష్కారాన్ని కోరుతున్నవి.

ప్రభుత్వ దమనకాండకు అంతులేకుండా పోతున్నది. కలకత్తా ఆహార ఆందోళన కాల్పులలో 80మంది చనిపోయారు, 200మంది గాయపడ్డారు. పంజాబులో లెవీవ్యతిరేక ఆందోళనలో 12,000 మంది జైళ్ళ పాలయ్యారు. మద్రాసు రాష్ట్రంలో వ్యవసాయ భూముల గరిష్ఠ పరిమితి నిర్ణయం ఆందోళనలో 16,000 మంది అరెస్టు చేయబడ్డారు. పౌరహక్కులను ప్రస్తావిస్తూ ప్రసిడెంటు రాజేంద్రప్రసాద్ నవంబరు 1960 గవర్నర్ల సమావేశంలో స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, బ్రిటిష్‌పాలనలో కంటె అధికంగా పోలీసు కాల్పులు జరిగాయని పేర్కొనుట, గమనించదగినది. అధికారులకు గల నిరంకుశ అధికారాలను, జస్టిస్ ఏ.యన్. ముల్లా అలహాబాద్

హైకోర్టు, లక్నో బెంచిలో జడ్జిమెంటునిస్తూ "దేశం మొత్తంమీద ఇండియన్ పోలీసు శక్తి చేసినన్ని రికార్డు నేరాలను చేసిన చట్ట వ్యతిరేక సంస్థయే ఒక్కటీ ఎక్కడా లేదని, బాధ్యత నెరిగిన వాడినిగా చెప్పగలను" అని మన ప్రజారక్షణ పోలీసు శాఖపై వ్యాఖ్యానించారు. ఏ ప్రజాస్వామ్య దేశంలోను హైకోర్టు జడ్జి యింతటి పదునైన విమర్శనచేసి, ఖండించుట కానరాదు.

కాంగ్రెసు కేంద్రంలో గుత్తాధికారాన్ని కలిగి వుంది. అంచేత వివాదగ్రస్థ చీలికలకు, గ్రూపులకు అవకాశం లేకుండా ధృఢమైన ఐక్యతాభివృద్ధికి అవకాశాలున్నవి. తద్విరుద్ధంగా స్వాతంత్ర్యం సంపాదించిననాటి ఐక్యత చాలవరకు విచ్ఛిన్నమైంది. మత,కుల, ప్రాంతీయ, భాషాతత్వాలు అభివృద్ధి చెంది విచ్ఛిన్నతకు పరిస్థితులు యేర్పడినవి. ఇందుకు చారిత్రికాంశాలు వున్నా, కాంగ్రెసు సరియైన మార్గాన్ని అనుసరించిన యిట్టి పరిస్థితి వుద్భవించేదికాదు. స్వాతంత్ర్య పోరాటంలోని ఐక్యత స్వాతంత్ర్యానంతరం అదే ప్రాతిపదికపై కొనసాగదనుట, సత్యమే. అయినా, పాలకవర్గ పార్టి విదేశ పరిశ్రమల జాతీయకరణ, దున్నేవానికే భూమినిచ్చే సంస్కరణలు చేబట్టే నూతన ప్రాతిపదికపై అదే ఐక్యతను నిరభ్యంతరంగా కొనసాగించగలిగేది. అభివృద్ధి నిరోధకుల ఆర్థిక పునాదిని తొలగించుట, భాషాప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణ, భాషా సమస్యపై సరియైన నిర్ణయం, మైనారిటీల రక్షణ, ప్రాంతీయ అసమానతల నివారణకై సత్వర చర్యలు, దీర్ఘకాల ప్రజాళికలు మత, కుల, ప్రాంతీయ దురహంకార శక్తులపై జాతీయ శక్తుల సమిష్టి ఆందోళనపై వుద్యమాలను చేబట్టిన, నాటి ఐక్యత నూతన రక్తంతో పునర్జీవనం పొందేది. దీనికి విరుద్ధంగా కాంగ్రెసు కేరళ, పంజాబులలో మతశక్తులతో సఖ్యత సంయుక్త ఐక్యత విధానాన్ని అవలంబించుట, అప్పుడప్పుడు కాంగ్రెసు అభ్యర్థులు కులాల పేరుతో వోట్ల అభ్యర్థించి, విజ్ఞప్తులు చేయుటతోనే ఐక్యత విచ్ఛిన్నమైంది. అంతేగాక వివిధ కులాల పెద్దల, రాజాల, భూస్వాములవారి కులభేదాలు కాంగ్రెసులోనికి తీసుకొచ్చారు. ఎన్నికలలో కులాల ప్రాతిపదికపైనే వోట్లకై విజ్ఞప్తులు, ఫలితంగా "వోటరులను కలుసుకొనే ప్రజాకార్యక్రమాలలో కులాల ప్రచారం సాగింది." అభ్యర్థులకు ఓట్లు, అసెంబ్లీ, పార్లమెంటు స్థానాలకు నిర్ణయించేటప్పుడు, ఆ ప్రాంతంలో యే కుల వోటర్లు అధికంగా వున్నారనే అంశాన్ని అగ్రనాయకత్వాలు పరిగణించుట సాధ్యముగాని, పరిస్థితి, కారణం అభ్యర్థి గెలవాలంటే యిది ముఖ్యాంశమైంది.

1. అజయ్‌ఘోష్ (1961) తృతీయ ఎన్నికలు, కమ్యూనిస్టుల ఛాలెంజి (ఆంగ్లంలో) పే. 18

విదేశాంగశాఖ, డిప్యూటి మంత్రిణి లక్ష్మీమీనన్ "గాంధీ సిద్ధాంతాలను హృదయ పూర్వకంగా అనుసరించే వొకేవొక కాంగ్రెసువాది ప్రధానమంత్రి నెహ్రూ తదితరులు గాంధీజీ అనుచరులమంటూ, వాస్తవంగా అభివృద్ధి నిరోధకతత్వ ప్రతినిధులు ఎప్పుడో చేయవలసిన సామాజిక సంస్కరణలు, అభివృద్ధికర బిల్లుగా పార్లమెంటులో ప్రవేశ పెట్టినపుడు, వాటిని వ్యతిరేకించుటలో కాంగ్రెసువాదులు ముందు పీఠాన నిలబడుట తనకెంతో జుగుప్సను కలిగించుచున్నదని"[1] అన్నది. ఇంకా "కాంగ్రెసు వాదులనేకమంది నెహ్రూలాగకాక వారి ప్రవర్తనలో విశ్వాసంలేనివారు. ఖాధీ ధరించుతారు, కాని జనసంఘం, హిందూమహాసభ, రాష్ట్రీయస్వయంసేవక్ సంఘంలాంటి మత సంస్థల ఆశయాలపై విశ్వాసం కలిగి, సానుభూతి కలిగివున్నారు అట్టివారు కాంగ్రెసును వదలి బయటకు వెళ్లుట చాల గౌరవప్రధమైనది. వారు నమ్మిన దానితో బహిరంగంగా బయటకు వచ్చి వారితోనే కలసి పనిచేయుట మంచిది"[2] అని మంత్రిణి పేర్కొన్నది.

భారతదేశం విదేశాంగ విధానంలో శాంతి, అలీన, వలస వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాన్ని అనుసరించుచున్నది. ఈ కారణంగానే ప్రపంచంలో శాంతికాముక దేశంగా ఖ్యాతి నొందింది. భారతదేశం, చైనా రెండూ ప్రపంచంలోనే అత్యధిక జనాభా కలిగిన పెద్దదేశాలు, వాటిమధ్య స్నేహ. సహకారం ఆసియా ప్రజల ఐక్యతకు శాంతి పరిరక్షణకు యెంతో అవసరం. అందువల్లనే కమ్యూనిస్టు పార్టి యీ రెండు దేశాల మధ్యగల సరిహద్దు తగాదాను, సంఘర్షణలను, శాంతి, సంప్రదింపుల మార్గంలో పరిష్కరింపబడాలని కోరుతున్నది.

మితవాద, అభివృద్ధి నిరోధక పార్టీలు, స్వతంత్రపార్టి, జనసంఘం, శాంతి అలీనవిదేశాంగ విధానాలను వ్యతిరేకించుతు, ప్రభుత్వసామ్రాజ్యవాద వ్యతిరేక విధానాలను తీవ్ర విమర్శకు గురి చేస్తున్నవి. ఈ రెండు మితవాద పార్టీలు పాకిస్తాన్‌తో "రక్షణ సహకార కూటమిని" దక్షిణ ఆసియా ప్రాంతంలో యేర్పాటు చేయాలనే సామ్రాజ్యవాదుల వాదాన్ని బలపరచుచున్నది. మనం అనుసరించే శాంతి, సహకారం, సహజీవనం, అలీనతటస్థత, సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాలను వ్యతిరేకించుచున్నవి. దేశీయాంగ విధానంలో ప్రణాళికాభివృద్ధిని, ద్వితీయ ప్రణాళికలోని భారీపారిశ్రామికాభివృద్ధి, విస్తరణ వ్యక్తి యాజమాన్యంలోగాక ప్రభుత్వ యాజమాన్యంలో కొనసాగుటను వ్యతిరేకించుతున్నారు. మన స్వాతంత్ర్యాన్ని, ఆర్థిక పారిశ్రామికాభివృద్ధిని పెంపొందించిన మార్గాలు అన్నివిధానాల అడ్డుకొంటున్నారు. జనసంఘం ఎన్నికల ప్రణాళికలో భారీ పరిశ్రమలను ప్రభుత్వరంగంలో నెలకొల్పు విధానాన్ని, శాంతి, అలీన, తటస్థ విదేశాంగ విధానాన్ని స్పష్టంగా వ్యతి

2. అదే........పే. 18........

రేకించింది. ప్రభుత్వం చేస్తున్న పరిమిత వ్యవసాయ సంస్కరణలను వ్యతిరేకించు తున్నది. స్వతంత్రపార్టి గూడ యీ విధానాలను వ్యతిరేకించుటతో జన సంఘానికి యేమాత్రం తగ్గక, ఔక అడుగుముందే వుంటున్నది.

పండిట్ నెహ్రూ "మత దురహంకారం, వివిధ ఫాసిస్టు రూపాలకు దగ్గరి సారూప్యత కలిగివుందని, విదేశాలలో దీనినే చూసానని, యిది భారతదేశ ఫాసిస్టు రూపమని పేర్కొన్నారు నెహ్రూ యీ విషయాన్ని కేరళలో "ప్రజావెల్లువ"గా కమ్యూనిస్టు వ్యతిరేకతను చిత్రించి, కాథలిక్, ముస్లిం మతతత్వ దురహంకార శక్తులతో కాంగ్రెసు కలసి రాష్ట్ర ప్రభుత్వ వ్యవసాయ, విద్యాసంస్కరణల బిల్లులకు వ్యతిరేకంగా ఆందోళనోద్యమాన్ని అరాచకాన్ని, సృష్టించినపుడు మరచిపోవుట దురదృష్టకరము.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీల పుణ్యాన ముస్లింలీగు అనేక రాష్ట్రాలలో పునరుద్ధరించబడింది. కేరళలో మతతత్వాభివృద్ధికి తోడ్పాటు లభించింది. అది హిందూ మతతత్వాన్ని పెంచి, ముస్లింలకు తీరని నష్టాన్ని కలుగ జేసింది.

పంజాబులోని అకాలీలు మరోమతతత్వ విచ్ఛిన్నకరశక్తి భాషాప్రయుక్త రాష్ట్రాల పునర్నిర్మాణాన్ని, విధానాన్ని వక్రీకరణచేసి, పెడమార్గం పట్టించి, గురుద్వారాలను రాజకీయ కార్యక్రమాలకు కేంద్రాలుగ జేసి, శిక్కుల యెడల ప్రభుత్వ విచక్షణ అనే లేనిపోని సమస్యను లేవనెత్తి ప్రజాశక్తులను చీల్చి, హిందూమతతత్వ దురహంకారశక్తులకు జీవం పోసారు. కమ్యూనిస్టుపార్టీ హిందూ, ముస్లిం, శిక్కు మత దురహంకారాన్ని ప్రతిఘటించుచున్నది.

మతకలహాల, కల్లోల ప్రాంతాలన్నిటిలో జనసంఘనాయకులు వాటి వెనుక న్నారు. హిందీ మాట్లాడే పంజాబ్ ప్రాంతాలలో జనసంఘ వ్యాప్తి దురదృష్టకరము జనసంఘం 1957 ఎన్నికల ప్రణాళికలో హిందూ యేతరులలో భారతీయ సంస్కృతిని, ఆదర్శాలను పెంపొందించి, వారిని జాతీయవాదులుగ జేయుటయే తమధ్యేయంగా పేర్కొంది. ఇది ముస్లింలపై యుద్ధాన్ని ప్రకటించుటతప్ప మరొకటి కాదు. భోపాల్, జబల్‌పూర్, శ్రీనగర్, అలీఘర్‌లలో మతకల్లోలాలక్రమ విధానం దీనినినే తెల్పుతుంది. తరువరి ఎన్నికల ప్రణాళికలో "హిందూయేతరులను జాతీయకరణ" అనే అంశాన్ని విడనాడుట గమనించవలసివుంది. వారి నమూనా భారతీయ సంస్కృతిని పెంపొందించుట ప్రణాళికలో వుంది.

ఈ మితవాద పార్టీల యెడల గుత్త వ్యాపారసంస్థల వైఖరి ఆశక్తికరమైనది. సెప్టెంబరు 11, 1961 ఇండియన్ ఎక్స్‌ప్రెస్ యేజన్సీ "జె. ఆర్. డి. టాటా, టాటాస్టీలు కంపెనీల అధ్యక్షుడు ప్రధానినెహ్రూకు కాంగ్రెసు ఎన్నికల నిధికి చందాయిస్తూ, ప్రజాస్వామ్య ప్రతిపక్ష అభివృద్ధికి స్వతంత్రపార్టీకి చందాయిస్తున్నామని, వారి దృష్టిలో కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా కాంగ్రెసు అంతశక్తివంతంగా పోరా

శుట లేదని పేర్కొన్నారు[1]. ఈ వర్గాల ద్వంద వైఖరిని విజయవాడ పార్టీ కాంగ్రెసులో ప్రస్తావించుట జరిగింది. జనసంఘకూడ అదే వర్గాలు కాంగ్రెసుతోపాటు, యితర బూర్జువా పార్టీలకు మద్దతునిచ్చుట జరుగుచున్నది. ఈ వర్గాలు కాంగ్రెసులో, బయటా, అభివృద్ధి నిరోధక వర్గాలను పెంపొందించుచున్నారు. వారు కమ్యూనిస్టు, పార్టీ పార్లమెంటులో ప్రధాన ప్రతిపక్షంగా వుండుటను, సహించజాలక, యితర రాజకీయపక్షాలు ఆస్థానాన్ని ఆక్రమించుటకై ప్రోత్సహించుతున్నారు.

ప్రజా సోషలిస్టుపార్టీ కొన్ని పరిమిత ప్రాంతాలలో అతివాద నినాదాలతో, కొంత బలాన్ని కలిగి వున్నా, వచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకతతో మితవాదం వైపు పయనిస్తుంది. అభివృద్ధి నిరోధక పార్టీలతో, శక్తులతో కలుస్తుంది. ప్రజాపోరాటాలలో విద్రోహ, విచ్ఛిన్నకరపాత్రవహించుచున్నది. కాంగ్రెసు కన్నా ఎక్కువ అభివృద్ధి, నిరోధక విధానాలను చేబట్టుతున్నది. విదేశాంగ విధానంలో అంతర్జాతీయ ప్రతి పక్షాలమధ్య "వాస్తవ అలీన విధానాన్ని", సైనిక కూటములకు దూరంగా వుండాలంటున్నారు. కాని, "దక్షిణాసియా" "నైరృతి ఆసియా" రాజకీయ రక్షణ కూటములతో పొత్తు కలిగి వుండాలని కోరుతున్నారు. భారతదేశం ప్రజాస్వామ్య జర్మన్ రిపబ్లిక్, అల్జీరియాలను గుర్తించక పోవు విషయంలో మౌనం వహించారు. అమెరికా ప్రోద్బలంతో క్యూబాపై జరిగిన దురాక్రమణపై ఒక్కమాటైనా లేదు. అమెరికా సామ్రాజ్యవాద దుశ్చర్యలపై ఒక్క విమర్శన మాటైనాలేదు. భారతదేశ భారీయంత్ర పరిశ్రమలను ప్రభుత్వరంగంలో నెలకొల్పుటను, సామ్రాజ్యవాదశక్తులు తెగనాడుట గురించి, అశోకమెహతా "ప్రజాస్వామ్యసోషలిజం"లో విమర్శించారు. విదేశీయగుత్త పెట్టుబడిదారి వర్గాలపై వారికెట్టి విమర్శనాపై ఖరిలేదు. కేరళలో ముస్లిం లీగుతో మిత్రసంఘటన యేర్పాటు చేసుకొన్నది ప్రజాసోషలిస్టుపార్టీ. పైగా ముస్లింలీగు మతతత్వ పార్టీకాదనే సిద్ధాంతాన్ని అందుకై రూపొందించింది.

**ప్రజాపోరాటాలు :**

కార్మిక విధానాల యెడల కాంగ్రెసు ప్రభుత్వ వైఖరిని, వారి సోషలిస్టు సమూనాస హజ నిర్మాణ వుపన్యాసాలను బట్టిగాదు, ఆచరణలో కేంద్ర కార్మికశాఖా మంత్రి నిర్ణయాలను, అనుసరించిన విధానాలను బట్టి నిర్ణయించవలసి వుంటుంది. లక్షోప లక్షల నిరుద్యోగ కార్మికుల సమస్య, వేతనాలు, నిత్యావసర వస్తువులధరలు, వసతి, సామాజిక సంరక్షణ, కార్మికశాఖ పనివిధానం, రోజువారి చర్యలు, అధ్యయనం క్లుప్తంగా చేయవలసి వుంటుంది. రెండవ ప్రణాళిక కార్మిక నిరుద్యోగసమస్యను యేమాత్రం పరిష్కరించలేకపోయింది. మూడవ ప్రణాళిక కూడ యీ సమ

1. అజయ్‌ఘోష్ (1861) తృతీయ ఎన్నికలు, కమ్యూనిస్టు చాలంజి (ఆంగ్లంలో) పే. 26-27.

ష్యను పరిష్కరించుటకు ఆశాజనకమైన కార్యక్రమాలను సూచించ జాలకపోయింది పశ్చిమ బెంగాల్ వొక్క జూట్ మిల్లు కార్మికులలోనే 1955-59 మధ్య అదనంగా 50 వేల మంది నిరుద్యోగులయ్యారు. మూడవ ప్రణాళికా కాలంలో పనిని చూపించ వలసిన వారు 26 మిలయనులు, ప్రణాళిక 10.5 మిలియనులకు మాత్రమే వుద్యోగాలు చూపించగలనని వాగ్దానం చేసింది. రైల్వేలు, రోడ్డురవాణా, పారిశ్రామిక నిర్మాణరంగాలు, గనులు, చిన్నపరిశ్రమలలో 3.4 మిలియనులు, ప్రాంతీయ వృత్తులు, వాణిజ్యంలో 3.8 మిలియనులు నిరుద్యోగులకు పనిని చూపించుటకు ప్రణాళిక అంచనావేసింది.

నిత్యావసరాల వస్తువుల ధరల సూచిక 1939 ధరల 100గా పరిగణించి, గుణించిన పెరుగుదల 1942లో 379.1, 1957లో 413.7, 1960లో 467.9, 1961 జూన్‌లో 479 2 గావుంది. ధరలు పెరుగుదల 1949ని భూమికగా తీసుకొని 100 అయిన 1956లో 105, 1957లో 112, 1958లో 118, 1959లో 125, 1960లో 126గా వుంది. ఫ్యాక్టరీ కార్మికులు సగటు సంవత్సరిక వేతనాలు 1954లో రు 1111లు, 1955లో రు 1174లు, 1956లో రు 1187లు, 1957లో రు 1234లు, 1958లో రు 1285లు, 1959లో రు 1310లు, 1960లో రు 1380 1961లో రు 1417లుగా వున్నవి.

ఈ విధంగా నిత్యావసరాల ధరలను కాంగ్రెసు ప్రభుత్వం కంట్రోలు చేయటంలో విఫలమైనందున, వాస్తవవేతనాలు పడిపోవుటను అరికట్టలేకపోయింది. కార్మికుల వొత్తిడితో, ధరల సూచికలబట్టి వేతనాలు పెంచుటకు సూత్రప్రాయంగా అంగీకరించినా, ఆచరణలో అమలుజరుగుటలేదు.

కార్మికపోరాటాలలో ప్రభుత్వం అనుసరించిన విధానం వ్యాఖ్య అవసరం లేకుండా స్పష్టంగా విదితమౌతుంది.

జంషెడ్‌పూర్ టాటా ఐరన్ అండ్ స్టీలు కార్మికులు 30వేలు 12 జులై 1958లో కరువు భత్యాన్ని పెంచాలని కోరుతూ మేజావాణీసమ్మె చేసారు. యాజమాన్యం డి.ఎ. పెంచుటకు అనేక సంవత్సరాలుగా నిరాకరించుచున్నది. ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. గత 30 సంవత్సరాలలో యిదే మొట్టమొదటి సమ్మె. ట్రేడు యూనియన్ కాంగ్రెసు నాయకత్వం వహించుచున్నది. ఒప్పందానికి సంవత్సరం పైగా సంప్రదింపులు జరిపింది. ప్రభుత్వం యేమి చేయలేదు. ఇప్పుడు సమ్మెను భగ్నం చేయుటకు, సమ్మెచట్ట వ్యతిరేకమని నిషేధించి, సైన్యాన్ని దింపింది. ప్రభుత్వం కార్మికుల చిన్న సమస్యయైన ధరల సూచికనుబట్టి వేతనాలు పెంచు విషయంలో కలుగజేసుకొనకుండా నిరాకరించి, సమ్మెను భగ్నం చేయుటకు తనశక్తినంతటిని కేంద్రీకరించింది. ఢిల్లీనుండి సైన్యాధికారిని విమానంలో దింపింది. వందలకొలది కార్మికులు అరెస్టు అయ్యారు, కాల్పులలో ముగ్గురు చనిపోయారు.

"కుట్రకేసు" బనాయించింది, 120 క్రిమినల్ కేసులు 791 మంది సంఘకార్యకర్తపై మోపబడ్డాయి, వీటిలో అనేక కేసులు కొట్టివేసారు. ఈ కేసులకై కార్మిక సంఘాలు కోర్టులలో రు 90 వేలు కర్చుపెట్టవలసి వచ్చింది. యాజమాన్యం 400 కార్మికులను వుద్యోగాలనుండి తొలగించింది. తాతా కంపెనీలో కార్మికులు సమ్మెజేయ సాహసించి నందుకు కార్మికులు చాలమూల్యం చెల్లించవలసి వచ్చింది. తాతాల సహాయాని కొచ్చి ప్రభుత్వం జరిపిన దమనకాండను వ్యతిరేకించిన కార్మికులు జరిపిన పోరాటాలు వ్యర్థంకాలేదు. సంవత్సరంలో టాటా కార్మికుల వేతనాలను ప్రధానంగానే సవరించ వలసి వచ్చింది.

రేవు నావికాకార్మికులు లక్షన్నరమంది జూన్ 1958లో దేశమంతటా జనరల్ సమ్మె జరిపారు. ప్రభుత్వం కమిషన్ సిఫార్సులను పరిశీలించి, అమలు చేయాలనే దానినే ప్రధాన కోర్కెగా రేవు నావికా కార్మికుల ఫెడరేషన్ ప్రకటించింది. ఈ సమ్మె కాలంలోగూడ సైన్యాన్ని పిలిపించుట జరిగింది. మద్రాసులో 16 జూన్ 1958లో పోలీసు కాల్పులలో ఆరుగురు చనిపోయారు, దమనకాండ తరువాతనే ప్రభుత్వం కమిటీ సిఫార్సులను అమలుచేయుటకు ముందుకొచ్చింది. లోక్‌సభ కమ్యూనిస్టుగ్రూపు నాయకుడు "ప్రభుత్వపు కార్మికవర్గం వైఖరియెడల, అభ్యుదయ కరమైనది కాదు, సంక్షేమరాజ్యపు సోషలిస్టు రాజ్యపుచర్యకాదు. టోరీ వైఖరిని అహింస శాంతి, శ్రామిక సంక్షేమం అనే మాటలతో కప్పిపెట్టుకొనుట, కార్మిక మంత్రి సుభాషితాలన్నీ, యితర మంత్రివర్గాలు త్రోసిరాజంటున్నవి. చివరకు మిగిలింది కార్మిక ద్రోహం"[1] అనుట పూర్తిగ సమర్థనీయము అని అన్నారు.

ప్రభుత్వ కార్మిక విధానాల వైఖరి, 14 జులై 1960లో జరిగిన కేంద్రప్రభుత్వోద్యోగుల సమ్మె విషయంలో, రుజువై పై విశ్లేషణకు బలాన్ని చేకూర్చింది.

కేంద్రప్రభుత్వోద్యోగులు వేతన కమిషన్ సిఫార్సులను హేతుబద్ధంగా అసంతృప్తిని వెల్లడించారు. వారు కరువుభత్యంలో పెరుగుదలను కోరుతున్నారు. వారి సంఘం యీ సమస్యపై చేసిన తీర్మానాన్ని ప్రభుత్వం నిర్లక్ష్యం చేసింది. మార్చి 1960లో ఐక్యప్రజాప్రదర్శనలు చేసారు. ప్రభుత్వంలో చలనంలేదు. సమ్మెనోటీసు యివ్వబడింది. పారిశ్రామిక వివాదాల చట్టాల ప్రకారం ప్రయత్నం జరిగివుండవలసింది. మధ్యవర్తి తీర్పుకు ఆమోదించుతామని వుద్యోగులు సూచించారు. ప్రభుత్వం కదలలేదు. ఉద్యోగుల ప్రయత్నాలకు "కాదు-లేదు" తప్ప మరేమిసానుభూతి చర్య ప్రభుత్వంనుండి కన్పించలేదు. ఈ ప్రయత్నాలన్నింటికి సమాధానంగా, మంత్రివర్గకోరికపై ప్రత్యేక ఆర్డినెన్సు ప్రకటించారు.

---

1. రాజబహదూర్ (1961) కాంగ్రెసురాజ్యంలో కార్మికులు (ఆంగ్లంలో) పే. 24.లో ఉదహరింపు.

సమ్మెను అతి నిరంకుశంగా అణచివేసారు. సుమారు 18వేల వుద్యోగులు, 25 వేలు తదితర ట్రేడు యూనియను, రాజకీయ కార్యకర్తలు సమ్మెకుమద్దతు నిచ్చినందుకు జైళ్ళలో వేయబడ్డారు. సైన్యాన్ని పిలిపించారు. అహింసా కాంగ్రెసు ప్రభుత్వం, తన వుద్యోగులపై యుద్ధం ప్రకటించింది. జూలై 1960లో జరిగిన కాల్పులలో ఐదుగురు రైల్వే కార్మికులు చనిపోయారు. పౌరహక్కులు రద్దు చేయ బడినవి, సమావేశాలు, మీటింగులు, వూరేగింపులు నిషేదించబడినవి.

ప్రభుత్వ దమనకాండ యంత్రాంగమంతా సమ్మెను అణచివేయుటకు ప్రయ త్నించింది. ఐదులక్షల ప్రభుత్వోద్యోగులు, ప్రభుత్వ విధానాలకు, తమ అసమ్మతిని తెల్పుతు సమ్మెలో పాల్గొన్నారు. మూడుకేంద్ర ట్రేడు యూనియనులు, వొక జాతీయ ట్రెడుయూనియన్ మినహా అన్నీ పిలుపిచ్చిన కారణంగా కార్మికలోకం సార్వజనీన సమ్మె జరిపింది, తమపూర్తి మద్దతును ప్రదర్శించింది.

భారతదేశంలో అత్యంత నిర్మాణ పటిష్ట కార్మికవర్గం కలిగిన గుడ్డలమిల్లుల పరిశ్రమలో ఆధునికీకరణ, ప్రభుత్వ విధానాలు, అనుభవాలు యీ విధమైన అవ గాహననే బలపరుస్తున్నవి.

గుడ్డల మిల్లుల వేతనబోర్డు నిర్ణయాలను, సిఫార్సులను అమలుచేయాలనే కోరి కతో అనేక మిల్లులు సమ్మె చేయవలసివస్తున్నది. ఇంకా చాలా మిల్లులు బోర్డు సిఫా ర్సులను అమలుచేయవలసే వుంది. ఇంతలో యజమాన్యాలు ఆధునికీకరణను చేబట్టి రిట్రెంచిమెంటు పేరుతో కార్మికవర్గంపై దాడి ప్రారంభించారు. ఈ సమస్య పెక్కు ఫ్యాక్టరీలలో అతి తీవ్రపోరాటాలకు కారణమైంది. కాన్పూరు, యితరచోట్ల జరిగిన తీవ్రపోరాటాల ఫలితంగా యజమాన్యం, ప్రభుత్వం, కార్మికసంఘాలు సమిష్టి సమా వేశాల ఫలితంగా ఆధునికీకరణ కొన్ని షరతులకు లోబడి చేయాలనే నిర్ణయాని కొచ్చారు. కొద్ది రోజులకే సరుకులు మార్కెట్టులో విడుదల కాక యాజమాన్యాలు, సరుకులు గోడౌన్సులో మూలుగుతున్నాయనే మిషతో లాకౌట్లు సంప్రదింపులు లేకుండా, ఏకపక్షంగా ప్రకటించారు. ఈ భారాన్నంతా కార్మికులే మోయవలసి వచ్చింది. తిరిగి వెంటనే విదేశాలకు ఎగుమతులన్న పేరుతో "ఆటోమాటెక్ మగ్గా లను విదేశాలనుండి దిగుమతి అన్న పేరుతో యాజమాన్యం అనేక దిగుమతి సౌక ర్యాలను, సుంకం మినహాయింపుతో సహా ప్రభుత్వం నుండి పొందింది. ఆధునికీకరణ ఆటోమాటిక్ మగ్గాలతో అన్నిరకాల రాయితీలు, లాభాలు యాజమాన్యం పొందింది. అధికపనిభారం, రిట్రెంచిమెంటు కార్మికవర్గం మోయవలసి వచ్చింది. గుడ్డలు మిల్లుల యాజమాన్యాలు కార్మికవర్గంపై జరుపబడిన దాడితో, ప్రభుత్వపు పెట్టుబడి దారి విధానబద్దబయలైనంతగా మరెప్పుడూ జరుగలేదు. గుడ్డల మిల్లుల యజమాన్యం చేసినంతదగా, మోసం, పెద్ద మొత్తంలో పన్నులు ఎగవేత మరెక్కడా కానరాదు. కార్మికుల ప్రావిడెంటు ఫండులను, జమకూడిన మొత్తాలను మ్రింగివేసారు. పరిశ్ర మలు మూలపడిపోతున్నాయి.

ప్రభుత్వం యజమాన్యాలకు బుద్ధి చెప్పటకు, స్వాధీనం చేసుకొనగలందులకు ప్రత్యేక చట్ట అధికారాలను పొందింది. జంషెడ్‌పూర్ మెరుపు దాడిలా సాగిన ప్రత్యేక అధికారాల అమలు జంషెడ్‌పూర్‌లో విచిత్రంగా ఆపివేయబడింది.

కార్మికవర్గం ముందుకు దూకినప్పుడల్లా, జాతీయట్రేడు యూనియన్ కాంగ్రెసు అత్యంత విశ్వాసపాత్రుడుగ విచ్ఛిన్నం చేయుటకు నైతికబలాన్ని నిర్వీర్యం చేయుటకు, రంగంలోనికి దిగుతున్నది. పనిహక్కుకై, పనిభారాన్ని పెంచినప్పుడు గుడ్డల మిల్లు కార్మికులు పోరాడినపుడు వేతన సంఘ సిఫార్సులను అమలుకు పోరాటంలో జాతీయట్రేడు యూనియన్ కాంగ్రెసు యాజమన్యం. తరపున నిలబడింది, 1961లో వేతన సంఘం సిఫార్సులకంటె చాలా తక్కువకు ఆమోదించి, వెన్నుపోటు పొడిచింది.

**కార్మిక వర్గ ఐక్యత :**

కార్మికవర్గ ఐక్యత అంటే కనీసం వివిధ ట్రేడ్ యూనియనులు కార్యాచరణ కనీసస్థాయిలోనైనా లేకపోతే ఐక్యతకు దూరంగా వున్నామని అర్థం. ఈ సమస్యపై అఖిలభారతట్రేడ్ యూనియన్ కాంగ్రెసుతీర్మానం "జాయింటు కౌన్సిల్ ఆప్ యాక్షన్‌లో వివిధ సంఘాలు ప్రభుత్యోద్యోగులు కలసి యేకగ్రీవంగా ఐక్యతతో సమ్మెలో పాల్గొనుట వర్కింగుకమిటి ఐక్యసంఘటనా మార్గంలో వొక ముందడుగుగా బావించుచున్నది. సమ్మె అనంతరం వుద్యమంలోని శక్తులు విజయాలను, అపజయాలను పొరపాట్లను. వ్యక్తుల, పార్టీలు, ట్రేడుయూనియనులు మొత్తంగా వాటి అన్ని శాఖల పాత్రలను సమీక్షించి అంచెనా వేయునపుడు యీ ఐక్యత దెబ్బ తింటుంది."

"ట్రేడుయూనియన్ కాంగ్రెసు సమిష్టి కార్యాచరణ సమితి యేర్పడి సమ్మె నిర్ణయం తీసుకొనకముందే మొత్తం కార్మికోద్యమం కేంద్రట్రేడు యూనియనులతో సహా వివిధ ప్రభుత్యోద్యోగుల సంఘాలు, సమిష్టి అవగాహన ఆచరణ వినాదాలు, అన్ని పక్షాలశక్తులను సమీకరించుటకు ఆమోదించి ఐక్యమై పోరాడినచో యిప్పటి కంటె మంచే ఫలితాలు లభించేవని, నష్టాలు తక్కువగా వుండేవని తలచుచున్నది.

"సమిష్టికార్యాచరణసమితి, ప్రభుత్వోద్యోగుల పెదరేషనులు సమస్యనువారి స్వంత సమస్యగానే పోరాట కాలమంతటా వుంచి ప్రజాసానుభూతిని పొందుటకు ప్రయత్నించకపోవుట పెద్దపొరపాటుగా వుంది. కేంద్రట్రేడు యూనియనులు వుద్యోగులకు మద్దతుగా. వారుకూడ తగినంత జాగ్రుతితో సామాన్యకార్మికులను, ప్రజలను సమీకరించి, సమస్య, పోరాటాన్ని అందరి సమస్యగా, పోరాటంగా వకాలంలో చేయ జాలకపోయారు.

"ఫిబ్రవరి 1960 జనరలు కౌన్సిలులో ఎఐటియుసి సమస్యను పరిశీలించింది కాని ప్రభుత్వోద్యోగుల స్వతంత్ర యూనియనులు నిర్ణయించవలసివున్నందునసమ్మె పిలుపును యివ్వలేదు. తన సానుభూతిపరులకు వుపయోగకరమైన [illegible]

మాత్రమే ఎ ఐ టి యు సి యివ్వగలిగింది. ఏప్రియల్, 2, 1960 కన్వెన్షన్‌లో వారు వొకరోజు సమ్మెను ప్రారంభంగా ప్రతిపాదించారు. అది చాల బలహీన కార్యక్రమంగా నెంచి ఆమోదించబడలేదు.

"సమ్మె తప్పని సరియని ! అనుకొనలేదు. చాలకాలం వరకు వుద్యోగుల సమస్యను కేంద్రం తీవ్రమైన సమస్యగా పరిగణలోనికి తీసుకొని తగినయేర్పాటు లన్నిటిని చేయలేదని ఎఐటియుసి అనుకొంటున్నది. జూన్ 29 వరకు యేమౌతుందనే అవగాహన ఎవ్వరికీలేదు. కాని సమిష్టి కార్యాచరణ సమితి సమావేశమై సమ్మె తేదీని జులై 12 వ తేదీగ నిర్ణయించి, సమ్మె నోటీసు యిచ్చింది. తీవ్రతను గమనించి సమ్మె యేర్పాటులను సమర్థవంతంగా చేసి వుండవలసింది. ఎ ఐ టి యు సి తాను చేయగలిగినదంతా చేయుటలోని వైఫల్యాన్ని అంగీకరించుతున్నది. అయితే తన కార్యకర్తలు సమ్మె కాలంలోని ఆచరణలను అభినందించుచున్నది. వందల కార్యకర్తలు అరెస్టు అయ్యారు. వారిలో యం. పీలు, యం. యల్. ఏలు, యూనియన్‌ల నాయకులు, ప్రెసిడెంటులు వున్నారు. ఎ ఐ టి యు సి యూనియనుల విజయాలను, పొరపాటులను సమీక్షించుకొని, భవిష్యత్తుకు వాటినుండి పాఠాలను నేర్చుకొని, పోరాటంలో నష్టపోయిన వారికి అన్ని విధాల తోడ్పాటు నిచ్చి, కార్మిక సంఘాల, ఉద్యోగుల సంఘాల హక్కులపై జరిగే దాడులనుండి సహజంగా రక్షణ కావించవలసి వుంది" [1] అని అఖిలభారతట్రేడు యూనియనుల కాంగ్రెసు వ్యాఖ్యానించింది.

నేడు ట్రేడు యూనియనుల ఐక్యత, సమిష్టి కార్యాచరణ గతంలో కంటె పురోగమించింది. పరిశ్రమ విస్తృతిలో ఐక్యకార్యాచరణ, కేంద్ర సంఘాలు ఏ మాత్రమూ ఐక్యతా మార్గాన్ని చేబట్టకపోయినా పోరాటాలు సాధ్యమగుచున్నవి. జీవన వ్యయం ఎక్కువగుట వేతనబోర్డుల నిర్ణయాలు అమలుకై సమిష్టి పోరాటాలను జరుపవలసిన అవసరం పెరుగుట, సమస్యలు పరిశ్రమ అంతటికీ సంబంధించినవగుట, కొన్ని జాతీయ సమస్యలుగా ముందుకొచ్చుట, వేతనాలు రక్షించుకొనవలసిన అవసరం, పెరిగే ధరలు, పన్నులు, సమిష్టి లేక ఐక్యకార్యాచరణ మార్గంలోనికి కార్మికులను, యూనియనులను త్రోసికొని వెళ్ళుతున్నవి. తాత్కాలికంగా సమస్యల నుండి సమస్య ప్రాతిపదికగా వొత్తిడి యొక్కువైంది. జులై 1960 ప్రభుత్వోద్యోగుల సమ్మె కాలంలో అత్యంత విస్తృత ఐక్యత ఒనగూడింది. వివిధ శాఖల ప్రభుత్వోద్యోగుల సంఘాల ఫెడరేషనులన్నీ ఒక కాన్ఫడరేషన్‌గా సమిష్టి పోరాటానికై సమిష్టి కార్యాచరణ సమితిగా ఏర్పడినవి.

---

1. రాజ్‌బహదూర్‌గౌడ్ (1961) కాంగ్రెసు రాజ్యంలో కార్మికులు (ఆంగ్లంలో) పే. 52.

కొన్ని ఫెడరేషన్‌లలో అభిప్రాయ భేదాలున్నాయి. కొన్ని ఫెడరేషనులలో ఐక్యకార్యాచరణ యెడల అఖిల భారత స్థాయిలో అభిప్రాయభేదాలున్నాయి. అటు రాష్ట్రాల స్థాయిలో కొన్ని సమస్యలపై సమిష్టి ఐక్యకార్యాచరణలో పాల్గొంటున్నవి. మరికొన్ని అఖిల భారత స్థాయి కలసి పోరాడ గలిగినా రాష్ట్ర స్థాయిలో ఐక్య కార్యాచరణలో పాల్గొనలేని భేదాలను కలిగివున్నవి. ప్రజాసోషలిస్టుపార్టీ నాయకులు నాయకత్వం వహించుతున్న ఫెడరేషనులలో యీ వైరుధ్యం స్పష్టంగా కన్పించు తున్నది. అందువలన కార్మిక సంఘాల ఐక్యత వంకరటింకరుల నదీ ప్రవాహంగా వుంది. ఎ. ఐ. టి. యు. సి., హెచ్. యం. యస్., యు. టి. యు. సి.లు ఎక్కడ కలిసి పనిచేస్తాయో, ఎక్కడ చేయజాలవో చెప్పజాలని పరిస్థితులలో కార్మికోద్యమం వుంది. కారణం ఐక్యత యొక్క నాయకులపైనే ఆధారపడిలేదు, వ్యూహం, ఎత్తు గడలపై ఆధారపడిలేదు. క్రింది వర్గాల ప్రజాసామాన్య అభిప్రాయాలు శక్తివంతమై నాయి. అగ్ర నాయకత్వం క్రింది ప్రజాసామాన్య ఉత్సుకతను గుర్తించలేనంతటి వారు కాలేదు. అగ్ర నాయకత్వం ప్రజాసామాన్యం యేకమైన స్థలాలలో, ప్రజా సామాన్యం మాత్రమే ఏకమైన స్థలాలలో వారు తమ వెంట నాయకులను లాక్కొని పోతున్నారు. కొన్ని ప్రాంతాలలో అగ్ర నాయకత్వంలో ఐక్యత యేర్పడి, మధ్య నాయకత్వాలలో ఐక్యత లేకుండుట, మరికొన్ని చోట్ల మధ్య నాయకత్వంలో ఐక్యత వుండి అగ్ర నాయకత్వంలో కొరవడుట కాన వస్తుంది.

కాన భారతదేశంలో కార్మిక సంస్థల ఐక్యత వివిధ రూపాలలోను, వంకర టింకరగాను, నిర్ణయించబడిన విధానాలకు, సూత్రాలకు, ఏ యొక్క నిర్మాణానికి అతీ తంగా వుండుట స్పష్టం. అనేక పర్యాయములు నాయకులు కొంతమంది ప్రజా సామాన్యాన్ని అర్థం చేసుకోలేని స్థితిని, మనదేశ ప్రత్యేక పరిస్థితిని అర్థం చేసు కొనలేని దశ యేర్పడుతుంది. మన కార్మికులలో, రైతులలో ముఖ్యంగా మన నూతన కార్మికవర్గం నుండి వచ్చేవారిలో చాల మార్పులు వస్తున్నవి, అభివృద్ధి కార్యక్రమాల లోనికి వస్తున్నారు. స్వాతంత్ర్యానంతరం యువ కార్మికవర్గం పొలాలనుండి త్రోసి వేయబడుటతో ఫ్యాక్టరీలలోనికి వచ్చింది. వర్గ పోరాటాలలో, ప్రభుత్వ, యాజ మాన్యాల జిత్తులలో అనుభవం లేదు, బ్రిటిష్ రోజులలోని అనుభవం కలిగిన వృద్ధు లలోని ఆరితేరిన, ఆర్థిక, రాజకీయ అన్ని రంగాలలో పోరాడిన అనుభవంలేదు. నేటి నిర్మాణంలో ఆరితేరిన వృద్ధులు తక్కువ. అందువలన ట్రేడు యూనియన్ ఐక్యత నూతనంగా, నూతన మార్గాలలో, నూతన అవగాహనలతో నిర్మించవలసి వున్నది. మరోసారి ట్రేడు యూనియన్ వృద్ధ నాయకత్వం కొత్త కార్మికవర్గ పరిభాషను, మాట తీరును, వారి వర్గ అనుభవాలను నూతన పదజాలంతో, మారిన పరిస్థితులలో తెలియపరచవలసి వుంటుంది. ఉద్యమంలో వేలకొలది కార్యకర్తలు, నాయకత్వం వస్తున్నపుడు స్నేహం, మాటలతీరు, ప్రవర్తన అన్నీ ఐక్యతకు తోడ్పడుతవి.

వారికి యింకా జాతీయ కర్తవ్యాలకు, వర్గ కర్తవ్యాలకు వున్న భేదం తెలియదు. అందువలన కార్మిక సంఘాల ఐక్యత, కార్మికవర్గ ఐక్యత అనూహ్య రూపాలలో ప్రత్యక్షమవుతుంది. వంకరటింకర మార్గమగుటలో ఆశ్చర్యంలేదు. పెరిగే ధరలు, తరిగే వేతనాలు, ప్రభుత్వపు, యజమాన్యాల నిర్లక్ష్యపై ఖరి కార్మికుల, ప్రజల వైఖరి, గుత్తపెట్టుబడిదారుల పరిమితిలేని లాభాలు, వాటిని కంట్రోలు చేయలేని ప్రభుత్వ వైఫల్యత. నాయకత్వాలపై ప్రజలలోగల దురభిమానాలను, సిద్ధాంత భేదాభిప్రాయాలను త్రోసిపేసి, ఐక్యకార్యాచరణకు ప్రజలను ముందుకు తీసుకెళ్ళుతున్నవి. కొన్ని వర్గాలు ఇండియా-చైనా సరిహద్దు వివాదాన్ని తెచ్చి గందరగోళపరచి, ఐక్య కార్యాచరణ భగ్నం చేద్దామనుకొన్న ప్రయత్నాలు సాగలేదు. ప్రభుత్వోద్యోగుల సాధారణ సమ్మెలో యిది స్పష్టమైంది.[1]

అఖిల భారత కిసాన్ సభ రెండున్నర దశాబ్దాల నుండి వ్యవసాయ సంస్కరణలుకు, జమిందారీ, జాగిర్దారీ రద్దుకు రైతాంగ పోరాటాలు సాగించుతున్నది. స్వాతంత్ర్యానంతరం, 14 సంవత్సరాలలో అనేక రైతు పోరాటాలు జరిగాయి. కాంగ్రెసు ప్రభుత్వం అనేక వ్యవసాయ సంస్కరణలు కావించామని ప్రచారం చేస్తున్నది. నేషనల్ శాంపుల్ సర్వే 8వ, విడత నివేదిక యీ చట్టాల అసలు రంగు బయట పెట్టింది. వ్యవసాయ భూముల కేంద్రీకరణపై యీ క్రింది నిర్ధారణలు చేసింది.[2]

"భారతదేశంలో 22 శాతం కుటుంబాలు భూమి ఏమీ లేనివి. కొన్ని రాష్ట్రాలలో 22-31 శాతం భూమిలేని కుటుంబాలు వున్నవి.

"గ్రామీణ భారతదేశంలో 47 శాతం కుటుంబాలు, 1 ఎకరం లోపు భూమిని కలిగివున్నా, మొత్తం భూమిలో 1 శాతం భూమిని కలిగి వున్నారు."

"భూమిలేని వారు, 5 ఎకరములకు తక్కువగా కలిగిన వారు 74 శాతం కుటుంబాలు, మొత్తం వ్యవసాయ భూమిలో 16 శాతం భూమిని కలిగి వున్నారు."

"ఇంకా, రెండున్నర శాతపు కుటుంబాలు 30 ఎకరములకు లోపుగా గలవారు మొత్తం భూమిలో 28 శాతము కలిగి వున్నారు."

"అంతేగాక, 40 ఎకరాలు పైగా వున్న 1 శాతము కుటుంబాలు మొత్తం భూమిలో 5 వ వంతున అనగా 20 శాతం కలిగి వున్నారు."

ఇది, అత్యధిక మెజారిటి కుటుంబాలు అతి చిన్న భూ ఖండాలను, మొత్తం భూమిలో కొద్ది శాతం మాత్రం కలిగి వుండగా, అత్యల్ప మైనారిటీ పెద్ద భూ ఖండాలను కలిగి మొత్తం భూమిలో అధిక భాగాన్ని కలిగి వున్నారు.

---

1. డాంగె, యస్. ఎ. (1961) కోయంబత్తూరు ఎ ఐ టి యు సి, 25 వ మహాసభ నివేదిక (ఆంగ్లంలో) పే. 56-57.
2. అఖిల భారత కిసాన్ సభ, 18 వ మహాసభ, త్రిచూర్, 1961 నిర్ణయాలు (ఆంగ్లంలో) ఎ ఐ కె యస్ సంచికలో పే. 10.

## పంజాబ్ రైతుల లెవీ వ్యతిరేక పోరాటం :

కిసాన్‌సభ అభివృద్ధి లెవీని రద్దు చేయమని అనేక తీర్మానాలుచేసింది. పంజాబ్ కిసాన్‌సభ అధ్వర్యలలో మోయలేని యీ భారానికి వ్యతిరేకంగా సత్యాగ్రహ పోరాటం జరిగింది. ప్రభుత్వం 45 రోజులలో 19 వేల రైతు సత్యాగ్రహులను అరెస్టు చేసింది. రైతాంగంలోని అన్నివర్గాలు యీ పోరాటానికి మద్దతునిచ్చి పాల్గొన్నారు. కాంగ్రెసు, అకాలీ, కమ్యూనిస్టుపార్టీల కార్యకర్తలు పాల్గొన్నారు. రాజకీయపార్టీల లోని కొందరు ప్రముఖవ్యక్తులు, గ్రామపెద్దలు, సర్‌పంచలు, సభ్యులు సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు అయ్యారు. రైతు స్త్రీలు ప్రముఖపాత్ర వహించారు.

పంజాబులో నీటిపారుదల క్రింద పన్నులు, శెస్సులు అన్నీ కలసి యకరానికి 1959లో రు 20లు వున్నాయి. ఈ అభివృద్ధిలెవీ 6 మాసాలస 10రు చొ॥న 30 కిస్తీలలో రు 300లు యకరానికి కట్టవలసి వుంటుంది, భాక్రా-నంగల్ ప్రాజెక్టు వుత్పత్తి శక్తి పెట్టుబడిపై లాభసాటిగానే వుంధి. పంజాబ్‌ప్రభుత్వం రైతాంగపు విన్నప వివరాలను విన నిరాకరించినందున తప్పనిసరిగా కిసాన్ సభ సత్యాగ్రహాన్ని చేబట్టవలసి వచ్చింది. ఈ పోరాటాన్ని అణచివేయుటకు కనీ వినీ ఎరగని దమనకాండను సాగించింది. ప్రతిరోజు శాంతియుత సత్యాగ్రహులపై లాఠీచార్జీలు చేసింది. సత్యాగ్రహులపై అపరాధాన్ని వేసారు. భయోత్పాతాన్ని కలుగజేసి, అభివృద్ధిలెవీని, అపరాధపన్నును వసూలు చేయుటకు అనేకచోట్ల కాల్పులకు పొందిగట్టారు. మగవాళ్ళ 7 గురు ఆడవాళ్ళు 3 గురు చనిపోయారు, 24 మందికిగాయాలు తగిలాయి. రాష్ట్రంలో అప్రకటిత మార్షల్‌లా అమలు చేయబడింది వీరోచితమైన యీ పోరాటం ఎంత దమనకాండ సాగించినా, ప్రభుత్వం అభివృద్ధి లెవీని వసూలు చేయలేకపోయింది. ఈ ఐక్యపోరాట ఫలితంగా యీ 104 కోట్ల రూపాయలలెవీ మొత్తాన్ని 42 కోట్లరూపాయలకు తగ్గించుతూ. ఆయకట్టు అభివృద్ధి చెందిన ప్రాంతాలలోనే లెవీ వసూలు చేయుటను ప్రకటించింది. కిసాన్‌సభ రైతులకు తమ ఐక్యతను బలాన్ని, లెవీ వ్యతిరేకతనూ కొనసాగిస్తూ, లెవీని పూర్తిగ రద్దు చేయు వరకు పోరాటాన్ని కొనసాగించాలని విజ్ఞప్తి చేసింది.

కేంద్రకాంగ్రెసు నాయకత్వం, చీఫ్‌మినిష్టరు పంజాబు, కేంద్రకమ్యూనిస్టు పార్టీ, కిసాన్ సభల నాయకత్వాలతో పోరాట విరమణకు వివిధ ప్రతిపాదనలు కావించారు. కేంద్రపార్టీ, కిసాన్‌సభల నాయకత్వాలు ప్రజల వుత్సాహాన్ని సరిగా అంచెనా వేయజాలకపోయారు. నిర్బంధ, దమనకాండలకు భయపడ్డారు. ప్రభుత్వ కాంగ్రెసునాయకుల వుచ్చులో పడిపోయారు. పోరాట కమిటీని సంప్రదించకుండా పోరాటాన్ని విరమించుతు ప్రకటన గావించారు. ఇది ఎవ్వరుఊహించనిది. వాస్తవానికి 19వ, తేదీన, పోరాట కమిటీ నిర్ణయాల ననుసరించి, కాంగ్రెసు నాయకుల వలలో పడవద్దని స్థానిక నాయకత్వం హెచ్చరించింది. చీఫ్ మినిష్టర్ తిరిగి 20వ తేదీన

ఆ ప్రతిపాదనతో, పోరాట కమిటి నాయకులతో స్పీకరుద్వారా ప్రయత్నించిన పుడు, ఆ ప్రతిపాదనలను తిరస్కరించారు.

"కిసాన్ సభకార్యకర్తలలో విచ్ఛిన్న ప్రమాదముంది, రైతాంగపు ఐక్యతపై దెబ్బతగులుతుంది. పోరాటంలో యేర్పడిన ఐక్యత ప్రమాదంలో పడింది. ఉద్యమానికి విరమణ పెద్ద వెనకడుగు. పోరాటకమిటీ కొన్ని నిర్ణయాలు తీసుకొననిచో రైతాంగ వుద్యమం పెద్ద విద్రోహానికి గురి కావలసివచ్చేది.

"పోరాట కమిటి పరిస్థితిని సమీక్షించి, వాగ్దానాలను పరగణించి, ప్రభుత్వం కేంద్ర నాయకులకు యిచ్చిన వాగ్దానాలను అమలుచేయనిచో, కోతల అనంతరం పోరాటం తిరిగి ప్రారంభించబడుతుందని ప్రకటించింది. కిసాన్ సభ అభివృద్ధిలెవీ సత్యాగ్రహపోరాన్ని 22 మార్చి, 1959న, గవర్నరు, నీటిపారుదల శాఖమంత్రి, స్పీకరులు చేసిన అనేక విజ్ఞప్తులకు ప్రతిస్పందించి,సంప్రదింపుల ద్వారా పరిష్కరించుటకుతగిన వాతావరణాన్ని సృష్టించుటకు,విరమించుట వాస్తవం.మార్చి 21న కామ్రేడ్స్ అజయ్ ఘోష్, ప్రసాదరావులు, పండిట్ రాంకిషన్ బిదోతియాలు చీఫ్ మినిష్టరును కలిసినపుడు, తిరిగి లెవీని గణనీయంగా తగ్గించగలవని, చెల్లించవలసిన వాయిదాలను దీర్ఘకాలానికి పొడిగించుతావని, అన్ని నిర్బంధచర్యలు ఆపివేయబడుతాయని, స్పష్టమైన వాగ్దానం చేసారు. వారి సలహా మేరకు మార్చి 22న పంజాబ్ కిసాన్ సభ వుద్యమాన్ని విరమించింది. మార్చి 22న యిచ్చిన ప్రకటనలో విజ్ఞప్తులు, ప్రార్థనలకు స్పదించి, పంజాబ్ కిసాన్ సభ సత్యాగ్రహ వుద్యమాన్ని వుపసంహరించుటకు నిర్ణయించిందని స్పష్టంచేసింది.[1]".

పశ్చిమబెంగాలులో రైతాంగ పోరాటం సీలింగుపై అధికంగావున్న భూములపై ప్రధానంగా కేంద్రీకరించబడింది. గరిష్ట పరిమితి 25యకరములుగ నిర్ణయింపబడినది. పరిమితికిమించిన భూములను రైతులకు పంచక, ఆయా భూస్వాముల సాగులోనే వుంచింది. భూస్వాములు చట్ట వ్యతిరేకముగ పంపకాలు, బినామి ట్రాన్స్‌ఫరులు చేయుటజరిగింది. మూడు సంవత్సరాల నుండి పాలు కౌలుదారులు పరిమితికిమించిన భూముల పంటను తమ స్వాధీనంలోనే వుంచుకొనుటను కిసాన్ సభ నాయకత్వంలో, భూస్వామి భాగాన్ని ప్రభుత్వాన్ని తీసుకొనమని ఆందోళన చేస్తున్నారు. ప్రభుత్వం సూత్రప్రాయంగా ఆమోదించినా, రైతులపై నిర్బంధం సాగుతూనేవుంది. మరోవైపు భూస్వాములు దౌర్జన్యంగా పంటను స్వాధీనం చేసుకొంటున్నారు.

కేరళలో భూసంస్కరణలకై అతి పెద్ద వుద్యమం 1961లో కర్షక సంఘం అధ్వర్యంలో జరిగింది. కమ్యూనిస్టు రాష్ట్రమంత్రి వర్గాన్ని రదు చేసిననాటి నుండి

1. సూర్జిత్, హరికిషన్ సింగ్ (1966) పంజాబులో బెటర్‌మెంట్ లెవీ వ్యతిరేక పోరాటం (ఆంగ్లంలో) గోల్డెన్ జూబిలీ ఎఐకెయస్ పబ్లికేషన్ నం. 4. పే. 14-15.

వ్యవసాయ బిల్లును సవరణలతో నీరుకార్చుతున్నారు. ప్రభుత్వంపై వొత్తిడితెచ్చి బిల్లుకు ప్రసిడెంటు ఆమోదంకై రైతుల ఆందోళన సాగుతున్నది. రైతుల, అగ్ర నాయకుల పాదయాత్రాదళాలు పార్టీని వుద్యమానికి బలాన్ని చేకూర్చాయి. తమిళ నాడులో భూసంస్కరణలకై పదయాత్రాదళాలు ప్రచారం సాగించాయి.

బీహారులో ఆహార సంక్షోభంతో జూన్ 1960లో సామూహిక నిరాహార దీక్షలు, అసమ్మతి సభలు, ప్రదర్శనలు జరిగి, ఆహారపదార్థాలను తక్కువధరలకు ప్రభుత్వషాపులలో సప్లయి చేయాలని ఆందోళన సాగించారు ధర్భంగా, ముజఫర్ పూర్, సిహర్మాలలో రైతులు నిరాహారదీక్షలలో పాల్గొన్నారు. ఉద్యమం ప్రభుత్వ షాపులలో ఆహారధాన్యాల సప్లయికి వాగ్దానాలు పొందింది.

రాజస్తాలో గకగానగర్ జిల్లాలో సంస్థాన సర్కారీ భూములకై తీవ్రరైతు వుద్యమం సాగింది. ప్రభుత్వం యీ భూములలో 48,000 భాగాల భూమిని యాంత్రిక వ్యవసాయ క్షేత్రానికి కేటాయించింది. 9000 భాగాలు అటవీశాఖక్షేత్రంగా కేటాయించింది. మిగతా భూములను వేలం పెట్టి అమ్మనెంచింది. దీనికి వ్యతిరేకంగా రైతులు భూములను పంచాలనే ఆందోళనను, నిర్బంధాలకు నిలబడి కొనసాగించారు.

ఈ కార్మిక, కర్షక పోరాటాలను, సమస్యలను రైతాంగం వారి సమస్యలలో వివిధ పోరాట రూపాలను బీజప్రాయంగా తెలుసుకొనుటకు, పార్టీలోని వివిధ ఆలోచనా విధానాలకు మౌలికమైనవిగా, అవగాహనలకు నమూనాగా కొన్నిటిని మాత్రమే యివ్వటం జరిగింది.

# II

## సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన

భారతకమ్యూనిస్టుపార్టిలో 1946 నుండి అంతర్గత సిద్ధాంత పోరాటం జరుగుతున్నది. అమృతసర్ 1958 పార్టీ కాంగ్రెసు ప్రధానంగా నిర్మాణ సమస్యలనే చర్చించింది. పార్టీలోని భేదాభిప్రాయాలు కొనసాగుటు, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో 1957 నుండి మొలకెత్తిన భేదాభిప్రాయాలతో మరింత తీవ్రస్థాయికి చేరాయి.

### 1. మాస్కో 1957 ప్రకటనపై భేదాభిప్రాయాలు

మాస్కో ప్రకటన స్ఫూర్తితో మారిన పరిస్థితులలో నూతన ప్రపంచ అవతరణను పరిగణలోనికి తీసుకొని శాంతిపధంలో సోషలిస్టు విప్లవం విజయం పొందు

టన తగిన వాతావరణాన్ని కలుగజేయుటకు, అమృత్‌సర్ పార్టీ కాంగ్రెసు, పార్టీ నిర్మాణ మార్గదర్శక సూత్రాలలో "పూర్తి ప్రజాస్వామ్యాన్ని, సోషలిజాన్ని శాంతియుత మార్గాలలో సాధించుటకు భారత కమ్యూనిస్టుపార్టీ ప్రయత్నం చేస్తుంది. బలమైన ప్రజావుద్యమాన్ని పెంపొందించుట ద్వారా, పార్లమెంటులో మెజారిటీ సంపాదించుటద్వారా, దానిని ప్రజాసమ్మతితో బలపర్చుటద్వారా కార్మికవర్గమూ దానిని బలపరచే మిత్రులూ అభివృద్ధి నిరోధకశక్తుల ప్రతిఘటనను అధిగమించి,ఆర్థిక,సాంఘిక రంగాలలోను, రాజ్యాంగ యంత్రంలోను ప్రాథమికమైన మార్పులు తెచ్చుటకుగాను, ప్రజాభిప్రాయాన్ని అమలుజరిపే సాధనంగా పార్లమెంటును తయారుచేస్తుంది" అనే నూతనాంశాన్ని చేర్చారు. ఈ ప్రధానమైన మార్పు అత్యంత తీవ్ర వివాదాంశమైనదనుటకు, తదనంతర పార్టీ అంతర్గత పోరాటంలో తిరిగి తిరిగి లేవనెత్త బడుటను బట్టి స్పష్టమౌతుంది. అమృత్‌సర్‌పార్టీ కాంగ్రెసు మాస్కో ప్రకటనను ప్రధానంగా ఆమోదించింది. రాజకీయతీర్మానంలో పార్టీ విధానాన్ని ఎత్తుగడలను స్పష్టంచేయుటతో పాటు, నిర్మాణసూత్రాలలో ఆమోదించిన సవరణలను, పార్టీయేతరవర్గాలు, నూతన దృక్పథంగా హర్షించాయి.

చైనా కమ్యూనిస్టు ప్రతినిధివర్గం 1963 మాస్కో సమావేశంలోనే మావో నాయకత్వంలో సమావేశంలోనే సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సమితికి, తమ అనంగీకారాన్ని తెలియజేస్తూ సంక్షిప్త పత్రాన్ని "శాంతియుత పరివర్తన"పై సమర్పించింది. ఈ పత్రం చర్చించినట్లు కన్పించదు. పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి పరివర్తన "శాంతియుత" మార్గాన్నేకాక "శాంతియేతర మార్గాన్ని" కూడ ఉదహరించుటతో రాజకీయ చొరవ మన చేతులలోనే వుంటుందని చైనా పార్టీ తెలిపింది. శాంతియుత పంథా కోరదగినదే అయినా స్వరక్షణకు శాంతియేతర మార్గాన్ని అవసరమైన వినియోగించే అవకాశాన్ని కోల్పోరాదన్నది. పెట్టుబడిదారి దేశాలలో కమ్యూనిస్టుపార్టీలపై బూర్జువావర్గం దాడి చేసే అవకాశం లేకుండా చేసి, ప్రజాసామాన్యాన్ని సమీకరించే రాజకీయ చొరవను కమ్యూనిస్టులకు వుంటుంది.

ఏ దేశంలోనయినా శాంతియుత పరివర్తనకు తగిన దేశీయ, అంతర్జాతీయ పరిస్థితులు ఏర్పడిన, ప్రజా సమీకరణ బలంతో శాంతి మార్గంలో రాజ్యాధికార సమస్యను పరిష్కరించవచ్చు. అంతేకాని, శాంతియుత పరివర్తన మార్గానికి కట్టుబడి వుండరాదు. బూర్జువావర్గం స్వచ్ఛందంగా చారిత్రికాధికార దశనుండి నిష్క్రమించదు. ఇది వర్గ పోరాట విశ్వజనీన సూత్రం. కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ ఎప్పుడూ విప్లవ మార్గాన్ని విడనాడదు. విప్లవ ప్రతీఘాతక శక్తుల ప్రతిఘటన, దాడులను త్రిప్పికొట్టుటకు సర్వసన్నద్ధంగా వుండాలి. కార్మికవర్గం విప్లవ సంక్షోభ పరిస్థితులలో రాజ్యాధికారాన్ని చేబట్టినపుడు, బూర్జువావర్గం సైనికశక్తితో విప్లవాన్ని రక్తపుటేరులలో ముంచెత్తే చివరి ప్రయత్నం చేయునపుడు విప్లవశక్తులు

అన్ని విధాల ఆయుధాలతో కూడ విప్లవాన్ని సంరక్షించగలగాలి. శాంతి, శాంతియేతర మార్గమా అని నిర్ణయించవలసింది బూర్జువావర్గమే. కమ్యూనిస్టులు సర్వదా అన్నింటికి సంసిద్ధులై వుండాలి.

నేటి అంతర్జాతీయ పరిస్థితులలో శాంతియుత పరివర్తనావకాశాలను ఉదహరించుటలో ఎత్తుగడల సౌలభ్యమున్నది కాని, శాంతియుత పరివర్తనను నొక్కి చెప్పుట కమ్యూనిస్టులను నిరాయుధులను చేస్తుంది. అంతేగాక చైనా పార్టీ తమ అనంగీకారానికి 1) అవకాశం, కోరిక, వాస్తవాలను వేరుపేరుగా చూడాలి. శాంతియుత పరివర్తనను ఉదహరించుదాము, నొక్కి చెప్పము. శాంతియుత పరివర్తనతో పాటు శాంతియేతర మార్గాన్ని ఉదహరించాలి. 2) శాంతియుత పరివర్తనను, రాజ్యాంగ సభలో మెజారిటి సంపాదించి, అధికారాన్ని స్వీకరించుటను నొక్కి చెప్పుట, కార్మికవర్గ పార్టీని నిరాయుధులను చేస్తుంది. 3) పెట్టుబడిదారి సమాజం సోషలిజం లోనికి శాంతియుత పరివర్తన చెందిన ఉదాహరణ ఒక్కటీ లేదు. ఎక్కడయినా అట్టి అవకాశాలున్న కమ్యూనిస్టులు తప్పనిసరిగా ప్రయత్నిస్తారు. అదే కాలంలో సర్వసన్నద్ధులై వుంటారు. 4) శాంతియుత పరివర్తనను నొక్కిచెప్పుట, బూర్జువా అభ్యుదయ నిరోధక సైన్యాన్ని బలహీనపరచుటుగాని, అప్రమత్తులను చేయదు. 5) సోషల్ డెమోక్రటిక్ పార్టీలను విప్లవాత్మకం చేయదు. 6) కమ్యూనిస్టుపార్టీలను బలపరచకపోగా విప్లవ లక్షణాలను కోల్పోయి నిర్వీర్యులగునట్లు చేస్తుంది. ప్రజలను గందరగోళ పరస్తుంది. 7) పార్లమెంటరీ పోరాట రూపాన్ని పూర్తిగా, సమర్థవంతంగా వినియోగించాలి. దాని పరిమిత పాత్రను మరువరాదు. విప్లవ పోరాట పటిమను పెంపొందించుట ముఖ్య కర్తవ్యం అని కారాణాలను పేర్కొంది. [1]

పార్లమెంటులో మెజారిటి సంపాదించుట, ప్రభుత్వ యంత్రాంగాన్ని సైనిక శక్తిని నిర్వీర్యచేయుట, నూతన రాజ్యాంగాన్ని, సైనికశక్తిని నిర్మించుట ఒకటికాదు బూర్జువా సైనిక, బూరాక్రటిక్ పాలక యంత్రాంగాన్ని ధ్వంసం చేయకుండా, కార్మిక వర్గ పార్లమెంటరీ మెజారిటి, మిత్రులు లభించుట అసాధ్యం. ఆధారపడ తగినది కాదు. చైనా అనుభవం, బూర్జువావర్గం తన ఆధిక్యతను నిలబెట్టుకొనుటకు రాజ్యాంగ పట్టాన్ని సవరించుతుంది, ఎన్నికలు చెల్లవని ప్రకటిస్తుంది, పార్లమెంటును రద్దు చేస్తుంది, చివరకు కమ్యూనిస్టుపార్టీని నిషేధిస్తుంది అని వివరించింది.

---

ఎడిటోరియల్ (1963) పీపిల్సు డెయిలీ, శాంతియుత పరివర్తన (అంగ్లంలో) అనుబంధంగా చేర్చబడినది. చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం, సోవియట్ పార్టీ కేంద్ర సమితికి, మాస్కో సమావేశంలో 10 నవంబరు 1957 న సమర్పించిన సంక్షిప్త వ్రాత ప్రతి.

శాంతియుత పరివర్తనము, పార్లమెంటరీ మెజారిటీ పరివర్తనగానే వ్యాఖ్యానించరాదు. ప్రధాన సమస్య ప్రభుత్వ రాజ్యాంగ యంత్రాన్ని స్వాధీనం చేసుకొనుట. బ్రిటన్‌లో సైనికతత్వం, బూరాక్రటిజం అంత ప్రాముఖ్యత వహించనందున మార్క్సు 1870 లో సోషలిజాన్ని శాంతి మార్గంలో సాధించగల అవకాశాలున్నవనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. లెనిన్ ఫిబ్రవరి విప్లవానంతరం, ప్రజలు సాయుధులై వున్నందున "సోవియట్‌కే సర్వాధికారాలు" అనే నినాదాన్నిచ్చి, విప్లవం శాంతి మార్గంలో పురోగమిస్తుందని ఆశించాడు. మార్క్సుగాని, లెనిన్‌గాని పాత రాజ్యాంగ యంత్రాంగాన్ని ఉపయోగించి, శాంతియుత పరివర్తన సాధ్యమని చెప్పలేదు. "కార్మికవర్గం తయారుగ వున్న ప్రభుత్వ యంత్రాంగాన్ని యధాతధంగా చేబట్టి తన కార్యక్రమానికి వినియోగించజాలదని" మార్క్సు, ఏంజెల్సుల ప్రముఖ ప్రపంచనాన్ని, లెనిన్ పదేపదే వివరించారు.

సోషలిస్టు డెమోక్రటిక్ పార్టీలు సోషలిస్టు పార్టీలు కావు. వాటిలోని కొన్ని అతివాద వర్గాలు మినహా, బూర్జువావర్గానికి, పెట్టుబడిదారీ విధానానికి సేవచేస్తాయి. సోషలిస్టు విప్లవ సమస్యలలో కమ్యూనిస్టుపార్టీలు, సోషల్‌డెమోక్రటిక్ పార్టీలు మౌలికంగా భిన్నమైనవి. ఈ భేదాన్ని కప్పిపెట్టుట, ఆ పార్టీలు ప్రజలను మోసబుచ్చుటకు సహాయపడుటయే. ఏమైనా యీ పార్టీలలోని అతివాద, తదితరవర్గాలతో ఐక్యసంఘటనకై ప్రయత్నించాలి.

ఈ వైఖరిని అనేక కారణాల వలన, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ కాంగ్రెసులో, తరువాత వివరించలేదని, యిప్పుడు సంయుక్త ప్రకటన కారణంగా స్పష్టం చేస్తున్నామని "చైనా కమ్యూనిస్టుపార్టీ తెలిపింది. అంతర్జాతీయ ఐక్యతకై సంతకం పెట్టింది. చైనా పార్టీ తన వైఖరి పత్రాన్ని సమర్పించినా ఆ సమావేశం చర్చించినట్లు కనిపించదు. రెండు పార్టీల అంతరంగిక సమస్యగానే వుండిపోయింది.

## 2) భారత-చైనా సరిహద్దు సమస్య :

భారతదేశం 1947లో స్వాతంత్ర్యాన్ని సంపాదించింది. చైనా 1949లో జనతా ప్రజాస్వామ్యంగా అవతరించింది, భారత ప్రభుత్వం చైనాను అధికారికంగా అదే డిశెంబరులోనే గుర్తించింది. ఐక్యరాజ్యసమితిలో ఎదురుతెగకుండా చైనా స్థానాన్ని పునరుద్ధరించువరకు సామ్రాజ్యవాద దేశాలతో పోరాడుతునేవుంది.

స్వాతంత్ర్యానికి పూర్వం. భారతవ్యాపార ప్రతినిధులకు టిబెట్‌లో కొన్ని ప్రత్యేక హక్కులను కలిగివున్నారు. అవే భారతదేశానికి వారసత్వంగా లభించాయి. వారు బ్రిటిష్ ఇండియా పౌరులు టిబెట్‌లో వ్యాపార, తదితర తగాదాలు వచ్చిన టిబెటన వ్యాయవట్టాల ననుసరించి గాక, భారతదేశ చట్టాలననుసరించి విచారించబడు

శారు. వ్యాపార ప్రతినిధులు వారి రక్షణకు, బ్రిటిష్‌వారిపౌరుల రక్షణకు సైనిక అనుచరులను కలిగి వుండవచ్చు. గాంటాంగ్ యాటుంగ్ గియాట్సేట్స్‌లకు స్వంత టెలిఫోన్ టెలిగ్రాఫ్‌లను యాటుంగ్ షారీ గియాంట్స్‌లలో స్వంత తపాలా, టెలిగ్రాఫ్ ఆఫీసులను కలిగివుండవచ్చు. భారతప్రభుత్వం కూడ 11 స్వంత విశ్రాంతి భవనాలను టిబెట్‌లో కలిగివుంది. ఒకప్పటి బ్రిటిష్ ప్రభుత్వంకు గల ప్రత్యేక హక్కులు భారతదేశానికి స్వాతంత్ర్యంతో పాటు లభించాయి. భారత-టిబెట్‌ల మధ్య ఏప్రిల్ 1954లో జరిగిన వ్యాపార, పరస్పర సంబంధాల ఒడంబడికలో భారతదేశం యీ ప్రత్యేక హక్కులు వదలుకొని, టిబెట్ చైనాలో భాగంగా గుర్తించింది. ఒడంబడిక ధ్యేయంలో "పంచశీల సూత్రాలు"-పరస్పర దేశాల ప్రాదేశికత్వాన్ని, సార్వభౌమాధికారాన్ని గుర్తించుట, పరస్పరం దురాక్రమణ చేయకుండుట, అంతరంగిక విషయాలలో పరస్పరం జోక్యం కలుగజేసుకొనకుండుట, సమానత్వం, పరస్పరలాభప్రదమైన శాంతి, సహజీవనములను ఆచరించుట ఆశయాలుగ ప్రకటించారు. అపరిష్కృత సమస్యలులేవని, భవిష్యత్తులో వచ్చే సమస్యలను పరస్పర సుహృద్భావంతో పరిష్కరింపబడగలవని ఆశించారు.

భారతప్రభుత్వం ఆగస్టు 1950లో సరిహద్దులలో అనిశ్చిత పరిస్థితులు తమకు ఆందోళన కలిగిస్తున్నవని, చైనా-టిబెట్ సంబంధాలను శాంతి సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొనాలని కోరింది. చైనా ఆమోదాన్ని తెల్పుతూ, చైనా-భారతదేశ సరిహద్దులను స్థిరీకరించుట తమ కోరికయని 2 ఆగస్టున చైనా ప్రభుత్వం ప్రకటించింది. భారత ప్రభుత్వం 24 ఆగస్టున టిబెట్ యెడల చైనా వుద్దేశ్యాలను హర్షించుతు, భారతదేశం-టిబెట్ మధ్యగుర్తించబడిన సరిహద్దు అదేవిధంగా స్థిరీకరణ అగుతుందని వ్రాసింది. భారత ప్రతినిధి ఐక్యరాజ్యసమితిలో 19 సెప్టెంబరున, ప్రజా ప్రభుత్వం సమితిలో చైనాకు ప్రాతినిధ్యం వహించాలని కోరింది. చైనా సైన్యాలు అక్టోబరు 7 న, టిబెట్‌లో ప్రవేశించాయి. భారతప్రభుత్వం అక్టోబరు 21 న, టిబెట్‌లో చైనాసైనికచర్యలు, ఐక్యరాజ్యసమితిలో చైనా ప్రభుత్వానికి సభ్యత్వాన్నిచ్చుట వాయిదా పడగలదేమో ఆలోచించమని చైనాను కోరింది. చైనా ప్రభుత్వం అక్టోబరు 30, న భారతప్రభుత్వం టిబెట్‌లో చైనా వ్యతిరేక విదేశ శక్తుల ప్రభావాలకు లోనైందని విమర్శించింది. భారత ప్రభుత్వం నవంబరు 1, న చైనా నిందలకు ఆశ్చర్యాన్ని తెల్పి, సమస్య శాంతియుత పరిష్కారాన్ని మాత్రమే తాము కోరుతున్నామని పేర్కొంది.

ఐక్యరాజ్యసమితి జనరలు అసెంబ్లీలలో, కొరియాపై చైనా దురాక్రమణదారుగ పేర్కొనబడిన తీర్మానానికి వ్యతిరేకంగా భారతదేశం 1951 ఫిబ్రవరిలో వోటు చేసింది. శాన్ ఫ్రాన్సిస్కో సెప్టెంబరులో 49 దేశాలు జపాన్‌తో శాంతి ఒడంబడిక సంతకాలు సమావేశానికి, యితర కారణాలతో పాటు, చైనా రిపబ్లిక్ ఆ సమావేశంలో భాగస్వామి కానందున భారతదేశం పాల్గొన నిరాకరించింది. ఐక్య

రాజ్యసమితిలో 25 అక్టోబరు 1952న భారతదేశం, చైనా ప్రతినిధిగా ప్రజా రిపబ్లి కన్ ప్రభుత్వమే అర్హతగలదని పునరుద్ఘాటించింది. ఐక్యరాజ్య సమితిలో కొరియా-యుద్ధ ఖైదీల సమస్యపై భారతదేశం ప్రవేశపెట్టిన తీర్మానం, చైనా దృక్పధాన్ని తెలుపుతుందని ప్రధాని నెహ్రూ 15 మే 1953న ప్రకటించారు. తీర్మానం అత్యధిక మెజారిటీతో ఆమోదించబడింది. సమితి తీర్మానాన్ని సరిగా అమలుపెట్టుటకు తటస్థ రాజ్యాల ఖైదీల మార్పిడి కమిషన్ యేర్పడింది. భారతదేశం కమిషన్ అధ్యక్షునిగా ఆమోదించింది. ప్రజా చైనా ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వాన్ని ఆమోదించాలని 28 సెప్టెంబరు 1953న భారతదేశం కోరింది. భారత్ చొరవతో 31 డిశెంబరు 1953న, భారత-టిబెట్ సంబంధాలపై సంభాషణలు పెకింగులో ప్రారంభించబడినవి. అపరిష్కృత, వారసత్వ సమస్యలు పరిష్కారమైతే స్నేహ, సహకార సంబంధాలు బలపడుతవని ఆశించి భారత్ యీ చొరవను తీసుకొంది. భారత్-టిబెట్ పరస్పర వ్యాపారసంబంధాలు వొప్పందంపై సంతకాలు 29ఏప్రిల్ 1954 న జరిగాయి. భారత దేశం, బ్రిటిష్ వారసత్వం నుండి లభించిన ప్రత్యేక అధికారాలను వదులుకొని, టిబెట్ చైనాలో వొక ప్రాంతంగా గుర్తించింది.

చైనా ప్రధాని చౌయెన్ లై జూన్ 25న భారతదేశంలో సౌహార్ధయాత్రకు వచ్చాడు. భారత చైనా ప్రధానులు సంయుక్త ప్రకటన చేసారు. పంచశీల సూత్రాలను పునరుద్ఘాటించుతు "వివిద దేశాలమధ్య యీ సూత్రాలను అనుసరించుటయేగాక అంతర్జాతీయ సంబంధాలలో సాధారణంగా శాంతి, రక్షణలకు నేడు ఆవరించిన భయాందోళనలు తొలగి సుస్థిర పునాదులు యేర్పడగలవు ప్రధానమంత్రులు భారత చైనాల మైత్రిపై విశ్వాసాన్ని వెలిబుచ్చి అదే విశ్వశాంతికి, రెండుదేశాలు శాంతి యుతంగా అభివృద్ధి చెందుటకు, అదేవిధంగా ఆసియాలోని అన్నిదేశాలకు తోడ్పడ గలదు[1]" అన్నారు.

ఉత్తరప్రదేశ్‌లోని బారాహోతి (చైనీయులు వూజె అంటారు) లో భారత సైన్యాల వునికిని, చైనా ప్రభుత్వం జులై 7, న గర్హించింది. భారత భూభాగంలోని యే భూ భాగంలోనైనా మొట్టమొదటసారిగా తమ హక్కును ప్రప్రధమంగా చెప్పుట యిదే. ఏది సాంప్రదాయ హద్దు అనే విషయంలో యెట్టి అసంగ్దితలేదు, చైనా ప్రభుత్వానికి అది తెలుసు. ఈ సరిహద్దులను అధికారమ్యాపులు చూచించుతునే వున్నవి. సరిహద్దులవరకు శతాబ్దాలనుండి, భారత అధికారుల ఆధిపత్యంలోనే వున్నవి. భారతరాజ్యాంగ చట్టం యిట్టివి అనేకమైన వాటిని పేర్కొన్నది. భారత సరిహద్దులపై 1950లో భారత ప్రధాని స్పష్టమైన అధికార ప్రకటన గావించారు.

---

1. ఇండియా-చైనా సంబంధాల ముఖ్యఘట్టాలు. 1947-1962. విదేశప్రచారశాఖ, విదేశాంగ మంత్రిత్వశాఖ, భారతప్రభుత్వం. న్యూఢిల్లీ (ఆంగ్లంలో) పే. 4లోని వుదహరింపు.

చైనా ప్రభుత్వం 1954లో సరిహద్దు సమస్యలను లేవనెత్తకపోగా, భారత ప్రాదేశికత్వాన్ని. సార్వభౌమాధికారాన్ని గౌరవించగలనని అధికార వాగ్దానం చేసింది. కాన బారాహోతి తమదని చైనా చెప్పుట, తెలియక చేసిందని భారత ప్రభుత్వం తలచింది ఆది యెక్కడున్నది వారికి తెలిసి వుండని యెంచింది.

భారతసైన్యాలు టిబెట్‌లోనికి చొరబడినవని చైనా ప్రభుత్వం చేసిన అపవాదును గర్హించుతు, భారత ప్రభుత్వం 'నోటు'ను పంపుతు, చైనా అధికార వర్గాలు "నితిలోయ" దక్షిణాన వున్న బారాహోతిలోని సరిహద్దునుదాటి, సాంప్రదాయంగావున్న భారత భూభాగంలోనికివచ్చుటకు చేసిన ప్రయత్నాలను గర్హించింది. అయినా ఐక్యరాజ్యసమితిలో చైనా సభ్యత్వాన్ని సెప్టెంబరు 6న, భారతదేశం మరోసారి ప్రతిపాదించింది. అక్టోబరు 14న,వ్యాపార వొప్పందంపై సంతకాలు జరిగాయి

భారత ప్రధాని నెహూృ అక్టోబరు 18, 1954 న రెండు దేశాల మధ్య స్నేహ సంబంధాలను పెంపొందించుటలో భాగంగా, చైనాను సందర్శించారు. చైనాలో నెహూృ చైనాతో కొత్తగ ప్రకటించిన మ్యాపులు 50,000 చదరపు మైళ్ళ భారత భూభాగాన్ని చైనా భూ భాగంగా చిత్రించిన విషయమై ప్రస్తావించారు నెహూృ. ఏదో పొరపాటు జరిగి వుండవచ్చు, సరిహద్దులు అందరికి స్పష్టంగా తెలిసినవి, వాగ్వివాదం చేయవలసినవి కానందున, భారతదేశం తీవ్రంగా నెంచుట లేదన్నారు. చౌయెన్‌లై సమాధానంగా వాటికేమీ ప్రాముఖ్యత లేదని, పాతకొమింగ్ హాంగు మ్యాపులను తిరిగి పునర్ముద్రించుట జరిగిందని, వాటిని పరిష్కరించు వ్యవధి ప్రభుత్వానికి లేదని చెప్పారు. [1]

భారత చైనా సరిహద్దులను చైనా సైనికులు దాటుట, ప్రభుత్వం గర్హించుట 1955, 1956 లలో నాలుగుసార్లు జరిగింది.

చౌయెన్‌లై, 28 నవంబరు 1956 న భారతదేశం సందర్శించి, అనేక అంతర్జాతీయ సమస్యలను చర్చించి, భారత, చైనాల మధ్య సరిహద్దు విషయం ప్రస్తావిస్తూ వివాదాలు లేనప్పటికీ, చిన్న సమస్యలు వున్నవి, కాన రెండు ప్రభుత్వాల ప్రతినిధులు సామరస్య భావనతో పరిష్కరింపబడాలన్నారు. బర్మా విషయంలో 1914 లో యేర్పడిన సరిహద్దును (మాక్‌మహాన్‌లైన్) ఆమోదించామని చౌయెన్‌లై తెలిపి, తూర్పు ప్రాంతంలో దానినే భారత సరిహద్దుగా గుర్తించుతామని ప్రతిపాదించారు. ఈ విషయంలో టిబెట్ అధికారులతో సంప్రదిస్తామన్నారు. [2]

సరిహద్దుల అతిక్రమణ 1957, 1958 లలో అదే విధంగా కొనసాగింది. నెహూృ 14 డిశంబరు 1958 న చౌయెన్‌లైకు ఉత్తరంలో అధికార చైనీస్

---

1. ఇండియా-చైనా సంబంధాలు. ముఖ్య ఘట్టాలు. 1947-62 (ఆంగ్లంలో) విదేశ ప్రచురణ శాఖ, విదేశాంగశాఖ, భారత ప్రభుత్వం, న్యూఢిల్లీ. పే. 5.
2. ........అదే........పే. 6.

జర్నలులో భారత-చైనా సరిహద్దులను తప్పుగా సూచించుటను తెలిపారు. సరికాని మ్యాపులను విడుదల చేయుట, యిరకాటంలో పెడుతున్నదని, రెండు దేశాల మధ్య దురభిప్రాయాలు యేర్పడుటకు గల అవకాశాలను సాధ్యమయినంత త్వరగా తొల గించాలని కోరారు. చౌయెన్‌లై 23 జనవరి 1959 న ప్రత్యుత్తరం వ్రాస్తూ చైనా-భారత సరిహద్దుల నిర్ణయం యెప్పుడూ జరుగలేదని, రెండింటికి భేదాభిప్రాయాలున్న వని, పరిస్థితుల పరిపక్వదశకు చేరనందున 1954 లో యీ సమస్య లేవనెత్తలేదని, చైనా ప్రభుత్వం మెక్‌మోహన్‌లైన్‌ను ఎప్పుడూ గుర్తించలేదని, చైనా మ్యాపు లలో గుర్తించబడిన సరిహద్దులు గతంలోని మ్యాపులుతో సరిగానే వున్నవని వ్రాసారు. మరో మాటలో సాంప్రదాయంగా నిర్ణయింపబడిన సరిహద్దులు గల రెండు దేశాలు శతాబ్దాలు గుర్తించిన దానిని అధికారికంగా త్రోసి బుచ్చింది. ఇచ్చిన వాగ్దా నాలన్నిటిని, 1954 వొప్పందాన్ని త్రోసిరాజని, 50 వేల చదరపు మైళ్ళ భారత భూభాగాన్ని తనదేనంటున్నది

భారత, చైనాలు సరిహద్దు రెండు వైపులా సైనిక చెక్‌పోస్టులను 1959-62 లలో యేర్పాటు చేయు చదరంగపు ఆట కొనసాగినందున పరిస్థితులు క్రమేణా తీవ్ర తరం కాజొచ్చాయి.

## కమ్యూనిస్టుపార్టీ - సరిహద్దు సమస్య :

సరిహద్దు సమస్య రెండు దేశాల సంప్రదింపుల సమస్యగ వుండి, టిబెట్‌లో తిరుగుబాటు జరిగి, పరిస్థితి తీవ్రమయిన తరువాత కమ్యూనిస్టుపార్టీ దృష్టినాకర్షిం చింది. తత్ఫలితంగా చైనా సైన్యాలు అధిక సంఖ్యలో సరిహద్దుల ప్రాంతాల వరకు వచ్చాయి. సరిహద్దు దళాల సరిహద్దుల అతిక్రమణ ఘర్షణలు ప్రారంభమయ్యాయి. చిన్న చిన్న సరిహద్దు ఘర్షణలు కొనసాగాయి.

పురాతన కాలంనుండి భారత-టిబెట్‌లకు అత్యంత సన్నిహిత సంబంధాల కారణంగా టిబెట్‌లో తిరుగుబాటు ఘటనలు, కేంద్ర సైన్యాల రాక, భారతీయులకు ఎంతో మనస్తాపాన్ని కలుగజేసింది. మానవ విలువలకు, టిబెట్ స్వయం ప్రతిపత్తి అత్యంత గౌరవాన్ని యిస్తూ, చైనా ఐక్యతను కాపాడుతున్న స్నేహశీలియైన సరి హద్దు చైనా యెడల భారతదేశం అత్యంత సానుభూతిని కలిగి వున్నదని 31 మార్చి 1959 న కార్యదర్శివర్గం, కమ్యూనిస్టుపార్టీ తరపున ప్రకటన గావించింది. టిబెట్‌లో నూతన వెలుగు, సమానత్వం ఉదయించకుండా చూడదలచిన అభివృద్ధి నిరోధకులు, బానిస యజమానులు, చైనా జనతా ప్రజాతంత్ర ప్రభుత్వం వారిపై వుంచిన నమ్మకాన్ని వమ్ముచేసి, టిబెట్ స్వయం ప్రతిపత్తిని తమ స్వార్థ ప్రయోజ నాలకై వినియోగించే శక్తులు, విదేశీ సామ్రాజ్యవాద శక్తులతో కుట్రలు చేసి తిరుగు బాటు లేవదీశారు. వారు భూ సంస్కరణలను, అభివృద్ధికర చర్యలను వ్యతిరేకిం

చారు. చైనా ప్రజా ప్రభుత్వం వారే నిర్ణయించు కొనగలందులకు చాలినంత వ్యవధి నిచ్చింది. దానిని వారు దుర్వినియోగం చేసి తిరుగుబాటు లేవదీసారు. స్వతంత్ర్యం, ప్రజాస్వామ్యాలకై వారు పోరాడుట లేదు. భారతదేశం టిబెట్టు చైనాలో భాగంగా ఎప్పుడో గుర్తించింది. చైనా ప్రజా ప్రభుత్వం మధ్యయుగాల టిబెటన్ ప్రజలను, చైనా కమ్యూనిస్టుపార్టీ మార్గదర్శికత్వంలో వెలుగులోనికి, సుభిక్షానికి, సమానతకు తీసుకొని వచ్చే ప్రయత్నాలకు భారత కమ్యూనిస్టుపార్టీ శుభాకాంక్షలను పంపింది. [1]

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సమితి, చైనా రిపబ్లిక్ ప్రాంతమయిన టిబెట్టులో జరిగిన దానిని వివరించుతు, బానిస యజమానులు, మతలామాలు, సంస్కరణలను నిరోధించుటకు, నిరంకుశ ప్యూడలు మధ్యయుగాల దోపిడిని శాశ్వతం చేసుకొనుటకై తిరుగుబాటు లేవదీసారని అన్నది. నూతన నాగరికతా వెలుగును టిబెట్టు ప్రజలపై ప్రసరించరాదని చేసారు. ఈ తిరుగుబాటుకు సామ్రాజ్యవాదులు అన్ని విధాల ప్రోత్సహించారు. ఫలితంగా టిబెట్టు మాజీ ప్రభుత్వం కుట్రలకు నిలయమయి, స్వయం ప్రతిపత్తిని దుర్వినియోగం చేసింది. 1951 ఒప్పందాన్ని విడనాడి తిరుగుబాటు ప్రయత్నాలు చేసింది. ఆ కారణంగానే సామ్రాజ్యవాదులు, సీటో వాదులు, ఆఫ్రో-ఆసియా, చైనా-భారతదేశాల సౌభాతృత్వాలకు వ్యతిరేకంగా. వారి దురాక్రమణల ప్రణాళికలను ముందుకు తీసుకొచ్చారు. ఈ తిరుగుబాటును "భారతీయ తిరుగుబాటు"గ చిత్రించుట తప్పు మాత్రమే గాక తప్పు మార్గాన్ని పట్టించునదిగా వున్నదని విమర్శించింది. టిబెట్టు ఘటనలను వక్రీకరించి, తిరుగుబాటుదారులు, టిబెట్టు ప్రభుత్వం మన దేశాన్నుండి వారి స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగించుటకు అవకాశమివ్వాలని, జనసంఘం, ప్రజా సోషలిస్టుపార్టీ, హిందూ మహాసభ వర్గాలు, పంచశీల వ్యతిరేక వాదులు, అమెరికా అభిమానులు చైనాకు వ్యతిరేకంగా ఇండియాను రెచ్చగొట్టే వారి ప్రయత్నాలను వమ్ము చేయాలని ప్రజలను కోరింది ప్రధానమంత్రి నెహూర్రి భారతదేశ విదేశాంగ విధానాన్ని, ఇండియా, చైనా మైత్రిని, పంచశీల విధానాన్ని రూపొందించుటలో అంత్యప్రముఖ పాత్ర వహించారని, కొంత వూగిసలాట దురదృష్టకరమంది. కాని, 8 మే 1959 లోక్ సభలో నెహూర్రి పంచిశీల ప్రాతిపదికపై విదేశాంగ విధానాన్ని పునరుద్ఘాటించుటకు, విదేశాంగ విధానాన్ని మార్చాలనే ప్రతిపాదనలను త్రోసి పుచ్చుటను హర్షించింది. చైనా జాతీయ ప్రజా కాంగ్రెసు రెండు దేశాల స్నేహ సంబంధాలను నొక్కి చెప్పుటకు కేంద్ర కార్యవర్గ సమితి స్వాగతం పలికింది. [1]

---

1. ఇండియా-చైనా సరిహద్దు తగాదా, భారత కమ్యూనిస్టుపార్టీ (1963) తీర్మానాలు ప్రకటనలు, ఉపన్యాసాలు. 1959-63(ఆంగ్లంలో) పి.పి.ఐ. పబ్లికేషన్. పే.12.
1. ఇండియా-చైనా సరిహద్దు తగాదా, భారత కమ్యూనిస్టుపార్టీ (1963) తీర్మానాలు, ప్రకటనలు, ఉపన్యాసాలు. 1959-63 (ఆంగ్లంలో) పి. పి. ఐ. పబ్లికేషను పే. 3-7.

ప్రధానమంత్రి నెహ్రూ 22 మార్చి 1959న చైనా ప్రధానికి వ్రాసిన లేఖలో "మొన్న జరిగిన సంఘర్షణకు ముందున్న సరిహద్దుల పరిస్థితి. యిరుపక్షాలు గౌరవించాలి. ఏ పక్షము తాను సరియని అనుకొన్నదానినైనా ఏకపక్షంగా చర్యగైకొనకుండుట తాను అంగీకరిస్తున్నానని" వుదహరించుట, చైనా జాతీయ ప్రజా కాంగ్రెసు స్టాండింగు కమిటీ 13 సెప్టెంబరు తీర్మానంలో "తాత్కాలిక చర్యగా యిరుపక్షాలు అనాదిగా వున్న 'యథాస్థితిని' కొనసాగిస్తూ, ఏకపక్షచర్యలతో మార్పు ప్రయత్నించకుండా, ముఖ్యంగా బలప్రదర్శనతో, ఒక్కొక్క స్థలాలపై తాత్కాలిక వొప్పందాలు సంప్రదింపుల ద్వారా చేసుకొనుట, స్థలాలపై తాత్కాలిక వొప్పందాలు, సంప్రదింపులద్వారా, రెండు దేశాల సరిహద్దులలో శాంతి, స్నేహ పరిస్థితులు నెలకొల్పుకొనుట"లో ఇకే విధమైన అవగాహనలను వెలిబుచ్చారు. భారత కమ్యూనిస్టుపార్టీ, యిరుపక్షాలు నిర్మాణాత్మకమైన సూచనలు చేయుటకు హర్షించింది. పార్టీ ప్రాదేశిక సమగ్రత రక్షించుటలో ఎవరికీ తీసిపోమని పునరుద్ఘాటించింది. భారత ప్రభుత్వపు, ప్రధాని నెహ్రూ సలహాలను; దలైలామా అనుచరవర్గం పాటించక, కాందిశీక ప్రభుత్వంగా వ్యవహరించుటను పార్టీ గర్హించి, భారత-చైనా సంబంధాలను భగ్నం చేయుట కుద్దేశింపబడినవని స్పష్టం చేసింది. ఏమైనా భారత-చైనా సంబంధాలు యీ పరీక్షకు నిలబడాలని, యీ స్నేహ సంబంధాల శతృవులకు ఎట్టి అవకాశమివ్వరాదని ప్రజలకు కమ్యూనిస్టుపార్టీ విజ్ఞప్తి చేసింది[1].

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సమితి "భారత-చైనా సంబంధాలు దిగజారుటకు విచారిస్తు" రెండు దేశాలు ప్రప్రథమంగా పంచశీల సూత్రాలను ప్రకటించి సరిహద్దు సమస్యపై" స్నేహపరిస్థితిపోయి, పరస్పర అనుమానం, అపనమ్మకం" యేర్పడింది. ఇది రెండు దేశాలకు నష్టదాయకం, ప్రపంచశాంతికి ప్రమాదకరం. ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకొని టిబెట్ తిరుగుబాటుదారులు, జనసంఘం, స్వతంత్రపార్టీ, ప్రజాసోషలిస్టుపార్టీల నాయకత్వం, కాంగ్రెసులోని కొన్నివర్గాలు చైనా "ద్వేష" ప్రచారాన్ని మొదలు పెట్టారు. మొదటి సరిహద్దు సంఘర్షణతోనే, చైనా దురాక్రమణ, దేశ సమగ్రతకు ప్రమాదం అనే దుష్ప్రచారం మొదలుపెట్టారు సోషలిస్టు చైనాకు భారతదేశపుపై యుద్ధఆలోచనలు లేవని అదేవిధంగా భారతదేశానికి చైనాపై అట్టి ఆలోచనలు లేవని పార్టి నమ్ముతున్నది. సరిహద్దు వందలకొలదిమైళ్ళు వుంది. తూర్పుప్రాంతంలో పరస్పర ఆమోదం పొందిన సరిహద్దు లేకపోవుట దురదృష్టకరము, పశ్చిమప్రాంతంలో సాంప్రదాయక సరిహద్దు అస్పష్టంగాను, నిర్ణయింప

---

1. భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గపు తీర్మానం, కలకత్తా 25 డిశెంబరు 1959 (ఆంగ్లంలో) ఇండియా చైనా సరిహద్దు తగాదా భారత కమ్యూనిస్టు పార్టీ (1963) తీర్మానాలు, ప్రసంగాలు, ప్రకటనలు. 1959-63, సి. పి. ఐ. పబ్లికేషన్స్, పే. 9-11,

బడకుండావుంది. ఈ స్థితిలో దురాక్రమణనిందా, ప్రతినిందలకు అర్థంలేదు, ప్రమాదకరం. భారతకమ్యూనిస్టుపార్టీ ప్రాదేశిక సమగ్రత రక్షణకు గట్టిగా నిలబడగలదని అనేకసారులు ప్రకటించింది. అన్నివాదనలు సమగ్రంగా పరిశీలించి, రాజకీయ, పాలనా వాస్తవ పరిస్థితులను ముఖ్యాంశాలుగ పరిగణించిన, పరిష్కారము, పరిహద్దుల నిర్ణయం సాధ్యమనిపార్టీ విశ్వశించుచున్నది[1].

"సాధారణంగా మెక్ మాహన్ లైన్‌గ తెలిసిన, దాని విషయమై చైనా ప్రభుత్వం, అది రహస్యంగా, పరస్పర నోట్సు మార్పిడియైనందున చట్ట విరుద్ధమనియే చైనా కేంద్ర ప్రభుత్వం దానిని గుర్తించలేదంటున్నది. భారతప్రభుత్వం యీ విషయంలో భిన్న అభిప్రాయాన్ని కలిగి వుంది.

"మెక్ మాహన్‌లైన్" యే విధంగా పుట్టినా, అనేక సంవత్సరాలు అది భారత సరిహద్దు అని, దానికి దక్షిణప్రాంతం భారతపాలనలో వున్నదనే వాస్తవాన్ని త్రోసిపుచ్చజాలమని జాతీయ సమితి తలచుచున్నది. కమ్యూనిస్టుపార్టీ సమితి మెక్ మాహన్‌లైన్‌కు దక్షిణప్రాంతం భారతదేశంలో భాగమన్న, అది భారతదేశంలోనే వుండాలని అంటుంది[2].

"పశ్చిమ సరిహద్దు విషయమై భారతప్రభుత్వం, సాంప్రదాయంగా వున్న సరిహద్దుఅని, సరియైన వైఖరి తీసుకొంది. అయినా యేది వాస్తవంగా సాంప్రదాయకంగా వున్న సరిహద్దు అనే విషయంలో వివాదముంది. పండిట్‌నెహ్రూ పార్లమెంటులో "ఇది సంక్లిష్టమైన సమస్య....సరిహద్దుకు సంబంధించినంతవరకు అస్పష్టప్రాంతం, కారణం మెక్‌మెహన్ లైన్‌లాగ సరిహద్దు అంతస్పష్టంగాలేదు. ఇదంతా, సరియైన సరిహద్దుల నిర్ణయానికి, మనప్రభుత్వం, చైనా ప్రభుత్వాల మధ్య స్నేహసంభాషణల అవసరాన్ని స్పష్టం చేస్తున్నదని అన్నారు.

"జాతీయ సమితి భారత-చైనాలు షరతులులేని సంభాషణలు ప్రారంభించాలని యీ కాలంలో సరిహద్దు ఘర్షణలు లేకుండా చూచుట అత్యంత ప్రాముఖ్యత వహించుతుందన్నది. అందుకు, ప్రథమంగా రెండు పక్షాలు 'యథాస్థితిని కొనసాగించుతు, పౌందారులు యితరుల ఆక్రమణలో వున్న ప్రాంతాలకు చొరబడకుండుట, కాల్పులు, ప్రమాదకర చర్యలు కాన నివారణకు సర్వప్రయత్నాలు చేస్తూ అంగీకారానికి పురోగమించాలన్నది.

"ప్రధానమంత్రులిరువురూ సమావేశమై సరిహద్దునంతా పరిష్కరించాలనే

---

1. అదే భారతకమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి, నవంబరు 1959 తీర్మానం పే 13-15
2. ఇండియాచైనా సరిహద్దు తగాదా, భారత కమ్యూనిస్టుపార్టీ (1963) తీర్మానాలు, ప్రకటనలు, వుపన్యాసాలు. 1959-63 (ఆంగ్లంలో) సి. పి. ఐ. పబ్లికేషన్స్. కేంద్రసమితి నవంబరు 1959, తీర్మానం పే. 15.

ప్రతిపాదన, కోట్లాది భారత- చైనా శాంతి ప్రియులైన ప్రజల కోర్కె, భారత-చైనా సంబంధాలలోని అస్థిర పరిస్థితి వెంటనే తొలగిపోవాలని, రెండు దేశాల మధ్య స్నేహ సంబంధాలు బలమైన పునాదులపై నిర్మింపబడాలని కోరుతున్నారు[1]" అని భారత కమ్యూనిస్టు పార్టి జాతీయసమితి తీర్మానం స్పష్టం చేసింది.

కేంద్రసమితి ఏప్రిల్ 1960లో భారత-చైనా ప్రధానమంత్రులు సమావేశమై సంభాషణలు జరుపుటకు సంతృప్తిని వెల్లడించింది. మే 1960 తీర్మానంలో రెండు దేశాల సంబంధాలలోని క్లిష్టపరిస్థితి కొంత సడలినా, పరిష్కార మార్గాన్ని కనుగొన జాలకపోవుటలో విచారం వ్యక్తం చేసింది. ప్రధానమంత్రుల సమావేశం, అధికారుల స్థాయిలో సంభాషణలు కొనసాగించుటకు నిర్ణయించుట సరిహద్దులో ఎట్టి సంఘటనలు జరుగకుండా తగుచర్య గైకొనుటకు నిర్ణయించుట, నెహ్రూ-చౌయెన్ లైల సుముఖ విజయంగా కమ్యూనిస్టుపార్టి తీర్మానంలో పేర్కొంది. ఎన్ని యిబ్బందులున్నా స్నేహ,సౌభాతృత్వవైఖరి నవలంభించిన చర్చలలో సరిహద్దు సమస్యకు శాంతియుత పరిష్కారం లభించగలదని నమ్ముతున్నామంది.

భారత-చైనాల స్నేహ, సహకారం ప్రపంచానికి 'పంచశీలను' ప్రసాదించుటయేగాక, బాండుంగు దృక్పధాన్నిచ్చి, ఆఫ్రో-ఆసియా పూర్తి చరిత్రగతినిమార్చి, విస్తృత ప్రపంచశాంతికి తోడ్పడిందని తీర్మానం స్పష్టం చేసింది.

ఈ పరిస్థితులలో శాంతియుత సంభాషణల విధానాన్ని బలపరుస్తూ సమస్యా పరిష్కారానికి తగిన వాతావరణాన్ని కలుగజేయండని ప్రజలకు కమ్యూనిస్టు పార్టి విజ్ఞప్తి చేసింది.[1]

## ప్రపంచ కమ్యూనిస్టు సమావేశంలో, భారత-చైనా సరిహద్దు సంఘర్షణలపై భారత్ కమ్యూనిస్టు పార్టి అభిప్రాయాలు:

భారత-చైనా సరిహద్దు సంఘర్షణలపై భారత కమ్యూనిస్టు పార్టీ సోదర కమ్యూనిస్టు పార్టీలకు నవంబరు 1960లో యిచ్చిన అవగాహనలోని ముఖ్యాంశాలు యీ క్రింది విధంగా వున్నవి.

ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలోని భేదాభిప్రాయాలను పరిష్కరించుకొనుటకై 1957 మాస్కో ప్రకటన మౌలిక ప్రాతిపదికగా, తదనంతర అనుభవాలతో నిర్దిష్ట సూత్రాలను రూపొందించింది. ఈ యుగ లక్షణాలను నిర్వచించి, ప్రపంచ

1. భారత-చైనా సరిహద్దు తగాదా. భారతకమ్యూనిస్టుపార్టి (1963) తీర్మానాలు, ప్రకటనలు, వుపన్యాసాలు. 1959-63 (ఆంగ్లంలో) కేంద్రసమితి, ఆగస్టు 1960 తీర్మానం. పే. 20-21

యుద్ధ నివారణసాధ్యమని, నిరాయుధీకరణ సుసాధ్యమని, శాంతి సహజీవన ప్రత్యేకత వివరించి, సామ్రాజ్యవాద వలసవిధానం త్వరితంగా అంతమై, స్వతంత్ర్య దేశాలు వుద్భవించుట, యీ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు జాతీయ ప్రజాస్వామ్యం కొరకై సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి వ్యతిరేక పోరాటాన్ని, సోషలిజంలోనికి పరివర్తనకై పోరాటాన్ని, అదేకాలంలో ప్రధానంగా సంస్కరణవాదానికి, పిడివాదానికి వ్యతిరేక పోరాటాన్ని కర్తవ్యంగా నిర్దేశించింది. ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలన్నీ మాస్కో ప్రకటనను ఆమోదించాయి. తదనంతరం యుద్ధం, శాంతి, శాంతియుపత సహజీవన సమస్యలుపై భిన్నాభిప్రాయాలను వెల్లడించుట, ఆశ్చర్యాన్నిగొల్పుతుంది. సోవియట్ చరిత్ర యీ అపవాదుకు పునాదిలేదని రుజువు చేస్తుంది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఆసియా, ఆఫ్రికా, లాటెన్, అమెరికా దేశాలలో జాతీయ విముక్తి పోరాటాల పెనుతుఫాన్ వీచింది. ప్రపంచంలోని 51 దేశాలు మాత్రమే 1945లో ఐక్యరాజ్య సమితితో సభ్యులుగ వున్నవి. అవి 1960 చివరకు 99దేశాలు సభత్వాన్ని కలిగి వున్నవి. అందులో 50 దేశాలు ఆసియా, ఆఫ్రికాలలోని దేశాలు. సామ్రాజ్యవాదం, స్వాతంత్రం పొందినా యీ దేశాలలో బలమైన స్థానాలను కలిగి వుంది. తరతమ భేదాలతో యీ దేశాలన్నీ సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలను కలిగి వున్నవి. భారతదేశం, చైనా ప్రజారిపబ్లిక్‌తో కలసి "పంచశీల' సూత్రాలను రూపొందించినది.

భారతకమ్యూనిస్టులకు జాతీయ బూర్జువా వర్గంపై భ్రమలులేవు. జాతీయ కాంగ్రెసు, పాలక పార్టీనాయకులు నెహ్రూతో సహా అందరూ కమ్యూనిస్టులను ప్రధాన శత్రువులుగ నెంచుతు, దుమ్మెత్తిపోయు అవకాశాన్ని ఎప్పుడూ విడువలేదు. కమ్యూనిస్టుపార్టి పూ్యడలు, అర్ధపూ్యడలు శేషశక్తులకు వ్యతిరేకంగా భూసంస్కరణలకై ప్రజాపోరాటాలు నడుపుట ద్వారానే బలమైన రాజకీయశక్తిగా రూపొందింది. గత ఎన్నికలలో 12 మిలియనుల వోటరుల అభిమానాన్నిపొంది, కేరళ రాష్ట్రంలో ప్రభుత్వాన్ని ఏర్పరచింది. కేరళ రాష్ట్రప్రభుత్వ విద్యా, భూసంస్కరణలు భారతపాలకవర్గాలలో భయాన్ని, దేశప్రజలలో గొప్ప ప్రభావాన్ని కలుగజేసాయి. కాంగ్రెసు నాయకత్వంలోవున్న కేంద్ర ప్రభుత్వం 18 మాసాల తరువాత కమ్యూనిస్టు ప్రభుత్వం ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిందని రద్దుచేసింది. కమ్యూనిస్టుపార్టి కేంద్రప్రభుత్వ ప్రజావ్యతిరేక, ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలన్నిటిని వ్యతిరేకిస్తూనే, నెహ్రూనాయకత్వంలో భారతప్రభుత్వం పూగిసలాటలున్నా, ప్రపంచ శాంతి శక్తులలో గణనీయమైన శక్తియని గుర్తించింది. ఆసియా, ఆఫ్రికాలలోని దేశాలలో భారత దేశశాంతి విధానం సుముఖ ప్రభావాన్ని కలుగజేసిందని పార్టి అవగాహన. ప్రపంచశాంతిని బలవరచే ప్రభుత్వ ప్రతి చర్యను కమ్యూనిస్టుపార్టీలు బలపరుస్తున్నది. సోషలిస్టు దేశాలతో మైత్రిని పెంపొందించుటకై వొత్తిడి చేస్తున్నది

భారతదేశ శాంతి, అలీనవిదేశాంగా కొనసాగుటకై ప్రజోద్యమాన్ని నిర్మించుట ప్రాముఖ్యతగల కర్తవ్యంగా పార్టీచేపట్టింది. ఆసియా, ఆఫ్రికా దేశాలు ప్రపంచ శాంతికి ప్రపంచయుద్ధ నిరోధించుటలో ప్రముఖ ప్రాముఖ్యత వహించుతవి. ఈ విషయం మాస్కో 1957 ప్రకటనలో స్పష్టం చేయబడింది.

ప్రపంచంలో యేదేశంలోను, చైనా ప్రజారిపబ్లిక్ యెడల స్నేహ, సౌభాతృత్వ భావాలు భారత ప్రజలలోకంటె ఎక్కువగాలేవు. చైనా ప్రజలు, కమ్యూనిస్టు పార్టీ సాధించిన ఘనవిజయాలు, సిద్ధాంత, ఆచరణలలో వారి ప్రముఖపాత్రలయెడల భారతకమ్యూనిస్టు అత్యంత గౌరవ భావాన్ని కలిగివున్నారు. ఆ కారణంగా చైనా కామ్రేడ్స్ నేడు చేబట్టిన కొన్ని విధానాలు, వారే గతంలో ప్రవచించి, ఆచరించిన విధానాలకు భిన్నంగా వుండుట, భారత కమ్యూనిస్టులకు విచారాన్ని కలిగించింది. "లెనిన్ 90వ, వర్థంతి సందర్భంలో చైనా ప్రకటించిన వ్యాసాలు, 1957లోని కొన్ని వుదహరింపులు తప్ప, ఆసియా, ఆఫ్రికాలలో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల పాత్రను చైనా పరిగణలోనికి తీసుకొనలేదు. సామ్రాజ్యవాద వలస విధానం విచ్ఛిన్నమైపోవుటను అనేకసార్లు పేర్కొన్న, ఆక్రమంలో అనేక నూతన స్వాతంత్ర్య దేశాల ఆవిర్భావం, అవి సోషలిస్టు దేశాలు కాకపోయినా స్వతంత్ర, శాంతి విధానాన్ని అనుసరించుట ప్రాముఖ్యతగల అంశంగా ఎక్కడా పేర్కొనలేదు. ఈ వాస్తవాన్ని వదలివేయుట నేటి ప్రపంచ పరిస్థితిని అంచెనా వేయుటలో నిస్సందేహంగా పెద్దలోపంగా కన్పడుతున్నది."[1]

అంతేగాక "మేము చైనా కామ్రేడ్స్ శాంతియుత సహజీవన విధానాన్ని ఆమోదిస్తుందని అనుకొంటున్నాము. శాంతియుత సహజీవన విధానం కరుడుగట్టిన సామాజ్యవాదులను వేరుచేసి, ఎక్కువమంది మిత్రులను పొంద గలుగుతుంది. శాంతి సహజీవన విధానం, నూతన స్వతంత్ర, అలీనదేశాలను సోషలిస్టు శిబిరానికి సన్నిహితంగా వుండునట్లు సోషలిస్టు దేశాలు నిరంతరం ప్రయత్నించవలసిన అవసరాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక, శాంతిపోరాటాలలో వారిని బలపరచవలసిన అవసరాన్ని స్పష్టం చేసింది" అని అన్నారు

"మా అభిప్రాయంలో చైనా కమ్యూనిస్టుపార్టీ యీ కర్తవ్యాన్ని తక్కువగా అంచెనా వేసింది, భారతదేశ సంబంధాలలో శాంతి మండలాన్ని బలపరచు మార్గం అనుసరించలేదు. పైగా చైనావైఖరి శాంతి పక్షాన్ని బలహీనపరచింది, కొంతకాలం

---

1. అజయ్ ఘోష్ వుపన్యాసం-ప్రపంచ కమ్యూనిస్టు, కార్మికపార్టీల సమావేశం, మాస్కో నవంబరు 1960. ఇండియా-చైనా సరిహద్దువివాదం,భారతకమ్యూనిస్టు పార్టి తీర్మానాలు, ప్రకటనలు, వుపన్యాసాలు 1959-63 (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషను, జులై 1963. పే.36.

నుండి మాపార్టీ యెడల చైనాపార్టీ వైఖరి, పార్టీల మధ్య వుండవలసిన సౌభాతృత్వ మార్గదర్శిక సూత్రాలకు భిన్నంగా పరస్పర సంబంధాలలో వ్యక్తమైంది. "మేము యీ విషయం యీ సమావేశంలో ప్రస్తావించే వారమేకాము, కాని టెంగ్‌హిసో పింగ్ వుపన్యాసం మరోమార్గం లేకుండా చేసింది.

అజయ్‌ఘోష్ "చైనా కామ్రేడ్స్‌కు మేము 1959 మే 3, 5 తేదీలలో వ్రాసిన లేఖలలో, చైనా రాజకీయ సిద్ధాన్ని బలపరుస్తు, టిబెట్ సరిహద్దులోని ఇండియాకు చెందిన కలింపాంగ్ బస్తీని, తిరుగుబాటుదారులకు "నాయకత్వకేంద్రం గాను" "భారత విస్తరణవాదులు" దలైలామాను "ఖైదీగా" చేసి, చైనాను "బ్లాక్ మెయిల్" వొత్తిడి చేస్తున్నారనుట అవాస్తవాలు, అసత్యాలు భారతదేశంలో ఎవరిని నమ్మించజాలవని స్పష్టం చేసాము. మేము ఇండియాలో మాపార్టీ నెహ్రూ-చౌయెన్ లైలు కలవాలనే నినాదాన్ని యివ్వబోతున్నదని, అది భారత ప్రజానీకంలో సుముఖ స్పందన కలిగించగలదని సూచించాము. అన్నిటికీ, మా నెహ్రూ-చౌయెన్‌లైలు కలవాలనే సూచన సరియైనది. కాదని, "దలైలామా ఖైదీ", "భారతవిస్తరణవాదులు" "కలింపాంగ్ తిరుగుబాటుదారుల నాయకత్వకేంద్రం" అన్నది అవాస్తవం, అసత్యమన్నదానికి ఎట్టి ప్రత్యుత్తరంలేదు.[2]

ఆగస్టు 20, 1959 వివరణ వుత్తరంలో భారత కమ్యూనిస్టుపార్టీ చైనా కమ్యూనిస్టుపార్టీకి "చైనా వ్యతిరేక ప్రచారం క్రమేణా ఎక్కువగుతున్నదని, అది భారతవిదేశాంగ విధానానికి, భారత-చైనా మిత్రత్వానికి, భారత కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేక ప్రచారమని స్పష్టం చేసాము. అది అలాగే సాగితే నేటి భేదాభిప్రాయాలు ఎక్కువై, భారత విదేశాంగ విధానానికి ముప్పుకలుగుతుందని, అమెరికా అనుకూల అభివృద్ధినిరోధక వర్గాలను, వారి కమ్యూనిస్టు వ్యతిరేకతకు బలాన్ని చేకూర్చుతుంది విదేశాంగ విధానం, ప్రజాస్వామ్య పరిరక్షణకు దేశంలో అత్యంత ముఖ్యమైన తక్షణ సమస్య అయింది" అని వ్రాసిన వుత్తరానికి జవాబులేదని అజయ్ అన్నారు. సెప్టెంబరు 3న, మాస్కోనుండి మా కార్యవర్గం కోరికపై, భారత పార్లమెంటులో సరిహద్దుల సంఘర్షణలపై చర్చ జరిగిన సందర్భంలో పరస్పర అభిప్రాయాలు తెలుసుకొనుట, సంప్రదింపులు ప్రారంభానికి వెంటనే చర్యలు తీసుకొనమని కోరుతు చైనా కమ్యూనిస్టుపార్టీకి మరో ఉత్తరం వ్రాసాము. పరిస్థితి అభివృద్ధి నిరోధకులది పైచేయి అగుటకు తోడ్పడుతుందని స్పష్టంచేసామని" అజయ్ తెలిపారు. "చైనా

---

1. అజయ్‌ఘోష్ వుపన్యాసం (1960) ప్రపంచ కమ్యూనిస్టు, కార్మికపార్టీల సమావేశంలో ఇండియా చైనా సరిహద్దు వివాదం భారత కమ్యూనిస్టుపార్టీ తీర్మానాలు, ప్రకటనలు, వుపన్యాసాలు(1959-63 (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్, 1963. పే. 37.
2. ....... అదే .......పే.38-39

కామ్రేడ్స్ మాకోరికను ఆలోచించనూలేదు, ప్రత్యుత్తరం వ్రాయనులేదు. మాకు వాస్తవ విషయాలను తెలుపుటగాని, ఇండియాలో వారి వైఖరిపై వేసే నిందలను మేము వారి దృష్టికి తెచ్చిన వాటిని వారు స్పష్టం చేయుటగాని చేయలేదు".

"ఈ అంతర్జాతీయ సమావేశంలో మనకు ముఖ్యమైనది, భారత, చైనా ప్రభుత్వాలు రెండు తమతమ ప్రాంతాలుగచెప్పు, సరిహద్దుల వివాదంకాదు. మనకు రెండు ప్రశ్నలు ప్రధానమైనవి. ఒకటి, శాంతి శిబిరంలోవున్న సోషలిస్టేతర దేశం యెడల ఒక సోషలిస్టు దేశం వైఖరి ఎట్టిది? రెండు, కమ్యూనిస్టుపార్టీల మధ్య సంబంధాలకు మార్గదర్శిక సూత్రాలెట్టివి? దేశాల సరిహద్దుల సమస్యలు అన్నివర్గాల ప్రజలలో వుద్రేకాలను కలుగజేస్తుందని అందరకు తెలుసు. ఏమైనా, భారతదేశం సామ్రాజ్యవాదులకు కేంద్రమైనా, చైనా వ్యతిరేకంగా మెక్‌మాహన్ రేఖకు దక్షిణ ప్రాంతాన్ని వారుకేంద్రంగా వుపయోగిస్తున్నా, చౌయెన్‌లై లలేఖలో (8 సెప్టెంబరు 1959)ని అంశాలను అర్థం చేసుకొనవచ్చు, సమర్థించవచ్చు. అటువంటి పరిస్థితి యేమీలేదు. కాని, సరిహద్దు సమస్యలను చేబట్టినపుడు చైనాకామ్రేడ్స్ సోషలిస్టు శిబిరపు దీర్ఘకాల, విస్తృత ప్రయోజనాలకు, శాంతి మండల ఐక్యతకు తగిన ప్రాముఖ్యత నిచ్చి వుండవలసింది.

"చైనానేగాక, భారతదేశాన్ని మాదేశ విస్తృత ప్రజాసామాన్యాన్ని, మా వుద్యమాలను కలవరపరచే సమస్య. ఆసియాలో రెండు దేశాల 1000మిలియనుల ప్రజల సంబంధాలకు, రెండు పెద్ద దేశాలకు సంబంధించిన సమస్యపై మాతో తగిన రీతిగా సంప్రదించి మావైఖరి తెలుసుకొనగలరని మేము తలంచుట సరియైనదని అనుకొంటున్నాము. అంతేగాక వరుసగా రెండు వుత్తరాలు వ్రాసినందున మేమా విధంగా ఆశించే హక్కుగలదనుకొంటున్నాము.

"భారత జాతీయ బూర్జువావర్గం యెడల ఐక్యత-పోరాటం ఎత్తుగడల ననుసరించి, చైనాయెడల భారత ప్రభుత్వం తప్పుడుగా వ్యవహరించినపుడు, అవసరమైన పోరాటాన్ని సాగించామని చైనా కామ్రేడ్స్ వాదించుచున్నారు. ఈ సందర్భంలో యీ వాదన విశ్వాసాన్ని యివ్వలేకపోతున్నది. భారత బూర్జువా పాలకులకు వ్యతిరేక పోరాట ప్రధానశక్తి భారత ప్రజలనుట స్పష్టం. కాబట్టే చైనా ఎత్తుగడలు, పోరాట విధానాలు పద్ధయులు బూర్జువాలను పేరుపరచే విధంగా, వారి వెనుక ప్రజాసామాన్యం చేరే విధంగా కాకుండా, నెహ్రూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కూడ జరిగింది. ఎత్తుగడలు భారత ప్రజాస్వామ్యాన్ని బలపరచేవి, సహాయపడేవి అవ్వాలి. ఇది నాటి మనో ఫలకంలో లేనందుకు విచారిస్తున్నాము[1]"

---

1. అజయ్‌ఘోష్ వుపన్యాసం, ప్రపంచ కమ్యూనిస్టు 1960 సమావేశం.. ఇండియా చైనా-సరిహద్దు వివాదం, భారత కమ్యూనిస్టు పార్టీ, తీర్మానములు, ప్రకటనలు, వుపన్యాసాలు. 1959-63 (ఆంగ్లంలో) పి.పి.ఐ. పబ్లికేషన్: పే. 43-44.

"చైనా కామ్రేడ్స్ తీవ్రమైన తప్పిదాన్ని చేస్తున్నారని తలచి, రెండు పార్టీలూ సత్సంబంధాల దృష్ట్యా, వ్యక్తిగతంగా యీ విషయాన్ని చర్చించదలచాము. చైనా ప్రజా రిపబ్లిక్ 10వ జయంతి వుత్సవాల సందర్భంలో (1957) చైనా కామ్రేడ్స్‌లో మా ప్రతినిధి వర్గం సుదీర్ఘ చర్చలు జరిపింది. చర్చలు నిర్మొహమాటంగా జరిగాయి, మొత్తంమీద ఫలవంతమైనా, భారతదేశ పరిస్థితిని నెహ్రూ ప్రభుత్వ విధానాల అంచెనాలలో పెద్ద భేదాభిప్రాయాలున్నవి. అయినప్పటికి పరస్పర సంబంధాలను మెరుగుపరచుటకై తీసుకొనవలసిన చర్యల విషయమై విస్తృత ఆమోదం కుదిరింది. గతచారిత్రిక అంశాలను లేవనెత్తకుండా రెండు ప్రభుత్వాలు వాస్తవంగావున్న సాంప్రదాయ సరిహద్దులకు చట్టబద్ధ గుర్తింపును కలుగజేసిన వొప్పందానికి అవకాశాలు గలవని మేము అనుకొన్నాము అదే చెప్పాము. చైనా కామ్రేడ్స్ వారి దృక్పథాన్ని మార్చుకొన్నారని మేము చెప్పవలసి వుంది. ఫలితంగా చైనా పత్రికలలో పరుష ప్రచారాన్ని ఆపివేయుట ఢిల్లీ ప్రపంచ వ్యవసాయ ప్రదర్శనలో పాల్గొనుట, భారత ప్రభుత్వ ప్రతినిధులను కలుసుకొనుట, నెహ్రూ-చౌయెన్‌లైలు కలుసుకొనుటకై చొరవను ప్రదర్శించింది. దీనికి ముందు 21 అక్టోబరు 1959న కాంగ్‌కాపాస్, వివాదగ్రస్త ప్రాంతంలో రెండు దేశాల పాయుధదళాల మధ్య సంఘర్షణ జరిగి యిరువైపుల ప్రాణనష్టం జరిగింది.

"చైనా కామ్రేడ్స్ ప్రకారం అనాదిగా చైనాలో వున్న భూభాగంలో భారతసైనికులు చొరబడుటతో జరిగింది. ఇది బహుదూరపు వాయువ్యప్రాంతం, జనం బహు కొద్దిమంది వున్నారు. నెహ్రూ కూడ దీనికి ఎట్టి ప్రాముఖ్యత యివ్వలేదు. ఘర్షణతో దీనికి ప్రాముఖ్యత వచ్చింది. ప్రజాభిప్రాయంలో యిది కలుగజేయు దుష్ప్రభావాన్ని వూహించి చొరవతో చైనా కామ్రేడ్స్ ముందుకు రావాలని వ్రాసాము. సంఘటన బాధ్యతను వొకరిపై మరొకరు త్రోసివేయక, సంఘటనకు విచారాన్ని, బాధితులకు సానుభూతిని ప్రకటించి, ఇక ముందు అట్టి సంఘటనలకు అవకాశం లేకుండా చేయుటకు సంప్రదింపులకు సంసిద్ధతను, మానవత, స్నేహభావాలను వెల్లడించు ప్రకటన అవసరమన్నాము. దురదృష్టకరంగా చైనా వెంటనే అట్టి ప్రకటన చేయజాలక పోయింది.

"భారతపాలక వర్గంలోని అభివృద్ధి నిరోధకులు యీ అవకాశాన్ని పూర్తిగ వినియోగించుకున్నారు. చైనాకు, మాపార్టీకి వ్యతిరేకంగా దౌర్జన్యపూరిత ప్రచారోద్యమం సాగించి చౌయన్ లై 7 నవంబరు 1959న మాత్రమే స్నేహపూరిత వుత్తరాన్ని నెహ్రూకు వ్రాసారు....అప్పటికి నష్టం జరిగిపోయింది. చౌయెన్‌లై వచ్చిన తరువాతే రెండు ప్రభుత్వాల ప్రతినిధుల సంయుక్త అధికాలు అధికార పత్రాల

పరిశీలన, నివేదిక తయారు చేయుట కుపక్రమించారు[2]." భారత కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గంలో అజయ్ నాయకుడుగా, డాంగే, నంబూద్రిపాద్, రామమూర్తి, భూపేష్‌గుప్తా సభ్యులుగ అంతర్జాతీయ సమావేశంలో పాల్గొన్నారు.

## సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 22వ, కాంగ్రెసు నూతన అవగాహన

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 22వ,కాంగ్రెసు అక్టోబరు 1960 చివర జరిగింది. కాంగ్రెసు రూపొందించిన అంతర్జాతీయ విధానం, 1957 మాస్కో ప్రకటన అవగాహనలకు మరింత పరిపూర్ణత చేకూర్చిందనవచ్చు.

1. రెండవ ప్రపంచ యుద్ధానంతరం యూరప్‌లో సోషలిస్టు విప్లవాలు, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో జాతీయ విముక్తి వుద్యమాల విజయాల ఫలితంగా ప్రపంచసోషలిస్టు వ్యవస్థకు దారితీసింది. ప్రపంచ ప్రజాసామాన్యంలో మూడవ వంతు నూతన సోషలిస్టు జీవితాన్ని నిర్మిస్తున్నారు. సామ్రాజ్యవాద వలస విధానం అంతరించిపోతున్నది. ఈ యుగధర్మం పెట్టుబడిదారి విధానం సోషలిజం లోనికి పరివర్తన. రెండు వైరుధ్య సమాజాల అంతిమపోరాటం ప్రారంభమైంది. ప్రపంచ సోషలిస్టు నాయకత్వంలో సోషలిస్టు, జాతీయ విముక్తి వుద్యమాల విప్లవ శక్తులు, వివిధదేశాల గుత్తపెట్టుబడిదారి వ్యతిరేక, కార్మిక, కర్షక శక్తులు, యుద్ధ వ్యతిరేక, శాంతిశక్తులు యీ యుగ నిర్మాతలు.

అక్టోబరు విప్లవంతో ప్రారంభమైన, పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి పరివర్తన సహజ పరిణామం. మానవ భౌతిక అవసరాలను అతివేగంగా వుత్పత్తి కావించే వుత్పత్తి పరికరాలలో విప్లవాత్మక అభివృద్ధి సాధించుటతో పెట్టుబడివారి సంబంధాలను కమ్యూనిస్టు వుత్పత్తి సంబంధాలుగ మార్చుట సాధ్యం. కమ్యూనిజం నిర్మాణానికి కమ్యూనిస్టుపార్టీ మూడవ కార్యక్రమాన్ని రూపొందించింది.

2. లెనిన్ రూపొందించిన నూతన పారిశ్రామిక విధానం, సోవియట్ సోషలిస్టు సహకార వ్యవసాయవిధానం, సమిష్టివ్యవసాయం మహోన్నత విజయాలను సాధించి, వెనుకబడిన దేశాన్ని పారిశ్రామికంగా, సైనికంగా అత్యున్నత శిఖరాలకు చేర్చింది. గ్రామీణప్రాంతాలు ప్యూడలిజాన్నుండి విముక్తి పొందాయి. సోషలిస్టు విప్లవం కార్మికవర్గ నాయకత్వంలో, రైతాంగ మిత్రత్వంతో, ప్రణాళికా బద్ధ అభివృద్ధితో ప్రజల జీవనప్రమాణాభివృద్ధి మెరుగుపరచబడింది. సోషలిస్టు విప్లవంతో జాతుల అణచివేతపోయి స్వయం నిర్ణయాధికారం, సమానత్వం ప్రాతిపదికగా సోవియట్ సోషలిస్టు యూనియన్ ఆఫ్ రిపబ్లికులు యేర్పడినాయి. "మార్క్సు,ఎంజెల్సులు

---

2. అజయ్‌ఘోష్ వుపన్యాసం. ప్రపంచ కమ్యూనిస్టు 1960 సమావేశం. ఇండియా-చైనా సరిహద్దు వివాదం, భారతకమ్యూనిస్టుపార్టీ తీర్మానములు, ప్రకటనలు, వుపన్యాసాలు. 1953–62. (ఆంగ్లంలో) సి. పి. ఐ పబ్లికేషన్. పే. 44-46.

శాస్త్రీయంగా సోషలిజం భవిష్యత్తులో తప్పని సరియని చేసిన నిర్ధారణ, లెనిన్ మార్గదర్శకత్వంలో నిర్మాణ ప్రణాళికలలో వాస్తవమైంది[1]". సోషలిస్టు ప్రభుత్వం వొక ఆయుధంగా పనిచేసింది. కమ్యూనిస్టుపార్టీ నిర్ణయాత్మక పాత్ర వహించుతుందన్న మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతం పూర్తిగ రుజువైంది. సామాజిక నిర్మాణంలో లెనినిజం వాస్తవికత ఆచరణలో రుజువై, సోషల్ డెమొక్రట్ల సిద్ధాంతం బీటలువారింది. "సోవియట్ ప్రజల ఐచ్ఛిక శ్రమశక్తితో, కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంత ఆచరణతో, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, శాస్త్రీయ సోషలిస్టు నిర్మాణం, ఆచరణలో పుటంపెట్టబడినవి. సోషలిజానికి రాచబాట వేయబడింది[2]".

3. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నూతన ఆర్థిక రాజకీయ సంబంధాలను, దేశాల మధ్య రూపొందించింది. సోషలిస్టు దేశాలు ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేసి, వొకే విధమయిన ఆర్థిక విధానాన్ని కార్మికవర్గ నాయకత్వంలో వొకే విధమైన ప్రజా ప్రభుత్వాలను, మార్క్సిజం-లెనినిజం సామాజిక సిద్ధాంతాన్ని, విప్లవ విజయాల పరిరక్షణ సమిష్టి ప్రయోజనాన్ని, స్వాతంత్ర్యం, సమానత్వం, సోషలిజం ధ్యేయంగా కలిగి వున్నవి. సోషలిస్టు దేశాల ఆర్థిక, శాస్త్ర సాంకేతిక సహకార ఆర్థిక ప్రణాళికల సమన్వయం, ప్రత్యేక ఉత్పత్తుల సంలీన క్రమంలో నూతన అంతర్జాతీయ పని విభజన, నూతన సోషలిస్టు అంతర్జాతీయ ఆర్థిక విధానం రూపొందుతున్నది.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, పెట్టుబడిదారి విధానంపై ఆర్థికాభివృద్ధి పోటీలో నిర్ణయాత్మక విజయం వైపు పురోగమిస్తున్నది. పారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తులలో మొత్తంగా పెట్టుబడిదారి విధానాన్ని త్వరలోనే అధిగమించనున్నది. శాంతి, ప్రజాస్వామ్యం, సోషలిజం, సామాజికాభివృద్ధిలో దాని ప్రభావం పెరుగుతున్నది. నూతన ప్రపంచంలో నూతన సమాజ నమూనాలు విస్తృత ప్రాంతాలలో శ్రామిక శక్తి సాహసాలతో నిర్మింపబడుతున్నవి. "సామ్రాజ్యవాదం క్షీణించి, మరణావస్థలో వున్న పెట్టుబడిదారి విధానంగా వుంది. ప్రపంచ పెట్టుబడిదారి వ్యవస్థ మొత్తంగా "పండి", కార్మికవర్గ సామాజిక విప్లవానికి సిద్ధంగా వుంది." [2]

4 ఫ్యూడలిజాన్ని బూర్జువా విధానం స్వాతంత్ర్యం. సౌభ్రాతృత్వం, సమానత్వ నినాదాలతో చరిత్ర పుటలలోనికి నెట్టివేసింది. అధికారాన్ని చేబట్టింది. సమానత్వం కాదుగదా, సామాజిక ఆర్థిక అసమానత్వ నూతన అఘాతపు లోతులలోనికి

1. కమ్యూనిజానికి బాట (1961) సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22వ, కాంగ్రెసు, డాక్యుమెంట్సు, మాస్కో. పే. 259.
2. ది రోడ్‌టు కమ్యూనిజం (ఆంగ్లంలో) సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 22వ, కాంగ్రెసు డాక్యుమెంట్సు. మాస్కో, 1961. పే 463.

త్రోసివేసింది. పాశ్చాత్యం కాదుగదా, తీవ్ర హింసా, దౌర్జన్యపూరిత బూర్జువా పాలనలో వర్గ పోరాటాలు మునిగిపోవునట్లు చేసింది.

మొదటి ప్రపంచయుద్ధం, అక్టోబరు విప్లవంతో సామ్రాజ్యవాదంలో సామాన్య సంక్షోభం ప్రారంభమయింది. రెండవ ప్రపంచ యుద్ధాంతంలో యూరపు, ఆసియాలలో ప్రజ్వరిల్లిన సోషలిస్టు విప్లవ విజయాలతో ప్రపంచ సామ్రాజ్యవాద సంక్షోభం మూడో దశకు చేరింది. దీని అభివృద్ధి యుద్ధంతో ముడివడి వుండక పోవుటే ప్రధాన లక్షణంగా వుంది.

అనేక సామ్రాజ్యవాద వలస దేశాలు విముక్తి పొందుటతో సోషలిస్టు ఆర్థికాభివృద్ధి జరిగి, పెట్టుబడిదారి విధానం బలహీనపడింది. ప్రపంచ పెట్టుబడిదారివర్గములో అంతర్గత వైరుధ్యాలు తీవ్రమగుట, ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారి విధానాభివృద్ధితో పెట్టుబడిదారి వర్గాలలో వైరుధ్యం పెరుగుట, ఉత్పత్తి శక్తులను పూర్తిగ వినియోగించలేని పరిస్థితి, పెట్టుబడి-కార్మికుల వైరుధ్యాలు యినుమడించి అంతర్గత అస్థిరతతో పెట్టుబడిదారి విధాన క్షీణత, సైనికతత్వం పెరిగిపోవుట, అన్ని రంగాలలో అభివృద్ధి నిరోధకుల పెరుగుదల, బూర్జువావర్గం ప్రజాస్వామ్య ముసుగు విత వాడి ఫాసిస్టు నిరంకుశత్వాలు అనేక దేశాలలో నెలకొల్పుట, దాని విధానాలు, సిద్ధాంతాలు సంక్షోభంలో మునుగుట అన్నీ పెట్టుబడిదారి సామాన్య సంక్షోభ ప్రతిబింబాలు ఫలితాలు.

రాజకీయ, ఆర్థిక వొత్తిడిలు గుత్త పెట్టుబడిదారి విధానం, ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారి విధానంగా అభివృద్ధి చెందునట్లు చేస్తాయి. ప్రభుత్వ ద్రవ్య గుత్తపెట్టుబడి వర్గాల ప్రయోజనాలకై బూర్జువా ప్రభుత్వం ఆర్థిక, పారిశ్రామిక రంగాలలో కొన్నింటిని జాతీయం చేస్తుంది. నూతన పెట్టుబడిదారి విధానం మార్కెటు సమస్య పరిష్కరించలేని తీవ్రతకు గురి చేసింది. ఉత్పత్తితోపాటు కొనుగోలు శక్తి పెరగక అఘాత మేర్పడుట దాని ఆర్థిక సూత్రము. తమ బయటపడుటకు తన భారాన్ని వెనుకబడిన దేశాలపై త్రోసి, వాటి పారిశ్రామికాభివృద్ధిని కుంటుపరుస్తుంది. అనేక ఆర్థిక మండలాలు, లెక్కలేనన్ని కష్టమ్సు అడ్డంకులు, విబంధనల ముళ్ళతీగలు, వివిధ కరెన్సీలు, పెట్టుబడి రంగాలు, వనరుల ప్రాంతాలుగ సామ్రాజ్యవాద శిబిరం వుంది. సామ్రాజ్యవాద వలసలు అంతరించుటతో మరింత కుదించుకుపోయింది. ఇవన్నీ ప్రపంచ పెట్టుబడిదారి విధానపు ఆర్థిక సంక్షోభాన్ని తీవ్రతరం చేస్తున్నాయి. అసమానాభివృద్ధి, బలాల సమతూకం విచ్ఛిన్నమగుటతో వైరుధ్యాలు తీవ్రమయ్యాయి. అమెరికా గుత్త పెట్టుబడి వర్గాలు అన్ని దేశాలలోని అభివృద్ధి నిరోధకుల రక్షకులయ్యారు.

నేడు సామ్రాజ్యవాదానికి సోషలిజానికి మధ్యగలదే మౌలిక వైరుధ్యం

పెట్టుబడిదారి విధానం ప్రపంచాన్ని ముంచేస్తున్న తీవ్ర సంక్షోభాన్ని రూపుమాప లేదు. అంతర్జాతీయ ప్రభుత్వ గుత్త పెట్టుబడి సంస్థలు సంలీనంతో సంక్షోభాన్ని, మార్కెట్లు సమస్యను పరిష్కరించకపోగా, ప్రపంచ మార్కెట్లను తిరిగి విభజించే మరో రూపాలు మాత్రమే. కాన తీవ్ర సంఘర్షణలకు స్థానాలయ్యాయి. ప్రధాన సామ్రాజ్యవాద శక్తుల మధ్య వైరుధ్యాలు తీవ్రమయ్యాయి, పునాదులు కూలిపోతున్నవి. ఆటం ఆయుధాలు యీ చారిత్రిక పతనాన్నుంచి పెట్టుబడిదారి విధానాన్ని కాపాడజాలవు.

5. జాతీయ విముక్తి విప్లవోద్యమాలపై 22 వ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు సిద్ధాంతం, అవగాహన వైఖరి తెలుసుకొందాము. [1]

ఎ) ప్రపంచంలో జాతీయ విముక్తి విప్లవోద్యమాల తుఫాన్ కొనసాగుతూనే వుంది. సోషలిజం అభివృద్ధితో అణగారిన జాతుల విముక్తి యుగం, వలస విధానానికి చరమగీతం పాడుతున్నది. అనేక దేశాలు సామ్రాజ్యవాద దాస్య సంకెళ్ళను బ్రద్దలుకొట్టి స్వాతంత్ర్యాన్ని సాధించాయి. కాని, నూతన స్వాతంత్ర్య దేశాలు వాస్తవంగా విదేశీ గుత్త పెట్టుబడిదారులపై ఆర్థిక స్వాతంత్ర్యానికై, స్థిరమైన, బలమైన రాజకీయ స్వాతంత్ర్యం కొరకు పోరాటాలు సాగిస్తూనే వున్నాయి. ఈ పోరాటాలు సామ్రాజ్యవాద, వారి అనుకూల, అభివృద్ధి నిరోధక శక్తుల వ్యతిరేక పోరాటాలు, వలస విధానం క్రింద యింకా మ్రగ్గుతున్న ప్రజ సమూహానంతో విప్లవ పోరాటాలు సాగిస్తున్నారు. నూతన స్వతంత్ర్య దేశాలు, ప్రపంచ సామ్రాజ్యవాద "గ్రామసీమలు"గా అర్ధవలస దోపిడికి గురి అవుతునే వున్నవి.

సామ్రాజ్యవాద శక్తుల పునాదులను, వలస అవశేషాల నిర్మూలన విదేశీ గుత్త పెట్టుబడి వర్గాలను పారద్రోలి, జాతీయ పారిశ్రామికాభివృద్ధి, ఫ్యూడలిజం నిర్మూలన కానిదే, జాతీయ ప్రయోజనాలు పూర్తిగ నెరవేరవు. ఈ కర్తవ్య నిర్వహణకు, సామ్రాజ్యవాదం బలహీనస్థితి, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అన్నీ యెంతో దోహదకారిగ వున్నవి. విస్తృత ప్రజాస్వామ్య శక్తులు, దేశభక్తుల ఐక్య సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటమే విదేశ పెట్టుబడుల నిష్క్రమణ మార్గం, ఫ్యూడలు మూల స్తంభాలు అట్టి సామాన్య ప్రజాస్వామ్య ఉద్యమాల దాడితోనే కూలిపోగలవు.

సామ్రాజ్యవాదులు వలస దోపిడిని నూతన రూపాలలో సాగించుటకు, ఆర్థిక వొత్తిడి, లంచం, కుట్రలు, హింస, దౌర్జన్యం, ప్రభుత్వాల కూలద్రోయుట, సైనిక కూటములు యేర్పరచుట, వలస యుద్ధాలు లాంటి అన్ని ఆయుధాలను వినియోగిస్తున్నారు. నూతనంగా తమ బలాన్ని పెంపొందించుకొనుటకు జాతీయ బూర్జువా వర్గ

---

1. ది రోడ్ టు కమ్యూనిజం (ఆంగ్లంలో) సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22 వ కాంగ్రెసు, డాక్యుమెంట్సు, మాస్కో, 1961. పే 490-7

-లను దువ్వట, వారి తొత్తులయిన మిలిటరీ దౌర్జన్య శక్తులను అధికారంలో నెల కొల్పుట చేస్తున్నారు. జాతీ యతత్వ శక్తులను, ఆటవిక జాతులను విష ప్రచారంతో రెచ్చగొట్టి, అభివృద్ధి నిరోధక శక్తులకు ప్రోత్సహించుచు, జాతీయ విముక్తి ఉద్య మాలను చీల్చుతున్నారు. జాతీయ సమస్య పరిష్కారానికి ప్రధాన అడ్డంకి, శత్రు భావం కలది సామ్యావాదమే.

"అందువలననే "శత్రువు భావం కల సామ్రాజ్యవాద వ్యతిరేక, నిలకడ ధృఢతర పోరాటం అవసరం. ఒకప్పటి వలసల, అర్ధవలసలను, పెట్టుబడిదారి ఆర్థిక పరిధిలో, ఆధారిత స్థితిని శాశ్వతంగా కొనసాగించు సర్వ ప్రయత్నాలను సామ్రాజ్య వాదం చేస్తున్నది. నూతన వలస విధానానికి ఆమెరికా పెట్టని కోట." [1]

బి) ఆర్థిక, సామాజికాభివృద్ధికై, జరుగు పోరాట ఆభివృద్ధికి మౌలికంగా కార్మిక, కర్షక ఐక్యత అవసరం. ఈ ఐక్యత విస్తృత జాతీయ ఐక్యసంఘటనకు పునాది అగుతుంది. సమాజాకాభివృద్ధికి, జాతీయప్రయోజనాలకై జరిగే పోరాటంలో కార్మికవర్గం స్థిరమైన పోరాటశక్తి, పారిశ్రామికీకరణ జరిగిన కొలది, కార్మికవర్గం ఎన్నోరెట్లు పెరుగుతుంది. దాని సామాజిక రాజకీయపాత్ర యెక్కువగుతుంది. కార్మిక కర్షక ఐక్యతాబలంపై జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పోరాటంలో పాల్గొనుట ఆధారపడివుంది. జాతీయ సంఘటన కార్మికవర్గం, రైతాంగం, జాతీయ బూర్జువావర్గం, ప్రజాస్వామిక మేధో వర్గాల కలయికతో యేర్ప డుతుంది.

అనేక దేశాలలో జాతీయ విముక్తి వుద్యమం జాతీయ జండా క్రింద జరుగు తున్నది. ఆజాతీయ విముక్తి పోరాటాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక, జాతి పునర్ని ర్మాణ లక్షణాలను కలిగి వుంటుంది. అణచే జాతుల జాతీయత, అభివృద్ధి నిరోధక పై వర్గాల ప్రయోజనాల పరిరక్షణ సిద్ధాంతం తప్ప మరొకటిగాదు. అదే ప్రకోపిం చితే జాతీయ దురహంకారమౌతుంది.

జాతీయ బూర్జువావర్గం ద్వందవై ఖరిగలది. నూతన పరిస్థితులలో మాజీవల సల, ఆధారిత దేశాల జాతీయ బూర్జువావర్గం, ముఖ్యంగా సామ్రాజ్యవాదంతో యెట్టి సంబంధం లేనిది సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాల నిర్వహణలో వాస్తవంగా పాల్గొనేపాత్ర, కోరికగలది. అత్యవసర జాతీయ సమస్యల పరిష్కా రానికి దాని అభ్యుదయకరపాత్ర,పాల్గొనే శక్తి,యింకా అంతం కాలేదు. కానిశ్రామిక వర్గాల, ధనిక వర్గాల మధ్య వైరుధ్యం పెరిగిన కొలది, వర్గ పోరాటం తీవ్రమైన కొలది సామ్రాజ్యవాద, దేశీయ అభివృద్ధి నిరోధక శక్తులతో జాతీయ బూర్జువావర్గం రాజీ వైఖరి నవలంభించుతుంది.

---

1. ది రోడ్ టు కమ్యూనిజం (ఆంగ్లంలో) సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22 వ కాంగ్రెసు డాక్యుమెంట్సు, మాస్కో 1961, పే. 492.

స్వాతంత్ర్యం పొందిన దేశాలలో అభివృద్ధి సంక్లిష్టము, వివిధ దొంతరుల విధానక్రమం. చారిత్రకంగా, సామాజిక పరిస్థితుల భిన్నత్వాల కారణంగా ప్రజల విప్లవ కార్యాచరణలో భిన్నరూపాలు, సామాజికాభివృద్ధి వేగంలో భిన్నత్వం వ్యక్త మవుతుంది.

సామ్రాజ్యవాద దాస్యశృంఖలాలనుండి బయటపడిన యీ దేశాల ముందున్న ప్రశ్న మౌలికమైనది. పెట్టుబడిదారి విధానమా? పెట్టుబడిదారేతర మార్గమా? ఏ మార్గాన్ని అనుసరించాలి?

పెట్టుబడిదారి మార్గంలో వారికి లభించేదేమిటి?

ప్రజల జీవితాన్ని దుర్భరం చేస్తుంది. సత్వర ఆర్థికాభివృద్ధిని గ్యారంటీ చేయదు. దారిద్ర్యాన్ని నిర్మూలించలేదు. సామాజిక అసమానత పెరిగిపోతుంది. గ్రామీణ ప్రాంతాలలో పెట్టుబడిదారి విధానం రైతులను మరింత క్రుంగదీస్తుంది. వారి బొక్కసాలు నింపుటకు కార్మికులు మరింత శ్రమశక్తిని ధారపోయాలి లేదా విప్లవోద్యమ సైన్యాన్ని పెంచాలి. బడా పెట్టుబడిదారులు పోటీలో పెటీ బూర్జువావర్గం అణగారిపోతుంది. విద్య, ప్రజా అవసరాలు, సాంస్కృతిక వ్యవహారాలు ప్రజలకు అందుబాటులో వుండవు. మేధావివర్గాలు తమ మేధో శక్తి అమ్ముకోనవలసి వస్తుంది.

సోషలిస్టు మార్గంలో ప్రజలకు లభించేదేమిటి?

సోషలిజం ప్రజల సుఖ సంతోషాల రాచబాట. ఆర్థిక సామాజికాభివృద్ధిని గ్యారంటీ చేస్తుంది. అనేక శతాబ్దాలలోగాక, ఒక జీవితకాలంలో వెనుకబడిన దేశాలను పారిశ్రామిక దేశాలుగ మార్చుతుంది. సహజంగానే సోషలిస్టు ఆర్థిక ప్రగతి అభివృద్ధి దేశాలను సుభిక్షంచేస్తుంది. దోపిడి విధానాన్ని, అసమానతను నిరుద్యోగాన్ని రూపుమాపుతుంది. సోషలిజం రైతులకు భూములు, యంత్రాలనిచ్చి సహకార వ్యవసాయాన్ని ప్రోత్సహిస్తుంది. ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచి, భౌతిక, సాంస్కృతిక అవసరాలను తీర్చుతుంది. మేధావి వర్గాలకు వారి సృజనాత్మక శక్తుల అభివృద్ధికి తోడ్పడుతుంది. పెట్టుబడిదారేతరమార్గం క్రమేణా సోషలిజానికి దారి నేర్పరుచుతుంది.

ఏ మార్గం అనుసరించవలసింది ప్రజలే నిర్ణయించాలి. నేటి ప్రపంచశక్తుల సమతూకంలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థనుండి లభించగల మద్దతు, అవకాశాలను పరిగణలోనికి తీసుకొని, మాజీవలస ప్రజాసామాన్యం, తమ ప్రయోజనాల దృష్టిలో వారే నిర్ణయించుకొనగలరు. వర్గ శక్తుల బలాబలాలబట్టి నిర్ణయింపబడుతుంది. ప్రజాస్వామ్య, కార్మిక, కర్షకోద్యమ, ప్రజల బలం పెట్టుబడిదారేతర మార్గాభివృద్ధిని సుస్థిరం చేయగలదు. అత్యధిక ప్రజాసామాన్య ప్రయోజనాలను పరిరక్షించగలదు.

జాతీయ ప్రజాస్వామ్య నిర్మాణం, వెనుకబడిన దేశాల అభివృద్ధికి నూతనావకాశాలను సృష్టిస్తుంది. సంపూర్ణ స్వాతంత్ర్యం, విస్తృత ప్రజాస్వామ్యాలకై పోరాడే

అన్ని అభ్యుదయకర, దేశభక్తివర్గాల సంఘటిత శక్తే, భారత ప్రజాస్వామ్యానికి రాజకీయ పునాది. అదే సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక ప్రజాస్వామ్య విప్లవాన్ని సంపూర్తి చేస్తుంది.

కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక, ప్రజాస్వామ్య విప్లవానికై వేరుగా జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వానికి, సాంఘికాభివృద్ధికి పోరాడు తున్నారు. జాతిమహాదాశయ, ప్రయోజనాలకు కమ్యూనిస్టు ధ్యేయం అనుగుణంగానే వుంది. కమ్యూనిస్టు వ్యతిరేక ముసుగులో జాతీయ సంఘటనవనువిచ్ఛిన్నంచేసి, వారిని వేటాడితే, జాతీయ విముక్తి పోరాటం బలహీనపడుటయేగాక, ప్రజల జాతీయ ప్రయోజనాలను, సాధించిన విజయాలను కోల్పోవుట జరుగుతుంది

జాతీయ ప్రభుత్వాలు ప్రపంచంలో చురుకైన స్వతంత్ర శక్తులై ప్రధానంగా సామ్రాజ్యవాద వ్యతిరేక, అభ్యుదయ, విప్లవశక్తులగుతవి, మరో ప్రపంచ యుద్ధ వ్యతిరేకశక్తులగుతవి. ఈ దేశాలలోని ప్రజాశక్తులు అభివృద్ధి నిరోధకుల ఆటలు కట్టించి, జాతీయ బూర్జువావర్గ వూగిసలాటను పోగొట్టి ప్రపంచశాంతికి కంచుకోటగా చేయవచ్చు. ఇదేవారి మౌలిక ప్రయోజనాలు, ప్రజాప్రయోజనాలు వేరు కాంచిలంచేది.

"నూతన స్వాతంత్ర్య దేశాల, సోషలిస్టు దేశాల ప్రజలు సంయుక్తంగా యుద్ధ ప్రమాద వ్యతిరేకంగా, ప్రపంచశాంతి పోరాటంలోని ముఖ్యాంశము. ప్రపంచ మూడవవంతు మానవ జాతి ఆకాంక్షను, బలాన్ని యీ బలమైన సంఘటన వ్యక్తం చేస్తున్నది. సామ్రాజ్యవాద దురాక్రమణను త్రిప్పికొట్ట గల శక్తిని కలిగి వున్నది",

6. అంతర్జాతీయ విప్లవ కార్మికవర్గ ఉద్యమం గణనీయమయిన విజయాలను సాధించింది. దాని ప్రధాన విజయం ప్రపంచ సోషలిస్టువ్యవస్థను ఏర్పాటు గావించుట పెట్టుబడిదారి ప్రపంచంలోని ప్రజా సామాన్యాన్ని సోషలిస్టు విజయాలు విప్లవ ప్రభావితులను చేస్తున్నవి. వారి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని ఉత్సాహపరచి బలపరచి అనుకూల వాతావరణాన్ని కలుగజేస్తున్నవి.

అటంకాంబుల ఉత్పత్తిదారులు, ప్రపంచ శాంతికి శత్రువులు గుత్త పెట్టు దారులే. కార్మిక, కర్షక, మధ్యతరగతి వర్గాలకు శత్రువులు వీరే. కాన, కార్మికవర్గం తమ ప్రధాన దాడిని గుత్త పెట్టుబడిదారి వర్గంపైనే కేంద్రీకరించుతుంది. వారి నియమరహిత పాలనాధికారాలను రూపుమాపాలని ప్రపంచ అన్ని జాతుల, వర్గాలను కోరుతున్నది.

"సోషలిస్టు, సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ విముక్తి విప్లవాలు, జనతా ప్రజాస్వామ్య విప్లవాలు, విస్తృత రైతాంగ ఉద్యమాలు. ఫాసిస్టు, తదితర నిరంకుశ ప్రభుత్వ వ్యతిరేక ప్రజా పోరాటాలు, సాధారణ ప్రజాస్వామ్య ఉద్యమాలు అన్ని

---

1 ది రోడ్ టు కమ్యూనిజం (ఆంగ్లంలో) సోవియట్ కమ్యూనిస్టుపార్టి 22వ కాంగ్రెసు, డాక్యుమెంట్సు. మాస్కో 1961. పే. 496.

కలిసి ప్రపంచ విస్తృత విప్లవ పోరాటాల క్రమంలో పెట్టుబడిదారి విధానాన్ని వాళ నము చేస్తున్నవి.[1]

7. ప్రపంచంలో నేడు బూర్జువా, కమ్యూనిస్టు సిద్ధాంతాల మధ్య తీవ్ర పోరాటము జరుగుచున్నది. మానవజాతి జీవితంలో, ముఖ్యంగా పెట్టుబడిదారి విధానం సోషలిస్టు పరివర్తనలో యిది ప్రతిబింబించుచున్నది. "కార్మికవర్గ విప్లవం" ప్రపంచ దృక్పథం, నూతన చారిత్రిక యుగంలో వాస్తవంగా విజయాన్ని పొందింది. మార్క్సిజం-లెనినిజం అభ్యుదయ ప్రపంచ మనోఫలకాన్ని ఆక్రమించింది."[2]

చరిత్ర పరీక్షలో బూర్జువా సిద్ధాంతాలు, దృక్పథాలు నిలువబడ జాలక పోయాయి. జీవితంలోని ప్రశ్నలకు అవి శాస్త్రీయ సమాధానాలను యివ్వలేదు, యివ్వ జాలవు. బూర్జువా వర్గం ప్రజలను సమీకరించగల ఏ నూతన ఆలోచనా విధానాలను అందించగల స్థితిలో లేదు. పెట్టుబడిదారి దేశాలలోని ప్రజలు బూర్జువా ప్రపంచ దృక్పథాన్ని విరసించుతున్నారు. బూర్జువా సిద్ధాంతం సంక్షోభంలో పడింది.

చారిత్రక అనుభవం సోషల్ డెమోక్రసీ సిద్ధాంత, విధానాల వైఫల్యాన్ని స్పష్టం చేసింది. సంస్కరణవాద పార్టీలు అధికారంలోనికి వచ్చినా గుత్త బూర్జువా వర్గాలను కాదని ఏమీ చేయలేదు. వారి కమ్యూనిస్టు వ్యతిరేకత సోషల్ డెమోక్రసీని ఏమీ చేయలేని స్థితికి తీసుకెళ్ళింది. సోషల్ డెమోక్రసీ రాజకీయ, సైద్ధాంతిక సంక్షోభానికి ప్రధాన కారణంమిదే.

8. శాంతియుత సహజీవనం, శాంతియుత పరివర్తన, శాంతియుత పోటీ, ప్రపంచ శాంతికై పోరాడుట సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ధ్యేయం, కర్తవ్యం. విదేశాంగ విధాన లక్ష్యం శాంతిని పెంపొందించుట, మానవజాతి మారణహోమ మయిన ప్రపంచయుద్ధ నివారణ, దేశాల మధ్య నూతన సంబంధాల అభివృద్ధికి తగిన వాతావరణ మేర్పడింది. చరిత్రలో మొట్టమొదటిసారిగా చిన్న దేశాలు కూడా స్వతంత్ర విదేశాంగ విధానాన్ని, శాంతియుత సహజీవనాన్ని సాగించగల పరిస్థితులు ఏర్పడినాయి. ఈ పరిస్థితులన్నీ దేశంలో కమ్యూనిస్టు సమాజాన్ని, ప్రపంచంలో సోషలిస్టు సమాజాల నిర్మాణానికి పోరాడవలసి వుంది. ఇదే ప్రధాన ఉద్దేశ్యం, ఆశయము.

"మానవ జాతినే నాశనం చేసే అణు, యితర మారణాయుధాల నిర్మాణం, అణు యుద్ధాన్ని ప్రపంచ ప్రజలు సరియైన సమయంలో నివారించాలి. సోషలిస్టు

1. ది రోడ్ టు కమ్యూనిజం (ఆంగ్లంలో) సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22 వ. కాంగ్రెసు డాక్యుమెంట్సు, మాస్కో 1961. పే. 484.

2. ........ అదే .. .... పే. 497.

శిబిరం, ప్రపంచ కార్మికవర్గం, శాంతిప్రియ దేశాలు అన్నీ కలిసి ప్రపంచ యుద్ధాన్ని నివారించుట సాధ్యం. సామ్రాజ్యవాద శక్తులపై సోషలిస్టు శక్తుల ఆధిక్యత, యుద్ధ శక్తులపై శాంతి శక్తుల ఆధిక్యత, ప్రపంచంలో ఒక భాగంలో సామ్రాజ్యవాదం వున్నపుడే, ప్రపంచమంతటా సోషలిజం విజయాన్ని సాధించక ముందే, యీ ప్రపంచంనుండి యుద్ధం లేకుండా చేసి, సుస్థిర శాంతిని నెలకొల్పుట కమ్యూనిజపు చారిత్ర కర్తవ్యం"[1] అంతర్జాతీయ పర్యవేక్షణలో సాధారణ సంపూర్ణ నిరాయుధీకరణ సుస్థిర శాంతిని తిరుగులేని దావిని చేస్తుంది. సామ్రాజ్యవాదం మానవ వనరులు సంపదలు గణనీయ భాగాన్ని అంతులేని ఆయుధీకరణకు వినియోగించి, మానవ జీవితాన్ని దుర్భరం చేసింది.

సోషలిస్టు, పెట్టుబడిదారి దేశాల మధ్య శాంతియుత సహజీవనం నేటి సజీవ వాస్తవం, వాంఛనీయం, మానవాభ్యుదయానికి అదే మార్గం. అంతర్జాతీయ వివాదాలను యుద్ధం పరిష్కరించజాలదు, అది పరిష్కార మార్గంకాదు చరిత్ర శాంతియుత సహజీవనమూ, మానవజాతి నాశన యుద్ధమూ అనే ప్రత్యామ్నాయాలను మన ముందుంచింది. సామ్రాజ్యవాద యుద్ధోన్మాదులు నూతన ప్రపంచ యుద్ధాన్ని మూర్ఖముగా ప్రారంభించితే, అట్టి యుద్ధాన్ని ప్రారంభించిన సమాజ వ్యవస్థను మానవ జాతి సహించజాలదు. సామ్రాజ్యవాదాన్ని భూస్థాపితం చేస్తారు.

శాంతియుత సహజీవనమంటే అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికి యుద్ధ మార్గాన్ని నిరసించుట. పరస్పర అవగాహన, సమానత్వం, విశ్వాసం, సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొనుట, పంచశీల సూత్రాలు పాటించుట.

9. కమ్యూనిస్టు సమాజ నిర్మాణం సోవియట్ ప్రజల తక్షణ ఆచరణ కర్తవ్యం. క్రమేణా సోషలిజం కమ్యూనిజంగా అభివృద్ధి చెందుట నేటి వాస్తవ సిద్ధాంత సూత్రం. గత దశాబ్దాలలో సోవియట్ సోషలిస్టు సమాజాభివృద్ధి యీ పరిస్థితులను సృష్టించింది.

భౌతికావసరాలు. సాంకేతిక పునాదిని కమ్యూనిస్టు నిర్మాణానికై సృష్టించుటకు పెద్ద మొత్తాలను వినియోగించవలసి వుంటుంది. అత్యంత వేగంగా, సమర్థవంతంగా, అత్యంత ఆర్థిక ప్రయోజనకారిగ వనరులను వినియోగించుట నేటి కర్తవ్యము. అందుకై పరిశ్రమల ఉత్పత్తి శక్తి, శ్రామికోత్పత్తిని పెంచుట 10 సంవత్సరాలలో 100 శాతం పెంచాలి, 20 సంవత్సరాలలో 300-350 శాతం పెంచవలసి వుంటుంది.

నగర, గ్రామీణ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక అంతరాలను, వారి జీవన

---

1. ది రోడ్ టు కమ్యూనిజం (ఆంగ్లంలో) సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22 వ, కాంగ్రెసు. డాక్యుమెంట్సు, మాస్కో 1961. పే. 505.

ప్రమాణాలలోని అంతరాలను తొలగించుట కమ్యూనిజపు నిర్మాణ అత్యున్నత విజయం కాగలదు.

"యాజమాన్యంలో ప్రజాస్వామిక సూత్రాలను అభివృద్ధి పరచుట కమ్యూనిస్టు నిర్మాణంలో ప్రాథమిక చర్య, దీనితోపాటు ప్రభుత్వం కేంద్రీకృత ఆర్థిక యాజమాన్యాన్ని బలపరచవలసి వుంటుంది. స్థానిక పరిశ్రమల, సంస్థల ఆర్థిక స్వాతంత్ర్యాన్ని వాటి హక్కులను కొనసాగించుట, విస్తరణ చేయుట, ఒకే ఆర్థిక జాతీయ ప్రణాళిక పరిధిలో జరగాలి. క్రింది నుండి పరిశ్రమ స్థాయిలో తయారు చేయబడి, ప్రతిపాదించబడిన అంశాలు ప్రణాళికా రచనలో అధిక ప్రాముఖ్యత వహించాలి.

ప్రజల సంక్షేమ జీవనాభివృద్ధికి పార్టీ రూపొందించిన కర్తవ్యాలను పరిపూర్తి చేయుటతో సోవియట్ యూనియన్ అవసరాలను బట్టి పంపకం అనే కమ్యూనిస్టు సూత్రాన్ని ఆచరణలో వాస్తవం చేయుటలో గణనీయంగా పురోగమించగలదు.

చారిత్రికాభివృద్ధి తప్పనిసరిగా ప్రభుత్వం అంతర్ధానమగుటకు దారి తీస్తుంది. అభివృద్ధి చెందిన కమ్యూనిస్టు సమాజ నిర్మాణం దేశంలోను ప్రపంచ స్థాయిలో సోషలిజపు విజయం, సుస్థిరత్వతలాంటి బాహ్య పరిస్థితులు అభివృద్ధి చెందుట అత్యవసరం. ప్రజలలో కమ్యూనిస్టు చైతన్యాభివృద్ధి, కార్మిక, కర్షక మేధావి వర్గాల సైద్ధాంతిక, రాజకీయ ఐక్యత క్రమేణా శ్రామికప్రజల ఏకైక సమిష్టి కమ్యూనిస్టు సమాజంగా మమేకం అగుటకు తోడ్పడుతుంది.

ఈ విధమయిన అవగాహనతో కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22 వ, కాంగ్రెసు కార్యక్రమాన్ని రూపొందించింది. అజయ్‌ఘోష్ "మార్క్సు కమ్యూనిస్టు ప్రణాళికంతటి చారిత్రిక ప్రాముఖ్యత కలదని, కమ్యూనిజానికి బాట" యని కార్యక్రమంపై వ్యాఖ్యానించారు. ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల [1] 1960 ప్రకటన.

ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల 1960 ప్రకటన అనేక దేశాలలో చెలరేగుతున్న వాగ్వివాదాలలో అత్యంత ప్రాముఖ్యత కలిగి వుంది. అధికారి "ప్రప్రథమంగా 1957 ప్రకటన కంటె, నూతన యుగానికి, పెట్టుబడిదారివిధాన సాధారణసంక్షోభం లోని నూతన దశకు వివరణాత్మకంగా లక్షణాలను నిర్వచించింది. ద్వితీయంగా, నూతన ప్రపంచ పరిస్థితుల కారణంగా జాతీయ విముక్తి ఉద్యమాలకు, నూతన స్వాతంత్ర్యదేశాలకు గల భవిష్యత్తుకు గల నూతనావకాశాలను నిశిత విశ్లేషణ గావించి లోతైన అవగాహన నిచ్చింది[2]" అని వ్యాఖ్యానించారు.

---

1 అజయ్‌ఘోష్ (1962) అజయ్‌కుమార్ ఘోష్, వ్యాసాలు, ఉపన్యాసాలు (ఆంగ్లంలో) మాస్కో 1962. పే. 269.

2. అధికారి, జి. (1964) జాతి పునరుజ్జీవనానికి సోషలిజానికి భారతకమ్యూనిస్టు పార్టీ పంథా సి. పి. ఐ. పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే. 145.

"మన పార్టిలో ఘోరనష్టాన్ని కలుగజేసిన మితవాద సంస్కరణ వాద అవకాశవాదం, పిడివాద 'అతివాద అవకాశవాదం రెండూ కవల ధూతాలు సోదరపార్టీలను పట్టుకొని, అంత్యంత అనుభవం కలిగిన పార్టీలను కూడ పీడించసాగాయి. ఒక విధంగా, సోవియట్-చైనా కమ్యూనిస్టుపార్టిలు స్వయంగానే గుర్తించాయి, యితరులతో కలసి 1957 మాస్కో ప్రకటనలో నవంబరు 1960లో 81 సౌహార్ధపార్టీల మాస్కో సమావేశపు ప్రకటనలో పునరుద్ఘాటించారు[1]"

## ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల 1960 ప్రకటన

మాస్కో 1960, 81 దేశాల కమ్యూనిస్టుపార్టీల ప్రకటన ప్రధానాంశాలు సంక్షిప్తంగా యీక్రింది విధంగా చెప్పుకొనవచ్చు.

1) ప్రపంచ కమ్యూనిస్టు 1960 సమావేశం, 1957 మాస్కో ప్రకటనను పునరుద్ఘాటించి, శాంతి మానిఫెస్టోని ప్రకటించింది. శాంతి మానిఫెస్టోలోని గత మూడు సంవత్సరాల అంతర్జాతీయ పరిస్థితుల, ఘటనల విశ్లేషణ ప్రపంచాభివృద్ధిని, సృజనాత్మక మార్క్సిజం-లెనినిజంల శక్తివంతమైనపాత్ర, శాస్త్రీయ సిద్ధాంత అమోఘ శక్తిని ఋజువుచేసాయి.

"ప్రపంచసోషలిస్టు వ్యవస్థ వేగంగా శక్తివంతమై, అభివృద్ధి చెంది అంతర్జాతీయ ప్రభావాన్ని కలుగజేస్తున్నది. శక్తివంతమైన వలస విముక్తి వుద్యమాల ప్రభావంతో వలస విధానం క్షీణతాక్రమవేగం పుంజుకొనుట, ప్రపంచసామ్రాజ్యవాద పతనం, క్షీణతతో పెట్టుబడిదారిదేశాలలో వర్గపోరాటం యిమమడించింది. సామ్రాజ్యవాదంపై సోషలిజం అధిక్యత, యుద్ధశక్తులపై శాంతిశక్తుల అధిక్యత, ప్రపంచ రంగంలో అతిస్పష్టంగా కన్పించుతున్నది[2]" అయినా సామ్రాజ్యవాదం సహజనైజాన్ని విడనాడలేదు.

2) యుగస్వభావం, "నేడు ప్రపంచసోషలిస్టు వ్యవస్థ సమాజాభికాభివృద్ధికో నిర్ణయాత్మకమైన అంశమని, అదే ప్రధాన లక్షణమని[3]"సమావేశం నిర్వచించింది. గత దశాబ్దాలలో పాత, కొత్త ప్రపంచాల మధ్య జరిగిన బ్రహ్మాండమైన పోరాటాలలో సోషలిజం బలం అజేయమని ప్రదర్శితమైందని వివరించింది.

అంతేగాక "నేడు సమాజ సోషలిస్టు పరిణామానికై ప్రపంచసోషలిస్టు, సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులు పోరాడుతున్నవి. అదే నేటి చారిత్రిక సమాజాభివృద్ధి

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1987) రెమినిసెన్స్‌సెస్ ఆఫ్ ఎ ఇండియన్ కమ్యూనిస్టు (ఆంగ్లంలో) నేషనల్ బుక్ సెంటర్. పే. 184.
2. బేసిక్ డాక్యుమెంట్సు ఆఫ్ ది మాస్కో మీటింగ్సు. 1957-1960-1969 (ఆంగ్లంలో) పే. 17-12
3. అదే పే. 18.

ప్రధాన స్వభావపై ఖరిని, లక్షణాలను నిర్ణయిస్తుంది. సామ్రాజ్యవాదం ఎన్ని ప్రయత్నాలు చేసినా యీ చారిత్రిక పురోగమనాన్ని ఆపలేదు. సోషలిజపు మరో నిర్ణయాత్మక విజయానికి నమ్మకమైన ప్రాతిపదిక యేర్పరచబడింది. సోషలిజపు సంపూర్ణ అఖండ విజయం తధ్యం[1]" అని ప్రకటన స్పష్టం చేసింది.

పతనమార్గంలోని ప్రపంచ పెట్టుబడిదారి విధానాన్ని గురించి "ప్రపంచ పెట్టుబడిదారి విధానం వేగంగా చిన్నాభిన్నమై, కృశించే క్రమంలో వుంది. గుత్తపెట్టుబడిదారి విధానంలోని వైరుధ్యాలు, అది ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారి విధానంగా మార్పు చెందే క్రమాన్ని వేగవంతం చేసాయి. జాతి జీవనంపై గుత్తపెట్టులడి పిడికిలి బిగియుటతో పెట్టుబడిదారి విధానాన్ని రక్షించు ధ్యేయంతో ప్రజా సామాన్యంలోని విస్తృత భాగాల, కార్మికవర్గాల దోపిడిని తీవ్రతరం చేసి సామ్రాజ్యవాద,పెట్టుబడి, బూర్జువావర్గాలకు అధికలాభాలను చేకూర్చుటకు ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారి విధానం, గుత్తపెట్టుబడిదారిశక్తిని, ప్రభుత్వశక్తితో నంలీనం చేస్తుంది[2]". అట్టి మార్పుకు వివిధ కారణాలను విపరించింది. ఈదశ ప్రపంచ యుద్ధకారణంగా ప్రారంభం కాలేదని, ప్రత్యేకంగా రెండు వ్యవస్థల మధ్య పోటీవలన, సోషలిజానికి అనుకూలంగా ప్రపంచ బలాబలాల మార్పు వచ్చి, సామ్రాజ్యవాదంలో వైరుధ్యాలు గణనీయంగా తీవ్రమైన పరిస్థితి సంభవించిందని వివరించింది:

"అనేక దేశాలలో పాలక సామ్రాజ్యవాద బూర్జువా వర్గపు మూల స్తంభాలైన పెట్టుబడిదారి విధానం, ప్రజాస్వామ్యం బలాన్ని, విస్తృతిని, అభివృద్ధిని, యింకా యే మాత్రం నిరోధించేశక్తి లేనంతగా బలాన్ని కోల్పోయింది, అమెరికా నాయకత్వంలో సామ్రాజ్యవాదులు సైనిక, రాజకీయ కూటములను సోషలిస్టు శిబిరంపైపోరాటానికి, జాతీయవిముక్తి పోరాటాల, కార్మికవర్గ సోషలిస్టు వుద్యమాల పీకనులిమి వేయుటకు ప్రయత్నాలు చేస్తున్నారు. అమెరికా సామ్రాజ్యవాదం ప్రపంచ అభివృద్ధి నిరోధక శక్తుల ప్రధాన భోధకశక్తి, ప్రపంచపోలీసు, ప్రపంచ ప్రజసామాన్యశత్రువు అనుటకు గత సంవత్సరాల అంతర్జాతీయ పరిణామాలు అనేక నూతన సాక్ష్యాధారాలను సమకూర్చాయి[3]"యని సమావేశపు ప్రకటన అమెరికా నూతనపాత్రను స్పష్టం చేసింది.

3) సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధిలో నూతన దశ ప్రారంభమగుటను గురించి, సమావేశం యీ విధంగాపేర్కొంది." కమ్యూనిస్టు సమాజనిర్మాణాన్ని సోవియట్

---

1. బేసిక్‌డాక్యుమెంట్సు ఆఫ్ ది మాస్కో మీటింగ్సు. 1957-1960-1969. (ఆంగ్లంలో) సి.పి. ఐ. పబ్లికేషన్ 1971. పే. 19.
2. ........ అదే ........ పే. 23,
3. ........అదే ........ పే. 22

యూనియన్ సంపూర్ణ విస్తృతస్థాయిలో విజయవంతంగా కొనసాగిస్తున్నది. సోషలిస్టు శిబిరంలోని యితరదేశాలు సోషలిస్టు పునాదులను విజయవంతంగా నిర్మించుచున్నవి. కొన్ని అభివృద్ధి చెందిన సోషలిస్టు దశకు నిర్మాణాభివృద్ధి యిప్పటికే చేరినవి[1]".

సోవియట్ ప్రజలు సప్తవర్ష ఆర్థికాభివృద్ధి ప్రణాళికతో కమ్యూనిజానికి సాంకేతిక, భౌతిక సముదాయ నిర్మాణ పునాదిని అత్యంత వేగంగా విజయవంతగా నిర్మించుతున్నారు. యూరపు, ఆసియాలోని సోషలిస్టుదేశాలు సోవియట్ యూనియన్‌తో కలసి బలోపేతమైన సోవియట్ శిబిరమై, చరిత్రలో అతి కొద్దికాలంలో సోషలిస్టు నిర్మాణంలో గణనీయమైన అభివృద్ధి సాధించారు. గతంలో వ్యవసాయ దేశాలైన యీ సోషలిస్టు దేశాలన్నీ అభివృద్ధి చెందిన పారిశ్రామిక, వ్యవసాయ దేశాలైనవి. ఈ దేశాలన్నీ కష్టతరమైన సోషలిస్టు నిర్మాణాన్ని, స్వచ్ఛంధంగా వ్యక్తిగత వ్యవసాయాన్ని విస్తృత సహకారరైతులు రూపొందించుచున్నారు. సమాజ సాంఘిక నిర్మాణ వ్యవస్థలో చారిత్రాత్మక మార్పు వచ్చింది. ఈ జనతా ప్రజాస్వామ్య దేశాలలో భూస్వామ్య పెట్టుబడిదారి వర్గాలు రూపుమాపబడ్డాయి. కార్మిక వర్గం సమాజ ప్రధానశక్తి అయింది. సంఖ్య, రాజకీయ చైతన్యం, పరిపక్వత పెరిగింది. ఒక నూతన మేధావివర్గం జనించింది వివిధ జాతుల కార్మికవర్గ ఐక్యత రూపొందింది.

"నేడు సోవియట్‌లోనేగాక అన్ని సోషలిస్టుదేశాలలో పెట్టుబడిదారి విధాన పునరుజ్జీవనం సామాజిక, ఆర్థికంగా అసాధ్యం చేయబడింది. సామ్రాజ్యవాదుల అభివృద్ధి నిరోధపుల దురాక్రమణను సోషలిస్టు శిబిరపుసంయుక్తశక్తులన్నీ కలసి వాస్తవంగా ప్రతిసోషలిస్టు దేశరక్షణను నమ్మకంగా చేస్తున్నవి. ఆ విధంగా సోషలిస్టు దేశాలన్నీ ఒక శిబిరంలో సమీకరింపబడుట ఐక్యతాభివృద్ధి, యీ శిబిరపుబలం స్థిరంగా పెరుగుట సంపూర్ణ విజయాన్ని సుస్థిరం చేస్తుంది[2]".

"కార్మికవర్గాన్ని, సోషలిస్టు అంతర్జాతీయతా అవగాహనను, అన్ని జాతీయ తత్వ, హింసాతత్వాల యెడల అసహనాన్ని నిరవధికంగా బోధించుతుంది. కమ్యూనిస్టు, కార్మికపార్టీల దృఢఐక్యత, సోషలిస్టు దేశాల ప్రజాఐక్యత, మార్క్సిస్టు. లెనినిస్టు సిద్ధాంతాలపై విశ్వాసం, సోషలిస్టుదేశపు, మొత్తంగా సోషలిస్టు శిబిరపు మౌలికబలము."

"సోషలిస్టుదేశాలు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ రూపొందించు సమయమాసన్నమైంది. ప్రపంచ అభివృద్ధిపై, సోషలిస్టు అంతర్జాతీయ శక్తి బలమైన ప్రభావాన్ని

1. బేసిక్ డాక్యుమెంట్సు. మాస్కో మీటింగ్సు 1957-1960-1969 (ఆంగ్లంలో) సి. పి. ఐ. పబ్లికేషన్ 1972. పే 24.

2. అదే పే. 27.

కలిగించుతుంది శాంతి, ప్రజాస్వామ్యం, సోషలిజం ప్రయోజనాలకై నూతన కాలపు ముఖ్య సమస్య నూతన మార్గంలో పరిష్కారానికి వాస్తవ అవకాశాలు నేడున్నవి[1]". అని ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల 1960 సమావేశం స్పష్టం చేసింది.

4) శాంతి, శాంతియుత సహజీవనమునకు పోరాటము, మనకాలంలో యుద్ధం శాంతి సమస్యలు తీవ్ర వివాదగ్రస్థమైనవి[1].

యుద్ధం, పెట్టుబడిదారీ విధానం కవల పిల్లలు. మానవుడు మానవుని దోచే విధానం. మానవుడు మానవుని అంతం చేయువిధానం, పెట్టుబడిదారి విధానం యొక్క రెండు పార్శ్వాలు. సామ్రాజ్యవాదం మానవాళిపై రెండు వినాశకర ప్రపంచయుద్ధాలను తెచ్చిపెట్టి, నేడు ప్రపంచాన్ని, మానవాళిని సర్వనాశనం చేసే అణుయుద్ధానికి దారి తీస్తున్నది.

సామ్రాజ్యవాదం వున్నంతవరకు దురాక్రమణ యుద్ధాలకు భూమిక వుంటుంది. అమెరికన్ సామ్రాజ్యవాదం దురాక్రమణ యుద్ధాలకు ప్రధానశక్తి. దాని విధానం, సైనికతత్వ స్పందన సిద్ధాంతం సంఘర్షణలకుమూలం. కమ్యూనిస్టు ప్రమాదాన్ని ఎదుర్కొనుట అన్నసాకుతో అమెరికా, బ్రిటన్, ఫ్రాంసు, పశ్చిమ జర్మన్ సామ్రాజ్యవాద శక్తులు నాటో, సీటో, సెంటో, సైనిక కూటములు నేర్పరచాయి, ప్రపంచాన్ని యుద్ధపు అంచులకు అనేక పర్యాయములు తీసుకువెళ్ళాయి.

**"సామ్రాజ్యవాద దురాక్రమణదారులు ప్రపంచ యుద్ధానికై చేయు ప్రయత్నాలను అంతం చేయుకాలం ఆసన్నమయినది. ప్రపంచ సోషలిస్టు శిబిరం, అంతర్జాతీయ కార్మికోద్యమం, జాతీయవిముక్తి వుద్యమం, యుద్ధాన్ని వ్యతిరేకించే అన్నిదేశాల శాంతిశక్తుల సమిష్టి ప్రయత్నంతో ప్రపంచయుద్ధాన్ని ఆపగలవు[2]".** చరిత్రలో ప్రప్రథమంగా శాస్త్ర, సాంకేతిక, సైనికశక్తితో సహా నేడు ప్రపంచశాంతి శక్తులకు సమిష్టి కార్యాచరణతో నూతన ప్రపంచయుద్ధాన్ని నిరోధించగల శక్తి వున్నది. "యుద్ధం వచ్చేవరకు యుద్ధవ్యతిరేకపోరాటం వాయిదా వేయరాదు, అప్పటికి కాలం మించిపోవచ్చు. నేడే యుద్ధ నిరోధకశాంతి పోరాటం జరగాలి. అణుబాంబులు పడినప్పుడుకాదు. యుద్ధాన్ని నిరోధించుటకు దురాక్రమణను సరియైన కాలంలోనే మట్టు పెట్టాలి, అది విస్తరించనివ్వరాదు[3]." నేడు శాంతి పోరాటమంటే, సామ్రాజ్య

---

1. బేసిక్ డాక్యుమెంట్సు. మాస్కో మీటింగ్సు 1957-1960-1969 (ఆంగ్లంలో) సి. పి. ఐ. పబ్లికేషన్. 1972 పే. 31.

2. బేసిక్ డాక్యుమెంట్సు ఆఫ్ ది మాస్కోమీటింగ్సు ఆఫ్ కమ్యూనిస్టు అండ్ వర్కర్స్ పార్టీస్, 1957-1960-1969 (ఆంగ్లంలో) సి. పి. ఐ. పబ్లికేషన్ 1972. పే. 34.

3. అదే పే. 35.

వాదపు విధానాన్ని ఎత్తుగడలను, కుట్రలను జాగరూకులమయిన భగ్నంచేయుట, యుద్ధవ్యతిరేక చైతన్యాన్ని పెంపొందించుటగా గుర్తించాలి.

"చరిత్ర నూతన ప్రపంచ యుద్ధాన్ని నిరోధించే మహోన్నత బాధ్యతను కార్మికవర్గ భుజస్కంధాలపై వుంచింది." సామ్రాజ్యవాదులు అణుయుద్ధ కుట్ర చేస్తున్నారు. "ప్రపంచ కార్మికవర్గ అన్ని శ్రేణులు, సంస్థలు, బలమయిన ఐక్యకార్యాచరణతో ప్రపంచ యుద్ధాన్ని నిరోధించి, శాంతిని పరిరక్షించేందుకు యుద్ధోన్మాద శక్తుల వ్యతిరేక పోరాట పిలుపు"[1] నిచ్చింది ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల సమాదేశము.

సోషలిస్టు దేశాల విదేశాంగ విధానం శాంతియుత సహజీవన సూత్రంపై ఆధారపడి, ఆర్థిక పోటీరూప ప్రధానంగా వుంది. పెట్టుబడిదారి దేశాలలోని కార్మికోద్యమం, వలస, ఆధారిత దేశాలలోని జాతీయ విముక్తి ఉద్యమాలు నూతన విజయాలను సాధిస్తున్నాయి. శాంతి, సోషలిజపు శక్తుల ఆధిక్యత సుస్థిరమగుతుంది "ఈ పరిస్థితులలో ప్రపంచంలో వొక భాగంలో పెట్టుబడిదారి విధానం వున్నపుడే, ప్రపంచంలో సోషలిజం సంపూర్తి విజయాన్ని పొందకముందే, సామాజిక జీవితాన్నుండి ప్రపంచ యుద్ధాన్ని పారద్రోలే వాస్తవ పరిస్థితులుద్భవించాయి. ప్రపంచమంతటా సోషలిజపు విజయం, యుద్ధాలకు కారణాలలైన సామాజిక, జాతీయాంశాలను పూర్తిగ నిర్మూలిస్తుంది."[2]

**శాంతియుత సహజీవన మొక్కటే సర్వనాశన ప్రపంచ యుద్ధానికి ప్రత్యామ్నాయము. కమ్యూనిస్టులు, అమెరికా "శీతల యుద్ధం", "సర్వసన్నద్ధత" సిద్ధాంతాలు అణుయుద్ధానికి సర్వనాశనానికి దారి తీస్తాయని వ్యతిరేకిస్తారు. శాంతియుత సహజీవన సిద్ధాంతం, మితవాదులు చెప్పునట్లు వర్గ పోరాటానికి స్వస్తికాదు, వర్గ పోరాటం యొక్క మరో రూపం, శాంతి శత్రువులకు వ్యతిరేకంగా ప్రజలను సంఘటిత పరచే శక్తివంతమయిన కార్యాచరణ విధానము. శాంతి, సహజీవన పరిస్థితులలో వర్గ పోరాటం మరింత అభివృద్ధి చెందుతుంది.**

ప్రపంచ యుద్ధాన్ని ఆయుధ నిర్మాణ పోటీ అతి చేరువకు తెస్తుంది తప్ప. సామ్రాజ్యవాద శక్తులు చెప్పునట్లు యుద్ధాన్ని నిరోధించజాలదు. ఆయుధాల అమ్మకము కొనసాగి అత్యధిక లాభాలు పొందే కారణంగా, సామ్రాజ్యవాద శక్తులు సామాన్య సంపూర్తి నిరాయుధీకరణను వ్యతిరేకిస్తారు. నిరాయుధీకరణ సమస్య ప్రభుత్వాల, సైనికాధికారుల, అధినేతల సమస్య మాత్రమే కాదు, మానవ వనరు

---

1. బేసిక్ డాక్యుమెంట్సు, మాస్కో కమ్యూనిస్టు మీటింగ్సు 1957-1960-1969 (ఆంగ్లంలో) పి. పి. ఐ. పబ్లికేషన్. 1972. పే. 36-7.
2. ........అదే........పే. 37.

లను మానవ జీవిత ప్రమాణాలను అభివృద్ధి చేయుటకుగాక యుద్ధ ప్రయోజనాలను వ్యర్థం చేయుట కారణంగా యిది ప్రజలందరి జీవిత సమస్య.

ప్రపంచ స్థాయిలో దారిద్ర్యాన్ని, దోపిడిని నిర్మూలించే చారిత్రాత్మక కర్తవ్యంగా నెంచుటయేగాక, మానవ సమాజంలో యుద్ధం మరెప్పుడూ వచ్చే అవకాశాలను నిర్మూలించుట, మన కాలంలో ఓ రాత్రి ప్రపంచ యుద్ధం పెనుఘాతంలా మానవజాతిపై పడకుండా చేయుట కమ్యూనిస్టులు తమ కర్తవ్యంగా నెంచుతారు, తమ శక్తినంతటిని యీ మహోన్నత కర్తవ్య నిర్వహణకు వినియోగిస్తారు." [1]

5. జాతీయ విముక్తి విప్లవోద్యమాలు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో అనూహ్యమయిన వేగంగా విజయాన్ని పొందాయి. "వలస విధానపు పూర్తి నిర్మూలన తథ్యం. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థా నిర్మాణం తరువాత అత్యంత చారిత్రాత్మక ప్రాముఖ్యతగల పరిణామం జాతీయ విముక్తి విప్లవాల ఫలితంగా వలస బానిస విధానం కూలిపోవుట"[2] వలసలు, ఆయా దేశాల ప్రత్యేక పరిస్థితులలో సాయుధ, సాయుదేతర పోరాటాల ద్వారా స్వాతంత్ర్యాన్ని సంపాదించాయి సామ్రాజ్యవాదం వలసలకు స్వచ్ఛందంగా స్వాతంత్ర్యాన్ని సమర్పించదు.

రెండవ ప్రపంచ యుద్ధంలో బలహీనపడిన సాంప్రదాయక వలస సామ్రాజ్యవాదులకు నేడు అమెరికన్ సామ్రాజ్యవాదం పట్టుకొమ్మగా నిలచింది. దాని నాయకత్వంలో దోపిడిని కొనసాగించుటకు ఆఖరి కొనవూపిరి ప్రయత్నాలు, లాటిన్ అమెరికన్ సహాయ చద్మవేషంలో ప్రత్యక్షమవుతున్నారు. విముక్తి పొందిన దేశాల పునర్జీవం సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలను పూర్తి చేయనిదే వలస విధాన పూర్తి నిర్మూలన జరుగదు. అన్ని వర్గాల, దేశభక్తుల జాతీయ ఐక్యసంఘటనా నిర్మాణం, ప్రజాస్వామ్య ఐక్యపోరాటం వాకనే. జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాలను పూర్తి చేస్తుంది. కార్మిక, కర్షక మైత్రి పునాదిగా ఐక్యసంఘటన నిర్మాణం విస్తృత ప్రజా ఐక్యతను పోరాటాల ద్వారా నిర్మిస్తుంది. జాతీయ బూర్జువావర్గం ఎంతవరకు ఐక్యసంఘటనల విముక్తి పోరాటాలలో పాల్గొనేది. దాని బలం. స్థిరత్వం ప్రయోజనాల బట్టి వుంటుంది.

"జాతీయ బూర్జువావర్గం ముఖ్యంగా సామ్రాజ్యవాదంతో సంబంధాలులేని దానికి, సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక పాత్ర కలిగివుంది. కాన అభివృద్ధికరమయినది. కాని, సామ్రాజ్యవాదంతో, ఫ్యూడలిజంతో రాజీకి మొగ్గే నైజాన్ని కూడ కలిగివుంది. ఈ ద్వంద నైజమైఖరి రీత్యా, విప్లవంలో జాతీయ బూర్జువావర్గ పాత్ర దేశ, దేశానికి భిన్నంగా వుంటుంది. నిర్దిష్ట పరిస్థితుల బట్టి వర్గ

---

1. బేసిక్ డాక్యుమెంట్సు, ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల మాస్కో మీటింగ్స్ 1957-1960-1969 (ఆంగ్లంలో) సి. పి. ఐ. పబ్లికేషన్, 1972 పే. 40.
2. ... ....అదే..,....పే. 40.

శక్తుల సంబంధాల బట్టి, సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంలకు ప్రజలకు గల వైరుధ్యాల తీవ్రతను బట్టి వుంటుంది." [1]

"రాజకీయస్వాతంత్ర్యాన్ని సాధించిన ప్రజలు, జీవితం లేవనెత్తిన సామాజిక సమస్యలకు, ఆర్థిక స్వాతంత్ర్య సమస్యలకు పరిష్కార మార్గాన్ని కోరుతారు. వివిధ వర్గాలు, పార్టీలు వివిధ పరిష్కారాలను సూచించుతాయి. ఏ అభివృద్ధిమార్గాన్ని ఎన్నుకొనాలనేది ఆ ప్రజల అంతరంగిక సమస్య. రాజ్యాధికారాన్ని పొందిన బూర్జువావర్గం సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, అభివృద్ధి నిరోధకులతో రాజీకి మొగ్గుతు వుంటుంది. కొంతవరకు ప్రజోద్యమాల బలంపై కూడ అధారపడి వుంటుంది. ప్రజల తరతరాల వెనుకబాటుతనాన్ని రూపుమాపి, జీవన ప్రమాణాలను పెంచాలంటే, పెట్టుబడిదారేతర మార్గాన్ని అనుసరించవలసి వుంటుంది, అదే సోషలిజానికి దారితీసే అవకాశాలున్నవి. కార్మికవర్గం, విస్తృత రైతాంగం, ప్రజాసామాన్యం మౌలిక సామాజిక పరిష్కారానికి నాయకత్వం వహించగలుగుతారు." [2]

"నేటి చారిత్రిక పరిస్థితులలో, స్వతంత్ర జాతీయ ప్రజాస్వామ్యం అంటే, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొంటూ, సామ్రాజ్యవాదం, దాని సైనిక కూటాలకు, సైనిక స్థావరాలకు, నూతన వలస రూపాలకు, దాని ద్రవ్య పెట్టుబడికి, వ్యతిరేకంగా నిలబడే రాజ్యం. ప్రజల స్వాతంత్ర్యాల, ప్రజాస్వామ్యాల గ్యారంటీ, పనికి అవకాశం, వ్యవసాయ సంస్కరణలు, సామాజిక మార్పులకు ప్రభుత్వ విధానాలలో ప్రజల పాత్రగల రాజ్యాంగము. నేటి అంతర్జాతీయ పరిస్థితులు, ప్రజాస్వామ్య దేశాలలో ప్రజలు చొరవ, చైతన్యంతో సామ్రాజ్యవాద దురాక్రమణలకు వ్యతిరేకంగా శాంతి పోరాటాన్ని సాగించుటకు, వలస నిర్మూలనకు అనుకూలంగా వుండి సాధ్యం చేస్తున్నవి."

"కమ్యూనిస్టుపార్టీల సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక, ప్రజాస్వామ్య విప్లవ పరిపూర్తికి, జాతీయ ప్రజాస్వామ్య నిర్మాణానికి, ప్రజల జీవన ప్రమాణాలను పెంచుటకు చురుకుగా పని చేస్తున్నాయి. సామ్రాజ్యవాద స్థానాన్ని బలహీనపరచుటకు జాతీయ ప్రయోజనాలను బలపరచే ప్రతిజాతీయ ప్రభుత్వచర్య బలపరుస్తున్నది. జాతీయ స్వాతంత్ర్యాన్ని ప్రమాదంలో పడవేస్తే ప్రజాస్వామ్య, ప్రజా వ్యతిరేక, పాలకవర్గ చర్యలను అదే కాలంలో వ్యతిరేకించుచున్నవి." [3]

---

1. బేసిక్ డాక్యుమెంట్సు. మాస్కో మీటింగ్సు 1957-1960-1969 (అంగ్లంలో) సి. పి. ఐ. పబ్లికేషను, 1972. పే. 43-44.
2.........అదే.........పే. 43.
3. ........అదే.........పే. 44.

"కమ్యూనిస్టుల ధ్యేయం జాతి అంత్య ప్రయోజనాలను అనుసరించే వుంది. అభివృద్ధి నిరోధకులు "కమ్యూనిస్టు వ్యతిరేకత" నినాదంతో జాతీయ సంఘటనను విచ్ఛిన్నం చేసి, కమ్యూనిస్టులను జాతీయ విముక్తి అగ్రగామి దళాన్ని వేరుచేసి, జాతీయ ప్రయోజనాలకు వ్యతిరేకంగా, జాతీయ ఉద్యమాన్ని బలహీనపరచి జాతీయ విజయాలకు ప్రమాదాన్ని కలిగిస్తున్నారు." [1] అంతేగాక, బూర్జువా రాజకీయవేత్తల సోషలిస్టు నినాదాల పసను బట్టబయలు చేస్తుంది కమ్యూనిస్టుపార్టీ, ప్రజాసమీకరణ చేస్తుంది.

ప్రపంచ గత దశాబ్దాల చరిత్ర అంతా వలస విధానం, అన్ని రూపాలలో పూర్తిగ అంతం చేయబడుటను సూచించుచున్నది. ఇంకా వలస బానిసత్వ వ్యతిరేక పోరాటం చాలవరకు బలపరుస్తుంది. అన్ని రూపాల వలస దోపిడిని అంతంచేయాలి.

6. నూతన శకంలో నూతనావకాశాలు, ప్రపంచశక్తుల నూతన సమతూకాన్ని కమ్యూనిస్టు పార్టీలను, వర్కర్సుపార్టీక్, శాంతి స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజపు చారిత్రాత్మక కర్తవ్యాలను నిర్వహించుటకు నూతనావకాశాలను కలుగ జేసింది. ప్రజల, కార్మికవర్గ ప్రయోజనాల పరిరక్షణకు, వారి జీవిన పరిస్థితులను మెరుగుపరచుట, ప్రజాస్వామ్య హక్కులకై కమ్యూనిస్టుపార్టీ నిస్వార్థ పోరాటాలను సాగించుచున్నది.

పోరాటదాడిని ఆయుధోత్పత్తి పోటీదారులు, ప్రధాన దురాక్రమణదారులు, అభివృద్ధి నిరోధకులైన గుత్తపెట్టుబడిదారి వర్గం, దాని ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారి వర్గంపై కేంద్రీకరించబడింది. కారణం అదే వారి ప్రయోజనాలకు రక్షణ కల్పించేది. యూరపేతర అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాలలో ముఖ్యంగా ఆర్థిక, రాజకీయంగా అమెరికా సైనిక పెత్తనంలోవున్న దేశాలలో కార్మికవర్గం ప్రజలు తమ ప్రధానదాడిని, అమెరికా సామ్రాజ్యవాదం, గుత్తపెట్టుబడిదారి వర్గం, స్థానిక అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా కేంద్రీకరించారు.

కార్మికవర్గ చీలికల యెడల పాలకవర్గాలు, మితవాద సోషల్ డెమోక్రాట్ల నాయకత్వాలు, అభ్యుదయ నిరోధక కార్మికవర్గ నాయకులు మాత్రమే సంతోషాన్ని కలిగి వుంటారు. వీరే జాతీయంగా, అంతర్జాతీయంగా కార్మికవర్గ ధ్యేయాలకు అడ్డంకిగా వున్నారు. ఈ చీలికలను అధిగమించుటకు సోషల్ డెమోక్రట్లమితవాద అవకాశవాదాన్ని తీవ్ర విమర్శకు గురిచేస్తూ, కమ్యూనిస్టులు పెట్టుబడిదారి వ్యతిరేక సోషల్ డెమోక్రేట్ల ప్రజాసామాన్యం వర్గపోరాట మార్గాన్ని దృఢంగా చేబట్టుటను ప్రోత్సహించాలి. సిద్ధాంత భేదాభిప్రాయాలు కార్మికోద్యమ, సంయుక్త పోరాటాలకు అడ్డుకారాదు.

7. సోషలిస్టు పరివర్తన రూపాలు: సమావేశం వివిధ దేశాలలో పెట్టుబడి

---

1. బేసిక్ డాక్యుమెంట్స్ ఆఫ్ మాస్కో మీటింగ్స్ ....పే. 45.

దారి విధానం సోషలిజంలోనికి పరివర్తన గురించి, 1957 మాస్కో ప్రకటన సిద్ధాంతాన్ని పునరుద్ఘాటించింది.

మాస్కో ప్రకటన "కార్మికవర్గం, దాని అగ్రగామి దళమైన మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు సోషలిస్టు విప్లవాన్ని శాంతియుత పద్ధతులలో సాధించుటకు ప్రయత్నిస్తాయి. అది కార్మికవర్గ, తదితర ప్రజల ప్రయోజనాలకు, ఆదేశంయొక్క జాతీయ శ్రేయస్సుకు పూర్తిగ అనుగుణమైందని[1]" అంది.

"ఈనాడు అనేక పెట్టుబడిదారి దేశాలలో కార్మికవర్గం, దాని అగ్రగామిదళం నాయకత్వాన, జనాభాలో అత్యధిక ప్రజలను సమైక్యపరచి, అంతర్యుద్ధ అవసరం లేకుండా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకొని, కీలకవుత్పత్తి సాధనాలనుజాతీయం చేయు అవకాశముంది. ఇందుకు, కార్మికవర్గ ఐక్యత, వివిధ రాజకీయ పార్టీల, ప్రజాసంస్థల సహకారంతో ప్రజా ఐక్య సంఘటనను నిర్మించుట ఆవసరం. అసంఖ్యాక ప్రజల ఆధారంతో రాజీవాద, అభివృద్ధి నిరోధక, ప్రజా వ్యతిరేక శక్తులను వోడించి, పార్లమెంటులో సుస్థిర మెజారిటి సంపాదించి, బూర్జువావర్గ ప్రయోజనాలకు సాధనమైన పార్లమెంటును, ప్రజాప్రయోజనాల రక్షణ సాధనంగా మార్చి, పార్లమెంటరీ, పార్లమెంటేతర మార్గాలలో ప్రజాపోరాటాలు సాగించి, అభివృద్ధి నిరోధకుల ప్రతిఘటనను నిర్మూలించి శాంతియుత పద్ధతులలో సోషలిస్టు విప్లవ విజయానికవసరమైన పరిస్థితులను సృష్టించాలి. విశాల ప్రాతిపదికపైన కార్మిక, కర్షక, పట్టణ మధ్యతరగతి ప్రజలను సమీకరించి, గుత్తపెట్టుబడిదారుల, అభివృద్ధి నిరోధకుల ఆధిపత్యానికి వ్యతిరేకంగా, అభ్యుదయకర సాంఘిక సంస్కరణల కోసం శాంతి, సోషలిజం కోసం వర్గపోరాటాన్ని సాగించుటద్వారా మాత్రమే సాధ్యము.

"ప్రజలపై పాలకవర్గాలు హింసాకాండకు వుద్యమిస్తే, సోషలిస్టు పరివర్తన శాంతియేతర పద్ధతులలోనే సాధ్యము. పాలకవర్గం అధికారాన్ని స్వచ్ఛందంగా వదలుకోదని లెనినిజం చెప్పుతున్నది వర్గ పోరాటం, తీవ్రత, దానిరూపంగాని కార్మికవర్గ అభీష్టంపై ఆధారపడి వుండదు. అత్యధిక ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా అభివృద్ధి నిరోధకుల ప్రతిఘటనపై, సోషలిజంకై జరిగే పోరాటంలో యేదో వొకదశలో అభివృద్ధి నిరోధవర్గాలు ప్రయోగించే బలప్రయోగంపై మాత్రమే వర్గ పోరాట రూపం ప్రధానంగా ఆధారపడి వుంటుంది.

---

1. బేసిక్‌డాక్యుమెంట్సు. కమ్యూనిస్టుపార్టీల మాస్కో మీటింగ్స్ 1957-1960 1969 (ఆంగ్లంలో) పి.పి.ఐ, పబ్లికేషను. 1972. పే. 53.

"ఆయా దేశాలలోని విశిష్ట పరిస్థితుల బట్టి సోషలిజానికి మార్గం నిర్ణయమౌతుంది.[1]"

8. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత; కమ్యూనిస్టు, కార్మికోధ్యమం మరింత అభివృద్ధి చెందుటకు ఐక్యతను, మాస్కో 1957 ప్రకటన పేర్కొన్న విధంగా ప్రధాన ప్రమాదమైన సంస్కరణవాదంపై: పిడివాదం సెక్టేరియనిజంలకు వ్యతిరేకంగా రెండు రంగాలలో తీవ్రమైన పోరాటాన్ని కొనసాగించుట వలననే నిర్మించగలము.

"సంస్కరణవాదం, మితవాద అవకాశవాదం, బూర్జువా సిద్ధాంత అవగాహన, ఆచరణను ప్రతిబింబిస్తుంది. మార్క్సిజం లెనినిజంలను వక్రీకరించి, విప్లవ సారాన్ని నీరు కార్చుతుంది. ఆ విధంగా కార్మికవర్గ విప్లవేచ్ఛను, పక్షపాతాన్ని కలుగజేసి, కార్మికులను, శ్రామిక ప్రజాస్వామ్యాన్ని సామ్రాజ్యవాదుల అణచివేతకు దోపిడికి వ్యతిరేకంగా శాంతి, ప్రజాస్వామ్యం, జాతీయ విముక్తి సోషలిజం విజయానికై జరిగే పోరాటంలో నిరాయుధులనుచేసి, చెల్లాచెదరజేస్తుంది

"పిడివాదం, సెక్టేరియనిజంల వ్యతిరేక పోరాటం నిరవధికంగా సాగించనిచో యేదో వొక దశలో యేపార్టీలోనైనా సైద్ధాంతిక, ఆచరణరంగాలలో ప్రధాన ప్రమాదకారి కాగలదు. విప్లవ పార్టీలు మార్క్సిజాన్ని లెనినిజాన్ని అభివృద్ధి పరచలేని శక్తిహీనులుగ జేస్తుంది. నిర్దిష్టపరిస్థితులను శాస్త్రీయ విశ్లేషణచేసి, సృజనాత్మక ఆచరణను లేకుండా చేస్తుంది. విస్తృత ప్రజాసామాన్యం నుండి కమ్యూనిస్టులను వేరుచేసి, ఆచరణశూన్య ఆశావాదులుగానో, లేక అతివాదదుందుడుకు విప్లవవాదులుగానో చేస్తాయి. మారే పరిస్థితులను, నూతనానుభవాలను సరియైన కాలంలో అంచెనావేయక, అవకాశాలనువయోగించి కార్మికవర్గ విజయాలను సాధించకుండా అడ్డుపడతవి. ప్రజాస్వామ్య శక్తులన్నిటిని సామ్రాజ్యవాద, అభివృద్ధి నిరోధక, యుద్ధోన్మాద శక్తులకు వ్యతిరేకంగా పోరాడి, వారి న్యాయమైన పోరాటంలో విజయాన్ని పొందకుండా చేస్తుంది."[2]

అందుకే సమావేశం ద్విముఖ దృఢతర పోరాటం సాగించుట ద్వారానే ప్రపంచ, వివిధ దేశాల కమ్యూనిస్టు వుద్యమాలలో ఐక్యతనెల కొనగలదనిమాస్కో చెప్పింది.

---

1. బేసిక్ డాక్యుమ్యెంట్సు. మాస్కో సమావేశాలు, 1957-1960-1969 (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్ 1972. పే. 53-54. ఉత్తరోత్తరాచర్చలలో ప్రధానాంశమైనందున, వుదహరింపు సుదీర్ఘంగా యివ్వబడింది.

2. బేసిక్ డాక్యుమెంట్సు, కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీల మాస్కో మీటింగ్సు 1957-1960-1969 (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్సు, 1972. పే. 54-55.

## సమావేశంలో చర్చల సరళి

ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల 1960 మాస్కో ప్రకటిత విధానం తీవ్రచర్చల అనంతరం యేకగ్రీవంగా ఆమోదించబడింది. అభిప్రాయ భేదాలు, చర్చల సరళి బహిరంగ పరచకపోయినా, క్రమేణా కొన్ని అంశాలు బహిర్గతమైనాయి. వివిధ అభిప్రాయాలను సంక్షిప్తంగా తెలుసుకొందాము.

చైనా కమ్యూనిస్టుపార్టి 1957 మాస్కో ప్రకటనపై అప్పుడే తన అభిప్రాయాలను నోటుగా సోవియట్ కమ్యూనిస్టుపార్టి కేంద్ర సమితికి సమర్పించింది. తమ వైఖరిని అనేక యితర కారణాల వలన సోవియట్ పార్టి 20వ, కాంగ్రెసులో చెప్పజాలకపోయామని, యిప్పుడు సంయుక్త ప్రకటన విడుదల చేస్తున్నందున తమ అభిప్రాయాలను తెలియజేస్తున్నామన్నారు. నాటి అంతర్జాతీయ పరిస్థితి, వుద్యమ పరిస్థితులలో, శాంతియుత పరివర్తన కోరికను ప్రకటనతో వుదహరించుటలో ఎత్తుగడల సౌలభ్యమున్నది. కాని శాంతియుత పరివర్తనావకాశాలను ఎక్కువగానొక్కి చెప్పుటకు తమ విముఖతను తెల్పారు. శాంతియుత పరివర్తనావకాశాలు వాస్తవంగా వున్నచో వాంఛనీయం, అందుకై కమ్యూనిస్టుపార్టి సర్వప్రయత్నాలు చేస్తుంది. అట్టి ప్రయత్నాలను బూర్జువావర్గం దౌర్జన్య, హింసా మార్గాలలో దాడి సాగించితే, శాంతి యేతర మార్గాలలో ప్రతిఘటించుటకు పార్టి ఎల్లప్పుడూ, అన్ని విధానాల సర్వసన్నద్ధమై వుండాలనే వారి అభిప్రాయమని వివరించారు. కేవలం శాంతియుత పరివర్తనను వుదహరించుట పార్టిని నిరాయుధులను చేసి, ప్రతిఘటనా పోరాటశక్తిని కుంటుపరస్తుంది, పైగా బూర్జువా వర్గాన్ని బలహీనపరచుటకు, అప్రమత్తులను చేయుటకుగాదు, బూర్జువావర్గాల దాడులను ప్రతిఘటించుటలో కమ్యూనిస్టు పార్టీలు సర్వసన్నద్ధులై వుండుటకుగాక, అప్రమత్తులను చేస్తుంది, విప్లవ బలాన్ని, పోరాట పటిమను బలహీనపరస్తుంది. కాన శాంతియుత పరివర్తనతోపాటు శాంతియేతర మార్గాన్ని వుదహరించాలనే చైనా అభిప్రాయాన్ని పరిగణించి రెండింటిని 1963 ప్రకటనలో వుదహరించుట చైనా కమ్యూనిస్టుపార్టీని సంతృప్తిపరచి వుండవలసింది

"చైనీస్ కామ్రేడ్స్ అనేక పర్యాయములు, సోవియట్ కామ్రేడ్స్ 9 సెప్టెంబరు 1959 టాస్ ప్రకటనను కార్మికవర్గ అంతర్జాతీయ సూత్రాలను వుల్లంఘించి విడుదలచేసి, సోవియట్-చైనా కమ్యూనిస్టు పార్టీల భేదాభిప్రాయాలను ప్రపంచానికి వెల్లడి చేసారని నిందవేసారు. టాస్ ప్రకటన చైనాను బహిరంగంగా ఖండించుటగా కనబడుతున్నది. అంతేగాక ఐసెన్‌హోవర్‌ను సంతోష పెట్టుటకుద్దేశించబడిందంటున్నారు. ఈ ప్రకటన సోషలిస్టు శిబిర ప్రయోజనాలకు నష్టం చేసిందని, సామ్రాజ్యవాదులకు, భారత అభివృద్ధి నిరోధకులకు సహాయపడిందని వారు తలంచుతున్నారు" అని అజయ్‌ఘోష్ అన్నారు.

"ఈ నిందలకు మేము ఆశ్చర్యపడుతున్నాము. సెప్టెంబరు 9న, లాగ్గూ సంఘర్షణానంతరం, టాస్ చేసిన ప్రకటన యేమి చెప్పుచున్నది? సంఘర్షణ గురించి" పశ్చిమ దేశాల కొన్ని రాజకీయ వర్గాలు, వార్తా పత్రికలు పెద్దగా ప్రచారం గావించాయి. అది ఇండియా-చైనా హిమాలయ సరిహద్దు సంఘర్షణ అంది. "ఈ ప్రచారం ఆసియాలోని రెండుపెద్ద దేశాలైన ఇండియా-చైనాల మధ్య పెద్ద అఘాతాన్ని సృష్టించుటకు వుద్దేశించబడిందన్నది. ఆసియాలో ప్రపంచమంతటా శాంతి, అంతర్జాతీయ సహకారాన్ని పెంపొందించుటకు వారి మధ్య స్నేహం అత్యంత ప్రాముఖ్యత కలదైనది"

"పశ్చిమదేశాల వర్గాలు, ప్రత్యేకంగా అమెరికాలో అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గకుండా చూడ ప్రయత్నించేవారు, యీ సంఘటనను పట్టుకొన్నారంట గుర్తుపెట్టు కొనవలసిన వాస్తవం" అని టాస్ ప్రకటన అన్నది. సోవియట్ మంత్రిమండలి అధ్యక్షుడు కృచ్చేవ్, అమెరికా ప్రెసిడెంటు ఐసెన్‌హోవర్ పరస్పరం సౌహార్ద సందర్శనల సందర్భంలో పరిస్థితులను ఉద్రేకపరచుటకు పత్రికలు ప్రయత్నించాయి శీతల యుద్ధాన్ని అంతం చేయాలని పశ్చిమదేశాలలోని ఆకాంక్షకు అడ్డుగోడను నిర్మించదలచారు. అందుకు సోషలిస్టు దేశాలతో అవగాహనకు రావాలనే తలంపుకు అడ్డుపడదలచారు.[1]"

"దీనిలో చైనాను ఖండించారని వ్యాఖ్యానించ తగిన వాక్య-మాటలేదు, ఐసెన్‌హోవర్‌ను సంతోషపెట్టుటకు అవసరమైనదిలేదు. సామ్రాజ్యవాద శక్తులనే స్పష్టంగా నిందించుట జరిగింది. వారే ఆ సంఘటనలను, శాంతియుత సహజీవన భావనను, అగౌరవపరచి, ఉద్రిక్తతను తీవ్రతరం చేయుటకుపయోగించారు." అని అజయ్‌ఘోష్ అంతర్జాతీయ విభేదాల బహిరంగ చర్చల ప్రారంభం టాస్ ప్రకటనతో కాలేదని వివరించారు.

వాస్తవ విషయాలు యీ విధంగావున్నా పీపుల్సు డెయిలీ 17 ఫిబ్రవరి 1963 "లెనినిజం చిరస్థాయి అగుగాక అన్న చైనా కమ్యూనిస్టు కరపత్రం 1960 వేసవిలో అన్ని భాషలలో ప్రచురించుట, ధోరెజ్ తదితరలు కామ్రేడ్స్ అభిప్రాయ భేదాలు బహిరంగం చేయుటతో వచ్చాయని నిందవేస్తున్నారు అని అంటూ, జరిగిన వాస్తవమంటూ పీపుల్సుడెయిలీ సంపాదకీయంలో యీ క్రింది విధంగా పేర్కొంది. "సోదర పార్టీల అంతర్గత భేదాభిప్రాయాలు బహిరంగంగా బయటకు తేబడింది, 1960 వేసవిలోకాదని, క్యాంప్‌డేవిడ్ సంప్రదింపుల సందర్భంలో, 9 సెప్టెంబరు

1. అజయ్‌ఘోష్ (1960) ప్రపంచ కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీల సమావేశంలో వుపన్యాసం మాస్కో నవంబరు 1960 ఇండియా-చైనా సరిహద్దు వివాదం, భారత కమ్యూనిస్టుపార్టీ తీర్మానాలు, ప్రకటనలు, ఉపన్యాసాలు. 1959-63. సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 47.

1959లోనని చెప్పాలి." అంతేగాక టాస్ ప్రకటన, "విచారకరమని" "విషాదకర మని", "ఆమోదించజాలనిదని" అనే పదజాలంతో తప్పో, ఒప్పో తెలుసుకొన కుండా, తోటి సోషలిస్టు దేశం పదేపదే చెప్పేది వినకుండా, పెట్టుబడిదారి దేశపు అభివృద్ధి విరోధకశక్తులు రెచ్చగొట్టే సాయుధ చర్యను, ఖండించకుండా, పైగా చైనా సరియైన విధానాన్ని ఖండించుట ప్రపంచ సామ్రాజ్యవాద, ప్రగతి నిరోధక శక్తులకు, సోషలిస్టు దేశాలలోగల అభిప్రాయ భేదాలను బహిరంగ పరచుట, మొట్ట మొదటగా జరిగిందని, చైనా ఆరోపించింది. కాంప్‌డేవిడ్‌లో కృశ్చేవ్-ఐసెన్‌హోవర్ సంభాషణలు తరువాత చైనా కమ్యూనిస్టుపార్టి సాధారణ పంథాను బహిరంగంగా సోవియట్ ఖండించింది.[1]

"బుఖారెస్టు జూన్ 1960 సమావేశంలో సోవియట్‌పార్టి నాయకత్వం అక స్మాత్తుగా సమాచార లేఖ అంటూ చైనా కమ్యూనిస్టుపార్టీపైన దాడి చేస్తూ, మమ్ము మెజారిటీ అభిప్రాయానికి ఆమోదం తెలుపునట్లు వొత్తిడి సాగించారు. సమావేశా నంతరం మెజారిటీ అభిప్రాయాన్ని మైనారిటీ ఆమోదించాలని, సౌహార్థ పార్టీల మధ్య సంబంధాలలో": ఏకగ్రీవంగా ఆమోదించబడిన అభిప్రాయాలు, అవగాహన ను చైనా పార్టి గౌరవించాలని, బుకారెస్టులో అత్యధిక పార్టీలు ఆమోదించాయనే కారణంగా వాటిని గౌరవించాలన్నారు చైనా కమ్యూనిస్టుపార్టి సమాచార లేఖ అంటూ సమావేశంలో పంచిన లేఖకు సమాధానంగా, 10 సెప్టెంబరు 1960న "మార్క్సిజం-లెనినిజం మౌలిక సూత్రాలకు సంబంధించినంతవరకు, ప్రతి సమ స్యను మెజారిటీని బట్టి ఎవరు ఒప్పు, ఎవరు తప్పు సరిగా నిర్ణయించజాలము. సత్య మేమైనా సత్యమే. తాత్కాలిక మెజారిటీ వలన తప్పు, సత్యంకాదు, తాత్కాలిక మైనారిటీ వలన సత్యం తప్పుకాదు." అని స్పష్టం చేసింది. అయినా, సోవియట్ కమ్యూనిస్టు పార్టి కేంద్రసమితి 5 నవంబరు 1960 లేఖలో అంతర్జాతీయ కమ్యూ నిస్టు వుద్యమంలో మెజారిటీ అభిప్రాయాన్ని మైనారిటీ మన్నించి గౌరవించాలని, డ్యూమా విషయంగా లెనిన్ అభిప్రాయాన్ని ఆ సందర్భంగా వుదహరించింది.

"కమ్యూనిస్టు పార్టీల నవంబరు 1960 మాస్కో సమావేశంలో చైనా కమ్యూనిస్టుపార్టి ప్రతినిధివర్గం యీ తప్పుడు వైఖరిని తిరస్కరించింది. పార్టీల పరస్పర సంబంధాలలో మైనారిటీ, మెజారిటీని అనుసరించాలనే సూత్రం అమలు చేయుట పూర్తిగ తప్పు అని, నేటి వాస్తవ పరిస్థితులలో కొమింటరను లాంటి కేంద్రనాయకత్వ నిర్మాణం లేదని, అట్టిది వాంఛనీయంకాదని ప్రకటించింది. ఒక

1. సంపాదకీయం, పీపిల్సుడెయిలీ, 27 ఫిబ్రవరి 1963, అభిప్రాయ భేదాలు ఎప్పటినుండి? థోరెజ్ తదితర కామ్రేడ్స్‌కు సమాధానం. అంతర్జాతీయ కమ్యూ నిస్టు వుద్యమంలో సిద్ధాంత సమస్యలు. నం.6. పే 1963 (ఆంగ్లంలో) కమ్యూ నిస్టుపార్టి పబ్లికేషన్. పే. 67-68.

పార్టీలో మైనారిటీ తప్పనిసరిగా మెజారిటీ నిర్ణయాన్ని అనుసరించాలనే సూత్రం పై కమిటీలను క్రింది కమిటీలు అనుసరించాలి, అనుటకు వర్తిస్తుంది. సౌహార్ద పార్టీల మధ్య పరస్పర సంబంధాలలో యిది వర్తించదు. వారి పరస్పర సంబంధాలలో ప్రతిపార్టీకి పూర్తి స్వాతంత్ర్యం వుంటుంది. అదే కాలంలో అన్నిటితో ఐక్యమగుతుంది. ఇక్కడ మైనారిటీ, మెజారిటీని అనుసరించాలనే దేమీ లేదు, అంతేగాక పై కమిటీని, క్రింది కమిటీ అనుసరించాలనే ప్రశ్న అసలే లేదు. ఈ సమస్యను, అందరికి చెందిన సమస్యలపై సంప్రదింపులు, చర్చలు, సంభాషణల ప్రకారం యేకగ్రీవ వొప్పందానికి వచ్చుట అనేదే సమస్యకు మార్గం."

"సోవియట్ పార్టి కేంద్ర కమిటి లేఖలో మైనారిటీ, మెజారిటీని అనుసరించాలనే సూత్రాన్ని ప్రతిపాదించుట, సంప్రదింపులద్వారా యేకగ్రీవా మోదానికి రావాలనే సూత్రాన్ని త్రోసి పుచ్చుటయే అయినది. యే సూపరు పార్టి నిర్మాణ సూత్రం ప్రకారం సోవియట్ కమ్యూనిస్టు పార్టి కేంద్రకమిటి అట్టి నిర్మాణ సూత్రాన్ని ముందుకు తెచ్చింది? ఎప్పుడు, ఎక్కడ కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీలు అన్నీ, అటువంటి సూపరుపార్టి నిర్మాణసూత్రాలను ఆమోదించాయి.[1]" అని చైనా ప్రశ్నించి, నగ్నంగా విమర్శించింది, మెజారిటీ అభిప్రాయాన్ని, అంతర్జాతీయ క్రమశిక్షణను త్రోసి పుచ్చారు అన్న నిందను తిరస్కరించింది.

## III

## కమ్యూనిస్టు పార్టి 6వ, కాంగ్రెసు విజయవాడ మార్గంలో

కమ్యూనిస్టుపార్టీ, విజయవాడ 6వ, కాంగ్రెసుకు ముందు అజయ్‌ఘోష్ ప్రవదాలో పార్టీ కాంగ్రెసు ముందున్న సమస్యల గురించి 5 ఏప్రియల్ 1861న, వ్రాసారు[2]. కాంగ్రెస్ పార్టీ కార్యక్రమాన్ని చర్చించి నిర్ధారణ చేస్తుందని, రాజకీయ తీర్మానాన్ని రూపొందించుతుందని, పార్టీ నిర్మాణ సూత్రాలలో సవరణలు తలపెట్టిం

1. "అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ ఐక్యత"-పై. (?) టైటిలు వగైరాలు లేవు. 51 పేజీల పత్రం" అన్న చైనా డాక్యుమెంటు. చైనాపై వివిధ ఫిర్యాదులను ఒకటి తరువాత వొకటిని త్రోసి పుచ్చింది. "మెజారిటీ అభిప్రాయాన్ని నీరుగార్చి అంతర్జాతీయక్రమ శిక్షణను వుల్లంఘించుటను (చైనాపార్టి)ఫిర్యాదుని 30-35 పేజీలలో త్రోసి పుచ్చింది. పే. 31-32

2. అజయ్‌ఘోష్ (1962) వ్యాసాలు ఆంగ్లములో) మాస్కో 1962 పే. 165.

దని సూచించారు. నూతన జాతీయ సమితిని, కార్యవర్గాన్ని, సెక్రటేరియట్‌ను ఎన్నుకొంటుందని, ఎన్నికల వ్యూహరచన చేస్తుందని వ్రాసారు. కేరళలో కమ్యూనిస్టు పార్టీ 5 గురు స్వతంత్రులతో కలసి రాష్ట్ర ప్రథమ కమ్యూనిస్టుమంత్రి వర్గాన్ని యేర్పాటు చేయుట 28 మాసాల తదుపరి రద్దు చేయబడుట ప్రస్తావించారు.

నెహ్రూ నాయకత్వంలో ప్రపంచశాంతికి,నిరాయుధీకరణకు భారతదేశం గణనీయమైన సేవచేసిందన్నారు. దేశవిదేశాంగ విధానాన్ని మార్చుటకై సామ్రాజ్యవాద శక్తులన్నిటి వొత్తిడలను ఎదుర్కొని, శాంతి వలన వ్యతిరేక శిబిరంవైపు గట్టిగా నిలబడిందన్నారు. భారత ప్రభుత్వం వూగిసలాటలకు లోనైనా దాని వలన వ్యతిరేకతను మరువరాదన్నారు. భారత సాధారణ విదేశాంగ విధానం మన ప్రయోజనాలకు ఆసియా, ఆఫ్రికాల ప్రయోజనాల కనుగుణంగానే వుందన్నారు. ఆదేకాలంలో దేశంలోని అభివృద్ధి నిరోధకశక్తులు స్వతంత్రపార్టీ, జనసంఘం, ప్రజాసోషలిస్టువర్గాలు అమెరికన్ సామ్రాజ్యవాద శక్తులతో చేతులు కలుపుతూ ప్రభుత్వవిధానాలను మార్చ ప్రయత్నిస్తున్నారు.

గుత్తపెట్టుబడిదారి వర్గాల అభివృద్ధిని పేర్కొంటూ, దేశంలోని పైవది పెద్ద కంపెనీలు 67 శాతపు పెట్టుబడిని కలిగి వున్నవని స్పష్టం చేసారు. కేంద్రప్రభుత్వం తలపెట్టిన 600 మిలియనుల రూపాయల పన్నులు ఆదాయంలో 30 మిలియనులు మాత్రం ప్రత్యక్షపన్నుల ద్వారాను, మిగిలినదంతా పరోక్ష పన్నులద్వారా ప్రజల నుండి వసూలు చేయతలపెట్టిందన్నారు.

కార్మికవర్గం రాజకీయపోరాటాలను చేబట్టే వర్గచైతన్యాన్ని కలిగి లేదని, రైతాంగ నిర్మాణంలో సమీకరించబడలేదని, రాజకీయ, సైద్ధాంతికస్థాయి కార్యకర్తలలో పెరగవలసివుందని వ్రాసారు. భారత-చైనా సరిహద్దు సమస్య పురోగామి శక్తుల అభివృద్ధికి ఆటంకంగా వుందన్నారు. పార్టి యీ సమస్య శాంతియుత సంప్రదింపులతో పరిష్కారాన్ని కోరుతున్నది. అభివృద్ధి నిరోధకులు దీనితో దేశ, విదేశాంగ విధానాన్ని మార్చ ప్రయత్నిస్తున్నారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సమస్యలు, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ, 22వ పార్టీ కాంగ్రెసుల నూతన దృక్పధాలను, పంధాలను, వ్యక్తి పూజావిధానాలను చర్చించి, వైఖరిని స్పష్టం చేయవలసి వుంది. అదేవిధంగా 1957, 1960 యూరోపియన్, ప్రపంచకమ్యూనిస్టుపార్టీల మాస్కో సమావేశాల ప్రకటనలు, వివాదగ్రస్తంగా వున్న నేటి యుగస్వరూప, స్వభావాలు, మౌలికవైరుధ్యాలు, యుద్ధం శాంతి సమస్య, నివారణ సాధ్యాసాధ్యాలు, విముక్తిపోరాటాల యెడలవైఖరి, అంతర్యుద్ధాలు, సామ్రాజ్యవాదుల మధ్య యుద్ధాలు, శాంతియుత సహజీవనం, శాంతియుత ఆర్థిక పోటీ, వాటివర్గప్రాతిపధిక, సోషలిజంలోకి పరివర్తనరూపాలు, కమ్యూనిస్టు వుద్యమంలోని మితవాద, అతివాద సంస్కరణవాదాల యెడల వైఖరులు చర్చించి స్పష్టం చేయవలసివుంది. వలస స్వాతంత్ర్య పోరాటాల నూతనదశ, నూతనస్వాతం

త్య్రదేశాలు పెట్టుబడిదారేతర పంథా, ఆ వెలుగులో జాతీయసమస్యలు,భారతజాతీయ పోరాటపంథా, భారతపారిశ్రామిక, వ్యవసాయ, ఆర్థికాభివృద్ధి పంథా, భారతశాంతి, పంచశీల, అలీన విదేశాంగ విధానాలను, మౌలిక సమస్యలుగ' చర్చించి నిర్ణయాలు చేయవలసి వుంది. అదేవిధంగా నూతన అవగాహనతో 1951 కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాన్ని వాస్తవపరిస్థితులు ప్రతిబింబించే విధంగా తిరిగి రూపొందించవలసి వుంటుంది.

## పార్టీకాంగ్రెసు పూర్వచర్చల సరళి

అమృత్ సర్ పార్టి కాంగ్రెసులో జాతీయవిధానాలను వామపక్షమార్గం పట్టించుటకు పార్టి పోరాటంలో ప్రజాస్వామ్య శక్తులను యెలా ఐక్యపరచాలి, పెరిగే అభివృద్ధి నిరోధకశక్తుల వ్యతిరేకపోరాటాన్ని, కాంగ్రెసు ప్రభుత్వ వ్యతిరేక పోరాటంతో ఎలా సమన్వయ పరచాలనేది ప్రధానాంశమైంది. కాంగ్రెసు ప్రభుత్వ ప్రజా వ్యతిరేక చర్యలే మితవాద అభివృద్ధి నిరోధకులకు బలాన్ని చేకూర్చుతున్నవని గుర్తించుట జరిగింది. అంచేతనే అమృత్ సర్" ధృఢచిత్తంతో శక్తివంతమైన పోరాటాన్ని ప్రభుత్వ ప్రజావ్యతిరేకచర్యలపై జరిపి వోడించనిచో కరుడు గట్టిన మిత వాద వర్గాలను వోడించజాలమని, అందుకు ద్విముఖ పోరాటాన్ని సాగించి ప్రభుత్వ ప్రజావ్యతిరేక చర్యలను, మితవాద అభివృద్ధి నిరోధకులను వోడించనిచో ప్రజాశికా లక్ష్యాలను సాధించుట అసాధ్యమగుతుందని[1]" స్పష్టం చేసింది.

"ఈ పరస్పరవైరుధ్య ఆర్థికాభివృద్ధి అమృత్ సర్ - విజయవాడ మధ్యకాలంలో సాగిందని" ఆ అంశాలను" ఒకటి, స్వతంత్ర ఆర్థికాభివృద్ధి మార్గాన్ని బలపరచుటతో ఇనుము, ఉక్కు, బొగ్గు, యంత్ర భారీపరిశ్రమల అభివృద్ధి. సోషలిస్టుదేశాల సహాయంతో ప్రభుత్వరంగ పరిశ్రమల విస్తరణ, రెండు, పెట్టుబడిదారి విస్తరణాభివృద్ధితో పెరిగే గుత్తపెట్టుబడి ఆర్థికశక్తి కేంద్రీకరణ, అధికపన్నులు, అధికధరలు, ద్రవ్యోల్బణం పెరుగుటతో సామాన్య ప్రజలపైపడే అధిక భారం, విదేశమారక ద్రవ్య సంక్షోభం: మూడు, వ్యక్తి యాజమాన్యంలో విదేశీపెట్టుబడుల విస్తరణ, విదేశీ అప్పులు, సహాయంపై మరింత ఆధారపడుటగ[3]" అధికారి పేర్కొన్నరు.

ఈ ఆర్థికాభివృద్ధి అమృతసర్ నుండి విజయవాడ కాంగ్రెసు, తదుపరి ఎన్నికల వరకు జరిగిన రాజకీయ పరిణామాలలో ప్రతిబింబించిందని అధికారి[1] యీ క్రింది విధంగా వివరించారు.

---

1. అమృసర్ పార్టీకాంగ్రెసు (1958) తీర్మానం. (ఆంగ్లంలో) పే. 10.
2. అధికారి, జి(1964) జాతీయ పునర్జీవనానికి, సోషలిజానికి కమ్యూనిస్టుపార్టీ, జాతీయపంథా (ఆంగ్లంలో) పే. 142.
3. అధికారి, జి (1964) జాతీయ పునర్జీవనానికి, సోషలిజానికి కమ్యూనిస్టుపార్టీ, భారతీయ పంథా (ఆంగ్లంలో) పే. 143.

కమ్యూనిస్టుపార్టీ, ప్రజాసంఘాలు, కేరళ కమ్యూనిస్టు రాష్ట్రప్రభుత్వం రద్దు చేయబడిన సమస్యపై విస్తృత జాతీయ ప్రచారోద్యమాన్ని, అదే కాలంలో అభివృద్ధి నిరోధక వర్గాల భారత–చైనా సరిహద్దు వివాదంపై కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారాన్ని ఎదుర్కొని, వమ్ముచేసే ప్రచారాన్ని కొనసాగించుట వలన, ఎన్నికలలో పార్టీ తన బలాన్ని నిలబెట్టుకొనగలిగింది.

అభివృద్ధి నిరోధక శక్తులు, గుత్తపెట్టుబడిదారులు, భూస్వాములు, మాజీ రాజులు, ఉద్యోగ విరమణ చేసిన సైనిక జనరల్సు కలసి స్వతంత్ర రాజకీయపార్టీని స్థాపించారు. ఉత్తరాదిన ప్రజాస్వామ్య వ్యతిరేక, కమ్యూనిస్టు వ్యతిరేక, మత శక్తులు కాంగ్రెసు విధానాలతో అసంతృప్తి చెందిన ప్రజాసామాన్యంలో బలపడినవి. ఎన్నికలలో మితవాద, అభివృద్ధి నిరోధక శక్తులు, కమ్యూనిస్టేతర వామపక్షాలు, కాంగ్రెసు స్థానాలను గెలుచుకొని బలపడినవి.

జాతీయ కాంగ్రెసు కేరళలో కమ్యూనిస్టు రాష్ట్రమంత్రి వర్గాన్ని తొలగించుటకై ముస్లింలీగు, కాథలిక్ మత అభివృద్ధి నిరోధకులతో కలసి కమ్యూనిస్టు వ్యతిరేకతను రెచ్చగొట్టుచున్నది. భారత-చైనా సరిహద్దు తీవ్రతతో మితవాద, సామ్రాజ్యవాద శక్తుల వొత్తిడితో కాంగ్రెసు కొన్ని సమస్యలలో మితవాదంవైపు మొగ్గుతున్నా మౌలిక అలీన, స్వతంత్ర ఆర్థిక విధానాలను సాగిస్తున్నది. మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాల యేర్పాటు, గోవా విముక్తికి సైనికచర్య, ఉత్తరాది పరిస్థితుల దృష్ట్యా వెనుకతట్టును బలపరచుకొనుటకు ప్రజాస్వామ్య శక్తులకు ప్రభుత్వం కొన్నిరాయితీలను యిచ్చింది.

ఈ విధంగా నూతన సంక్లిష్ట పరిస్థితి అమృత్‌సర్ కాంగ్రెసు కాలంలో ప్రారంభమై విజయవాడ పార్టీ కాంగ్రెసు నాటికి వొక నిర్దిష్ట స్వరూపాన్ని పొందిందనేఅభిప్రాయాన్ని వెలిబుచ్చారు అధికారి.

కార్మికవర్గ నాయకత్వంలో జనతా ప్రజాస్వామ్యం కొరకు పోరాటం అనే పాల్గాటు దృక్పధంతో, అమృత్‌సర్ కాంగ్రెసు అభివృద్ధి నిరోధకులపై, కాంగ్రెసు ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలపై ద్విముఖ పోరాటాన్ని, కాంగ్రెసు నాయకత్వం వామపక్ష పంధావైపు మొగ్గునట్లు చేయుటకు, సాగిస్తున్నది. మరోవైపు మితవాద అభివృద్ధి నిరోధకులు భారత చైనా సరిహద్దు వివాద పరిస్థితిని వినియోగించి కమ్యూనిస్టు వ్యతిరేకతను రెచ్చగొట్టి, ప్రభుత్వం అలీన, ప్రభుత్వ రంగంలో వారి పరిశ్రమలు పెంపొందించు విధానాన్ని, శాంతి, యుద్ధవ్యతిరేక విధానాలను విడనాడునట్లు వొత్తిడిని అధికం చేసారు.

మాస్కో 1957 ప్రకటన సోషలిస్టు విప్లవం శాంతిమార్గంలో సాధించుటకు,

అనేక దేశాలలో నేడు అవకాశాలు అభివృద్ధి చెందాయని, దానిని వాస్తవం చేయుటకు కార్మికవర్గం, దాని పార్టీ తగిన పరిస్థితులను రూపొందించాలనే నిర్ధారణ ననుసరించి, అమృత్‌సర్ కాంగ్రెసులో పార్టీ నిర్మాణ ఆదేశ సూత్రంలో సోషలిజాన్ని, పూర్తి ప్రజాస్వామ్యాన్ని శాంతి మార్గంలో సాధించుటకు కమ్యూనిస్టుపార్టీ ప్రయత్నిస్తుందని చేర్చింది. బలమయిన ప్రజాసామాన్య వుద్యమాన్ని నిర్మించి, పార్లమెంటు ఎన్నికలలో మెజారిటీ సంపాదించి, ఆ బలంతో కార్మికవర్గం దాని మిత్రులు అభివృద్ధి నిరోధక శక్తుల ప్రతిఘటనను అధిగమించి, పార్లమెంటును ప్రజా కోర్కెల ఆయుధంగా చేసి, ఆర్థిక, సాంఘిక, రాజ్యాంగ మౌలిక మార్పులను తీసుకొని రావచ్చనే విశ్వాసాన్ని అమృత్‌సర్ కాంగ్రెసు స్పష్టం చేసింది. ఈ దృక్పథం తదనంతర కాలంలో అత్యంత వివాదాస్పదమయింది.

మాస్కో 1960 ప్రకటన వలన సామ్రాజ్యవాదం నుండి విముక్తికి ఒకే ఒక జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో అన్ని వర్గాలను సమీకరించాలని, ఆ విధంగానే జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాలు పూర్తి అవుతాయని, జాతీయ బూర్జువా వర్గాలు ద్వంద వైఖరిని కలిగి వున్నాయని, అభ్యుదయకరమయినవి అయినా సామ్రాజ్యవాద, ఫ్యూడలిజాలతో రాజీ ధోరణిని కలిగి వున్నదని స్పష్టం చేసిందని నంబూద్రిపాద్ పేర్కొని, రాజకీయ స్వాతంత్ర్యంతో జాతీయ ప్రజాస్వామ్య ఉద్యమంలో ఘర్షణలు, వైరుధ్యాలు ఏర్పడుటను ప్రకటన స్పష్టం చేసిందన్నారు. ఇంకా యీ విషయ పరిశీలన, చర్చలనుండి "నూతనంగా స్వాతంత్ర్యం పొందిన వెనుకబడిన దేశాల అభివృద్ధి సమస్యల పరిశీలన నుండి రెండు దృక్పదాలు స్పష్టమయినవని" వాటిని "1. ఐక్యసంఘటన ఒక వర్గపు మరో వర్గాల వ్యతిరేక సంఘటన కాదని, అది జాతి మొత్తపు సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక ఐక్య సంఘటన. జాతీయ బూర్జువా వర్గానికి అందులో స్థానముంది. సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేకంగా అది పోరాడగలిగినంత వరకు వుంటుంది. 2. అటువంటి అన్ని వర్గాల జాతీయ సంఘటనలో రెండు ప్రధాన సామాజిక శక్తులు తమ తమ కార్యక్రమాలు, దృక్పథాలతో పోటీ పడుతుంటవి. ఒకవైపు బూర్జువావర్గం, వర్గ చైతన్యంతో ప్రణాళికాబద్ధంగా జాతీయాభివృద్ధిని పెట్టుబడిదారి మార్గంలో కొనసాగించే ప్రయత్నం. అందుకు ఆ వర్గ పూర్తి ప్రయోజనాలకై పూర్తి స్వాతంత్ర్యం కావాలని కోరుతుంది, జాతీయ ప్రయోజనానికై మాత్రమే కాదు. మరోవైపు అటువంటి జాతీయాభివృద్ధిని వ్యతిరేకించే సామాన్య ప్రజానీకం, నూతనంగా పొందిన స్వాతంత్ర్యాన్ని సామ్రాజ్యవాద, ఫ్యూడలు శక్తుల ప్రభావాన్ని గుత్త పెట్టుబడిదారి వర్గం పరిమితిలేని పెరుగుదలను అంతం చేయుటకు వినియోగించుటను కోరుతున్నది. [1]

---

1. నంబూద్రిపాద్ (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా, పి. పి. ఐ. పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే 94.

"1955 నుండి 1961 వరకు అంటే విజయవాడ 6 వ పార్టీ మహాసభ జరిగే వరకు పార్టీలో పైకి కనిపించిన ఐక్యత చాల దుర్బలమయినది. అందువలన పార్టీ మహాసభలో భీషణమయిన పార్టీ అంతర్గత పోరాటం మరోసారి జరిగింది. ఆరవ మహాసభ ప్రతినిధులలో పూర్తిగ కొత్త రాజకీయ కలయికలు యేర్పడినాయి. మహాసభ ప్రతినిధులు చెరినగం చీలిపోయారు" [1] దేశ పరిస్థితులు, రాజకీయ అంచనా, విధాన వైఖరి అత్యంత వివాదగ్రస్థమయినా "అంతర్జాతీయ మాస్కో 1957, 1960 ల ప్రకటనలను నాటి సంయుక్త భారత కమ్యూనిస్టుపార్టీ అమోదించి సంతకాలు చేసారు. విడిపోయి పార్టీ రెండుగా రెండుగా చీలిపోయినా మేము పై రెండు అంతర్జాతీయ ప్రకటనలోని అంచనా, అవగాహనల నుండి దూరమవ్వలేదని, పైగా వాటిపై మా విశ్వాసాన్ని సుముఖంగా అనేక పర్యాయములు చెప్పామని" [2] బసవపున్నయ్య పేర్కొన్నారు.

పాల్ఘాట్, అమృతసర్ రాజకీయ తీర్మానాలు, అవగాహనలు ప్రధాన భేదాభిప్రాయాలను, పార్టీలో అంతర్గత చర్యలకు సంతృప్తికరమయిన సమాధానాలను యివ్వజాలక పోయాయి. ప్రభుత్వరంగంలో సత్వర భారీ పారిశ్రామికీకరణ, వ్యవసాయ సంస్కరణలు, గరిష్ట పరిమితులపై పాలక వర్గాలలో భిన్నాభిప్రాయాల అంచనాలపై పార్టీలో అంగీకృత అభిప్రాయాలు అభివృద్ధి చెందలేదు. రెండు వైఖరులు, ఒకటి బూర్జువావర్గం మొత్తంగా ప్రతిపాదనలకు సుముఖంగా వుండగా, భూస్వామ్య వర్గాలు, సామ్రాజ్యవాద యేజంట్లు ప్రతికూలంగా వున్నారు. మరో వైఖరి, బూర్జువా వర్గం మొత్తంగా కాక వొక శాఖ, భూస్వామ్యవర్గం, సామ్రాజ్యవాద వర్గాలు వారి తైనాతీయులు వ్యతిరేకంగా వున్నారనే అవగాహనతో వుంది. ఈ వైఖరి వారిలో కూడ, బూర్జువా వర్గంలో ఏ శాఖ, భూస్వాములు, సామ్రాజ్యవాదుల తైనాయితీలు వ్యతిరేకంగా వున్నారనే విషయంలో తీవ్ర భేదాభిప్రాయాలున్నవి.

పాలకవర్గాలలోని కొన్ని ప్రత్యేక వర్గాలకే భేదాభిప్రాయాలను అంటగటుట అసంగతమనే వైఖరిని అజయ్‌ఘోష్ అవలంభించారు. ఆ ప్రత్యేక వర్గాల రాజకీయ ఆర్థిక ప్రయోజనాలకు హానియగుట చేతనే వారి వ్యతిరేకతకు కారణమంటూ, నంబూద్రిప్రసాద్, యీ క్రింది అజయ్ అభిప్రాయాలను వుదహరించారు. "ఆయా వర్గాల రాజకీయ ప్రతినిధుల దీర్ఘకాల, తక్షణ ప్రయోజనాలననుసరించి రూపొందిం

---

1. బసవపున్నయ్య, మాకినేని (1985) మన పార్టీ కార్యక్రమము. ప్రజాశక్తి ప్రచురణ. పే. 19.
2. బసవపున్నయ్య, మాకినేని (1985) ఆన్ ప్రోగ్రాం ఆఫ్ ది సి. పి. ఐ. (యం) (ఆంగ్లంలో) పే. 4-5.

-భిన విధానాలు భిన్నంగా వుండుటవలన కొన్ని పర్యాయములు విధానాలలో భేదాభిప్రాయాలు యేర్పడవచ్చు. ఇండియాలో ఉక్కు ఫ్యాక్టరీ సోవియట్ సహాయంతో స్థాపించిన కమ్యూనిజం వ్యాప్తికి కారణభూతం కావచ్చనే భయం కొన్ని వర్గాలలో వుంది, కాగా నెహ్రూ లాంటి మరికొందరు వారి బలం, ప్రభావంలపై ఆత్మవిశ్వాసం కలిగి వున్నారు." అంతేగాక ఈ అవగాహన జాతీయ బూర్జువా వర్గపు స్వతంత్ర పెట్టుబడిదారి విధానాభివృద్ధిని లోతుగా పరిశీలించినందున అసంపూర్తి, అసమగ్రంగా వుందని నంబూద్రిపాద్ అన్నారు. ఇంకా "పాలక వర్గాలలో ఎవరు బలపరస్తున్నారు, ఎవరు వ్యతిరేకిస్తున్నారు- భారీ పారిశ్రామిక సత్వరాభివృద్ధి, ప్రభుత్వ పారిశ్రామికరంగ విస్తరణ, వ్యవసాయ సంస్కరణల ప్రాతిపదికగా-అనే ప్రశ్న ప్రధానంగా యెదురైందన్నారు. పార్టీ నాయకత్వంలో వివిధాభిప్రాయాలు వెల్లడైనాయి. ప్రతి దశలో పార్టి యీ సిద్ధాంత అభిప్రాయ భేధాలలో కూరుకుపోయిందని[1]" నంబూద్రిపాద్ పేర్కొన్నారు.

విజయవాడ కమ్యూనిస్టు పార్టి 6వ, కాంగ్రెసు ముందున్న సిద్ధాంత చర్చల వరశి గురించి, నవంబరు 1964లో 7వ, పార్టి కాంగ్రెసు ఆమోదించిన రివిజనిజంపై పోరాటం అనే రాజకీయ, నిర్మాణ నివేదిక యీక్రింది విధంగా తెలుపుచున్నది.[2]

"కమ్యూనిజం పార్టీలో అభిప్రాయ భేధాలు తీవ్రం కాజొచ్చాయి. మే 1960లో కలకత్తాలో జాతీయ సమితి సమావేశమైనపుడు పార్టి కాంగ్రెసుకు కేంద్ర కార్యవర్గపు ముసాయిదా తీర్మానాన్ని పరిశీలించజాలకపోయింది. అంతకు క్రితం యీ ముసాయిదా విదేశ పెట్టుబడిని, ముఖ్యంగా అమెరికా పెట్టుబడిని అతిగా అంచెనా వేస్తున్నదని, తప్పుగా చిత్రించుచున్నదని డాంగే వ్యతిరేకించారు. అయితే కేంద్ర కార్యవర్గంలో అత్యధిక మెజారిటి ఆమోదాన్ని పొందింది. తదనంతరం కేంద్ర కారవ్యర్గపు ముసాయిదాను చర్చించి ఆమోదించుటకు పిలువబడిన కేంద్రసమితి సమావేశంలో డాంగే వ్యతిరేకత కారణంగా పార్టి జనరల్ శక్రటరీ, కేంద్రకార్యవర్గంలో మెజారిటి ఆమోదం పొందిన తీర్మానాన్ని ప్రతిపాదించలేదు. వాస్తవపరిస్థితి అధ్యయనం చేయుటకు మరింత వ్యవధి అవసరమంటూ, ముసాయిదాను చర్చించుటకు యేర్పాటు చేసిన జాతీయ సమితి సమావేశం దానిని పరిశీలించకుండానే ముగిసింది.

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్ (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిసు పార్టి ఆఫ్ ఇండియా. పే 81-82.

2. రివజనిజం వ్యతిరేక పోరాటం, రాజకీయ నిర్మాణ నివేదిక, నవంబరు 1964 7వ, కలంత్తా సి.పి.ఐ. కాంగ్రెసు ఆమోదించినది. సి పి.ఐ. పబ్లికేషన్, డిసెంబరు 1965. (ఆంగ్లంలో) పే. 6-7.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సిద్ధాంత భేదాభిప్రాయాలు ఎక్కువగుటతో 1960 చివరలో ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల సమావేశం జరిగింది. ఆ సమావేశపు సన్నాహ కమిటీ మీటింగులకు భారత కమ్యూనిస్టు పార్టీ ఆహ్వానించబడింది. కేంద్రకార్యవర్గం సమావేశమై చర్చలు జరుపగా సిద్ధాంత సమస్యలపై తీవ్ర భేదాభిప్రాయాలు వెల్లడయ్యాయి. భారత కమ్యూనిస్టుపార్టీకి సూచనలపై కొద్ది మెజారిటీతో వొక పత్రం ఆమోదించబడింది. కేంద్రకార్యవర్గంలో అంతటి తీవ్ర భేదాభిప్రాయాలున్నప్పటికి, జాతీయసమితి సమావేశం పిలువబడలేదు, మెజారిటీ అభిప్రాయం పార్టీ అంతటిపై రుద్దబడి, తెలియజేయబడింది. మాస్కో 81 కమ్యూనిస్టు పార్టీలసమావేశానంతరం కేంద్ర కార్మిక వర్గంకాని, కేంద్రసమితిగాని మాస్కో ప్రకటనను చర్చించలేదు. పేరుకొని పోతున్న అభిప్రాయ భేదాలు పరిష్కరించుకొనుటకు ఎట్టి ప్రయత్నం జరుగలేదు. కాన అభిప్రాయ భేదాలు మరింత తీవ్రమైనాయి.

సిద్ధాంత భేదాభిప్రాయాలను సూత్రబద్ధంగా పరిష్కరించుటకు ప్రయత్నించక 1961 లో జరిగే విజయవాడ పార్టీ కాంగ్రెసుకు ముసాయిదా కార్యక్రమాన్ని, రాజకీయ విధాన తీర్మానాన్ని రూపొందించుటకు రెండు కమిషనులను యేర్పాటు చేయుట జరిగింది.

జాతీయ సమితి 1961 ప్రథమ భాగంలో సమావేశమై ముసాయిదా రాజకీయ తీర్మానం, కార్యక్రమములను పరిశీలించ తలపెట్టినపుడు రెండు రాజకీయ తీర్మానాలు రెండు కార్యక్రమాలు కమిషనులు ప్రవేశపెట్టుట జరిగింది.

జాతీయ సమితి సమావేశానంతరం రెండు వర్గాలు పార్టీ కాంగ్రెసులో తమ తమ దృక్పథాలకు మెజారిటీ సంపాదించుటకై సర్వప్రయత్నాలు మొదలు పెట్టాయి. లెనినిస్టు నిర్మాణ సూత్రాలకు భిన్నంగా పార్టీ వ్యతిరేక మార్గాలను అనుసరించాయి. ఏ ఏ రాష్ట్రాలలో ఎవరెవరు మెజారిటీగా వుంటే ఆయా గ్రూపుల-ముఠా పద్ధతులపై ప్రతినిధుల ఎన్నికల కుమ్ములాటలు అంతర్గతంగా జరిగాయి.

ఈ విధంగా ఆరవపార్టీ కాంగ్రెసుకు ప్రతినిధుల ఎన్నిక రెండు దృక్పథాల సంఘర్షణలకు సిద్ధమగుతున్న రాష్ట్రాల జిల్లాలలోని ప్రతినిధులు రెండు శిబిరాల సైనికులుగా విజయవాడపార్టీ కురుక్షేత్రానికి వెళ్ళారు. ఇది ఎవరూ కాదనలేని వాస్తవ పరిస్థితి.

దీనికి తోడుగా, పార్టీ అంతర్గత సిద్ధాంత పోరాటాన్ని మరింత తీవ్రతరంగావించిన రెండు ముఖ్య పరిణామాలను ప్రస్తావించాలి. ప్రథమంగా, చైనా ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాలు, భారతప్రభుత్వం, నెహ్రూ రాజకీయ విధానాల మొదల నూతన దృక్పథాన్ని చేబట్టి, నెహ్రూ ప్రభుత్వం విస్తరణ, అభివృద్ధి నిరో

ధక విధానాలను అనుసరించుచున్నవనే నిర్ణయానికి వచ్చినట్లు, వారి పార్టీ పత్రికలో "ఫిలాసఫీ ఆఫ్ జవహర్‌లాల్ నెహరూ" అన్న వ్యాసం మొట్టమొదటగా తెలియజేసింది. భారతకమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యవర్గం అజయ్‌ఘోష్ నాయకత్వంలో "చైనా కమ్యూనిస్టుపార్టీ, చైనా ప్రజారిపబ్లిక్ ప్రభుత్వం, సరిహద్దు వివాదం" అన్నపార్టీ అంతర్గత తీర్మానాన్ని ఆమోదించింది. ఈ తీర్మానాన్ని పంజాబ్, బెంగాల్ కామ్రేడ్స్ వ్యతిరేకించారు. అయినా యిదే అవగాహన, ప్రపంచకమ్యూనిస్టుపార్టీల 1960 యేక గ్రీవ ప్రకటన భారత కమ్యూనిస్టుపార్టీలోని అంతర్గత సిద్ధాంత పోరాటాన్ని మరింత విస్తృత, తీవ్రత పరచింది. అది యీ యుగలక్షణాలను మరింత వివరంగాను, పెట్టుబడిదారి సంక్షోభంలోని నూతనదశను, 1957 ప్రకటన సూచన ప్రాయంగా చెప్పిన దానిని మరింత వివరంగా విశ్లేషణగావించి వివరించింది. అంతేగాక, జాతీయ విముక్తి వుద్యమాలకు గల నూతనావకాశాలను సునిశిత విశ్లేషణగావించి, నూతన ప్రపంచపరిస్థితులలో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల అభివృద్ధి మార్గాలను వివరించింది. సహజంగానే యీ నూతన అవగాహనలు దేశీయ పరిస్థితులలోని అవగాహన అంతరాలను మరింత తీవ్రతరం చేసాయి అనుటలో భారత కమ్యూనిస్టు పార్టీలోని వివిధ వర్గాలలో యెట్టి భేదాభిప్రాయం లేదు.

## విజయవాడ, పార్టీ కాంగ్రెసులో రెండు దృక్పథాల సంఘర్షణ

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20 వ కాంగ్రెసు జరిగిన తరువాత భారత కమ్యూనిస్టు 4వ, పాల్ఘాట్ పార్టీ కాంగ్రెసులో తీవ్ర అభిప్రాయభేదాభిప్రాయాల ఫలితంగా, 1951లో రూపొందించిన పార్టీ కార్యక్రమాన్ని పరిస్థితుల కనుగుణంకా లేదని, తిరిగి నూతన కార్యక్రమాన్ని రూపొందించవలసిన అవసరాన్ని అందరూ గుర్తించారు. ఆచరణలో 1951 కార్యక్రమం వుపసంహరించబడింది. అయితే యే యే ప్రాథమిక అంశాల ప్రాతిపదికగా నూతన కార్యక్రమాన్ని రూపొందించాలనే విషయంలో యేక అభిప్రాయం లేక తీవ్ర వివాదగ్రస్థంగా వుంది. జాతీయ సమితి, యేకగ్రీవ అవగాహన లేనందున, వివిధ దృక్పథాలు వైఖరులు గలిగినవారు తమ తమ ముసాయిదాల కార్యక్రమాలను, రాజకీయవిధానాలను ప్రతిపాదించుటగా నిర్ణయించింది. అంచేతనే, 6వ, విజయవాడ పార్టీ కాంగ్రెసులో మూడు ముసాయిదాలు చర్చలకు ప్రతిపాదించబడినవి. డాంగే, జోషి, అధికారీలచే ప్రతిపాదించబడి రాజేశ్వరరావుచే బలపరచబడిన "మితవాద" ముసాయిదాగా పేర్కొనబడుతున్నది ఒకటి, రెండవది "అతివాదుల" ముసాయిదాగా పేర్కొనబడుతున్నదానివి రణదివె, వెంకటేశ్వరరావు, సూర్జిత్, జ్యోతిబసు, బసవ పున్నయ్య, సుందరయ్య, హనుమంతరావు, ముజఫర్ అహమ్మద్, ప్రసాదరావు, నాగిరెడ్డి, సోహన్‌సింగ్‌జోష్, జగిజిత్‌సింగ్ లాయల్‌పురి, హరిసింగ్. హరికృష్ణకోనార్, బాపనయ్య, ఇంబిచిబావ,

ధశరద్‌దేవ్, బిరేన్‌దత్, భూపేష్‌గుప్త, అచింత్యభట్టాచార్య, అబ్దుల్ హాలిం లు 21 మంది జాతీయ సమితి సభ్యులు కలసి ప్రదిపాదించారు.

పార్టీలోని భేదాభిప్రాయాలు కార్యక్రమ దృక్పదాలకు మాత్రమే గాక, నాటి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల అంచెనాలు, వ్యూహం, ఎత్తుగడల అవగాహనలపై సిద్ధాంతప్రాథమిక, మౌలికాంశాలపై సమిష్టి అవగాహనయే మాత్రం లేనందున కాంగ్రెసు వొక రాజకీయ తీర్మానాన్ని ఆమోదించలేని పరిస్థితి యేర్పడింది. ఈ భేదాభిప్రాయాలకు అంతర్జాతీయ పరిస్థితులు తోడై పార్టీ రెండుగా చీలుటకు కారణ భూతమైనందున, ఆ భేదాభిప్రాయాల పుట్టుక, అభివృద్ధి, తోడ్పడిన అంశాలు, వాటి వెనుక గల సిద్ధాంతప్రాతిపదికలు కొంత వివరంగానే తెలుసుకొనవలసి వుంది.

## భారత కమ్యూనిస్టుల వివిధ అంతర్జాతీయ అవగాహనలు

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో అనేక సిద్ధాంత సమస్యలపై తీవ్ర మైన భేధాభిప్రాయాలు యేర్పడినాయనేది రహస్యమేమీకాదు. ఈ భేదాభిప్రాయాలు ఆయా పార్టీల అంతరంగిక చర్యలకే పరిమితమైలేవు బహిరంగ తీవ్రరూపం ధరిం చాయి. భారత కమ్యూనిస్టుపార్టీలో యీ అంతర్జాతీయ భేధాభిప్రాయాలు వివాదగ్రస్త మగుట, పార్టీలోని భేదాభిప్రాయాలకు దేశీయభూమికయే గాక, అంతర్జాతీయ సిద్ధాం తాల భేధాభిప్రాయాల భూమికగూడా విస్తృత సిద్ధాంత పోరాటరంగాన్ని యేర్పర చింది. ఆకారణంగానే పార్టీ అనైక్యతకు దేశీయ సుడిగాలులకు, అంతర్జాతీయ పెను తుఫాన్‌గాలులు తోడై వివాదగ్రస్త విషయాలు విస్తరించాయి, భేదాభిప్రాయాలకు అంతర్జాతీయ సిద్ధాంతప్రాతిపధికలు యేర్పడినవి. పార్టీలోని "మితవాద", "అతివాద" దృక్పధాలకు, అంతర్జాతీయ కమ్యూనిష్టు వుద్యమంలోని "సంస్కరణవాద" "అతి వాదపిడివాదాలు" తోడై విభేదాల, వివాదగ్రస్త విషయాలు తీవ్రత యెక్కువైంది.

"మనదేశంలో నిస్సందేహంగా పెట్టుబడిదారి విధానాభివృద్ధికి చారిత్రికంగా అభ్యుదయకరపాత్ర వుంది. విదేశీ సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడిదారుల ప్రత్యక్ష పాలన కాలంలో వారికి మన ఆర్థిక విధానంపైగల "ఉడుంపట్టు"ను మన పెట్టుబడి దారి విధానాభివృద్ధి, దాని పట్టును సడలించి వేస్తుంది. మన ఆర్థిక, పారిశ్రామికీకర ణకు, వ్యవసాయ ఆధునికీకరణకు, సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి, సాంస్కృతాభివృద్ధికి అది పునాది వేర్పరుస్తుంది ...దీనిని కాదనే వైఖరి, స్వాతంత్ర్యానంతరం సామాజిక రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టి, ఆర్థిక ప్రణాళికలను ఆవిష్కరించుటలోని ప్రత్యేకతను చూడజాలకపోవుట వారసత్వంగా పొందిన పిడివాద విముఖతలో వుంచి, సెక్టేరియన్ వొంటెత్తు ఎత్తుగడలకు దారితీస్తుంది, అంచేత ఆ విధమైన వైఖరులకు తావివ్వరాదు."[1]

1. నంబూద్రిప్రసాద్, ఇ.యం.యస్ (1963) రివజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా, సి.పి.ఐ పబ్లికేషన్ పే. 91.

పెట్టుబడిదారి విధానం యెడల యీ విధమైన విమర్శనాత్మక వైఖరి, అవ గాహన 1960 మాస్కో సమావేశ పూర్వం కలిగి వుండుటకు వెనుకాడ వలసి వుంది. పెట్టుబడిదారి విధానంయెడల తీవ్ర విమర్శనాత్మక దృష్టిని లేకుండుట, సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక విప్లవాభివృద్ధిని వెనుకబడిన దేశాలలో విడనాడుట కాదాయనే సహజ అనుమానం మనకు వస్తుంది. కాని మాస్కో ప్రకటన మనకట్టి అనుమానాలు కలుగకుండా చేసి, బూర్జువావర్గం చేబట్టిన పెట్టుబడి దారి మార్గాన్ని విమర్శనాత్మకంగా సునిశితంగా దాడి చేయుటను సాధ్యం చేసింది. సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక విప్లవ లక్షణాన్ని యేమాత్రం మరువ కుండా చేస్తుంది.[1]"

"వలస బానిసత్వాన్ని బద్దలు చేసిన దేశాల జాతి పునర్జీవన కర్తవ్యాలను మాస్కో ప్రకటన నిర్వచించి, జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాల సంపూర్తికి, అన్ని దేశభక్త శక్తులు ఒకేఒక జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో సమీకరించ బడాలని సూచించింది."

"ఈ దేశాలలోని జాతీయ బూర్జువా వర్గం "ద్వంద్వనైజాన్ని" కలిగి అభ్యు దయకరమైన దైనప్పటికి, సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంలతో రాజీవిధానం వైపు మొగ్గును కలిగి వున్నదని"[2] ప్రకటన స్పష్టం చేసింది. అంతేగాకుండా రాజకీయ స్వాతంత్ర్యం పొందిన ఫలితంగా, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో సంఘర్షణ వైరుధ్యాలు పుట్టగలవని కూడ తెలిపింది. జాతీయ బూర్జువా వర్గం దేశీయ అభివృద్ధి నిరోధకులతో, సామ్రాజ్యవాదంతో రాజీకి మరింత చేరువైన కొలది, ప్రజలు శతా బ్దాల తమ వెనుకబాటు తనాన్ని రూపుమాపుకొనుటకు, జీవన ప్రమాణాలను పెంచు కొనుటకు పెట్టుబడిదారేతర పంథాను స్పష్టంగా చూడగలరని ప్రకటన వివరించిం దన్నారు నంబూద్రిపాద్.

"నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల అభివృద్ధి సమస్యల పరిశీలనతో రెండు అంశాలు స్పష్టం i) ఐక్య సంఘటన అంటె ఒక వర్గానికి వ్యతిరేకంగా మరోవర్గ సంఘటన కాదని, సామ్రాజ్యవాదానికి, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా జాతి మొత్తపు సంఘటన; సామ్రాజ్యవాదానికి, ఫ్యూడలిజాన్నియే మేరకు పోరాడుటకు జాతీయ బూర్జువావర్గం సిద్ధమగుతుందో ఆ మేరకు ఐక్య సంఘటనలో దానికి స్థాన ముంటుంది. ii) అట్టి అన్ని వర్గాల జాతీయ ఐక్య సంఘటనలో రెండు ప్రధాన సామాజిక శక్తులు తమ తమ కార్యక్రమాలు, దృక్పధాలతో ఒకదానికొకటి పోటీ పడుతున్నవి. ఒక చివర ప్రణాళికాబద్ధంగా జాతీయాభివృద్ధిని పెట్టుబడిదారి పంథాలో

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టుపార్టి ఆఫ్ ఇండియా. పి.పి.హెచ్. పబ్లికేషన్. పే. 94.
2. ........అదే........పే. 93.

కొనసాగించ ప్రయత్నించే బూర్జువావర్గం, ఆది సమాజంలో పెట్టుబడిదారి వర్గాలు, జాతి ప్రయోజనాల కొరకుగాక తమ ప్రయోజనాలకై నిర్వహించే పూర్తి స్వేచ్ఛను కలిగి వుండాలని కోరుతుంది. మరో చివర, అట్టి జాతీయ ఆర్థికాభివృద్ధిని వ్యతిరేకించి, నూతనంగా పొందిన రాజకీయ స్వాతంత్ర్యాన్ని సామ్రాజ్యవాద, ఫ్యూడలు శక్తులు ప్రభావాన్ని రూపుమాపుటకు, నియమరహిత పెట్టుబడిదారి విధానాభివృద్ధికి హద్దులు విధించుటకు వుపయోగించాలనే ప్రజాసామాన్యముంది".

మాస్కో ప్రకటనకు రెండు వివరణ వ్యాఖలు, స్వాతంత్ర్యానంతర అభివృద్ధికి రెండు అంచెనాలు, రెండు దృక్పధాల వ్యూహం, ఎత్తుగడలు, కార్మికవర్గం ప్రజాస్వామ్య వుద్యమం అనుసరించవలసిన మార్గాలను విజయవాడ పార్టీ కాంగ్రెసుకు ముందు పార్టీ ఎదుర్కొనవలసి వచ్చింది. ఈ రెండు దృక్పదాలలో యేదో వొకదానిని చేబట్టినవారు రెండో దృక్పదాన్ని, ప్రపంచ వుద్యమ సాధారణ కమ్యూనిస్టు పంధాకు వ్యతిరేకమైనదానిగా, మార్క్సిస్టు వ్యతిరేక విధానంగాను, వారు అనుసరించే విధానమే వాస్తవ మార్క్సిస్టు లెనినిస్టు విధానంగాను ప్రకటించారు. ఒకరు మరొకరిని మాస్కో ప్రకటనను గ్రుడ్డిగా, వొంటెత్తుగా, యేదో గా (పార్షల్) ఆమోదించారని నిందించారు. ప్రతిగా మాస్కో ప్రకటనలోని విప్లవ సారాంశాన్ని భూమికగా గైకొనలేదని నిందించబడ్డారు[1]

"మన పార్టీలోని వివిధ భావాలకు 1960 నవంబరు మాస్కో 81 దేశాల కమ్యూనిస్టు పార్టీల ఏకగ్రీవ ప్రకటనకు ప్రత్యేక ప్రాముఖ్యత కలిగి వుంది. మొదటిది; 1957 ప్రకటనకంటె నూతన యుగానికి పెట్టుబడిదారి విధానంలోని సామాన్య సంక్షోభానికి నూతన దశ వివరణాత్మకమైన అంశాలను లేక లక్షణాలను నిర్వచించింది. రెండవ విషయంగా నూతన అంతర్జాతీయ పరిస్థితి కారణంగా నూతన స్వతంత్ర దేశాలు, జాతీయ విముక్తి ఉద్యమాలకు ముందున్న నూతనావకాశాలను, సునిశిత విశ్లేషణ గావించి, మాస్కో ప్రకటన వివరించిందని"[2] అధికారి అన్నారు.

అంతేగాక, "ఈ విశ్లేషణలో నూతనమయినదేది?" అని ప్రశ్నించి వాటిని, "ఒకటి : నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల అనుభవాల శాస్త్రీయ సారాంశం నూతన ప్రపంచ పరిస్థితులలో ఆవిర్భవించిన నూతనాంశాలు. రెండు : జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని యీ నూతనావకాశలను కార్మికవర్గం, దాని పార్టీ వినియో

---

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టుపార్టి ఆఫ్ ఇండియా (ఆంగ్లంలో) పే. 100-101.
2. అధికారి, జి. (1964) కమ్యూనిస్టుపార్టీ అండ్ ఇండియన్ పాత్ టు నేషనల్ రీజనరేషన్ అండ్ సోషలిజం (ఆంగ్లంలో) పే. 145.

గించి నూతన మార్గంలో పూర్తిచేసి, ఎట్లు సోషలిజం వైపు పురోగించగలదో చూపెడుతుంది. ఈ రెండు అంశాలు, ప్రధాన సిద్ధాంతంలోని-మాస్కో ప్రకటనలోని నాల్గవ ప్రకరణంలో ప్రతిపాదించబడినవని" అధికారి వివరించారు.

ఈ కర్తవ్యాలను పూర్తి చేయగలిగిన వర్గ శక్తులేవి? అనుసరించు పద్ధతులేవి?" అని తిరిగి ప్రశ్నించుకొని యీ విధంగా సమాధానమిచ్చారు. "ప్రపథమంగా కార్మికవర్గం ముఖ్యంగా యీ కర్తవ్యాలను పూర్తి చేయుటకు నిరవధికంగా పని చేస్తుంది. రైతుల ప్రయోజనాలకై అభ్యుదయకర వ్యవసాయ సంస్కరణలు, పారిశ్రామికీకరణ ప్రజాస్వామ్య పద్ధతులలో ప్రభుత్వరంగ విస్తరణ, విదేశ గుత్త పెట్టుబడిదారులపై ఆధారపడని స్వతంత్ర విధానం, భూమికగా క్రమేణా దేశ ఆర్థిక విధానంలో నిర్ణయాత్మక పాత్ర వహించగలిగిన దవుతుంది.

"ఉపకరణాలు : విస్తృత జాతీయ సంఘటన పునాదిగా కార్మిక, కర్షక ఐక్యత, జాతీయ బూర్జువావర్గం యీ సంఘటనలో పాల్గొంటుంది. దాని పాత్ర "ద్వంద నైజ కారణంగా" వివిధ దేశాలలో భిన్నంగా వుంటుంది" [1] అని అధికారి మాస్కో ప్రకటన, నూతన స్వాతంత్ర్య దేశాల అవగాహన వివరించారు.

"భారత కమ్యూనిస్టుపార్టీ యీ రెండు అధికార పత్రాల (మాస్కో 1957, 1960 ప్రకటనలు) విప్లవ సూత్రాలను, వాటి మార్క్సిస్టు-లెనినిస్టు స్వచ్ఛతను పరిరక్షించుటయే గాక అన్ని సంస్కరణవాద, పిడివాద వక్రీకరణలనుండి తన్నుతాను కాపాడుకొంటుంది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చుట్టుముట్టి పీడించుచున్న నూతన సంస్కరణవాద ప్రమాదానికి వ్యతిరేకంగా పోరాడుటయేగాక—ఇదియే ప్రధాన ప్రమాదకారియైనది—అదే కాలంలో పిడివాద పొరపాటులపై హెచ్చరిక చేస్తుంది. అంతర్జాతీయ ఉద్యమ ఐక్యతను బలపరచుటకు ప్రయత్నిస్తుంది ఈ నూతన యుగంలో ప్రపంచమంతటా ఏర్పడిన నూతనావకాశాలను ప్రతి దేశంలో, ప్రపంచంలో వాస్తవాలుగ చేయుటకు అది వొక్కటే నిజమైన గ్యారంటీ చేయగలదు." [2]

"మాస్కో 81 పార్టీల సమావేశంలో పాల్గొన్న మన ప్రతినిధులలోనే మనకు సంబంధించిన సమస్యలపై ప్రకటన అవగాహనలపై అభిప్రాయభేదాలున్నవి. జాతీయ సమితి 11 జనవరి 1961 సమావేశంలో అజయ్‌ఘోష్ మాస్కో సమావేశంపై నివేదిక సమర్పించారు. అజయ్‌ఘోష్ సూత్రీకరణలపై భేదించిన భూపేష్

1. అధికారి, జి. (1964) కమ్యూనిస్టుపార్టీ అండ్ ఇండియన్ పాత్ టు నేషనల్ రీజనరేషన్ అండ్ సోషలిజం (ఆంగ్లంలో) పే. 146-7.
2. బసవపున్నయ్య, యం. (1965) సి. పి. ఐ. (యం) కార్యక్రమం (ఆంగ్లంలో) పే. 5.

గుప్తా 14 జనవరి 1961 న తన అభిప్రాయాలను తెలియజేస్తూ 'మరో పత్రం సమర్పించారు.

శాంతి సహజీవన సమస్యపై "సామాజికార్థంలో శాంతి సహజీవనమంటే, వర్గపోరాట ప్రత్యేక రూపం, ప్రపంచంలో సామ్రాజ్యవాదంతో సిద్ధాంత పోరాటం, సామ్రాజ్యవాదం యుద్ధాలకు దిగకుండా నిరోధించుటతో పాటు, సోషలిస్టు శక్తుల నిరవధికంగా బలోపేతంగా అభివృద్ధి చెందుట" అని అజయ్ నోటు చెప్పుతున్నదని భూపేష్‌గుప్తా పేర్కొన్నారు.[1]

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని భేదాభిప్రాయాలు వాస్తవానికి, భారత కమ్యూనిస్టుపార్టీలో దీర్ఘకాలంగా పేరుకుపోయిన అంతరంగిక భేదాభిప్రాయాలకు తోడయినాయి. పార్టీ అంతరంగిక పరిస్థితి ప్రజ్వలించి, బద్దలయ్యే స్థితి ఏర్పడింది. అంతర్జాతీయ 1957, 1960 ల మాస్కో సమావేశాల పత్రాలకు భాష్యం చెప్పటంలో, అమలు జరుపుటలో తీవ్రమయిన భేదాభిప్రాయాలు ఏర్పడినవి.

భారత కమ్యూనిస్టుపార్టీ ప్రపంచ సిద్ధాంత పోరాటంలో తటస్థంగా వుండజాలదు. చర్చనీయాంశాలు అంతర్జాతీయ ప్రాధాన్యత గలవే కాకుండా, భారత విప్లవోద్యమంపై ప్రత్యక్ష ప్రభావం కలవి. అందుచేత, యీ చారిత్రాత్మక సైద్ధాంతిక వివాదంలో మనం నిర్లిప్తులమై ప్రేక్షకులుగా వుండుట ఎంత తప్పో, తీవ్ర వాదోపవాదాలు జరుపుకొంటున్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, చైనా కమ్యూనిస్టుపార్టీలలో ఏదో వొకదాని వైఖరిని ఆలోచించకుండా, అనుసరించేవారుగ వుండుట అంతే తప్పు అవుతుంది.[2]"

భారత కమ్యూనిస్టుపార్టీలో సోవియట్ 20 వ పార్టీ కాంగ్రెసు, 1957 మాస్కో ప్రకటన, 1960 మాస్కో సమావేశ పత్రాలు, సోవియట్ 22 వ పార్టీ కాంగ్రెసు అధికార పత్రాలపై చర్చలు, నిర్ణయాలు జరిగిన మాట వాస్తవం. ఈ చర్చలన్నీ కేంద్ర కార్యవర్గం, జాతీయ సమితి, కొన్ని సందర్భాలలో రాష్ట్ర కమిటీలకు మాత్రమే పరిమితమై, హడావుడిగా జరిగాయి. చర్చలకు తగినంత కాలాన్ని వినియోగించుటలో విఫలమయ్యాయి. మరో విషయం, అనేక నిర్ణయాలు ఆయా పార్టీ కమిటీలలో తీవ్రమయిన చీలికలు యేర్పడి వుండగా తీసుకొన్నవి. పార్టీ కార్యకర్తలలో సుసంఘటితంగా అంతరంగిక చర్చలు జరిపి, భేదాభిప్రాయాలపై ఏకగ్రీవామోదం, అవగాహన వచ్చుటకు తీవ్ర ప్రయత్నం చేయుటలో పార్టీ విఫలమైంది.

---

1. సూర్జిత్, హరికిషన్‌సింగ్ (1980) సి. పి. ఐ. (యం), సి. పి. ఐ. భేదాభిప్రాయాలు. పే. 6.
2. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చర్చించబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యల చర్చా పత్రం (తెలుగు) పే. 3.

అందువలనే పార్టీ ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో తదనంతర కాలంలో దాదాపు సమానంగా చీలిపోయింది. ఈ అనుభవాల దృష్ట్యా పై కమిటీలు పార్టీపై తొందరపాటుగ నిర్ణయాలు రుద్దటం నిరుపయోగమే కాక, నష్టదాయమవుతుంది. అవి సక్రమంగా అమలు జరుగవు, ఐక్యతకు తోడ్పడవు.

## విజయవాడ 1961 పార్టీ కాంగ్రెసు :

1. ఈ నేపధ్యంలో భారత కమ్యూనిస్టుపార్టీ 6 వ, కాంగ్రెసు మహాసభ విజయవాడలో 7-16 ఏప్రిల్ 1961 లలో జరిగింది. పార్టీలోని 'మితవాద సంస్కరణ వాదులు', 'అతివాద పిడివాదులు' హోరాహోరీగా సంఘర్షించిన చారిత్రిక కాంగ్రెసుగా చెప్పుకొనవచ్చు.

కలకత్తాలో మే 1960 లో కేంద్ర సమితి సమావేశమైనప్పుడు 6 వ పార్టీ కాంగ్రెసు పూర్వ చర్చల నిమిత్తం కేంద్ర కార్యవర్గం ముసాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించగా, డాంగే దానిని వ్యతిరేకించినందున అది చర్చకు రాలేదు. మాస్కో-81 కమ్యూనిస్టుపార్టీల సమావేశానంతరం భేదాభిప్రాయాలను చర్చించి పరిష్కరించుకొనకుండానే పార్టీ కార్యక్రమము, రాజకీయ విధానం ముసాయిదాలను రూపొందించుటకు రెండు కమిషనులను ఏర్పాటుకు నిర్ణయం జరిగింది. జాతీయ సమితి 1961 మొదటిలో సమావేశమయినప్పుడు రెండు కార్యక్రమాలు, రెండు రాజకీయ తీర్మానాలు చర్చలకు కమిషన్‌లు సమర్పించాయి. ఏకగ్రీవామోదం లేనందున జాతీయ సమితి వివిధ దృక్పధాలు, వైఖరులు గలవారు తమ తమ ముసాయిదా కార్యక్రమాలను, రాజకీయ తీర్మానాలను పార్టీ కాంగ్రెసులో ప్రతిపాదించుటకు నిర్ణయించబడింది. అందుచేతనే విజయవాడ పార్టీ కాంగ్రెసులో మూడు ముసాయిదాలు చర్చలకు ప్రతిపాదించబడినవి.

భేదాభిప్రాయాలు కార్యక్రమ వైఖరులకు సంబంధించి మాత్రమేకాక నాటి పరిస్థితుల అంచెనా, ఎత్తుగడల పంధాలకు సంబంధించి వుండుట వలన, కాంగ్రెసులో ఆమోదించబడుటకై రూపొందించ వలసిన రాజకీయ విధాన తీర్మానం ముసాయిదాపై అందరి ఆమోదం పొందిన అవగాహన శూన్యమైంది. నూతన కార్యక్రమ ఆమోదం వాయిదా వేసినప్పటికీ, నేటి పరిస్థితులలో అనుసరించవలసిన ఎత్తుగడలవ్యూహం, అందరి ఆమోదం పొందినదిగాని లేక మెజారిటీ ఆమోదం పొందినది లేకుండానే పార్టీ కాంగ్రెసు ముగియుట అసంగతమేగాక, పార్టీలోని సంక్షోభాన్ని తెలియజేస్తుంది. ఈ పరిస్థితినుండి బయటపడుటకు వొక వింతైన విధానం అనుసరించబడింది. జనరల్ సెక్రటరీ ఉపన్యాసం నుండి అనేక ప్రధానాంశాలను తీసికొని, కారణం ఆ వుపన్యాసంకు చాలావరకు అందరి ఆమోదం వున్నదికాన, ఆ విధంగా వొక ముసాయిదా తీర్మానాన్ని రూపొందించుట జరిగింది. దీనికి అభ్యంతరాలు వున్నవి. సంక్షోభాన్నుండి బయటపడుటకు యిది వొక అశాస్త్రీయ రాజీమార్గం తప్ప మరొకటికాదు.

ఈ పార్టీ కాంగ్రెసు మూడు ముసాయిదాలు భవిష్యత్తులోని అత్యంత ముఖ్య పరిణామాలకు మూలమైనందున కొంత వివరంగా తెలుసుకొందాము.

2. కాంగ్రెసులో మూడు చిత్తు పార్టీ కార్యక్రమాలు, రాజకీయ తీర్మానాలు ప్రతిపాదించబడినవి. జాతీయ సమితి మెజారిటీ సభ్యుల ముసాయిదా తీర్మానాన్ని; డాంగే, జోషి, అధికారులు ప్రతిపాదించారు. ప్రత్యామ్నాయపై నారిటీ ముసాయిదా తీర్మానాన్ని జాతీయ సమితిలోని 21మంది రణదివె తదితరులు, 'అతివాదులుగ' పేర్కొనబడుతున్నవారు ప్రతిపాదించారు. మెజారిటీ తీర్మానాన్ని రాజేశ్వరరావు బలపరచారు. ఈపై రెండు 'మితవాద సంస్కరణవాదుల', 'అతివాదసంస్కరణవాదుల' ముసాయిదాలతో ఆమోదించలేని నంబూద్రిపాద్ మూడో ముసాయిదాను ప్రతిపాదించారు. మెజారిటీ, మైనారిటీ సభ్యుల ముసాయిదాలు రెండు కార్యక్రమాలు రాజకీయ తీర్మానాలు ప్రధానంగా రెండు దృక్పదాలును, అంచెనాలను తెలియజేస్తున్నవి. కాంగ్రెసులో పేరుకుమాత్రందృక్పదాల సమ్మేళనంతో వొకనామమాత్రపు తీర్మానం ఆమోదించబడినా, రెండు మౌలిక దృక్పదాలు, అంచెనాలు, అవగాహన, ఆచరణలు కొనసాగాయి. రెండు కార్యక్రమాలపై వివాదగ్రస్త విషయాలు అతి తీవ్రమైనవగుటతో చర్చలను కాంగ్రెసు వాయిదా వేసింది.

రెండు దృక్పధాల, అంచెనాల సారాంశం గుత్తపెట్టుబడిదారి వర్గం యెడల ప్రభుత్వం వహించిన పాత్ర, సంబంధాలను పరిశీలించిన విధానం, రెండు ముసాయిదాలు అంచెనావేయు విధానాలలో స్పష్టంగా కానవస్తుంది. "మెజారిటీ ముసాయిదా" ఆర్థిక విధానంపై ప్రభుత్వ అజమాయిషీని, సామ్రాజ్యవాద, ప్యూడలు వ్యతిరేకాంశంగా మాత్రమేగాక గుత్త పెట్టుబడిదారి వ్యతిరేకాంశంగా అంచెనా వివరిస్తుంది" అని నంబూద్రిపాద్ పేర్కొని, ముసాయిదాలోని వుదహరింపును క్రింది విధంగా యిచ్చారు. "పారిశ్రామికీకరణ విధానం, ప్రభుత్వరంగ పేర్పాటు, మౌలిక పరిశ్రమల కొన్నింటిలో విదేశ వ్యక్తి యాజమాన్య పెట్టుబడిపై కొన్ని పరిమితులు, వ్యక్తి యాజమాన్య పెట్టుబడి మార్గాన్ని, అజమాయిషీ చర్యలు నిర్ణయించబడినవి. ఇవన్నీవొక మార్పును సూచిస్తున్నవి. బూర్జువావర్గంలో గుత్తపెట్టుబడిదారులు నూతనంగా పొందిన స్వాతంత్ర్యాన్ని, సామ్రాజ్యవాద, వలస వ్యతిరేక జాతీయ బూర్జువా ప్రభుత్వాన్ని పూర్తిగా తమ సంకుచిత ప్రయోజనాలకై దేశ ఆర్థిక విధానాన్ని మొత్తంగా తమ వ్యక్తి యాజమాన్యంలో వుంచుకొనుటకై చేసిన ప్రయత్నాల వైఫల్యాన్ని ప్రత్యేకంగా తెలియజేస్తుంది[1]" ఉదహరింపుపై నంబూద్రిపాద్ యిలా వ్యాఖ్యానించారు. "బూర్జువా వర్గంలోని గుత్తపెట్టుబడిదారులు ప్రభుత్వాన్ని

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్. (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిష్టుపార్టీ ఆఫ్ ఇండియా. (ఆంగ్లంలో) పే. 83.

పూర్తిగ తమ సంకుచిత ప్రయోజనాల పరిధిలో వుంచే ప్రయత్న వైఫలాన్ని ముసాయిదా పేర్కొని, బూర్జువావర్గంలోని వచ్చి అభివృద్ధి విరోధక వర్గం స్వతంత్ర పార్టీలో చేరింది అన్నది. కాంగ్రెసు విస్తారంగా, మొత్తంగా జాతీయ బూర్జువా వర్గ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది, స్వతంత్రపార్టి అత్యంత అభివృద్ధినిరోధక బూర్జువా వర్గాల రాజకీయ సంస్థగా కన్పడుతున్నది. అయితే వారిని బలపరచేవారు కాంగ్రెసులోని మితవాద వర్గంతో వుండి ప్రభుత్వంలో, మంత్రివర్గాల నిర్మాణంలో ప్రముఖపాత్ర వహించుతున్నారు. ఇదే కాంగ్రెసు, స్వతంత్రపార్టీలభేధంగా కన్పడుతున్నది[1].

కేంద్ర సమితిలోని అతివాదుల 21మంది ముసాయిదా యీ విషయమై యేమి చెబుతున్నదో చూద్దాము.

"మన ఆర్థిక విధానంలో బూర్జువా ప్రణాళికలు గుత్తపెట్టుబడిదారి వైఖరులను ప్రోత్సహించి, ఆర్థికశక్తిని వారి చేతులలో కేంద్రీకరించునట్లు అభివృద్ధి చేయుట స్పష్టం. పాలకవర్గం ప్రభుత్వపారిశ్రామికరంగాన్ని బడాబూర్జువా సేవలకు వినియోగిస్తున్నది. ప్రణాళికా కాంట్రాక్టులు, ప్రభుత్వరంగ పరిశ్రమల వుత్పత్తులు పంపకాలు బడా బూర్జువాలకే సంక్రమిస్తున్నాయి. ప్రభుత్వ పరిశ్రమలు, ద్రవ్య, అప్పు సంస్థలు ప్రభుత్వరంగంలోవున్నా బడాబూర్జువా వర్గాలకే వుపయోగపడుతున్నవి. జాతీయ బూర్జువా వర్గంలోని పెటిబూర్జువా, మధ్యతరగతి వర్గాలకు సహాయం లభించుటలేదు, ప్రభుత్వానికి దూరంగానే వుంచబడ్డాయి." ఈ వుదహరింపుపై నంబూద్రిపాద్ వ్యాఖ్య యిలా వుంది. "ముసాయిదా పాలకపార్టీలోని వర్గవిభజన సారాంశపు ప్రశ్ననేగాక, ప్రతి పక్షపార్టియైన స్వతంత్రపార్టి యెడల అట్టి ప్రశ్న లేవనెత్తలేదు. పాలకపార్టీలో అట్టి సంఘర్షణలు, వాటి వర్గ విశ్లేషణ చేయవలసినంతటి పాత్ర వహించుటలేదని, వాటి సిద్ధాంత వివేచనావసరం ఆకర్షించలేదు. "రెండు ముసాయిదాలు పై రుద్యాలతో నిండివున్నాయి. ముగ్గురి ముసాయిదా "గుత్త పెట్టుబడివర్గాల ప్రభుత్వాన్ని పూర్తిగా వారి సంకుచిత ప్రయోజనాలకు అనుగుణం మార్చే ప్రయత్న వైఫల్యం" అనే సూత్రీకరణను యీ క్రింది విధంగా వ్యతిరేకిస్తున్నదని నంబూద్రిపాద్ ముసాయిదా నుండి యిలా వుదహరించారు.

"జాతీయ బూర్జువావర్గం ప్రణాళికాబద్ధ వుత్పత్తిని అదుపుచేయుటను కొంత అయిష్టంగానే ఆమోదించినా, పెట్టుబడుల నిర్దేశించే యంత్రాంగాన్ని ప్రభుత్వం చేబట్టుటను ఆమోదించక వ్యతిరేకించుచున్నది. అంటే బ్యాంకులు, ధరల నిర్ణయాన్ని విదేశ, గుత్త వ్యాపారాన్ని, విదేశీమారకద్రవ్య మార్కెట్టు సంస్థల అదుపును అంగీకరించలేదు.... పెట్టుబడిదారి విధానాభివృద్ధి, దానిలోని పోటీ ఫలితంగా కొద్ది

---

1. నంబూద్రిపాద్ ఇ యం ఎ. యస్. వ్యాఖ్య .......అదే .......పే. 84.

మంది బడా పెట్టుబడిదారుల క్రింద పెట్టుబడి, ఆర్థికశక్తి కేంద్రీకరణజరిగింది. జాతీయ బూర్జువా, ప్రజలకు నష్టదాయకంగా గుత్తవర్గాలు పెరిగాయి. దిగుమతి కోటాలు, విదేశమారక ద్రవ్యం, ముడిపదార్థాలు, ఆర్థికశక్తిని పెంచుటకై ద్రవవనరుల పెరుగుదల, రాజ్యాధికారంలో అభివృద్ధి నిరోధకుల నిలబెట్టి, దేశ, విదేశాంగ విధానాలలో మార్పుతెచ్చుటకై, గుత్తపెట్టుబడిదారి వర్గాలు ప్రభుత్వయంత్రాంగంలో అధికార బ్యూరాక్రటిక్ వర్గాలతో కలసి, వారితోగల పొత్తును వినియోగించుతున్నవి.[1]"

నంబూద్రిపాద్ తదనంతరం ఈ విధంగా వాఖ్యానించారు. "ఈ విధంగా రెండు ప్రణాళికల కాలంలో విస్తరించబడిన ప్రభుత్వ పారిశ్రామికరంగం, రెండవ ప్రణాళిక కాలంలో ముఖ్యంగా విస్తరణ, ప్రభుత్వరంగం ఆధిపత్యం సంపాదించి, గుత్తపెట్టుబడిదారులు తమస్వపూర్తి ప్రయోజనాలకుపయోగపడునట్లు చేయుటలో వైఫల్యం పొందునంతగా బలహీనపడుట జరుగలేదు. గుత్తపెట్టుబడి పబ్లిక్ లేక ప్రభుత్వ ప్రజారంగంలో అంతటి శక్తివంతంగా లోపలికి జొరబడునట్లు కన్పించుచున్నది. ముసాయిదాలో యీ రెండు వైఖరులు లేక దృక్పథాల మధ్య సమన్వయం చేయు ప్రయత్నం జరుగలేదు."

అదేవిధంగా, నంబూద్రిపాద్ 21 మంది 'అతివాదుల' ముసాయిదాపై వ్యాఖ్యానించారు. "ముసాయిదా మనం చూచినట్లు గుత్తపెట్టుబడి వర్గాలు తాము బలపడకుండుటకై పంచవర్ష ప్రణాళికలను సాధనాలుగ వుపయోగించుకొనుట, ప్రభుత్వరంగం బడావ్యాపారవర్గాల సేవలకు వినియోగపడింది." అయినా అదే ముసాయిదా "అట్టి ప్రభుత్వరంగం గుత్తపెట్టుబడి వర్గాల స్థానాలను బలహీనపరచి, ప్రజలు యేదోవొక స్థాయిలో అజమాయిషీ చర్యలు గైకొనునట్లు బూర్జువా భూస్వామ్య సంస్థలద్వారా చేస్తుంది. కాన దానికి అభివృద్ధికరపాత్రవుంది. ప్రభుత్వరంగం బడా వ్యాపారవర్గాల సేవలు చేయుట అదేకాలంలో గుత్తవర్గాల స్థానాలను బలహీనపరచుట ఈ రెండు వైఖరులను సమన్వయం చేయుట ఎట్లు, దీనిని అర్థం చేసుకొనుట సాధ్యంకాదు[2]." అంతేగాక ప్రజాప్రభుత్వరంగం ఎవరి సాధనంగా వుపయోగపరుతున్నదో నంబూద్రిపాద్ సుదీర్ఘంగా వివరించి యీ క్రింది విధంగా ముగించారు.

"మనలాంటి బూర్జువా ప్రభుత్వ రాజకీయ నిర్మాణంలో ప్రభుత్వరంగం బూర్జువావర్గంలోని గుత్తపెట్టుబడుదారులకు వ్యతిరేకంగా, ప్రజల చేతులలో ఆయుధంగా వుపయోగపడుతుందనుట భ్రమేకాగలదు. అందుకు భిన్నంగా, యీ ప్రజాప్రభుత్వరంగ విస్తరణ, యితర బూర్జువా వర్గాలకు వ్యతిరేకంగా గుత్తపెట్టుబడి

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్ (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా. (ఆంగ్లంలో) పే. 85లోని ఉదహరింపు.
2. నంబూద్రిపాద్, ఇ.యం.యస్(1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా (ఆంగ్లంలో) పే. 85 లోని ఉదహరింపు.

దారుల చేతులలో ఆయుధంగా వుపయోగపడగలదు. పెట్టుబడి కేంద్రీకరణ విధాన క్రమాన్ని తేలిక చేయగలదు"[1].

"ఇది వ్యబుసు పోక సిద్ధాంతీకరణకాదని, ఆర్థికాభివృద్ధి విధాన నిర్దిష్ట పరిశీలనపై ఆధారపడినదని, రాజకీయ తీర్మానాన్ని ప్రతిపాదించుతు పార్టి 6వ, కాంగ్రెసులో అజయ్‌ఘోష్ యిచ్చిన వుపన్యాసం స్పష్టం చేసింది[2]"

"గుత్తపెట్టుబడి పెరుగుదల, ప్రజాసామాన్యం మరింత దారిద్ర్యంలో మునుగుట, ధనికుల బీదలమధ్య అంతరం మరింత అఘాత మగుట, అన్ని ముసాయిదాలలో సాధారణంగా ఆమోదించబడిన అంశాలు. కాని, యేకగ్రీవంగా అభ్యుదయకరమైనదని, స్వతంత్ర పెట్టుబడిదారి ఆర్థిక విధానాభివృద్ధికి మౌలికమైనదని తలచిన ప్రభుత్వరంగం విస్తరణ, అభివృద్ధి జరిగినప్పటికి, యిది యెలా జరిగిందనే ప్రశ్న వుదయించింది. ఏ ముసాయిదా యీ ప్రశ్న వేయలేదు, యేసీ పైన వుదహరించిన వాస్తవాలకు,ప్రభుత్వరంగం, గుత్తబూర్జువా వర్గాలు ప్రభుత్వాన్ని తమ పూర్తి ప్రయోజనాలకు వినియోగించుకుందునట్లు చేయుటవే డాంగే, జోషి, అధికారుల ముసాయిదా కాని, కనీసం ప్రజలకు యాజమాన్య,కంట్రోలు,గుత్త వర్గాలపై కొంతవరకు యిచ్చే అవకాశాలున్నవనే, భూపేష్‌గుప్తా, రామమూర్తి 21 మంది ప్రత్యామ్నాయ ముసాయిదాగాని గుర్తించనేలేదు[3]". అని నంబూద్రిపాద్ కీలకాంశాలను లేవనెత్తి యీ క్రింది విధంగా సమాధాన మీయ ప్రయత్నించారు.

"పెట్టుబడిదారి పరిధిలో ప్రభుత్వరంగ అభివృద్ధిలోని బిడీకృతంగా వున్న అట్టిప్రమాదకరసాధ్యాలను పరిగణలోనికి తీసుకొనపోవుటలోని వైఫల్యం, సంస్కరణ వాదాభివృద్ధికి ఫలవంతమయిన నేల అగుతుంది. పెట్టుబడిదారి విధానాన్ని కాక, ప్రజాస్వామ్య సోషలిజాన్ని, సంక్షేమ రాజ్యాన్ని నిర్మిస్తున్నామన్న జాతీయ బూర్జువా వర్గ సిద్ధాంతానికి దాసోహం అనుటకు సమానమగుతుంది[4]."

పెట్టుబడిదారి విధానం 19వ, శతాబ్దంలో యూరపులో అభ్యుదయ కరపాత్ర వహించింది. నేడు భారతదేశంలో అదే పాత్ర వహించుచుంది. మార్క్సు, ఏంజిల్సు అభ్యుదయకరపాత్రేకాదు, విప్లవకరపాత్ర వహించుచుందనుటలో వెనుకాడలేదు. అయితే పెట్టుబడిదారి విధానం అభివృద్ధిలో వైరుద్యాలను, సంక్షోభాలను యీ విధానంలోనే అంతర్గతంగా వుండుటను మరువజాలము. ఈ వాస్తవ విపేచన నుండి

1. నంబూద్రిపాద్, ఇ. యం.యస్ (1963) రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్‌ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా. (ఆంగ్లంలో) పే. 88
2. అదే పే. 88
3. ........ అదే ........ పే. 89
4. ........ అదే ........ పే. 91

"మాస్కో 1960 ప్రకటన జంట దృక్పధాలను, జాతీయ ప్రజాస్వామ్యం, పెట్టుబడిదారేతర పంథా అనురెండు సిద్ధాంతాలను అభివృద్ధి చేసింది".

అధికారి, "ప్రభుత్వరంగ ప్రత్యేకతను అభ్యుదయకరత్వాన్ని, అది బూర్జువా వర్గపు చేతులలో పెట్టుబడిదారి విధాన నిర్మాణానికి, గుత్తపెట్టుబడిదారి వర్గాభివృద్ధికి సాధనంగా వుపయోగపడిందన్ని "మరచిపోయి," అతిగానొక్కి చెప్పారనే నంబూద్రిపాద్ విమర్శనకు "మెజారిటి ముసాయిదా సంస్కరణవాదాన్ని రచయిత బహిరంగ పరచుటను అభినందించుతు, అవుత్సాహం, ఆ ముసాయిదాలో లేని వాటిని చూచేటట్లు చేయరాదు. ఉదాహరణకు ముసాయిదా ఎక్కడా ప్రభుత్వరంగం "గుత్తావర్గాలకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడిన అంశంగా పేర్కొనబడలేదని "తమ సంకుచిత ప్రయోజనాలకై గుత్తపెట్టుబడిదారి వర్గాలు చేసే ప్రయత్నాలను, ప్రభుత్వరంగం వమ్ముచేసినట్లు" ఎక్కడా చెప్పలేదని "అధికారి అని "యిది న్యాయం చేకూర్చే సంక్షిప్తాలు కావన్నారు[1]." ప్రభుత్వరంగంలో కీలక భారీ పరిశ్రమల నిర్మాణ ఆశయం,1938లో జాతీయ కాంగ్రెసు అధ్వర్యంలో జాతీయ ప్రణాళికా సంఘపు ప్రతిపాదనలు, 1944 తాతా బిర్లా ప్లానులో భారతపెట్టుబడిదారులు భారీ, మౌలిక పారిశ్రామికరంగాన్ని వ్యక్తి యాజమాన్యాలకు వదలి ఇంధనం, శక్తి, రవాణా, సమాచార, రక్షణ పరిశ్రమలపై ప్రభుత్వరంగం కేంద్రీకరించాలని కోరుట, ప్రధమప్రణాళికలో ఇనుము, వుక్కు, భారీపరిశ్రమలను స్థాపించుటకు ప్రభుత్వం ప్రయత్నించగా, పశ్చిమదేశాలు ఆ పరిశ్రమలను ప్రవేటురంగంలో చేబట్టితేనే సహాయం చేస్తామనుట,చివరకు రష్యా సహాయంతో ఆ పరిశ్రమలస్థాపనయత్నాలక్రమాన్ని, అధికారి వివరించి, విజయవాడ తీర్మానం "సామ్రాజ్యవాదులు, దేశంలోని గుత్తపెట్టుబడిదారిశక్తులు కొన్ని ప్రభుత్వ రంగాభివృద్ధిని నిరోధించప్రయత్నించినప్పటికి ప్రభుత్వరంగాభివృద్ధి చెందిందని" పేర్కొన్నదని స్పష్టం చేసారు.

అంతేగాక మెజారిటి ముసాయిదా "ప్రభుత్వరంగం రెండు అంశాలను చూపెడుతుంది ప్రధమంగా భారతదేశంలో కాంగ్రెసు పాలనలో పెట్టుబడిదారి విధానము అభివృద్ధి చేయబడుతున్నదని కార్యక్రమంలో స్పష్టంగా చెప్పబడింది. ప్రభుత్వ పెట్టుబడి భారీపోత పరిశ్రమలు, యంత్ర నిర్మాణ పరిశ్రమలు, నూనె, బొగ్గు వగైరా పరిశ్రమలలో విస్తరించి యాజమాన్యం చేబట్టినప్పటికి, ప్రభుత్వరంగం కూడ ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాన్ని, ప్రభుత్వం జాతీయ బూర్జువావర్గపు పాలన యంత్రాంగం కాన పెంపొందిస్తుంది.

---

1. అధికారి, జి (1964) జాతిపునరుజ్జీవనానికి సోషలిజానికి భారతకమ్యూనిస్టుపార్టి పంథా (ఆంగ్లంలో) సి. పి. ఐ. పబ్లికేషను. పే. 164.

అది యిలా చెప్పుతుంది. "ఏమైనప్పటికి, ప్రభుత్వరంగంలో ఆర్థిక విధానాభి వృద్ధి కాన, భారతదేశపు స్వతంత్ర ఆర్థికాభివృద్ధిని సుగమం చేస్తుంది. సామ్రాజ్య వాద వలస వ్యతిరేక అంశంగా వుంది. ఒక భారతీయ లక్ష్యాన్ని పూర్తి చేస్తుంది, కాన అది అభ్యుదయకరమైనది.

ప్రభుత్వరంగం ఆ విధంగా అభివృద్ధి చెందుతూ వుంటే, భారీ, కీలక పరి శ్రమాభివృద్ధి స్వతంత్ర పెట్టుబడిదారి విధానాభివృద్ధిలో భాగంగా గుత్తపెట్టుబడి వర్గాలు బలపడుతవి. ఈ గుత్త వర్గాలు ప్రభుత్వ పబ్లిక్ రంగాన్ని దాడికి గురి చేస్తున్నవి. ఈ క్రమం ముసాయిదా కార్యక్రమం 32 వ పేరాలో వివరించబడింది. ప్రభుత్వరంగాన్ని, ప్రభుత్వ పెట్టుబడిదారి విధానంగా గుర్తించితే నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో నూతన ప్రపంచ పరిస్థితులలో ద్వందపాత్ర వహించి 1) ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పెంపొందించే అంశంగా, ఆ మేరకు సామ్రాజ్య వాద వలస వ్యతిరేక పాత్ర వహించగలిగి, జాతీయ ధ్యేయాన్ని పూర్తి చేసిన అభ్యు దయకరమైందిదే 2) పెట్టుబడిదారి సంబంధాలు పెంపొందించుట, ఫలితంగా గుత్త వర్గాల అభివృద్ధి, దారిద్ర్యం పెరుగుట వగైరాలలో వైరుధ్యం ఏమీలేదు. [1]

మెజారిటీ ముసాయిదా విశ్లేషణను మరికొంత పొడిగించి, అభివృద్ధి క్రమం, అభివృద్ధి నిరోధకశక్తులు తలెత్తుటకు దారితీసి, రాజకీయ పరిస్థితులను మరింత క్లిష్ట తరం చేస్తుందని స్పష్టం చేసింది.

"మన ఆర్థిక రంగంలో ప్రభుత్వరంగపు ద్వందవైఖరి శాస్త్రీయ అవగాహన సామాన్య ధ్యేయమయిన జాతి పునర్జీవనానికి గుత్త వర్గాల అభివృద్ధితో కలుగు ప్రమాద అవగాహన, ప్రభుత్వరంగంపై సరియైన కోర్కెలను మెజారిటి ముసాయి దాలో, దేశభక్త జాతీయ బూర్జువావర్గంతో సహా జాతీయ ప్రజాస్వామ్య సంఘటన ప్రాతిపదికగా కోర్కెలను రూపొందించునట్లు చేసింది. అన్ని విధాల మన జాతి ఆర్థిక జీవనంలో ప్రభుత్వ పారిశ్రామికరంగం ఆధిక్య రంగంగా, వేగంగా అభివృద్ధి చెందునట్లు బలపరచాలి. నేటి ప్రభుత్వరంగ పాలనాయంత్రాంగాన్ని సంస్కరించి, అభివృద్ధి చేసి, ప్రజాస్వామ్యయుతం చేయాలి. మొట్టమొదటి పారిశ్రామిక విధాన తీర్మానం ప్రకారం కీలక, భారీ పరిశ్రమలను ప్రభుత్వ రంగానికి ప్రత్యేకించి, ప్రభుత్వ పారిశ్రామిక రంగాన్ని, పరిధిని విస్తరించాలి. జాతీయకరణ పరిధిని బ్యాంకులకు, ఇన్సూరెన్సు, బొగ్గు, నూనె సంపదం, యితర గనులకు, ప్లాంటేషన్ తోటలకు విస్తరించాలి" అని అధికారి వివరించారు

ఇంకా "మెజారిటీ ముసాయిదాలోని ప్రభుత్వరంగ విశ్లేషణ, పాత్ర చివరి మాటగా మేము అనుకొనుట లేదు. అనుభవాల వెలుగులో దానిని అభివృద్ధి పరచి

---

1. అధికారి, జి. (1964) జాతి పునర్జీవనానికి, సోషలిజానికి కమ్యూనిస్టుపార్టీ పంథా (ఆంగ్లంలో) పే. 167 9.

నిర్దిష్టం చేయాలి. ప్రభుత్వరంగపు ద్వంద పాత్ర, ప్రమాదాంశాలను వాటి మౌలిక లక్షణాలను సరియైన శాస్త్రీయ విశ్లేషణ కావించబడి మెజారిటీ ముసాయిదాలో వున్నవి. అట్టిది మైనారిటి ముసాయిదాలో కానరాదు." [1]

ప్రభుత్వాధికారం బడా గుత్తపెట్టుబడిదారి వర్గాల చేతులలోనికి మాత్రమే వెళ్ళినచో ప్రభుత్వ పెట్టుబడిదారి విధానం, ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారి విధానంగా మారే ప్రమాదముందని మార్క్సిస్టు-లెనినిస్టు మూల సూత్రాలు చెప్పుతున్నవి. అధికారి మెజారిటీ ముసాయిదాలో యీ సూత్రీకరణ చేయునప్పటికి, గుత్త పెట్టుబడిదారుల గ్రూపుల ప్రమాదాన్ని గురించి, అవి ప్రభుత్వ యంత్రాంగంలో తమ "పట్టు"ను పెంపొందించుకొనుటకు చేయు ప్రయత్నాలపై సాగించవలసిన పోరాటాన్ని గట్టిగానే చెప్పింది. మైనారిటీ ముసాయిదాగాని, మరే యితర ముసాయిదాగాని యీ విషయమై యెట్టి ప్రస్తావన చేయలేదని అధికారి వివరించారు.

విజయవాడ పార్టీ కాంగ్రెసులో ఆమోదించబడిన రాజకీయ తీర్మానానికి ప్రాతిపదికయిన అజయ్‌ఘోష్ ఉపన్యాసంలో పై అంచనాలపై యీ క్రింది ప్రస్తావనలున్నవి.

"గుత్త పెట్టుబడిదారివర్గ అభివృద్ధి మన ప్రజలకు తీవ్రమయిన ప్రమాదకారి. గుత్తవర్గాల పెరుగుదల కొనసాగితే ప్రభుత్వంలో వారి ప్రతినిధులు, వారి మద్దతుదారులు కలసి, ప్రభుత్వ పారిశ్రామిక, ఆర్థిక రంగాలు మరింత యెక్కువగా వారి చేతులలో సాధనాలై, ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారివర్గ లక్షణాలను పొందుతుంది. ఆ విధమయిన ప్రమాదాన్ని త్రోసివేయ జాలము. కాన దానికి, దాని పెరుగుదలకు వ్యతిరేకంగా పోరాడవలసిన అవసరముందని" అజయ్ అన్నారు.

భారతదేశంలో మరే యితర నూతన స్వాతంత్ర్య దేశంలో కంటె యెక్కువగా పారిశ్రామిక, బ్యాంకింగు వ్యాపార కేంద్రీకరణ జరిగినా, ప్రభుత్వ పెట్టుబడిదారి విధానం, వెనుకబడిన మన దేశంలో అధ్యయనం చేయవలసి వుందని, అధికారి పావ్‌లోవ్ అధ్యయనంలోని ముఖ్యాంశాల కొన్నిటిని క్లుప్తంగా యీ క్రింది విధంగా పేర్కొన్నారు.

—స్వాతంత్ర్యానికి పూర్వమే భారత బూర్జువా వర్గాలు, గుత్తపెట్టుబడిదారి వర్గాలుగా అభివృద్ధి చెంది, రెండు పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆర్థికాధికారంలో విపరీతంగా పెరిగి, విదేశ గుత్తపెట్టుబడి వర్గాలతో పొత్తును ప్రమాదకరమయినంత వేగంగా విస్తరింప జేసుకొన్నవి. అయినా యీ పొత్తు కంప్రెడరీ స్వభావాన్ని కలిగిలేదు. స్థానిక వ్యాపార పెట్టుబడి, ఫ్యూడలు లేక వుజరప్పీ పెట్టుబడి పారిశ్రామిక, బ్యాంకింగు పెట్టుబడిగా అభివృద్ధి చెంది, అందులోని ముఖ్యవర్గాలు జాతీయోద్యమాన్ని స్వాతంత్ర్యానికి పూర్వం బలపరచారు.

---

1. అధికారి జి. ప్రకటన....అదే........పే. 169.

—భారత పారిశ్రామిక, బ్యాంకింగు, వ్యాపార బూర్జువా వర్గాల పరస్పర కలయికలతో ఉన్నత కేంద్రీకరణ జరిగి బడా గుత్తపెట్టుబడిదారి వర్గాలు ఏర్పడినవి. అయినా భారతీయ గుత్తపెట్టుబడిదారి వర్గాలు ద్రవ్యపెట్టుబడి వర్గంలో చేర్చబడ జాలవు.

—ప్రభుత్వరంగంలో పెట్టుబడి, ఉత్పత్తి కేంద్రీకరణాభివృద్ధి, ముఖ్యంగా భారీ పరిశ్రమలు ప్రభుత్వ రంగంలో విస్తార నిర్మాణంపై బడా గుత్తపెట్టుబడిదారి వర్గాలు ప్రభుత్వరంగంపై ఆధిపత్యం సంపాదించగలిగినా లేక తమకు అనుకూలంగా విచ్ఛిన్నం చేయగలిగినా, ద్రవ్యపెట్టుబడి విధానాభివృద్ధికి అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. ఇది ప్రభుత్వ గుత్తపెట్టుబడికి, అభివృద్ధి నిరోధక వర్గాల అధికారానికి దారితీస్తుంది.

—ఈ కారణంగానే కార్మికవర్గం, ప్రజాస్వామ్యశక్తులు, జాతీయ ప్రజా స్వామ్య విప్లవం వెనుకడుగు వేయకుండా, తాత్కాలికంగానయినా అట్టి పరిణామాన్ని అడ్డుకొని, నిరోధించి, సామ్రాజ్యవాదం, గుత్తపెట్టుబడి వర్గాలు బలపడ కుండా చేయాలి. అందువలనే భారతదేశంలో అభివృద్ధికరశక్తులు, సోషలిస్టు దేశాల లోని శక్తులు, అట్టి పరిణామాలను నిరోధించ వాంఛించుచున్నారు.

3. పెట్టుబడిదారి విధానాభివృద్ధి పరిణామాల గురించి కొంత తెలుసుకొనవలసి వుంది. వివిధ దృక్పధాల క్రమాభివృద్ధిని చూద్దాము.

భారతదేశంలో స్వాతంత్ర్యానంతర సామాజిక, ఆర్థిక, పెట్టుబడిదారీ, రాజకీయ నిర్ణయాత్మక పరిణామాలపై నంబూద్రిపాద్ అవగాహన యీ క్రింది విధంగా వుంది.

ఎ) అభివృద్ధి ప్రణాళికల సామాజిక ధ్యేయం ప్రజల జీవనాభివృద్ధి కాని వాస్తవంగా యిది జరుగలేదు. ఇదే అభిప్రాయం సామాన్య ప్రజలలో కూడా ప్రబలు తున్నది. పంచవర్ష ప్రణాళికలలో జాతీయోత్పత్తి పెరగలేదని దీనర్థంకాదు. ఆ ఫలితాలు సామాన్య ప్రజల వరకు క్రిందికి రాలేదు కొద్దిమంది ధనికులు ఆ ప్రయోజనాలనన్నిటిని పొంది, పెరిగారు. పేదలు మరింత పేదలయ్యారు. ఇది వాస్తవ పరిస్థితి ప్రభుత్వ గణాంకాలు యిదే వాస్తవాన్ని రుజువు చేస్తున్నాయి. ఈ పరిస్థితి యింత ఘోరంగ పశ్చిమ పెట్టుబడిదారి దేశాలలో కొంతవరకు, సోషలిస్టు దేశాలలో జరుగలేదు.

బి) ప్రజలలో సోషలిస్టు, పెట్టుబడిదారేతర సామాజికాభివృద్ధి అనే అభిప్రాయం ప్రబలుటను, బూర్జువావర్గం, సోషలిజాన్ని ఉత్పత్తి సాధనాలపై సమిష్టి యాజమాన్యం, పంపకం, ఉత్పత్తులుగా కాక, "మిక్సిడ్ ఎకనమీ" అనంతంగా అనే భాష్యం చెప్పి ప్రారంభించారు. ప్రభుత్వ పెట్టుబడిదారి మార్గంలో జరుగుతున్న పారిశ్రామికాభివృద్ధిని 'సోషలిజం'గా వ్యాఖ్యానించి ప్రజలలో భ్రమలు కల్పించుతున్నారు.

ఇది పాలకవర్గాల సమీకరణకు, బలంచెందుట కుపయోగపడలేదు. అందువలనే కాంగ్రెస్ రాజ్‌ను "లైసెన్స్, కోటా, కంట్రాక్టు" రాజ్యాంగా రాజాజీ వ్యాఖ్యానించి అదేనివాదాన్ని ఇచ్చారు. అసంతృప్తి కార్మిక,కర్షక, బడుగువర్గాలలోనేగాక, బూర్జువా వర్గంలోని కొన్ని వర్గాలలో కూడ వ్యాపించింది. ఈ వర్గాల ఆర్థిక కార్యక్రమాలు, వారికి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు, అధికార వర్గాలపై గల "పట్టు" ప్రభావాలతో జరుగటలేదు. అందుచేతనే వారి అసంతృప్తి.

సి) సంఘర్షణలు, వైరుధ్యాలు-పెట్టుబడిదారులు, పారిశ్రామికుల వ్యక్తుల మధ్యనే గాక గ్రూపుల మధ్య, వ్యాపారుల మధ్య ప్రారంభమయ్యాయి. ఇవి రాజకీయ నాయకుల మధ్యకు వ్యాపించాయి. పెద్ద ఉద్యోగుల మధ్య ఈ విధమయిన పోటీ వుంది.

ఇవి గ్రూపుల, ముఠాల రాజకీయ వివాదాలు, కుల, మత, ప్రాంతీయ తగాదాలుగ తమ తమ బలాన్ని పెంపొందించుకొనుటకు పైపరిపాలన యంత్రాంగంలో పాలకపార్టీలో వ్యాపించాయి.

డి) కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేసే ప్రణాళిక విధానాలే యీ గ్రూపు ముఠా, కుల, మత, ప్రాంతీయ స్పర్ధలను, సంఘర్షణలను, వైరుధ్యాలను మరింత ఎక్కువ చేశాయి. ఇవి ప్రజలలో జుగుప్సతను, నిరాశను, అసహ్యతను కలుగజేసాయి. ప్రజలలో నిస్సహాయత కూడ చోటు చేసుకొంది.

నంబూద్రిపాద్ యీ అవగాహనలపై అధికారి ద్విముఖ పరిణామాలను ఏకపార్శ్వంగానే చూసారని వ్యాఖ్యానించి, జాతి ప్రయోజనాల కొరకుగాను పెట్టుబడిదారి మార్గంకాక, పెట్టుబడిదారేతర మార్గంలో అభివృద్ధి కార్యక్రమాలను, ప్రణాళికలను చేపట్టాలనే నిర్ణయాలకు రచయిత వచ్చారని వ్యాఖ్యానించారు. దీనినే మరికొంత వివరించుతు "పెట్టుబడిదారి విధానాభివృద్ధి వలన జరిగిన ద్విముఖ పరిణామాల గురించి కాక, ఏకపక్షంగా సామాన్య ప్రజానీకంపై పడిన అధిక భారాన్ని గురించి, లంచగొండితనాన్ని గురించి, గ్రూపులు. ముఠా తగాదాల గురించి, రాజాజీ వ్యాఖ్యానించిన 'కాంగ్రెస్ రాజ్ అంటే లైసెన్స్ కోటా, కంట్రాక్టర్ల రాజ్' గానే చూసారని" [1] అధికారి వ్యాఖ్యానించారు. అంతేగాక యివన్నీ పెట్టుబడిదారి మార్గంలో సామాజికాభివృద్ధిని కావించుట వలన కలిగాయని రచయిత అభిప్రాయమన్నారు. దానినుండి పెట్టుబడిదారేతర మార్గంలో సామాజికాభివృద్ధిని సాగించితేనే జాతీయ ప్రయోజనం మొత్తంగా నెరవేరగలదనే నిర్ణయానికి వచ్చారని కూడ అన్నారు.

"రచయిత (నంబూద్రిపాద్) సంస్కరణవాదం, పిడివాదంపై సమాన పోరాటాన్ని జరపాలనే ఉత్సుకతతో, మెజారిటీ యొక్క సంస్కరణ వాదంపై ప్రత్యే

1. అధికారి, జి. (1964) జాతి పునర్జీవనానికి సోషలిజానికి కమ్యూనిస్టుపార్టీ పంథా (ఆంగ్లంలో) పే. 1.

కంగా పోరాడాలనే ఉత్సాహంతో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో భారతదేశంతో సహా, అభివృద్ధి చెందే పరిస్థితులలోని నూతనాంశాలను, మాస్కో ప్రకటనలోని 4 వ, ప్రకరణలోని నినాదాలు విశ్లేషణలో ప్రత్యేక నూతనాంశాలను రెప్పపాటు కాలంలో చూడజాలక పోయారని" [1] అధికారి వ్యాఖ్యానించారు.

పరిస్థితులలోని నూతనాంశాలను అధికారి వివరించారు. సంక్షిప్తంగా యీ క్రింది విధంగా చెప్పుకొనవచ్చును. [3] అంతేగాక యీ నూతనాంశాల ననుసరించే జనతా ప్రజాస్వామ్య నినాదాన్ని వదలి జాతీయ ప్రజాస్వామ్య నినాదం విజయవాడ కాంగ్రెసులో చేబట్టబడిందని పేర్కొన్నారు.

ఎ) నూతన యుగంగా, పెట్టుబడిదారి విధానంలో సామాన్య సంక్షోభంలో ఏర్పడిన నూతన దశవలన, నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలోని జాతీయ బూర్జువా ప్రభుత్వాలు మొత్తంమీద స్వతంత్ర ఆర్థిక విధానం, అలీన విదేశాంగ విధానాన్ని అనుసరించుతూ, పెట్టుబడిదారి మార్గంలో ఆర్థిక స్వాతంత్ర్యాన్ని బలోపేతం చేసుకొంటూ, ఒక విధమయిన ప్రజాస్వామ్యాన్ని కొనసాగిస్తున్నాయి సోషలిస్టు దేశాలు, కార్మికవర్గమూ, దేశాలలోని అభ్యుదయికరశక్తులు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో యీ నూతన పరిణామ అంశాన్ని పరిగణించవలసి వుంది.

బి) జాతీయ బూర్జువా ప్రభుత్వంలో ఆర్థికాభివృద్ధి జరిగిన కొలది, ఒకవైపు రాజకీయ స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యంవైపు పురోగమనం, మరోవైపు పెట్టుబడిదారి విధానంలో అభివృద్ధివలన వైరుధ్యాలు, గుత్తవర్గాల, గ్రూపులు పెరుగుట, ఆర్థికశక్తి వారి చేతులలో కేంద్రీకరణ, సామాన్య ప్రజానీకం మరింత దారిద్ర్యంలోనికి దిగజారిపోవుట అభివృద్ధి కుంటుపడుట, సంక్షోభంలో కూరుకొని పోవుటతో ద్వంద్వవైఖరి స్పష్టమగుట, పరిస్థితులలోని మరొక నూతనాంశము. ఫలితంగా సామ్రాజ్యవాదం దేశప్రజల మధ్య వైరుధ్యం తీవ్రమగుటతోపాటు, జాతీయ ప్రభుత్వము ప్రజాస్వామ్యశక్తుల మధ్య సంఘర్షణ తీవ్రమయింది.

సి) పరిస్థితులలోని నూతనాంశం రాజకీయ ఆర్థికాభివృద్ధి ప్రతిబింబము. గుత్త వర్గాల పునాదిగా, అభివృద్ధినిరోధక ప్యూడలు వర్గాల ఐక్యతతో శక్తివంతమైన, అభివృద్ధి నిరోధకమునా ఆవిర్భావం, తత్ఫలితంగా జరిగింది. కమ్యూనిస్టు వ్యతిరేకనినాదంలో జాతీయ విధానాలను, ప్రజాస్వామ్యాన్ని కూలద్రోయ ప్రయత్నిస్తున్నది, జాతీయ ప్రభుత్వంలోని మితవాదవర్గం, పాలక పార్టీ యీ వైఖరులను బలపరస్తున్నది. ఈ సంక్లిష్టపరిస్థితులలో పార్టీ, పోరాటం ఐక్యత విధానాన్ని రూపొందించుచున్నది, వున్నటువంటి స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యఅవకాశాలను పూర్తిగ వినియో

1. అధికారి జి. జాతి పునర్జీవనానికి కమ్యూనిస్టు పంథా .... పే. 173
3. ........అదే........పే. 173-6.

గించుచున్నది. వాస్తవానికి "పోరాటం-ఐక్యత' పంథా పాల్ఘాటునుండి అమృత్‌సర్, నేడు, రూపొందించ ప్రయత్నించుచున్నాము, అది విజయవాడ కాంగ్రెసులో అజయ్ ఘోష్ వుపన్యాసంలోనే సమగ్రస్వరూపం దాల్చింది.

డి) స్వాతంత్ర్యానికి పూర్వం వున్న జాతీయ సంఘటన, జాతీయ బూర్జువా వర్గం అధికారాన్ని చేబట్టుటతో విచ్ఛిన్నమైన దానివి, జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని సంపూర్తిచేయుటలో పాల్గొనే అన్నివర్గాల నూతన జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను నిర్మించే ప్రయత్నమే పరిస్థితులలోని నూతనాంశం. మాస్కో-ప్రకట 4వ,ప్రకరణములో యీవిషయంగాశాస్త్రీయ సూత్రీకరణను పరిగణలోనికి తీసుకొనుట జరిగింది. మితవాద అభివృద్ధి నిరోధకులకు ప్రభుత్వానికి వ్యతిరేకంగా, దాని విధానాలలో మార్పు తీసుకొని వచ్చుటకు, శక్తివంతమైన విస్తృత ప్రజాపోరాటాలను కొనసాగించేక్రమంలో జాతీయ ప్రజాస్వామ్యసంఘటన యేర్పడుతుందని విజయవాడ తీర్మానం స్పష్టం చేస్తున్నది. విజయవాడ కాంగ్రెసులో కార్యక్రమం చిత్తులో ఆమోదించక పోయినప్పటికి, జాతీయప్రజాస్వామ్యసంఘటన,జాతీయ ప్రజాస్వామ్యసంఘటనా ప్రభుత్వం సూచించుటలోపై సూత్రీకరణను పరిగణలోనికి తీసుకొనుటజరిగింది.

ప్రధాన భేదాభిప్రాయాలు :

విజయవాడ 6వ, పార్టీ కాంగ్రెసులో అజయ్ ఘోష్ మెజారిటి ముసాయిదాను, జాతీయ సమితిలోని 21 మంది మైనారిటి ముసాయిదాను, యీ రెండింటిని ఆమోదించజాలక నంబూద్రిపాద్ మూడోముసాయిదాను సమర్పించారు. ఈ విధంగా మూడు రాజకీయ తీర్మానాలు, కార్యక్రమాలు చర్చకువచ్చాయి. నంబూద్రిపాద్ ముసాయిదాను మరికొంతమంది బలపరచారు, అయినా తొందరగానే వుపసంహరించుకొన్నారు.

ఫిబ్రవరి 1961 జాతీయ సమితి సమావేశంలో మెజారిటి, మైనారిటి ముసాయిదాలు చర్చించబడి, అజయ్‌ఘోష్ ముసాయిదా పార్టీ కాంగ్రెసుతో ప్రతిపాదించుటకు ఆమోదించబడింది. మైనారిటి ముసాయిదాను జాతీయ సమితి తిరస్కరించినా, 21 మంది తిరిగి చర్చించి సవరించబడిన రూపంలో కాంగ్రెసులో ప్రతిపాదించారు. ఆ విధంగా రెండు ముసాయిదాలు, దీర్ఘకాల చర్చల తరువాత యిరువర్గాలు పరిపూర్ణత చేకూర్చిన దృక్పధాలు. జాతీయ సమితి 21 మంది ముసాయిదాకు చేర్చిన నోటు", జాతీయసమితి ముసాయిదా, 21 మంది ముసాయిదా పరిశీలించిన, రెండు ముసాయిదాలలోని సారూప్యతలు, భేదాభిప్రాయాలు స్పష్టమౌతవి. పైనరు భేదాభిప్రాయా

1. ఇంద్రదీప్ సిన్హా, తదితరులు (1983) సి పి. ఐ (యం) కొన్ని సిద్ధాంతం పైఖరులు. (ఆంగ్లంలో) సి. పి. ఐ పబ్లికేషన్ నం, 7, (1983) 396· పే 13-14.

లను వదలి వేసిన, ప్రధానభేదాభిప్రాయాలు యీక్రింది విధంగా చెప్పుకొనవచ్చును[1].

"1. మార్క్సిస్టు-లెనినిస్టు కార్మికవర్గ దృక్పథంలో దేశ ఆర్థిక, రాజకీయ పరిస్థితి అంచెనా.

2. మన పరిస్థితులలో, 81 కమ్యూనిస్టుపార్టీల ప్రకటన దృక్పదాన్ని అన్వయించి రాజకీయ తీర్మానాన్ని రూపొందిందుట.

3. భారత విదేశాంగ విధానం, ప్రపంచ సమస్యలలో ప్రభుత్వ బహుముఖ పాత్ర పరిశీలన

4. అమెరికా, పశ్చిమదేశాల సహాయమనబడే విదేశ పెట్టుబడి మన ఆర్థిక విధానంలో చొరబడి, యేర్పరచుకొన్న స్థానం మాస్కో ప్రకటన ఆలోచనా విధానంలో పరిశీలన.

5. కార్మిక వర్గపాత్ర, కార్మిక కర్షక ఐక్యత, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో, నిర్మాణంలో ఐక్యప్రజా పోరాటాల ప్రాధాన్యత.

6. అభివృద్ధి పంథా సమస్య, నేటి రాజకీయ విధాన, ఎత్తుగడలను వ్యూహ దృక్పథంలో రూపొందించుట, నూతన అవకాశాలలో యీ దృక్పధంతో పుధ్యమాలు రూపొందించి, నడుపుట.

ప్రధాన భేదాభిప్రాయాలను పై విధంగా పేర్కొని సిన్హా "అధికార ముసాయిదా (కేంద్రసమితి మెజారిటిది) తీర్మానం సంయుక్త (కొయలిషన్) ప్రభుత్వం-కాంగ్రెసుతో, కనీసం కాంగ్రెసులోని అభ్యుదయ కాముకులతో అను విషయాన్ని ప్రస్తావించిందా? లేదు. ఈ విషయం చిట్టచివరిగా పాల్ఘాటు కాంగ్రెసులోనే పరిష్కరించబడింది. ఆ విషయాన్ని తిరిగి ఎవ్వరూ తీసుకొని రాలేదు" అన్నారు.

పాల్ఘాట్ కాంగ్రెసు ఆమోదించిన రాజకీయ తీర్మానం, "భారత జాతీయ కాంగ్రెసు పాలకపార్టి, సామ్రాజ్యవాదం, ఫ్యూడలు శక్తులతో రాజీవ్యతిరేక, బిురాక్రసీ, పోలీసు వ్యతిరేక పోరాటంలో, ప్రజాస్వామ్య విస్తరణ పోరాటంలో ప్రజలు కాంగ్రెసు, ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడవలసి వుంది. అంచేత కాంగ్రెసుతో సామాన్య ఐక్యసంఘటన అనే సమస్యలేనేలేదు[1]" అని స్పష్టంచేసింది. అదే వైఖరి కొనసాగుతున్నది.

"కేంద్రరాజకీయ కర్తవ్య సమస్యపైగల భేదాభిప్రాయం ఎంత చిన్నదంటే, అధికార ముసాయిదా ప్రత్యామ్నాయ ముసాయిదా రెండూ దాదాపు వొకే కర్తవ్యాన్ని, యీ విషయంలో దాదాపు వొకే "వివాదాన్ని పేర్కొన్నవి" అని ఇంద్రదీప్ సిన్హా వ్యాఖ్యానించి, యింకా "రాజకీయ తీర్మాన ప్రధాన సమస్యపై ఆ విధమైన విస్తృత ఆమోదంతోను, ప్రత్యామ్నాయ తీర్మాన ప్రతిపాదితులు తమ వొంటెత్తు

---

1. భారత కమ్యూనిస్టుపార్టి చరిత్ర-అధికార పత్రాలు. వా VIII పే. 55-56.

పెడివాద సూత్రీకరణలకు, అనేక సమస్యలపై బలపరచే వారిని సమీకరించుకొనుట కష్టమైంది" అని వివరించారు.

"విజయవాడలో జరిగిన పార్టి ఆరవ మహాసభలో రెండు ప్రత్యామ్నాయ ముసాయిదా తీర్మానాలు (రాజకీయ), రెండు ప్రత్యామ్నాయ కార్యక్రమాలు ప్రతిపాదించబడినాయి. పార్టి రెండుగా చీలిపోయే పరిస్థితి యేర్పడింది .. ఇంద్రదీప్‌సిన్హా విభేధాలకు అంత ప్రాధాన్యత లేనట్లు ప్రజలను నమ్మమంటారు" అని హరికిషన్ సింగ్ సూర్జిత్ ప్రస్తావించుతూ "భేదం లేనపుడు రాజకీయ నివేదికను ప్రాతిపదికగా చేసుకొని చేయబడిన మా ప్రతిపాదనను వీరు ఎందుకు వ్యతిరేకంగా వోటుచేసినట్లు[1]" అని ప్రశ్నించారు.

విజయవాడలో జరిగిన 6వ, పార్టీ కాంగ్రెసు వరకు "పార్టీలో పైకి కనిపించిన ఐక్యత చాల దుర్బలమైనది. అందువలన 6వ, మహాసభలో భీషణమైన అంతర్గత పోరాటం మరొకసారి జరిగింది. ఆరవ మహాసభ ప్రతినిధులలో పూర్తిగా కొత్త రాజకీయ కలయికలు యేర్పడ్డాయి. మహాసభ ప్రతినిధులు దాదాపు సగం చీలిపోయారు. చాలా మంది కామ్రేడ్స్ గతంలో అధికార పంథాను సమర్థించినవారు వ్యతిరేక పక్షంలో చేరారు. ఏప్రిల్ 1961లో జరిగిన 6వ, మహాసభ రాజీతో నిర్మాణ పరమైన సర్దుబాట్లతో ముగిసింది. కాని చీలికలకు దారితీసిన తీవ్రమైన రాజకీయ విభేదాలు కొనసాగాయి[2]" అని బసవపున్నయ్య పార్టీ అంతర్గత పోరాట తీవ్రతపై వ్యాఖ్యానించారు.

పార్టి చీలిపోయే తీవ్రపరిస్థితులు యేర్పడుటతో యిరువరాలు అజయ్‌ఘోష్ పార్టీ నివేదిక వుపన్యాసాన్ని ఆధారం చేసుకొని, తీర్మానాన్ని రూపొందించే ప్రతిపాదనను ఆమోదించారు. సంఘర్షించిన రెండు వైఖరులను అజయ్‌ఘోష్ సమన్వయం చేసి, రాజకీయ తీర్మానాన్ని రూపొందించగా, సవరించబడిన రూపంలో పార్టీ కాంగ్రెసు ఆమోదం పొందింది. అయినా ఎన్నికల సమస్యపై నూతనకేంద్రసమితి చీలిక వరకు వచ్చింది. ప్రత్యామ్నాయ రాజకీయతీర్మానాన్ని బలపరచిన 38 మంది కేంద్రసమితి సభ్యులు తమపేర్లను నామినేషన్ జాబితానుండి వుపసంహరించుకొని తమకు మరికొన్ని అదనపుస్థానాలు యివ్వనిచో పార్టీ చీలగలదని హెచ్చరించారు. పార్టి కాంగ్రెసు ప్రత్యేక అర్ధరాత్రి సమావేశమై, పార్టి నిర్మాణ సూత్రాలకు సవరణలు ఆమోదించబడి, నిరసన వాదులతో కలసి 110మంది గల కేంద్ర సమితి యేర్పడింది. ఆచరణలో సిద్ధాంత పోరాటాన్ని, నిర్మాణంలో స్థానాల పోరాటంగా, వర్గపోరాటం పరిణామమొందింది. విదేశ సౌహార్ధ ప్రతినిధులతో ముఖ్యుల సలహాలు కూడ కమ్యూనిస్టుపార్టీ చీలి పోకుండా, వొక రాజీ అవగాహనకు వచ్చి, రాబోయే ఎన్నికల పోరాటంలో పాల్గొనుటకు తోడ్పడింది.

1. హరికిషన్‌సింగ్ సూర్జిత్, బసవపున్నయ్య మాకినేని (1983) భారత కమ్యూనిస్టు వుద్యమంలో చీలిక ఎందుకు వచ్చింది? ప్రజాశక్తి. పే. 21.

## రాజకీయ తీర్మానం

కమ్యూనిస్టుపార్టీ విజయవాడ 6వ, కాంగ్రెసులో "జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాలకై జాతీయ ప్రజాస్వామ్య సంఘటన" అనే తీర్మానంయేకగ్రీవంగా ఆమోదించబడింది. తీర్మానంలోని ప్రధానాంశాలు యీ క్రింది విధంగా వున్నవి[1].

ప్రపంచ యుద్ధానంతరం అంతర్జాతీయంగా విస్తృత మార్పులు వచ్చాయి. మూడవవంతు ప్రపంచంలో సోషలిజం విజయం పొందింది. వలస వ్యతిరేక విప్లవం మహోదృతంగాసాగి 40 దేశాలు నూతనంగా స్వాతంత్ర్యం పొందాయి. వలసవిధాన పునాదులుకదలిపోయాయి. మారిన నాటి ప్రపంచ పరిస్థితిని 1960 మాస్కో ప్రకటన వివరించింది. ఈ విషయం యింతకు ముందు ప్రస్తావించాము.

ఈ యుగం సామ్రాజ్యవాద సంక్షోభం, వలసల విముక్తి, సోషలిజం నిర్ణయాత్మకపాత్ర, పెట్టుబడిదారి సమాజం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన, సమాజం మొత్తంగా సోషలిస్టు పరిణామంగా నిర్వచించబడింది. సోషలిస్టుశక్తులు, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటశక్తులు ప్రపంచ చారిత్రిక పరిణామాలను, దృక్పథాలను, వైఖరులను, విశ్వాసాలను, లక్షణాలను, నిర్ణయించుచున్నవి. సామ్రాజ్యవాదం యెట్టి ప్రయత్నం చేసినా చరిత్ర పురోగమనాన్ని ఆపలేదు. సోషలిజం మరెన్నో విజయాలు సాధించుటకు, నమ్మకమైన పునాదులు యేర్పడినవి. సోషలిస్టు సంపూర్తి విజయం అనివార్యం. ఇది మాస్కో 1960 ప్రకటన సంక్షిప్త అంతర్జాతీయ అవగాహన.

### సోషలిస్టు సహాయం పారిశ్రామికాభివృద్ధి :

భారత ఆర్థిక, పారిశ్రామిక పునాది ప్రథమ,ద్వితీయ పంచవర్ష ప్రణాళికలలో విస్తృతం, బలమైనది అయింది. గతంలో దిగుమతి చేసుకొనే అనేక వస్తువులు నేడు మనదేశంలో తయారగుతున్నవి. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు అధికమైనది. అనేక భారి, కీలకపరిశ్రమలు స్థాపనతో మన ఆర్థికాభివృద్ధికి తోడ్పడినవి. సామ్రాజ్యవాద, దేశీయగుత్త పెట్టుబడిశక్తుల వ్యతిరేకతను ఎదుర్కొంటూనే పబ్లిక్, ప్రభుత్వరంగాలలో పారిశ్రామికాభివృద్ధి,ఆశక్తులపై ఆధారపడుటను యెంతో తగ్గించి మనస్వాతంత్ర్యపారిశ్రామికాభివృద్ధికి తోడ్పడింది. నూనె పరిశోధన, పారిశ్రామికాభివృద్ధిలో సాధించిన ఘనవిజయాలతో మన స్వతంత్ర ఆర్థిక ప్రతిపత్తితో అంతర్జాతీయంగా మన బేరమాడేశక్తి పెరిగింది. తృతీయ పంచవర్ష ప్రణాళికలో మౌలిక, భారీ పరిశ్రమలకేటాయింపులపై సామ్రాజ్యవాద, దేశీయ శక్తులవొత్తిడిని తట్టుకొనుటకు, గతశతాబ్దికాలంగా లభించిన సోవియట్, యితర సోషలిస్టు దేశాల సాంకేతిక, యితర సహాయం భారతదేశానికి యీశక్తి సమకూరుటకు తోడ్పడింది.

భారతదేశం సోషలిస్టుదేశాలు ముఖ్యంగా సోవియట్ యూనియన్‌ల మధ్య సహకార, శాంతి సహజీవన సంబంధాలు ప్రపంచ ఖ్యాతి వహించుటయే గాక, దేశ పారిశ్రామికీకరణకు అత్యంత దోహదకారి అయ్యాయి. పంచవర్షప్రణాళికలలో ప్రభుత్వ, పబ్లిక్‌రంగాలలో భారీ, కీలక పరిశ్రమలు దేశ పారిశ్రామికీకరణకు, దేశ వెనుకబాటుతనాన్ని తగ్గించుటలో శ్లాఘనీయపాత్ర వహించాయి. సోషలిస్టు ప్రపంచం ముఖ్యంగా సోవియట్ యూనియన్ మనదేశపారిశ్రామికీకరణలో నిర్ణయాత్మకపాత్ర వహించాయి. ఈ సంబంధాలు భారీయంత్ర సామాగ్రి, సాంకేతిక పరిజ్ఞానాన్ని, తక్కువ వడ్డీరేటుతో అప్పులు, తేలికవ్యాపార షరతులు, చెల్లింపులకు విదేశమారక ద్రవ్య సహాయాలతో గుణాత్మకసహాయ మిచ్చి మన ఆర్థిక స్వాతంత్రాన్ని, ప్రభుత్వ పబ్లిక్‌రంగ పారిశ్రామికాభివృద్ధి, బలపరచాయి పరోక్షంగా పశ్చిమదేశాలు దిగివచ్చి ఉక్కు, యంత్ర భారీపరిశ్రమల కొన్నింటికి సహాయాన్నిచ్చుటకు తోడ్పడినవి. పాలకవర్గాలలోని అభ్యుదయ, దేశభక్తివర్గాలు బలపడుటకు పరోక్షంగా సహాయపడింది. సామ్రాజ్యవాదశక్తుల అధీనంలోని ప్రపంచబ్యాంక్, అంతర్జాతీయ ద్రవ్యనిధి వగైరా సంస్థల వొత్తిడికి తట్టుకొని ప్రభుత్వ. పబ్లిక్‌రంగాల విస్తరణ కార్యక్రమాలకు బలాన్ని చేకూర్చింది. తృతీయ పంచవర్షప్రణాళిక 240 కోట్ల భారీ ఇంజనీరింగు పారిశ్రామికాభివృద్ధికి సోవియట్ వాగ్దానం చేయుట హర్షించదగినది. ప్రభుత్వం ప్రణాళికా వనరులకు ధనికుల ముట్టకుండుట, కీలక విదేశీ పరిశ్రమలను జాతీయం చేయక, విదేశీకంపెనీలను, బ్యాంకులను దేశీయం చేయక వ్యవసాయ సంస్కరణలను రైతుల ప్రయోజనాల దృష్టిలో చేబట్టక పోవుటతో ఆర్థికాభివృద్ధి తగినంతగా పెరుగకపోవుట అందరకు తెలసిన విషయం

భారత పారిశ్రామికాభివృద్ధికి పునాదులైన మౌలిక సమస్యలను పరిష్కరించుటలో విఫలమైనప్పటికి, పారిశ్రామికరంగంలో గణనీయమైన అభివృద్ధి జరిగింది. అవసరాలకు, అవకాశాలకు తగినంత జరుగలేదనుట స్పష్టం. అనేక ముఖ్యరంగాలలో బొగ్గు, వ్యవసాయ సంస్కరణలులలో ప్రణాళికా లక్ష్యాలు సాధించలేదు. పారిశ్రామికాభివృద్ధి మొత్తం మీద నత్తనడకలో అలసి, ఆగిపోయి, సాగిపోవు పద్ధతులలో సాగింది పుంజుకొనవలసిన వేగాన్ని యెప్పుడూ చేరలేదు.

## విదేశీ పెట్టుబడి ప్రమాదం

భారత ప్రభుత్వం భారీ పరిశ్రమల నిర్మాణం, ప్రభుత్వ పబ్లిక్ రంగంలో పారిశ్రామికాభివృద్ధిని విడనాడాలనే విదేశీయ, దేశీయ వొత్తిడులను విజయవంతంగా త్రోసి బుచ్చింది. మూడవ ప్రణాళికలోని పెట్టుబడి రు. 10,200 కోట్లలలో రు. 3475 కోట్లు లోహాల విద్యుచ్ఛక్తి, యితర భారీ పరిశ్రమలను ప్రభుత్వ, పబ్లిక్ రంగాలలో నిర్మాణానికై రు. 2425 కోట్లు కేటాయించబడినాయి.

అయినా రెండు ముఖ్యాంశాలు గుర్తుపెట్టుకొనాలి. ద్వితీయ ప్రణాళికాకాలం ద్రవ్యోల్బణం 2.5 శాతం పెరిగినందున, రు 10,200 కోట్ల పెట్టుబడి కనుపించినంత యెక్కువేమీ కాదు. అంతేగాక, ద్వితీయ ప్రణాళికాకాలంలో వ్యక్తి యాజమాన్యంలో కేటాయించిన పెట్టుబడులను మించి వినియోగించుట జరిగింది. అదే తృతీయ ప్రణాళికా కాలంలో ప్రభుత్వం గట్టిచర్యలు తీసుకొనజాలకపోతే జరగవచ్చు.

ఈ కాలంలో రెండు ముఖ్య పరిణామాలు స్పష్టం. భారతదేశం సోషలిస్టు ప్రపంచంలో అభివృద్ధికర విదేశాంగ విధానం ఫలితంగా, సోవియట్ యూనియన్ తదితర సోషలిస్టు దేశాలనుండి లభించిన సహాయంతో పారిశ్రామిక విస్తృతి, జరిగి స్వాతంత్ర్యం బలపడింది. అదే కాలంలో పశ్చిమ దేశాలనుండి పెట్టుబడి, 1955లో 200 కోట్లుగా వున్నది 1959లో 900 కోట్లుఅయింది, అందులో 600 కోట్లు అమెరికా నుండి దిగుమతి అయింది. వీటిపై వడ్డీలు యిప్పటికే సగటున సంవత్సరానికి 100 కోట్లు కట్టవలసి వుంది. ఇవిగాక పి.యల్ 480 పద్దుకో తృతీయ ప్రణాళికాకాలంలో పవిక్రర్గాని అమెరికా గోధుమల దిగుమతికిగాను 600 కోట్లు అమెరికా అప్పు. ఈ మన బలహీనతను వుపయోగించి, ప్రపంచ బ్యాంకి అంతర్జాతీయ ద్రవ్యనిధి తదితర సంస్థలు ప్రభుత్వ, పబ్లిక్ పారిశ్రామికరంగాన్ని కుదించమని, విదేశ పెట్టుబడికి మరిన్ని రాయితీలను యివ్వమని వొత్తిడిచేస్తూ, ఇండో-అమెరికన్ జాయింటు కంపెనీలలో యాజమాన్యం భారతీయులక్రింద వుండాలనే షరతుల తీసివేయమని వొత్తిడి చేయసాగాయి. సామ్రాజ్యవాదుల వొత్తిడులను కొన్నిటిని నిరోధించగలుగుతున్నా, చాలా రాయితీలను యిస్తూనే వుంది. భారత విదేశ గుత్తపెట్టుబడిదారుల మధ్య 22 కొత్త ప్రాజెక్టులు ఆమోదించబడ్డాయని, 1960 మొదటి తొమ్మిది మాసాలలోనే అనేక పత్రికలు తెలుపుతున్నవి.

భారతదేశం తక్కువ ధరలకు రష్యానుండి దిగుమతి చేసుకున్న క్రూడు ఆయిల్‌ను ఇండియాలోని అమెరికన్, బ్రిటిష్ కంపెనీలు శుద్ధిచేయ నిరాకరించ గలిగిన ధైర్యాన్ని కలిగి వుండుట, మనదేశంలో వాటికిగల బలాన్ని తెలియజేస్తుంది. క్యూబావలె ధైర్యంగా మనదేశం గట్టి చర్యలను గైకొనలేకపోయింది.

భారతదేశంలో తనస్థానాన్ని, బలాన్ని ఎరిగిన అమెరికన్ సామ్రాజ్యవాదం, దాని బలాన్ని విస్తృత పరచుకొనుటకు వ్యూహలు, గుత్తపెట్టుబడిదారి వర్గాలతో ప్రపంచవ్యూహం అనుబంధంగా అనేక కొత్త సంబంధాలను యేర్పరచుకొంటున్నది. ఆ వర్గాలకు సామాజిక పునాదిలేదని, జాతీయ బూర్జువా వర్గాలలోని మితవాద, అభివృద్ధి నిరోధక వర్గాలతో సన్నిహిత సంబంధాలను పెంపొందించుకొంటూ పాతన మిత్రులవలె ప్రయత్నిస్తున్నది. వేగంగా అభివృద్ధి చెందుతున్న యీ అంశాన్ని మరచినా, పరిగణలోనికి తీసుకొనకపోయినా పార్టీ అత్యంత విషమ పరిస్థితులలో పడిపోగలదు.

## ప్రభుత్వరంగం

ప్రభుత్వరంగంలో వ్యూహాత్మక పరిశ్రమలైన ఇనుము, ఉక్కు. యంత్ర నిర్మాణ పరిశ్రమలు, బొగ్గు, ఆయిలు పరిశ్రమలు అభివృద్ధికి స్వాగతం చెప్పాలి. ప్రభుత్వరంగానికి కేటాయించబడిన అల్యూమినియం, ఎరువుల పరిశ్రమలను ఆనేక రాయితీలనిచ్చి గుత్తపెట్టుబడిదారుల హస్తగతం చేయబడ్డాయి. ప్రభుత్వ, పబ్లిక్ రంగ పరిశ్రమల ఆధిక్యత నిర్ణయాత్మకపాత్ర యేర్పడలేదు. గతంలో గుత్తవర్గాల వొత్తిడితో ప్రభుత్వ, పబ్లిక్ రంగాలలోని పరిశ్రమల షేర్లను ప్రవేటు వ్యక్తులకు అమ్మే ప్రతిపాదనలొచ్చాయి. అంత్యే జాతీయం చేసిన వాటిని రద్దు చేయుట. ప్రజలు జాగృతితో నిరోధించి, జాతి ప్రయోజనాలు కాపాడాలి.

ప్రభుత్వ, పబ్లిక్ రంగాన్ని అప్రదిష్టపాలుచేసే అసమర్థత, యాజమాన్యం విఫలత, లంచగొండితనం, రూపుమాపి, కార్మికుల సహకారాన్ని పొందే, ప్రజా స్వామ్య పద్ధతులను ప్రవేశపెట్టాలి.

## నిరుద్యోగం

రెండవ ప్రణాళిక ప్రారంభం నాటికంటె ముగింపునాటికి నిరుద్యోగం పెరిగి పోయింది. ప్రణాళికాంతానికి వ్యవసాయేతర రంగంలో 8 మిలియనుల అదనపు వుద్యోగాలను కలుగజేయుట లక్ష్యం. వాస్తవంగా 6.5 మిలియనులుకు మాత్రమే కలుగజేసినందున, మూడవ ప్రణాళిక ప్రారంభానికి 7 మిలియనుల పూర్వపు నిరుద్యోగులతో అభివృద్ధి పనులు సాగించారు. మూడవ ప్రణాళికాంతానికి 14 మిలియనులు వుద్యోగాలు లక్ష్యంగా వుండగా, నూతనంగా 15 మిలియనులు నిరుద్యోగులు సమాజంలో చేరతారని అంచెనా వేయబడింది. ఇప్పటికే నమూనా సర్వేలో గ్రామీణ నగర నిరుద్యోగులు 15 మిలియనులకు చేరినట్లు తెలిసింది.

కోట్లకొలది శ్రామికులను దుర్భర పరిస్థితులలో ముంచుటయేగాక, జాతి పునర్నిర్మాణానికి ప్రధాన వైపుణ్య శ్రామిక శక్తిని వినియోగించకపోవుట నేరము.

## వ్యవసాయంలో స్తబ్దత

వ్యవసాయరంగం నుండి జాతీయ అదాయంలో సగం లభించుతున్నా, అత్యధిక ప్రజాసామాన్యం వ్యవసాయ వుత్పత్తిలోనే వున్నా వ్యవసాయ ఆర్థికస్థితి అర్ధ విస్తబ్ధతలో వుంది. భారత అభివృద్ధి అవసరాలకు వ్యవసాయాభివృద్ధి చాల వెనుకబడి వుంది. ద్వితీయ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో వ్యవసాయోత్పత్తి సంవత్సరానికి 4 శాతపు అభివృద్ధిని సూచించింది. ఆహారోత్పత్తి 1955-56లో 65.7మిలియనుల టన్నులనుండి 1960-61కు పెరుగుదల 75 మిలియను టన్నులుగా

అంచెనా వేయబడింది. ఈ స్వల్ప పెరుగుదల కారణంగా 3 మిలియను టన్నుల పి.యల్ 480 ఆహారపదార్థాల దిగుమతి నిర్ణయించబడింది.

రెండు ప్రణాళికలలో 1000కోట్లు నీటిపారుదలకు ఖర్చు పెట్టినా, వ్యవసాయ వుత్పత్తులలోని లోటు, రైతులు వాతావరణంపై ఎంతగా ఆధారపడి వున్నారో తెలియజేస్తుంది. రెండవ ప్రణాళిక లక్ష్యంలో 50 శాతపు విస్తీర్ణానికి మాత్రమే నీరు, 25 శాతంకు, ఎరువులు మాత్రమే అందిచ్చుట అంచెనా (1961కి) వేయబడింది.

వ్యవసాయ వుత్పత్తి పెరుగపోవుటకు ముఖ్యకారణం ప్రభుత్వంభూస్వాములు పూ్యడలు వర్గాలతో రాజీపడిన కారణంగా రద్దుచేయకపోవుట. కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల కమిటి, ప్రణాళికా సంఘపు భూముల కమిటీల సిఫార్సులనుకూడ, గరిష్ఠ పరిమితి నిర్ణయాన్ని అమలుచేయకపోవుటతోపాటు, అర్ధపూ్యడలు భూస్వామ్య విధానాన్ని రద్దు చేయకుండా, పెట్టుబడిదారి భూస్వాములగ మార్చే ప్రయత్నంలో, కొద్దిమంది ధనిక రైతుల ప్రయోజనాలు కాపాడబడుటతో అత్యధిక బీదరైతాంగం దుర్భర పరిస్థితులకు లోనయ్యారు. దీనికితోడు వ్యవసాయ ధరల స్థిరీకరణ పరిస్థితిని మరింత అధ్వాన్నంచేసింది. అంచేతనే ప్రణాళికలను వ్యవసాయ సంక్షోభంలోనికి నెట్టుతున్నది. "దున్నేవానికే భూమి" అన్నవినాదాన్ని కాంగ్రెసు మరచిపోయింది.

భారత ఆర్థికాభివృద్ధికి ప్రజాస్వామ్యానికి భూస్వామ్య విధానాన్ని రద్దు చేయు రైతుల ప్రయోజనాలకై సంస్కరణలు అమలు చేయనిదే, దేశంలోని వనరుల అభి వృద్ధి, ప్రజల కొనుగోలు శక్తి పెరగనిదే, జీవన ప్రమాణాలు మెరుగకావు. ధనికులకు, పేదలకు మధ్యగల అంతరం అంతంకాదు. కార్మికుల, రైతుల యితర ప్రజానీకపు పోరాటాలు అభివృద్ధి చెందుతుంటవి.

## ప్రజాస్వామ్య వైఖరులు:

ప్రజలలోనేగాక, కాంగ్రెసువాదులలోను ప్రభుత్వ విధానాల యెడల అసం తృప్తి పెరిగింది. కాంగ్రెసు బయట, లోన అభివృద్ధి విరోధకులు చేయు వొత్తిడుల వలన అనేక సమస్యలపై కాంగ్రెసు విధానాలు మితవాదంవైపు మళ్ళాయి. ప్రణాళికా సంఘం సంక్షోభంలో పడినపుడు బడా బూర్జువాలకు, భూస్వాములకు రాయితీలనిచ్చి పరిష్కరించ ప్రయత్నిస్తున్నది. నాగపూరు తీర్మానాన్ని కాంగ్రెసు గాలికి వదలివేసి, మితవాదులను సంతృప్తిపరస్తున్నది. ఒరిస్సా కాంగ్రెసు పూ్యడలు గణతంత్ర పరిషత్‌తో కలసి సంయుక్త మంత్రివర్గాన్ని యేర్పాటు జేసింది. కలకత్తా ఆహార ఆందోళనపై దౌర్జన్యహింసాకాండ, ప్రభుత్వోద్యోగుల సమ్మెను 21 వేలమందిని జైళ్ళలో నిర్బంధించి, హింసాచర్యలతో అణచివేసింది. చైనా భారత సరిహద్దు వివాదాన్ని కమ్యూనిస్టు వ్యతిరేకతను రెచ్చగొట్టుటకు, జీవిత సమస్యల నుండి ప్రజలను తప్పుదారి పట్టించుటకు వినియోగించింది.

కాంగ్రెసు, ప్రభుత్వ ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలు కేరళలో కమ్యూనిస్టు రాష్ట్రప్రభుత్వంపై వహించిన వైఖరుల మరింత స్పష్టం చేసాయి. కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం, ఇంటా, బయటా ప్రజామన్నన పొందుట, కాంగ్రెసు ప్రభుత్వాలను పోల్చి చూచుకొనునట్లు చేయుట, నెహ్రూకి, కాంగ్రెసుకు అద్దం పట్టినట్లు అయింది. నాయర్ సొసైటి, కాథలిక్ చర్చి, కుల, మతతత్వ వాదులతో, ప్రజాసోషలిస్టుతో లకలసి దౌర్జన్య ప్రచారంతో కల్లోలాన్ని, అల్లర్లను రెచ్చగొట్టి అసాకుతో చట్టబద్ధ పాలనచేస్తున్న కమ్యూనిస్టు రాష్ట్రప్రభుత్వాన్ని, చట్టవ్యతిరేకంగా కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వం రద్దు చేసింది. పాలకవర్గం గుత్తపాలనాధికారాన్ని పునరుద్ధరించుకొనుటకు ఎంత దూరం వెళ్ళగలదో తెలియజేసింది.

కమ్యూనిస్టు రాష్ట్రమంత్రివర్గాన్ని బర్తరఫ్ చేయుటకు వ్యతిరేకంగా వివిధ రాష్ట్రాలలో ప్రజానిరసనోద్యమాలు, తదనంతర ఎన్నికలలో కమ్యూనిస్టులు మిత్రులను కలిసి గతంలో కంటె అధికంగా వోట్లు లభించుట కమ్యూనిస్టుల రాష్ట్రమంత్రివర్గ బర్తరఫ్ కారణాలు ఎంత అర్ధరహితమో తెలియజేసాయి. కాంగ్రెసు అవకాశవాదంతో ముస్లింలీగుతో మైత్రి నెరపి కమ్యూనిస్టు మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేయుట, యితర రాష్ట్రాలలో మతతత్వవాదులకు బలాన్ని చేకూర్చింది.

కేరళ రాష్ట్ర కమ్యూనిస్టు మంత్రి వర్గాన్ని చట్ట వ్యతిరేకంగా బర్తరఫ్ చేయుట పార్టికి దెబ్బ మాత్రమేగాక, దేశంలో ప్రజాస్వామ్యానికే దెబ్బ అనుటలో సందేహం లేదు. ప్రజాస్వామ్యానికి, ఆచరణకు వ్యతిరేకంగా దేశంలో ప్రజాస్వామ్యం పనికిరాదనే ప్రచారం తీవ్రమైంది. ప్రజాసోషలిస్టులు, స్వతంత్రపార్టీ, కాంగ్రెసు మితవాదులు సైన్యాధిపతి తిమ్మయ్యను బలపరచుట, నెహ్రూ రక్షణ మంత్రిని తొలగించుటతో సైన్యం రాజకీయ సమస్యలలో కలుగజేసుకొనే వారి ప్రయత్నాలు వమ్ము చేయబడి, ఆ దురదృష్టం నివారించబడింది. అధ్యక్షుడు రాజ్యాంగ నేతగా మాత్రమేగాక, వాస్తవాధికారాలను కలిగి వుండాలని రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ పేర్కొనుట, భావనగర్ కాంగ్రెసు అధ్యక్షుడుగా సంజీవరెడ్డి అధ్యక్షోపన్యాసంలో రాష్ట్ర అసెంబ్లీలకు, పార్లమెంటుకు ప్రత్యక్ష ఎన్నికలుండ రాదనుట తీవ్ర అసమ్మతిని కలుగజేస్తుంది. వీటిని ప్రమాదకర వైఖరులకు హెచ్చరికలుగా నెంచాలి.

భారతదేశంలో అట్టి పరిస్థితి యేర్పడదని వుపేక్షాభావం వహించి వుండుట ప్రమాదకరము.

### మితవాద అభివృద్ధి నిరోధకత్వం తలెత్తుట :

కాంగ్రెసులోని మితవాదులు బలపడుటయేగాక, తీవ్రమితవాదులు అభివృద్ధి నిరోధకులు బహిరంగ స్వంతరాజకీయ "స్వతంత్రపార్టీని" స్థాపించారు. బడా

భూస్వాములు గుత్తపెట్టుబడిదారులు, మాజీ సైనికాధికారులు, రాజులు; అసంతృప్తి చెందిన రాజకీయనాయకులు, అమెరికా ప్రైరవీకారులు కలపి స్వతంత్రపార్టీని యేర్పరచారు. సి. రాజగోపాలాచారి నాయకత్వం కొంత గౌరవప్రదమైనది.

స్వతంత్రపార్టీ యేర్పడుటతో కాంగ్రెసులోని మితవాదులకు మరింతధైర్యమొచ్చింది. స్వతంత్ర పార్టీకి కాంగ్రెసులోని మితవాదులు అత్యంత బలమైన మిత్రులు. వారి తక్షణ లక్ష్యం కాంగ్రెసును మరింత మితవాదంవైపు నెట్టుట. ప్రభుత్వంపై గల అసంతృప్తిని వినియోగించుకొని ప్రధాన ప్రతిపక్షంగా అభివృద్ధి చెందుట వారి ఆశయం. ఆహారధాన్యాలకొరత, వ్యవసాయ పంటలధరలకు ప్రోత్సాహం లేకపోవుట, పన్నులు అదికమగుటతో పారిశ్రామిక వస్తువుల ధరలు పెరిగిపోవుట, లంచగొండితనం, అసమర్థత, దుబారాలపై దాడితో ప్రజలను ఆకట్టుకొంటున్నది.

సామ్రాజ్యవాద, భూస్వాములు, అభివృద్ధి నిరోధక బడా బూర్జువా, వ్యాపారుల మద్దతుతో, మతపార్టీల, కాంగ్రెసులోని "ముసుగు స్వతంత్రుల" అభివృద్ధి నిరోధకులతో కలపి కదంత్రొక్కుతున్నది. స్వతంత్రపార్టీ. సోషలిస్టు కమ్యూనిస్టుభావాల వ్యాప్తిని అరికట్ట ప్రయత్నిస్తున్నది స్వాతంత్ర్యానంతర అభివృద్ధినంతా తెగనాడుతూ, స్వతంత్ర విదేశాంగ విధానాన్ని, ప్రభుత్వరంగంలో పారిశ్రామిక విస్తరణను, భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణాన్ని వ్యతిరేకించుతు కాంగ్రెసును తెగనాడుతున్నది.

హిందూ మతశక్తుల అగ్రగామిదళమైన రాష్ట్రీయ స్వయం సేవకసంఘం దాని రాజకీయపార్టి జనసంఘం అభివృద్ధి నిరోధకశక్తులకు నాయకత్వం వహించుచున్నది. హిందీ, భాషాప్రాంతాలలో జనసంఘం బలాన్ని పుంజుకొంది, హిందూ-ముస్లిం ఘర్షణలు జరుగుటకు కారణమగుతున్నది.

నేటి పరిస్థితి వైరుధ్యాలతో అతిక్లిష్టముగ క్రింది అంశాలతో కూడివుండుట స్పష్టమని తెలిసింది.

1) మన పారిశ్రామికాభివృద్ధి వేగం మన అవసరాలకు తగినంత వేగంగా కాక నెమ్మదిగా అంచెలుగా జరిగింది. వ్యవసాయం అర్ధభూస్వామ్యంతో వుంది, తొలకరి అనిశ్చిత పరిస్థితులపై ఆధారపడి వుంది.

2) సోషలిస్టు ప్రపంచంతో ముఖ్యంగా సోవియట్ యూనియన్‌తో ఆర్థిక సంబంధాలు బలపడి. అనేక పరిశ్రమల స్థాపన, మన జాతీయ స్వాతంత్ర్యం బలోపేతమైనదైంది. అమెరికా పెట్టుబడి దిగుమతి, అప్పుల సహాయంతో భారత బడా బూర్జువవర్గ విదేశపొత్తు సంబంధాలు పెరుగుతున్నది.

3) అర్థికవిధానంలో ప్రభుత్వ పబ్లిక్ రంగంలో పారిశ్రామికాభివృద్ధిప్రముఖపాత్ర వహించుతున్నది. అయినా, గుత్తపెట్టుబడివర్గాలు అంతులేకుండా పెరిగిపోయాయి, అర్థికశక్తి బడాబూర్జువావర్గంలో కేంద్రీకరించబడింది.

4) వ్యాడలు సంబంధాలు అణచివేయబడుతున్నా ఫలితాలన్నీ ధనికరైతులకే ప్రోగుపడుతున్నవి. భూస్వాముల శక్తిమంతులగుటతో వారి చర్యలు ఎక్కువయ్యాయి.

5) ఈ ఆర్థికాభివృద్ధి వలనవిధానంతో ప్రజలపై అధిక భారాన్ని మోపినందువలన ధనికులను మరింత ధనికులగ, గ్రామాలలో నగరాలలో చేయుట జరిగింది. నిరుద్యోగం నిరభ్యంతరంగా పెరుగుతున్నది.

6) కార్మికవర్గం, రైతువర్గం, మేధావి వర్గాలు మరింత దారిద్ర్యానికి గురయ్యాయి. ఫలితంగా వారి పోరాటాల తీవ్రత పెరిగింది, కాని అనేక కారణాలవలన వారిలో ఐక్యత మృగ్యమైంది. ఈ బలహీనతను అధిగమించుట అవసరం.

7) అనేక రాష్ట్రాలలో పార్టీ ప్రభావం పెరిగింది, అయినా నిర్ణయాత్మకశక్తి అగుటకు యింకా చాల దూరంలో వున్నాము.

8) ప్రతి అసంతృప్తిని అనేకప్రాంతాలలో మతోన్మాదశక్తులు వినియోగించుకొని కుల మత ప్రాంతీయ తత్వాలను విజృంభింప చేస్తున్నవి.

9) కరుడు గట్టిన అభివృద్ధి నిరోధకశక్తులు బహిరంగ స్వతంత్ర రాజకీయ పార్టీని యేర్పాటు చేసుకొన్నవి. మన విదేశాంగవిధానం, ప్రభుత్వ, పబ్లిక్‌రంగపారిశ్రామిక విధానాన్ని, భూసంస్కరణలపై స్వతంత్ర పార్టీలు దాడిని ప్రారంభించినవి"

10) నెహ్రూ ప్రభుత్వ మౌలికవిధానాలు గతంలోవలెనె ప్రధానంగా జాతీయ బూర్జువా విధానాలు.

## జాతీయ ప్రజాస్వామ్య సంఘటన

### ప్రజాస్వామ్యశక్తులు అనైక్యత

భారతదేశానికి ఖ్యాతిని తెచ్చిన విదేశాంగవిధానం, అభివృద్ధి నిరోధకశక్తులు తప్ప కాంగ్రెసు నాయకులు, విశ్వాసపాత్రులైన అభ్యుదయ జాతీయ వాదులు ఈ విధానం కొనసాగించాలని కోరుతున్నారు. గరిష్ఠ భూపరిమితి, ఆహారపదార్థాలలో ప్రభుత్వవ్యాపారాలపై నాగపూరు జాతీయకాంగ్రెసు తీర్మానాలనుక్షీతు. చ. తప్పకుండా అమలును వీరు కోరుతున్నారు. కాంగ్రెసు భూస్వామ్యవర్గాలతో, మతతత్వశక్తులతో ఎట్టి సంబంధం కలిగి వుండరాదని వీరు కోరుతున్నారు. వారిలో అనేకమంది కేరళలో కాంగ్రెసు అనుసరించిన ఎత్తుగడలను విమర్శించారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించాలని కోరుతున్నారు. కాంగ్రెసు నాయకత్వం "సోషలిస్టు"పదజాలంతో కాంగ్రెసు ఐక్యతను కాపాడవలసిన అవశ్యకతలపై కేంద్రీకరించి ప్రచారం చేస్తూ వారి అసంతృప్తిని అరికట్ట ప్రయత్నిస్తున్నది, నెహ్రూపై విశ్వాసం వుంచవలసిందిగా కోరుతున్నది. కాంగ్రెసువాదులు వూగిసవాదులు, స్థిరఅవగాహనలేని వారై

ఎప్పటికి, కాంగ్రెసులోన, బయటవున్న అభివృద్ధి నిరోధకులతోపాటు వర్గీకరించ రాదు. పునరాలోచనా క్రమం కొనసాగుతున్నది, పరిపక్వత చెందలేదు. కాంగ్రెసు ప్రజావ్యతిరేకవిధానాలతో పెరుగతున్న ప్రజా అసంతృప్తి, నిరాశ, పెంపొందుతున్న అభివృద్ధికరభావాలు, కాంగ్రెసులో కూడ తప్పనిసరిగ ప్రభావాన్ని కలుగజేస్తున్నవి. కాంగ్రెసులో పెట్టుబడిదారి వర్గాల "పిడికిలిపట్టు" బిగియుట, భూస్వాముల, అభివృద్ధి నిరోధకుల ప్రభావం పెరుగుట, లంచగొండి తనం వికృతరూపం ధరించుట, జాతీయోద్యమ విలువలను మరచి, పదవుల వ్యామోహం. వాటిని ఎట్టి పరిస్థితులలోను వదలకపోవుట, ప్రతిపక్షాల, ప్రజలపై నిర్భందకాండ తీవ్రం చేయుట కాంగ్రెసులో అసంతృప్తి పెరిగి అసెంబ్లీ పార్లమెంటులలో వినిపించుతున్నది.

ఈ శక్తులు నిర్మాణయుతమై, కాంగ్రెసు విధానాలపై ప్రభావాన్ని కలుగ జేయునంతటి శక్తివంతమైనవి గావు. ఇవి పూర్తిగ నెహ్రూపై ఆధారపడి, నెహ్రూ మితవాదులతో రాజీపడినపుడు నిస్సహాయతకులోనై, అప్పుడప్పుడు కాంగ్రెసు అభ్యుదయకర తీర్మానాలు చేయునట్లు చేయగలుగుతున్నా, అమలులో నిస్సహాయులుగ వున్నారు. అత్యంత అభ్యుదయకరశక్తులు సైతం, కమ్యూనిస్టు వ్యతిరేకమైకంలో అభ్యుదయ ప్రజాస్వామ్య శక్తులు నిర్మాణం కలిగివున్నవాటితో, శక్తివంతమైన ప్రజాస్వామ్య వుద్యమాభివృద్ధికి తోడ్పడలేక వున్నారు.

ప్రజాసోషలిస్టుపార్టీ కొన్ని రాష్ట్రాలలో కొంత బలాన్ని కలిగివుంది, నాయకత్వం మరింత అవకాశవాదాన్ని అనుసరించింది. కేరళ కమ్యూనిస్టు మంత్రివర్గాన్ని పడగొట్టుటకు కాంగ్రెసు, ముస్లింలీగులతో కలసింది, ఫలితంగా ముఖ్యమంత్రి పదవిని పొందింది. బెంగాలులో మహోన్నత ఆహారోద్యమాన్ని. బీహారులో పన్నుల వ్యతిరేకోద్యమాని , పంజాబులో ఆహారోద్యమాన్ని విచ్ఛిన్నం చేయ ప్రయత్నించింది. టిబెట్‌లో విప్లవ ప్రతిఘాతకశక్తుల తిరుగుబాటు సమయంలో చైనా వ్యతిరేక వుద్యమాన్ని చేబట్టింది. ప్రజాబలం క్షీణించుటతో అభివృద్ధి నిరోధకులతో, కాంగ్రెసు అసంతృప్తివాదులతో ఎన్నికలలో గెలుపొందుటకై సహకారాన్ని నెరపుతున్నది.

నామమాత్రంగా యేదో రూపంలో వున్న వామపక్ష ఐక్యతను గతంలో సోషలిస్టుపార్టీ విచ్ఛిన్నం చేసింది. అయినా, అధిక సంఖ్యాకులైన కార్యకర్తలు, అనుచరులు, వామపక్షవాదులు, కేంద్ర ప్రభుత్వోద్యోగులసమ్మె పోరాటాలలో కమ్యూనిస్టులతో కలసి పని చేసారు.

కమ్యూనిస్టుపార్టీ అన్నిపోరాటాలలో ముందు పీఠన వుంది. గతంలో కంటె కమ్యూనిస్టులు పనిచేస్తున్న ట్రేడుయూనియనులు బలపడినవి. కాంగ్రెసు, ప్రభుత్వపు ప్రధానదాడి కమ్యూనిస్టులపై కేంద్రీకరించబడింది, అయినా వుద్యమం బలపడింది. చైనా వ్యతిరేకత అత్యున్నతస్థాయికి చేరినపుడు నాగాంగ్ బై ఎలక్షనులో కమ్యూనిస్టు పార్టీ గెలుపొందింది. కలకత్తా పార్లమెంటు బై ఎలక్షనులో భోపాల్

ఇలకై కేరళ, తమిళనాడు పాదయాత్ర మహోద్యమంలో విస్తృత ప్రజా సమీకరణ గావించింది. వివిధరాష్ట్రాలలో అదేవిధంగా ప్రజాప్రదర్శనలు చేసింది. ఇవన్నీ యాదృచ్ఛికంగా ప్రాప్తకాలజ్ఞత వుద్యమాలు, నిర్మాణం, కార్యక్రమాలనుండి వుద్భవించినవి కావు.

ప్రభుత్వ, యాజమాన్యాలదాడిని ఎదుర్కొనుటకై కార్మికవర్గం పారిశ్రామిక, జాతీయస్థాయిలలో వేతనాల, ప్రజాస్వామ్యహక్కుల పోరాటాలను సాగించింది. కాని ప్రజా సమస్యలపై, రైతుపోరాటాలకు సానుభూతి పోరాటాలు, రాజకీయపోరాటాలు చాలా తక్కువ. ప్రభుత్వవిధానలపై ప్రభావాన్ని కలుగజేయగలిగినంతటి శక్తివంతమైన కార్మికోద్యమ పోరాటదశకు చేరలేదు. ఒక్క కేరళ సమస్యపై తప్ప జాతీయస్థాయి వుద్యమంలేదు. రైతాంగంలో పార్టీ బలహీతయే, ప్రజాస్వామ్యవుద్యమాలలోని బలహీనతకు మూలము.

"అభ్యుదయకరవిధానాలకై జాతినంతటికి విస్తరించిన విస్తృత ఐక్యవుద్యమం లేకపోవుట, గతంలో నామమాత్రంగా వున్నవామపక్ష ఐక్యతవిచ్ఛిన్నమై, సామాన్యప్రజాస్వామ్య సమస్యలపై కార్మికవర్గాన్ని పార్టీ కదలించలేకపోవుట, రైతువుద్యమబలహీనతలతో ప్రజాస్వామ్యశక్తులు సంఘటితం కాలేదు. అవి ప్రజావ్యతిరేక చర్యలను వోడించలేకపోగా ప్రభుత్వం ప్రకటించిన విధానాలను సైతం ప్రజల ప్రయోజనాలకనుగుణంగా అమలుచేయుటకై వొత్తిడి చేయుటలో విఫలమయ్యాయి కరుడుగట్టిన అభివృద్ధి నిరోధకవర్గాలు యీ పరిస్థితులను వినియోగించుకొని తమ దాడిని కొనసాగించి తమ బలాన్ని విస్తరించుకొన గలిగాయి[1]"

## ఐక్యతా మార్గం :

ఆర్థిక రాజకీయ పరిణామాలు కొనసాగితే ప్రజలకు నిరాశ, నిస్పృహ, దుర్భర పరిస్థితులు, అధిక భారము, యింతటి అననుకూల పరిస్థితులున్నప్పటికీ, ప్రజాస్వామ్యశక్తులకు అనేక విధాలుగ అత్యంతసానుకూల పరిస్థితులు కూడావున్నవి. నూతన యుగధర్మం, ప్రపంచశక్తులబలాలలో నూతనసమతూకము సోషలిస్టు వ్యవస్థ పాత్ర బలోపేతమైన అగ్రగామిసోవియట్ యూనియన్ ప్రజలు సోషలిజంవైపుకు మొగ్గునట్లు చేస్తున్నాయి. పార్టీ, అనేకలోపాలున్నా మనదేశంలో ముఖ్యస్థానాన్ని పొందింద. అభివృద్ధి నిరోధకులకు యింకా ప్రజాపునాదిలేదు వారి నినాదాలు ప్రజలనాకర్షించలేదు. గత 14 సంవత్సరాల అనుభవం ప్రజలకు పోరాటం-ఐక్యతల అవసరాన్ని స్పష్టం చేసింది.

గత 14 సంవత్సరాలలో పాలకవర్గాలు పెట్టుబడిదారి విధానాన్ని నిర్మించుటలో విదేశీయ పెట్టుబడుల కిచ్చిన రాయితీలు, భూస్వాములకిచ్చిన రాయితీలు,

---

1. రాజకీయ తీర్మానం (1961) భారతకమ్యూనిసు పార్టీ 6వ, విజయవాడ కాంగ్రెసుచే ఆమోదించబడినది. పి.పి.హెచ్. పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే.25

బై ఎలక్షన్‌లో పార్టీ గణనీయమైన విజయాలను సాధించింది. స్థానిక ఎలక్షనులలో, పంచాయితీ ఎన్నికలలో అనేక స్థానాలను సంపాదించింది. వ్యవసాయ సంస్కర లాభాపేక్ష, బడా పెట్టుబడిదారివర్గంపై ఆధారపడుట ఫలితంగా ప్రజలు మోయ వలసిన భారం ప్రజలకు అనుభవాలనిచ్చింది. కాంగ్రెసులోని ప్రజాస్వామ్యవాదులు ఎంతటి మహోన్నత నాయకులైనా వ్యక్తులపై ఆధారపడితే సుభిక్ష, సంతోషదాయక మైన, భారతదేశ లక్ష్యాన్ని చేరజాలమని పాఠం నేర్చుకొన్నారు. కాంగ్రెసు బయట వున్న ప్రజాస్వామ్య శక్తులు, ప్రజల జీవన ప్రమాణాలను రక్షించాలంటే, పౌర హక్కులు రక్షించవలయునన్న కాంగ్రెసు ప్రజాసామాన్యంతో ఐక్యకార్యాచరణ నిర్మించాలని, కాంగ్రెసులోని ప్రజాస్వామ్యవాదులను బలపరచాలని, సామాన్య జాతీయ కర్తవ్యాల నిర్వహణలో వారితో చేతులు కలపాలని గత అనుభవాలు నేర్పుతున్నవి. వివిధ వర్గాల ప్రజలలో ముఖ్యంగా శ్రమించే, బాధపడే, పోరాడే వారిలో ఐక్యతావాంఛ ప్రగాఢమైంది.

అనేక అనుకూల అంశాలు విస్తృత ప్రజాస్వామ్య ఐక్యతను అనువగు పరి స్థితులను కలుగజేస్తున్నవి. విశాల, శక్తివంతమైన ఐక్య ప్రజోద్యమానికి పరిస్థి తులను సుగమం చేస్తున్నది ఐక్య ప్రజోద్యమ నిర్మాణానికి గట్టిప్రయత్నాలు చేసిన అభివృద్ధి నిరోధకుల రూపుమాపి, ప్రభుత్వ |రాజీ విధానాలను ఓడించగలము. అట్టి వుద్యమం ప్రచారోద్యమం, పోరాటాలు, తదితర కార్యాచరణ రూపాలద్వారా యేర్పడగలదు. ఆ విధంగా మాత్రమే మితవాద నిరోధక శక్తులను ప్రణాళికలను, ఓడించగలము, ప్రభుత్వ విధానాలలో కోరిన మార్పులను తీసుకొనిరాగలం, బహు ముఖ అభివృద్ధి గ్యారంటీ చేయగలము.

అట్టి వుద్యమ నిర్మాణానికి కమ్యూనిస్టుపార్టీ దేశంలోని అన్ని దేశభక్త వర్గాలను, ప్రజాస్వామ్య శక్తులను ఐక్యంచేయుటకు తన ప్రయత్నాలను ముమ్మరం చేయుటకు తన శక్తినంతా వినియోగించగలదు.

ప్రభుత్వ విధానాలలోని అన్ని దేశభక్త ప్రజాస్వామ్య సంస్కరణలకు వర్గాలను, ప్రజాభ్యుదయకర విధానాలను బలపరచి. పరిరక్షించుటకు, ప్రజలకు హాని చేయు విధానాలను, ఆర్థికాభివృద్ధి వేగాన్ని తగ్గించుట, తిరుగతోడు విధానాలకు వ్యతి రేకంగా ప్రభుత్వం వామపక్ష విధానాలవైపు మొగ్గునట్లు చేయుటకై ఐక్యప్రజా పోరాటలలో ఐక్యత నిర్మింపబడుతుంది.

ఈ సందర్భంలో కార్మికవర్గ ముఖ్యప్రయోజనాల రక్షణ వారి జీవన పరిస్థి తుల అభివృద్ధికి ఐక్యకార్యాచరణ రూపొందించుట అత్యంత ప్రాముఖ్యత గలదు.

ప్రజాస్వామ్య సంఘటనలో కార్మికవర్గం, రైతాంగం, పెటీ బూర్జువా వర్గాలు జాతీయ బూర్జువావర్గం కలసిన వర్గాల పొందిక ఈ సంఘటనకు కార్మిక, కర్షక ఐక్యత మౌలికమైనది, ఇరుసులాంటిది. అమ్మకవర్ పార్టీ, కాంగ్రెసు కిసాన్ సభ

ళను, వ్యవసాయకూలి సంఘాలను యేర్పాటు చేయుటలోని వైఫల్యమే ప్రజా స్వామ్య వుద్యమాల బలహీనతగా పేర్కొంది. మరోసారి "రైతాంగం వైపు పార్టీ తిరగాలి" అనేది నినాదం కావాలి. ప్రతిరాష్ట్రకమిటీ యీ నినాదాన్ని అమలు చేయుటకు తీవ్ర ప్రయత్నం చేయాలి.

ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణానికి, అందులోకి వచ్చే వర్గాల యెడల సరియైన అంచెనా, దృక్పథం వుండుట మాత్రమే చాలదు. దేశంలోని వివిధ పార్టీల యెడల సరియైన అవగాహన ప్రాముఖ్యతను కలిగి వుంది.

వామ పక్షాలు అత్యంత సామీప్య, సహకార, ఐక్యతలను కలిగి వుండాలని కమ్యూనిస్టుపార్టీ చెప్పుతూనే వుంది. కాని, యీ పార్టీలలోని కొన్ని నాయకత్వాలు ప్రధానంగా ప్రజాసోషలిస్టుపార్టీ, అనేక విషయాలలో కాంగ్రెసుకంటె మితవాద పార్టీగ వుంది. అదే కాలంలో కార్యకర్తలు, అనుసరించే ప్రజాసామాన్యంమొత్తంగా విస్తృత వామపక్షభావాలు కలిగి, ప్రభుత్వ ప్రజావ్యతిరేక భావాలను పోరాడ గలిగి వున్నారు. కాబట్టే యీ పార్టీల యెడల సరియైన దృక్పథం కొరకు తీవ్ర సిద్ధాంత పోరాటాన్ని కొనసాగిస్తూనే, సాధ్యమైన ప్రాంతాలలో వారిని, వారిననుసరించే వారిని జనసామాన్య కార్యాచరణలో, పోరాటాలలోనికితీసుకొని రావలసిన ఆవసరం యెంతో వుంది.

"కాంగ్రెసు మన దేశ రాజకీయ జీవితంలో అత్యంత ప్రాముఖ్యత గలది. స్వాతంత్ర్య పోరాటంలో నెహ్రూనాయకత్వంలో అది వహించిన పాత్రను బట్టి యిది ఆశ్చర్యకరమైన విషయంకాదు. కాంగ్రెసు ప్రభావం స్వాతంత్ర్య పోరాటాల రోజులకంటే తక్కువైనా విస్తృతంగాను, విస్తారంగానూ వుంది. అన్ని వర్గాలకు కార్మికవర్గంలోని పెద్ద భాగాలకు వ్యాపించింది. రైతాంగంలో విస్తరించింది. చేతి వృత్తులవారు, మేధావి వర్గాలలోను వ్యాపించింది. నెహ్రూ ప్రభావం మరింత యెక్కువగా వుంది. భారత పరిస్థితిలోని యీ పెద్ద వాస్తవాన్ని వదలి, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను నిర్మించజాలము."[1]

అంచేతనే, 4వ, పాల్ఘాట్ పార్టీ కాంగ్రెసు, జాతీయ కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యం, ప్రజాస్వామ్య ప్రతి పక్షాలను అనుసరించే ప్రజాసామాన్యం మధ్యగల అఘాతమే ప్రజాస్వామ్య పక్షంలో ప్రధానమైనదని స్పష్టం చేసింది. అదే పరిస్థితి కొనసాగుతూనే వుంది. ప్రజాసోషలిస్టుపార్టీ ప్రభావం క్షీణించుటతో కేరళ, ఆంధ్ర, పశ్చిమ బెంగాల్ కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యం కమ్యూనిస్టు పార్టీని అనుసరించే ప్రజాసామాన్యాల మధ్యనున్నదే ప్రధాన చీలిక అయింది.

---

1. రాజకీయ తీర్మానం (1961) భారత కమ్యూనిస్టుపార్టీ 6, వ కాంగ్రెసుచే ఆమోదించబడినది. పి.పి. హెచ్. పబ్లికేషను. (అంగ్లంలో) పే. 28.

ఏమైనా, నేడు కాంగ్రెసుతో సాధారణ ఐక్య సంఘటన సాధ్యమనే నిర్ణయానికి రారాదు. పార్టీ సంబంధాలు తప్పనిసరిగా "ఐక్యతా—పోరాటం"గా వుంటవి. కాంగ్రెసు జాతీయ బూర్జువా వర్గానికి మొత్తంగా, మితవాద పక్షంతో సహా చెందిన సంస్థ. పైగా స్వాతంత్ర్యం తరువాత అందులో జాతీయోద్యమాన్ని వ్యతిరేకించిన అభివృద్ధి నిరోధక శక్తులు, భూస్వామ్య, తదితర వర్గాలు నూతనంగా చేరాయి. బడా బూర్జువాలతో గల సంబంధాలతో అనేకమంది వృద్ధ నాయకులు ప్రలోభాలకు లోనయ్యారు. జాతీయోద్యమంతో సంబంధంలేని అనేకమంది కాంగ్రెసులో చేరారు. ఇదంతా కాంగ్రెసు, దాని ప్రభుత్వ ఆచరణలో ప్రతిబింబిస్తుంది.

అంతమాత్రంచేత కాంగ్రెసును మితవాద అభివృద్ధి నిరోధక పార్టీలతో జమ చేయుట పెద్ద పొరపాటు కాగలదు. ప్రకటించిన అనేక కాంగ్రెసు విధానాలు, కొన్ని చర్యలు, నేటి సందర్భంలో అభ్యుదయకరమైనవి. విదేశాంగ విధానం, ప్రభుత్వ పబ్లిక్ రంగంలో భారీ పారిశ్రామిక విధానం, మతాతీత విధానం మొదలైనవి.

ఈ క్రింది వాస్తవాలమంది భారతీయ సంక్లిష్ట పరిస్థితి రూపొందింది.[1] అతి క్లుప్తంగా :

1) కాంగ్రెసు,దాని ప్రభుత్వ విధానాలు చర్యల వలనే ప్రజలపై భారం అధికమయి అసంతృప్తి, నిరాశ, నిస్పృహ కలుగుతున్నవి. మితవాద అభివృద్ధి నిరోధక వర్గాలు యీ అసంతృప్తిని వినియోగించే,ప్రజలను తప్పుదారిని పట్టించి, బలపడ చూస్తున్నవి. అయితే పార్టీయొక్క బలంతో మాత్రమే కాక, వామపక్ష శక్తుల ఐక్యతతో మాత్రంతోనే కాని, శక్తివంతంగా యీ విధానాలపై పోరాటం సాగించజాలము. ఈ విధానాలపై పోరాటానికి కాంగ్రెసులో విశ్వాసం గలిగిన ప్రజలలో పెద్దభాగాన్ని సమీకరించగలిగిన విధంగా విస్తృత, ప్రగాఢతను చేకూర్చాలి.

2) మతవాద శక్తులలోఅత్యధిక భాగం కాంగ్రెసులోనే వున్నారు. అంతేగాక పార్టీ మిత్రులు కాదగిన వారిలో అత్యధికులు కూడా కాంగ్రెసులోనే వున్నారు.

కాంగ్రెసు నాయకులలో అనేకమంది హృదయపూర్వకంగా శాంతి, అలీన తటస్థ విదేశాంగ విధానాన్ని బలపరచరు. ఆ విధానాన్ని బలపరచే అత్యధికులు, దానిని పరిరక్షించేవారు ప్రజాసోషలిస్టుపార్టీలో గాని, మరే యితర "వామపక్ష" పార్టీలో గాక కాంగ్రెసులోనూ, నెహ్రూ ప్రభావంలో వున్నవారిలోనే వున్నారనుట వాస్తవం. కాంగ్రెసులోని అనేకమంది ప్రభుత్వ, ప్రజారంగ పారిశ్రామిక విధానంపై దాడి చేస్తున్నారు. దానిని పరిరక్షించువారనే అత్యధికులు కూడ కాంగ్రెసులోనే వున్నారు, యిదీ అంతటి వాస్తవమే. మతతత్వం సంబంధించినంత వరకు కాంగ్రెసు

1. రాజకీయాత్మానం (1961) పి.పి.హెచ్ పబ్లికేషన్ పే. 29.

లోనికే చొరబడిందనుట స్పష్టం. నెహూ్రు మాత్రమేగాక, కాంగ్రెసులోని అనేక మంది జబ్బల్‌పూర్ సంఘటనలపై విచారం వ్యక్తం చేసారు.

భారత విదేశాంగ విధానాన్ని, ప్రభుత్వ, ప్రజారంగ పారిశ్రామిక విధానాన్ని, పార్లమెంటరీ విధానాన్ని పరిరక్షించుటకు, మతశక్తులకు వ్యతిరేకంగా పోరాడుటకు కాంగ్రెసువాదులతో సంబంధాలను పెంపొందించుట అత్యవసరము.

అందుకై, కాంగ్రెసువాదులకు ఆ సంస్థపైగల విశ్వాసం, వారి అభిప్రాయాలను పరిగణలోనికి తీసుకొని తగిన దృక్పధాన్ని రూపొందించాలి. ఎప్పటికప్పుడు కాంగ్రెసు ప్రజాసామాన్యానికి, కాంగ్రెసువాదులకు, కాంగ్రెసు కమిటీలకు నేరుగా, వాస్తవ స్థానిక పరిస్థితులను పరిగణించి, తక్షణ సమస్యలపై నేరుగా విజ్ఞప్తులు చేయాలి.

మతతత్వానికి వ్యతిరేకంగా వెన్వెంటనే విస్తృత ఐక్యతను నిర్మించే సమస్య ప్రధానంగా చేబట్టాలి. సరియైన దృక్పధం, ఐక్యకార్యాచేరణకై, సౌభాతృత్వ విజ్ఞప్తి అన్ని సుముఖ మార్గాలులో, అనేకమంది కాంగ్రెసువాదులలో సైతం ప్రతిస్పందన లభించగలదు. మధ్యప్రదేశ్ మతకలహాల అనంతరం, జనసంఘం తన చర్యలను తీవ్రం చేయుటతో యీ కర్తవ్యం ప్రత్యేక ఆవశ్యకతగా అయింది.

"కాంగ్రెసులోని ప్రజాసామ్యవాదులను, కాంగ్రెసు ప్రజాసామాన్యాన్ని మన మిత్రులుగ, రాజకీయ స్వాతంత్ర్యం పరిపుష్టం చేయుటలో, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించుటలో, విదేశాంగ విధానాన్ని, ప్రభుత్వ, పబ్లిక్‌రంగ పరిశ్రమలు, వ్యవసాయ సంస్కరణలు కొనసాగించుటలో మన సంఘటనలో భాగస్వాములు, సహకారులు, మనం సౌభాతృత్వ వైఖరిని చేబట్టాలి. అంతేగాక, కాంగ్రెసు అభ్యుదయ ప్రకటనలను విమర్శించుట మాత్రమే గాక, ఐక్యతను పెంపొందించుటకు వినియోగించాలి.

"మితవాద అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా ప్రభుత్వం చేబట్టే సరియైన ప్రతి చర్యను మనం నిస్సందేహంగా ప్రజాసమీకరణతో బలపరచాలి. అట్టి మన చర్య, ప్రభుత్వపు ప్రజావ్యతిరేక చర్యలను వ్యతిరేకించి శక్తివంతంగా పోరాడుటకు శక్తినిస్తుంది. విధానాలపై పాలకపార్టీలో ఘర్షణలు జరిగినపుడు పార్టీ వైఖరిని ప్రజలలో స్పష్టపరచి, సరియైన విధానాలకు బలం చేకూర్చుటకు ప్రజా సమీకరణ చేయాలి." [1]

"పోరాట భూమికను విస్తృత పరచవలసిన అవసరంరీత్యా, భవిష్యత్తులోని సంక్లిష్ట స్థితి దృష్ట్యా, గతంలో కంటె శక్తివంతమయిన ప్రయత్నాలు అవసరం.

---

1. రాజకీయ తీర్మానం (1961) భారత కమ్యూనిస్టు 6వ పార్టీ కాంగ్రెసుచే ఆమోదించబడినది. పి. పి. హెచ్. పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే. 30.

కాన, కాంగ్రెసులోని ప్రజాస్వామ్యవాదులు, దాని ప్రభావంలోని ప్రజాసామాన్యంతో సంబంధాలను పెంపొందించుకొనవలసి వుంది. పాల్ఘాటులో యీ విషయం చెప్పినా, యీ కర్తవ్యం ఆచరణ అశ్రద్ధ చేసాం, ఆ కారణంగాయిది నొక్కి చెప్పవలసి వుంది.

అందుకు పార్టీ సూచనలు :

1) కాంగ్రెసు అభ్యుదయకర ప్రకటనలను ఆచరణలో ఐక్యతను రూపొందించుటకు వినియోగించుట.

2) ఆందోళనలో మన ప్రభావంలోని వారినేగాక, బయటవారిని దృష్టిలో పెట్టుకొని, "ముందు కూర్చొని" కాంగ్రెసుని, దాని ప్రభుత్వాన్ని తెగనాడుతు మాట్లాడిన ప్రతి మాటకు చప్పట్లు కొట్టువారికి మాత్రమేగాక, కూర్చున్నవారి "చివర నిల్చున్న" వారికై మాట్లాడండి.

3) మితవాద అభివృద్ధి విరోధకులపై, మతతత్వ పార్టీలు వాటి విధానాలు, వివాదాలపై దృఢమైన, రాజీలేని పోరాటం సాగించాలి. ఇదీ నిజమయిన కాంగ్రెసువాదులను, మనవైపు రాగలందులకు తోడ్పడుతుంది.

4) కాంగ్రెసు, దాని ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడునపుడు మితవాద శక్తులపై దాడిని కేంద్రీకరించాలి.

5) కాంగ్రెసువాదులు వారి ప్రజాసామాన్యంలో వోర్పుతో వివరణోద్యమాన్ని కొనసాగించాలి. రూపొందుతున్న పరిస్థితి, అభిప్రాయాల అభివృద్ధి చీలికలకు వారు ఆందోళన చెందుతున్నారు. ప్రభుత్వవర్గవిధానాలే మౌలికకారణాలు, అందుండి వుద్భవించిందని బట్టబయలు చేయాలి. ఈ విధానాలను వారి భావాలను మార్చి, పోరాటంలోనికి సమీకరించుటకై చేయాలి."

కాంగ్రెసు వారితో ఐక్యకార్యాచరణ రూపొందించునపుడు వోర్పుతో వివరణోద్యమాన్ని కొనసాగించి నేటి పరిస్థితులలో భారతదేశంలో పెట్టుబడిదారి విధానాన్ని పెంపొందించు వారి కాంగ్రెసు విధానాలనుండి అభిప్రాయభేదాలు వుద్భవించుచున్నదని స్పష్టపరచాలి. అందులోనిగట్టి చర్యలు విదేశపెట్టుబడిపై తీసుకొనందున, భైతాంగ ప్రయోజనాలకై వ్యవసాయ సంస్కరణలు చేపట్టనందున గుత్తపెట్టుబడిదారులకు రాయితీలను యిచ్చుట వలన యేర్పడుతున్నవి. మారక ద్రవ్యసంక్షోభంతో, ధరల విధానం, అసమర్థపాలనలతో హృదయ పరిశోధనాక్రమం ప్రారంభమై వేగోద్రుతిపొందుట తథ్యంమని స్పష్టంమగుతుంది. ప్రజాస్వామ్య కాంగ్రెసువాదుల చైతన్యం అవగాహన ఉన్నతదశకు చేరుటకు అన్ని ప్రయత్నాలుచేయాలి. జాతి పునర్జీవనానికి పార్టీ మౌలిక వివాదాలు ఎంతవాస్తవం సరియైనవో కాంగ్రెసువాదులలో విశ్వాసాన్ని కలుగజేయాలి. మితవాద అభివృద్ధి విరోధకుల అతంతర వివాదాలను

బట్టబయలుచేసి, వారు ప్రజల అసంతృప్తిని వినియోగించే ప్రయత్నాలను వమ్ము చేయాలి.

పార్టీ స్వతంత్రకార్యాచరణతోపాటు, సౌహార్ద విజాయితీ వైఖరితో ఐక్య సంఘటనా దృక్పథం కలసి ప్రతిసమస్యపై సాధ్యమైనంత యెక్కువ ప్రజా సమీకరణ ఎత్తుగడలుకావాలి. అటువంటి స్వతంత్రప్రజాకార్యాచరణ పార్టీనసరించే ప్రజాస్వామ్యపు చైతన్యాన్ని అభ్యున్నతదశకు పెంపొందించాలి. ప్రజాకార్యాచరణకు ఐక్యత ముందుగానే యేర్పడాలని యెంచరాదు. పార్టీ స్వతంత్రకార్యాచరణలోను పోరాట సన్నాహ ప్రయత్నాలక్రమంలోను పార్టీపైపు యితరులు ఆకర్షింపబడు దృక్పధాన్ని తప్పనిసరిగా అనుసరించాలి."

ప్రజాస్వామ్యశక్తుల విస్తృత ఐక్యత ప్రభుత్వవిధానాలలో మార్పును తెచ్చుటకేగాక అనేకవిధానాలప్రకటనలోని ప్రజాప్రయోజనాలను ఆచరణలో పెట్టునట్లు చేయుటకు ప్రజలు కొత్త రాయితీలను పొందుటకేగాక పొందిన రాయితీలను ప్రజాప్రయోజనాలకు సుస్థిరం చేయుటకు ప్రజాస్వామ్య విస్తరణకేగాక ఎన్నికైన స్థానిక సంస్థలహక్కులు ప్రజాప్రయోజనాల కొరకు వినియోగించుటకు పెంపొందించవలసి యున్నది. ఐక్యతలేకుండా వున్న అవకాశాలను సాధ్యాలుగ జేయుటకై ప్రజలను మౌలిక సంస్కరణల కొరకై వుత్సాహపరచి,సమీకరించుట అసాధ్యం. అట్టి ప్రయత్నానికి ప్రజలకు సేవలందించుటకై సిద్ధపడే అందరిని తప్పనిసరిగా ఐక్యపరచుట అనుసరించతగినది, అవసరం.

## జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాలు :

జాతీయ పునర్జీవనానికి జాతి పురోగమనానికి నిర్వహించవలసిన కర్తవ్యాలు యీ క్రింది విధంగా వున్నవి. మనస్వాతంత్ర్యాన్ని బలోపేతం చేయుట మనరక్షణ విదేశాంగవిధానాలను బలపరచుట సోషలిస్టు ఆసియా ఆఫ్రికాదేశాలతో సన్నిహిత సంబంధాలను బలపరచుకొనుట, మన ఆర్థికవిధానంపై విదేశపెట్టుబడికి గల 'పట్టు'ను, కీలకరంగాలలో విదేశపెట్టుబడి ప్రవేశాన్ని తొలగించి, అరికట్టుట, ప్రభుత్వరంగాన్ని వేగంగా విస్తరించుట ద్వారా చేయాలి. మన ఆర్థిక విధానంలో ప్రభుత్వ పబ్లిక్‌రంగం నిర్ణయాత్మక పాత్రను వహించుటకు బ్యాంకులు, ఇన్సూరెన్స్ తదితర సంస్థలను జాతీయం చేయాలి. దుబారా, అసమర్థత, లంచగొండితనాలను ప్రభుత్వరంగంలో రూపుమాపుటకు ప్రజాస్వామ్యయాజమాన్యం, మరిన్నిభారీ, కీలక పరిశ్రమలను ప్రభుత్వరంగంలో నిర్మించాలి. రైతాంగానికి వాస్తవంగా వుపయోగపడే వ్యవసాయసంస్కరణలుచేసి, వారిపై పడిన బరువు భారాన్ని తగ్గించుట, వ్యవసాయ అధికోత్పత్తులకై వ్యవసాయరంగంలో అధికపెట్టుబడిపెట్టి విజయాన్ని సాధించాలి.

ధనికులపైనే ప్రధానభారం పడునట్లు న్యాయమైన పన్నులవిధానం, కార్మికులకు కనీస వేతనం, క్రమానుగత కరువుబత్తెం నిర్ణయించాలి. ప్రజల జీవన ప్రమాణాన్ని వృద్ధి పరచాలి. ప్రజలనణచే చట్టాల పుపసంహరణ, పౌరహక్కులు గ్యారంటీ చేయాలి.

ఇవి జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాలు. ఈ కర్తవ్యాల నిర్వహణకు దేశ భక్తియుత, ప్రజాస్వామ్యశక్తులన్నీ కలిపి విస్తృత జాతీయ ప్రజాస్వామ్య ఐక్య సంఘటనను నిర్మించాలి.

ఐక్యసంఘటనా నిర్మాణం మితవాత అభివృద్ధి నిరోధక శక్తులపై దృఢతర మైన నిరంతరపోరాటం సాగించాలి. కాంగ్రెసు వాదులను అభ్యుదయకర నాయక త్వాన్ని ప్రమాదాన్నుండి పోరాటమే జాగృతిని రక్షణను కలుగజేస్తుంది. కాంగ్రెసు ప్రకటనలు, ఆమోదంపొందిన దృక్పధం అవగాహవలను అనుసరించాలి. ప్రజా అసంతృప్తిని వినియోగించదలచే మితవాద అభివృద్ధి నిరోధకుల ఆడంబర నినాదా లను బహిరంగ పరచాలి, ప్రజలు కార్యాచరణలోనికి దిగునట్లు చేయగలగాలి.

అటువంటి ఐక్యసంఘటనను నిర్మించుటకు కాంగ్రెసు ప్రభుత్వపు రాజీ విధా నాలకు విదేశీసామ్రాజ్యవాద పెట్టుబడి ప్రవేశానికి, శేషభూస్వామ్యదలిజానికి కుల, మత ప్రాంతీయతత్వాలకు వ్యతిరేకంగా ధనికుల ప్రయోజనాలను రక్షించుటకు వ్యతిరే కంగా దృఢమైన ఎడతెగని పోరాటాన్ని సాగించాలి. ఈ పోరాటం సాగించనిదే అభివృద్ధి నిరోధకుల నోడించ జాలమని, అభివృద్ధి పందాననునరించజాలమని కాంగ్రెసువాదులకు వివరించాలి.

ఐక్యసంఘటన నిర్మాణానికై తక్షణ ప్రయోజన సమస్యలపైన దోపిడిదారుల వాదులకు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాసంఘాలను నిజమైన ప్రజాసంఘాలుగ అభివృద్ధిపరచి ఐక్యసంస్థలుగా పెంపొందించి ప్రజల ఐక్యకార్యాచరణను రూపొం దించాలి.

ఐక్యసంఘటనా నిర్మాణానికై రాష్ట్రాలకు అధిక అధికారాలకై పోరాడుతు అన్నిదేశభక్త శక్తులతో కలిపి జాతియైక్యతను పరిరక్షించాలి. కమ్యూనిస్టుపార్టీని సైద్ధాంతికంగా రాజకీయంగా నిర్మాణరీత్యా బలపరచాలి. కార్మిక కర్షక తదితర ప్రజా సంఘాలఐక్యతను పునరుద్ధరించి ఐక్యసంఘటనలో ప్రధాన పాత్రదారులుగ చేయాలి.

**జాతి పురోగమన పంథా :**

సంక్షిప్తంగా, జాతీయ ప్రజాస్వామ్య సంఘటన జాతి స్వాతంత్ర్యాన్ని బల పరచుట, విదేశ గుత్తపెట్టుబడిని అంతం చేయుట, త్వరితంగా జాతీయ పారిశ్రామికీ కరణ, ప్రభుత్వ, పబ్లిక్‌రంగ విస్తరణ, ప్రజాస్వామ్య యాజమాన్యం, నిజమయిన వ్యవసాయ సంస్కరణలు, రాజకీయ, ఆర్థిక, సామాజిక జీవితంలో ప్రజాస్వామ్య విస్తరణ, అన్ని దేశభక్త వర్గాలతో కలిపి కొనసాగించాలి.

అట్టి ప్రజోద్యమం విస్తృత ప్రాతిపదికగా ఎడతెగకుండా, శక్తివంతంగా తీవ్రంగా కొనసాగించిన, ప్రజలు తమ తక్షణ కోర్కెలను సాధించుకొనుటయేగాక, ప్రభుత్వ విధానాలలో మార్పులు తీసుకొని రాగలవు. మితవాద అభివృద్ధి నిరోధకులను వేరుపరచి, వారి ప్రయత్నాలను వమ్ము చేయగలదు. మన దేశంలో వివిధ శక్తుల బలాబలాలలో మార్పు, ప్రజాస్వామ్యశక్తుల బలాన్ని పెంపొందించగలదు. జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వ విధానాన్ని, పోరాడే శక్తులు కలసి, జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాలను వాస్తవం చేయగలవు. అట్టి ప్రభుత్వ నిర్మాణ శ్రామిక ప్రజల స్థానాన్ని బలోపేతం గావించి "సోషలిజంలోనికి పరివర్తనను సుగమం చేయగలదు."

## IV

# ఎన్నికల తదనంతర పరిణామాలు

భారత సమాజంలో పెరుగుతున్న అఘాతం, ముఖ్యంగా వర్గశక్తుల మధ్య దూరం మరింత పెరిగిపోయిన విషయం, 1962 ఫిబ్రవరిలో జరిగిన కేంద్ర పార్లమెంటు, రాష్ట్రి అసెంబ్లీలకు జరిగిన ఎన్నికలలో స్పష్టమైనది. దేశంలో ప్రధాన రాజకీయపార్టీగ కాంగ్రెసు స్థానం సుస్థిరమయినదని రుజువైంది. లోక్‌సభ 520 స్థానాలలో 361 స్థానాలను, 46.02 శాతపు వోట్లు పొందింది. కాంగ్రెసు 1957 తో పోల్చిన 60 లక్షల వోట్లను కోల్పోయింది. పార్లమెంటు, అసెంబ్లీలలో తనకుగల అత్యధిక మెజారిటీలను కొంత కోల్పోయింది. కమ్యూనిస్టుపార్టీ లోక్‌సభలో 29 సభ్యులతో ప్రధాన ప్రతిపక్ష స్థానాన్ని పొందింది. అదే కాలంలో పార్లమెంటు, అసెంబ్లీలలో స్వతంత్ర, జనసంఘం మితవాద పార్టీల బలం పెరిగింది. లోక్‌సభలో మితవాద పార్టీలు 13.2 శాతపు వోట్లను, కమ్యూనిస్టుపార్టీ 10 శాతపు వోట్లు పొందగలిగాయి. కాంగ్రెసు గాని, కమ్యూనిస్టుపార్టీ గాని మితవాద పార్టీల నుండి పెరుగుతున్న ప్రమాదాన్ని తక్కువగానే అంచనా వేసాయి.

కాంగ్రెసు బలాన్ని కోల్పోవుటకు గ్రూపుల అంతర్గత కుమ్ములాట ప్రధానంగా కన్పడుతున్నది. రాష్ట్రాలలో అనేక గ్రూపుల మధ్య యీ అంతర్గత పోరాటం ఎక్కువయింది. ప్రత్యేకంగా హిందీ భాషా ప్రాంతంలో, బెంగాలులో మరీ ఎక్కువయింది. భారత సమాజంలోని ధనిక వర్గాలలో వివిధ జాతుల బూర్జువా వర్గాలలో సంఘర్షణలు, వైరుధ్యాలు ఎక్కువయ్యాయి. మరోవైపు జాతీయ కాంగ్రెసులో మితవాద, అతివాద శక్తుల మధ్య సంఘర్షణలు తీవ్రం కాసాగాయి. ప్రధానంగా కాంగ్రెసులో మూడు గ్రూపులు; నెహూ్రి అతని అనుచరులు మధ్యేమార్గవాదులు, రాష్ట్రాలలోని వివిధ కాంగ్రెసు గ్రూపులు, పశ్చిమబెంగాల్ అతుల్యఘోష్, ఉత్తరప్రదేశ్

సి. బి. గుప్తా గ్రూపులు కేంద్రంలోని మంత్రుల కొందరి మద్దతుతో మితవాదగ్రూపు కేంద్రమంత్రి కె.డి. మాలవ్యా నాయకత్వంలో వివిధ అతివాద వర్గాలు నిర్మాణంలేని అతివాద గ్రూపుగా పనిచేయ మొదలుపెట్టాయి. ఎన్నికల అనంతరం యీ గ్రూపుల మధ్య విభేదాలు, అంతర్గత సంఘర్షణలు పెరిగాయి. అధికార కాంగ్రెసు ప్రతినిధులను వ్యతిరేకించ మొదలిడినవి.

కాంగ్రెసులోని మితవాదశక్తులు భారత-చైనా సరిహద్దు సంఘర్షణలను చైనా 1962 వ సం॥ కాలలో యెక్కువ చేయుటలో, కాంగ్రెసు వెలపల గల మితవాద శక్తులతో ఏకమై, 1963 వేసవిలో నెహూర్ ప్రభుత్వం రాజీనామా చేయాలని వొత్తిడి ప్రారంభించాయి. కేంద్ర కాంగ్రెసు నాయకత్వంలో ఐక్యత పునరుద్ధరించుటకై మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి కామరాజ్‌నాడార్ ప్రణాళిక ప్రతిపాదనలలో భాగంగా, కాంగ్రెసు సంస్థను కేంద్రంలో, రాష్ట్రంలో బలోపేతం చేయుటకై కేంద్రంలోని ప్రముఖ నాయకులందరిని రాష్ట్రాలకు సంస్థలకు బదిలీ చేసారు. ఫలితంగా కేంద్ర ప్రభుత్వంలో మితవాద వర్గాలు బలాన్ని కోల్పోయినా, అనేకమంది అనధికార "సిండికేటు" గ్రూపుగా కాంగ్రెసు నాయకత్వంలో ఏర్పడ్డారు. దీని ప్రభావము 1960 దశకంలో పాలకవర్గ పార్టీపై గణనీయంగా వుంది. జయపూర్‌లో 1963 వ సం॥ కాలంలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటి సమావేశంలో కామరాజ్‌నాడార్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు.

## ఎన్నికల విశ్లేషణ, కొన్ని ముఖ్యాంశాలు :

ద్వితీయ సాధారణ ఎన్నికలలో 1957 లో కాంగ్రెసు 47 1 శాతం వోట్లు, మొత్తం పోలైన వోట్లలో పొందింది. 73 శాతం పార్లమెంటు స్థానాలను గెలుచుకొంది. కమ్యూనిస్టుపార్టీ 10.9 శాతం ఓట్లను 6 శాతం స్థానాలను పొందగలిగింది. పార్టీ గెలచిన స్థానాలు దగ్గర దగ్గరగా 1952 లో గెలచినన్ని స్థానాలనే పొందినా, పార్టీ విస్తరించి బలం పెరిగినా 1952 లో 6 మిలియనులు, 1957 లో 12 మిలియనుల ఓట్లను పొందినా, పెరిగిన బలాన్ని పూర్తిగా ఎన్నికలలో ప్రతిబింబించబడలేదు.

అతివాద వర్గాలు రెండవ ఎన్నికలలో సాధించిన విజయాలు, కేరళ కమ్యూనిస్టు రాష్ట్రప్రభుత్వ మేర్పాటుతో, దేశంలోని సామాజిక రాజకీయ శక్తులబలాబలాలలో వచ్చిన మార్పుతో పాలకవర్గంలోని మితవాద వర్గాలు సి. రాజగోపాలాచారి, యన్.జి. రంగా నాయకత్వంలో కాంగ్రెసును విడచి బయటకుపోయి స్వతంత్రపార్టీగ యేర్పడి దేశంలోని అన్ని మితవాద శక్తులను కూడగట్టు ప్రయత్నం చేసాయి. స్వతంత్ర పార్టీ బడా బూర్జువావర్గం, భూస్వాములు, మాజీ రాజుల రాజకీయపార్టీ.

కాంగ్రెసు 1952·1957, 1962లలో క్రమంగా 405, 428, 435 లోక్‌సభ సీట్ల మొత్తంలో 364, 371, 356 సీట్లను గెలుచుకొంది. రాష్ట్ర అసెంబ్లీలలో

2623, 2514, 2620 సీట్లలో 2246, 2008, 1917 స్థానాలను గెలుపొందింది, లోక్ సభకు 45, 48, 45 శాతపువోట్లను, రాష్ట్ర అసెంబ్లీలలో 42,45, 44 శాతము వోట్లను గెలుచుకొంది. గెలచిన సీట్లశాతము, పొందిన వోట్ల శాతంల మధ్యభేదము 1952లో 29.4; 1957లో 27.3; 1962లో 27.8 శాతము అనగా గెలచిన ఓట్ల శాతముకంటె గెలిచిన సీట్లు 27.3నుండి 29.4 శాతం అదనంగా పొందగలిగింది. గుర్తుపెట్టుకొనవలసిన మరో విషయం, మూడు సాధారణ ఎన్నికలలో ఎప్పుడూ కాంగ్రెసు 50 శాతం అయినా వోట్లను పొంద జాలకపోయినా, 70 శాతం పైగా ఓట్లను సంపాదించగలిగింది. రిపబ్లిక్ ఎన్నికల విధానం, దామాషా పద్ధతిలో ప్రతినిధుల ఎన్నికల విధానం కాని కారణంగానే ప్రతినిధుల సంఖ్య ప్రజాసామాన్యపు వాంఛ వాస్తవాన్ని ప్రతిబింబించే విధానంగా లేదు. అందువల్లనే యీ ఎన్నికల విధానం వాస్తవంగా ప్రజాస్వామ్య విధానం కాదని అన్నిదేశాలలోని అతి వాదులు పొందిన వోట్ల నిష్పత్తిలోనే ప్రతినిధులను కేటాయించే విధానం వుండాలని అందోళన చేస్తున్నారు. ఇది సూత్ర బద్ధమైన ప్రజాస్వామ్య ఎన్నికల విధానమునకై సాగించే పోరాటమైనది.

కమ్యూనిస్టుపార్టీ 1952లో 16, 1957లో 27, 1962లో29 పార్లమెంటు సీట్లు ఎన్నికలలో గెలచింది. రాష్ట్ర అసెంబ్లిలలో అదే సంవత్సరాలలో 1952లో 106; 1957లో 204, 1962లో 184 సీట్లు గెలచింది. పార్టీ 1962లో 10 శాతము వోట్లను పొందగలిగింది. కాని 5.9 సీట్లను మాత్రమే పొందింది. కమ్యూనిస్టుపార్టీ 1957లోవలెనె 1962లో ప్రతిపక్షపార్టీ స్థానాన్ని నిలబెట్టు కొనగలిగింది. ప్రజాసోషలిస్టుపార్టీ 1952 తరువాత ప్రధాన ప్రతిపక్ష స్థానాన్ని కమ్యూనిస్టులకు కోల్పోయింది. కమ్యూనిస్టుపార్టీకి వున్నబలం ప్రధానంగా పశ్చిమ బెంగాల్ ఆంధ్ర, కేరళ, మహారాష్ట్రంలోనే కేంద్రీకృతమై వుంది. మితవాద పక్షాలు అంతగా పురోగమించలేకపోయాయి.

కేరళలో 1959-60లలో కమ్యూనిస్టు రాష్ట్రమంత్రి వర్గాన్ని రాష్ట్రపతి రద్దు చేసిన తరువాత అసెంబ్లీ ఎన్నికలలో కమ్యూనిస్టుల బలాన్ని 29 ప్రతినిధులకు, కాంగ్రెసు, ముస్లింలీగు, ప్రజాసోషలిస్టుపార్టీల కలయిక తగ్గించగలిగింది. అయినా కమ్యూనిస్టుపార్టీకి పోలైన వోట్లు 44 శాతంకి పెరిగాయి. కాంగ్రెసు, దాని మిత్ర పక్షాలు కలసి 54 శాతం వోట్లును 94 సీట్లను సంపాదించగా కాంగ్రెసు వొక్కటీ 35 శాతం వోట్లు మాత్రమే సంపాదించగలిగింది. కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే 44 శాతం వోట్లను 29 సీట్లను మాత్రమే సంపాదించగలిగింది. కారణం పోలింగు విధానంలో అప్రజాస్వామ్య విధాన ఫలితమని చెప్పవచ్చు. రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ 12 సీట్లకు పోటీచేసి 1.2 శాతము వోట్లన 1 సీటును మాత్రమే గెలుచుకొంది.

స్వతంత్రపార్టీ 170 పార్లమెంటు స్థానాలకు, 1000 అసెంబ్లీస్థానాలకు 1962లో పోటీ చేసింది. ఫలితాలు స్వతంత్రపార్టీని ప్రధాన ప్రతిపక్షంగా చేసాయి. వివిధ రాష్ట్ర అసెంబ్లీలలో 167 స్థానాలకు పోటీచేసి గెలిచింది. కమ్యూనిస్టుపార్టీ 153 స్థానాలను మాత్రమే సంపాదించింది. ప్రజాసోషలిస్టుపార్టీ 4 జనసంఘం 15 స్థానాలను పొందాయి. ఒరిస్సాబ్లీలో స్వతంత్రపార్టీతో కలసిపోయిన గణతంత్ర పరిషత్ గెలచిన 36 స్థానాలను పరిగణలోనికి తీసుకొనవలసి వుంటుంది. స్వతంత్రపార్టీ, గుజరాత్, రాజస్థాన్ బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలో ప్రధానప్రతిపక్షంగా వుంది. పార్లమెంటులో స్వతంత్రపార్టీ 24 స్థానాలను కమ్యూనిస్టుపార్టీ 29 స్థానాలను కలిగి వున్నాయి. వీరుగాక అనేకమంది స్వతంత్రులు పార్లమెంటుకు ఎన్నికయ్యారు. వారి స్వతంత్రపార్టీని బలపరుస్తున్నారు. కాన వారు వాస్తవంగా ప్రతిపక్ష స్వతంత్ర పార్టీయేయని చెప్పకొనవచ్చు. రాజ్యాంగ చట్టం ప్రకారం మాత్రమే కమ్యూనిస్టు పార్టీ ప్రధాన ప్రతి పక్షమైంది.

జనసంఘం రక్షణ ప్రాధాన్యత చైనా, పాకిస్తాన్‌ల యెడల ధృఢమైన వైఖరి అవలంభించుట, తర్వాత సంస్కృతి ప్రాతిపదికగా 'భారత ఐక్యత, జాతీయుతలను ప్రధాన ఎన్నికల సమస్యలుగా చేబట్టింది. లోకసభ స్థానాలను 14, అసెంబ్లీ స్థానాలను 116ను 1962 జనరల్ ఎన్నికలలో వివిధరాష్ట్రాలలో గెలుపొందింది. గతంలా 1957లో 4 లోకసభ స్థానాలను, 46 అసెంబ్లీ స్థానాలను, 1952లో 3 లోకసభలో 35 అసెంబ్లీలో గెలుపొందింది. జనసంఘం 1952, 1957లలోకంటె తమ బలాన్ని లోకసభ, రాష్ట్రాల అసెంబ్లీలలో పెంచుకొనుట నిర్వివాదాంశము. ఈ విషయాన్ని ప్రస్తావించుతు బలరాజ్‌మధోక్ "ఎన్నో అననుకూల పరిస్థితులున్నప్పటికి, మిగిలిన ప్రతిప్రతిపక్ష పార్టీలకంటె అనుకూల అభివృద్ధినే సాధించింది. కమ్యూనిస్టుపార్టీ తన బలాన్ని, గెలిచిన స్థానాలు, సంపాదించిన వోట్లు దగ్గర దగ్గరగా నిలబెట్టుకొనుట మాత్రమే చేయగలగగా, ప్రజాసోషలిస్టుపార్టీ నిలకడగా దిగజారిపోతుండగా జనసంఘం అనేక అడ్డంకులున్నప్పటికి అభివృద్ధి నిలకడగా పెంపొందించుకొనగలిగింది.[1]" అని 1962 ఫలితాలపై వ్యాఖ్యానించారు. ఉత్తర, మధ్యప్రదేశ్‌లలో, ఢిల్లీ, రాజస్థాన్, పంజాబ్, జమ్మూ,కాశ్మీర్ లోకసభ, రాష్ట్ర అసెంబ్లీలలో జనసంఘం ప్రధాన ప్రతిపక్షంగా వుద్భవించింది. రాజస్థాన్‌లో జనసంఘం, స్వతంత్ర పార్టీ రాష్ట్రస్థాయిలో పూర్తి సహకార మిత్రత్వాన్ని నెరపుటతో అసెంబ్లీలలో గెలుపొందిన 116 స్థానాలలో, 15 స్థానాలను పొందింది. అంతేగాక జనసంఘం అసెంబ్లీలలో గెలుపొందిన 116 స్థానాలలో 113 స్థానాలను హిందీ భాషా ప్రాంతాలలోనే పొందగలిగింది. ఆంధ్ర, అస్సాం, గుజరాత్, కేరళ, మహారాష్ట్ర, ఒరిస్సా

---

1. బలరాజ్‌మధోక్ (1962) సెమినార్. మంత్లీసింపోజియం. (ఆంగ్లం) న్యూఢిల్లీ నం. 34. పే. 37.

పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో వొక్క సీటునుగూడ గెలువజాలకపోయింది. జన సంఘం అఖిల భారత రాజకీయ పార్టీగకాక, హిందీ భాషా ప్రాంతీయ పార్టీగ రూపొందింది.

ప్రజాసోషలిస్టుపార్టి, సోషలిస్టుపార్టీలు 1952లో 10 11; 1957లో 19,7; 1962లో 12,6; పార్లమెంటు సీట్లు గెలుపొందారు. అదే విధంగా రాష్ట్ర అసెంబ్లీలలో 1952లో 77, 125; 1957లో 208, 25; 1962లో 179, 58 స్థానా లలో గెలుపొందారు. జనసంఘంవలెగాక చాలా రాష్ట్రాలలో పార్లమెంటుకిగాని, అసెంబ్లీలకుగాని తమ ప్రతినిధులను పంపగలిగిన స్థితిలో వున్నారు. అయినా వీరి బలం ప్రధానంగా బీహార్, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్‌లలో యెక్కువగా కేంద్రీక రింపబడి వున్నది.

ప్రతిపక్షపార్టి రాజకియ అభిప్రాయాలు ప్రణాళికాభివృద్ధికి అనుకూలంగా, వ్యతిరేకంగా అనేక విషయాలపై ప్రధానంగా కేంద్రీకరింపబడుతున్నట్లు కన్పడు తున్నది కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు పార్టీలు కోల్పోయిన సీట్లు ప్రణాళికా వ్యతిరేక పార్టీయైన స్వతంత్రపార్టి పొందగలిగింది. ప్రజాభిప్రాయం ప్రణాళికా వ్యతిరేకత వైపు అభివృద్ధి చెందుతున్నట్లు కన్పడుతున్నది.

కేంద్రంలో స్వతంత్రపార్టి, జనసంఘాలు గెలచిన 32 మంది, కమ్యూ నిస్టులు గెలచిన 35 మందికి సమీపంగానే వుంది. తీవ్రమిత్రవాద అతివాద వర్గాల ప్రాతినిధ్యం పార్లమెంటులో సమాన బలంలోనే వున్నాయి.

ఎన్నికలలో మితవాద వర్గాలు 24 స్థానాలు కోల్పోయాయి. అందులో ప్రజా సోషలిస్టు పార్టీ 8 స్థానాలను కోల్పోయింది. రాష్ట్ర అసెంబ్లీలలో సైతం కాంగ్రెసు వొక్క మహారాష్ట్రంలో తప్పితే మిగతా అన్ని రాష్ట్రాలలో పోలు చేసుకొన్న ఓట్లు తగ్గిపోయాయి. ప్రజాసోషలిస్టుపార్టీ అన్ని రాష్ట్రాలలో పోలైన వోటరుల బలాన్ని కోల్పోయింది, మినహాయింపు మహారాష్ట్ర, గుజరాత్‌లలో కన్పడుతున్నది. కమ్యూ నిస్టుపార్టీ తన ఓటరుల బలాన్ని నిలబెట్టుకొనగలిగింది. పశ్చిమబెంగాల్, గుజరాత్ లలో జనసంఘం తన బలాన్ని పెంచుకొనగలిగింది. అదే కాలంలో స్వతంత్రపార్టీ బీహార్, రాజస్థాన్, గుజరాత్‌లలో పెంచుకొనగలిగింది.

రాష్ట్రం అసెంబ్లీ ఎన్నికల సరళిలో స్థానిక సమస్యలే ప్రాధాన్యత వహిం చుతున్నట్లు స్పష్టమగుచున్నది.

కాంగ్రెసు నాలుగు రాష్ట్రాలలో మినహా అన్ని రాష్ట్రాలలో నూటికి 50 శాతం కంటే తక్కువగానే పార్లమెంటు ఎన్నికలలో ఓట్లు పొందింది. అనగా కాంగ్రెసు మైనారిటి ఓటరుల బలంపైనే ఆధారపడి పాలించుచున్నది, ఇది సుస్పష్టం. అసెంబ్లీ, పార్లమెంటు స్థానాలలో మెజారిటి వుండుట వేరు, ఓటరుల బలాన్ని 50 శాతం కంటె తక్కువగా వున్నా,70 శాతపు స్థానాలను పొందగలిగింది. ఇది ఎన్నిక

విధానం ప్రజాభిప్రాయాన్ని వాస్తవంగా ప్రతిబింబించుట లేదనుటను స్పష్టంచేసి, అందులోని వైరుధ్యాన్ని బట్టబయలు చేస్తుంది. అందువల్లనే అతివాద పార్టీలన్నీ, పోలైన ఓటరుల బలంపైన ఆధారపడిన దామాషా ప్రాతినిధ్యం పార్లమెంటు, అసెంబ్లీలలో వుండాలని కోరుతున్నారు. ఆ విధంగా ఎన్నికల విధానంలోని వైరుధ్యానికి ప్రజాస్వామ్య పరిష్కారాన్ని సూచించుచున్నారు. బూర్జువా పార్టీలు ప్రపంచము మొత్తంగానే కేంద్రంలో బలమైన ప్రభుత్వం వుండాలనే సాకుతో, విజ్ఞమైన ప్రజాస్వామిక దామాషా నిష్పత్తిలో అభ్యర్థుల కేటాయింపు ఎన్నికల విధానాన్ని వ్యతిరేకించుచున్నవి.

## ఎన్నికల ఫలితాలపై అభిప్రాయ భేదాలు :

ఎన్నికల పోరాటంలో వ్యూహం, ఎత్తుగడలను ఆచరణలో ఎన్నికల ఐక్య సంఘటనలను రూపొందించుటలో భేదాభిప్రాయాల వలెనే ఎన్నికల ఫలితాలను అంచనా వేయుట, పాఠాలను, నిర్ధారణలు చేయుటలో వైరుధ్య వైఖరులు స్పష్టమైనాయి. అభిప్రాయ భేదాభిప్రాయాలు, జాతీయ సమితికి సమర్పించబడిన రెండు ఎన్నికల ఫలితాల 'సమీక్ష'ల ముసాయిదాలలో వెల్లడయ్యాయి. ఒక సమీక్ష ముసాయిదా భూపేష్‌గుప్త చేతను, మరో సమీక్ష ముసాయిదా పి. సి. జోషీ చేతను జాతీయ సమితికి సమర్పించబడినవి. ముఖ్యాంశాలు యీ క్రింది విధంగా వున్నవి.

కాంగ్రెసు ఎన్నికలలో మితవాద అభివృద్ధి నిరోధకులకు ఎక్కువ సీట్లను కోల్పోవుట, కమ్యూనిస్టు, కాంగ్రెసు నాయకుల మధ్య సత్సంబంధాలు నెలకొనుటకు అనుకూల పరిస్థితులను సృష్టించాయంటూ, జోషీ ముసాయిదా, "ఈ విధమయిన నూతన విధాన మార్పుకు చొరవ కాంగ్రెసులోని వర్గాల నుండి రాదని, ఆ చొరవ పార్టీయే తీసుకోనాలని, కాంగ్రెసు యెడల ప్రజలలో పెరిగిన అసంతృప్తి ప్రథమ, ద్వితీయ ఎన్నికలలో కమ్యూనిస్టు బలాన్ని పెంచుటలో ప్రతిబింబించుచున్నదనే కారణంగా, వొంటెత్తు విధాన చీకటిగూడులోనికి పోరాదని, ఫలితంగా మితవాద వర్గాల బలాన్ని ఓటరులు పెంచుట స్పష్టమయింది. ఆ కారణంగా పార్టీ తన అస్తిత్వాన్ని కాపాడుకొనుటకే నూతన వైఖరి అవలంబించాలని, ఎంత తొందరగా ఆ పని చేస్తే, అంత బలాన్ని పార్టీ సంపాదిస్తుందని" అని కాంగ్రెసు యెడల అవలంబించవలసిన విధానాన్ని సూచించారు.

పార్టీ కర్తవ్యాలను గురించి జోషీ అదే పత్రంలో యిలా పేర్కొన్నారు. "దీనినుండి, ప్రపధం, కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి ముఖ్య కర్తవ్యం, జాతీయ ప్రజాస్వామ్య సంఘటన ఎత్తుగడలను సరియైన మార్గంలో ఆచరించుచూ, మితవాద, అభివృద్ధి నిరోధక వ్యతిరేక వుద్యమాన్ని కొనసాగించాలి. ఆ విధంగా దీర్ఘకాల వైఖరి, సాహసోపేత పంథానుసరించి భారత ప్రజల అగ్రగామిశక్తిగా ముందుకు

రావాలి. నేడు కథుడుగట్టిన మితవాద అభివృద్ధి నిరోధక శక్తులను, కాంగ్రెసు నాయకత్వాన్ని నెహూ్రి అధ్వర్యంలో వేరుగ చూడజాలక, మితవాద శక్తులను వేరు చేయు ఎత్తుగడలను రూపొందించజాలనిచో, ఎన్నికల తదనంతర పరిస్థితులలో మన బాధ్యత నెరిగి ముందుకు రానిచో మన బాధ్యత మరచిన వారమగుదుము." [1]

మితవాద అభివృద్ధి నిరోధక జాతీయోద్యమంతో కలసి వచ్చే మిత్రుల గురించి, జోషి ప్రస్తావిస్తూ "మితవాద అభివృద్ధి నిరోధక శక్తుల అభివృద్ధిని కాంగ్రెసులోనే నూతన వాతావరణం సృష్టించబడుటను చూడాలి. కాంగ్రెసులోని ఆలోచనాపరులైన పురోగామి శక్తులు అట్టి వాతావరణాన్ని కలుగజేస్తున్నందున, మిత్రులుగ మరింత మందిని సమీకరించవచ్చును. ఎన్నికల తదనంతరం మితవాద అభివృద్ధి నిరోధకుల వ్యతిరేకంగా నెహూ్రి చేసిన ఉపన్యాసాలలో యిది స్పష్టంగా కానవస్తున్నది. మనం వాటి ప్రాముఖ్యతను, పరిమితిని, జాగ్రత్తగా విశ్లేషణ చేయాలి. నెహూ్రి సుముఖ ప్రకటనలను చేబట్టవలసిన అంశంగా నేను తలచుచున్నాను. వాటిని మరింతగా అభివృద్ధి పరచుట మన కర్తవ్యం."

ఇంకా "దేశంలోని శక్తుల నేటి కలయికతో మితవాద అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా మార్పు తీసుకొని రావాలి. ప్రధాన బాధ్యత పార్టీది, తానొక్కటే చేయజాలదు. మిత్రుల కొరకు ప్రయత్నించి, పొందాలి. ఎన్నికలలో మితవాద అభివృద్ధి నిరోధక శక్తుల పురోగమనం పెద్ద వ్యతిరేక నూతనాంశంగా స్పష్టమయింది. కాంగ్రెసులోని కమ్యూనిస్టు వ్యతిరేకత తగ్గిపోయి, నూతన జాగృతి ముందెన్నటికంటె బలమైనదయింది." [2]

"జాతీయ సమితి దృక్పథం, అవగాహన పూర్తిగ సరియైనదైనదని ఋజువైందని" ఎన్నికల ఫలితాల నుండి నిర్ధారణ అయిందని భూపేష్‌గుప్తా నిర్ధారణకు వచ్చారు.

మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు బలపడుట భూపేష్‌గుప్తా నొక్కి చెప్పుతూ, "మత, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులను తక్కువగా అంచనా వేయుటయే గాక, అతిశయోక్తిగా, ఆందోళనకరంగాను పరిగణించరాదు. మొదటిది, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా అన్ని మతాతీత, అభ్యుదయకర శక్తులను సమీకరించే కర్తవ్య నిర్వహణను కుంటుపరచే, ఒంటెత్తు పోకడకు

---

1. రివిజనిజానికి వ్యతిరేక పోరాటం (1965) రాజకీయ, నిర్మాణ నివేదిక, కలకత్తా 7వ, కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) కాంగ్రెసుచే, నవంబరు 7, 1964 న ఆమోదించబడినది. పే. 13 లోని ఉదహరింపు.
2. ........అదే........పే. 13.

దారి తీస్తుంది. రెండవది, కాంగ్రెసు బూర్జువా నాయకత్వం తోకను పట్టుకొని అనుసరించుటకు దారి తీస్తుంది. ప్రజాస్వామ్య ప్రతిపక్ష శక్తుల కంటె మితవాద శక్తులు బాగా బలపడి వేగంగా పెరుగుటను, ఏమయినా ఒప్పుకొనక తప్పదు మన రాజకీయ జీవితంలో, యిది అన్ని విధాల ప్రమాదకరమయిన వైఖరి" [1] అని గుప్తా హెచ్చరించారు.

దశాబ్దం నుండి, కాంగ్రెసుకు వ్యతిరేకంగానా లేక మితవాద వైఖరితో కాంగ్రెసు విధానాలకు వ్యతిరేకించే శక్తులపైనా ఎవరిపై కమ్యూనిస్టుపార్టీ దాడిని కేంద్రీకరించాలనే ప్రశ్న తిరిగి తిరిగి ఎదురయిన దానికి వివరణ లభించింది.

ఒక దృక్పథం ప్రకారం, జాతీయ ఐక్యతకు, ప్రజాస్వామ్యానికి, కార్మికోద్యమానికి అత్యంత ప్రమాదకారిగా రూపొందిన మత, మితవాద అభివృద్ధి నిరోధక విచ్ఛిన్నకర శక్తులకు వ్యతిరేకంగా, "మధ్యేమార్గ వాదులనబడే శక్తులను" ఐక్యముగా సమీకరించే కర్తవ్యాన్ని కమ్యూనిస్టుపార్టీ తన భుజస్కంధాలపై వేసుకొనాలి. ఈ వైఖరివాదుల ప్రకారం, కాంగ్రెసువాదులతో సహా అందరిని, మితవాద అభివృద్ధి నిరోధక, మత, విచ్ఛిన్నకర శక్తుల ప్రయత్నాలను వమ్ము చేయాలి.

మరో దృక్పథం వాదులు దీనిని వ్యతిరేకించుతూ, పెరుగుతున్న మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు మతదురహంకారం వేర్పాటువాదం, పాలకపార్టీ కాంగ్రెసును బలపరచుట ద్వారా నిరోధించజాలము, కారణం పాలకపార్టీ కాంగ్రెసు పార్టీ విధానాలు, ఆచరణే, మత దురహంకార వేర్పాటువాద, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు పెరుగుటకు ప్రజలలో అసంతృప్తిని ప్రజారాజకీయ ప్రాతిపదికను తగిన పరిస్థితులను రూపొందుటకు తోడ్పడుతున్నదని స్పష్టంచేస్తున్నారు.

జాతీయ సమితి తీవ్ర అభిప్రాయాల దృష్ట్యా సాధారణ ఎన్నికల సమీక్ష అధ్యయనాన్ని మరునటి జాతీయసమితి సమావేశానికి వాయిదా వేసింది. అయినా ఒక సంక్షిప్త ప్రకటనను ఎన్నికల ఫలితాలపై ఆమోదించి, జోషీతదితరులు ప్రతిపాదించిన కాంగ్రెసుతో సంయుక్త సంఘటనా దృక్పథాన్ని నిరాకరించింది. పార్టీ కేంద్రకార్య నిర్వాహక సమితి, జాతీయ సమితి ముందుంచిన ఎన్నికల సమీక్షతీర్మానంలో యీ క్రింది విధంగా పేర్కొంది.

"అభివృద్ధి నిరోధక మత విచ్ఛిన్నకరశక్తుల పెరుగుదలకు వ్యతిరేకంగా దృఢ వైఖరి పోరాట అవసరాన్ని పరిస్థితులు నిర్ధారణ చేస్తున్నవి. కాంగ్రెసుదేశంలోని వివిధ ప్రాంతాలలో తన విధానాలతో తన బలాన్ని పెంపొందించుకొనుటకు అనువగు పరిస్థితులను కలుగజేస్తున్నది. ఇంకా జీవనపరిస్థితులు ప్రమాణాలు

---

1. రివిజనిజానికి వ్యతిరేక పోరాటం (1965) రాజకీయ, నిర్మాణ నివేదిక, కలకత్తా 7వ కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) కాంగ్రెసుచే ఆమోదించబడినది. పే. 13.

మరింత అధ్వాన్నమగుటతోపాటు పాలకపార్టీలలో లంచగొండితనం పెరుగుటతో ప్రజా అసంతృప్తి వ్యాపించింది. పెరిగివ్యాపించుతున్న ప్రజా అసంతృప్తి దేశభవిష్యత్తును నాశనం చేసే వాగాడంబర, దౌర్జన్యశక్తులకు సారవంతమైన క్షేత్రమగుచున్నది. వారి చర్యలకు నూతనస్థావరాలను, బలాన్ని చేకూర్చుతున్నది. మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు యీ అవకాశాన్ని తీసుకొని బలపడకుండా, 6వ పార్టీ కాంగ్రెసు సాధారణ పంధాననుసరించి, అభివృద్ధి నిరోధకశక్తుల వ్యతిరేకపోరాటంలో ప్రజా అసంతృప్తిని, ప్రజలపై భారాన్ని అధికం చేసే ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా అన్ని ప్రజాస్వామ్య ప్రజాశక్తులను ఐక్యపరచే కర్తవ్యాన్ని చేబట్టాలని, జాతీయ సమితి నిర్ణయించింది యీ కర్తవ్యంలో పురోగమించాలి[1]."

జాతీయ సమితిలోని అత్యధికులు యీ తీర్మానాన్ని బలపరచుటతో డాంగే తదితరులు ఎన్నికల "పోస్టుమార్టమ్" పరిశీలన అవసరం లేదని వాదించి ఎన్నికల సమీక్షలేకుండా చేసారు.

రెండు దృక్పధాల మధ్య అభిప్రాయభేదాలు మార్చి 1963లో పార్టీ కేంద్ర నాయకత్వం అనేక బై ఎలక్షనులలో "ఎట్టి పరిస్థితులలోను మితవాద అభివృద్ధి నిరోధక వర్గాల విజయాన్ని నిరోధించాలనే" పార్టీ విధానాన్ని అచరించేక్రమంలో తీవ్రమైనవి. ఈ పరిస్థితిని వివరించేముందు, ఏప్రిల్-అక్టోబరులలో భారత్—చైనా సరిహద్దు యుద్ధకారణంగా పార్టీలలో యేర్పడిన అంతర్గత పరిస్థితిని, నాటి రాజకీయ పరిణామాలను పరిశీలించవలసి వుంది.

## V

## సమీక్ష కొన్ని ముఖ్యాంశాలు

1. స్వాతంత్రపోరాటకాలంలో దున్నే వానికే భూమి, ప్రతి వొక్కరికి వుద్యోగం తిండి బట్టనివాసం, కనీస అవసరాలు వాగ్దానం చేసి అధికారంలోనికి వచ్చి 14 సంవత్సరాలు అయినా పాలకపార్టీ జాతీయ కాంగ్రెసు వాటిని నెరవేర్చుటలో విఫలమైంది. సమగ్ర పథకాల అమలు శూన్యమైంది.

బ్రిటిష్, దౌర్జన్య ప్రత్యక్షదోపిడి అంతమైనా వారి, వారి అమెరికన్ మిత్రుల "గ్రాండ్ దోపిడి" పరోక్షంగా సాగుతూనేవుంది. యుద్ధకాలంలో కనీస అవసరాలు నోచుకోని ప్రజల కష్టాల ఫలితంగా యేర్పడిన 1686 క్రోట్ల స్టెర్లింగు నిల్వలులో

---

1. రివిజనిజానికి వ్యతిరేకపోరాటం (1965) రాజకీయ నిర్మాణ నివేదిక కలకత్తా 7వ, కమ్యూనిస్టు (మార్క్సిస్టు) పార్టీ కాంగ్రెసు నవంబరు 1964లో ఆమోదింబడినది పే. 14.

అధికభాగం బూర్జువా వర్గ విలాస వస్తువుల దిగుమతులకే ఖర్చుకాగా, పారిశ్రామి కాభివృద్ధి కుంటుపడింది. అమెరికానుండి ఆహారపదార్థాల దిగుమతులకు వినియో గించవలసి వచ్చింది. స్టెర్లింగు నిల్వలు కరిగిపోయిన 'వెలగపండు' చందమైంది, మన విదేశవ్యాపారం 1958-60లలో 1139.72 కోట్లు అత్యధిక భాగం బ్రిటిష్‌చేతులలోనే వుంది. మనకు విదేశీ కరెన్సీని సంపాదించే తేయాకు పుగాకు జూట్ ఆయిలు విదేశీ యుల చేతులలోనే వున్నవి. లాభాల ఎగుమతి నిరాటంకంగా జరుగుతునే వుంది. విదేశీ భారత జాయింటుగా 100కు పైగా పారిశ్రామిక సంస్థలు యేర్పడినవి.

పశ్చిమదేశాలతో పోల్చిన భారత బడా-గుత్త పెట్టుబడి వర్గాలు "మరిగుజ్జు" లైనా పైస్థాయి 1 శాతపు మూడు కంపెనీలు 47. 8 శాతం పెట్టుబడి కలిగి ప్రపం చంలో యెక్కడా లేనంతటి పెట్టుబడి కేంద్రీకరణ జరిగింది. ప్రభుత్వం నుండి యీ కంపెనీలు అన్నిరాయితీలను యథేచ్ఛగా పొందుతున్నవి.

ఆహార పదార్థాల దిగుమతులను పి. యల్. 480 క్రింద 10,963 మిలయను రూపాయల విదేశీ కరెన్సీని వినియోగిసుచుట, అభ్యుదయ వ్యవసాయ సంస్కరణలు చేసి, వుత్పత్తి శక్తులను విముక్తి చేయవలసిన అవసరాన్ని, 11 రాష్ట్రాలలో కౌలు దారుల రక్షణ చట్టాలు చేసినా అమలులోని వైఫల్యతను స్పష్టం చేస్తుంది. ప్రణాళికా సంఘపు సూచనలను చట్టాలు, రాష్ట్ర ప్రభుత్వాలు పాటించలేదు.

మన ఆర్థిక అభివృద్ధి 'నత్తనడక'లో, అవాంతరాలకు లోనగుతున్నది. జాతీయ ఆదాయం సాలుకు 3 శాతానికి తక్కువగా, తలసరి ఆదాయం పెరుగుదల రేటు 2 శాతానికి తక్కువగా వున్నందున, తలసరి ఆదాయం రెట్టింపు అగుటకు 50 సంవత్సరాలు పడుతుంది ఈ జాతీయ ఆదాయ పెరుగుదలను కొద్దిమందియైన గుత్తపెట్టుబడి పారిశ్రామికులు, భూస్వాములు పై వర్గాలలోనివారే పొందుతున్నారు.

కాంగ్రెసు ప్రభుత్వం నెహూ్రా నాయకత్వంలో వూగిసలాటలకు లోనగు తున్నా సామ్రాజ్యవాద, యుద్ధ వ్యతిరేక, నిరాయుధీకరణ, ప్రపంచశాంతి, "పంచ శీల" మార్గాన్ని చేబట్టింది. ప్రజలలో అభివృద్ధి చెందుతున్న సోషలిస్టు భావాలను చూసి ఎత్తుగడగా కాంగ్రెసు సోషలిజం ధ్యేయంగా ప్రకటించింది. కమ్యూనిస్టులు కాంగ్రెసును సోషలిస్టు నిర్మాణం చేయుటలేదని విమర్శించరు", వలస అవశేషాలను అంతంచేసి జనజీవన పరిస్థితిని మెరుగుపరచుటలేదని మాత్రమే, కార్మికవర్గ నాయ కత్వంలోనే సోషలిజం సాధ్యమని తెలుసు

ఫెడరల్ రాజ్యాంగంలో రాష్ట్రాలకు గల అధికారాలను, వనరులను ప్రభు త్వము యివ్వ నిరాకరించుట, అన్ని వర్గాలలో కాంగ్రెసుతో పరా అసంతృప్తిని కలుగజేసింది. కాంగ్రెసు కేరళలో ప్రజాస్వామ్య వ్యతిరేక దౌర్జన్య విధానాలను చేబట్టి, ముస్లింలీగు, క్రిష్టియన్ మత సంస్థలతో "అపవిత్ర కూటమిని" ఏర్పరచి

చట్టరీత్యా ఏర్పడిన ప్రభుత్వాన్ని, చట్ట వ్యతిరేకంగా "ప్రజావెల్లువనే" సాకుతో భూ సంస్కరణలు, విద్యాబిల్లు ప్రవేశపెట్టిన రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దు చేయించింది. తదనంతర ఎన్నికలలో కమ్యూనిస్టులు దాని మిత్రులు కలసి 43.8 శాతపు వోలైన వోట్లలో పొందుట ప్రభుత్వ వాదనలోని పసను తెలియజేస్తుంది. అత్యధిక భాగం శ్రామిక, కర్షకుల యొట్టి విస్మాణంలో సమీకరించబడలేదు. పార్టీ వర్గాలలో రాజకీయ, సైద్ధాంతిక స్థాయి చాల తక్కువగా వుంది. ఇండియా-చైనా సరిహద్దు వివాదం దేశములో కమ్యూనిస్టు వ్యతిరేకులకు బలమైన పూపునిచ్చింది.

కలకత్తా ఆహార ఆందోళనలో, పంజాబ్ లెవీ వ్యతిరేక ఆందోళనలో, మద్రాసు గరిష్ట భూముల పరిమిత విధయ ఆందోళనలో, ప్రభుత్వ హింసా, దౌర్జన్య కాండకు అంతేలేకుండాపోయింది. అందుకే రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ నవంబరు 1960 లో గవర్నర్ల సమావేశంలో "బ్రిటిష్ పాలనలో కంటె అధికంగా పోలీసు కాల్పులు జరిగాయి" అని, "దేశం మొత్తం మీద ఇండియన్ పోలీసు శక్తి చేసినన్ని రికార్డు నేరాలను చేసిన చట్ట వ్యతిరేక సంస్థ యే వొక్కటీ లేదని" జస్టిస్ ముల్లా పోలీసులపై వ్యాఖ్యానించారు.

కాంగ్రెసు కేంద్రంలో గుత్తాధికారాన్ని కలిగి వుంది. ఐక్యతాభివృద్ధికి అవకాశాలున్నవి. తద్విరుద్ధంగా, కాంగ్రెసు విధానాల వలన ఐక్యత విచ్ఛిన్నమై, మత, కుల, ప్రాంతీయ, భాషాతత్వాలు విజృంభించాయి. పండిట్ నెహ్రూ "మత దురహంకము, ఏవిధ పాసిస్టు రూపాలకు సారూప్యత కలిగి వుందని, యిది భారతదేశ పాసిస్టు రూపమని" పేర్కొని, కేరళలో కాథలిక్, ముస్లిం మతతత్వ దురహంకార శక్తులతో కాంగ్రెసు కలసి, కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా కలుగజేసిన అల్లకల్లోలాన్ని, ప్రజావెల్లువగా పేర్కొని, ప్రభుత్వాన్ని రద్దు చేయుటలోని ఔచిత్యాన్ని మరే ప్రజాస్వామ్యవాదికి అర్థంకాదు.

కాంగ్రెసు, ప్రజాసోషలిస్టుల పుణ్యాన కేరళలో మతతత్వాభివృద్ధి ఫలితంగా, అనేక రాష్ట్రాల ముస్లింలీగు పునరుద్ధరణ, అది హిందూమతతత్వాన్ని పెంచి ముస్లింలకు తీరని నష్టాన్ని కలుగజేసింది. పంజాబ్‌లో మరో అకాలీ మతతత్వశక్తి అభివృద్ధికి తోడ్పడింది.

కాంగ్రెసు ప్రభుత్వం నిత్యావసరాల ధరలు కంట్రోలు చేయుటలోని వైఫల్యముతో ప్రజల జీవితం దుర్భరమై, జంషెడ్‌పూర్ టాటా, ఐరన్, స్టీల్ కార్మికుల, రేవు కార్మికుల, కేంద్ర ప్రభుత్వోద్యోగుల, గుడ్డల మిల్లు కార్మికుల సమ్మె పోరాటాలలో ప్రభుత్వ హింసాయుత దౌర్జన్యకాండ వ్యక్తమైంది.

కార్మికవర్గ అనైక్యతా ఫలితాలను ప్రత్యక్షంగా అనుభవించిన కార్మికులు "జాయింటు కౌన్సిల్ ఆఫ్ యాక్షన్", "ట్రేడు యూనియనుల సమిష్టి కార్యాచరణ సమితి", "కేంద్ర ప్రభుత్వోద్యోగుల ఫెడరేషన్‌ల సమిష్టి కార్యాచరణ సమితి"

వంటి పోరాట సమితుల రూపాలను రూపొందించుకొన్నారు. ఈ పోరాటాల నుండి అనుభవాలను భవిష్యత్ పోరాటాలలో వినియోగించుట సహజము. వేరు వేరు యూనియనుల ఐక్యత, సమిష్టి కార్యాచరణ గతంలో కంటె పురోగమించింది. ఒక పరిశ్రమలోని యూనియనులు, వివిధ రాజకీయ పార్టీల ప్రభావాలలో వున్నా అవన్నీ కలిసి ఫెడరేషనులుగా ఏర్పడు విధానం పురోగమించింది. ఫెడరేషనులలో అభిప్రాయ భేదాభిప్రాయాలున్నా, పోరాట క్రమంలో కార్మికవర్గ ఐక్యతా అవకాశాలు మెరుగు అయ్యాయి.

ఈ కాలంలో పంజాబ్ రైతుల లెవీ వ్యతిరేక పోరాటం, గరిష్ట పరిమితికి మించిన భూములను రైతులు స్వాధీనం చేసుకొనుటకై పశ్చిమబెంగాల్ రైతుల పోరాటాలు, బీహార్‌లో ఆహార సంక్షోభంతో సామూహిక నిరాహారదీక్షలు, ప్రదర్శనలు, కేరళలో వ్యవసాయ సంస్కరణ బిల్లుకు రాష్ట్రపతి ఆమోదానికై జరిగిన మహోద్యమం, ప్రధాన రైతాంగ పోరాటాలు.

2) మాస్కో 1957 ప్రకటన స్ఫూర్తితో, భారత కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ సూత్రాలలో "సోషలిజాన్ని శాంతియుత మార్గాలలో సాధించుటకు ప్రయత్నం చేస్తుంది" అని పేర్కొని తదితర వివరణ చేర్చారు. చైనాపార్టీ 1957 లోనే పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనను ఆమోదించక, వొక పత్రాన్ని సమర్పించింది. తిరిగి 1960 మాస్కో సమావేశంలో "పెట్టుబడిదారి విధానము సోషలిజంలోనికి పరివర్తన శాంతియుత" మార్గాన్నేగాక "శాంతియేతర మార్గాన్ని కూడ వుదహరించుట చైనాపార్టీ చొరవతోనే జరిగింది. అంతేగాక "శాంతియుత పరివర్తనావకాశాలను పేర్కొనుటలో ఎత్తుగడల సౌలభ్యం వున్నది. కాని, దానిని నొక్కి చెప్పుట కమ్యూనిస్టులను నిరాయుధులను చేస్తుంది. బూర్జువా వర్గం స్వచ్ఛందంగా చారిత్రికాధికార దశనుండి నిష్క్రమించదు. విప్లవ ప్రతిఘాతక శక్తుల ప్రతిఘటనను, దాడులను త్రిప్పికొట్టుటకు విప్లవశక్తులు సర్వసన్నద్ధంగా వుండి, అన్నివిధాల విప్లవాన్ని రక్షించగలగాలి. శాంతియుత పరివర్తనను, పార్లమెంటరీ మెజారిటీ పరివర్తనగానే వివరించరాదు. పార్లమెంటులో మెజారిటీ సంపాదించుట ప్రభుత్వ యంత్రాంగాన్ని, సైనికశక్తిని నిర్వీర్యంచేయుట, నూతన రాజ్యాంగాన్ని, సైనికశక్తిని నిర్మించుట వొకటిగాదు బూర్జువా పాలక యంత్రాంగాన్ని ధ్వంసం చేయకుండా, కార్మికవర్గం పార్లమెంటరీ మెజారిటీ, మిత్రులు లభించుట, కొనసాగుట అసాధ్యం, ఆధారపడ తగినదికాదు. విప్లవోద్యమాల అనుభవమిది.

3) భారతదేశం 1947 లో చైనా 1949 లో విదేశ సామ్రాజ్యవాదుల నుండి స్వాతంత్ర్యాన్ని సంపాదించాయి. భారత ప్రభుత్వం చైనాను అధికారికంగా 1949 డిసెంబరులో గుర్తించింది. అదే విధంగా భారత-టిబెట్‌ల మధ్య ఏప్రిల్ 1954 లో జరిగిన వొడంబడికలో, టిబెట్ చైనాలో భాగంగా గుర్తించింది, ఐక్యరాజ్యసమితిలో

చైనా స్థానాన్ని పునరుద్ధరించుటకు సామ్రాజ్యవాద దేశాలతో ఎడతెగకుండా పోరాడు తున్నది. భారత సరిహద్దులపై 1950 లోనే భారత ప్రధాని స్పష్టమైన అధికార ప్రకటన చేశారు. చైనా ప్రభుత్వం 1954 లో సరిహద్దు సమస్యలను లేవనెత్తకపోగా భారతదేశ ప్రాదేశికత్వాన్ని, సార్వభౌమాధికారాన్ని గౌరవించగలనని వాగ్దానం చేసింది. చైనా ప్రధాని చౌయెన్‌లై 25 జూన్ 1954 భారతదేశ సౌహార్ధయాత్ర వచ్చి, సంభాషణల అనంతరం భారత-చైనా ప్రధానులు "పంచశీల సూత్రాలను పున రుద్ఘాటించుచు సంయుక్త ప్రకటన చేసారు.

ఉత్తరప్రదేశ్‌లోని బారాహోతిలో భారతీయ సైన్యాల వునికిని, చైనా ప్రభు త్వము 7 జులై 1954 లో గర్హించింది. చైనా భారత భూభాగంలోని ఏ భాగంపై నయినా ప్రప్రథమంగా తమ హక్కును తెలుపుట యిదే. సాంప్రదాయ హద్దుపై ఎట్టి అసందిగ్ధతలేదు. ఈ సరిహద్దులను అధికార మ్యాపులు సూచించుతునే వున్నవి. బారాహోతి తమదని చెప్పుట, తెలియక చేసిందని భారత ప్రభుత్వంతలచింది, అది యెక్కడున్నది వారికి తెలిసి వుంటదని యెంచింది. భారత సైన్యాలు టిబెట్‌లోనికి చొరబడిసనుటను అపవాదుగనెంచి గర్హించుతు, భారతప్రభుత్వం 'నోటును' పంపుతు, చైనా సైన్యాలు టిబెట్‌లోని 'నితిలోయ' దక్షిణానవున్న బారాహోతిలోని సరిహద్దునుదాటి, సాంప్రదాయంగా వున్న భారతభూభాగంలోనికి వచ్చుటకు చేసిన ప్రయత్నాన్ని గర్హించింది. అయినా ఐక్యరాజ్య సమితిలో చైనా సభ్యత్వాన్ని ప్రతి పాదించుటను నిరవధికంగా కొనసాగించింది.

ఈ విధంగా ప్రారంభమైన సరిహద్దుల వివాదం, అతిక్రమణలు, ప్రతి అతి క్రమణలు, 1959-62లలో రెండు వైపులా సైనిక చెక్‌పోస్టులను యేర్పాటు చేయు 'చదరంగపు ఆట' కొనసాగినందున పరిస్థితులు క్షీణించసాగాయి.

భారత కమ్యూనిస్టుపార్టీ టిబెట్ చైనా విధానాన్ని, బలపరుస్తూ, భారత దేశంలో కొందరు, సామ్రాజ్యవాదులు అభివృద్ధి నిరోధకుల పితూరీని, "జాతీయ తిరుగుబాటుగ" చిత్రించుటను గర్హించింది. హిమాలయాలలో భారత చైనా సరిహద్దు దళాల మధ్య సంఘర్షణ దురదృష్టకరము, విచారకరమని పార్టీ కార్యవర్గం 30 ఆగస్టు1959న ప్రకటించింది. ప్రధానినెహ్రూ 22 మార్చి 1959న చౌయెన్‌లైకి లేఖ వ్రాయుట, చైనా జాతీయ ప్రజా కాంగ్రెసు స్టాండింగు కమిటి 13, సెప్టెంబరు 1959 తీర్మానాంశాలు, సంప్రదింపులు ద్వారా రెండు దేశాలు సరిహద్దులలో శాంతి నెలకొ ల్పుటకు చేయు ప్రయత్నాలను హర్షించింది.

భారత కమ్యూనిస్టుపార్టీ నవంబరు 1959 కేంద్ర సమితి తీర్మానంలో "భారత చైనా సంబంధాలు దిగజారుటకు విచారిస్తూ "రెండుదేశాలు" పంచశీల "సదవగాహన విడనాడి, స్నేహపరిస్థితిపోయి, పరస్పర అనుమానం, అపనమ్మకం" యేర్పడుట, "రెండు దేశాలకు నష్టదాయకమేగాక, ప్రపంచశాంతికి ప్రమాదకరమని" స్పష్టంచేసి

"దీనిని అవకాశంగా తీసుకొని" దేశ, విదేశ అభివృద్ధి నిరోధకులు "చైనా ద్వేష ప్రచారాన్ని" మొదలు పెట్టారంది. ఇంకా "తూర్పు ప్రాంతంతో పరస్పరం ఆమోదం పొందిన సరిహద్దు లేకపోవుట దురదృష్టకరము, పశ్చిమ ప్రాంతంలో సాంప్రదాయక సరిహద్దు అస్పష్టంగాను, నిర్ణయింపబడకుండుట వలన దురాక్రమణ నిందా, ప్రతినిందలకు అర్థంలేదు, ప్రమాదకరం" కమ్యూనిస్టు ప్రాదేశిక సమగ్రతకు, గట్టిగా నిలబడుతుంది, అన్ని వాదనలు సమగ్రంగా పరిశీలించి, వాస్తవాంశాలను పరిగణించిన, సరిహద్దుల నిర్ణయం, పరిష్కారం సాధ్యమని పార్టీ విశ్వసించుచున్నదని స్పష్టం చేసింది. "ప్రధాన మంత్రు లిరువురూ సమావేశమై సరిహద్దు సమస్యను పరిష్కరించాలని, భారత-చైనా శాంతిప్రియులు కోరుతున్నారు." అనికూడ తెల్పింది. ఏప్రిల్ 1960లో భారత-చైనా ప్రధానమంత్రులు సమావేశమై సంభాషణలు జరుపుట సంతృప్తిని వెల్లడించింది. భారత-చైనా స్నేహ సహకారం ప్రపంచానికి 'పంచశీలను' ప్రసాదించి. బాండుంగు దృక్పధాన్నిచ్చి, ఆఫ్రికా ఆసియా పూర్తి చరిత్ర గతిని మార్చి, విస్తృత ప్రపంచశాంతికి తోడ్పడిందని తీర్మానం స్పష్టం చేసింది. శాంతియుత సంభాషణలను బలపరుస్తూ, పరిష్కారానికి తగిన వాతావరణాన్ని కలుగజేయండని తీర్మానం ప్రజలకు విజ్ఞప్తి చేసింది.

ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల 1960 సమావేశంలో భారత-చైనా సరిహద్దు వివాదంలో భారత కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయాల క్రమాన్ని వివరించి "మేము చైనా కామ్రేడ్స్ శాంతియుత సహజీవనాన్ని ఆమోదించి, కరుడు గట్టిన సామ్రాజ్యవాదులను వేరుచేసి, మిత్రులను అధికంగా పొందగలుగుతుందని ఆశించుతున్నాము అని అజయ్ వుపన్యసించారు. చైనా కామ్రేడ్స్‌కు మేము మే 3, 5, తేదీలలో వ్రాసిన లేఖలలో చైనా టిబెట్ విధానాన్ని బలపరచి, సరిహద్దులోని భారత్‌కు చెందిన కలింపాంగ్, తిరుగుబాటు దారుల "నాయకత్వకేంద్రం" "భారత్ విస్తరణ వాదులు దలైలామాను "ఖైదీగా" చేసి, "బ్లాక్ మెయిల్" చేస్తున్నారనుట అవాస్తవం, అసత్యాలు "మేము నెహ్రూ-చౌయెన్‌లైలు కలవాలనే నినాదాన్ని యివ్వబోతున్నామని సూచించాము. పైనివాదం సరియైనదికాదని, "భారత విస్తరణ వాదులు, కలింపాంగ్ తిరుగుబాటుదారుల నాయకత్వ కేంద్రం" అన్నది అవాస్తవం, అసత్యమన్న దానికి ఎట్టి ప్రత్యుత్తరం లేదు.

"చైనా కామ్రేడ్స్ తీవ్రమైన తప్పిదాన్ని చేస్తున్నారని మేము తలచాము, వ్యక్తిగతంగా యీ విషయాన్ని చైనా రిపబ్లిక్ 10వ జయంతి వుత్సవాల సందర్భంలో చర్చించాము. చర్చలు నిర్మొహమాటంగా జరిగాయి, మొత్తం మీద ఫలవంతమైనా, భారతదేశ పరిస్థితి, నెహ్రూ ప్రభుత్వ అంచెనాలలో పెద్ద భేదాభిప్రాయాలున్నవి. పరస్పర సంబంధాలను మెరుగుపరచుకొనుటకై తీసుకొనవలసిన చర్యలపై విస్తృత ఆమోదం కుదిరింది. చైనా పత్రికలలో పరుష ప్రచారాన్ని

ఆసియేసి ఢిల్లీ ప్రపంచ వ్యవసాయ ప్రదర్శనలో చైనా పాల్గొంది. నెహ్రూ-చౌయెన్‌లైలు కలుసుకోమటకు భారత్ చొరవను ప్రదర్శించింది.

4) సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 22వ కాంగ్రెసు అక్టోబరు 1960 చివరలో జరిగింది. మాస్కో 1957 ప్రకటనకు, 1960 ప్రపంచపార్టీల సమావేశపు అవగాహనలకు మరింత పరిపూర్ణత చేకూర్చాయి.

యూరపులో సోషలిస్టు విప్లవ విజయాలు ప్రపంచ వలసవిముక్తి వుద్యమాల విజయాలు సోషలిస్టు వ్యవస్థ యేర్పాటుకు దారి తీసింది. ప్రపంచ జనాభాలో మూడవ వంతు సోషలిస్టు జీవితాన్ని నిర్మిస్తున్నారు. ఈ యుగధర్మం పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన,రూప వైరుధ్య సమాజాల అంతిమ పోరాటం ప్రారంభమైంది.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ దేశాలమధ్య నూతన ఆర్థిక, రాజకీయ సంబంధాలను రూపొందించి, ఆర్థిక, శాస్త్రసాంకేతిక సహకార ఆర్థిక ప్రణాళికలను సమన్వయపరచి, వుత్పత్తుల సంలీన క్రమంలో నూతన అంతర్జాతీయ సవిభజన, నూతన సోషలిస్టు అంతర్జాతీయ ఆర్థిక విధానం రూపొందుతున్నది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ పెట్టుబడిదారి విధానంపై ఆర్థికాభివృద్ధి పోటీలో మొత్తంగా త్వరలో అధిగమించుచున్నది. నూతన ప్రపంచంలో నూతన సమాజ నమూనాలు విస్తృత ప్రాంతాలలో శ్రామికశక్తి సాహసాలతో నిర్మింపబడుతున్నవి. "సామ్రాజ్యవాదం క్షీణించి, పెట్టుబడిదారి విధానం మరణావస్థలో వున్నది ప్రపంచపెట్టుబడిదారి వ్యవస్థ మొత్తంగాపండి, కార్మికవర్గ సామాజిక విప్లవాలకు సిద్ధంగా వుంది."

బూర్జువా విధానం, ప్రజాస్వామ్యాన్ని స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సమానత్వ నినాదాలు వినాదాలతో చరిత్ర పుటలలోనికి నెట్టివేసింది, అధికారాన్ని చేబట్టింది. నినాదాలు ఆచరణలో శూన్యమైనందున వర్గ పోరాటాలలో మునిగిపోయింది. అక్టోబరు విప్లవంతో సామ్రాజ్యవాదంలో సామాన్య సంక్షోభం ప్రారంభమై, యుద్ధానంతర సోషలిస్టు విప్లవ విజయాలతో ప్రపంచ సామ్రాజ్యవాద సంక్షోభం మూడోదశకు చేరింది, దీని అభివృద్ధి యుద్ధంతో ముడివడి వుండక పోవుట ప్రధాన లక్షణంగా వుంది.

నేడు సామ్రాజ్యవాదానికి, సోషలిజానికి మధ్యగల వైరుధ్యమే ప్రధానమైనది పెట్టుబడిదారి ప్రపంచాన్ని తీవ్ర సంక్షోభం గురిచేయగా, అంతర్జాతీయ గుత్తపెట్టుబడిదారి ప్రభుత్వం సంస్థలను సంలీనంతో సంక్షోభాన్ని,మార్కెట్టు సమస్యను పరిష్కరించ జాలకపోగా, ప్రపంచ మార్కెట్టును తిరిగి విభజించే మరోరూపాంతరమే ప్రపంచ బూర్జువా ఆర్థిక వ్యవస్థ నిర్మాణ ప్రయత్నాలు.

ప్రపంచంలో జాతీయ విముక్తి విప్లవోద్యమాల తుఫాన్ వలసవిధానానికి

39)

చరమ గీతం పాడుతున్నది. నూతన స్వతంత్ర దేశాలు, ప్రపంచ సామ్రాజ్యవాద "గ్రామసీమలుగా" అర్థవలస వోపిడికి గురి అగుతున్నది. వలసలను, అర్థవ్యవలను పెట్టుబడిదారి పరిధిలో, ఆధారిత స్థితిని శాశ్వతంగ కొనసాగించుటకు సామ్రాజ్యవాదం, నియో వలస విధానాన్ని అవలంభించుచున్నది. అమెరికా ప్రపంచ నియో వలస విధానానికి కంచుకోట.

నూతన స్వాతంత్ర్య దేశాల ఆర్థిక, సామాజికాభివృద్ధికై జరుగు పోరాటాభివృద్ధికి మౌలికంగా కార్మిక, కర్షక వర్గ ఐక్యత అవసరం. ఈ ఐక్యత విస్తృత జాతీయ ఐక్య సంఘటనకు పునాది అగుతుంది. జాతీయ సమాజాభివృద్ధికై జరుగు పోరాటంలో కార్మికవర్గం స్థిరమైన పోరాటశక్తి, కార్మిక కర్షక ఐక్యతా బలంపై జాతీయ బూర్జువావర్గం, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పోరాటంలో పాల్గొనుట ఆధారపడి వుంటుంది. జాతీయ ఐక్యసంఘటన కార్మిక, కర్షక, జాతీయ బూర్జువా వర్గాల, ప్రజాస్వామ్య మేధోవర్గాల కలయిక తోడ్పడుతుంది.

జాతీయ బూర్జువావర్గం ద్వంద వైఖరి గలది. నూతనపరిస్థితులలో సామ్రాజ్యవాదంతో ఎట్టి సంబంధంలేని జాతీయ బూర్జువర్గం సామ్రాజ్యవాద ఫ్యూడలువ్యతిరేక కర్తవ్యాల నిర్వహణలో వాస్తవంగా పాల్గొనే పాత్ర, కోరిక గలది. అత్యవసర జాతీయ సమస్యల పరిష్కారానికి దాని అభ్యుదయకరపాత్ర, పాల్గొనే శక్తి అంతం కాలేదు. కాని శ్రామికవర్గాల ధనికవర్గాల మధ్య వైరుధ్యం పెరిగినకొలది వర్గపోరాటం తీవ్రమైనకొలది సామ్రాజ్యవాద దేశీయ అభివృద్ధి నిరోధకశక్తులతో జాతీయ బూర్జువా వర్గం రాజీపై ఖరి నవలంభించుతుంది.

దాస్యశృంఖలాలనుండి బయటపడినదేశాలు అనుసరించవలసిన మార్గం ప్రజలే నిర్ణయించుతారు. ప్రపంచశక్తుల నేటి సమతూకంలో, సోషలిస్టు వ్యవస్థనుండి లభించగల మద్దతును, అవకాశాలను పరిగణించి,తమ ప్రయోజనాల దృష్టిలో వారే నిర్ణయించుకొనగలరు. వర్గశక్తుల బలం, ప్రజాస్వామ్య, కార్మిక కర్షక వుద్యమ బలం పెట్టుబడిదారేతర మార్గాభివృద్ధిని సుస్థిరం చేయగలదు. అత్యధిక ప్రజాసామాన్య ప్రయోజనాలను పరిరక్షించగలదు.

"నూతన స్వాతంత్ర్యదేశాల, సోషలిస్టుదేశాల ప్రజలు సంయుక్తంగా యుద్ధ వ్యతిరేక, ప్రపంచశాంతి పోరాటంలో ప్రధానశక్తులు. ప్రపంచ ప్రజల ఆకాంక్షను శక్తిని యీ సంఘటన వ్యక్తం చేస్తున్నది. సామ్రాజ్యవాద దురాక్రమణను త్రిప్పి కొట్టగల శక్తిని కలిగి వున్నవి."

ప్రపంచంలో నేడు బూర్జువా కమ్యూనిస్టు సిద్ధాంతాల మధ్య తీవ్ర పోరాటం జరుగుచున్నది. మానవజీవనంలో పెట్టుబడిదారి విధానం సోషలిస్టు పరివర్తనలో యిది ప్రతిబింబించుచున్నది. చరిత్ర పరీక్షలో బూర్జువా సిద్ధాంతాలు, దృక్పధాలు నిలువబడజాలక పోయాయి. జీవితంలోని సమస్యలకు అవి శాస్త్రీయ సమాధానాలను

ఇవ్వలేదు. చారిత్రిక అనుభవం సోషల్ డెమోక్రసీ సిద్ధాంత,విధానాల వైఫల్యాన్ని స్పష్టం చేసింది. సంస్కరణవాద పార్టీలు అధికారంలోనికి వచ్చినా గుత్త బూర్జువా వర్గాలను కాదని యేమీ చేయజాలకపోయాయి. వారి కమ్యూనిస్టు వ్యతిరేకత సోషల్ డెమోక్రసీని నిర్వీర్యం చేసింది. సోషల్ డెమోక్రసీ రాజకీయ, సైద్ధాంతిక సంక్షోభానికి ప్రధాన కారణమిదే.

శాంతియుత సహజీవనం, శాంతియుత పరివర్తన శాంతియుత పోటీ, ప్రపంచ శాంతి సోవియట్ కమ్యూనిస్టుపార్టీధ్యేయం. కర్తవ్యం విదేశాంగవిధానలక్ష్యం శాంతిని పెంపొందించుట, మానవజాతి మారణహోమం, యుద్ధనివారణ, దేశాల మధ్య సహజీవన సంబంధాలు పెంపొందించుట, ప్రపంచసోషలిస్టు సమాజ నిర్మాణం ప్రధాన ఆశయం,లక్ష్యం. శాంతియుత సహజీవనమంటే అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికి యుద్ధమార్గాన్ని నిరశించుట, పరస్పర అవగాహన సమానత్వం,విశ్వాసం సంప్రదింపుల ద్వారా వివాదాల 'పరిష్కారం పంచశీల సూత్రాలు' పాటించుట.

కమ్యూనిస్టు సమాజనిర్మాణం సోవియట్ ప్రజల తక్షణ ఆచరణకర్తవ్యం. సోషలిజం క్రమేణా కమ్యూనిజంగా అభివృద్ధి చెందుట నేటి వాస్తవ సిద్ధాంతసూత్రం. గత శతాబ్దాల సోవియట్ సోషలిస్టు సమాజాభివృద్ధి యీ పరిస్థితి రూపొందింది. ఉత్పత్తి శక్తిని, శ్రామికోత్పత్తి శక్తిని 10 సంవత్సరాలలో 100 శాతం, 20 సంవత్సరాలలో 300-350 శాతం పెంచాలని 22వ, కాంగ్రెసు వివరించింది. నగర, గ్రామీణ, ఆర్థిక సామాజిక సాంస్కృతిక అంతరాలను, తొలగించుట కమ్యూనిజపు అత్యంత నిర్మాణం కాగలదు.

సోవియట్ చారిత్రికాభివృద్ధి ప్రభుత్వం అంతర్థానమగుటకు దారితీస్తుంది. కమ్యూనిస్టు సమాజనిర్మాణం ప్రపంచస్థాయిలో సోషలిజపు విజయం, సుస్థిరత బాహ్యపరిస్థితుల అభివృద్ధి, కమ్యూనిస్టు చైతన్యాభివృద్ధి, ప్రజలలో కమ్యూనిస్టు చైతన్యాభివృద్ధి కార్మిక కర్షక మేధావివర్గాల సైద్ధాంతిక రాజకీయ, ఐక్యత క్రమేణా కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి తోడ్పడుతవి సోవియట్ పార్టీ 22వ కాంగ్రెసు రూపొందించిన కార్యక్రమాన్ని, అజయ్‌ఘోష్ "మార్క్స్ కమ్యూనిస్టు ప్రణాళికంతటి ప్రాముఖ్యత కలదని కమ్యూనిజానికి 'బాట" అని వ్యాఖ్యానించారు. మూడు దశాబ్దాల తరువాత, "సోషలిస్టు వ్యవస్థ పతనానికి బాట అగుట చారిత్రిక సత్యం.

5) ప్రపంచకమ్యూనిస్టు పార్టీల 1960 ప్రకటన వివిధదేశాల కమ్యూనిస్టు పార్టీలలో చెలరేగుతున్న సిద్ధాంత వాగ్వివాదంలో అత్యంత ప్రాముఖ్యత కలిగి వుంది. మాస్కో 1957 ప్రకటనను పునరుద్ఘాటించి, శాంతి మానిఫెస్టోలో ప్రకటించింది.

యుగస్వభావం "నేడు ప్రపంచసోషలిస్టు వ్యవస్థ సామాజికాభివృద్ధిలో నిర్ణయాత్మక అంశం అదే ప్రధాన లక్షణం" సమావేశం నిర్వచించింది. సోషలిస్టు సమాజ పరిణామానికై ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు పోరాడుతున్నవి. నేటి సమాజ చారిత్రిక సమాజాభివృద్ధిని స్వభావాన్ని లక్షణాలను ప్రధానంగా నిర్ణయిస్తుంది. సామ్రాజ్యవాదం యీ చారిత్రక పురోగమాన్ని ఆపలేదు. సోషలిజం సంపూర్ణ అఖండ విజయం తధ్యం" అని ప్రకటన స్పష్టం చేసింది.

సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధిలో నూతనదశను "కమ్యూనిస్టు సమాజ నిర్మాణాన్ని" సోవియట్ యూనియను చేబట్టింది. సోషలిస్టు శిబిరంలోని దేశాలు "సోషలిస్టు పునాదులను నిర్మించుచున్నవి, కొన్ని "అభివృద్ధి చెందిన సోషలిస్టుదశ"కు చేరినని.

శాంతి, శాంతియుత సహజీవనం, యుద్ధం, శాంతి సమస్యలు ప్రధానాంశాలుగ సమావేశపు మానిఫెస్టో ప్రకటించింది. యుద్ధం, పెట్టుబడిదారి విధానం కవల పిల్లలు, సామ్రాజ్యవాదం వున్నంత వరకు దురాక్రమణ యుద్ధాలకు భూమిక వుంటుంది. అణుయుద్ధం మానవజాతిని నాశనం చేస్తుంది. ప్రపంచ శాంతి మానవ జాతి మనుగడకు అవసరం సర్వవిధాల యుద్ధ నివారణ ప్రధమ కర్తవ్యం. ప్రపంచ శాంతి శక్తులకు నేడు యుద్ధాన్ని నిరోధించగలిగిన శక్తి యున్నది. ప్రపంచయుద్ధ నిరోధం, శాంతి పరిరక్షణకు యుద్ధోన్మాద శక్తులకు వ్యతిరేక పోరాటానికి సమావేశం పిలుపునిచ్చింది.

జాతీయ విముక్తి విప్లవోద్యమాలు అమోఘమైన వేగంగా విజయాన్ని సాధించాయి. "వలస విధాన పూర్తి నిర్మూలన తధ్యం. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థా నిర్మాణం తరువాత అత్యంత చారిత్రాత్మక ప్రాముఖ్యతగల పరిణామం జాతీయ విముక్తి విప్లవాల ఫలితంగా వలస బానిసత్వ విధానం కూలిపోవుట. "ప్రపంచ గత దశాబ్దాల చరిత్ర అంతా వలస విధానం అన్నిరూపాలలో పూర్తిగ అంతం చేయబడుటను సూచించుతున్నది. వలస బానిసత్వ వ్యతిరేక పోరాటాలను బలపరచి, వలస దోపిడిని అన్ని రూపాలలో అంతం చేయాలి.

నూతన శకంలో ప్రపంచ శక్తుల నూతన సమతూకాన్ని బలపరచి శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజంవ్యాప్తికి చారిత్రాత్మక కర్తవ్యాల నిర్వహణకు నూతన అవకాశాలు అభివృద్ధి చెందాయి. కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీలు ప్రజల, కార్మికవర్గ ప్రయోజనాల పరిరక్షణ, జీవన పరిస్థితుల మెరుగుపరచుటకు, ప్రజాస్వామ్య హక్కుల కొరకు పోరాటాలు సాగించుతున్నవి. పోరాటదాడిని గుత్త ఆయుధోత్పత్తి, దురాక్రమణదారులపై, అభివృద్ధి నిరోధకులపై కేంద్రీకరించబడింది.

సమావేశం వివిధ దేశాలలో పెట్టుబడిదారి విధానం, సోషలిజంలోనికి పరివర్తనఅంశంపై 1957 మాస్కో ప్రకటన సిద్ధాంతాన్ని, శాంతియుత పరివర్తనను

పునరుద్ఘాటించింది. ఆయా దేశాలలోని పరిస్థితులను బట్టి సోషలిస్టు పరివర్తనా మార్గాలు నిర్ణయింపబడుతవి.

కమ్యూనిస్టు వుద్యమ ఐక్యతను పెంపొందించుటకు, మాస్కో 1957 ప్రకటన సంస్కరణవాదం ప్రధాన ప్రమాదకారిగ, పిడివాదం, సెక్టేరియనిజం వలన వున్న ప్రమాదం కారణంగా రెండు రంగాలల్లో తీవ్రమైన ద్విముఖ పోరాటాన్ని సాగించాలని స్పష్టం చేసింది.

సమావేశంలో చర్చల సరళిని తెలుసుకొనవలసి వుంది. చైనా కమ్యూనిస్టు పార్టీ, మాస్కో 1957 ప్రకటనపై అప్పుడే తానంగీకరించలేకపోవుటను వొక పత్రంలో సోవియట్ పార్టీ కేంద్రసమితికి తెలియపరచింది. ముఖ్యంగా, పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి పరివర్తన సిద్ధాంతాన్ని వ్యతిరేకించింది. శాంతి, శాంతి యేతర మార్గాలలో అన్ని విధాల ప్రయత్నించి, సర్వసన్నద్ధమై వుండాలని శాంతి యుత పరివర్తనంపైనే ఆధారపడి, పార్టీని నిరాయుధులను చేస్తుంది. అంతర్జాతీయ సైద్ధాంతిక అభిప్రాయ భేధాలును ఎవరు బహిరంగ పరచారు అనే ప్రశ్న చర్చనీయాంశమైంది. అంతేగాక పార్టీలమధ్య వుండవలసిన పరస్పర సంబంధాలలో మైనారిటి, మెజారిటిని అనుసరించాలనుట చర్చనీయాంశమై సోవియట్ అవగాహనను చైనా తిరస్కరించింది. ఒకే పార్టీలోని మైనారిటి మెజారిటి అభిప్రాయాన్ని ఆమోదించాలనే సూత్రం, రెండుదేశాల స్వతంత్రపార్టీల మధ్య వుండవలసిన సంబంధాలకు వర్తించిందని చైనా కమ్యూనిస్టు పార్టీ స్పష్టం చేసింది.

6) ఈ నేపధ్యంలో భారత కమ్యూనిస్టుపార్టీ 6వ, కాంగ్రెసు, విజయవాడలో ఏప్రిల్ 1961లో జరుగబోవు సందర్భంలో అజయ్‌ఘోష్ ప్రవదాలో కాంగ్రెసు ముందున్న సమస్యలు అని; పార్టీ కార్యక్రమాన్ని నిర్ధారణ చేయుట, రాజకీయ తీర్మానాన్ని రూపొందించుట, పార్టీ నిర్మాణ సూత్రాలలో సవరణలు చేస్తుందని వ్రాసారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సిద్ధాంత సమస్యలను, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20, 22వ, కాంగ్రెసుల నూతన విధానాలను చర్చించి, వైఖరిని స్పష్టంచేయుట, అంతర్జాతీయ అవగాహనల వెలుగులో జాతీయ ఆర్థిక, రాజకీయ, ప్రణాళికా, పార్టీ అంతర్గత సిద్ధాంత సమస్యలను చర్చించి, భారత జాతీయ పోరాట పంథాను రూపొందించు కర్తవ్యాలను చేపట్టుతుందని వ్రాసారు. ఒక్కమాటలో పార్టీ కాంగ్రెసు యీ కర్తవ్యాల నిర్వహణలో వైఫల్యమైందని చెప్పవచ్చు. జరిగిన నిర్ణయాలు, ఆమోదించిన తీర్మానాలు అన్ని అసలు సమస్యలను వాయిదావేసి, తాత్కాలికంగా, ఎన్నికల దృష్ట్యా ప్రాప్తకాలజ్ఞతా వైఖరినుండి, ఆమోదించబడిన రాజీల ఫలితాలు.

పార్టీలో పైకి కనిపించే ఐక్యత చాల దుర్భరమైంది. పార్టీలోభేదాభిప్రాయాలు తీవ్రమైనవి, మే 1960 కలకత్తా జాతీయ సమితి సమావేశం, పార్టీ కాంగ్రెసుకు

కేంద్రకార్యవర్గపు ముసాయిదా తీర్మానాన్ని పరిశీలించజాలకపోయింది, కారణం. అంతకుక్రితం మెజారిటి ఆమోదించినా దాంగే వ్యతిరేకించారు. దీనిని చర్చించి ఆమోదించవలసిన సమితి, కార్యదర్శి దానిని ప్రవేశపెట్టనందున, అందుకై పిలువబడిన కేంద్రసమితి, దానిని పరిశీలించకనే సమావేశం ముగిసింది. ఇతర కారణాలెన్ని వున్నా పార్టీలోని తీవ్రభేదాభిప్రాయలే ప్రధాన కారణం. సిద్ధాంత సంఘర్షణను పార్టీ కాంగ్రెసులోనికి తగిన పూర్వరంగాన్ని సిద్ధం చేయకుండా తీసుకొని వెళ్ళుట ఇది సమస్యలను జటిలం చేస్తుందిగాని, శాస్త్రీయ సోషలిస్టు పరిష్కారానికి ఎంత తోడ్పడుతుందో చెప్పజాలము.

అదే విధంగా, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో సిద్ధాంత భేదాభిప్రాయాలు ఎక్కువైనందున 1960 చివరలో 81 పార్టీల సమావేశానికి ముందు సన్నాహక కమిటీలకు ఆహ్వానంపై వెళ్ళిన భారత ప్రతినిధి వర్గానికి మార్గదర్శిక సూత్రాలను భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గం, రూపొందించునపుడు తీవ్ర భేదాభిప్రాయాలు వెల్లడయ్యాయి, కొద్ది మెజారిటీతో వొకపత్రం ఆమోదింపబడింది. తీవ్రభేదాభిప్రాయాలున్నప్పటికి జాతీయ సమితి సమావేశం పిలువబడలేదు, మెజారిటి అభిప్రాయం పార్టీ అంతటిపై రుద్దబడింది. అంతేగాక మాస్కో 1960 సమావేశానంతరం కేంద్ర కార్యవర్గంగాని, కేంద్రసమితిగాని మాస్కో ప్రకటనను చర్చించలేదు. అభిప్రాయ భేదాలు పరిష్కరించుటకు ఎట్టి ప్రయత్నం జరుగనందున అవి మరింత తీవ్రమైనాయి. అగ్రనాయకత్వం సిద్ధాంత చర్చలలో వొకపరిణిత చేరకుండా, అభిప్రాయ భేదాలను జాతీయ సమితిలోనికి తీసుకొని వెళ్ళిన, సిద్ధాంత నాయకత్వంలేని కారణంగా భేదాభిప్రాయాలు మరింత లోతుగా, విస్తరించి సమస్యయ పరిష్కారం జటిల మౌతుందని మెజారిటీవర్గం తలచివుండవచ్చు, లేదా మైనారిటి వర్గం అట్టి చర్చలతో మరింత బలపడుతుందనే భయమైనా కావచ్చు లేదా పార్టీ మొత్తంగా బలహీనపడుతుందనే తలంపుకావచ్చు, అయితే మైనారిటి యీ సమస్యను ఐక్యతా మార్గంలోకాక తద్విరుద్ధతిరేకంగా జరిగిన, వుదహరింపులు ప్రకటిత సాహిత్యంలో కానరాలేదు. రెండు దృక్పథాలలో యే విధంగా జరిగినా, సైద్ధాంతిక పోరాటాన్ని అంగీకృత స్థాయిలోనే జరిగినపుడు పార్టీ బలపడుట జరుగుతుంది. అది అశాస్త్రీయ పద్ధతులలో నియమ, నిబద్ధత లేకుండా చైనాలో 70 దశకంలో, సోవియట్ యూనియన్‌లో 90 దశకంలో జరిగిన విధంగా జరిగిన విషమ పరిణామాలను చరిత్ర లిఖించింది. పార్టీ నిర్మాణస్థితి చీలికల పొలిమేరలలో వున్నపుడు ఐక్యతను కాపాడు దృష్టితో అగ్రనాయకత్వం కొంతకాలం సైద్ధాంతిక చర్చలు, నిర్ణయాలు వాయిదా వేయుట సమంజసమే అయినా, వాయిదా దీర్ఘకాలమైతే విషమ పరిణామాలు సంభవించవచ్చును.

జాతీయ సమితి సమావేశానంతరం రెండువర్గాలు, పార్టీ కాంగ్రెసులో తః దృక్పథాలకు మెజారిటీ సంపాదించుటకై, లెనినిస్టు నిర్మాణ సూత్రాలకు భిన్నంగా పార్టీ వ్యతిరేక మార్గాలను అనుసరించాయి. ముఠా పద్ధతులపై కాంగ్రెసుకు ప్రతి నిధుల ఎన్నికల కుమ్ములాటలు అంతరతంగా జరిగాయి. ప్రతినిధులు రెండు శిబిరాల సైనికులుగా విజయవాడ పార్టీ కాంగ్రెసు కురుక్షేత్రానికి వెళ్ళారు.

ఆచరణలో 1941 కార్యక్రమం, కాలం చెల్లినదని, నూతన కార్య క్రమాన్ని రూపొందించవలసిన అవసరాన్ని అందరూ గుర్తించారు. కార్యక్రమం ఆచరణలో వుపసంహరించబడింది. ఏకగ్రీవ అవగాహన లేనందున వివిధ దృక్ప థాల వైఖరులు గలిగిన వారు తమ తమ ముసాయిదా కార్యక్రమాలను, రాజకీయ తీర్మానాలను ప్రతిపాదించుటకు నిర్ణయించింది. ఆ విధంగా, కాంగ్రెసులో మూడు ముసాయిదాలు చర్చలకు ప్రతిపాదించబడినవి.

పార్టీలోని భేదాభిప్రాయాలు కార్యక్రమం, రాజకీయ విధానాలకే గాక, అంత ర్జాతీయ. జాతీయ పరిస్థితుల అంచనా, వ్యూహం, ఎత్తుగడల వంటి ప్రాథమికాంశా లపై సమిష్టి అవగాహన లేనందున, కాంగ్రెసు ఒక రాజకీయ తీర్మానాన్ని ఆమో దించజాలని పరిస్థితి ఏర్పడింది. దీనికి అంతర్జాతీయ పరిస్థితి తోడై పార్టీ రెండుగా చీలిపోవుటకు కారణభూతమైనవి.

భారత కమ్యూనిస్టుపార్టీలోని "సంస్కరణవాద", "అతివాద" దృక్పథాలకు, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని "మితవాద", "అతివాద, పిడివాదులు", తోడై విభేదాలు, వివాదగ్రస్తమై తీవ్రమయ్యాయి పార్టీలోని అంతర్జాతీయ సిద్ధాంత భేదాభిప్రాయాలు వివాదగ్రస్తమగుట, పార్టీలోని భేదాభిప్రాయాలకు దేశీయ భూమి కయేగాక అంతర్జాతీయ సిద్ధాంత భూమికతో మేళవించి, విస్తృత సిద్ధాంత పోరాట రంగాన్ని యేర్పరచింది. పార్టి అనైక్యతా దేశీయ సుడిగాలులకు, అంతర్జాతీయ పెను తుఫాన్ గాలులు తోడై వివాదాంశాలు లోతై విస్తరించాయి.

"వలస వానినత్వాన్ని బద్దలు చేసిన దేశాల జాతి పునర్జీవన కర్తవ్యాలను మాస్కో ప్రకటన నిర్వచించి, జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాల సంపూర్తికి అన్ని దేశభక్త శక్తులు ఒకేవొక జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో సమీకరించబడాలని సూచించింది."

మాస్కో ప్రకటనకు రెండు వివరణ వ్యాఖ్యలు, స్వాతంత్ర్యానంతర అభి వృద్ధికి రెండు అంచనాలు, రెండు దృక్పథాల వ్యూహం, ఎత్తుగడలు, కార్మికవర్గం, ప్రజాస్వామ్య వుద్యమం అనుసరించవలసిన మార్గాలను విజయవాడ పార్టీ కాంగ్రె సుకు ముందు పార్టీ ఎదుర్కొనవలసి వచ్చింది. ఈ భిన్న దృక్పథాలను అనుసరించే వారు ఒకరిని మరొకరు ప్రపంచ వుద్యమ సాధారణ పంథాకు మార్క్సిస్టు-లెనినిస్టు వ్యతిరేకులుగ నింద, ప్రతినిందల గురయ్యారు.

మాస్కో ప్రకటన, నూతన ప్రపంచ పరిస్థితులలో 1) నూతన స్వాతంత్ర్య దేశాలకు, ఆవిర్భవించిన నూతన అవకాశాలు, శాస్త్రీయ విశ్లేషణ సారాంశం నూత నాంశాలు 2) ఈ అవకాశాలను కార్మికవర్గ పార్టీ వినియోగించి జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని పూర్తి చేయగలుగుట, ప్రకటనలో ప్రతిపాదించబడినవి. ఈ కర్తవ్యాలను కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా గలిగి, జాతీయ బూర్జువావర్గం పాల్గొనే విస్తృత జాతీయ ఐక్య సంఘటన పూర్తి చేస్తుంది.

మాస్కో సమావేశంలో పాల్గొన్న భారత కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులలోనే మన సమస్యల ప్రకటన అవగాహనపై అభిప్రాయభేదాలున్నవి. మనం యీ సమస్యలపై తటస్థంగా వుండజాలమనుట సరియైనదే అయినా, సిద్ధాంత పోరాటంలో సోవి యట్ కమ్యూనిస్టుపార్టీ లేక చైనా కమ్యూనిస్టుపార్టీలలో యేదో వొకదాని వైఖరిని అనుసరించుట అభిలషణీయంకాదు. శాస్త్రీయంగా మన ప్రయోజనాలను పెంపొందించే దృక్పథాన్ని రూపొందించవలసి వుంటుంది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో 1957, 1960 సమావేశాల నిర్ణయాలపై భారత కమ్యూనిస్టుపార్టీలో జరిగిన చర్చలన్నీ కేంద్ర కార్యవర్గం, కేంద్ర సమితి, కొన్ని సందర్భాలలో రాష్ట్ర కమిటీలకు మాత్రమే ప్రధానంగా పరిమిత మయ్యాయి. అన్ని స్థాయిలలో తీవ్రమయిన అభిప్రాయాలున్న విషయం వాస్తవమే. అయినా నిర్ణయాలు జరిగాయి. పార్టీ కార్యకర్తలలో సుసంఘటితంగా అన్ని స్థాయిలలో జాతీయ సమితిలో అంతరంగిక సిద్ధాంత చర్చలు జరుగలేదు. పార్టీ పై కమిటీల నిర్ణ యాలను క్రింది కమిటీలపై రుద్దటం, నిరుపయోగం, అసలు జరుగదు, నష్టదాయ కమేగాక ఐక్యతకు యే మాత్రమూ తోడ్పడదు.

7) భారత కమ్యూనిస్టుపార్టీ 6 వ కాంగ్రెసు యీ నేపథ్యంలో ఏప్రిల్ 1961 లో విజయవాడలో జరిగింది. ఈ కాంగ్రెసు, "మితవాద సంస్కరణవాదులు" "అతివాద పిడివాదులు" హోరాహోరీగా సంఘర్షించిన చారిత్రిక మహాసభగా చెప్ప వచ్చు.

జాతీయ సమితి 1961 మొదటిలో సమావేశమైనపుడు రెండు కార్యక్రమాలు, రెండు రాజకీయ తీర్మానాలను కమీషనులు సమర్పించాయి. ఏకగ్రీవామోదం లేనం దున జాతీయ సమితి వివిధ దృక్పథాలు గలవారు తమ తమ ముసాయిదాలను కాంగ్రెసులో ప్రతిపాదించుటకు నిర్ణయించారు. ఫలితంగా మూడు ముసాయిదాలు ప్రతిపాదించబడినవి. జాతీయ సమితి మెజారిటీ సభ్యుల ముసాయిదాను డాంగే తది తరులు, మైనారిటీ సభ్యుల ముసాయిదాను రణదివె తదితర 21 మంది, యీ రెండు ముసాయిదాలను ఆమోదించజాలవని నంబూద్రిపాద్ మూడో ముసాయిదాను కాంగ్రె సులో ప్రతిపాదించారు.

కాంగ్రెసులో ప్రధానంగా రెండు దృక్పథాలు సంఘర్షించాయి. రెండు దృక్ప

ధాల సారాంశము, అవి గుత్తపెట్టుబడిదారీ వర్గంపై ప్రభుత్వ విధానం, పంధాలను పరిశీలించిన తెలుస్తుంది. మెజారిటీ ముసాయిదా, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక ఆర్థిక విధాన ప్రభుత్వ అజమాయిషీయే గాక, గుత్తపెట్టుబడిదారి వ్యతిరేకాంశంగా అంచనా వేస్తుంది. గుత్తపెట్టుబడిదారులు జాతీయ బూర్జువా ప్రభుత్వాన్ని పూర్తిగా తమ ప్రయోజనాలకు వినియోగించుటల్లో విఫలులయ్యారంటున్న మైనారిటీ సభ్యుల ముసాయిదా, మన ఆర్థిక ప్రణాళికలు గుత్తపెట్టుబడి వర్గాల చేతుల్లో ఆర్థికశక్తి కేంద్రీకరణను ప్రోత్సహించి, ప్రభుత్వ పారిశ్రామికరంగాన్ని బడా బూర్జువా సేవలకు వినియోగిస్తుందని చెప్పుతున్నది. ఈ ముసాయిదా పాలకపార్టీల వర్గ విభజన, స్వతంత్ర పార్టీ యేర్పాటు గుర్తించలేదని నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు. కాని, మన బూర్జువా ప్రభుత్వ రాజకీయ నిర్మాణంలో ప్రభుత్వరంగం, గుత్తపెట్టుబడిదారులకు వ్యతిరేకంగా, ప్రజల ఆయుధంగా వుపయోగపడుట భ్రమే కాగలదని కూడ నంబూద్రిపాద్ అన్నారు. "గుత్తపెట్టుబడి యెలా పెరిగిందని" యే ముసాయిదా ప్రశ్న వేయలేదని, "ప్రభుత్వాన్ని, ప్రభుత్వరంగాన్ని గుత్తపెట్టుబడిదారీ వర్గాలు తమ పూర్తి ప్రయోజనానికై వినియోగించుటలోని" వైఫల్యాన్ని మాత్రమే డాంగే వగైరాల ముసాయిదా, "గుత్తవర్గాలు కనీసం కొంతవరకు ప్రజలకు యాజమాన్యం, కంట్రోలు యిచ్చే అవకాశాలున్నవని" మైనారిటీ 21 మంది ముసాయిదా గుర్తించనే లేదని నంబూద్రిపాద్ కీలకాంశాలను లేవనెత్తారు. ఇంకా "పెట్టుబడిదారి పరిధిలో ప్రభుత్వరంగ అభివృద్ధిలో నిబిడీకృతంగా వున్న ప్రమాదకర అంశాలను పరిగణలోనికి తీసుకొనకపోవుటలోని వైఫల్యం సంస్కరణవాదాభివృద్ధికి ఫలవంతమయిన నేల అగుతుంది. పెట్టుబడిదారి విధానాన్నిగాక, ప్రజాస్వామ్య సోషలిజాన్ని, సంక్షేమ రాజ్యాన్ని నిర్మిస్తున్నామన్న జాతీయ బూర్జువావర్గ సిద్ధాంతానికి దాసోహం అనుటకు సమానమగుతుంది" అని నంబూద్రిపాద్ అన్నారు.

నంబూద్రిపాద్ విమర్శకు అధికార, "మెజారిటీ ముసాయిదా సంస్కరణవాదాన్ని బహిరంగపరచుటను" అభినందించుతు, ఆ ముసాయిదాలో లేని వాటిని" ఆ వుత్సాహంతో చూడరాదు. మెజారిటి ముసాయిదా "ప్రభుత్వరంగం, గుత్తపెట్టుబడిదారి వర్గాలకు వ్యతిరేకంగా ఎక్కుపెట్ట బడిందని" చెప్పలేదని, "అవి న్యాయం చేకూర్చే పంక్తిస్థాలు కావన్నారు" అధికారి. ఇంకా, "ప్రభుత్వం జాతీయ బూర్జువా వర్గపు పాలనా యంత్రాంగం కాన, ప్రభుత్వరంగం కూడ ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాన్ని పెంపొందిస్తున్నది." మెజారిటీ ముసాయిదా "ప్రభుత్వరంగంలో ఆర్థికాభివృద్ధి, భారత స్వతంత్ర ఆర్థికాభివృద్ధిని సుగమం చేస్తుంది. సామ్రాజ్యవాద వలస వ్యతిరేక అంశం, భారతీయ లక్ష్యాన్ని పూర్తి చేస్తుంది. కాన అభ్యుదయకరమయినదని తెలియజేస్తున్నది." ప్రభుత్వరంగాన్ని ప్రభుత్వపెట్టుబడిదారి విధానంగా గుర్తిం

చితే, నూతన ప్రపంచ పరిస్థితులలో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో ద్వంద పాత్ర: 1) ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పెంపొందించే అంశం, కాన ఆ మేరకు సామ్రాజ్యవాద, వలస వ్యతిరేక పాత్ర గలిగి జాతీయ ధ్యేయాన్ని పూర్తి చేయు అవకాశాలున్నవి. కాన అభ్యుదయ అంశమే. 2) పెట్టుబడిదారి విధానాభివృద్ధి ఫలితంగా గుత్తపెట్టుబడి వర్గాలు పెంపొందుట, దారిద్ర్యం పెరుగుటలో వైరుధ్యంయేమీ లేదు" అని అధికారి కొంత వివరించారు "ముసాయిదాలోని ప్రభుత్వరంగ విశ్లేషణ, పాత్ర చివరమాటగా మేము అనుకొనుటలేదు. అనుభవాల వెలుగులో దానిని అభివృద్ధపరచి నిర్దిష్టంచేయాలి. ప్రభుత్వరంగ ద్వందపాత్ర ప్రమాదాంశాలను లక్షణాలను మౌలిక శాస్త్రీయ విశ్లేషణ మెజారిటీ ముసాయిదాలో వుందని, మైనారిటీ ముసాయిదాలో లేదని" అన్నారు.

ప్రజలలో సోషలిస్టు పెట్టుబడి దారేతర సామాజికాభివృద్ధి అభిప్రాయాలను బూర్జువావర్గం, సోషలిజానికి ప్రత్యామ్నాయంగా సమిష్టి యజమాన్యం లేని వుత్పత్తి సాధనాలు, పంపకం వుత్పత్తులుగాక, "మిక్సడ్ ఎకనమీ" అనంతంగా అనేభాష్యం చెపుతున్నారు. ప్రభుత్వ "పెట్టుబడిదారి విధాన పారిశ్రామికాభివృద్ధిని" సోషలిజంగా" వాఖ్యానించుతు ప్రజలలో భ్రమలు కల్పించుతున్నారు,

పరిస్థితులలోని నూతనాంశాల ననుసరించే విజయవాడపార్టీ కాంగ్రెసు జాతీయ ప్రజాస్వామ్య నినాదాన్ని చేబట్టిందని వాటిని యీక్రింది విధంగా పేర్కొన్నారు.

ఎ) పెట్టుబడిదారి విధానంలోని సామాన్య సంక్షోభం నూతనదశ, నూతన స్వాతంత్రదేశాలు స్వతంత్ర ఆర్థిక, అలీన విదేశాంగ విధానాల పెట్టుబడిదారి మార్గంలో ఆర్థికస్వాతంత్ర్యాన్ని బలోపేతచేసుకొంటూ, వొక విధమైన ప్రజాస్వామ్యాన్ని కొనసాగిస్తున్నాయి, కావ సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో యీ నూతనాంశాన్ని సోషలిస్టుదేశాలు అభ్యుదయశక్తులు పరిగణించాలి.

బి) జాతీయ బూర్జువా ప్రభుత్వంలో ఆర్థికాభివృద్ధి ఒకవైపు, రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యాల పురోగమనం మరోవైపు పెట్టుబడిదారి విధానాభివృద్ధిలో వైరుధ్యాలు, గుత్తవర్గాలు గ్రూపులు పెరుగుట ఆర్థికశక్తి కేంద్రీకరణ, దారిద్ర్యం పెరుగుట, సంక్షోభాలతో ద్వందవైఖరి సుస్పష్టం. ఫలితంగా సామ్రాజ్యవాదం, దేశప్రజలమధ్య వైరుధ్యంతీవ్రమగుడ, జాతీయప్రభుత్వం ప్రజాస్వామ్యశక్తుల మధ్య ఘర్షణ తీవ్రమైంది.

సి) గుత్తవర్గాల పునాదిగా అభివృద్ధి విరోధక వ్యూహాలు ఐక్యతతో శక్తివంతమైన అభివృద్ధి విరోధక ముఠా ఆవిర్భావం, ఈ క్లిష్టపరిస్థితులలో పార్టీ "పోరాటం-ఐక్యత" విధానాన్ని రూపొందించుచున్నది. స్వాతంత్ర ప్రజాస్వామ్య అవకాశాలను పూర్తిగ వినియోగించుచున్నది. "పోరాటం-ఐక్యతా" వందా పాల్ఘాట్ మంది అమృతసర్, తదుపరి రూపొందుక్రమంలో వుంది. విజయవాడ అజయ్ వుపన్యాసంలో సమగ్రస్వరూపం దాల్చింది.

డి) స్వాతంత్ర్యానికి పూర్వం వున్న జాతీయ సంఘటన, జాతీయ బూర్జువా వర్గం అధికారాన్ని చేబట్టుటతో విచ్ఛిన్నమైన దానిని, జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని సంపూర్తి చేయుటలో పాల్గొనే అన్నివర్గాల నూతన జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను పునర్నిర్మించుటయే నూతనాంశము.

8) విజయవాడ పార్టీ కాంగ్రెసులో రెండు ముసాయిదా తీర్మానాలు కార్యక్రమాలు చర్చించబడి, తీవ్ర అభిప్రాయ భేదాలతో పార్టీ చీలిపోయే పరిస్థితిలో, యిరు వర్గాలు ఆమోదించిన అజయ్‌ఘోష్ నివేదిక, ఉపన్యాసాన్ని ప్రాతిపదికగా చేసుకొని రూపొందించిన తీర్మానాన్ని ఆమోదించారు. ముఖ్యాంశాలు యిలా వున్నవి.

ఈ యుగం సామ్రాజ్యవాద సంక్షోభం వలన విముక్తి సోషలిజపు నిర్ణయాత్మక పాత్ర, పెట్టుబడిదారి సమాజం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన, సమాజ మొత్తంగా సోషలిస్టు పరిణామంగా నిర్వచించబడింది.

భారత పారిశ్రామికాభివృద్ధికి పునాదులయిన మౌలిక సమస్యలను పరిష్కరించుటలో విఫలమైనప్పటికి, గణనీయమయిన అభివృద్ధి జరిగింది. అనేక రంగాలలో ప్రణాళికా లక్ష్యాలు నెరవేరలేదు. పారిశ్రామికాభివృద్ధి నత్తనడకలో వుంది.

భారత ప్రభుత్వం భారీ పరిశ్రమల నిర్మాణం, ప్రభుత్వరంగంలో విడనాడాలనే విదేశీయ, దేశీయ వొత్తిడులను త్రోసిబుచ్చి, 3 వ ప్రణాళికలోని పెట్టుబడి 10,200 కొట్లలో 3475 కోట్లు పరిశ్రమలకు, అందులో 2425 కోట్లు లోహ, విద్యుచ్ఛక్తి, భారీ పరిశ్రమలు పబ్లిక్ రంగంలో నిర్మాణానికి కేటాయించారు.

భారతదేశం సోషలిస్టు ప్రపంచంతో అభివృద్ధికర విదేశాంగ విధానం ఫలితంగా లభించిన సహాయింతో భారీ పారిశ్రామిక విస్తృతితో, స్వాతంత్ర్యం బలపడింది మరోవైపు పశ్చిమదేశాల అధికంగా పెట్టుబడి దిగుమతుల ఫలితంగా 228 విదేశ గుత్తపెట్టుబడి, దేశీయ పెట్టుబడి పొత్తు ప్రాజెక్టులు ఆమోదించబడ్డాయి. అందుకే సోషలిస్టు దేశాలనుండి దిగుమతి చేసుకున్న క్రూడుఆయిల్‌ను, అమెరికన్, బ్రిటిష్ కంపెనీలు శుద్ధి చేయ నిరాకరించ గలిగే ధైర్యం వాటికి చేకూరింది.

ప్రభుత్వరంగంలో వ్యూహాత్మక ఇనుము, ఉక్కు, యంత్ర, బొగ్గు, ఆయిల్ పరిశ్రమలకు స్వాగతం చెబుతూ, ప్రభుత్వరంగానికి కేటాయించబడిన అల్యూమినం ఎరువుల పరిశ్రమలను అనేక రాయితీలతో గుత్తపెట్టుబడిదారుల హస్తగతం చేయుటను నిరసించాలి. ప్రభుత్వ, పబ్లిక్‌రంగ పరిశ్రమల ఆధిక్యత నిర్ణయాత్మక పాత్ర ఏర్పడలేదు.

నిరుద్యోగం ద్వితీయ ప్రణాళిక ప్రారంభం నాటికి నమూనా సర్వేలో 15 మిలియనులకు చేరినట్లు తేలింది.

కాంగ్రెసు "దున్నేవానికే భూమి" అన్న నినాదాన్ని మరచి, వ్యవసాయ సంస్కరణల కమిటీల, ప్రణాళికా సంఘ సిఫార్సులను కూడ, గరిష్ఠ భూపరిమితి

నిర్ణయించి అర్ధ ఫ్యూడలు భూస్వామ్య విధానాన్ని రద్దు చేయకుండా పెట్టుబడిదారీ భూస్వాములుగ మార్చే ప్రయత్నంలో బీదరైతాంగం భూములను కోల్పోయి దుర్భర పరిస్థితులలో మునిగిపోయారు.

నాగపూరు తీర్మానాన్ని కాంగ్రెసు గాలికి వదిలేసి మితవాదులను సంతృప్తి పరుస్తున్నది. ఒరిస్సాలో ఫ్యూడలు గణపరిషత్ తో కలిపి సంయుక్త మంత్రివర్గాన్ని యేర్పాటు చేయుట, కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని చట్ట వ్యతిరేకంగా బర్తరఫ్ చేయుట, దేశంలో ప్రజాస్వామ్యానికి గల ప్రమాదాలను సూచిస్తున్నాయి. అంతేగాక కలకత్తా ఆహార ఆందోళన, ప్రభుత్వోద్యోగుల సమ్మెను హింసా, దౌర్జన్యాలతో అణచివేయుట ప్రతిపక్షాలలోనేగాక, కాంగ్రెసువారిలోను అసంతృప్తిని కలుగజేసింది. మితవాద అభివృద్ధి నిరోధకవర్గాలు సైన్యాధిపతి తిమ్మయ్యను బలపరచుట, దేశంలో ప్రజాస్వామ్యం పనికిరావనే ప్రచారం, రాష్ట్రపతి రాజ్యాంగనేతగానే గాక, వాస్తవాధికారాలను కలిగి వుండాలని రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ పేర్కొనుట, భావనగర్ కాంగ్రెసు అధ్యక్షుడుగా సంజీవరెడ్డి అధ్యక్షోపన్యాసంలో అసెంబ్లీలకు,పార్లమెంటుకు ప్రత్యక్ష ఎన్నికలుండ రాదనుట, ప్రజాస్వామ్యవాదానికి ప్రమాదకర వైఖరుల హెచ్చరికలుగా నెంచారు.

కాంగ్రెసులోని తీవ్ర మితవాదులు, బయట అభివృద్ధి నిరోధకులు కలసి బహిరంగ స్వంత రాజకీయ పార్టీ "స్వతంత్ర పార్టీని" స్థాపించారు. బడా భూస్వాములు, గుత్తపెట్టుబడిదారులు, మాజీ సైనికాధికారులు, రాజులు, అసంతృప్తి రాజకీయ నాయకులు, అమెరికా పైరవీదారులు ప్రముఖ పాత్ర వహించారు. ఇంకా కాంగ్రెసులో వున్న మితవాదులకు మరింత ధైర్యమొచ్చింది.

హిందూమత శక్తుల అగ్రగామిదళమైన రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘం దాని రాజకీయ పార్టీ జనసంఘం అభివృద్ధి నిరోధక శక్తులకు నాయకత్వం వహించాయి.

**నేటి పరిస్థితి వైరుధ్యాలతో అతి క్లిష్టమైన అంశాలతో కూడి వున్నది.**

నెహూ్రు ప్రభుత్వ మౌలిక విధానాలు గతంలో వలెనె ప్రధానంగా జాతీయ బూర్జువా విధానాలు, పారిశ్రామికాభివృద్ధి వేగం మన అవసరాలకు తగినంతగా లేక నత్తనడకలో వుంది. ఆర్థిక విధానంలో ప్రభుత్వ, పబ్లిక్ రంగంతో పారిశ్రామికాభివృద్ధి గణనీయంగా వున్నా, ఆధిక్యత పొందలేదు. గుత్తపెట్టుబడి వర్గాలు అదుపు లేకుండా పెరిగాయి. ఆర్థికశక్తి బడా బూర్జువావర్గంలో కేంద్రీకరించబడింది. సోషలిస్టు ప్రపంచం ముఖ్యంగా సోవియట్ యూనియన్ తో సంబంధాలు బలపడి, అనేక పరిశ్రమలు స్థాపనతో. జాతీయ స్వాతంత్ర్యం బలోపేతమైంది. అమెరికా పెట్టుబడి దిగుమతి అప్పుల సహాయంతో, బడా బూర్జువావర్గ పొత్తు సంబంధాలు పెరిగాయి. ఆర్థికాభివృద్ధి వలన విధానంతో భారాన్ని ప్రజలపై మోపుటతో ధనికులు మరింత ధనికులుగ, పేదలు మరింత పేదలుగ అయ్యారు.

ప్యాదలు సంబంధాలు సంస్కరించబడుతున్నా ఫలితాలన్నీ ధనిక రైతులకే చేరుతున్నవి. భూస్వాములు శక్తివంతులై, వారి దౌర్జన్యం యెక్కువగుతున్నది. వ్యవసాయం తొలకరి అనిశ్చిత పరిస్థితులపై ఆధారపడి, అర్ధ స్తబ్దతలో వుంది.

కార్మిక, కర్షక, మేధావి వర్గాలు మరింత దారిద్ర్యానికి గురయ్యారు. ఫలితంగా వారి పోరాటాల తీవ్రత పెరిగింది. కాని వారిలో ఐక్యత లోపించింది. ఈ బలహీనతను అధిగమించాలి. అనేక ప్రాంతాలలో అసంతృప్తిని మతోన్మాద శక్తులు వినియోగించుకొని కుల, మత, ప్రాంతీయ తత్వాలను పోషించుతున్నారు. కరుడు గట్టిన అభివృద్ధి నిరోధక శక్తులు బహిరంగే స్వతంత్ర రాజకీయపార్టీనియేర్పాటుచేసు కొన్నవి. మన విదేశాంగ విధానం, ప్రభుత్వ, పబ్లిక్ రంగ పారిశ్రామిక విధానాన్ని, భూసంస్కరణలపై దాడిని, ప్రారంభించింది.

అనేక రాష్ట్రాలలో పార్టీ ప్రభావం పెరిగింది. అయినా నిర్ణయాత్మకశక్తిగా రూపొందలేదు. అందుకు యింకా చాల దూరంలో వున్నాము.

9) పార్టీ కాంగ్రెసు జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా సమస్యలను పరిశీలించి మార్గదర్శక అవగాహన యిచ్చింది.

కాంగ్రెసులోని ప్రజాస్వామ్య శక్తుల ఆలోచనా విధానాలను, ఆచరణలో వారికిగల పరిమితులను వివరించింది. కాంగ్రెసువాదులు వూగిసలాటలు స్థిర అవగాహన లేనివారైనప్పటికి కాంగ్రెసులోన, బయటవున్న అభివృద్ధి నిరోధకులతో పాటు వర్గీకరించరాదు. పునరాలోచనా క్రమం సాగుతున్నది. ఈ శక్తులు కాంగ్రెసు విధానాలపై ప్రభావాన్ని కలుగజేయగల శక్తివంతమైనవి. వీరు పూర్తిగ నెహూర్రిపై ఆధారపడి, నెహూర్రి మితవాదులతో రాజీపడినపుడు నిస్సహాయులై, కాంగ్రెసు అభ్యుదయకర తీర్మానం చేయుటకు సహాయపడుతున్నా, అమలులో నిస్సహాయులు.

వామపక్ష పార్టీల ఐక్యత లేదు, కేంద్ర ప్రభుత్వోద్యోగుల సమ్మె పోరాటాలలో అధిక సంఖ్యాక కార్యకర్తలు, అనుచరులు కమ్యూనిస్టులతో కలసి పని చేసారు. ఈ పరిస్థితులలో సమస్యలపై ఐక్య కార్యాచరణ అనుసరణీయము.

పారిశ్రామిక కార్మికులు వారి సమస్యలపై జాతీయ స్థాయి పోరాటాలు చేసిన, సాధారణ ప్రజాసమస్యలు, రైతు పోరాటాలకు మద్దతు పోరాటాలు కాని, రాజకీయ పోరాటాలు కాని చెప్పుకొనతగినవి లేవు. ప్రభుత్వ విధానాలపై ప్రభావాన్ని కలుగ జేయగలిగిన పోరాట దశకు కార్మికోద్యమము చేరలేదు.

కాంగ్రేసేతర ప్రజాస్వామ్య శక్తులు ప్రజల జీవన ప్రమాణాన్ని, పౌర హక్కులను రక్షించాలంటే కాంగ్రెసు ప్రజాసామాన్యంతో ఐక్యకార్యాచరణ నిర్మించాలనే కాంగ్రెసులోని ప్రజాస్వామ్యవాదులను బలపరచాలని, సామాన్య జాతీయకర్తవ్యాల నిర్వహణలో వారితో చేతులు కలపాలని గత అనుభవాలు నేర్పుతున్నవి. వివిధ శ్రామిక వర్గాలలో ఐక్యతావాంఛ ప్రగాఢమైంది.

శక్తివంతమైన విస్తృత ఐక్య ప్రజోద్యమానికి పరిస్థితులు అనుకూలంగా వున్నవి. ప్రచారోద్యమం, పోరాటాలు తదితర ఐక్యకార్యాచరణ రూపాలద్వారా ఐక్య ప్రజోద్యమం నిర్మాణమవుతుంది. అభివృద్ధి నిరోధకులకు, మితవాదులకు వ్యతిరేక పోరాటాలలో ఐక్యసంఘటన బీజాలు మొలకెత్తుతవి.అట్టి ఐక్య సంఘటనా ప్రజోద్యమాల పోరాటాలతోనే ప్రభుత్వ విధానాలలో అభ్యుదయకర మార్పులకు మార్గమేర్పడుతుంది. అట్టి వుద్యమంలో అన్ని దేశభక్త వర్గాలను, ప్రజాస్వామ్య శక్తులను సమీకరించగలగాలి.

ఈ సందర్భంలో కార్మికవర్గ ముఖ్య ప్రయోజనాల రక్షణ వారి జీవన పరిస్థితులు మెరుగు పరచుటకు ఐక్యకార్యాచరణ రూపొందించుట అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది.

జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటనలో కార్మిక,కర్షక పెటీ బూర్జువా జాతీయ బూర్జువా వర్గాలు కలసిన వర్గాల పొందిక. ఈ సంఘటనకు కార్మిక కర్షక ఐక్యత మౌలికమైనదే గాక యిరుసులాంటిది. కాన సంఘటనలోనికి వచ్చే వర్గాల యెడల వాటి రాజకీయ పార్టీల యెడల సరియైన అంచెనా దృక్పథం నిలకడ దృఢతర నహానంతో కూడిన వివరణాత్మక ప్రయత్నాలు అవసరము. ఐక్యసంఘటనా వ్యతిరేక పార్టీల యెడల సహనము వారి ప్రజాసామాన్యంతో స్నేహ, సౌభాతృత్వ సంబంధాలు పెంపొందించు నేర్పు అవసరము.

వామపక్షాలలో, ప్రజాసోషలిస్టుపార్టీ అనేక విషయాలలో కాంగ్రెసు కంటె మితవాద పార్టీగ వుంది. దీనికార్యకర్తలు, అనుసరించే ప్రజాసామాన్యం విస్తృతవామ పక్ష భావాలు కలిగి, ప్రభుత్వ ప్రజావ్యతిరేక భావాలను పోరాడగలిగివున్నారు. కాన సిద్ధాంత పోరాటాన్ని సాగిస్తూనే అవకాశాలు వున్నప్రాంతాలలో వారిని, వారి ననుసరించే జనసామాన్య కార్యాచరణలో, పోరాటాలలోనికి తీసుకొని రావలసిన అవసరం యెంతో వున్నది.

కాంగ్రెసు దేశ రాజకీయజీవితంలో అత్యంత ప్రాముఖ్యత గలది. కాంగ్రెసు ప్రభావం స్వతంత్ర పోరాటకాలంలో కంటె తక్కువైనా, విస్తృతంగాను, విస్తారంగాను వుంది. ఆ ప్రభావం కార్మికవర్గంతో సహా అన్ని వర్గాలలో వుంది. మన పరిస్థితులలో యీ పెద్ద వాస్తవాన్ని వదలి, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను నిర్మించజాలము. ఏమైనా నేడు కాంగ్రెసుతో సాధారణ ఐక్యసంఘటన సాధ్యమనే నిర్ణయానికి రారాదు. పార్టీ సంబంధాలు తప్పనిసరిగా "ఐక్యతా-పోరాటం"గా వుంటవి. కాంగ్రెసును మితవాద అభివృద్ధినిరోధక పార్టీలతో జమవేయుట పెద్దపొరపాటు కాగలదు. ప్రకటించిన అనేక కాంగ్రెసు విధానాలు కొన్ని చర్యలు నేడు అభ్యుదయకరమైనవి. విదేశాంగ విధానం, ప్రభుత్వ పబ్లిక్ రంగంలో భారీ పారిశ్రామికవిధానం, మతాతీతవిధానాలు అట్టివి.

రెండు వాస్తవాలు : ఒకటి, కాంగ్రెసు దాని ప్రభుత్వవిధానాల వల్లనే ప్రజలపై భారం అధికమై, అసంతృప్తి, నిరాశ, నిస్పృహకలుగుతున్నవి. అభివృద్ధి విరోధకులు యీ అసంతృప్తిని వినియోగించే బలపడ చూస్తున్నవి. పార్టీ బలం వామపక్షాల ఐక్యతతో మాత్రమే, యీ విధానాలపై శక్తివంతమైన పోరాటం సాగించగలము. పోరాటానికి కాంగ్రెసులో విశ్వాసం గల ప్రజలలో పెద్ద భాగాన్ని సమీకరించనిదే వుద్యమానికి విస్తృత చేకూరదు. రెండు మితవాదశక్తులలోని పెద్దభాగాన్ని అత్యధిక భాగం కాంగ్రెసులోనే వుంది పార్టీ మిత్రులలో కాదగిన వారిలో అత్యధికులు కూడ కాంగ్రెసులోనె వున్నారు. తటస్థ విదేశాంగ విధానాన్ని, శాంతి, అలీన విధానాన్ని బలపరచే అత్యధికులు కాంగ్రెసులోను, నెహ్రూ ప్రభావంలోనూ వున్నారు. ఇది వాస్తవం. అంతేగాక ఆ విధానాలపై దాడిచేసే అత్యధికులు కూడ కాంగ్రెసులోనే వున్నారు. ఇదీ అంతటి వాస్తమే. అందువలనే కాంగ్రెసు వాదులకు కాంగ్రెసుపై గల విశ్వాసం అభిప్రాయాలు పరిగణలోనికి తీసుకొని తక్షణ సమస్యలపై నేరుగా విజ్ఞప్తులు చేయాలి.

కాంగ్రెసులోని ప్రజాస్వామ్యవాదులను ప్రజాసామాన్యాన్ని మన మిత్రులుగ మన సంఘటనలో భాగస్వాములు, సహకారులుగ మనం సౌభ్రాతృత్వ వైఖరిని చేబట్టాలి. కాంగ్రెసు అభ్యుదయ ప్రకటనలను విమర్శించుటయేగాక ఐక్యతను పెంపొందించుటకు వినియోగించాలి. ప్లాట్‌లో యీ విషయం చెప్పినా ఆచరణ అశ్రద్ధ చేసామంటూ పార్టి పంచసూత్రాలను పేర్కొంది.

ఐక్యకార్యచరణ రూపొందించునపుడు కాంగ్రెసువాదులతో దేశంలో పెట్టుబడిదారి విధానాన్ని కాంగ్రెసు ప్రభుత్వచర్యలు పెంపొదించుచున్నవని అభిప్రాయభేదాభిప్రాయాలు అందుండే వుద్భవించుచున్నవని ఓర్పులో వివరణోద్యమాన్ని సాగించాలి. విదేశపెట్టుబడిపై గట్టిచర్య తీసుకొనక గుత్తపెట్టుబడిదారులకు రాయితీలను యిచ్చుట, రైతుదృష్టిలో వ్యవసాయ సంస్కరణలు చేపట్టనందున భేదాభిప్రాయాలు వస్తున్నవని వివరించాలి. ప్రజాస్వామ్యవాదుల చైతన్యం, అవగాహన ఉన్నతదశకు చేరుటకు అన్ని ప్రయత్నాలు చేయాలి. జాతి పునర్జీవనానికి పార్టీ మౌలికవిధానాలు ఎంత వాస్తవం సరియైనవో వివరించి, వారిలో విశ్వాసాన్ని కలుగజేయాలి.

స్వతంత్ర కార్యాచరణతోపాటు ప్రతి సమస్యపై సాధ్యమైనంత ప్రజా సమీకరణ ఎత్తుగడలు అవలంభించాలి. ప్రజాకార్యాచరణకు ఐక్యతముందుగా యేర్పడాలని యెంచరాదు. పార్టీ స్వతంత్రపోరాట సన్నాహ ప్రయత్నాలలోను, కార్యాచరణలోను ప్రజాస్వామ్యవాదులు ఆకర్షింపబడు దృక్పదాన్ని ఎత్తుగడలను అవలంభించాలి.

జాతీయ ప్రజాస్వామ్య కర్తవ్యాలు నిర్వహణకే దేశభక్త, ప్రజాస్వామ్య

శక్తులన్నీ కలసి విస్తృత జాతీయ ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణావ అవసరం,. వాటిని జాతీయ పునర్జీవనానికి, జాతి పురోగమనానికి అత్యంత ఆవశ్యకత కలదు. మన స్వాతంత్ర్యాన్ని బలోపేతం చేయుట మన రక్షణ విదేశాంగ విధానాన్ని బల పరచుట, ఆసియా, ఆఫ్రికా దేశాలతో సన్నిహిత సంబంధాలు మన ఆర్థికవిధానంపై విదేశ పెట్టుబడి గల "ఉడుంపట్టును" విదేశ పెట్టుబడి ప్రవేశాన్ని అరికట్టుటప్రభుత్వ పబ్లిక్‌రంగాన్ని నిర్ణయాత్మకపాత్ర వహించునట్లు విస్తృత పరచుట బ్యాంకులు ఇన్సూ రెన్సు జాతీయం చేయాలి. భారీ కీలక పరిశ్రమలను ప్రభుత్వరంగంలో నిర్మించుట. అభ్యుదయకర వ్యవసాయ సంస్కరణలు న్యాయమైన పన్నులవిధానం, కార్మికులకు కనీస వేతనం, కరువుబత్తెము, ప్రవిల జీవన ప్రమాణాన్ని పెంచాలి, ప్రజావ్యతిరేక చట్టాల వుపసంహరణ, పౌరహక్కులు గ్యారంటీ చేయాలి.

10) తృతీయ జనరల్ ఎన్నికలు, 1962 ఫిబ్రవరిలో జరిగాయి. ప్రధాన రాజకీయ పార్టీగ కాంగ్రెసు స్థానం సుస్థిరమైంది. కాంగ్రెసు 1957తో పోల్చితే పార్లమెంటు, అసెంబ్లీలలో అత్యధిక మెజారిటీలలో కొంత కోల్పోయింది. కమ్యూ నిస్టుపార్టీ లోక్‌సభలో ప్రధాన ప్రతిపక్షమైంది. స్వతంత్ర, జనసంఘం, మితవాద పార్టీల బలం పెరిగింది. కాంగ్రెసు అంతర్గత గ్రూపులకుమ్ములాట కారణంగా బలాన్ని కోల్పోయింది.

ప్రధానంగా కాంగ్రెసులో మూడు గ్రూపులు: నెహ్రూ అతని విధాన అనుచ రులు మధ్యేమార్గవాద గ్రూపు, రాష్ట్రాలలోని మితవాద గ్రూపులు, పశ్చిమ బెంగాల్ అతుల్యఘోష్, ఉత్తరప్రదేశ్‌లోని సి.బి. గుప్తావర్గం. కేంద్రంలోని మంత్రులు కొందరు మద్దతుతో మితవాదగ్రూపు: కె.డి. మాలవ్యా నాయకత్వంలో వివిధ అతి వాద వర్గాలుగల నిర్మాణంలేని అతివాద గ్రూపుగా పనిచేస్తున్నాయి.

కాంగ్రెసు కేంద్రనాయకత్వంలో ఐక్యత పునరుద్ధరించుటకు, కామరాజ్ నాడార్ ప్రణాళిక ప్రతిపాదనలలో భాగంగా, కాంగ్రెసును కేంద్రంలో రాష్ట్రాలల్లో బలోపేతం చేయుట, కేంద్రంలోని ప్రముఖ నాయకులందరిని రాష్ట్ర సంస్థలకు బదలీ చేసారు. ఫలితంగా కేంద్ర ప్రభుత్వంలో మితవాద వర్గాలు బలాన్ని కోల్పోయినా, అనేకమంది అనధికార "సిండికేటు" గ్రూపుగా కాంగ్రెసు నాయకత్వంలో ఏర్పడ్డారు.

దీని ప్రభావం 1960 దశకంలో పాలకవర్గపార్టీపై గణనీయంగా వుంది. జయపూర్‌లో 1963 వసంతకాలంలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సమితి సమా వేశంలో కామరాజ్‌నాడార్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు.

కాంగ్రెసు 1952, 57, 62లలో 405, 425, 435 లోక్‌సభ సీట్లలో 364, 371, 356 సీట్లను గెలుచుకొంది. లోక్‌సభకు 45, 48, 45 శాతపు వోట్లను వోట్ల శాతంకంటె అధనంగా 27.3 నుండి 29.4 శాతము సీట్లను పొందగలిగింది.

కాంగ్రెసు మూడు సాధారణ ఎన్నికలలో 50 శాతము వోట్లను పొందజాలక పోయినా 70 శాతము పైగా సీట్లను పొందగలిగింది. ఎన్నికల విధానం దామాషా విష్పత్తిలో ప్రతినిధుల ఎన్నికల పద్ధతికాని కారణంగానే ప్రతినిధుల సంఖ్య ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించబడలేదు. అందువలన్నే ప్రపంచంలోని అతివాదులు సంపాదించిన వోట్ల దామాషా విష్పత్తిలోనే ప్రతినిధులను కేటాయించే విధానం కొరకు ఆందోళన, పోరాటం సాగిస్తున్నారు.

కమ్యూనిస్టుపార్టీ 1952లో 16, 1957లో 29, 1961లో 29 లోకసభ సీట్లు గెలుపొంది, 1957లోవలెనె 1962లో ప్రతిపక్ష స్థానాన్ని నిలబెట్టుకొంది. కాని అభివృద్ధి చెందలేదు.

ప్రజాసోషలిస్టుపార్టీ 1952 తరువాత ప్రధాన ప్రతిపక్ష స్థానాన్ని కమ్యూనిస్టులకు కోల్పోయింది. మితవాద పక్షాలు అంతగా పురోగమించ లేకపోయారు. కమ్యూనిస్టుపార్టీ అతికష్టంతో బలాన్ని నిలబెట్టుకొనగలిగింది కాని పురోగమించ లేదు. ఇది సోచ్చరిక అనక తప్పదు. అంతేగాక కమ్యూనిస్టులు పశ్చిమ బెంగాల్, ఆంధ్రప్రదేశ్, కేరళ, మహారాష్ట్రలలోమాత్రమే తమ వునికి కాపాడుకొనగలిగారు.

స్వతంత్ర పార్టీ గుజరాత్, రాజస్థాన్, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలో ప్రధాన ప్రతి పక్షంగా వుంది. లోకసభలో 24 స్థానాలను సంపాదించి, రెండవ స్థానాన్ని పొందింది.

జనసంఘం 14 లోకసభ స్థానాలను గెలుపొందింది. గతంలో 1952లో 3, 1957లో 4 లోకసభ స్థానాలను సంపాదించింది. ఉత్తర, మధ్యప్రదేశ్‌లలో, ఢిల్లీ, రాజస్థాన్, పంజాబ్‌లలో, జమ్మూ-కాశ్మీర్ రాష్ట్ర అసెంబ్లీలలో ప్రధాన ప్రతిపక్షంగా వుద్భవించింది. జనసంఘం హిందీ భాషా ప్రాంతీయ పార్టీగ రూపొందింది.

ప్రజాసోషలిస్టుపార్టీ, సోషలిస్టు పార్టీలు. బీహార్, మహారాష్ట్ర, ఉత్తర ప్రదేశ్‌లలో మాత్రం కేంద్రీకరింపబడి వున్నారు.

కేంద్రంలో మితవాద పార్టీలైన స్వతంత్రపార్టి, జనసంఘం కలసి 32 స్థానాలను కలిగి, కమ్యూనిస్టుల 35 స్థానాలకు సమీపంగానే వున్నారు. తీవ్ర మితవాదుల, అతివాదుల ప్రాతినిధ్యం లోకసభలో దగ్గరిదగ్గరిగ సరిసమానంగానే వున్నవి.

కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల ఫలితాల సమీక్ష, పాఠాలను నిర్ధారణ చేయుటలో అభిప్రాయ భేదాల వలన భూపేష్‌గుప్తా ఒక సమీక్ష ముసాయిదా, పి.సి.జోషీ మరో సమీక్ష ముసాయిదా జాతీయ సమితికి సమర్పించారు.

జోషి కాంగ్రెసు యెడల "నూతన విధానాన్ని చొరవతో అవలంభించాలని", "వొంటెత్తు విధాన చీకటిగూడు" లోనికిపోరాదని, ఎన్నికల ఫలితాలలో "మితవాద

వర్గాల బలాన్ని ఓటరులు పెంచుట స్పష్టమైంది" అనే దృక్పధాన్ని చేబట్టారు. అంతేగాక "నేడు కరుడు గట్టిన మితవాద అభివృద్ధి నిరోధక శక్తులను, కాంగ్రెసు నెహ్రూ నాయకత్వాన్ని, పేరుగమూడజాలక, మితవాద శక్తులను వేరుచేయు ఎత్తు గడలను రూపొందించనిచో, మన బాధ్యత మరచినవారమగుతాము" అని వివరించారు.

భూపేష్‌గుప్తా "మత, మితవాద శక్తులను తక్కువగా అంఅంచెనా వేయరాదు, అతిశయోక్తిగా, ఆందోళనకరంగాను పరిగణించరాదు. మొదటిది, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా అన్నిమతాతీత అభ్యుదయకర శక్తులను సమీకరించే కర్తవ్యాన్ని కుంటుపరచే, పొంచెత్తుపోకడకు దారి తీస్తుంది. రెండవది కాంగ్రెసు బూర్జువా నాయకత్వాల తోకను పట్టుకొని అనుసరించుటకు దారి తీస్తుంది. ప్రజాస్వామ్య, ప్రతిపక్ష శక్తులకింటె మితవాద శక్తులుబాగా బలపడి వేగంగా పెరుగుటను, యేమైనా ఒప్పుకొనక తప్పదు. మన రాజకీయ జీవితంలో యిది అన్ని విధాల ప్రమాదకరమైన వైఖరి" అని హెచ్చరించారు.

ఒక దృక్పధం ప్రకారం, మత, మితవాద అభివృద్ధి నిరోధక విచ్ఛిన్నకర శక్తులకు వ్యతిరేకంగా కాంగ్రెసులోని "మధ్యేమార్గ వాదులనబడే శక్తులు"ను ఐక్య సంఘటనలో సమీకరించే కర్తవ్యాన్ని పార్టీ చేబట్టాలి. మరో దృక్పధం ప్రకారం, మత, మితవాద శక్తులను పాలకపార్టీ కాంగ్రెసును బలపరచుట ద్వారా విరోధించ జాలము, కారణం, పాలకపార్టీ కాంగ్రెసు ఆచరణే, ఆ శక్తులు పెరుగుటకు, వారు ప్రజల అసంతృప్తిని వినియోగించుకొని బలపడుటకు తోడ్పడుచున్నదని స్పష్టం చేస్తున్నది.

అభిప్రాయ భేదాలు తీవ్రంగా వున్నందున జాతీయ సమితి, ఎన్నికల సమీక్ష చర్చను మరో సమావేశానికి వాయిదా వేసినా, ఎన్నికల ఫలితాలపై ఒక సంక్షిప్త ప్రకటనను ఆమోదించింది, దీని కారణంగా, డాంగే తదితరులు "ఎన్నికల ఓస్టు మార్టం" పరిశీలన అవసరం లేదని వాదించి, సమీక్ష లేకుండా చేసారు..

# 9

# బృహద్వివాద పర్వం

## I

## ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో సిద్ధాంత చర్చలు

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో అనేక సమస్యలపై తీవ్రమైన భేదాభిప్రాయాలు పార్టీల అంతర్గత చర్చలకే పరిమితంగాక, బహిరంగ వాదోపవాదాలగుట వాస్తవం.

సామ్రాజ్యవాదం, సోషలిస్టు ప్రపంచాల మధ్య వర్గపోరాటం తీవ్రతరమగుచున్నందున, ప్రపంచ విప్లవోద్యమ అవసరాలు, అవి వివిధ దేశాల పార్టీల మధ్య భేదాభిప్రాయాలకు వాస్తవ కారణాలుగ యెంచాలిగాని, ప్రపంచ వ్యాప్తంగా కార్మిక వర్గం జరిపే పోరాటాలనుండి వేరుచేసి కారణాలను వెదుకుట, శాస్త్రీయ పద్ధతికాదు.

మాస్కో 81 కమ్యూనిస్టు పార్టీల నవంబరు 1960 సమావేశంలో సుదీర్ఘ చర్చలు జరిగాయి. చైనా ప్రతినిధివర్గం అత్యున్నత స్థాయిలో లీషౌచీ, టెంగ్, పెంగ్, కాంగ్ షెంగ్ తదితర ముఖ్యుల పెక్కుమందిని కలిగివుంది.

సోవియట్ పక్షం సమర్పించిన అసలు ముసాయిదా ప్రతిపాదనలో ప్రాక్షనలిజాన్ని నిషేధించి, సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన సిద్ధాంతాన్ని పునరుద్ఘాటించి అన్ని పార్టీలు విధిగా మెజారిటీ నిర్ణయాన్ని పాటించాలంది.

టింగ్ చైనాదృక్పథాన్ని వివరించి 1957 ప్రకటనను నూతన సంస్కరణవాదంగా తిరస్కరించి, సామ్రాజ్యవాదులకు లొంగిపోవుటగా తీవ్రంగా విమర్శించాడు "కొన్ని సందర్భాలలో మైనారిటీ దృక్పధమే సరియైనది" కాన మెజారిటీ నిర్ణయానికి మైనారిటీ కట్టుబడి వుండనవసరం లేదని, రెండవ ఇంటర్నేషనల్‌లో మైనారిటీ గలిగిన లెనిన్ అనుసరించిన విధానాన్ని ఉదహరించాడు. ఒక పార్టీలో మైనారిటీ, మెజారిటీ నిర్ణయానికి కట్టుబడి వుండవలసిన నిర్మాణ సూత్రాన్ని స్వతంత్రం, సమానత్వంగల స్వతంత్ర పార్టీల మధ్య ఆచరణ యోగ్యంకాదన్నాడు. అత్యంత ముఖ్యమై అంశాలపై నిర్ణయాలను ఎవ్వరూ తొందర పెట్టరాదన్నారు[1].

---

1. హన్‌సుయిన్ (1976) విండ్ ఇన్ ది టవర్ మౌసియంగ్ అండ్ ది చైనీస్ రివల్యూషన్. 1949, పే. 191.

"సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన" అనే దృక్పథం ప్రధానంగా దాడికి గురైంది. కార్మికులు, ప్రజలు రాజ్యాధికారానికై అభివృద్ధి నిరోధక పాత ప్రభుత్వయంత్రాంగాన్ని నాశనం చేయాలి. రాజ్యాధికారాన్ని సంపాదించిన తరువాత సమాజాన్ని శాంతియుత సోషలిస్టు పరివర్తన మార్గంలో పురోగమించుట మరో విషయం "ఈ రెండింటిని గందరగోళ పరచుట "మందమతులపని" "విప్లవవ్యాప్తికి యుద్ధాన్ని చేబట్టాలనియే మార్క్సిస్టుపార్టీ" చెప్పదు. "నూతన సంస్కరణవాదులు మాత్రమే, విప్లవలక్ష్య వ్యతిరేకంగా ప్రపంచ శాంతినినిలబెట్టుతారు. ప్రపంచశాంతిని రక్షించుటకు విప్లవాలు అవసరమనుట అసంగతము.

ప్రకటనలో అనేక రాజీ అంశాలున్నవని మావో తలచారు. చివరి ప్రకటన సోషలిజానికి సాయుధ పోరాటం, శాంతియుత పార్లమెంటరీ పంథా, రెండూ పుదహరించారు. రెండవదానికి మాత్రమే కట్టుబడి వుండాలని కృశ్చేవ్ కోరిన విధంగా పేర్కొనలేదు. ప్రతి సోషలిస్టు దేశపు స్వాతంత్ర్యప్రతిపత్తి పునరుద్ఘాటించబడి, స్వతంత్ర రాజ్యాల మధ్య సాంఘిక, ఆర్థిక, రాజకీయ సహకారంగా సోషలిస్టు పక్షం నిర్వచించబడింది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రపంచ ఉద్యమ నాయకుడుగా కాక అగ్రగామి దళంగా పేర్కొనబడింది.

మావో సోవియట్ 22వ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసుకు,ప్రతినిధి వర్గ నాయకుడైన చౌయెన్‌లై ద్వారా సందేశం పంపాడు. కాంగ్రెసు నూతన "కమ్యూనిజం నిర్మాణానికి కార్యక్రమాన్ని ఆమోదించింది. సోవియట్ యూనియన్" మొత్తం ప్రజాసామాన్యపురాజ్యం" అని కమ్యూనిస్టుపార్టీ ప్రజలందరి పార్టీయని చెప్పింది. వర్గాలులేవని, కమ్యూనిజం నిర్మాణం జరుగుతున్నది కాన కార్మికవర్గ నియంతృత్వం అవసరంలేదని ఉత్పత్తి అభివృద్ధికి 'ప్రోత్సాహకరాలు' వుండాలని కార్యక్రమం సూచించింది. నాటోలో విరాక్రమణ నందిని కృశ్చేవ్ ప్రాతిపదించాడు. "పార్లమెంటరీ మార్గంలో సోషలిజం" అనే సిద్ధాంతాన్ని పునరుద్ఘాటించాడు. సోవియట్‌సహాయాన్ని పుపసంహరించుకొని, అల్బేనియాంపై దాడి చేసాడు, కారణం మధ్యధరా సముద్రపై ఆధిపత్యాన్ని సంపాదించుటకు: మిసలీలకు స్థావరాలను అల్బేనియా విరాకరించుటయేనని తెలుస్తున్నది, అందుకే ఆర్థిక దిగ్బంధాలు మరునటి రోజు" సౌహార్థ పార్టీల మధ్య వివాదం అభిప్రాయ భేదాలు ప్రశాంతంగా అంతర్జాతీయ కార్మికవర్గ దృష్టిలో పరిష్కరింపబడాలని మానమ్మకం. ఏకపక్ష ఎట్టి బహిరంగ అండనము యేసౌహార్థపార్టీపై కావించినా ఐక్యతకు తోడ్పడదు. పరస్పరగౌరం స్వతంత్రం,సమానత్వం పార్టీల మధ్య ఐక్యతకు అవసరమని చైనా కమ్యూనిస్టుపార్టీ తలచుచున్నది" అని చౌయెన్‌లై సభావేదికను వదలివెళ్ళి,లెనిన్, స్టాలిన్ సమాధులపై పుష్పగుచ్ఛాలుంచి చైనా వెళ్ళిపోయాడు. పక్షంరోజులలో రెడ్‌స్క్వేర్‌నుండి స్టాలిన్ శవపేటిక తీసివేయబడింది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితిలో ఎర్రసైన్యపుబలం పెరిగి "ధృఢమైన వైఖరి" చేబట్టాలని వొత్తిడి యెక్కువైంది. ప్రతికమ్యూనిస్టు పార్టీలో చైనా సిద్ధాంతపత్రం చర్చించబడుట సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంత పరిజ్ఞానాన్ని ప్రశ్నించుట జరిగింది. నూతన సైద్ధాంతిక, రాజకీయ చర్చలు అధ్యయన వెల్లువ కొనసాగింది. క్రమశిక్షణాదండం పనిచేయుట మానివేసింది. హాల్బేవ్ పార్టీ 22వ కాంగ్రెసు కార్యక్రమాన్ని విమర్శించుతూ కేంద్ర సమితికి వ్రాసారు. ఇల్గానిన్ కూడ వ్యతిరేకించారు.

చైనాతో "పట్టు-విడుపుల" విధానాలను అవలంభించాలనే అమెరికన్ ప్రజాభిప్రాయాభివృద్ధిని కృచ్చేవ్ గమనించాడు. అమెరికా కష్యూతోగాక చైనాతో సంభాషణలు ప్రారంభించే అవకాశముంది. లావోస్ పరిస్థితిపై జినివా సమావేశంలో అవెరల్ హారిమన్ చైనా ప్రతినిధి వర్గానికి సదభిప్రాయం కలిగించాడు. చైనా విదేశాంగ మంత్రి చెన్‌యీ అమెరికా ఫైవాన్, తైవాన్ జలాలనుండి సైన్యాలను ఉపసంహరించితే సమస్య శాంతియుతంగా పరిష్కారమగుతుందని జినీవాలో అనేకసార్లు ప్రకటించాడు. సోవియట్ యూనియన్ చైనాను కొంత అదుపులో పెట్టగలదని అమెరికా ఆశించి, ఆ రెండు దేశాల యెడల భిన్నవైఖరులను అవలంభించింది. కమ్యూనిస్టు ప్రపంచంలో సోవియట్ యేకచ్ఛత్రాధిపత్యాన్ని కోల్పోయింది. ఈ పరిస్థితులలో అమెరికా "చైనానుతురుపు" ముక్కను చేయ ప్రయత్నించుటలో విచిత్రమేమీ లేదు.

మావో సామ్రాజ్యవాద దురాక్రమణకు వ్యతిరేకంగా ప్రపంచ ఐక్యసంఘటనను రూపొందించవలసిన అవసరముందని పునచ్చరణ చేయ మొదలుపెట్టాడు. కెయిరోలో ఫిబ్రవరి 1962 లో జరిగిన ఆఫ్రో-ఏసియన్ రచయితల సమావేశంలో, మూడవ ప్రపంచ ప్రతినిధి వర్గాలనుండి చైనాకు లభించిన మద్దతును సోవియట్ యూనియన్ అంత తేలికగా మరచిపోలేదు. "చైనా, సోవియట్ యూనియన్, అమెరికా విధానాల జయాపజయాలు, చిట్టచివరకు మూడవ ప్రపంచంలో లేక "మధ్యేమార్గ ప్రాంతాలలో" తేల్చబడుతుందనే విషయం నేడు స్పష్టమయింది." [1]

క్యూబా మిసలీల సంక్షోభం తరువాత కెనడీ సలహాదారుల విశ్లేషణ నాటికంటె, అమెరికా-సోవియట్ సంబంధాలు మెరుగయినవి. కృచ్చేవ్ ప్రపంచ సమస్యలలో అమెరికాతో సమాన భాగస్వామ్యాన్ని, సమాన స్థాయిలో సంప్రదింపులు, అమెరికా పాలక వర్గాన్నుండి సంపాదించాడు. అమెరికా అధ్యక్షుని చుట్టుముట్టియున్న "మేధావి టాంకుదళం" తమకు తెలియకుండానే, చైనా యెలా ప్రపంచ

1. హన్‌సుయిన్ (1976) వింద్ అన్ ది టవర్. మాసియాంగ్ అండ్ ది చైనీస్ రివల్యూషన్. పే. 199.

ప్రమాదకారో అని చెప్పే రష్యా నివేదికల ప్రభావంలో పడిపోయారు. అమెరికా ప్రభుత్వ యంత్రాంగం గడ్డు సమస్యలలో సోవియట్ వహాయాన్ని వాంఛించే సామీప్య సంబంధాలను పెంపొందించుకొంది. కృశ్చేవ్ తన పోరాటాన్ని చైనాతో సాగించుటను ఆయుధాలు పదును పెట్ట ప్రారంభించాడు.

నైరృతి ఆసియాలో చైనా ఆధిపత్య అవకాశపు సిద్ధాంతం, అమెరికా, సోవియట్ యూనియన్‌ల రాయబారుల సంభాషణల, సంప్రదింపుల వేదికను వాషింగ్టన్ నుండి వార్సాకు బదిలీ చేసింది. ప్రజల స్వాతంత్ర్యేచ్ఛ,' సామాజిక మార్పుల యత్నంగా కాక, ప్రతి విముక్తి వుద్యమంలో 'చైనా హస్తం' చూచుట మొదలెట్టారు. అగ్రరాజ్యాలు యీ అవగాహన తొందరలోనే జులై 1963 లో అణు ప్రయోగ నిషేదపు ఒప్పందాలపై సంతకాలు చేసాయి. నేల, నీరు, ఆకాశాలలో మాత్రం అణు ప్రయోగాలను నిషేదించారు. భూగర్భ ప్రయోగాలకు అవకాశముంచుకొన్నారు.

చైనా మద్దతు అవసరమయినపుడు కృశ్చేవ్ వహృదయంతో ప్రవర్తించుట అవసరం తీరిన వెంటనే బిగుసుకు పోవటం మావో గుర్తించాడు. సోవియట్ నాయకత్వం అమెరికా యెడల కృశ్చేవ్ వైఖరికి కలత చెందుటతో ఫిబ్రవరి 1963 లో మర్యాదగా యిద్దరి మధ్య చెలరేగుతున్నా వాగ్యుద్ధానికి వ్వస్తి చెప్పుదామని ప్రతిపాదించాడు. అక్టోబరులో పారిశ్రామిక యంత్రాల విడిభాగాలు, సాంకేతిక నిపుణులను తిరిగి పంపగలనని, సోవియట్-చైనా సరిహద్దు సంప్రదింపులు ప్రతిపాదించి, సరిహద్దును 'చరిత్ర నిర్ణయించింద'న్నాడు. చైనా 16 అక్టోబరు 1963 లో ప్రధమ అణుబాంబు ప్రయోగం జరిపింది.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోని తీవ్ర భేదాభిప్రాయాలు యిటీవలవికావు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభకు పుర్వమేర్పడినవని, మార్క్సిజం, లెనినిజం అధ్యయనం చేయు అందరికి తెలుసు. ఆ మహాసభ చర్చలు, నిర్ణయాలు, కొన్ని ప్రాధమిక సూత్రీకరణలలో మౌలికమైన కొన్ని అంశాలు వున్నవి. అవి యుద్ధమూ శాంతి, సోషలిజానికి పరివర్త పంథాలు, స్టాలిన్ పాత్ర గూర్చి అంచనా, వ్యక్తిపూజా సమస్యలకు సంబంధించినవి. ఇది ప్రపంచమంతటా కమ్యూనిస్టులలో గందరగోళము కలిగించింది. మొదట 1957 లోను, మళ్ళీ 1960 లోను జరిగిన మాస్కో అంతర్జాతీయ కమ్యూనిస్టు సమావేశాలు యీ భేదాభిప్రాయాలను తొలగించ ప్రయత్నించాయి. ఈ సమావేశాల నిర్ణయాలు చరిత్రాత్మకమైన 1957 ప్రకటన, మాస్కో 1960 పత్రాలలో పొందుపరచబడ్డాయి. నిర్ణయాలు అమలు పరచుటలోను, బాష్యం చెప్పుటలోను తీవ్ర భేదాభిప్రాయాలు వచ్చాయి. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం ప్రచండమైన సిద్ధాంత పోరాట సుడిగుండంలో చిక్కుకున్నది. ప్రపంచ కమ్యూనిస్టు ఐక్యతా పునాదులనే యిది కదలిపేపేటంత తీవ్ర దశకు చేరింది.

ఈ సిద్ధాంత పోరాటమంతా రెండు విశాల సోషలిస్టు రాజ్యాలయిన సోవియట్ యూనియన్, చైనా రిపబ్లిక్‌లకు ప్రాతినిధ్యం వహించే రెండు చారిత్రిక ప్రసిద్ధ కమ్యూనిస్టుపార్టీల మధ్య యేర్పడిన వివాదం మాత్రంగా పరిగణించుట తీవ్రమైన పొరపాటు అవుతుంది. రెండు తీవ్రమైన పరస్పర వ్యతిరేక దృక్పధాలకు ప్రాతినిధ్యం వహిస్తూ, ఈ ఉభయ కమ్యూనిస్టుపార్టీల మహానాయకులు మొత్తం వివాదంలో కీలక స్థానం వహించుట వాస్తవం. చర్చించబడే సమస్యలు అతి ప్రధానమైనవి, ప్రతి కమ్యూనిస్టును, పార్టీని, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం మొత్తాన్ని కలవరపరచేవే కాకుండా భారత విప్లవోద్యమంపై ప్రత్యక్ష ప్రభావం కలవి. కాన యీ చారిత్రిక వివాదంలో మనం పాత్రదారులం కాకుండా ప్రేక్షకులుగా వుండుట యెంత తప్పో, తీవ్ర వాగ్వివాదానికి లోనగుతున్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, చైనా కమ్యూనిస్టుపార్టీలలో యేదో వొకదాని వైఖరిని భుజాన వేసుకొనుట అంతే తప్పు అవుతుంది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చేబట్టిన సిద్ధాంత, రాజకీయ పంధా శాస్త్రీయ, మార్క్సిజం-లెనినిజంలకు దూరంగా, సంస్కరణవాద దిశగా తప్పుత్రోవ పట్టిందని కొందరి అభిప్రాయం కాగా, చైనా కమ్యూనిస్టుపార్టీ పంధా, పిడివాదం, వొంటెత్తు పంధా తప్ప మరొకటి కాదని, మరికొందరి అభిప్రాయంగా వుంది. బహిరంగ వివాదము, వాదోపవాదాలు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమానికెంతో హాని కలిగిస్తున్నాయని, వుభయ పక్షాలు రెండోవారి వాస్తవిక వైఖరిని వక్రంగా చిత్రిస్తున్నారని, వివాదస్థాయి నానాటికి, తమ హోదాకు, హుందాతనానికి భంగం కలిగించే విధంగా నానాటికి దిగజారిపోయి మన కార్యకర్తలలో కలవరం, నిస్పృహ కలిగిస్తున్నదని అభిప్రాయపడేవారు కూడ గణనీయంగానే వున్నారు. సోవియట్ యూనియన్, ప్రజాచైనా ఎడమొఖం పెడమొఖం అయితే ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, నూతన యుగాలకు అర్థంలేదు. వివాదగ్రస్థ సమస్యలకు న్యాయం చేకూరాలంటే, భేదాభిప్రాయాలను సరిగా అవగాహన చేసుకొని, మూల కారణాలను కనుక్కొని, స్వభావాన్ని వాటి ప్రాధాన్యతను పూర్తిగ అర్థం చేసుకొనాలి. వాస్తవ దృష్టితో, చారిత్రిక పద్ధతిలో పరిశీలించు ప్రయత్నం చేయాలి.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం, సోషలిస్టు శిబిరం సంఖ్యా బలంలోను, గుణాత్మకంగాను పెరిగాయి అంతర్జాతీయవర్గ పోరాటం తీవ్రతరం కావడం, సామ్రాజ్యవాదం, సిద్ధాంత, రాజకీయ సైనిక దాడులను ముమ్మరం చేయడం ప్రపంచ విప్లవోద్యమం యొక్క అవసరాలు, మార్క్సు పరిభాషలో పెటుబడిదారి విధానపు సంక్షోభపు మూడవదశలో అంతర్జాతీయ వర్గపోరాటపు క్రమంలో పార్టీల మధ్య భేదాభిప్రాయాలు, ఆ పోరాటాల నుండి అభిప్రాయభేదాలకు మౌలిక కారణాలను వెదుకుట వ్యర్థప్రయత్న మవుతుంది. అవి ఆ పోరాటాల అవగాహనల ప్రతిబింబాలు తప్ప మరొకటి కావు. ఈ అంతర్జాతీయ వర్గపోరాటం అత్యంత తీవ్రదశకు చేరుకొని

అనేక అత్యవసరం, క్లిష్టము అయిన పమస్యలను తెచ్చిపెట్టింది. అవి ; యుద్ధము, శాంతి, వలస, అర్ధవలస జాతీయ విముక్తి పోరాటాల వెల్లువ, సోషలిస్టు దేశాల మధ్య పార్టీల మధ్య సంబంధాలు, అనేక దేశాలలో సోషలిజానికి పరివర్తన రూపాలు పద్ధతులు, మొదలయినవి. వీటికి మార్క్సిజం, లెనినిజం ప్రాతిపదికపై సరియైన విప్లవ పరిష్కార మార్గాల అన్వేషణలో, పోరాటాలలో వాటిని ఆచరణలో పెట్టుటలో ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో భేదాభిప్రాయాలు మౌలికంగా యేర్పడు తున్నాయి.

మార్క్సిస్టు, లెనినిస్టు మౌలిక సిద్ధాంత సూత్రాలు కాలదోషంతో చెల్లకుండా పోయాయి. మార్పులు, సవరణల అవసరముందా, నేటి నూతన వాస్తవ పరిస్థితుల ప్రాతిపదికపై నూతన సిద్ధాంతాలను, సూత్రాలను రూపొందించాలా అన్న విషయాన్ని, ఆచరణతోని విప్లవకారులు శాస్త్రీయ పద్ధతులలో పరిశీలించవలసిన అవసరం యెంతయినా వుంది. ఇది హడావుడిగా కాక నింపాదిగా, ప్రశాంతంగా, ఉద్రేకరహితంగా చేయాలి. ఆ క్రమంలోనే యీ అభిప్రాయభేదాలకు మౌలిక కారణం కన్పడుతుంది.

మూడో ఇంటర్నేషనల్ 1943 లో రద్దయింది. ఉద్యమాభివృద్ధి, శాఖలు అనేకమగుట, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం ఎదుర్కొంటున్న వివిధ సమస్యలకు వొకే ఒక పార్టీ కేంద్రం పరిష్కార మార్గాలు రూపొందించి తోడ్పడజాలదని స్పష్టం చేసారు. తరువాత కమ్యూనిస్టు ఇన్ఫర్మేషన్ బ్యురో యేర్పడి పని చేసింది. దాని నిర్ణయాలలో అనేకం "అవకతవకగా, అసమన్వయంగాను, అసందర్భంగాను, ఆదేశాత్మకంగానూ ఉన్నవి. అది కూడ తరువాత రద్దయింది. సంప్రదింపుల తరువాత 1957, 1960లలో ప్రపంచ కమ్యూనిస్టు సమావేశాలు జరిగాయి. ఇవన్నీ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి తోడ్పడాలనే సమస్యలు, ఉద్యమాలను సమన్వయం పరచాలనే సమస్యలు, నూతన పరిస్థితులకు తగిన మార్గాన్ని అన్వేషించటానికి జరిగిన ప్రయత్నాల సమావేశాలు తప్ప, సంస్థగా యేర్పడలేదు.

పెట్టుబడిదారి విధానపు సాధారణ సంక్షోభం ప్రస్తుత దశలో దాని స్వభావం, సామ్రాజ్యవాదుల మధ్యయుద్ధం అనివార్యం అని చెప్పేలెనినిస్టు సూత్రం చెల్లుబడి అవుతుందా? కాదా? యుద్ధం నివారించుట సాధ్యమా అనే సమస్యలు స్టాలిన్ కాలంలోనే చర్చకు వచ్చాయని, నిర్ణయాలు జరిగాయని అందరకు తెలిసినదే. నూతన పరిస్థితులకు అనుగుణంగా లేవని సోవియట్ నూతన నాయకత్వం 1956లో జరిగిన 20వ, పార్టీ కాంగ్రెసులో అన్ని మౌలిక సమస్యలను చర్చించి, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం యెదుర్కొన్న సమస్యలన్నిటిపైన తీర్పునిచ్చింది, ఏకపక్షంగా నిర్ణయాలను చేసింది. అప్పటికే కొన్ని సోదర పార్టీలు రాజ్యాధికారంలో వున్నాయి, మరికొన్ని పెరిగిపెద్దవై, అవాడు ఎదుర్కొంటున్న అన్ని క్లిష్ట సమస్యలపైనా చర్చలకు తోడ్పడే శక్తి సామర్థ్యాలను కలిగివున్నవి. అయినా సోవియట్ పార్టీ

నాయకత్వం, సోదరపార్టీలతో తగిన సుహృద్భావ చర్చలు జరుపలేదనుటకు విదా
రించవలసి వస్తున్నది. సోవియట్, 20, వ పార్టీ మహాసభ ఏకపక్షంగా చేసిన నిర్ధ
యాలను ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలపై రుద్దేవాత్రిడి కొనసాగింది. సోవియట్
కమ్యూనిస్టుపార్టీలాంటి వొకపెద్ద పార్టీ ఆ విధంగా చేసే హక్కువుందా అనే ప్రశ్న
అటువుంచి, అది అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో వాంఛనీయమైన సిద్ధాంత,
రాజకీయ ఐక్యతను సాధించజాలకపోయిందని చెప్పకతప్పదు. ఆది వాస్తవంగా
పార్టీలలోపల, పార్టీల మధ్య వివాదాలకు దారితీసే తీవ్రమైన భేదాభిప్రాయాలకు
నాందీ వాచకమైంది. ఇది వాస్తవం[1].

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోని అభిప్రాయ భేధాల చర్చ అతితీవ్రంగా
సోవియట్ యూనియన్, చైనా రిపబ్లిక్‌ల కమ్యూనిస్టుపార్టీల మధ్య అంతటి తీవ్రం
గానే భారత కమ్యూనిస్టు ఉద్యమంలో జరిగింది. ఇతర దేశాల పార్టీలలో జరిగినా
అంతటి తీవ్రస్థాయికి చేరలేదు. వివాదగ్రస్థంగా వున్న సమ్యలు 1) నూతనయుగం
2) యుద్ధం-శాంతి సమస్య పైరుద్యాలు, నిరాయుధీకరణ 3) శాంతియుత సహ
జీవనం, శాంతియుత పోటీ, ప్రజలరాజ్యం, ప్రజలపార్టీ, భౌతికపోత్సాహకాలు. 4)
పెట్టుబడిదారి విధానం (సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన-జాతీయ ప్రజా
స్వామ్యం-పెట్టుబడిదారేతర పంథా 5) జాతీయ విముక్తి వుద్యమాలు 6) వ్యక్తి
పూజా విధానం 7) మితవాద, అతివాద సంస్కరణ వాదాలు. 8) దేశాల మధ్య,
కమ్యూనిస్టుపార్టీల మధ్య సంబంధాలు. 9) ప్రపంచ ఉద్యమ నాయకత్వ సమస్యలు
ప్రధానమైనవి. ఈ సమస్యలపై జరిగిన చర్చలు వివిధ దేశాలలోని కమ్యూనిస్టు
ఉద్యమాలపై, భారత కమ్యూనిస్టు ఉద్యమాలపై, భారత కమ్యూనిస్టు పార్టీపై ప్రధా
నంగా సగంసగంగా చీలిపోయేటంతటి తీవ్ర పరిణామాలను కలుగజేసాయి. అంచేత
సమస్యలపై జరిగిన చర్చలను వివరంగానే తెలుసుకొనవలసిన అవసరం వుంది.

## II

## నూతన యుగం

ఈ యుగపు అవగాహనపై లెనినిజం "శిధిలమగుతున్న సామ్రాజ్యవాదం
పెట్టుబడిదారి విధానం, సోషలిస్టు ప్రాంగణంలో వుంది." అని, యే యుగంలోనైనా

---

1. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో చర్చించబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు
పార్టీ కాంగ్రెసుముందు చర్చలకు సహాయకారిగాప్రచురణ. 1962 (?) తెలుగులో
పే. 12-15.

ఏ వర్గం కేంద్ర, ప్రముఖ స్థానాన్ని ఆక్రమించియున్నదో దానినిబట్టి ఆ యుగం యొక్క ప్రధాన స్వభావాన్ని, ప్రధాన అభివృద్ధి దిశను, ఆ చారిత్రిక పరిస్థితులలో ప్రధాన లక్షణాన్ని మనం తెలుసుకోగలం, అని తెలుపుతుంది. వివిధ దేశాల చారిత్రిక చెదురు మదురు కదనాలను బట్టిగాక ప్రధాన మౌలికాంశాలనుబట్టి అనగా భూమికగా చేసుకొని వ్యూహం, ఎత్తుగడలను రూపొందించుకోవగలమని లెనిన్ మనకు బోధించాడు. లెనిన్ 1920లో నిర్వచించిన యుగంకంటె గుణాత్మకంగా ప్రత్యేక నూతన యుగంలో మనం వున్నామా? అలాంటి నూతనయుగంలో వుంటే వ్యూహం, ఎత్తుగడల పంథాను రూపొందించవలసి ఉంటుంది లెనిన్ చెప్పిన అదేయుగం అయినట్లయితే, అటువంటి ప్రయత్నాన్ని సంస్కరణవాదంగా తీవ్రవిమర్శకు గురిచేయవలసి వుంటుంది[1]"అని సాధారణ సూత్రాన్ని సేన్ వివరించారు.

సోవియాట్ కమ్యూనిస్టుపార్టీ 20వ, కాంగ్రెసు 1956లో "సోషలిజం వొక దేశపు సరిహద్దులనుండి విస్తరించి, ప్రపంచ వ్యవస్థగా రూపొందుట యీ యుగపు ప్రధాన లక్షణంగా పేర్కొంది. సామ్రాజ్యవాద వలస విధాన విచ్ఛిన్నత, యుద్ధానంతర చారిత్రక నిర్మాణ ప్రాముఖ్యతగల అభివృద్ధికాంశంగా పేర్కొంది.

మాస్కో 1957 ప్రకటన, యీ యుగపు ప్రధాన లక్షణం పెట్టుబడిదారీ విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన, రష్యాలో అక్టోబరు విప్లవంతో ప్రారంభమైందని, నేడు మానవజాతిలో మూడవవంతు ప్రజ సోషలిస్టు పంథాను చేబట్టి నూతన జీవిత నిర్మాణం చేస్తున్నారన్నది. సోషలిస్టు శక్తుల విస్తృతాభివృద్ధి, అనేక వలస దేశాలదాస్య విముక్తి, సామ్రాజ్యవాదం ఆధిక్యతను కోల్పోవుట, సోషలిస్టు, నూతన స్వాతంత్ర్య దేశాలు నిర్ణయాత్మక పాత్ర వహించుటతోయేర్పడిన పరిస్థితులలో శాంతియుత పరివర్తనావకాశాలు యినుమడించాయి. నేటి శకంలో ప్రపంచాభివృద్ధి "రెండు పరస్పర వ్యతిరేక సమాజాల పోటీ ఫలితాలచే నిర్ణయించబడుతుందని"[2] పంచశీలసూత్రాలు బాడుంగు సమావేశంలో నూతన స్వతంత్ర దేశాల ప్రజల ఆమోదం పొంది, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం, శాంతి ఉద్యమం పంచశీల సూత్రాలను చేబట్టుటతో ప్రపంచ ప్రజల ధ్యేయం 'పంచశీల' సూత్రాలలయ్యాయి అని వివరించింది.

చైనా ప్రతినిధివర్గం మావో నాయకత్వంలో మాస్కో 1957 సమావేశంలోనే ప్రకటనపై తమ అభిప్రాయ భేదాన్ని సంక్షిప్తపత్రంగా సోవియట్పార్టీ

---

1. సేన్,మొహిత్ (1964) దిన్యూలైన్ అండ్ ది డాగ్మాటిస్ట్స్, సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 5 న వుదహరించబడినది.

2. బేసిక్ డాక్యుమెంట్సు, 1957, 1950, 1969 కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీల మాస్కో మీటింగ్సు (ఆంగ్లంలో) కమ్యూనిస్టుపార్టీ పబ్లికేషన్. 1972. పే1-3.

కేంద్ర సమితికి సమర్పించింది. యుగలక్షణాలను 1960 వేనవిలో "లెనినిజం చిరస్థాయి అగుగాక" "అన్న వ్యాసంలో" మనం ఒక మహత్తర నూతనయుగాన్ని ఎదుర్కొంటున్నాం. సోషలిస్టు శక్తులు సామ్రాజ్యవాద శక్తులను అణచివేసి ముందుకుసాగటం, అట్లాగే ప్రపంచంలో విద్రణావస్థమండి మేల్కొన్న ప్రజలు అభివృద్ధి నిరోధక శక్తులను అణచివేయటం యీ యుగం యొక్క ప్రధాన లక్షణం[1]" అని నిర్వచించింది. చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటి 14 జూన్ 1963న సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీకేంద్రసమితికి వ్రాసిన లేఖలో "ఈ యుగం" "విషయమై" మన యీ యుగలక్షణాలను రెండు ప్రకటనలు, 1957 ప్రకటన, 1960 పత్రము, సోషలిస్టు విప్లవానికి నిర్మాణానికి వుమ్మడి సూత్రాలను పేర్కొంటూ, కమ్యూనిస్టు, వర్కర్లపార్టీల అన్నిటి ఉమ్మడి కార్యాచరణ విధానాన్ని నిర్ణయించాయి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సాధారణ కార్యక్రమాలే అవి. "ప్రపంచంలో వచ్చిన మార్పును "అది సోషలిజానికి, పీడిత ప్రజలందరికి, అన్ని పీడిత దేశాలకు అత్యంత అనుకూలంగాను, సామ్రాజ్యవాదానికి, అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా మార్పు చెందింది" అని చెప్పింది.

జూన్ 14, 1963 చైనా లేఖకు సమాధానంగా సి.పి.యస్.యు. కేంద్ర సమితి జూలై 1963లో బహిరంగ లేఖను ప్రకటించింది. అది "మన యుగపు(లక్షణాల) సారాంశం, పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి (శాంతియుత) పరివర్తన మహోన్నత సోషలిస్టు అక్టోబరు విప్లవంతో ప్రారంభమైంది. ప్రత్యర్థి రెండుసామాజిక వ్యవస్థల పోరాటాల యుగం సోషలిస్టు విప్లవాల జాతీయ విముక్తి విప్లవాల యుగం, సామ్రాజ్యవాద పతనం, వలస విధానం నమసిపోయేయుగం, నూతన ప్రజాసామాన్యం సోషలిస్టు పథంలో పురోగమించేయుగం, ప్రపంచమంతటా సోషలిజం కమ్యూనిజం విజయం పొందేయుగం[2]"గా సోవియట్ లేఖ నిర్వచించింది. ప్రపంచ సౌహార్థ కమ్యూనిస్టు పార్టీల విశ్లేషణను పునరుద్ఘాటించింది. అందుచేత యుగనిర్వచనాలలో చైనా, సోవియట్ యూనియన్ మధ్య ఎట్టి భేదాభిప్రాయం లేదనుట స్పష్టం, ఆచరణ, వ్యాఖ్య వివరణలలోనే అభిప్రాయ భేదాలు అని భారత కమ్యూనిస్టులలో ఒక వర్గ అభిప్రాయం.

---

1. లెనిన్ చిరస్థాయి అగుగాక, అన్న వ్యాసం నుండి; ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చర్చింపబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు (తెలుగు) పత్రంలో పే. 19-20లోని వుదహరింపు.
2. సి.పి.యస్. యు. కేంద్ర సమితి బహిరంగ లేఖ (జూలై1963) సోవియట్ యూనియన్ కమ్యూనిస్టులకు, పార్టీశాఖలకు వ్రాయబడినది. లేఖ IV భాగంలో పే 37లోని వుదహరింపు.

"మనయుగంలో ప్రపంచాభివృద్ధి, రెండు పత్యర్థి సామాజిక వ్యవస్థల పోటీ క్రమ ఫలితం నిర్ణయిస్తుంది. గత 40 సంవత్సరాలుగ పెట్టుబడిదారి విధానం కంటె సోషలిజం అత్యున్నత సామాజిక వ్యవస్థగా రుజువైంది. పెరిగి బలవంతమౌతున్న సోషలిస్టు వ్యవస్థ. శాంతి, స్వాతంత్ర్యం, అభ్యుదయాల ప్రయోజనాలకై, అంతర్జాతీయ పరిస్థితిపై రోజురోజుకి అత్యధిక ప్రభావాన్ని కలుగజేస్తున్నది."[3]

లెనిన్, గుత్తపెట్టుబడిదారి విధానపు అత్యున్నత దశే సామ్రాజ్యవాదం, శిథిలమగుతున్న పెట్టుబడిదారి విధానం మరణావస్థలోని చివరి దశ, సోషలిస్టు విప్లవ ప్రాంగణంలో వుంది అని వివరించారు. అంతేగాక, ఒక యుగంలో చారిత్రికోద్యమాలు ఎంత వేగంగా, విజయవంతంగా అభివృద్ధి చెందునో చెప్పజాలముకాని, యీ యుగం లేక మరొకయుగంలోకాని యేవర్గం కేంద్ర స్థానాన్ని ఆక్రమించి యున్నది చెప్పగలమన్నారు. అదే ఆ యుగపు స్వభావాన్ని, దాని అభివృద్ధి మార్గాన్ని, ఆ యుగంలో చారిత్రిక పరిస్థితుల లక్షణాలను నిర్ణయిస్తుందని చెప్పగలమన్నారు.

పెట్టుబడిదారి వర్గం, సామ్రాజ్యవాదం తనను నాశనం చేసే కార్మిక వర్గాన్ని తానే సృష్టించుకొంటుందని మార్క్సు చెప్పితే, లెనిన్ సామ్రాజ్యవాదం "కార్మిక వర్గం సామాజిక విప్లవ ప్రాంగణంలో వుందని, మరోమాటలో తానే ఆ విప్లవానికి జన్మ యిచ్చేయుగం అనీ అర్థంలో ప్రవచించారు. ఒక్కమాటలో సామ్రాజ్యవాదం, కార్మికవర్గ విప్లవయుగం అని అర్థం. దీనికి నేపథ్యంగా పారిస్ కార్మిక విప్లవం, జర్మను కార్మిక విప్లవాలు, విజయవంతమైన అక్టోబరు విప్లవం వున్నాయి. విప్లవాలు విజయం పొందవచ్చు లేక ప్రతిఘాతక విప్లవ శక్తులచే అణచివేయబడవచ్చు, బహుశా అందుకే లెనిన్, "సామ్రాజ్యవాదం-కార్మిక విప్లవాలయుగం"గా మాత్రమే చెప్పారు. అక్టోబరు విప్లవానంతరం జరిగిన జర్మన్, హంగెరీ కార్మిక విప్లవాలు అపజయాన్ని పొందుటను, అదే విధంగా చిలీ విప్లవం అపజయం పొందుటను బట్టి సామ్రాజ్యవాదం, కార్మిక విప్లవాలయుగంగానే పేర్కొనుట యెంతో సమంజసంగా కన్పించుతున్నది.

మాస్కో 1960 పత్రంలో శీర్షికకు సూత్రం "యుగం" అనేమాట వాడి, విషయ వివరణ అంతటా 'నూతనయుగం' అనేమాట వదలివేసి, "మనకాలంలో" "యీ కాలంలో" అనే మాటను ప్రత్యామ్నాయంగా వాడుటను గమనించాలి. "మన కాల స్వభావం పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి పరివర్తన చెందుట, ఇది అక్టోబరు విప్లవంతో ప్రారంభమైంది, యీ కాలం రెండు పరస్పర వ్యతిరేక సామా

3. ది బేసిక్ డాక్యుమెంట్సు. మాస్కో మీటింగ్సు, కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీస్. 1957, 1960, 1969. పి.పి.ఐ. పబ్లికేషన్. పే. 1-2.

జిక వ్యవస్థల మధ్య పోరాటకాలం, సోషలిస్టు, జాతీయ విముక్తి విప్లవాలకాలం, సామ్రాజ్యవాదం వలన విధాన పతనకాలం, అశేషప్రజానీకం సోషలిస్టు పంథాకు పరివర్తన చెంది, సోషలిజం, కమ్యూనిజం ప్రపంచ విస్తృతిలో జయం పొందే కాలంగా" మాస్కో పత్రం 'మనకాల' స్వభావాన్ని వివరించింది

ఇంకా "మనకాలంలో ప్రపంచసోషలిస్టు వ్యవస్థ సమాజాభివృద్ధిలో నిర్ణయాత్మక పాత్ర" వహించుట ప్రధాన అంశం అగుట, ప్రధాన లక్షణంగా పేర్కొంది. "నేడు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, సమాజ సోషలిస్టు పరివర్తనకై, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు సమాజ చారిత్రికాభివృద్ధి ప్రధాన స్వభావ వైఖరి, లక్షణాలను నిర్ణయిస్తాయి." సామ్రాజ్యవాదం చరిత్ర పురోగమనాన్ని ఆపజాలదు. మరిన్ని సోషలిస్టు విజయాలకు ధృఢమైన పునాది యేర్పడింది. పూర్తి సోషలిస్టు విజయం తధ్యం.

ప్రపంచ పెట్టుబడిదారి వ్యవస్థ తీవ్ర సంక్షోభాలకు లోనగుట, స్వరక్షణకై గుత్తపెట్టుబడి దారి వ్యవస్థగా పరిణామ మొందుటను త్వరితం చేసింది, వెనుకబడిన దేశాలను, ప్రపంచ ప్రజలను మరింత దోపిడికి గురిచేసి బొక్కసాలు నింపుకొన్నా వివిధ వైరుధ్యాలను పరిష్కరించజాలని కారణంగా, అవి మరింత తీవ్రమైనాయి.

పెట్టుబడిదారి విధానంలో సంక్షోభం మూడవదశకు చేరిందని, ఆర్థిక పోటీలో తన ఆర్థిక ఔన్నత్యాన్ని సోషలిజానికి అనుకూలంగా కోల్పోవుట, ఫలితంగా ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారి విధానం, సైనికతత్వం పెరుగుట, జాతిమొత్తంగా గుత్త పెట్టుబడిదారి వర్గాల మధ్య వైరుధ్యాలు పెరుగుట, బూర్జువా ప్రభుత్వాలు ప్రజాస్వామ్య హక్కులను హరించివేసి నిరంకుశ, ఫాశిస్టు దౌర్జన్య, రాజకీయ, సైద్ధాంతిక పరిణామాలు యే యుద్ధ సంక్షోభకాలంలోనోగాక రెండు వ్యవస్థల మధ్య ఆర్థిక పోటీ ఫలితంగా ఏర్పడినవి. ప్రపంచ శక్తుల బలాబలాలలో సోషలిజానికి అనుకూల మార్పులు వచ్చాయి. సామ్రాజ్యవాదులలో వైరుధ్యాలు మరింత పెరిగాయి.

భారత కమ్యూనిస్టు పార్టీ చర్చలలో వివాదాంశమైన నూతనయుగం, దాని లక్షణాలపై వెల్లడైన వివిధ అభిప్రాయాలను స్థూలంగా చూద్దాము

"అంతర్జాతీయంగా ఈ యుగంలో ఏ వర్గం ఆధిపత్య స్థానాన్ని ఆక్రమించింది అనునది మార్పుల మౌలిక సమస్య ప్రతి కమ్యూనిస్టుపార్టీ ఈ పరిధిలో జాతీయ పరిస్థితులు, సందర్భాలకు అనుగుణంగా తన పంథాను రూపొందించుకొంటుంది.

"ప్రధమ ప్రపంచ యుద్ధానికి దారితీసిన గుత్తపెట్టుబడి అభివృద్ధి కాలాన్ని లెనిన్ "పెట్టుబడిదారి అత్యున్నతదశ", "సామ్రాజ్యవాద యుగం"గా అభివర్ణిం

చాడు. జయప్రదమైన అక్టోబరు విప్లవం, ఓటమి పొందిన అటువంటి యూరపు దేశాలలోని కొన్ని కార్మికవర్గ విప్లవాలను, అంతర్జాతీయ కమ్యూనిజం, సామ్రాజ్య వాదం, కార్మికవర్గ విప్లవాల యుగంగా నిర్వచించారు. ఈ యుగంలో అంతర్జాతీయ ముగా "సోషలిస్టు విజయం ఎజెండాలోనికి తీసుకొని రాబడింది" ఇది వాస్తవం. 'లెనినిజం చిరస్థాయి అగుగాక', తదితర చైనా రచనలు అనేకసార్లు నొక్కి చెప్పాయి. ఈ విషయంలో అంతగా వివాదంలేదు.

ఇంతకుముందు రెండవ ప్రపంచ యుద్ధానంతర 'యుగం' గురించి చెప్పు కొనని అంశాలను మాస్కో ప్రకటన, యీ యుగంలో సామ్రాజ్యవాద శక్తులు యుద్ధోన్మాద శక్తులపై శాంతి, సోషలిస్టు శక్తులు అంతర్జాతీయంగా గణనీయమైన ఆధిక్యతను సంపాదించాయని చెప్పుతున్నది. "లెనినిజం వర్ధిల్లాలి" అనే చైనా పత్రం యీ అంచనాను ఒక విధంగా ఆమోదించుచున్నది. మాస్కో ప్రకటనలు, "లెనినిజం వర్ధిల్లాలి" అనే చైనా పత్రం రెండు ఒకే విధమయిన అభిప్రాయాన్ని కలిగి వున్నవని వాదించుట సులభసాధ్యమే. ఈ వాస్తవాన్ని గుర్తించుట ఒక్కటే నూతనయుగ స్వభావపు సమగ్ర అవగాహనకేగాక సామ్రాజ్యవాదాన్ని ఓడించి, శాంతి, ప్రజాస్వామ్యం, జాతీయ స్వాతంత్ర్యం, సోషలిజపు శక్తుల విజయాన్ని సాధించుటకు గల నూతనావకాశాల అవగాహనకు చాలదు.

ప్రపంచ 81 పార్టీల ప్రకటన, నూతన యుగం వెల్లడించిన నూతనాంశాలను సమగ్ర పరిశీలన గావించి ఆ భూమికపై సామ్రాజ్యవాద, సోషలిస్టు శక్తుల బలా బలాలలో వచ్చిన మార్పుల అంచనాలకు వచ్చింది. ఆ కారణంగానే ప్రకటన నూతన వ్యూహం, ఎత్తుగడలను ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి రూపొందించింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రపంచ శక్తుల బలాబలాల్లో వచ్చిన మార్పులను యాంత్రికంగా, మొరటు అవగాహనకొచ్చి, సామ్రాజ్యవాదంతో "దెబ్బకు దెబ్బ", "కత్తికి కత్తి", "కుక్క కాటుకు చెప్పుదెబ్బ" అంటూ వేరుగా తలపడే విధానంతో ప్రపంచ యుద్ధాన్ని నిరోధించే పంథా, పెట్టుబడిదారి దేశాలలో అంతర్యుద్ధం సర్వ రోగనివారిణిగా, పరాధీన దేశాలలో సాయుధ పోరాట పంథా సోషలిస్టు విజయానికి, జాతీయ విముక్తికి మార్గంగా చేబట్టింది.

మాస్కో ప్రకటనపై "నేడు వాస్తవంగా నూతన కాలంలో నూతన మార్గ ములో సమస్యలను ప్రజలకై శాంతి, ప్రజాస్వామ్య, సోషలిజాలకై పరిష్కరించే అవకాశాలు యేర్పడినవని" వ్యాఖ్యానించింది. చైనా సాహిత్యం, రేడియో ప్రకటన లలో 81 పార్టీల ప్రకటనను బలపరస్తూ చేసినది కానరాదు. ప్రకటన ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నిర్ణయాత్మకమైనదని, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులతో కలిపి, సహజ చారిత్రికాభివృద్ధి, స్వభావం, ప్రధాన దృక్పథం, మౌలిక లక్షణాలను నిర్ణ

యిస్తుందని తెలిపింది. ఇంకా అంతర్జాతీయ సంబంధాలు రెండు ప్రపంచ వ్యవస్థల మధ్య పోరాటంచే నిర్ణయింపబడుతవి. ఈ విషయమై 1957 లో 12 పార్టీల ప్రకటన "మన యుగంలో ప్రపంచాభివృద్ధిని పరస్పర వ్యతిరేక రెండు సామాజిక వ్యవస్థల మధ్య పోరాట ఫలితాల క్రమం నిర్ణయిస్తుందని" చెప్పింది. దీనిని 1960 ప్రకటన విస్పష్టంగా వివరించింది.

చైనా అధికార ప్రకటనలు, పత్రాలు యెట్టి అభిప్రాయం వెల్లడించలేదు మన యుగం సామ్రాజ్యవాదం కార్మికవర్గ విప్లవాల యుగమని, సోషలిజానికి సామ్రాజ్యవాదంపై ఆధిక్యత వుంది, విజయం తథ్యం. ఈ ఆధిక్యత సామ్రాజ్యవాదంలో సంక్షోభంగా, సామ్రాజ్యవాదుల దురాక్రమణలను శాంతిశక్తులు తిరుగగొట్టుటలో, ప్రపంచ యుద్ధం రాకుండా నిరోధించుటలో, రెండు సామాజిక వ్యవస్థల శాంతియుత సహజీవనం, శాంతియుత పోటీలలో పరాధీన దేశాల పోరాటాలకు మద్దతునిచ్చుటలో, పెట్టుబడిదారి దేశాలతో సోషలిజానికై జరుపు పోరాటాలలో, సోషలిస్టు, జాతీయ విముక్తి పోరాటాలలో నూతన పంథాలో వ్యక్తమవుతుంది. [1]

భారత కమ్యూనిస్టుపార్టీలోని అతివాద వర్గంగా వుండి, తదుపరి 1964 లో మార్క్సిస్టుపార్టీగ యేర్పడి, 1968 ఏప్రిల్ బర్ద్వాన్ ప్లీనం వరకు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని సిద్ధాంత భేదాభిప్రాయాలపై ఎట్టి అభిప్రాయాన్ని అధికార రీత్యా బహిరంగంగా వెలిబుచ్చక, బర్ద్వాన్‌లో ఆమోదించిన తీర్మానం యుగ స్వభావం, లక్షణాలపై వెలిబుచ్చిన అభిప్రాయాలు తెలుసుకొందాము.

అర్థ శతాబ్దం క్రితం పెట్టుబడిదారి విధానం, గుత్తపెట్టుబడిదారి విధానంగా అభివృద్ధి చెందుటను విశ్లేషణ చేసి "సామ్రాజ్యవాదం కార్మికవర్గపు సామాజిక విప్లవదశలోనిది" అని లెనిన్ పేర్కొన్నారు. రెండు ప్రపంచ యుద్ధాలు, అనేక దేశాలలో సోషలిస్టు విప్లవాలు, ప్రపంచ జనాభాలో మూడవ వంతు ప్రజలుగల ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ రూపొందుట, అతివేగంగా పురాతన వలసవిధాన పతనం స్వాతంత్ర దేశాల పుద్భవం, శక్తివంతమయిన కార్మిక, కమ్యూనిస్టుపార్టీల అభివృద్ధి ఎన్నో గొప్ప మార్పులు, ప్రపంచవర్గ శక్తుల బలాబలాలలో పూర్తి మార్పులు వచ్చాయి. "సోషలిస్టు విప్లవాల శకం ప్రారంభమైంది" అని లెనిన్ సిద్ధాంతీకరించిన తరువాత యిదంతా జరిగింది. నేటి యీ యుగాన్ని పరిశీలించి తిరిగి నిర్వహించ వలసిన అవసరం "యీ పనిని" మార్క్సిస్టు-లెనినిస్టు విశ్లేషణ విధానంలో చేయ వలసి వుంది."

---

1. పార్టీ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతపై (1964) సిద్ధాంత వివాదంపై భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి నివేదిక. కాంగ్రెసు పూర్వపు చర్చలకై సి. పి. ఐ. ప్రచురణ, ఆగస్టు 1964 (ఆంగ్లంలో) పే. 14-19.

"మన యుగం వాస్తవంగా నూతన యుగం, పెట్టుబడిదారి విధానం సోషలిజం లోనికి పరివర్తన చెందే యుగం. ప్రపంచాభివృద్ధి క్రమాన్ని నిర్ణయించే ప్రధానాంశంగా అంతర్జాతీయ సోషలిస్టు వ్యవస్థ రూపొందుచున్న యుగం, జాతీయ విముక్తి, సోషలిస్టు విప్లవాల యుగం; వలస విధానం అత్యంత వేగంగా శిథిలమై, విచ్ఛిన్నమవుతున్న యుగం; మరణావస్థలో వున్న పెట్టుబడిదారి విధానానికి, సోషలిస్టు, జాతీయ విముక్తి విప్లవాలకు మధ్య మహా భయంకర వర్గ పోరాటాలు జరుగుచున్న యుగం; ప్రపంచ విస్తృతిలో సామ్రాజ్యవాదం శిథిలమై సోషలిజం, కమ్యూనిజం విజయం పొందుతున్న యుగం" [1] అని వివరించింది. ఈ వివరణ 1957, 1960 అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ అవగాహనను పూర్తిగ పోలి వుంది.

అయితే "నూతన సంస్కరణ వాదం యీ యుగపు నూతన నిర్వచనానికి విశ్వాసపాత్రంగానే వున్నట్లు నటించుతు, కొన్ని ముఖ్యాంశాలను (యుగపు) తన వీలు కొరకు, బిడియం లేకుండా తక్కువ చేసి చెప్పుతు, వాటిలోని కొన్ని అంశాలను తలక్రిందులు చేసి పెద్దవిగా, అతిగా నొక్కి చెప్పుతున్నది. వలస విధానం దగ్గరి దగ్గరిగా నిర్మూలించబడినా, సామ్రాజ్యవాదం దగ్గరి దగ్గరిగా శక్తిహీనం చేయబడినా సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన కాలం చాలావరకు ప్రారంభమైందనే చిత్రాన్నిస్తున్నది. సామ్రాజ్యవాదం చాల బలహీనపడినా, ప్రపంచ మొత్తంగా బలమైన శక్తిగానే పరిగణించాలి, అనవాయితీ పెట్టుబడిదారి దేశాలలో గుత్తపెట్టుబడిదారి శక్తుల పాలన కొనసాగుతూనే వుంది. ముఖ్యంగా ప్రపంచంలో బ్రిటన్, ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, జపాన్, ఇటలీ, అమెరికాలలో వుంది. ఇది వాస్తవం. వలసతత్వం, సామాజిక జీవనంలో కని, వినని సైనికతత్వం, సామ్రాజ్యవాదం చివరి చావు-బ్రతుకుల పోరాటం, తన్నుతాను నాశనం నుండి కాపాడుకొనుటకు సాగించుటను తక్కువ చేసి చూపుట వాస్తవం, త్రోసివేయరానిది. ఈ పొరపాటు దృక్పథమే, నూతన సంస్కరణ వాదానికి మూలపురుషుడైన కృశ్చేవ్‌ను సామ్రాజ్యవాదం "కోటుకు కుట్టబడిన గుండీ లాంటిదని" అంటే అలంకారప్రాయమయినదని "ఎదుర్కొని నిరపాయకరం చేయునట్టి కోడేలు" అని వాగాడంబర వర్ణనలు చేయువరకు తీసుకొనివెళ్ళింది. ఆ దృక్పథమే సామ్రాజ్యవాదం యుద్ధాలు అన్న లెనిన్ సిద్ధాంతంలోని ముఖ్యాంశాలు నేడు పనికి రావని త్రోసిపేసేందుకు, కొన్ని ప్రతిపాదనలను నూతన సంస్కరణవాదులు వక్రీకరించునట్లు దిగజార్చింది. అవును, అంతా నూతన యుగం

1. ఐడియోలాజికల్ రిజల్యూషన్ (1968) భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) బర్ద్వాన్ ప్లీనంలో ఏప్రిల్ 1968 లో ఆమోదించబడినది (ఆంగ్లంలో) పే. 8.

మార్క్సిజం లెనినిజాన్ని సృజనాత్మకంగా నూతన పరిస్థితులలో అమలుచేయుట అన్న పేరుతో[1]" అని తీవ్రంగా విమర్శించింది తీర్మానం.

అనంతరం యుగనిర్వచనం, వర్గసంబంధాలలో సంపూర్తిగా సమగ్రంగా ప్రతిబింబించి ప్రపంచ పెట్టుబడిదారి విధానంపై కార్మికవర్గం జరిపే విప్లవ పోరాటాలకు మార్గదర్శకంగా అత్యంత క్లుప్తంగా వుండకుండా స్వీయమానసికతత్వంతో వూహాత్మకమైనది భ్రమలు కల్పించేదిగా తప్పుడు దృక్పథంలో వుండరాదు. అట్టి తప్పుడు నిర్వచనం కార్మికవర్గ విప్లవపోరాటాల కెంతో నష్టాన్ని కలుగజేస్తుంది. అంతేగాక ప్రపంచం మొత్తంగా సామ్రాజ్యవాదం చాల గణనీయంగా బలహీనపడిందని," సోషలిస్టు వ్యవస్థ, విప్లవ కార్మికోద్యమం పెట్టుబడిదారి విధానం అభివృద్ధి చెందిన దేశాలలో జాతీయ విముక్తి వుద్యమం, శక్తులు నూతనస్వాతంత్ర్యదేశాలలో, వలసదేశాలలోని యుద్ధ వ్యతిరేక ప్రపంచ శాంతి వుద్యమం సంయుక్తంగా అత్యంత బలమైనవని, సామ్రాజ్యవాదం దాని మిత్రులపై వోటమి తరువాత వోటమిని నేడు కలుగజేయగలవనుట ఎవ్వరూ వ్యతిరేకించజాలరు.

"ఏమైనప్పటికి యీ విప్లవశక్తులను సమీకరించే క్రమం అంత తేలికయైన కర్తవ్యం గాదు, అందుకు కరుడు గట్టిన అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాదశక్తులను వేరుపరచు సోషలిస్టు రాజబార ఎత్తుగడలు, శాంతిని వాంచించే దేశాలపై దురాక్రమణ గావించే సామ్రాజ్యవాద శక్తులకు, విముక్తి పోరాటాలను రక్తపు టేరులలో ముంచదలచిన వారికి వ్యతిరేకంగా జాతీయ విముక్తి శక్తులను సోషలిస్టు వ్యవస్థ పక్షపు సైనిక బలాన్ని సంలీనం, సమీకరించగల దృక్పథం అవసరము. ఇందుకు నిరంతరం అభివృద్ధి చెందే అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ ఐక్యత పెట్టుబడిదారి దేశాలలో విప్లవ కార్మికోద్యమాన్ని వెనుకబడినదేశాలలోని జాతీయ విముక్తి వుద్యమాలకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద జోక్యం దురాక్రమణకు వ్యతిరేకంగా సోషలిస్టుదేశాలు ఆచరణ సాధ్యమైన అన్ని రూపాలలో, సైన్యంతో అన్నిరకాల సహాయం చేయుటకవసరమైన ఐక్యత అవసరం. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ఐక్యతను, నూతన సంస్కరణవాద వ్యతిరేక పోరాటాన్నుండి వేరు చేయరాదు[2]" అనగా రెండూ వొకటేనని అర్ధం చేసుకొనాలి

ప్రపంచ యుద్ధానంతరం నూతన యుగంలో యేర్పడిన నూతన అవకాశాలను పదునైన పోరాటాలలో వినియోగించుటకు బదులు,నూతన సంస్కరణవాదం శాశ్వత

---

1. ఐడియోలాజికల్ రిజల్యూషన్ (1968) భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) బర్ద్వాన్ ప్లీనం ఆమోదించినది(ఆంగ్లంలో) పే 9.
2. అదే. పే. 9-10.

ప్రపంచశాంతికి, సామ్రాజ్యవాదం రాక్షసత్వాన్ని విడనాడనందున దానిని నాశనంచేసి ప్రపంచశాంతిని శాశ్వతం చేయుటకు, స్వాతంత్ర సంపాదనకు అవసరం లేదనే ఊహా ప్రపంచలోనికి పోతున్నది, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమాల జాతీయ విముక్తి పోరాటాల, కార్మికవర్గ విప్లవ పోరాటాల ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నది.

భారతకమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు)లోని ఆంధ్రప్రదేశ్ తీవ్రవాదులు పాల కొల్లు ప్లీనం సమావేశంలో 231 ప్రతినిధులలో 158 మంది ఆమోదంతో మధురై సిద్ధాంత ముసాయిదా పత్రాన్ని వ్యతిరేకించి, ప్రధాన సమస్యలపై ఎట్టి స్పష్టమైన అభిప్రాయాలను మార్గాలను సూచించుటలేదని వొక తీర్మానాన్ని ఆమోదించింది. అందులో ముఖ్యంగా కొల్లా వెంకయ్యచే ప్రతిపాదించబడి ఆమోదించబడిన తీర్మా నంలో నేటి యుగంపై నిర్దిష్టభావాలు కొన్నింటిని వెలిబుచ్చింది. ప్లీనం కేంద్రసమి తికి చైనా జూన్ 14 లేఖను సాధారణ పంధాను తొమ్మిది వ్యాఖ్యలను ప్రాతిపదిక చేసుకొని నూతనంగా మరో ముసాయిదాను తయారు చేయమని కోరింది. ప్రస్తుతం నూతన యుగనిర్వచనం, మార్క్సిస్టు-లెనినిస్టుల కర్తవ్యాలు అన్ని విషయాలపై తీర్మానంలోని అభిప్రాయాలను పరిశీలిద్దాం.

"నూతన యుగాన్ని శాంతియుత పరివర్తన యుగంగా పరిగణించి దానిపై ఆదారపడి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం శాంతియుత సహజీవనం,శాంతి యుత ఆర్థికపోటీ శాంతియుత పరివర్తన, రాజీ, సంప్రదింపులు పొత్తువిధానంగా, అమెరికాతో ప్రపంచ ఆధిపత్యవిధానంగా రూపొందించింది.

"ఈ విధంగా మార్క్సిస్టు-లెనినిస్టు వ్యతిరేకంగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం నూతనయుగాన్ని నిర్వహించుట, ఆచరణలో అమెరికా సామ్రా జ్యవాదం యొక్క దురాక్రమణ దౌర్జన్య విధానాన్ని కప్పిపెట్టుట తప్ప మరొకటి గాదు. విప్లవశక్తులలో మహోన్నత పోరాటాలు, త్యాగాలు లేకుండా విప్లవశక్తులలో సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనలో భ్రమలు కల్పించి, విజయాన్ని పోరాటం లేకుండా సంపాదించవచ్చని భ్రమలు కల్పించుటయే అగుతుంది.

కేంద్రసమితి ముసాయిదా, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వపు, నూత యుగపు అంచెవాను నిర్దాక్షిణ్యంగా విమర్శించకుండా, "ఆ తప్పుడు అంచెనాలకు కారణాలను పరిశోధించి వివరించుచున్నది. నూతన యుగంలోసామ్రాజ్యవాదపు తుది పతనానికి సోషలిజపు అంత్య విజయానికి" జాతీయ విముక్తి పోరాటాలు నిర్ణయా త్మక శక్తులయ్యాయి. అంతర్జాతీయ కార్మికోద్యమ ప్రధమ కర్తవ్యం జాతీయ విముక్తి వుద్యమాలకు తన శక్తినంతటితో బలపరచుట. సోషలిస్టు దేశాలు రాజకీయ ఆర్థిక, సైద్ధాంతిక, సైనిక సహాయాన్ని యిచ్చి, జాతీయ విముక్తి ఉద్యమాల

విజయమొందునట్లు చేయుట వాటి పవిత్ర కర్తవ్యం[1]" అని తీర్మానం భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) అవగాహనను తీవ్రంగా విమర్శించింది.

కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) కేంద్రసమితి, మధురై సిద్ధాంత ముసాయిదా నూతనయుగ నిర్వచనం ఊహాత్మక సూత్రాలపై ఆధారపడి స్వీయమానసికధోరణిలో వుండరాదన్నది. కేంద్రసమితి ముసాయిదా ప్రకారం విప్లవశక్తులు, "సోషలిస్టు వ్యవస్థలోని నేటి దేశాలు, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాలలో విప్లవ కార్మికోద్యమం, జాతీయ విముక్తి వుద్యమాలు, నూతనంగా స్వాతంత్ర్యం సంపాదించిన దేశాలు, వలసలలోని యుద్ధ వ్యతిరేక, ప్రపంచ శాంతి రక్షణ విస్తృత ప్రజా ఉద్యమాలు." కేంద్రసమితి ముసాయిదాలో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో భారతదేశం వుందా అన్నది స్పష్టంగా చెప్పలేదు. సోవియట్ నాయకత్వం, భారత ప్రభుత్వాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక శాంతి మండలంలో పేర్కొని, ప్రచారం చేస్తున్నది[2]"అని, "భారత ప్రభుత్వం సామ్రాజ్యవాదంతో చేతులు కలుపలేదని" పార్టీ నాయకత్వం అంటున్నది, "సి.పి.ముసాయిదా నూతన సంస్కరణవాద సోవియట్ నాయకత్వం యీ విప్లవశక్తులలో వున్నదా అన్న విషయం స్పష్టం చేయలేదని" తీర్మానం పేర్కొన్నది.

"నూతనయుగంలో జాతీయ విముక్తి పోరాటాల ప్రత్యేక పాత్రను నవీన సంస్కరణవాదులు త్రోసిపేస్తున్నారని," "నూతనయుగంలో సామ్రాజ్యవాదుల యుద్ధ ప్రణాళికలను వమ్ముచేయుటతో జాతీయ విముక్తి పోరాటాలకు ప్రత్యేక పాత్ర, వారి వ్యూహం వమ్ముచేసి, ప్రపంచ సోషలిస్టు విప్లవ విజయానికి దోహదం చేయుపాత్ర నిరాకరించుట పేర్కొన్నారు".

**ఈ యుగంలో వైరుధ్యాలు :**

ఈ యుగంలో సోషలిజానికి సామ్రాజ్యవాదానికిగల వైరుధ్యం, పెట్టుబడదారి దేశాలలో బూర్జువావర్గానికి శ్రామికవర్గానికి గల వైరధ్యం వలస సామ్రాజ్యవాదానికి జాతీయ విముక్తి ఉద్యమాలకు గల వైరుధ్యం, సామ్రాజ్యవాద శక్తుల మధ్య, వివిధ గుత్తపెట్టుబడిదారుల మధ్యగల వైరుధ్యాలు మౌలిక వైరుద్యాలు. ఈ వైరుధ్యాలన్నీ యీ యుగంలో మౌలిక వైరుధ్యాలనుటలో అంతర్జాతీయ

---

1. తీర్మానం-ఆంధ్ర కమ్యూనిస్టు ప్లీనం. పాలకొల్లు, జనవరి 1968, సి పి.ఐ. (మార్క్సిస్టు) కేంద్రసమితి మధురై సిద్ధాంత పత్రం ముసాయిదాపై, ప్లీనం ఆమోదించినది పే 8-9

2. వెంకయ్య,కొల్లా (1968) ప్రతిపాదించిన తీర్మానం. ఆంధ్రకమ్యూనిస్టు ప్లీనం, పాలకొల్లు-జనవరి 1968లో ఆమోదించబడినది. పే. 77-79.

కమ్యూనిస్టు ఉద్యమంలో భేదాభిప్రాయాలున్నట్లు లేదు. అలాగే యీ యుగంలో సామ్రాజ్యవాదానికి, సోషలిజానికి గల వైరుధ్యం ప్రధానమైనదనుటలోనూ భేదాభిప్రాయాలు అంతగా వున్నట్లు కనుపించదు. వైరుధ్యాలను అధ్యయనం చేయు విధానం, మౌలిక వైరుధ్యాల మధ్యగల పరస్పర సంబంధాలు; వివిధ దేశాలలో పరిణామ క్రమంలో వైరుధ్యాలన్నింటి కీలకాంశాన్ని గుర్తించుటలో దాని నిజ స్వభావాన్ని నిర్దుష్టంగా విశ్లేషణగావించి, పరిశీలించి పరిష్కారానికి సరైన పద్ధతులను రూపొందించుటలో కీలక భేదాభిప్రాయాలున్నవి.

ఒక్కొక్క దేశంలో వైరుధ్యాల ప్రాధాన్యతల క్రమం ఒక్కొక్క విధంగా వాస్తవ పోరాట ఆర్థిక, రాజకీయ పరిస్థితుల ప్రభావానికి లోనగుతుంటది. ఒక వైరుధ్యం ఉధృతమగుతు, మరో వైరుధ్య ఉధృతం తగ్గుతుండవచ్చు లేదా క్రొత్త వైరుధ్యం ఉద్భవించవచ్చు. ప్రధాన వైరుధ్యం, వైరుధ్యాలు సమానాంతర మార్గంలో పెరుగుతు ఉధృతమగుతు వాటి ప్రభావాలను యితర వైరుధ్యాలపై ప్రభావాన్ని కలుగజేయుటలో సందేహం లేనప్పటికి వివిద దేశాలలో యీ ప్రభావాలు వివిధంగా వుండి, ఆయా దేశాలలోని వాస్తవ పోరాటాల ప్రభావాలకు పరిమిత లోనగుతూ, ఆయా పోరాటాల దిశ, తీవ్రత, అంతర్జాతీయ పరిస్థితులు ఆదేశాల పోరాటాలపై కలుగజేయు ప్రభావాలకు లోనగుతూ ఉంటుంది. అంతర్జాతీయ వర్గ పోరాటంలో స్పష్టత లోపించిన, ఆయా దేశాల వాస్తవ పరిస్థితులబట్టి, వివిధ వైరుధ్యాల సంబంధాలు సంక్లిష్టతకు లోనై, సమానాంతర అభివృద్ధినుండి వక్రీభవనకు లోనగుతుంటవి. అందేత వైరుధ్యాల ప్రాధాన్యతలో మార్పులు వస్తుంటవి

"ఈ యుగంలో మౌలిక వైరుధ్యాలు పరస్పర ప్రభావాలకులోనై అంతరంగికంగా ప్రభావితమై, యేకో ఒక మౌలిక వైరుధ్యాన్ని పరిష్కర నిమిత్తం ముందుకు నెడతాయి. మరోవైపు ప్రధానమైన వైరుధ్యంలో మార్పేమీ వుండదు. ఈ నగ్నసత్యాలను సోవియట్ నాయకత్వం గుర్తించుచున్నట్లు కన్పించదు. ఇలా ముందుకు వచ్చిన మౌలిక వైరుధ్యాలలో యేకోనొకటి పరిపక్వత పొందుటయో, వుధృతం కావటమో, పూర్తిగాకాని, పాక్షికంగాకాని పరిష్కరింపబడటమో జరిగితే, అవి తిరిగి అసలు ప్రధాన వైరుధ్యమే మరింతగా పరిపక్వత పొందటానికి తమ ప్రభావాన్నిదానిపై కలుగజేస్తాయి "అవి యీ నగ్నసత్యాలను, యీ వాస్తవాన్ని సోవియట్ నాయకత్వం గుర్తించినట్లు కన్పించదని చెబుతూ, "ప్రధానమైన వైరుధ్యాన్ని తదితర వైరుధ్యాలనుండి వేరుచేసి నొక్కి చెబుతూ" తతిమా వైరుధ్యాలను దాదాపు వెనుకకు నెట్టివేస్తూ, ప్రస్తుత పరిణామదశలో వాటి పాత్రను తక్కువగా అంచెనావేసి చెప్పుతోంది[1]" అని భారత కమ్యూనిస్టులలోని ఒక వర్గపు అభిప్రాయం ఈ అభిప్రాయం చైనా అభిప్రాయానికి దగ్గరిగా వుంది.

సోవియట్ "కమ్యూనిస్టుపత్రిక సంపాదకీయం" "జాతీయ విముక్తిపుద్యమం ప్రబలంగావున్న ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని పోరాట ప్రాంతాలు,

ప్రపంచవిప్లవనాడీకేంద్రాలుతుపాన్‌లకు ఏరఆయ్యే ప్రధానమండలాలుగా" ఉంటాయని చైనీస్ కామ్రేడ్స్ భావిస్తున్నారు. మరోవైపు: రెండుప్రత్యర్థి వ్యవస్థలైనసోషలిస్టు పెట్టుబడిదారి విధానాల మధ్య జరిగే పోరాటాన్నివారు రెండవస్థానానికినెట్టివేస్తున్నారు. యదార్థంగా యీ రెండు వ్యవస్థలమధ్య ప్రపంచ చారిత్రిక మహత్తర పోరాటం జరుగుతూనే వుంది. దీని ఫలితంపైనే మానవజాతి భవిష్యత్తు అంతా ఆధార పడి వుంది" అనే వుదహరింపును ఆధారం చేసుకొని భారత కమ్యూనిస్టులలోని ఒక వర్గంపై అభిప్రాయానికి మద్దతుగా వుదహరించింది. అదే వ్యాసంలో ఆ పేరా క్రిందే "వైరుధ్యాల ప్రాముఖ్యతల అన్నిటిలో ... ......పెట్టుబడిదారి దేశాలలో బూర్జువావర్గం—కార్మికవర్గానికి మధ్యగల వైరుధ్యం; సామ్రాజ్యవాదం అణచబడే జాతుల మధ్య; సామ్రాజ్యవాద దేశాలు గుత్తపెట్టుబడిదారివర్గం మధ్యగల వైరుధ్యాలన్నిటిలో సోషలిజం-పెట్టుబడిదారి విధానం మధ్యగల వైరుధ్యం నిర్ణయాత్మకమయినది" [1] అని పేర్కొన్నది. సోవియట్ యూనియన్ కూడ అన్ని వైరుధ్యాలను పేర్కొనుట, సోషలిజం-పెట్టుబడిదారి విధానముల మధ్య గలది నిర్ణయాత్మకం అనుట ప్రధానంగా గుర్తించుట తప్ప వేరుకాదు. మాట-చేతల అభూతపు విషయం వేరుగ దీనిని చెప్పనవసరంలేదు.

చైనా 14 జూన్ 1963 లేఖ, అన్ని పక్షాలు చెప్పుతున్న నాలుగు వైరుధ్యాలను పేర్కొంది. "రెండు భిన్న సామాజిక వ్యవస్థలు, సోషలిజం-పెట్టుబడిదారి విధానముల మధ్యగల వైరుధ్యం నిస్సందేహంగా చాలా తీవ్రమయినది. సోషలిస్టు పక్షం, సామ్రాజ్యవాదం పక్షాల మధ్యగల వైరుధ్యాన్ని మాత్రమే మార్క్సిస్టులు—లెనినిస్టులు పరిగణించరాదన్నది" ఇంకా "అంతర్జాతీయంగా బలాబలాల తూకం సోషలిజానికి ప్రపంచంలో అణచివేయబడుతున్న జాతులు, ప్రజలకు అనుకూలంగాను, సామ్రాజ్యవాదులకు, అన్ని దేశాలలోని అభివృద్ధి నిరోధకుల వ్యతిరేకంగాను మారిందని స్పష్టం చేసింది. ఈ వైరుధ్యాల ఫలితంగా వుద్భవించే పోరాటాలు పరస్పర సంబంధం కలిగి, పరస్పర స్వభావాలకు లోనగుతవి. ఎవ్వరూ యీ మౌలిక వైరుధ్యాలను తుడిచివేయుటగాని, అన్నిటి బదులు స్వీయ మానసిక దృష్టితో పొక దానిని ప్రతిష్టించుటగాని చేయలేరు. ఈ వైరుధ్యాల నుండి ప్రజా విప్లవాలు ఆవిర్భవించుట అనివార్యం, అవే వాటిని పరిష్కరించగలవు" [2] అని లేఖ వివరించింది

1. సంపాదకీయం, కమ్యూనిస్టు. నం. 11, 1963. సోవియట్ లాండ్ బుక్‌లెట్స్ న్యూఢిల్లీ చే ప్రకటితం. పే. 10 లో వుదహరించబడినది. ఇది, దీనిపై వుదహరింపు అందులోనివి.

2. సి. పి. సి కేంద్ర సమితి, 14 జూన్ 1963 న, సి. పి. యస్. యు. కేంద్ర సమితి 30 మార్చి 1963 లేఖకు జవాబుగా వ్రాసినది సిద్ధాంత సమస్యలు. నం 8 జులై 1963 లో (ఆంగ్లంలో) సి. పి. ఐ. ప్రచురణ. పే 7.

అంతేగాక చైనా లేఖ, నాటి ప్రపంచ వైరుధ్యాలపైగల పొరపాటు వైఖరు లను పేర్కొని వాటిని తిరస్కరించాలని కోరింది. ముఖ్యంగా సోషలిస్టు, సామ్రాజ్య వాద పక్షాలలో, కార్మికవర్గ నియంతృత్వపు, గుత్తపెట్టుబడిదారివర్గాల నియంతృత్వ దేశాల మధ్యగల వైరుధ్యాలలో వర్గాల సంబంధాలను చూడజాలని వైఖరి; సోషలిస్టు సామ్రాజ్యవాద పక్షాలలోని వైరుధ్యాన్ని మాత్రమే గుర్తించి, పెట్టుబడిదారి ప్రపం చంలోని బూర్జువా వర్గానికి, కార్మికవర్గానికి గల వైరుధ్యాన్ని, సామ్రాజ్యవాదం, అణచబడే జాతుల మధ్యగల వైరుధ్యాన్ని, సామ్రాజ్యవాద దేశాల గుత్తపెట్టుబడి దారి వర్గాల మధ్యగల వైరుధ్యాన్ని, ఆ వైరుధ్యాల నుండి వుద్భవించే పోరాటాలను అశ్రద్ధ చేయుట, తక్కువగా అంచనా వేయు వైఖరిని, పెట్టుబడిదారి ప్రపంచంలో కార్మికవర్గానికి బూర్జువావర్గానికి గల వైరుధ్యం సోషలిస్టు విప్లవం లేకుండాను, సామ్రాజ్యవాదం అణచబడే జాతులకు మధ్యగల వైరుధ్యం విప్లవం లేకుండానే పరిష్కరించుట సాధ్యమనే వైఖరి: నేటి పెటుబడిదారి ప్రపంచంలో స్వభావసిద్ధంగా వున్న వైరుధ్యాల పెరుగుదల సామ్రాజ్యవాద దేశాల మధ్య తీవ్ర సంఘర్షణలకు దారితీయక అంతర్జాతీయ గుత్తపెట్టుబడివర్గాలు ఒడంబడికలతో పరిష్కరించుకొనుటో లేక పూర్తిగ నివారించుటో జరుగుతుందనే వైఖరిని, రెండు ప్రపంచ వ్యవస్థలు సోషలిజం పెట్టుబడిదారి విధానాల మధ్యగల వైరుధ్యాలు, ఆర్థిక పోటీలో వాటి అంతట అవే అంతర్ధానమవుతవని, రెండు వ్యవస్థల మధ్య వైరుధ్యం అంతమవు టతో తదితర మౌలిక వైరుధ్యాలు కూడ వాటి అంతట అవే అంతర్ధానమగునని "యుద్ధాలులేని ప్రపంచం", "సర్వత్రా సహకారం" నూతన ప్రపంచం రూపొందు ననే వైఖరులను తిరస్కరించాలని 14 జూన్ చైనా లేఖ వివరించి కోరింది.

ఈ యుగంలోని వైరుధ్యాల సమస్యపై యేదో వొక రచనలో చైనా, సోవి యట్ కమ్యూనిస్టుపార్టీలు వైరుధ్యాలన్నిటిని పేర్కొన్నా, కీలక మౌలిక వైరుధ్యం ఆచరణలోనే భేదాభిప్రాయాలున్నవి. సామ్రాజ్యవాదం-సోషలిజంల మధ్యగల వైరు ధ్యము మౌలికమయినదని సోవియట్ వైఖరి కాగా, సామ్రాజ్యవాద-వలసదేశాల ప్రజల మధ్యగల వైరుధ్యం, నాటికేంద్రం, తుఫానులకు ఎర అయ్యే ప్రధాన మండ లము, కీలక వైరుధ్యంగా నెంచుట చైనా వైఖరిగా వుంది. ఈ రెండు వైఖరులు ఒకేదాని రెండు పార్శ్వాలుగా విడివిడిగా చూచి, రెండు పార్శ్వాలను సమగ్రంగా చూడజాలక పోవుటలో అసలు పొరపాటు కల్పించుచున్నది. ఒక యుగం బహుదీర్ఘ కాలప్రమాణం కలిగి, వొక శతాబ్దం లేక కొన్ని శతాబ్దాలు కావచ్చు. అట్టి దీర్ఘకాల ములో వైరుధ్యాల లేక కీలక వైరుధ్యాల క్రమం మారుతు వుండవచ్చు. ప్రపంచ ములో వొక ప్రాంతంలో వొక కాలంలో ద్వితీయ స్థానంలోని వైరుధ్యం ప్రధమ ప్రాధమిక వైరుధ్యంగా ముందుకు నెట్టబడి వర్గపోరాటాలు ఆ ప్రాంతంలో అత్యు

న్నత పోరాటాలై సామ్రాజ్యవాదాన్ని చావుదెబ్బలు కొట్టవచ్చు. ప్రపంచ భౌతిక, శాస్త్ర సాంకేతిక, రాజకీయ పరిస్థితులలో విప్లవాత్మక మార్పులు కారణంగా నూతనావకాశాలు కలుగవచ్చు. అట్టి మార్పులు శాస్త్ర సాంకేతిక రంగాలలో వచ్చినటువంటి శాశ్వత మార్పులు కావచ్చు. లేదా సామాజిక రాజకీయ పరిస్థితుల తాత్కాలిక మార్పులు కావచ్చు. అయితే యుగ స్వభావాన్ని, లక్షణాలను నిర్వచించునపుడు తాత్కాలిక మార్పులు లేక శాశ్వత మార్పులు కాని వాటిని ప్రాతిపదికలుగా చేసుకొనరాదు. అందుకే లెనిన్ యీ యుగాన్ని ప్రస్తావిస్తూ, "చారిత్రికోద్యమాలు ఎంత విజయవంతంగా, ఎంత వేగంగా అభివృద్ధి చెందునో చెప్పజాలం, కాని యీ యుగంలో లేక మరో యుగంలో యే వర్గం కేంద్ర స్థానాన్ని ఆక్రమించియున్నదో చెప్పగలం, అదే ఆ యుగపు స్వభావాన్ని, అభివృద్ధి మార్గాన్ని, ఆ యుగంలో చారిత్రిక పరిస్థితుల లక్షణాలను నిర్ణయిస్తుందని చెప్పగలమన్నారు." అందుచేతనే యీ యుగాన్ని "సామ్రాజ్యవాదం-కార్మికవర్గపు సామాజిక విప్లవ దశలోనిది" అని మాత్రమే చెప్పి, భావితరాల సామాజిక ఆర్థిక పరిస్థితులలో వుద్భవించే పరిణామాలను వూహించి చెప్పుటకై తొందరపడలేదు. సోవియట్ 20 వ, పార్టీ కాంగ్రెసులో "పెట్టుబడిదారి విధానం సోషలిజం లోనికి పరివర్తన చెందే" "నూతన యుగంగా చెప్పుటయేగాక, అనేక సాధికార రచనలలో "శాంతియుత పరివర్తనను" నొక్కి చెప్పుతు, దేశాల మధ్య సంబంధాలయిన "శాంతియుత సహజీవనాన్ని" రెండు వ్యవస్థల మధ్య "సహజీవనంగా చెప్పుతు, ప్రపంచ స్థాయిలో వర్గపోరాటాన్ని నీరుగార్చుట జరిగింది. ఇది నేటి చారిత్రిక సత్యం. చరిత్ర రుజువుతో నిరూపించింది. ఇంతేగాక అణుయుగంలో ప్రపంచ సర్వనాశనం దృష్ట్యా రెండు వ్యవస్థల శాంతియుత సహజీవనం, శాంతియుత పోటీ, పెట్టుబడిదారి సామ్రాజ్యవాదం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనగా వివరించి, పైగా శాంతియుత సహజీవనమే వర్గపోరాట వొక రూపంగా సోవియట్ పై ఖరి వివరించింది.

సంగ్రహంగా :

భారత కమ్యూనిస్టుపార్టీ "అంతర్జాతీయ పరిణామాలు, మార్పుల సమస్యయని యీ యుగంలో యే వర్గం ఆధిపత్యం వహించునో దానిని బట్టి ప్రతి కమ్యూనిస్టు పార్టీ తమ జాతీయ పరిస్థితుల కనుగుణంగా తన పంథాను రూపొందించుకొనాలని" అని, ఈ యుగంలో అంతర్జాతీయంగా సోషలిస్టు విజయం ఏజండాలోనికి వచ్చిందని" స్పష్టం చేసింది. "ఈ యుగంలో సామ్రాజ్యవాద యుద్ధోన్మాద శక్తులపై సోషలిస్టు, శాంతిశక్తులు ఆధిక్యతను సంపాదించాయన్న మాస్కో ప్రకటనను బలపరుస్తూ, ప్రపంచ 81 పార్టీల 1960 పత్రపు భూమికపై ప్రపంచ ప్రజాశక్తుల బలాబలాలతో

వచ్చిన మార్పులను ఆమోదించి యీ యుగానికి నూతన వ్యూహం, ఎత్తుగడలను ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం రూపొందించిన వాటికి పూర్తి ఆమోదాన్ని తెలిపింది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నిర్ణయాత్మకమయినదని, సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులతో కలసి సమాజ చారిత్రికాభివృద్ధి, స్వభావం, ప్రధాన దృక్పథం, మౌలిక లక్షణాలను నిర్ణయిస్తుందని స్పష్టంచేసి, అంతర్జాతీయ సంబంధాలు 1957 ప్రకటన "మన యుగంలో ప్రపంచాభివృద్ధిని పరస్పర వ్యతిరేక రెండు సామాజిక వ్యవస్థలమధ్య పోరాటాల ఫలితం నిర్ణయిస్తుందన్నపై ధోరిణి భారత కమ్యూనిస్టుపార్టీ విస్పష్టంగా బల పరచింది. అంతేగాక 1957, 1960 కమ్యూనిస్టుపార్టీల సమావేశాల నిర్ణయాలు నూతన స్వతంత్ర దేశాల వలస ప్రజా విముక్తి వుద్యమాలకు మార్గదర్శికాలు, ఆ వుద్యమాలకు బలాన్ని చేకూర్చుతవని స్పష్టం చేసింది. చైనా అధికార ప్రకటనలు పత్రాలు యీ యుగ స్వభావాన్ని స్పష్టం చేయలేదని విమర్శించి "యీ యుగం సామ్రాజ్యవాదం కార్మికవర్గాల విప్లవ యుగమని సామ్రాజ్యవాదంపై, సోషలిజానికి అధిక్యతకారణంగా విజయం తథ్యమన్నది."

భారత కమ్యూనిస్టు పార్టీలోని "అతివాద వర్గం,"మార్క్సిస్టుపార్టీగ యేర్పడినవారు, 1968 బర్ద్వాన్ప్లీనంలో "మనయుగం, నూతనయుగం. పెట్టుబడిదారివిధానం, సోషలిజంలోనికి పరివర్తనచెందేయుగం, ప్రపంచాభివృద్ధిక్రమం, అంతర్జాతీయ సోషలిస్టు వ్యవస్థ రూపొందుతున్నయుగం, జాతీయ విముక్తి సోషలిస్టు విప్లవాల యుగం. వలసవిధానం అంత్యంత వేగంగా శిథిలమై విచ్ఛిన్నమగుతున్న యుగం, మరణావస్థలోవున్న పెట్టుబడిదారి విధానానికి, జాతీయవిముక్తి సోషలిస్టు విప్లవాలకు మధ్య భయంకర వర్గపోరాటాలు జరుగుతున్న యుగం ప్రపంచ విస్తృతిలో సామ్రాజ్యవాదం శిధిలమై సోషలిజం కమ్యూనిజం విజయం పొందుతున్న యుగం" అని వివరించింది. ఈ అవగాహన 1957, 1960 మాస్కో సమావేశాల అవగాహనలకు దేయవగానే వుంది. కాని, "నూతన సంస్కరణవాదం నూతన యుగ నిర్వచనానికి కట్టుబడి వున్నట్లు నటించుతు: ముఖ్యాంశాలను తనపిలుకొరకు తేలికపరస్తూ, కొన్నింటిని తల క్రిందుగాను, పెద్దవిగా చేసినొక్కి చెప్పుతున్నదని" తీవ్రంగా విమర్శించింది. అంతేగాక "సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన ప్రారంభమైందని" రంగుల చిత్రాన్ని చూపెడుతు, మరోవైపు వలససామ్రాజ్యవాదం దావు-బ్రతుకుల సమస్యనెంచి నగ్న సైనిక, పైశాచిక హింసాకాండను వలస విముక్తి పోరాటాలపై కొనసాగిస్తు వుంటే, సంస్కరణవాదం తేలిక అంచెనాలు అవగాహన సమార్గం కాదు. ఈ దృక్పథమే నూతన సంస్కరణవాదప్రవక్త కృశ్చేవ్, సామ్రాజ్యవాదం "కోటుకు కుట్టబడిన గుండీలాంటిదని", ఎదుర్కొని నిరపాయకరం చేయగలిగిన కోడేలు" అని వాగాడంబర వర్ణనలు చేయుధైర్యాన్నిచ్చింది. నూతన యుగ, పరిస్థితులలో మార్క్సిజం-లెనినిజాన్ని సృజనాత్మకంగా చేయుట అనే "ముసుగు"తోనే సంస్కరణవాదం, యీ పనికి పొడిగట్టిందని తీవ్ర విమర్శకు గురిచేసింది.

భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) లోని తీవ్రవాదులు, మార్క్సిస్టు-లెనినిస్టుగా గుర్తింపబడినవారు "నూతనయుగంలో జాతీయ విముక్తి పోరాటాల పాత్రను "నవీన సంస్కరణవాదులు (సి. పి. యం) త్రోసి వేస్తున్నారని" "నూతన యుగంలో జాతీయ విముక్తి పోరాటాలకు ప్రత్యేకపాత్ర వారి వ్యూహం వమ్ముచేసి ప్రపంచ సోషలిస్టు విప్లవ పోరాటాలకు ప్రత్యేక పాత్రను నిరాకరించుటగ పేర్కొని మార్క్సిస్టు కేంద్ర సమితి మధురై సిద్ధాంత పత్రం ముసాయిదాను తీవ్ర విమర్శకు గురిచేసారు. అంతేగాక సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని నూతనయుగాన్ని శాంతి యుత పరివర్తన యుగంగానెంచి, దానిపై ఆధారపడి శాంతి,శాంతియుత సహజీవనం, ఆర్థిక పోటీ, రాజీ, సంప్రదింపులు ప్రపంచాధిపత్యం కొరకు అమెరికాతో పొత్తు విధానంగా రూపొందించి, ఆచరణలో అమెరికా సామ్రాజ్యవాద దురాక్రమణ విధానాన్ని కప్పిపెట్టుటగా తీవ్రంగా విమర్శించారు. విప్లవశక్తులలో భ్రమలు కల్పించుట తప్ప మరొకటి కాదన్నారు.

భారత కమ్యూనిస్టు వుద్యమంలో వివిధ భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. సమగ్ర అవగాహన కొరతస్పష్టం.

—o—

# III

# యుద్ధం-శాంతి సమస్య

లెనిన్ 1920లో "పెట్టుబడిదారి విధానపుచరమదశయే సామ్రాజ్యవాదం" అనే గ్రంథం, ఫ్రెంచి ప్రతి ఉపోద్ఘాతంలో" యుద్ధం యొక్క నిజమైన వర్గ స్వభావాన్ని యుద్ధతంత్ర చరిత్రలోగాక, "పాలకవర్గాల గుణాత్మక పరిస్థితి పరిశీలనలో కనుగొనవచ్చు" అనివ్రాసారు. ఇంకా ఉత్పత్తి శక్తులలో వ్యక్తిగత ఆస్తికి అవకాశం వున్నంతవరకు అలాంటి ఆర్థిక వ్యవస్థక్రింద సామ్రాజ్యవాద యుద్ధాలు తప్పని సరియని" వ్యాఖ్యానించారు. లెనిన్ క్రియాశీలఅభివృద్ధి సూత్రాల అధ్యయనాన్ని ప్రాతిపదికగా చేసుకొని సామ్రాజ్యవాదంలో యుద్ధాలు అనివార్యం అని సూత్రీకరించారు. సామ్రాజ్యవాదం వున్నంత వరకు యుద్ధాలు తప్పనిసరియన్న లెనిన్ సిద్ధాంతం, రెండవ ప్రపంచయుద్ధ పూర్వపు, తదనంతర సంఘటనలు రుజువు చేసాయి.

రెండవ ప్రపంచ యుద్ధపుపూర్వకాలంలో ప్రపంచ కార్మికవర్గంలో అనైక్యత సోషల్ డెమోక్రాట్లను ప్రజాస్వామ్య వుద్యమం యిముడ్చుకొనుటలోని వైఫల్యం

వలన ప్రజలసంఘటనాశక్తి జాగరూకత, దీక్ష అన్నీ సామ్రాజ్యవాద శక్తుల దురాక్రమణలను, యుద్ధాన్ని నిరోధించగలిగినంతటి శక్తివంతంగా లేదు. నేడు సోషలిజానికి శాంతికి అనుకూలరగా ప్రపంచ పరిస్థితులు ప్రజాశక్తులలో మార్పులు ఆధునికయుగ కీలక సమస్యలను సరికొత్త పంథాలో శాంతి, ప్రజాస్వామ్యం సోషలిజంల ప్రయోజనాల దృష్ట్యా పరిష్కరించ గల అవకాశాలేర్పడినవి. ఈ సమస్యలపై ప్రఖ్యాత యింటర్వ్యూలో స్టాలిన్" శాంతిరక్షణ బాధ్యతను ప్రజలు హస్తగతం చేసుకొని, దానిని అత్యంతము కాపాడగలిగితే సమీకృతం చేయడమే గాక శాంతిని పదిలంగా నిలబెట్టుట సాధ్యము. ప్రజాసామాన్యాన్ని అబద్ధాలతో నమ్మించి మోసగించి మరో కొత్త ప్రపంచ యుద్ధం వైపు ప్రజలను యుద్ధోన్మాదులు తీసుకొని వెళ్ళుటలో విజయం సాధిస్తే, యుద్ధం అనివార్యం కావచ్చు[1]" అని స్పష్టం చేసారు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 1951-52 సిద్ధాంత చర్చలను స్టాలిన్ సమీక్షిస్తూ వైరుధ్యాల ప్రాతిపదికగా పెట్టుబడిదారి దేశాల మధ్య కంటె, సోషలిస్టు-పెట్టుబడిదారి కూటాల మధ్యగల వైరుధ్యంతీవ్రమైనదిగా పరిగణించి, అమెరికా పెట్టుబడిదారి కూటమికి ఆధిపత్యం వహించినందున యుద్ధాలు అనివార్యం కావడం ఆగిపోయినట్లు కొందరు భావించుటను తీవ్రంగా విమర్శించారు. సామ్రాజ్యవాదం తప్పనిసరిగా యుద్ధాన్ని సృష్టిస్తుందనే విషయం యింకయేమాత్రం సరికాదని, సామ్రాజ్యవాదం పూర్తిగ మొండిగ తయారైందని లెనిన్ ప్రబోధించిన సిద్ధాంతంపై వెలువడ తప్పుడు అభిప్రాయాన్ని తిరస్కరించుటలో స్టాలిన్ ఖచ్చితంగా సరైన పనే చేసారు. ముగింపుగా స్టాలిన్" పెట్టుబడిదారి దేశాల మధ్య యుద్ధాలు అనివార్యం అన్నసూత్రం చెల్లుతుంతని దీని వలన స్పష్టమౌతుంది. "అంతేగాక "ప్రజాశక్తులు ముందుకు రావటం వలన సామ్రాజ్యవాదం తప్పనిసరిగా యుద్ధాన్ని సృష్టిస్తుందని లెనిన్ చెప్పిన సిద్ధాంతానికి కాలదోషం పట్టిందని చెప్పుతున్నారు. ఇది యదార్థం కాదు." యుద్ధంఅని వార్యతను నివారించాలంటే, సామ్రాజ్యవాదాన్ని నాశనం చేయటం అవసరం[1]"అని స్టాలిన్ ముగింపుగా అన్నారు " "ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలు అన్ని ప్రజాస్వామ్య శాంతిశక్తులను ఐక్యపరచిబలపడుటకొ చేయగలిగినంతా చేస్తే నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారించుట సాధ్యము[2]" అని మావో జూన్ 1950లో స్పష్టం చేసారు.

---

1. ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమంలో చర్చించబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు. (తెలుగు) పే. 61లో వుదహరింపు "సోవియట్ రష్యాలో సోషలిస్టు ఆర్థిక సమస్యలు అన్నగ్రంథం నుండి వుదహరింపు.
2. చైనా వ్యాఖ్య (కామెంటు నం. 5) యుద్ధం శాంతి (ఆంగ్లంలో) పే. 13లోని ఉదహరింపు.

యుద్ధం శాంతి సమస్యపై మాస్కో 1957 ప్రకటన, 1960 పత్రం వెల్లడించిన అభిప్రాయాలను యింతకుముందే అధ్యయనం చేసి వున్నా వొకటి రెండు విషయాలు ప్రస్తావించవలసివుంది,

మాస్కో 1957 ప్రకటన, అమెరికా దురాక్రమణశక్తులు" బలమైన స్థానాల నుండి" అనే విధానాన్ని, "కమ్యూనిజాన్ని అరికట్టుట" అనే మిషతో స్వతంత్ర, ప్రజాస్వామ్య దేశాలను పాదాక్రాంతం చేసుకొనుట లేదా విచ్ఛిన్నం చేయుటకు ప్రయత్నిస్తున్నారు. సామ్రాజ్యవాదం వున్నంతవరకూ దురాక్రమణయుద్ధాలకు సారవంతమైన భూమి వుంటుంది. అనుటకు, అమెరికా, బ్రిటన్, ఫ్రెంచ్, డచ్ సామ్రాజ్యవాదులు వారితొత్తులు ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం, ఇండొనేషియా ఇండోచైనా, కొరియా, మలయా, కెన్యా, గౌటమల్లా, ఈజిప్టు, అల్జీరియా, ఓమన్, ఈమెన్‌లలో జరిగిన దురాక్రమణ యుద్ధలు ప్రత్యక్షసాక్ష్యాలు నిరాయుధీకరణ వ్యతిరేకించుతు అణు, లాసర్, మానవనాశన బారీ ఆయుధ నిర్మాణం సైనిక కూటములు, స్థావరాల యేర్పాటు దురాక్రమణదారులు కొనసాగిస్తున్నారు. అమెరికా పశ్చిమజర్మనీ జపాన్‌లలో సైనికతత్వాలను పెంచి, పోషిస్తున్నారు. మధ్యఆసియాలో "ఐసెన్ హోవర్-డల్లెస్‌ల" సిద్ధంతాన్ని అమలుచేస్తూ అరబ్బు దేశాలలో అభివృద్ధి నిరోధకుల బలపరుస్తూ దేశాలను చీల్చుతు యుద్ధ ప్రమాదాలను తెచ్చిపెడుతున్నారు. తూర్పు ఆసియలో "సీటో" దురాక్రమణ సైనిక కూటమి యుద్ధాలను తెచ్చిపెట్టుచున్నది. అయితే నేడు శాంతి శక్తులు అత్యంతబలమైన యుద్ధప్రమాదాన్ని అరికట్టగలిగిన శక్తిని అవకాశాలను కలిగి వున్నవి. ఈజిప్టులో సామ్రాజ్యవాదుల సైనిక దాడిని వమ్ముచేయుట, హంగెరీలో సామ్రాజ్యవాదం విప్లవ ప్రతీఘాత శక్తులతో చేసిన కుట్రలు భగ్నం చేయుట శాంతిశక్తుల పాటవాన్ని తెల్పుతున్నవి. సోవియట్ యూనియన్ శాంతియుత సహజీవనాన్ని విదేశాంగ విధానంగా 20వ, పార్టీ కాంగ్రెసులో నిర్ణయించింది. ఇది చైనా-భారతదేశాలు ప్రతిపాదించిన బాండుంగు సమావేశంలో ఆయా ఆసియా ఆఫ్రికాదేశాలు ఆమోదించిన 'పంచశీల' సూత్రాలను అనుసరించే వుంది. శాంతి సహజీవనం అన్నిదేశాలలోని శాంతిప్రియులైన ప్రజాస్వామ్యవాదుల కోరిక అయింది. శాంతి పోరాటం ప్రథమ కర్తవ్యంగానెంచి, యుద్ధ నివారణకు కమ్యూనిస్టు పార్టీలు తమ శక్తినంతటిని వినియోగిస్తాయి.

ప్రపంచ 81 కమ్యూనిస్టుపార్టీల 1960 సమావేశం, యుద్ధం-శాంతి సిద్ధాంతాన్ని లోతుగా పరిశీలించి 1957 ప్రకటనను స్థూలంగా పునరుద్ఘాటించింది. పెట్టుబడిదారి విధానం, యుద్ధం విడదీయరాని కవలపిల్లలు. సామ్రాజ్యవాదం మానవాళిపై రెండు వినాశకర యుద్ధాలను సాగించి, సర్వనాశనకర అణు ప్రపంచ యుద్ధానికి దారి తీస్తున్నది. అమెరికా నాయకత్వంలో ప్రపంచంలో సైనిక కూటముల నేర్పరచి ప్రపంచాన్ని అణుయుద్ధ పొలిమేరలకు తీసుకెళ్ళింది.

చరిత్ర నూతన ప్రపంచయుద్ధాన్ని విరోధించే మహత్తర బాధ్యతను కార్మిక వర్గంపై వుంచింది. సామ్రాజ్యవాద శక్తులు అణుయుద్ధానికై కుట్రలు చేస్తున్నవి. ఈ ప్రమాద నివారణకు అంతర్జాతీయ కార్మికవర్గం ఐక్యంగా సంఘటితమవ్వాలి. కార్మిక వర్గ అన్ని శ్రేణులు ఐక్యమై యుద్ధోన్మాదశక్తుల వ్యతిరేక పోరాటానికి పిలుపునిచ్చి, ప్రపంచ యుద్ధాన్ని విరోధించి, శాంతిని పరిరక్షించాలి అని పిలుపునిచ్చింది. ఆ శక్తి ప్రపంచ ప్రజోద్యమాలకు గలదని స్పష్టం చేసింది.

చైనా-భారతదేశాలు ప్రవచించిన పంచశీల సూత్రాలు బాండుంగు సమావేశములో ఆసియా-ఆఫ్రికా శాంతి ప్రియుల ఆమోదం పొంది, ప్రపంచ యుద్ధ వ్యతిరేక శాంతి పోరాటానికి అత్యంత బలాన్ని చేకూర్చాయి. అమెరికా "శీతల యుద్ధం" "బలమైన సర్వసంసిద్ధ స్థానాలనుండి" అనే సిద్ధాంతాలు అణు యుద్ధంలో మానవాళి సర్వనాశనానికి దారి తీస్తాయి.

సామాన్య సంపూర్తి నిరాయుధీకరణ, దేశాల మధ్య యుద్ధాలు రాగల అవకాశాలను నిర్మూలించుట, సామ్రాజ్యవాద శక్తులనుండి తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొనవలసి వచ్చినా, ఆయుధ నిర్మాణపోటీ ప్రపంచ అణుయుద్ధాన్ని అతి చేరువకు తెస్తుంది. కాని, సామ్రాజ్యవాదులు చెబుతున్నట్లు యుద్ధాన్ని విరోధించజాలదు, కాని వారికి అత్యధిక లాభాలను మాత్రం చేకూర్చిపెడుతుంది. అందుచేతనే కమ్యూనిస్టులు పూర్తి నిరాయుధీకరణను బలపరస్తూ, ఆయుధ నిర్మాణ పోటీని, అణుబాంబుల ప్రయోగాలను వ్యతిరేకిస్తారు. నిరాయుధీకరణ సైనికాధికారులు, ప్రభుత్వాలు, అధినేతల సమస్య మాత్రమే గాక, ప్రపంచ మానవ వనరులను మానవ జీవిత ప్రమాణాలను అభివృద్ధి చేయుటకు వినియోగించక, యుద్ధ ఆయుధ నిర్మాణాలకు వ్యర్థం చేయుట మానవాళి జీవిత సమస్యగా నెంచుతారు.

అన్ని దేశాలలోని కార్మికవర్గం, పోషలిస్టుశక్తులు, జాతీయ విముక్తి ఉద్యమాలు, శాంతి వుద్యమము సంయుక్తంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం కొనసాగించాలని సోవియట్ అవగాహన. అక్టోబరులో చైనా సైనిక ప్రతినిధివర్గం పెంగెతెహాయి నాయకత్వంలోనికి వచ్చినపుడు అణు ఆయుధాల సమాచారమార్పిడి చైనాకు వొక నమూనా అటంబాంబు ఇచ్చుటకు వొప్పందం జరిగింది. కాని అదే కాలంలో అణు ఆయుధాల ప్రయోగాల నిషేదంపై అమెరికాతో ప్రాథమిక చర్చలు సోవియట్ ప్రారంభించింది సోవియట్ ప్రతిపాదనలకు క్రుశ్చేవ్ అణు ఆయుధాల ప్రయోగపు నిషేధం; నిరాయుధీకరణ, అణు ఆయుధాల నాశనం, నిషేదం రెండూ వేరు వేరు విషయాలు. అమెరికా, రష్యాలలో అణు ఆయుధాల విస్తరణకు అవకాశము యిస్తూనే, యితర దేశాలకు అట్టి అవకాశం లేకుండా చేయ ప్రయత్నిస్తూ, ఏ దేశమయినా విజయం పొందితే దానిని ప్రయోగించి చూచుకొని మెరుగుపరచకు

కొనే అవకాశం లేకుండా అగ్రరాజ్యాలు అమెరికా, సోవియట్ యూనియన్‌లు ప్రయత్నించుట తప్ప మరొకటి కాదు. ఈ విషయం భిన్నాభిప్రాయాలకు సమిధ అగుటలో ఆశ్చర్యంలేదు.

## చైనా దృక్పథం :

మావో 1955 లోనే, చైనాలోని ఫిన్లండు రాయబారితో "చైనా, ఫిన్లండు సంబంధాలు శాంతియుత సహజీవనం, పంచశీల సూత్రాలపై ఆధారపడి వున్నవి" అని చెప్పి, "నేడు ప్రపంచయుద్ధ ప్రమాదం, అమెరికా యుద్ధోన్మాదులు చైనాను బెదరించుటతో ప్రధానంగా వస్తున్నది. మా తైవాన్‌ను, తైవాన్ జలాలను ఆక్రమించి, అటంబాంబుల యుద్ధాన్ని ప్రస్తావిస్తున్నారు. మేము ప్రధానంగా, ఒకటి, యుద్ధాన్ని వాంఛించము, రెండు, ఎవరయినా మాపై దురాక్రమణ జరిపితే ఎదురు దాడి చేస్తాం" అని యింకా "మూడవ ప్రపంచ యుద్ధాన్ని అమెరికా ప్రారంభించితే, "వారు భూమిపై నుండి తుడిచివేయబడతారని" తరువాత "ప్రజల ఐక్యరాజ్యసమితి షాంగ్‌హైలోనో, యూరపులోనో, న్యూయార్క్‌లోనో నూతనంగా ఏర్పడుతుందని" [1] సంభాషణలో వెల్లడించారు. ఈ సందర్భంలో ప్రపంచ యుద్ధం అనివార్యమా అన్న ప్రశ్నకు సమాధానంగా "సామ్రాజ్యవాదుల నుండి యుద్ధ ప్రమాదం యింకా వుంది: మూడవ ప్రపంచ యుద్ధం రావటానికి యింకా అవకాశముంది. అయితే యుద్ధ ప్రమాదాన్ని, మూడవ ప్రపంచ యుద్ధాన్ని నిరోధించే శక్తులు త్వరితంగా అభివృద్ధి చెందుతున్నాయి....మరో ప్రపంచ యుద్ధాన్ని నిరోధించగలవు" అని మావో 1950 జూన్‌లో వ్యాఖ్యానించారు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ కాంగ్రెసులో స్టాలిన్‌ను తెగనాడి, దొడ్డిదారిని "శాంతియుత పరివర్తన సిద్ధాంతాన్ని" కృశ్చేవ్ ప్రతిపాదించాడు. అటం ఆయుధాల కారణంగా ఏ యుద్ధమయినా మానవజాతి నాశనానికి దారి తీస్తుంది. కాన ఎంతటి మూల్యమైనా చెల్లించి యుద్ధమును నిరోధించాలి. అగ్రరాజ్యాల మధ్య స్నేహ, సహకారాలకు ఎట్టి ఆటంకం వుండరాదు. చైనా దృష్టిలో సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ విముక్తి పోరాటాలు, అగ్రరాజ్యాల ప్రపంచ శాంతి అవగాహనను నాశనం చేస్తున్నవి అనే అవగాహన సంస్కరణవాదపు మొట్టమొదటి అడుగులు, సోవియట్ 20 వ కాంగ్రెసుతో యిది ప్రారంభమైంది.

అక్టోబరు విప్లవ 40 వ వార్షికోత్సవ సందర్భంలో మావో వుపన్యసిస్తూ వివిధ ప్రజా పోరాటాల ఫలితంగా, ముఖ్యంగా సాయుధ పోరాటాల వలన భూస్వాం

---

1. మాసియంగ్ (1955) చైనా ప్రజలను అటంబాంబుతో భయపెట్టజాలరు. సెలెక్టెడ్ వర్క్సు అఫ్ మాసియంగ్. వాల్యూం నం. 5. ఫారిన్ లాంగ్వేజస్ ప్రెస్, పెకింగు 1957. పే. 152-153.

దిన అత్యంత అంతర్జాతీయ సుముఖ రాజకీయ వాతావరణాన్ని వివరించి, మావో "పశ్చిమ గాలిపై తూర్పుగాలి ఆధిక్యత వహించింది" అని అలంకారికంగా సోషలిస్టు శిబిరం సామ్రాజ్యవాద శక్తులకంటె వాస్తవంగా బలమయినదిగా సూచించారు. సోషలిస్టు రాజ్యాల ఆవిర్భావం, సోవియట్ మిసలీలు యీ పెరిగే బలాన్ని సూచించుచున్నవి. అయినా "మనం యుద్ధమును కోరము" అని పునరుద్ఘాటించి, "యుద్ధమును నివారించుటకు మంచిమార్గం, రక్షణకు సరియైన వ్యూహం, ఎత్తుగడలు, దీని అర్థం జాతీయ విముక్తి వుద్యమాలకు మద్దతునిచ్చుట మూడవ ప్రపంచ మధ్యస్థ నుండలాలలో అవలంభించాలి. తృతీయ ప్రపంచంలోని ముడి సరుకుల లభ్యతపైనే సామ్రాజ్యవాదం బలం వుంది. ఈ ముడి సరుకులను నిరోధించుట దాని బలాన్ని నిర్వీర్యం చేస్తుంది" ఇది మావో వైఖరి. "శత్రువును వ్యూహరీత్యా" తేలికగా, "ఎత్తుగడలరీత్యా" తీవ్రంగా పరిగణించుటనే అలంకారికంగా "పశ్చిమ పవనంపై", "తూర్పు పవనం" ఆధిక్యత కలిగివుందని చెప్పాడు.

ఫిబ్రవరి 1960లో జరిగిన వార్సా వొడంబడిక రాజ్యాల సమావేశంలో కృశ్చేవ్, అణు సాంకేతిక విజ్ఞానాన్ని సోవియట్ యూనియన్ "పిచ్చివారి" చేతులలో పెట్టజాలదని పేర్కొన్నాడు. పరిశీలకుడుగా పాల్గొన్న చైనా ప్రతినిధి కాంగ్ షెంగ్, పెకింగ్ మేయరు చైనా వైఖరిని వివరించాడు. అమెరికా ఆయుధ విస్తరణ అణు క్షిపణుల, సైనికుల స్థావరాలను అనేక ప్రాంతాలలో స్థాపించిన సర్వసన్నద్ధతను పేర్కొని, చైనా నిజమైన నిరాయుధీకరణ బలపరచిందని స్పష్టం చేసాడు. "ఎట్టి అంతర్జాతీయ నిరాయుధీకరణ వొడంబడిక అయినా, అన్ని అంతర్జాతీయ వొడంబడికలు, చైనా పాల్గొనని, సంతకం చేయని వాటికి చైనా కట్టుబడి వుండజాలదని చైనా ప్రభుత్వం ప్రకటించింది. అమెరికాతో సంప్రదింపులలో కృశ్చేవ్ సోషలిస్టు శిబిరం మొత్తానికి ప్రాతినిధ్యం వహించుటను చెప్పుకొనజాలకపోయాడు. సంభాషణలు గాలిలో అణు ఆయుధాల ప్రయోగాల నిషేదంపై జరుగుచున్నవి. అమెరికా, సోవియట్ రష్యా రెండూ భూగర్భ ప్రయోగాలకు సర్వసన్నద్ధంగా వున్నవి. అమెరికా పూర్తిగా అంగీకరించక తమ జాతి ప్రయోజనం కొరకు, అణు ప్రయోగాలను తనకు వీలయిన పద్ధతిలో అవసరమైనపుడు జరుపగలనని షరతు విధించింది. చివరకు సెప్టెంబరు 1963లో గాలిలో అణుప్రయోగాల నిషేదపు వొడంబడిక జరిగింది. స్టీవర్ట్ ఆల్ సోస్ "చైనా స్వంత అణుఆయుధాలను తయారు చేయకుండుటకై వుద్దేశించబడినదిగా" పేర్కొన్నాడు. అగ్రరాజ్యాలు అణుఆయుధాలను అభివృద్ధి చేయుట, ఉత్పత్తి ఆపుచేయుట, పరిమితం చేయుట జరుగదు. అణుప్రయోగాల నిషేదపు వొడంబడిక చైనాకు అణుఆయుధాలు లేకుండా చేయుటగా చైనా

కమ్యూనిస్టులు అర్థం చేసుకొన్నారు. "చైనాను అణుస్థైరిలైజేషన్" చేయుటగా వాషింగ్టన్ వర్గాల అభిప్రాయం[1].

కృశ్చేవ్ నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారించగలుగుట సాధ్యం, నూతన ప్రపంచ యుద్ధ ప్రమాదం లేదని, వచ్చే అవకాశం లేదనే ధోరణికి వెళ్ళాడు. మార్క్సిస్టు లెనినిస్టులు నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారించగల అవకాశముందని గుర్తిస్తూనే, సామ్రాజ్యవాద శక్తులు యుద్ధాన్ని తీసుకొచ్చే ప్రమాదముందని చెప్పాలి అట్టి అవకాశమున్నందున ఆ విధంగా చెప్పి, రెండు విధాలైన పరిణామాలకు ప్రజలను సమీకరించుతూ, వారిని సన్నద్ధులను చేయాలి, ప్రపంచశాంతికై పోరాడి వారిని పరిరక్షించాలన్నారు.

కృశ్చేవ్ నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారించగలమనే సిద్ధాంతాన్ని అన్ని రకాల యుద్ధాలకు, యిచ్ఛాపూర్వకంగా విస్తరించి, నివారించగల అవకాశాలను విస్తృతంగా వ్యాఖ్యానించి, సామ్రాజ్యవాదం వున్నంతవరకు యుద్ధాలు ఉంటవి, అనే లెనినిస్టు సూత్రమునకు కాలదోషము పట్టిన వైఖరి నవలంభించాడు.[1] నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారించుట వేరు, అన్నిరకాల యుద్ధాలను నివారించుట వేరు, విప్లవ యుద్ధాలను నివారించుట వేరు. రెండిటిని యేకంజేసి గందరగోళపరచుట, పూర్తిగ తప్పు. సామ్రాజ్యవాదం వున్నంతవరకు, మనిషి మనిషిని దోచే విధానం వున్నంతవరకు యుద్ధాలకు భూమిక ఉంటుందనేది, విస్తృతశాస్త్రీయ అధ్యయనం తరువాత లెనిన్ కనిపెట్టిన వాస్తవ సామాజిక సూత్రము.

కృశ్చేవ్ తదితరులు,అన్ని యుద్ధాలను నివారించవచ్చని "ఆయుధాలు,సాయుధ సైన్యం, యుద్ధాలులేని ప్రపంచాన్ని, సామ్రాజ్యవాదం వున్నపుడే ఆవిష్కరించ వచ్చని తీవ్రప్రచారం చేస్తున్నారు. ఇది అంతా సామ్రాజ్యవాదం ఉండగానే శాశ్వత ప్రపంచ శాంతిని నిర్మించవచ్చని ప్రజలను నమ్మించప్రయత్నిస్తున్నారు. ఆ విధంగా విప్లవాలను, జాతీయ విముక్తి యుద్ధాలను, విప్లవ అంతర్యుద్ధాలను, సామ్రాజ్యవాదం వారి తాబేదార్ల వ్యతిరేక యుద్ధాలను నీరుగార్చివేసి, సామ్రాజ్యవాదులకు వారి యుద్ధ ప్రయత్నాలకు తోడ్పడుతున్నారు.[2]" అని చైనా అభిప్రాయం.

---

1. హన్‌సుయిన్ (1976) విండ్ ఇన్ ది టవర్, మాసియంగ్ అండ్ రివల్యూషన్ 1949-75 (ఆంగ్లంలో) జనాతన్‌కెప్, లండన్ పబ్లికేషన్. పే 171లోని ఉదహరింపు.

1. పెకింగ్ రేడియో కామెంటు నం. 5. వార్ అండ్ పీస్ చైనా డాక్యుమెంటు (ఆంగ్లంలో) ఇండియన్ పబ్లికేషన్. పే. 14

2. పెకింగ్ రేడియో కామెంటు నం 5. వార్ అండ్ పీస్. చైనా డాక్యుమెంటు (ఆంగ్లంలో) పే. 18.

'యుద్ధంశాంతి'పై సోవియట్ నాయకుల సిద్ధాంతం, అణుఆయుధాల ఆవిర్భావం, అన్నిటిని మార్చివేసిందని, వర్గపోరాట సూత్రాలు కూడ మారిపోయాయని చెప్పుతుంది. "అణుమిసలీ ఆయుధాలు యుద్ధంపై పాత అభిప్రాయాలను మార్చివేసాయని" సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి బహిరంగలేఖ చెప్పుతున్నది. అణు ఆయుదాల రంగంలో ప్రత్యక్షమగుటతో ఇంక ఏ మాత్రమూ" అన్యాయ యుద్ధాలు, న్యాయ యుద్ధాలు, అనే భేధమేలేదని సోవియట్ నాయకులు అంటున్నారు.

సంగ్రహంగా, చైనా-సోవియట్ యూనియన్‌ల మధ్య యుద్ధమూ శాంతి సమస్యలపై గల భేదాభిప్రాయాలు రెండు పంథాలలో గల భేదాన్ని స్పష్టపరస్తున్నవి రెండు పంథాల ముందుకు వచ్చే రెండు ప్రధాన ప్రశ్నలు, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం, వలస దేశాలలోని విముక్తి విప్లవ పోరాటాల యెడల అవలంభించవలసిన వైఖరులు కీలకాంశాలు. చైనా సామ్రాజ్యవాద వ్యతిరేక అన్ని పోరాటాలలో వలస విముక్తి విప్లవ పోరాటాలతో సహా అన్నిటిలో ముందు పీఠాన ఉంటున్నది. తమ పంథా 1957 ప్రకటన, **1960** సిద్ధాంతపత్రం, సమిష్టి పంథానుసరించి వుంది అంటున్నది. సోవియట్‌యూనియన్ శాంతి పరిరక్షణ పోరాటంలో ముందుంటున్నది. అన్ని మార్గాలలో యుద్ధ నివారణ, శాంతి పరిరక్షణ చేయాలంటుంది. ఏ యుద్ధమైనా, సామ్రాజ్యవాదంపై వలస ప్రజల యుద్ధమైనా నేటి పరిస్థితులతో ప్రపంచ యుద్ధానికి దారి తీస్తుంది అనే దృక్పదాన్ని చేబట్టింది.

సోవియట్‌యూనియన్ తన పంథానుసరించి ప్రజాచైతన్యాన్ని నిరంతరం పెంపొందిస్తూ, ప్రపంచశాంతికి సరియైన మార్గంగా పోరాటాలను విస్తరింపచేయగలమంటున్నది. ప్రపంచశాంతి శక్తులను సోషలిస్టు శిబిర కేంద్రంగా నిరంతరం బలపరచగలము. నిరంతరం ప్రజావిప్లవాలను విస్తరించగలం, సామ్రాజ్యవాదంపై దెబ్బ తీయగలము. అమెరికా సామ్రాజ్యవాదానికి, యితర సామ్రాజ్యవాద శక్తుల మధ్య గల వైరుధ్యాలను వినియోగించుకొని అమెరికా సామ్రాజ్యవాదాన్ని చాలవరకు వేరు చేయగలము. అమెరికా సామ్రాజ్యవాదపు ఆటవిక బెదిరింపులను, నూతన ప్రపంచ యుద్ధ ప్రయత్నాలను భగ్నం చేయగలము. అన్ని దేశాల ప్రజలు విప్లవ విజయాలను, ప్రపంచశాంతిని పొందగలరు నిస్సందేహంగా ప్రపంచశాంతికి సమర్ధవంతమైన మార్గం యిది, యని సోవియట్ దృక్పధము.

చైనా, సోవియట్ పార్టీ అనుసరించే పంథా, మార్క్సిస్టు-లెనినిస్టు విప్లవ ప్రజాసామాన్యపు సాధారణ పంథాకు, చైనా పంథాకు పూర్తి వ్యతిరేక పంథా అంటున్నది. ఈ పంథాలో పోరాటపదునును ప్రపంచశాంతి శత్రువుపై కేంద్రీకరించకుండా సోషలిస్టు శిబిరంపై కేంద్రీకరించుట వలన ప్రపంచశాంతిని పరిరక్షించే ప్రధాన శక్తులను బలహీనపరచుట జరుగుతుంది, సోషలిస్టు దేశాల ప్రజలపైవొత్తిడి

తెచ్చి, అణచబడే ప్రజల, జాతుల విప్లవ పోరాటాలను బలపరచకుండునట్లు ఆటం ఆయుధ శక్తులు బెదరింపులు చేయుట ద్వారా అమెరికా సామ్రాజ్యవాద శక్తులకు తోడ్పడుతు, సోషలిస్టు శిబిరాన్ని వేరుపరచి, ప్రజావిప్లవాలను అణచివేయుట జరుగుతుంది. అణు బెదరింపులు, అణచబడిన ప్రజలు, జాతులు విప్లవ పోరాటాలు విడనాడుటకు వొత్తిడిని,విప్లవ కేంద్రాల గొంతులను నులిమివేయుటకు అమెరికా సామ్రాజ్యవాదంతో సహకరించుట, అగుతుంది. ఆ విధంగా అది స్వేచ్ఛగా దురాక్రమణ యుద్ధప్రయత్నాలను సోషలిస్టు సామ్రాజ్యవాద మధ్యస్థ మండలాలలో కొనసాగించుటకు వీలును కలుగజేయుట; అమెరికా మిత్రులను తమపై విధించబడిన అజమాయిషీలకు వ్యతిరేకంగా పోరాటం సాగించుకుండునట్లు వొత్తిడి చేయుటకు వినియోగిస్తూ ఆదేశాలను అమెరికా సామ్రాజ్యవాదం బానిసలుగా చేయుటకు వారి స్థానాలను బలపరచుకొనుటకు బెదరింపులు వినియోగపడుతున్నవి. ఈ పంథా ననుసరించి సామ్రాజ్యవాద దురాక్రమణ యుద్ధ వ్యతిరేక పోరాటాన్ని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం పూర్తిగ విడనాడింది. ఈ పంథా అమెరికా సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటన కార్యాచరణ ప్రపంచశాంతి పరిరక్షణను త్రోసి రాజంటున్నది. ప్రపంచశాంతి వ్యతిరేక శక్తులను వేరుపరచకుండా శాంతి శక్తులనే వేరు పరస్తుంది. దీనర్థం ప్రపంచశాంతి పరిరక్షణ కర్తవ్యానికి తిలోదకాలివ్వటమే; అమెరికా సామ్రాజ్యవాదపు "ప్రపంచ వ్యూహానికి" తోడ్పడుటయే; యిది ప్రపంచశాంతి పంథాకాదు; మరింత యుద్ధ ప్రమాదానికి, యుద్ధానికి దారితీసే పంథాయని చైనా వివరించింది.[1] కమ్యూనిస్టులు, ప్రపంచ ప్రజలు సామ్రాజ్యవాదుల ఈ ప్లానులను భగ్నం చేయగలరని విశ్వశిస్తున్నామని ముగించింది. ఇదీ స్థూలంగా యుద్ధం శాంతి సమస్యపై చైనా కమ్యూనిస్టు పార్టీ దృక్పధం.

యుద్ధం—శాంతి సమస్యలపై భారత కమ్యూనిస్టు వర్గాల స్పందనలను చూద్దాము.

భారత కమ్యూనిస్టు మార్క్సిస్టు వర్గాలు, "సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ కాంగ్రెసులో సామ్రాజ్యవాదుల, యుద్ధోన్మాదుల శక్తి సామర్థ్యాలను, యుద్ధాన్ని నివారించగల శక్తులను అంచనా వేసిందని, బలోపేతమైన నూతన యుద్ధ వ్యతిరేక శక్తులు ఆవిర్భవించక పూర్వం యుద్ధం అనివార్యమైతే, ఆ పరిస్థితులు మారిన తరువాత, యుద్ధం అనివార్యం కాదు అని చెప్పుటలో సోవియట్ పార్టీ

1. అంతర్జాతీయ కమ్యూనిస్టు సిద్ధాంత వివాదంపై సి.పి.ఐ. జాతీయ సమితి ఆమోదించిన నివేదిక (1964) కమ్యూనిస్టుపార్టీ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత కొరకు, కమ్యూనిస్టు పార్టీ పబ్లికేషను (ఆంగ్లంలో) పే. 20-21.

సరిగానే వ్యవహరించింది అని [1] అయితే తప్పేమిటంటే "సామ్రాజ్యవాదానికి సోషలిజానికీ మధ్య జరిగే ప్రపంచ యుద్ధం, వివిధ పెట్టుబడిదారి రాజ్యాల మధ్య జరిగే యుద్ధాలు, వలస పాలకులు వలస విమోచనోద్యమాలకు మధ్య జరిగే యుద్ధాలు సామ్రాజ్యవాదానికి అంతర్యుద్ధ ప్రజాస్వామ్యశక్తుల మధ్య జరిగే యుద్ధాలు, వివిధ రకాల యుద్ధాలను వేరు వేరుగ చూడజాలక పోవుటయని విమర్శించింది. అంతేగాక "సామ్రాజ్యవాదం. సోషలిజం మధ్య యుద్ధమును నివారించవచ్చని పొరపాటు వక్కాణించుతు, సామ్రాజ్యవాద అంతర్యుద్ధాల సమస్యనూ వాటి అనివార్యత లేదా తద్విరుద్ధ విషయాన్ని, ప్రపంచ యుద్ధంతో గల సంబంధాన్ని తెలియజేయకుండా, సోవియట్ 20 వ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు తప్పుకొన్నదని" తీవ్రంగా విమర్శించింది.

"లెనిన్ సిద్ధాంతాన్ని ఒకవైపు వల్లిస్తూనే, మరోవైపు యుద్ధాలు విధిగా అనివార్యం కావని చెప్పడం తీవ్రమైన అనుమానాలను రేకెత్తిస్తుంది. సామ్రాజ్యవాదుల మధ్య అంతరంగిక యుద్ధాలు అనివార్యం అన్న లెనినిస్టు సూత్రాన్ని త్రోసిపేస్తుంది. ఆ విధంగా అది లెనినిస్టు సిద్ధాంతానికి సంపూర్ణంగా బూజుపట్టిందని ఏ మాత్రం చెల్లదని రివిజనిస్టులు అన్ని విధాల తీర్మానించుటకు దోహదమిస్తుంది సూత్రం ఇంకా వర్తిస్తుందనీ కాని వర్గ శక్తుల మధ్య యేర్పడిన నూతన సంబంధాల, తదితర పరిణామాల దృష్ట్యా యీ సూత్రం పరిమితంగా అమలు జరుగుతుందంటే ఎవరికయినా తేలికగా అర్థం అవుతుందని" భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) విమర్శించింది.

"యుద్ధాన్ని నివారించవచ్చు అనే అవకాశాన్ని "సాగదీసి" కొన్ని స్పష్టమైన నిర్ణయాత్మక పరిస్థితులు జతకూడినపుడే యీ అవకాశాలు వాస్తవాలుగ మార్చబడగలవనేది చెప్పడమేగాక, ఆ వాస్తవ పరిస్థితులు యిప్పుడు ఏర్పడినాయని చెప్పేటంత వరకు, ఆ విధంగా ప్రపంచ యుద్ధ వాస్తవ ప్రమాదాన్ని గూర్చి, సామ్రాజ్యవాదానికి యుద్ధాన్ని తేగల శక్తిసామర్థ్యాలను తక్కువగా అంచనా వేసేటంతవరకు వెళ్ళినది" [2] అని సి. పి. ఐ. (యం) అభిప్రాయం.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ కాంగ్రెసు, యుద్ధం-శాంతి సమస్యలపై రూపొందించిన నూతన సిద్ధాంతాలను, సోవియట్ నాయకుల ఉపన్యాసాలు, వ్రాతలు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో తీవ్ర చర్చనీయాంశాలైనవి. మాస్కో 1957 ప్రకటన, 1960 ప్రపంచ పార్టీల సమావేశ పత్రం, 20 వ కాంగ్రెసు సిద్ధాంతాలను

1. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చర్చింపబడుతున్న సిద్ధాంత సమస్యలు పే. 65.

2. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చర్చింపబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు పే. 66.

మెరుగుపరచి, సరియైన అంశాలను, మొత్తం సిద్ధాంతాన్ని విశదీకరించి, నూతనాంశాలను చేర్చి సమగ్రతను చేకూర్చింది. సామ్రాజ్యవాదం, యుద్ధం-శాంతి సమస్యలపై రివిజనిజానికి, అవకాశవాదానికి అవకాశం లేకుండా చేసింది.

"సోవియట్ నాయకత్వం యీ అవగాహన (1960 మాస్కో పత్రం) నుండి తీవ్రంగా వైదొలగినట్లు మేము అభిప్రాయపడుతున్నాం. కొన్ని అంశాలను నొక్కి చెప్పటం, ప్రత్యేకించి ప్రపంచ యుద్ధ ప్రమాదాన్ని తగ్గించి చెప్పటం ప్రపంచ యుద్ధాన్ని నివారించటానికి అవసరమైన విశ్వతోముఖ పోరాటాన్ని తగ్గించి చెప్పటం జరుగుతున్నదని" కమ్యూనిస్టు మార్క్సిస్టుపార్టీ విమర్శించింది.

అంతేగాక "యుద్ధాన్ని గూర్చి జనరల్‌గా మాట్లాడటం, సామ్రాజ్యవాదం సోషలిజంల మధ్య యుద్ధాన్ని గుర్చి తికమక పరచడం, సామ్రాజ్యవాదుల మధ్య జరిగే అంతర్యుద్ధాలను, జాతీయ విముక్తి యుద్ధాలను, అంతర్యుద్ధాలను తికమక పరచడం మార్క్సిస్టు-లెనినిస్టులకు కూడదు." "కొత్త ప్రపంచ యుద్ధాన్ని నివారించ దానికి గల అవకాశాన్ని....సాధారణ సూత్రంగా చేసి దానిని వివిధ రకాల యుద్ధాలకు యాంత్రికంగా విస్తరింప జేయరాదు. వివిధ రకాల యుద్ధాలను వివరంగా, నిర్దిష్టంగా, అధ్యయనం చేయుటం సరియైన వైఖరి" అవసరమని మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ స్పష్టం చేసింది.

అమెరికా సామ్రాజ్యవాదం కొత్త ప్రాంతాలకు తమ యుద్ధ కేంద్రాల వలయాన్ని విస్తరింప చేయుట, సప్తమ నౌకాదళం హిందూ మహాసముద్రం లోనికి పంపబడుట, సోషలిస్టు దేశాలపై గురిపెట్టబడిన అణ్వస్త్ర మిసలీల కేంద్రాల వలయాన్ని సామ్రాజ్యవాదులు బలవత్తరం చేయుట, మిసలీలుగల జలాంతర్గాముల బలాన్ని పెంపొందించుట జరిగింది. నాటో దళాలకు ప్రత్యేకంగా పశ్చిమ జర్మనీ యుద్ధోన్మాదులకు అణ్వస్త్రి "కెట్" మిసలీలను సరఫరా చేయుట, వియత్నాంతో అమెరికా తన సైనిక బలాలను పెంచుట జరిగింది మూడేళ్ళలో అమెరికా అణ్వాయుధాలు 100 శాతము, పోరుకు సన్నద్ధంగా వున్న సైనిక దళాలు డివిజనులు 45 శాతం, విమాన వాహక వైమానిక దళాలు 175 శాతం, గెరిల్లా వ్యతిరేక ప్రత్యేక సైనిక దళాలు 5 రెట్లు పెంచబడ్డాయి. బ్రిటిష్, ఫ్రెంచి తదితర సామ్రాజ్యవాదులు సైనిక దళాలను పెంచుకొంటూ, అణ్వాయుధాలను సమకూర్చుకొంటున్నారు. వీటన్నిటిని సోవియట్ తక్కువగా అంచనా వేయుటను పరోక్షంగా విమర్శించింది.

ఇదే విషయంపై సి. పి. ఐ. అభిప్రాయాలను చూద్దాము,

మాస్కో ప్రకటన ప్రపంచ యుద్ధం, అణు ఆయుధాల యుద్ధమగుతుందని, మానవజాతి వినాశనం అవుతుందని, కాన నిరోధించవలసిన అవసరం వుందని,

సాధ్యమని చెప్పింది. ప్రపంచ దేశాలకు చెప్పుకోలేనంత మానవ వినాశనం, పారిశ్రామిక, సాంస్కృతిక కేంద్రాలు నామరూపాలు లేకుండా పోతవని, వందల మిలియనుల ప్రజా సామాన్యం చనిపోవుట, వివిధ రోగగ్రస్తులై బాధలకు గురియగుట జరుగుతుందని, సామ్రాజ్యవాదం "మానవజాతి మొత్తానికి వినాశనాన్ని తీసుకొస్తుందని" అది ప్రపంచ వినాశనమని చెప్పింది.

చైనా నాయకత్వం, వారి జూన్ 14, 1963 లేఖలో "అటంబాంబు కాగితపు పులియని", "అంత భయంకరమైనది కాదని చెప్పుట ఆశ్చర్యాన్ని కలుగజేస్తుంది." వారు "లెనినిజం వర్థిల్లాలి" అనే కరపత్రంతో "సామ్రాజ్యవాదపు శిథిలాలపై విజయము పొందిన ప్రజలు పెట్టుబడిదారి సంస్కృతి కంటె వెయ్యిరెట్లు మిన్నయైన సంస్కృతిని అత్యంత వేగంగా సృష్టిస్తారు" అని చెప్పుతున్నారు. ఇంతకంటె ఘోరం మరొకటి లేదు. ప్రపంచ యుద్ధం అణుబాంబుల యుద్ధమే అవుతుంది, దాని వినాశనశక్తిపై ఆ విధమయిన వైఖరిని అవలంభించిన చైనా నాయకత్వంతో మాస్కో ప్రకటన చెప్పిన విధంగా యుద్ధాన్ని నివారించుట అత్యంత ఆవశ్యకమని వాదించుట సాధ్యంకాదు. ఇప్పుడు సమస్య "వివిధ సామాజిక వ్యవస్థలు శాంతియుత సహజీవనాన్ని" కొనసాగించుటా లేక "వినాశకర యుద్ధమా" యివే మనముందున్న ప్రత్యామ్నాయం. ఇదే మాస్కో ప్రకటన మనకు చెప్పుతున్నది, "నేడు ప్రజాస్వామ్య, శాంతిశక్తులకు ప్రపంచ అణుబాంబుల, ధార్మికశస్త్రల వినాశనం నుండి మానవజాతిని రక్షించే కర్తవ్యం కంటే మరో ముఖ్య కర్తవ్యంలేదు." [1]

"నూతన యుగంలో ప్రపంచ యుద్ధాన్ని నిరోధించు అవకాశాలపై మాస్కో ప్రకటన వైఖరి స్పష్టం. సామ్రాజ్యవాదం వున్నంతవరకు దురాక్రమణ యుద్ధాలకు ఆధారవంతమైన క్షేత్రముంటుంది. సామ్రాజ్యవాద నైజము మారలేదు. యుద్ధ ప్రమాదము వాస్తవం." అదేకాలంలో "యుద్ధం వినాశనం అనివార్యం కాదు. "సామ్రాజ్యవాదం తమ యిష్టానుసారం యుద్ధంపై నిర్ణయం చేయు రోజులు గతించాయి. శాంతి శక్తులు నిర్మాణయుతమైన బలమైన కార్యాచరణ శాంతిని పరిరక్షించి, యుద్ధాన్ని నివారించగలదు."

కమ్యూనిస్టుపార్టీ సోదాహరణంగా యుద్ధం-శాంతి సమస్యపై చైనా అవగాహనను తీవ్రంగా విమర్శించి యీ క్రింది విధంగా వ్యాఖ్యానించింది, "ఇక్కడ ముఖ్యాంశం ప్రపంచప్రజలు యెప్పుడూ ప్రపంచయుద్ధాన్ని వ్యతిరేకించారు. సామ్రాజ్యవాద దురాక్రమణకు వ్యతిరేకంగా శాంతి పోరాటమే దానిని వ్యతిరేకించు పోరా

---

1. అంతర్జాతీయ కమ్యూనిస్టు సిద్ధాంత వివాదంపై సి. పి. ఐ జాతీయ సమితి ఆమోదించిన నివేదిక (1964) కమ్యూనిస్టుపార్టీ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత కొరకు, కమ్యూనిస్టుపార్టీ, పబ్లికేషన్ (ఆంగ్లంలో) పే. 20-21.

టం, గతంలో చేయజాలకపోయినా నేడు ప్రపంచశాంతి సమర్థవంతంగా సంరక్షింప బడగలదు.

"ఈపై ఖరిని వొకరు ఆమోదించవచ్చు లేక ఆమోదించకపోవచ్చు. సామ్రాజ్యవాదం నుండి విడదీయరాని యుద్ధం వేరు అని చెప్పజాలం. ఆదే కాలంలో ప్రజలు నిరోధించగలరని వాదన కొనసాగించజాలము. సామ్రాజ్యవాద సహజ సూత్రాలు వున్నప్పటికి నిరోధించుట సాధ్యం, కారణం సామ్రాజ్యవాదశక్తులు ప్రపంచ ప్రజా శక్తుల బలాల మధ్యగల సమతూకం మారింది నేడు. సామ్రాజ్యవాదం కాదు, శోషణ రహిత వ్యవస్థ లిజపు శక్తులు సమాజచారిత్రికాభివృద్ధి స్వభావాన్ని లక్షణాలను నిర్ణయిస్తున్నవి.

"యుద్ధ నిరోధం సాధ్యమా అన్న ప్రశ్నకు ద్విముఖ పార్శ్వ సమాధానాలు న్నవి. నిరోధించే అవకాశం, నిరోధించలేక పోయే అవకాశమూ రెండూ వున్నవి, రెండింటిని సమానంగానే గుర్తుంచుకోవాలి. కాని సమస్యను "కలిపి పులగం" చేయ రాదు. ప్రపంచయుద్ధాన్ని ఎదుర్కొనుటకై, నిస్సందేహంగా సోవియట్ యూనియన్, సోషలిస్టుదేశాలు సైనికంగా తయారై వుండుట వాటి బాధ్యత. సామ్రాజ్య వాదం యుద్ధానికి సాహసించితే వోడించాలి. ఈ బాధ్యతను ఆ దేశాలు అరమరికలు లేకుండా చేస్తున్నవి. సోవియట్ యూనియన్ బిలియనులు సైన్యానికై ఖర్చుపెట్టి, సైనిక, సాంకేతికరంగాలలో అత్యాధునికంగా సమంగా వుంది. స్వరక్షణకై మాత్రమేగాదు, సోషలిస్టు, శాంతికాముక దేశాలన్నిటి రక్షణకు రెండు సాధ్యావకాశా లను సమతూకంలో వుంచుట, శీతలయుద్ధాన్ని అంతంచేయుటకు శాంతిని బలపరచు టకు పరిస్థితుల తీవ్రపరిణామాలను తగ్గించుట, ఆ విధంగా యుద్ధప్రమాదాన్ని తొల గించి వేయుటకు, అన్ని విధాలసైనిక సంసిద్ధత, రాయబారాలు, సంభాషణలు,వొప్పం దాల మార్గాలు అవలంభించిబలపరుస్తున్నది". యుద్ధం-శాంతి సమస్యపై భారత కమ్యూనిస్టుపార్టీ అవగాహన సంక్షిప్తంగా యిది.

## IV

## శాంతియుత సహజీవనం

అక్టోబరు విప్లవానంతరం యేర్పడిన సోషలిస్టు ప్రభుత్వానికి, విదేశాంగ సం బంధాల సమస్యలు యెదురైనపుడు లెనిన్ శాంతియుత సహజీవనం అనే ప్రఖ్యాత సిద్ధాంత సూత్రీకరణ చేసాడు. "విభిన్న సామాజిక వ్యవస్థలు గల దేశాల మధ్య పరస్పర సంబంధాలు శాంతియుత సహజీవనం అనే సూత్రంపై ఆధారపడి వుండాలి, "అది సాధ్యం,మన కర్తవ్యం" అన్నారు లెనిన్.

లెనిన్ అనుసరించిన విదేశాంగ విధానంలోని ప్రధాన అంశాలు : 1) విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాలన్నిటితో శాంతియుత సహజీవనాన్ని నెరపుట ii) సామ్రాజ్యవాదుల దురాక్రమణ యుద్ధ విధానాలను గట్టిగా వ్యతిరేకించుట, శాంతి కోసం కృషి చేయుట iii) సోవియట్ ప్రభుత్వానికి, సామ్రాజ్యవాదంచే అణచివేయబడుతున్న బలహీన దేశాలకు మధ్య అలాగే ఇరుగు పొరుగున వున్న దేశాల మధ్య సన్నిహిత సంబంధాలు నెలకొల్పుట iv) పెట్టుబడిదారి విధానాన్ని కూలద్రోయుటకు ప్రపంచలో కార్మికులు సాగిస్తున్న అన్ని పోరాటాలలో వారికి సహాయం చేయుట v) అన్ని దేశాలలోనూ ప్రత్యేకంగా వలస, అధీన దేశాలలోని ప్రజాతంత్ర విప్లవోద్యమాలకు సహాయం చేయుట లెనిన్ నిర్దేశించిన యీ విదేశాంగ విధానాన్ని తూ-చా" తప్పకుండా సోవియట్ యూనియన్ పాటించింది.

ఈ విధానాన్ని లెనిన్ కొమింటరన్ 4వ, కాంగ్రెసులో "పెట్టుబడిదారి విధానాన్ని కూలద్రోయుటకు యావత్ ప్రపంచంలోని కార్మికులు,సాగిస్తున్న పోరాటంలో వారికి సాయపడటం సోవియట్ రష్యా అంత్యంతగర్వకారణంగా యెంచుకొంటుందని" అంతేగాక "అభివృద్ధి చెందిన దేశాలలోని విప్లవకారులతోను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడుతున్న పీడిత ప్రజలందరిలోను, భుజం భుజం కలపటమే. కార్మిక ప్రభుత్వం యొక్క విదేశాంగ విధానమని" స్పష్టం చేసారు. ఇదే విషయాన్ని లెనిన్ రష్యన్ కమ్యూనిస్టు పార్టీ 7వ, కాంగ్రెసులో పునరుద్ఘాటించారు. లెనిన్ తదనంతరం స్టాలిన్ బోల్షివిక్ పార్టి 15వ, కాంగ్రెసులో రాజకీయ నివేదికలో" పరస్పర విరుద్ధమైన రెండు సామాజిక వ్యవస్థల మధ్య సహజీవనం సాధ్యమన్న భావం, పెట్టుబడిదారి దేశాలతో మన సంబంధాలకు ఆధారం. పెట్టుబడిదారి దేశాలతో శాంతియుతమైన సంబంధాలు కొనసాగించుట మన కర్తవ్యం[1]" అని అన్నారు.

అంతేగాక దీర్ఘకాల అవగాహనపై లెనిన్ "యుద్ధం-శాంతి సమస్యలపై నివేదికలో" అంతర్జాతీయ సామ్రాజ్యవాదం-సోవియట్ రిపబ్లిక్‌తో దాని సరసన నివసించలేదు. దీనికి రెండు కారణాలున్నాయి. దాని భౌతిక పరిస్థితి ఒక కారణం. పెట్టుబడిదారి వర్గపు ఆర్థిక ప్రయోజనాలు మరొక కారణం. సోవియట్ రిపబ్లిక్, సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఒకదాని సరసన మరొకటి దీర్ఘకాలం మనగలుగుట అనూహ్యం. చివరకు యేదో ఒకటి జయించి తీరాలి. రెండింటికి ఆఖరురోజు వచ్చే వరకు "మధ్య భీషణ ఘర్షణలు అనేకం జరగడం అనివార్యం" అని 8వ పార్టీ

1. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చర్చించబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు. పే. 37లోని ఉదహరింపు.

కాంగ్రెసు నివేదికలో పేర్కొన్నారు. అందువలన సదా జాగరూకులమై వుండాలని పదేపదే నొక్కి చెప్పారు.[1]

పోరాటం ద్వారానే సోషలిస్టు ప్రభుత్వం, సామ్రాజ్యవాద దేశాలతో శాంతి యుతంగా జీవించగలుగుతున్న విషయం, లెనిన్ స్పష్టపరచారు. రెండు శిబిరాల మధ్య, రెండు వ్యవస్థల మధ్య జరిగే వర్గ పోరాట రూపాల్లో శాంతియుత సహజీవనం వొకటి. అనగా శాంతియుత సహజీవనం కూడ వర్గపోరాటపు వొకరూపంగా సూత్రీకరించబడింది. శాంతియుత సహజీవనమే సర్వస్వం అని లెనిన్ చెప్పలేదు. ఆ పేరుజెప్పి జాతీయవిముక్తి ఉద్యమాలకు కార్మిక విప్లవోద్యమాలకుసహాయాన్ని ఆపు చేయలేదు. సోషలిస్టుదేశపుయొక్క విభిన్న రెండుతరహాలవిదేశాంగ విధానాలనుస్టాలిన్ స్పష్టం చేసారు. లొంగుబాటు విధానాన్ని నిరాకరించుతు "సోవియట్ యూనియన్ కార్మికవర్గము చుట్టూ, అన్ని దేశాల కార్మిక వర్గాన్ని, పీడిత ప్రజలను సమీకరించు విప్లవపంథాను మనం అనుసరిస్తాం" అని స్టాలిన్ అన్నారు. ఇంకా "అలాకాకమనం విప్లవకర విధానాన్ని విసర్జించి అంతర్జాతీయ పెట్టుబడిదారి విధానానికి సౌకర్యాలను కల్పించుటకు అంగీకరించితే, సోషలిస్టుదేశాన్ని, "మంచిపెట్టుబడిదారి దేశంగా మార్చుటకు అంతర్జాతీయ పెట్టుబడిదారి వర్గం" సహాయం చేయుటకు వెనుకాడదని కూడ స్పష్టీకరించారు. స్టాలిన్ రెండవ విధానాన్ని పూర్తిగ నిరాకరిస్తూ "అది ఆత్మ ద్రోహం మాత్రమేకాగలదు" అని ఒక దేశంలో విప్లవం విజయవంతమైనంత మాత్రాన ఆ విప్లవం తన పని ముగిసినట్లుగా భావించరాదు. అన్ని దేశాలలోని కార్మికవర్గ విజయాన్ని త్వరితం చేయుటకు దానిని వొక సాధనంగా సహాయకారిగా మాత్రమే పరిగణించాలి[2] ఒక్కమాటలో లెనిన్, స్టాలిన్‌లు జాతీయ విముక్తి ఉద్యమాలను ముందుకు తీసుకొని వెళ్ళుటకు సర్వదా కృషి చేసారు. జాతీయ విముక్తి ఉద్యమాలకు సహాయం చేయుటలో వారెన్నడూ వెనుకాడలేదు.

శాంతియుత సహజీనాన్ని వర్గపోరాటం యొక్క మరోరూపంగా చిత్రించి వర్గపోరాటాలను అన్ని విధాల ప్రోత్సాహమిచ్చుట శాస్త్రీయ మార్క్సిస్టు-లెనిస్టు అవగాహన. సోవియట్ నాయకులు శాంతియుత సహజీవనమే మానవజాతి సోషలి జానికి పురోగమించుటకు బాట అని, జాతీయ విముక్తిని సాధించుటకు మార్గమనీ చెప్పుతున్నారు. సోవియట్‌పార్టీ 30 మార్చి 1963న వ్రాసిన లేఖలో క్యూబాలో జరిగిన సోషలిస్టు విప్లవాన్ని గూర్చి అల్జీరియా మరికొన్ని దేశాలు స్వాతంత్ర్యాన్ని సంపాదించిన విషయాన్ని గూర్చి వ్రాయుట జరిగింది." మొత్తం పెట్టుబడిదారి సంబంధాలకు చావు దెబ్బ తెచ్చిపెట్టగలదు, అని శాంతియుత సహజీవనాన్ని గూర్చి

---

1. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చర్చించబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు పే. 85.
2. స్టాలిన్ వర్క్సు, ఆంగ్లంలో, మాస్కో ప్రచురణ. సంపుటి 6. పే. 410.

శాంతియుత పోటీని గూర్చి సోవియట్ నాయకులు చెప్పుతున్నారు. అంటే, వలస సత్వంలో వున్న జాతులు పోరాటాలు, విప్లవాలు నడుపనక్కరలేదు. సోవియట్ సోషలిస్టు దేశాలు వుత్పత్తిలో పెట్టుబడిదారి దేశాలను అధిగమించువరకు వేచి యుండాలి. జాతీయ విముక్తిగానీయండి సోషలిజం కానీయండి శాంతియుతంగా స్థాపనజరుగుటకు పరిస్థితులు అనుకూలంగా యేర్పడుతున్నవని చెప్పుతున్నారు.

"భిన్న సాంఘిక వ్యవస్థలు మధ్యగల ప్రత్యేక ఒకానొక సంబంధమే శాంతియుత సహజీవన విధానము" కాని సోవియట్ నాయకులు, సోషలిస్టు ప్రభుత్వం యొక్క విదేశాంగ విదానమే శాంతియుత సహజీవన విదానమని చెప్పుతున్నారు. ప్రపంచ సమస్యలన్నింటికి శాంతియుత సహజీవనమే సర్వరోగనివారిణిగా చెప్పుతున్నారు. ప్రపంచంలో సోషలిస్టు వ్యవస్థ పెట్టుబడిదారి వ్యవస్థల మధ్యవర్గపోరాటం జరుగుతున్నది. ఇది అంతర్జాతీయ వర్గ పోరాటం. రెండు వ్యవస్థల మధ్య జరుగుతున్న యీ అనివార్య వర్గ పోరాటం, కేవలం భావాల మధ్య పోరాటంగా మాత్రమే రూపొందించవలసిన అవసరముందని" చెప్పుతున్నారు. "సమాజాన్ని ఎదుర్కొంటున్న ప్రాణప్రదమైన ప్రధాన సమస్యలను పరిష్కరించుటంలో శాంతియుత సహజీవన మొక్కటే, మిక్కిలి శ్రేష్ఠమైన అంగీకృతమైన మార్గం" "మొత్తంఆధునిక సమాజ జీవిత మలుపులసూత్రం" శాంతియుత సహజీవనమని చెప్పుతున్నారు." "సామాజిక జీవితంలోని మూల సూత్రాలన్నీ శాంతియుత సహజీవన సూత్రంలోనే యిమిడిపోతాయట యిది నిజంగా విడ్డూరం." "ఈ భావాలు లెనిన్ భావాలకు అనుగుణంగా లేవు. సోషలిస్టు దేశంయొక్క విదేశాంగ విధానంలోని విప్లవ సారాన్ని ఇవి ప్రతిబింబించవు"[1].

సోషలిస్టు, సామ్రాజ్యవాద దేశాల మధ్య శాంతియుత సహజీవన సిద్ధాంతాన్ని అన్వయించటంలో ఆర్థిక, రాజకీయ, సైద్ధాంతిక రంగాలలో పోరాటం అనివార్యం. కాని, దీనిని కేవలం "భావాలమధ్య" పోరాటంగా చిత్రించడం తప్పు. ఇతరుల వ్యవహారాలలో జోక్యం కలిగించుకొనకుండా వుండుట అనే సాకుతో, వివిధ దేశాలలోని ప్రజల విప్లవ పోరాటాలను వుద్యమాలను, తమకుగల అంతర్జాతీయ బాధ్యతలను విస్మరించుటకు దారి తీయనంత వరకు యీ అసంగత వ్యాఖ్యలు చేస్తున్నారు. "శాంతియుత సహజీవన పరిస్థితులలో పెట్టుబడిదారి దేశాలలో వర్గ పోరాటాలకు, వలస, అర్థవలస దేశాలలో జాతీయ విముక్తి పోరాటాలు కొనసాగుటకు అనుకూల పరిస్థితులు యేర్పడుతాయి. అదే విధంగా విప్లవవర్గ పోరాటాలు, జాతీయ విముక్తి పోరాటాలు విజయం పొందుట వలన శాంతియుత సహజీవనం

---

1. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చర్చించబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు పే. 89-90. ప్రజాశక్తి పబ్లికేషను (?) తెలుగు.

పెంపొందుతుందని మాస్కో పత్రము సరిగానే చెప్పింది. ఆచరణలో సోవియట్ యూనియన్ అందుకు పూర్తి భిన్నంగా వ్యవహరించి విప్లవ ప్రజాపోరాటాలను నిరుత్సాహపరచింది, వాటికి సహకారాన్ని అందించుటలో విఫలమైంది.

సామ్రాజ్యవాదుల మోసాలను, కుతంత్రాలను, ప్రజా ఉద్యమాలను రక్తపు ఏరుల ముంచెత్తుటను, స్వాతంత్ర్యం ప్రజాస్వామ్య రక్షణ అనే పేరుతో నియంతలను, భూస్వాములు నిరంకుశ వర్గాలను ప్రజోద్యమాలనుండి రక్షించుటకు సైనికంగా కలుగజేసుకొంటూవున్న యీ దుష్టశక్తులను లెనిన్, స్టాలిన్‌లు అనేక సందర్భాలలో హెచ్చరికలు చేసి వున్నారు. శాంతియుత సహజీవనమనే పేరుతో సామ్రాజ్యవాదం, ముఖ్యంగా అమెరికాతో సర్వతోముఖమైన సహకారం నెరపుట వచ్చి అవకాశవాదం. "మన (సోవియట్ యూనియన్, అమెరికాలు) దేశాలు ప్రపంచంలో కల్లా బలమైనవి. మనం గనుక శాంతికి ఐక్యమైతే యుద్ధమనేదే వుండదు. ఏ పిచ్చివాడయినా యుద్ధానికి ఉబలాటపడితే, మనం కాస్త వేలు చూపితే బేజారెత్తిపోతాడు" అని కృశ్చేవ్ 1961 సెప్టెంబరు 5 న, అమెరికన్ పత్రికా రచయిత సుల్జబెర్గర్‌కు యిచ్చిన ఇంటర్వ్యూలో అన్నారు. అంతేగాక కృశ్చేవ్, కెన్నడీల మధ్య అంగీకారం కుదిరితే మానవజాతి భవిష్యత్తుకు సంబంధించిన సమస్యలన్నీ పరిష్కారమగుతవని సోవియట్ నాయకులు వెల్లడించారు. అనేక మౌలిక వైరుధ్యాలున్న ఆధునిక ప్రపంచంలో "ఇద్దరు మహాపురుషులు" మానవజాతి భవిష్యత్తునీ, అంతర్జాతీయ సమస్యలన్నిటిని పరిష్కరించగలరనుకొనుట శాస్త్రీయ సోషలిజపు దృష్టికాదు, స్వీయమానసిక, జాతి దురహంకార, బలప్రదర్శన అవుతుంది. లెనినిస్టు విదేశాంగ విధాన సూత్రం కాజాలదు.

ప్రస్తుతం సామ్రాజ్యవాదులు ప్రజలను మోసగించుటకు, అప్రమత్తులను చేయుటకు, ప్రపంచాధిపత్యం అనే వారి లక్ష్యాన్ని చేరుటకు యుద్ధం-శాంతి అనే ఎత్తుగడలను అవలంభించుచున్నారు. "శాంతి వ్యూహం" అని, "బాంబు కన్న మంచి ఆయుధం" వుంచుంటున్నారు. ఆ మంచి ఆయుధమే శాంతియుత సహజీవనం" అని వారంటున్నారు. ఇంకా "ఈనాడు దౌర్జన్యంగా నియంతృత్వ పద్ధతుల ద్వారా అణచబడి వున్న ప్రజలు, స్వేచ్ఛగా తమ వోట్లు ద్వారా తమ మార్గాన్ని నిర్ణయించుకొనే హక్కు సంపాదించుటకు అమెరికా శాంతి పద్ధతుల ద్వారా చేయగలిగినదంతా చేస్తుందని" ఐసెన్‌హోవర్ తెల్పారు. కెన్నడీ యింకా స్పష్టంగా సోవియట్ సామ్రాజ్యంలోను, అన్ని ఖండాలలోను....ఈనాడు జరుగుతున్న మార్పులు....ఇంకా ఎక్కువ మంది ప్రజల యొక్క స్వతంత్రానికి, ప్రపంచ శాంతికి దారిచేసే విధంగా మనం చేయగలిగినదంతా చేయాలి" అన్నాడు. తూర్పు యూరపులోని సోషలిస్టు దేశాలలో స్వాతంత్ర్యం కొరకై, ఓపికతో అక్కడి శక్తులకు ప్రోత్సాహానివ్వటం, దౌర్జన్య

ప్రభుత్వంపై (ప్రజాతంత్ర ప్రభుత్వాలపై) వొత్తిడి తేవటం తన విధానంగా అవలంభించానని, ఆ విధంగా యీ దేశాలలో స్వేచ్ఛతో కూడిన అవకాశాన్ని కలుగ జేస్తానని కూడ కెన్నడీ అన్నాడు. ఈ మాటల అర్థం స్పష్టం. సోషలిజాన్ని "నియంతృత్వమని", "సోషలిసు శిబిరాన్ని సోవియట్ సామ్రాజ్యమని నిందించి", విప్లవ ప్రతీఘాతక శక్తులకు ప్రోత్సాహమివ్వటాన్ని, స్వేచ్ఛాపూరిత అవకాశ మివ్వటమనీ అమెరికన్ సామ్రాజ్యవాదులు అంటున్నారు. కాబట్టి శాంతియుత సహజీవనం, సహకారం, శాంతియుత పోటీ అంటే యేమిటో వారి అర్థం; విప్లవ పోరాటాలను అణచి వేయటం, వీలయితే సోషలిస్టు శిబిరాన్ని నాశనం చేయుటయని స్పష్టంగానే చెప్పారు. అమెరికన్ సామ్రాజ్యవాదం, వారి శాంతియుత సహజీవన వ్యూహ లక్ష్యాన్ని యింత స్పష్టంగా తెలియజేసినా, సోవియట్ యూనియన్ యితర సోషలిస్టు మితవాదశక్తులు శాంతియుత సహజీవన విధానాన్ని సోషలిజం విస్తృతికి వొక వర్గపోరాట రూపంగా చిత్రించినా, ఆచరణలో వైఫల్యం ఫలితంగా 1990 దశకంలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, అంతర్గతంగా విప్లవ ప్రతీఘాతక శక్తుల విజృంభణ, బాహ్యంగా సామ్రాజ్యవాద శక్తుల కుట్రలు, సహాయం ఫలితంగా కుప్పగా కూలిపోయింది. ప్రపంచ సామ్రాజ్యవాద శక్తుల సహాయంతో తిరిగి పెట్టుబడిదారి విధానం తూర్పు యూరపు మాజీ సోషలిస్టు దేశాలలో పునర్మించబడుతున్నది లెనిన్, స్టాలిన్‌లు హెచ్చరించిన సోషలిస్టు జాగరూకత లోపించిన ఫలితంగా, మితవాద, సంస్కరణవాద శక్తులు అంతర్గతంగా కుట్రలతో కార్మికవర్గ సోషలిస్టు శక్తులను నిర్వీర్యులను చేసిన ఫలితం. సామ్రాజ్యవాదులు నిజంగానే శాంతియుత సహజీవనాన్ని అటంబాంబు కన్న శక్తివంతమైన ఆయుధంగా, వారి వర్గపోరాట ఆయుధంగా వుపయోగించి, హిట్లర్ రెండవ ప్రపంచయుద్ధంలో సాధించలేని "కమ్యూనిజం నాశనాన్ని" చేసి, విజయం పొందారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ వైఖరిని బలపరచే భారత కమ్యూనిస్టుపార్టీలోని అతివాద వర్గం సోవియట్ యూనియన్ శాంతియుత సహజీవన విధానాన్ని ఆచరణలో పెట్టిన పద్ధతులను తీవ్ర విమర్శకు గురి చేయుటను యింతకుముందు తెలుసు కొన్నాము. భారత కమ్యూనిస్టుపార్టీలోని మితవాద, సంస్కరణవాద వర్గాలు సోవియట్ విధానాన్ని బలపరుస్తూ చేసిన కొన్ని వాదనలను చూద్దాము.

మాస్కో ప్రకటన "భిన్న సామాజిక వ్యవస్థలు గల రాజ్యాల సహజీవనం, సోషలిజం-పెట్టుబడిదారి విధానాల మధ్య వొక వర్గపోరాట రూపమని" స్పష్టంగా చెప్పింది, "రాజ్యాల మధ్య సహజీవనమంటె వర్గ పోరాటాన్ని వదలి వేయుటగాని, సోషలిస్టు, బూర్జువా సిద్ధాంతాల రాజీకాదని హెచ్చరించింది. ఇంత స్పష్టంగా యీ వైఖరిని చెప్పినపుడు, చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రత్యామ్నాయంగా వివిధ ప్రతిపాదనలు చేయవలసిన అవసరమేముంది అని భారత కమ్యూనిస్టుపార్టీలోని మితవాద

వర్గం ప్రశ్నించింది. అంతేగాక "శాంతియుత సహజీవన సిద్ధాంతాన్ని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నిర్వీర్యం చేసింది ఆచరణలో అని నిందించారు. అయితే ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు చేయుటలోని అర్థం మాస్కో ప్రకటనలోని "శాంతియుత సహజీవనం, ఆర్థికపోటీల ప్రాత్రను జాతీయ విముక్తి, సోషలిజంకై జరుగు పోరాటాలలో లేకుండా జేయుటయే" అని విమర్శించారు.

మాస్కో ప్రకటన "వలస విముక్తికై పోరాడే ప్రజలకు పూర్తిగ నైతికంగా భౌతికంగా సహాయాన్నందించుట, అన్ని సోషలిస్టు దేశాల, అంతర్జాతీయ కార్మిక వర్గం, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ కర్తవ్యమని" విస్పష్టంగా తెలిపింది. అటువంటి స్థితిలో అట్టి సహాయానికి, శాంతియుత సహజీవన విధానానికి వైరుధ్యమెక్కడున్నది అని ప్రశ్నించింది. అయినా పీపిల్సు డెయిలీ 13 డిసెంబరు 1963 సంపాదకీయంలో, లెనిన్ శాంతియుత సహజీవన సిద్ధాంతాన్ని వికృతంగా వక్రీకరించి, త్రోసివేస్తున్నారని విమర్శించి "దీర్ఘకాలం సహజీవనం వూహించరాదని", "చివరకు ఏదో వొకటి విజయం పొందుతుందని", "సోవియట్-బూర్జువా రాజ్యాల మధ్య అనేక పోరాటాలు అనివార్యం" అని లెనిన్ మాటలను వుదహరించింది. సోవియట్ వైఖరిపై యీ విధంగా లెనిన్‌ను వుదహరించుట చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, "ప్రపంచ యుద్ధం అనివార్యం" అని చెప్పే సిద్ధాంతాన్ని పునరుద్ఘాటించుట తప్ప మరొకటి కాదని విమర్శించింది, సోవియట్ యూనియన్ విదేశాల కార్మిక వర్గాలకు సహాయం చేయుట లేదనుట నింద తప్ప వాస్తవం కాదు. శాంతియుత ఆర్థిక పోటీ పాత్రను చైనా కమ్యూనిస్టుపార్టీ చూడజాలక, లెనిన్ సూత్రాన్ని వికృతము చేసి, రూపుమాప ప్రయత్నిస్తున్నారని భారత కమ్యూనిస్టుపార్టీ మితవాద వర్గం విమర్శించింది.[1]

ఈ శతాబ్దపు చివర దశకంలో, శాంతియుత సహజీవన వర్గపోరాట రూపాన్ని వదునైన ఆయుధంగా సామ్రాజ్యవాద శక్తులు వుపయోగించి, సోవియట్ యూనియన్, తూర్పు యూరపు దేశాలలో సోషలిజపు పతనాన్ని సాధించారు.

---

1. పార్టీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకై-సిద్ధాంత వివాదంపై జాతీయ సమితి (సి. పి. ఐ) ఆమోదించిన నివేదిక, 1964. పే. 24-27.

V

# పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన

మార్క్స్, 1870 లో బ్రిటన్‌లో సైనికతత్వం, బూరాక్రటిజం, పెట్టుబడిదారి విధానం, గుత్త పెట్టుబడి సామ్రాజ్యవాదంగా రూపొందనపుడు, కార్మికవర్గం పెరిగిన దేశాలలో సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన మార్గాలు యేర్పడవచ్చుని అన్నారు. లెనిన్ ఫిబ్రవరి అనంతరం "సోవియట్లకే సర్వాధికారాలు" అన్న నినాదమిచ్చి విప్లవం శాంతియుత మార్గంలో పురోగమించుతుందని ఆశించారు. కాని అది వమ్ము అయింది. మార్క్స్, లెనిన్‌లు "కార్మికవర్గం, ప్రభుత్వ యంత్రాంగాన్ని చేబట్టి, దానినదే విధంగా తన కార్యక్రమాలకు వినియోగించజాలదన్నారు".

మాస్కో 1956 కమ్యూనిస్టు పార్టీల సమావేశం చారిత్రాత్మక అంతర్జాతీయ పరిణామాలను బలాబలాలో సోషలిజానికి సుముఖంగా వచ్చిన నిర్ణయాత్మకమైన మార్పులను అధ్యయనం చేసి "సోషలిజంలోనికి పరివర్తన రూపాలు వివిధ దేశాలకు భిన్నంగా వుంటవి. కార్మికవర్గం దాని అగ్రగామి మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ సోషలిస్టు విప్లవాన్ని శాంతిమార్గంలో సాధించ ప్రయత్నిస్తుంది. ఇది కార్మిక వర్గ, ప్రజల జాతుల మొత్తం ప్రయోజనాలకు అనుగుణంగా వుంటుంది." అని స్పష్టం చేసింది. అంతేగాక "అంతర్యుద్ధం లేకుండా కొన్ని దేశాలలో రాజ్యాధికారాన్ని పొందగల అవకాశాలు నేడు ప్రపంచంలో అభివృద్ధి చెందాయని,వాటిని వినియోగించుకొనగలగాలి" అంది. ఇంకా "కార్మికవర్గం నేడు అభివృద్ధి నిరోధకశక్తుల ప్రతిఘటనను చిత్తుగావించి పార్లమెంటులలో ఆధిక్యత సంపాదించి, బూర్జువాపార్లమెంటును కార్మికవర్గ ఆయుధంగా చేసి ప్రజలందరి ప్రయోజనాలకై వుపయోగించగలదని, అభివృద్ధి నిరోధకులు పార్లమెంటేతర మార్గంలో ప్రతిఘటించితే అణచివేసి సోషలిస్టు విప్లవాన్ని శాంతియుతంగా సాగించుటకు తగిన పరిస్థితులను సృష్టించగలరు "అని వివరించింది" పాలక వర్గాలు దౌర్జన్యంగా ప్రజలపై హింసాపద్ధతులు చేబట్టితే సోషలిజాన్ని శాంతియేతర మార్గాల సాధించుటకు గల అవకాశాలను మనసులో పెట్టుకోవాలని" నిశితంగా చెప్పింది[1]. సోషలిజంలోనికి పరివర్తనరూపం ఆయాదేశాల వాస్తవ పరిస్థితుల బట్టి వుంటుందని కూడ వివరించింది.

---

1. బేసిక్ డాక్యుమెంట్సు, 1957, 1960, 1969 (ఆంగ్లంలో) పి. పి. హ. పబ్లికేషన్ 1972 పే. 13.

ప్రపంచ 81 దేశాల కమ్యూనిస్టుల 1960 మాస్కో సమావేశంలో సోషలిజంలోనికి పరివర్తన రూపాలను చర్చించి, వివిధపెట్టుబడిదారి దేశాలలో 1957 మాస్కో ప్రకటన విధానాన్ని పునరుద్ఘాటించింది. మాస్కో ప్రకటనలోని "సోషలిస్టు విప్లవాన్ని శాంతియుత పద్ధతులలో సాధించుట, ప్రజల శ్రేయస్సుకు అనుగుణమైందని," "అంతర్యుద్ధం లేకుండానే రాజ్యాధికారాన్ని పొందగల అవకాశాలను "వివరించింది అంతేగాక" పాలకవర్గాలు ప్రజలపై హింసాకాండచేస్తే, సోషలిస్టు పరివర్తన శాంతియేతర పద్ధతులలో సాధ్యమని గుర్తుపెట్టుకొనాలని" హెచ్చరించింది "అభివృద్ధి నిరోధవర్గాలు బలప్రయోగాన్ని చేబట్టుటపై వర్గపోరాట రూపం ఆధారపడి వుంటుందని" కూడ పునరుద్ఘాటించింది. ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలు 1957, 1960లలో సోషలిజంలోనికి పరివర్తన [రూపాలపై యీ సమిష్టి అవగాహనకు వచ్చారు.

కాని, 1957లోనే మాసియంగ్ నాయకత్వంలో చైనా కమ్యూనిస్టు ప్రతినిధి వర్గం, సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన సిద్ధాంతాన్ని వ్యతిరేకించుతు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సమితికి తమ అభిప్రాయాల సంక్షిప్తపత్రాన్ని సమర్పించారు అనేక కారణాలవలన బహిరంగ పరచలేదన్నారు. సంయుక్త ప్రకటనను 1960లో విడుదల చేయవలసి వున్నందున "అంతర్జాతీయ కార్మికవర్గ విప్లవ ప్రయోజనాలకొరకు, యీ కార్యక్రమ పత్రాలను మితవాదులు తప్పుడుగా వుపయోగించకుండా వుండగలందులకు 1957, 1960 ప్రకటన పత్రాలను కమ్యూనిస్టు వర్కర్స్ పార్టీల మధ్య పరస్పర సంయుక్తసమాలోచనల తదనంతరం సవరణలు ప్రతిపాదించుట, మార్క్సిస్టు లెనినిస్టు మూలసూత్రాలను పటిష్ఠం చేయగలందులకు అవసరం అందుకే 1957లో మేము సోవియట్ పార్టీ కేంద్రకమిటికి అందజేసిన "శాంతియుత పరివర్తనపై మా అభిప్రాయాల పత్రాన్ని విడుదల చేస్తున్నాము ఈ గత 8 సంవత్సరాలలో కృశ్చేవ్ మిత వాదాన్ని గుర్తించారు. అయినప్పటికి సోవియట్ నాయకులు తమ విధానాలను అలాగే కొనసాగిస్తున్నారు అంచేత "శాంతియుత పరివర్తన అనే వూహా చిత్రాన్ని త్రోసివేయుట యిప్పటికి అవసరం"[1]

సోవియట్ పార్టీ కేంద్ర కమిటికి, చైనా నాయకత్వం 1957లో సమర్పించిన చిరుపత్రం. శాంతియుత పరివర్తన రూపాన్ని వుదహరించుటలో ఎత్తుగడల సౌలభ్యం వున్నదని, నొక్కిచెప్పుటను ఆమోదించజాలమంటూ 1) అవకాశం, అవకాశం వాస్తవగుట రెండు ప్రత్యేకాంశాలు అవకాశం కోరికగానే మిగిలపోవచ్చు లేక వాస్తవంగా రూపొందవచ్చు, ii) శాంతియుత పరివర్తనను పార్లమెంటులో మెజారిటీతో

---

1 పీస్‌ఫుల్ ట్రాన్సిషన్ టు అపోజింగ్ సిస్టము (1966) పీపిల్సు డెయిలీ సంపాదకీయం పెకింగ్ రేడియో కామెంట్సు నవంబరు 6 (ఆంగ్లంలో) పే 8-13 ముఖ్యాంశాలు మాత్రమే యివ్వబడినవి

రాజ్యాధికారాన్ని పొందుటగా నొక్కిచెప్పుట కార్మికవర్గపోరాట శక్తిని కుంటుపరచి, నిరాయుధుల చేస్తుంది iii) ఆచరణలో శాంతియుత పరివర్తనకు ఉదాహరణలేదు, iv) శాంతియుత పరివర్తన బూర్జువాలను బలహీనపరచదు, అప్రమత్తుల చేయదు, v) సోషల్ డెమోక్రాట్లను విప్లవకారులుగ చేయదు vi) కమ్యూనిస్టులను బలపరచదు, పైగా విప్లవపటిమను కోల్పోతారు. viii) విప్లవ పోరాటమార్గాన్ని వదలకుండుటయే ముఖ్యకర్తవ్యం అనే కారణాలను పేర్కొని వివరించింది. అందేకనే వ్యతిరేకించామని, తదనంతరం కూడ వ్యతిరేకపోరాటాన్ని సాగిందామని చైనా పార్టీ వివరించింది.

పెట్టుబడిదారి విధానం సోషలిజంలోకి శాంతియుత పరివర్తన సిద్ధాంతంపై చైనా కమ్యూనిస్టుపార్టీ వైఖరి క్లుప్తంగా చూద్దాము.

"కృశ్చేవ్ 20వ, సి. పి. యస్. యు. కాంగ్రెసులో మొదట, "పార్లమెంటరీ పంథాను" ప్రవేశపెట్టినపుడు చైనా కమ్యూనిస్టుపార్టీ సోవియట్ వైఖరి మార్క్సిజం-లెనినిజం మూలసూత్రాలకు వ్యతిరేకమని, తప్పని యెంచింది. కృశ్చేవ్ సంస్కరణవాదన శైశవదశలో వుంది, బహిరంగ వాగ్వివాదాన్ని రెచ్చగొట్టలేదు, మేము బహిరంగంగా విమర్శించలేదు. మా 8వ, పార్టీకాంగ్రెసు, సి. పి. యస్. యు 20వ, పార్టీ కాంగ్రెసు మితవాదాన్ని వ్యతిరేకించింది. డిశెంబరు 1956లో "కార్మికవర్గ నియంతృత్వపై మరికొంత చారిత్రిక అనుభవం" అన్న వ్యాసంలో అక్టోబరు విప్లవ పంథాను వివరించాము. ఆ విధంగా సోషలిజానికి కృశ్చేవ్ పార్లమెంటరీ పంథాను విమర్శించాము. చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి సభ్యులు సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ సభ్యులతో చర్చించాము. సోవియట్ నాయకులు అనేక పర్యాయములు శతృవుపై సమిష్టి పోరాట కోరికను వెలిబుచ్చినందున సోవియట్ చిత్తు తీర్మానాన్ని ప్రాతిపదికగా ఆమోదించాము, సవరణలు ప్రతిపాదించాము. సోవియట్ కామ్రేడ్స్ తమ తప్పులను తెలుసుకొంటారని, సరిచేసుకొంటారని తలచాము, అట్లు జరుగలేదు.

"కమ్యూనిస్టు పార్టీల 1960 సమావేశంలో చైనా పార్టీ ప్రతినిధులు తీవ్ర చర్చలలో, పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన సిద్ధాంతాన్ని, ఘాటుగ విమర్శించారు. సౌహార్ద్ర ప్రతినిధుల కోరిక ప్రకారం ఒక సాధారణ అవగాహన పత్రాన్ని సమావేశం తయారుచేసింది. ముఖ్య వివాదాంశమైన సోషలిజం లోనికి శాంతియుత పరివర్తన అంశాలను 1957 ప్రకటనమండి చేర్చుటకు చైనా ప్రతినిధివర్గం, ఐక్యత కొరకు ఆమోదించింది. అదేకాలంలో 1957లో తాము సోవియట్ పార్టీ కేంద్రసమితికి యీ అంశంపై అందించిన పత్రాన్ని ప్రతినిధులందరికి అందజేసింది, ఈ విధంగా మేము చేసి వుండవలసిందికాదని అంటే, అట్టి విమర్శనకు తలవంచుతాము. మా వ్యతిరేకత కారణంగా, పరివర్తన ...యూపాలలో

"శాంతియేతరమార్గాలలో" అనికూడ చేర్చినా, "విప్లవంలో బలప్రయోగం విశ్వ మూత్రంగా" నొక్కిచెప్పటలో విఫలమైంది. సోవియట్ నాయకత్వం, 1957 ప్రకటన, 1960 పత్రాలలోని యీ లోపాలను అవకాశంగా తీసుకొని కృశ్చేవ్ మితవాదాన్ని అనుసరించుటకుపాతుగా వుపయోగపడింది.

"ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం బూర్జువా రాజ్యాంగ యంత్రాంగానికి ప్రధానమైనది సైన్యమేగాని పార్లమెంటుకాదని రుజువైంది. పార్లమెంటు బూర్జువా పాలనకు "పొకరణ", "తెర" మాత్రమే. పార్లమెంటరీ విధానాన్ని చేబట్టుట, లేక త్రోసివేయుట, అధికారాలను "యిచ్చుట" లేక "తీసివేయుట" ఒక ఎన్నికల చట్టాన్ని ఆమోదించుట లేక రద్దుచేయుట, వీటిలో దేనిని చేబట్టవలసింది, బూర్జువా పాలన అవసరాలు, ప్రయోజనాల బట్టి వుంటుంది. సాయుధ సైన్య బురాక్రసీని బూర్జువావర్గం కంట్రోలు చేస్తున్నంతవరకు "పార్లమెంటులో స్థిరమైన మెజారిటీని" ఎన్నికలలో సంపాదించుట అసాధ్యం లేదా "స్థిరమైన మెజార్టీ" ఆధారపడతగినది కాదు. పార్లమెంటరీ మార్గాన "సోషలిజాన్ని సాధించుట" మిక్కిలి అసాధ్యం, మోసపు మాటలు మాత్రమే.[1]

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఫ్రెంచిపాలక గుత్తపెట్టుబడిదారివర్గం ఎన్నికల చట్టాన్ని రెండుసార్లు తిరుగవ్రాసారు. ప్రతిసారి కమ్యూనిస్టుపార్టీ ప్రాతినిథ్యం ఫ్రెంచి పార్లమెంటులో తగ్గిపోతూ వచ్చింది. పార్లమెంటు 1946 ఎన్నికలలో 182 సీట్లు వచ్చిన కమ్యూనిస్టులకు, 1951లో ఎన్నికల చట్టాన్ని మార్చిన తరువాత 103 సీట్లు వచ్చాయి 79 సీట్లు తగ్గిపోయాయి· తదుపరి 1956 ఎన్నికలలో 156 సీట్లు వచ్చాయి. తదుపరి ఎన్నికల చట్టాన్ని మరోసారి మార్చి ఎన్నికలు 1958లో జరుపగా 10 సీట్లు వచ్చాయి, అనగా 140 సీట్లు కోల్పోయారు.

"చిలీ కమ్యూనిస్టుపార్టీ 1946 ఎన్నికలలో బూర్జువా రాడికల్ పార్టీని బల పరచింది. కమ్యూనిస్టులతో కలసి కొయలిషియన్ ప్రభుత్వాన్ని యేర్పరచింది. చిలియన్ కమ్యూనిస్టులు ఆ బూర్జువా ఆధిపత్యంలోని ప్రభుత్వాన్ని "జనతా ప్రజా స్వామ్య ప్రభుత్వం" అన్నంత వరకు వచ్చారు. సంవత్సరం లోపలే బూర్జువావర్గం, బయటకు త్రోసివేసింది. మూకుమ్మడిగా అరెస్టులు చేసింది, చివరకు 1948లో కమ్యూనిస్టు పార్టీ నిషేధించింది.

"కార్మికవర్గ పార్టీ తన అస్తిత్వాన్ని కోల్పోయి సోషల్ డెమోక్రటిక్ పార్టీగ రూపొందితే, బూర్జువా వర్గపు కీలుబొమ్మగానైతే పార్లమెంటులో మెజారిటీ సంపా దించగలుగుతుంది. ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగలుగుతుంది. ఇది బూర్జువాలకు

---

1. పీప్‌పుల్ ట్రాన్సిషన్ టు అపోజింగ్ సిస్టమ్స్ (1963) పీపుల్స్ డెయిలీ సంపాద కీయం. పెకింగ్ రేడియో కామెంటు నంబరు 6. (ఆంగ్లంలో) పే. 8-13. ముఖ్యాంశాలు మాత్రమే యివ్వబడినవి.

రక్షణగా, వారి నియంత్రుత్వాన్ని బలపరచుటకే వుపయోగపడుతుంది. కార్మికుల పరిస్థితి యే మాత్రమూ మార్చజాలదు. పార్లమెంటరీ విధానపు "మేడిపండు"ను బుజువు చేస్తుంది. పార్లమెంటరీ విధానాన్ని పూర్తిగ కమ్యూనిస్టులు విశ్వశించితే చివరకు మితవాద సంస్కరణ వాదంలో కూరుకుపోతారు. పార్లమెంటు ప్రభుత్వపు బూర్జువా నైజాలను మార్చజాలరు. పాత ప్రభుత్వపు రాజ్యాంగ యంత్రాంగాన్ని నాశనం చేయలేరు, నూతన రాజ్యాంగ యంత్రాన్ని నిర్మించలేరు. బూర్జువా పార్ల మెంటు, ప్రభుత్వంపై ఆధారపడి మౌలిక సామాజిక మార్పులను తేజాలరు. బూర్జువావర్గం చేతులలో రాజ్యాంగ యంత్రాంగం ఉండుటతో ఎన్నికలను, పార్ల మెంటును, ప్రభుత్వాన్ని ఏకపక్షంగా రద్దు చేయవచ్చు, ప్రభుత్వంనుండి కమ్యూ నిస్టులను తొలగించవచ్చు, పార్టీని రద్దు చేయవచ్చు, నిషేధించవచ్చు, ప్రజలను అణచేదౌర్జన్య చర్యలు కొనసాగించవచ్చు. ఈ వాస్తవాన్ని కమ్యూనిస్టు మరువరాదు

"లెనిన్ రెండవ ఇంటర్నేషనల్ మితవాదులను, పార్లమెంటరీ నీడవెంటపడి నారని, విప్లవకర్తవ్యాలను, రాజ్యాధికారాన్ని విప్లవమార్గంలో చేబట్టుటను వదలి వేసారని ఖండించారు కార్మికవర్గపార్టీని పార్లమెంటరీ పార్టీగ, బూర్జువాపార్టీలకు తోకగా మార్చివేసారని, బూర్జువా నియంత్రుత్వాన్ని బలపరచే సాధనంగా చేసారని తీవ్రంగా విమర్శించారు. కృశ్చేవ్ అతని అనుచరులు పార్లమెంటరీ మార్గాన సోష లిజం స్థాపన ప్రయత్నించితే, రెండవ ఇంటర్నేషనల్ మితవాద వర్గాలు పొందిన గతినే పొందగలుగుతారు.

"కృశ్చేవ్, ఫ్రెంచి కమ్యూనిస్టు నాయకత్వపు సలహాలను అల్జీరియా కమ్యూ నిస్టు పార్టీ ఆమోదించినా, అల్జీరియన్ విప్లవ ప్రజాసామాన్యం సంస్కరణవాదాన్ని త్రోసిపారవేసి, సామ్రాజ్యవాదంపై సాయుధ జాతీయ విముక్తి విప్లవ పోరాటాన్ని దీర్ఘకాలం సాగించి, విజయాన్ని సాధించి ఫ్రెంచి ప్రభుత్వం వారి స్వాతంత్ర్యాన్ని గుర్తించునట్లు చేయగలిగారు. సోవియట్ సంస్కరణవాద పంథాని అనుసరించిన అల్జీరియన్ కమ్యూనిస్టుపార్టీ ప్రజల విశ్వాసాన్ని రాజకీయ బలాన్ని కోల్పోయింది.

"క్యూబా విప్లవకాలంలో పాప్యులర్ సోషలిస్టుపార్టీలోని కొందరు నాయకులు కృశ్చేవ్ సంస్కరణవాదాన్ని శాంతియుత పరివర్తనాన్ని వ్యతిరేకించి సరియైన మార్క్సిస్టు-లెనినిస్టు విప్లవ సాయుధ పోరాటాన్ని చేబట్టి, ఫీడల్ కాస్ట్రోనాయక త్వంలో క్యూబన్ పార్టీలోపల బయట ఉన్న మార్క్సిస్టు-లెనినిస్టులు ఐక్యంగా, ప్రజలతో విప్లవ పోరాటాన్ని క్యూబాలో కొనసాగించి, చారిత్రాత్మక విజయాన్ని పొందారు.

"ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ సంస్కరణవాదాన్ని కృశ్చేవ్ ఆశీస్సులతో "సోషలిజం కొరకు పార్లమెంటరీ పంథా" రాజకీయ విధానాన్ని రూపొందించి, కమ్యూనిస్టుపార్టీని, సోషల్ డెమోక్రటిక్ పార్టీగ దిగజార్చింది. ప్రజల విప్లవాశయా

లకు ఆకాంక్షలను బలాన్ని చేకూర్చుటమానివేసారు. అమెరికా సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ జెండా దించివేసారు వారి సంస్కరణవాద ఫలితంగా ప్రజల నుండి దూరమై రోజురోజుకు బలాన్ని కోల్పోతున్నారు.[1]

"తూర్పు యూరపు, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలోని దేశాలు కొన్ని ప్రపంచయుద్ధానంతరం అక్టోబరు విప్లవమార్గాన్ని అనుసరించి సోషలిజాన్ని విజయవంతంగా స్థాపించాయి. నేడు అక్టోబరు అనుభవాలేగాక చైనా, కొరియా, తూర్పుయూరపు సోషలిస్టు దేశాల, క్యూబా, వియత్నాం, అనుభవాలు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాలకు అందుబాటులో ఉన్నవి. ఈ అనుభవాలన్నీ మార్క్సిజం, లెనినిజాన్ని పరిపుష్టం చేసాయి. చైనానుండి క్యూబా విప్లవం వరకు సామ్రాజ్యవాద దేశాల సాయుధ దురాక్రమణకు వ్యతిరేకంగాను, ఆ దేశాల అంతర్గత పరిస్థితులలో సాయుధంగా సామ్రాజ్యవాదం కలుగజేసుకొనినపుడు విప్లవ శక్తులు సాయుధ పోరాటం సాగించి విజయం పొందాయి.

రెండు మౌలిక విధానాలు అనుసరించుట రెండు మౌలిక భిన్న ఫలితాలకు దారి తీయుట స్పష్టంగా చూచాం. ఈ పాఠాలన్నీ నిశితంగా అధ్యయనం చేయవలసిన అవసరముంది.

సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనపై సోవియట్-చైనా వైఖరులను చూసాము. ఇక భారతదేశంలోని మితవాద, అతివాద కమ్యూనిస్టు వర్గాల స్పందనలను చూద్దాము.

భారత కమ్యూనిస్టుపార్టీ అమృత్‌సర్ పార్టీ కాంగ్రెసు ఏప్రియల్ 1958లో పార్టీ నిర్మాణ సూత్రాలలో "భారత కమ్యూనిస్టుపార్టీ సంపూర్ణ ప్రజాస్వామ్యం, సోషలిజాన్ని శాంతియుత మార్గంలో సంపాదించుతుంది. బలోపేతమైన ప్రజోద్యమాన్ని నిర్మించి, పార్లమెంటులో ఆధిక్యత సంపాదించి, దానివెనుక ప్రజోద్యమం నిలబడుతుంది. కార్మిక, ప్రజోద్యమాలు అభివృద్ధి నిరోధక శక్తులవ్యతిరేకతను అధిగమించి, ప్రజావాంఛా ప్రతిబింబంగా పార్లమెంటును మార్చి, మౌలిక మార్పుల సాధనంగా జేసి ఆర్థిక, సామాజిక రాజ్యాంగ మార్పులను తీసుకొస్తుంది." అని సవరణలు ఆమోదించింది. అంటె ధ్యేయం లేక లక్ష్యంగా ప్రకటించింది. కాన "కోరిక", "ఎత్తుగడలు"గా అర్థం చేసుకొనజాలము.

పార్టీలోని మితవాద వర్గాలు మాస్కో ప్రకటన ఏకకాలంలో స్పష్టంగా "వివిధ సామాజిక వ్యవస్థలుగల రాజ్యాలు సహజీవనం చేయుట సోషలిజం-పెట్టుబడిదారి

---

1. పీస్‌పుల్ ట్రాన్సిషన్ టు అపోజిషన్ సిస్టమ్స్ (1963) పీపుల్సు డెయిలీ సంపాదకీయం పెకింగ్ రేడియో కామెంటు నంబరు. 6. (ఆంగ్లంలో) పే. 36-40.

విధానం మధ్య వర్గ పోరాటంయొక్క ఒక రూపమని." "దేశాల మధ్య శాంతియుత సహజీవనమంటే వర్గ పోరాటాన్ని వదలివేయుటకాదని" లేక "సోషలిజం-పెట్టుబడిదారి విధానాల మధ్య రాజీపడుటకాదని" హెచ్చరికలు చేస్తుంటే పైగా తమ వైఖరి, అవగాహనలను స్పష్టం చేసినపుడు ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు చైనా చేయుటలో అర్థమేమిటని ప్రశ్నించింది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తదితర కమ్యూనిస్టు పార్టీలు ఆచరణలో శాంతియుత సహ జీవనమూల సూత్రాన్ని విస్మారం చేసారనుట నింద తప్ప మరొకటికాదు. ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ స్థానాన్ని దిగజార్చుట తప్ప మరొకటికాదు. ఇది శాంతియుత సహజీవనం శాంతియుత పోటీల పాత్రలను నిరాకరించుటయే అగుతుంది.

దేశాల మధ్య "శాంతియుత సహజీవనాన్ని" ముఖ్యంగా రెండు సామాజిక వ్యవస్థల మధ్య సహజీవనాన్ని, సోషలిస్టు దేశాల మధ్య, సోషలిస్టు దేశాలు, అణచబడిన జాతుల దేశాల మధ్య సహజీవనంగా చెప్పి, చైనా విమర్శించుటను మితవాద వర్గాలు సమస్యను గందరగోళపరచునట్లుగా వ్యాఖ్యానించింది. ప్రథమంగా శాంతియుత సహజీవనం సోషలిస్టు పెట్టుబడిదారి దేశాలమధ్య సంబంధాల గురించినది కాని సోషలిస్టు దేశాల మధ్యగల సంబంధాల గురించికాదు. సోషలిస్టుదేశాల మధ్య సౌహార్ద సహకార ఐక్యతా సంబంధాలు వుంటవి. ద్వితీయంగా సోషలిస్టుదేశాల మధ్య విదేశ సంబంధాలకు సంబంధించిన శాంతియుత సహజీవనము చైనా కమ్యూనిస్టుపార్టీ శాంతియుత సహజీవనము స్వతహాగా వర్గపోరాటంయొక్క మరోరూపంగా భావించుటలేదు. అంటే శాంతియుత సహజీవనమనగా ప్రపంచాన్ని సోషలిస్టు ప్రాంతంగా సామ్రాజ్యవాద ప్రాంతంగా శాశ్వతపరచుట అనే అవగాహనకు చైనాపార్టీవచ్చి శాంతియుత సహజీవనము సోషలిస్టు దేశాల సాధారణ విదేశాంగ విధానమైతే, అణచబడుతున్న దేశాలవారికి సహాయం చేయుటలో అడ్డువస్తుందని ముఖ్యంగా జాతీయ స్వాతంత్ర్యం పొందుటకు ఆటంకమగుతుందనుట వింతగా వుంది. మాస్కో ప్రకటన స్పష్టంగా అన్ని సోషలిస్టు దేశాలు, అంతర్జాతీయ కార్మికవర్గం, కమ్యూనిస్టు ఉద్యమం సామ్రాజ్యవాద వలస దౌర్జన్యానికి వ్యతిరేకంగా పోరాడే ప్రజా ఉద్యమాలకు నైతిక భౌతిక అన్ని సహాయాలు చేయుట తమ కర్తవ్యంగా సూచించింది.

అటువంటప్పుడు సహాయకార్యక్రమానికి శాంతియుత సహజీవనానికి వైరుధ్యమెక్కడుందని, భారత కమ్యూనిస్టు మితవాదవర్గం ప్రశ్నించింది.[1]

భారత కమ్యూనిస్టుపార్టీలోని అతివాదవర్గం, 1964లో సి.పి.యం.గా రూపొంది అంతర్జాతీయ సిద్ధాంత సమస్యలను 1968లో చర్చించి నిర్ణయాలు తీసుకున్నది, కాని 1957నుండి ప్రధానంగా చైనా అవగాహనలను మరోమాటలలో

1. పార్టీ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతపై, సిద్ధాంత వివాదంపై జాతీయ సమితి ఆమోదించిన నివేదిక (1964) ఆంగ్లంలో. పే. 52-53.

బలపరస్తూ వచ్చింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు సిద్ధాంత సమస్యలపై స్వతంత్ర అవగాహనా ప్రయత్నమే బర్ద్వాన్ ప్లీనంలో ఏప్రియల్ 1968లో ఆమోదించిన తీర్మానం అధికారికంగా వారి అభిప్రాయాలను పొందుపరచింది. అందులోని "సోష లిజం పరివర్తన రూపాలుపై ప్రత్యేకంగా శాంతియుత పరివర్తనపై వారి అభిప్రా యాలు విశదీకరించబడినాయి. అత్యద్భుతమైనా పేరు ఎక్కడా పుదహరించ బడలేదు. వాటిని సమస్యకు సంబంధించినంతవరకు తెలుసుకొందాము.

మార్క్సిస్టుపార్టీ లెనిన్ "రాజ్యాంగ విప్లవం" అన్న సిద్ధాంత మౌలికాంశా లను పునరుద్ఘాటించి రాజ్యం మరోవర్గాన్ని అణచివేయుటకై హింసాపూర్వక నిర్మాణం అని సంక్షిప్తంగా చెప్పి, బూర్జువాల రాజ్యం బూర్జువావర్గ నియంతృత్వ తప్ప మరొకటికాదని అదేవిధంగా కార్మికవర్గ రాజ్యాలు వివిధ రూపాలులో వున్నా సారాంశం కార్మికవర్గ నియంతృత్వాలనుట సత్యదూరం కాదన్నది. బూర్జువారాజ్యపు హింసను యే విధంగా యెదుర్కొనాలన్నదే సోషలిస్టు విప్లవపు ప్రధాన సమస్య అన్నది. మార్క్సిజం లెనిన్‌లు సాయుధ తిరుగుబాటు పోరాట రూపం, అన్ని పరి స్థితులలో ఎల్లప్పుడూ అనుసరణీయంగా గుర్తించాలని" అన్నారు. దీనివికాదవి, కార్మికవర్గ విప్లవం చరిత్ర శాంతియుత పరివర్తన కలుగజేసిన అవకాశాలను వుప యోగించుటకు అంతర్జాతీయ బూర్జువావర్గం యే విధంగా హింసను దౌర్జన్యాన్ని వుపయోగించుచున్నది పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్త నకు గల అడ్డంకులను పరిగణించవలసియున్నది. లెనిన్ యీ విషయమై 1916లోనే ప్రత్యేక సందర్భాలలో పెద్దదేశపు ప్రక్కన ఉన్న చిన్నదేశం అధికారాన్ని శాంతి యుతంగా యిచ్చుట సాధ్యమే నిరోధించిన మరింత నష్టదాయకమని వ్యక్తిగతంగా అపాయమనినెంచవచ్చు. అయినా చిన్నదేశంలో కూడ అంతర్యుద్ధం లేకుండా సోషలిజం స్థాపన అసాధ్యం అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

జాతీయ, అంతర్జాతీయ మారిన పరిస్థితులు శక్తుల బలాబలాలు కార్మికవర్గానికి సోషలిజానికిఆధిక్యత లభించినపుడు మార్క్స్ ఎంజిల్స్‌లెనిన్ స్టాలిన్‌లు ప్రవచించిన విప్లవం హింసాయుతమనే విశ్వసూత్రానికి, బూర్జువర్గపు వొత్తిడితో కార్మికవర్గం,వారి ననుసరించు విధానానికి కాలదోషం పట్టిందని, మితవాద సంస్కరణవాదులు సిద్ధాంతీ కరించారు. దాని స్థానాన్ని పెట్టుబడిదారి విధానం, పార్లమెంటరీ పంథాలో సోషలి జంలోనికి శాంతియుత పరివర్తన సిద్ధాంతం ఆక్రమించిందని వాదించుతున్నారు. జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం అనే పాలనా యంత్రాంగంచే గూడ సోషలిజం లోనికి పరివర్తనను కొనసాగించవచ్చనే సూత్రీకరణ వరకు వెళ్ళారు, జాతీయ ప్రజా స్వామ్య విప్లవ ప్రభుత్వంలో బూర్జువావర్గం, కార్మికవర్గం సంయుక్తంగా నాయక త్వంలో వుండుట స్పష్టం. మార్క్సిస్టు-లెనినిస్టు కార్మికవర్గ విప్లవ మౌలిక సూత్రా లను రాజ్యం-కార్మికవర్గ విప్లవంపై ప్రాథమిక మౌలిక అవగాహనలనే కాదనే మిత

వాద మెన్షివిక్‌ల సంస్కరణవాదం తప్ప యిదిమరొకటి కాదు. మార్క్సిస్టు. లెనినిస్టు మౌలిక సూత్రాలు ప్రతి విప్లవప్రధాన సమస్య రాజ్యాధికారం అనే అవగాహనతోనే పురోగమిస్తుంది. ఈ విధమైన అవకాశవాద వ్యాఖ్యపై లెనిన్ "ఈ విధమైన వక్రీకరణ రాజ్యం-కార్మికవర్గ విప్లవానికి గల సంబంధాన్ని కప్పిపెట్టి సామ్రాజ్యవాదాల మధ్య వైరుధ్యాల ఫలితంగా ఫెనుభూతంలా పెరిగిపోయిన సైనిక యంత్రాంగంతో ప్రపంచాన్ని ఎవరు పాలించాలనేది తేల్చుకోమటగాను కోట్లకొలదిప్రజాసామాన్యాన్ని బలిపెట్టుటకై ద్రవ్య పెట్టుబడి చేయు ఘోరాన్ని కప్పిపెట్టుట తప్ప మరొకటికాదు" అని స్పష్టం చేసారు.

ఇంకా "రెండవ ప్రపంచ యుద్ధానంతర చరిత్ర అంతా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా యూరపులలో శాంతియుత మార్గాన విప్లవం పురోగమించుట బూర్జువావర్గాలు సహించక లక్షలాది స్వాతంత్ర్య, విప్లవవాదులను బూర్జువా పోలీసు, సైనిక దళాలు మట్టుబెట్టుట, యీ సత్యాన్నే రుజువు చేస్తున్నది" వాస్తవాలు యీ విధంగా వుంటే సోషలిస్టు విప్లవం కాని, జాతీయ విప్లవ విముక్తి విప్లవ పరివర్తన రూపాల సమస్యను యే మార్క్సిస్టులెనినిస్టు గుత్తపెట్టుబడిదారి రాజ్యం లేక రాజ్యాల నుండి వేరు చేసి పరిశీలించుటకు ఆమోదించవచ్చునా అనే ప్రశ్న వుదయిస్తుందని మార్క్సిస్టుపార్టీ ప్రశ్నించి "మా సమాధానం ఆ విధంగా వేరుచేసి పరిశీలించి,చర్చించుట మార్క్సిజం కాదని[1]" స్పష్టంచేసింది.

లెనిన్ 1917 ఏప్రిల్-జూలైలలో రష్యావిప్లవం శాంతియుత మార్గంలో పరివర్తన చెందు మార్గాలను అవకాశాలను, దృక్పధాన్ని చూడగలిగాడంటే "రాజ్యం-విప్లవం" విశ్లేషణ చేసి, ఆ దశలో ప్రభుత్వంసైన్యాన్ని వుపయోగించలేని ప్రత్యేక దశలో ద్వంద ప్రభుత్వం కార్మిక, కర్షక సైనికుల సాయుధ పోరాటాల ఫలితంగా యేర్పడిన దశలో సోవియట్లు అధికారాన్నంత సోవియట్లకా అప్ప నివంధ మిచ్చిన దశలో శాంతియుత పరివర్తన మార్గానికి గల అవకాశాలను ఆలోచించాడుకాని అంతర్జాతీయ దేశీయ అభివృద్ధి విరోధకులు అట్టి అవకాశాన్ని వ్యర్థ్యం చేసి, సాయుధ విప్లవ కొనసాగింపునే ముందుకు నెట్టారు.

నేటి సంస్కరణ వాదులు ప్రతిపాదించే పెట్టుబడిదారివిధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన సిద్ధాంతం మార్క్సిజం లెనినిజం లకు సంబంధములేనిది, బూర్జువా ప్రభావజనితం, ఈ సిద్ధాంతం విప్లవ కార్మిక వర్గాన్ని నిరాయుధులను చేస్తుంది, మార్క్సిజం-లెనిజంలకు ద్రోహంచేసి, బూర్జువాలకు సేవచేస్తుంది.

ముగింపుగా, కార్మికవర్గం రాజ్యాధికారాన్ని విప్లవాన్ని శాంతి మార్గంలోనే విజయం పొందాలని కోరుకొంటుంది. ఎప్పుడు, ఎక్కడ అట్టి అవకాశంలభించినా

---

1. బర్ద్వాన్ సైద్ధాంతిక తీర్మానం (1968) మే 1968 కేంద్రప్లీనంలో ఆమోదించినది జూన్ 1969లో భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు)చే (ఆంగ్లంలో ప్రచురించబడినది పే. 23-30

సోషలిస్టు విప్లవాన్ని శాంతి మార్గాన్నే ప్రయత్నించుతుంది. అట్టి అవకాశాన్ని జార విడువదు. అందుకే పార్టీ కార్యక్రమంలో "జనతా ప్రజాస్వామాన్ని సోషలిస్టు పరివర్తనను శాంతి మార్గాన స్థాపించ ప్రయత్నిస్తుంది పాలకవర్గాలు యీ మార్గాన్ని మూసివేయుటకు ప్రయత్నిస్తాయని మరువదు. అందుకే అన్ని పరిస్థితులకు సంసిద్ధంగా, జాగరూకతతో వుంటుంది" అన్ని మార్క్సిస్టు పార్టీ స్పష్టం చేసింది.

భారత కమ్యూనిస్టువర్గాలలోని మార్క్సిస్టులు (సి. పి. యం)వారి దృక్పధం, అభిప్రాయాలు, అవగాహనలు, శాంతియుత పరివర్తనపై చైనా ఆలోచనా విధానాలననుసరించే వుండుట స్పష్టం, కాని చైనా ప్రస్తావన ఎక్కడా తీసుకొని రాకపోవుట గమనించవలసినదే. సోవియట్ అవగాహనలను మితవాద సంస్కరణవాదంగా తీవ్రంగావిమర్శించి పరోక్షంగా చైనా అవగాహనల బలపరచుట స్పష్టం.

## VI
## జాతీయ విముక్తి ఉద్యమాలు

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం సోషలిస్టు ప్రజాస్వామ్యశక్తులబలం ప్రోత్సాహలతో విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయవిముక్తి వుద్యమాలు అత్యంత వేగంగా విజృంభించాయని మాస్కో 1957 ప్రకటనపేర్కొంది. గత 12 సంవత్సరాలలో చైనా కొరియా, వియత్నాం ప్రజాస్వామ్యరిపబ్లిక్‌ల 700 మిలియనులప్రజలు వలస బానిసత్వ విముక్తిని స్వాతంత్ర్యాన్ని పొందారు. మిగిలిన వలస, ఆధారిత దేశాలలో జాతీయ విముక్తి పోరాటాలు తీవ్రతరమయ్యాయి. సోషలిజపు జాతీయ విముక్తి వుధ్యమాల అభివృద్ధి సామ్రాజ్యవాద పతనాన్ని వేగిరపరచింది. ప్రపంచంలో అత్యధిక భూభాగంలో వలసబానిసత్వాన్ని సాగించిన సామ్రాజ్యవాదం వైరుధ్యాలతో కూలిపోయింది.

సామ్రాజ్యవాదం వున్నంతవరకు దురాక్రమణ యుద్ధాలకు భూమిక వుంటుంది యుద్ధానంతరం సామ్రాజ్యవాదదేశాలు, వారి తొత్తులు ఇండొనేషియా, ఇండొచైనా, కొరియా. మలయా, కెన్యా, గౌటమలా, ఈజిప్టు, అల్జీరియా, ఓమన్, ఈమెన్‌లలో ప్రజావ్యతిరేక యుద్ధాలు సాగించారు. కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు, అన్ని దేశాల జాతీయ ప్రజాస్వామ్య ప్రయోజనాల రక్షణ, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పోరాటాల చారిత్రిక కర్తవ్యాల పరిపూర్తిని స్వాతంత్ర్యాన్ని బలపరచవలసి వుంది. సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక కార్మిక, కర్షక, జాతీయ బూర్జువా, నగరపేటీ బూర్జువా, తదితర దేశభక్త వర్గాల ఐక్యసంఘటనను యీ దేశాలు నిర్మించవలసి వుంది అదే విజయాన్ని చేకూర్చగలదు. మాస్కో ప్రకటన వలన, నూతన స్వాతంత్ర్య దేశాల ముందుంచిన ప్రధాన కర్తవ్యమిదే.

ప్రపంచ 81 కమ్యూనిస్టుపార్టీల 1960 మాస్కో సమావేశం అంతర్జాతీయ సైద్ధాంతిక జాతీయ విముక్తి వుద్యమాల సమస్యల అధ్యయనంచేసి, కర్తవ్యాలను ప్రకటనలో రూపొందించింది, మానవజాతి జీవితంలో నూతన చారిత్రిక కాలం ఆరంభమైందని ఆసియా, ఆఫ్రికా, లాటిన్, అమెరికావలస ప్రజలు స్వాతంత్ర్యాలను పొంది, ప్రపంచరాజకీయాలలో తమపాత్ర నిర్వహించుచున్నారు. "వలస బానిస విముక్తి వుద్యమాల సమ్మెట దెబ్బలతో వలస సామ్రాజ్యవాదం బ్రద్దలై పూర్తిగ కూలిపోవుట తధ్యమని, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ యేర్పాటు తరువాత యిది రెండవ చారిత్రాత్మక ప్రముఖ పరిణామమని[1]" జోస్యం, వ్యాఖ్య అవసరం లేకుండా స్పష్టం చేసింది.

"ఆసియా స్వరూపం మౌలికంగా మారిపోయింది. వలసతత్వం ఆఫ్రికాలో కూలిపోతున్నది. దక్షిణ అమెరికాలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మరో సాయుధ పోరాటరంగం తెరవబడింది. సామ్రాజ్యవాద వ్యతిరేక సాయుధపోరాటంలో ఆసియ, ఆఫ్రికా తదితరప్రాంతాలలో వందల మిలియనుల ప్రజలు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నారు. ఈ పోరాటాలన్నిటిలో కమ్యూనిస్టులు అగ్రగామి దళంగా సాహసాన్ని పోరాట పటిమను ప్రదర్శించారు

వలస ప్రజలు జాతీయవిముక్తి ఉద్యమ సాయుధ పోరాటం ద్వారా స్వాతంత్ర్యాన్ని సంపాదించారు. కొన్నిచోట్ల ప్రత్యేక పరిస్థితులబట్టి సైనికేతర మార్గాల ద్వారా కూడ సంపాదించారు. వలస-సామ్రాజ్యవాదం యిష్టాపూర్వకంగా స్వాతంత్ర్యాన్ని ప్రసాదించదు. విముక్తి పొందిన దేశాల జాతీయ పునర్నిర్మాణ తక్షణ కర్తవ్యం సామ్రాజ్యవాద శేషఫ్యూడలు శక్తుల వ్యతిరేక ధృఢతరపోరాటంతోనే సమర్థవంతంగా నెరవేరదు. జాతీయ స్వాతంత్ర్య పరిరక్షణ, కార్మిక, కర్షకఐక్యత, అన్ని దేశభక్త శక్తులు జాతీయ ప్రజాస్వామ్య ఐక్య సంఘటనద్వారానే లక్ష్యసాధన నెరవేరుతుంది. అభ్యుదయ వ్యవసాయ సంస్కరణంతో ప్రజల ఆహార సమస్య పరిష్కారమగుతుంది.

నేటి పరిస్థితులలో వలస, అర్థవలస ఆధారిత దేశాలలోని జాతీయ బూర్జువా వర్గం, ముఖ్యంగా సామ్రాజ్యవాదంతో బ్రహ్మముడి వేసుకొననిది, సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలను పరిష్కరించుటలో తన ప్రయోజనాలను చూస్తుంది అంచేత సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక విప్లవ పోరాటాలలో సుముఖంగా ద్వందపాత్రసహజమైనా పాల్గొంటుంది. ఈ అర్థంలో దానికి యింకా అభ్యుదయకర

1. బేసిక్ డాక్యుమెంట్సు, మాస్కో సమావేశాలు. కమ్యూనిస్టు అండ్ వర్కర్స్ పార్టీలు, 1957 1960-1969: పి.పి.ఐ.పబ్లికేషన్స్ (ఆంగ్లంలో) 1972 పే, 40.

పాత్ర వుంది. నేడు స్వతంత్ర జాతీయ ప్రజాస్వామ్యాలు వర్ధిల్లుటకు మంచి అవకాశాలున్నవి.

కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేక విజయాలను జాతీయ ప్రభుత్వ ప్రజాకార్యక్రమాలను బలపరచాలి. అదే సమయంలో ప్రజాస్వామ్య ప్రజావ్యతిరేక పాలకవర్గ చర్యలను కార్యక్రమాలను జాతిస్వాతంత్ర్యాలను ప్రమాదంలోనికి త్రోసే చర్యలను గట్టిగా ప్రతిఘటించాలి. జాతీయ ప్రయోజనాలు కమ్యూనిస్టుల ధ్యేయంగా వుండాలి. కమ్యూనిస్టు వ్యతిరేక నినాదాలతో అభివృద్ధి నిరోధకులు జాతీయ ఐక్య సంఘటనను విచ్ఛిన్నము చేయు చర్యల నెరుర్కొని వమ్ముచేయాలి. కార్మిక వర్గంలో వర్గ చైతన్యాన్ని పెంపొందించాలి. ప్రపంచ చరిత్రగమనం వలస విధానం అన్ని రూపాలలో రద్దుచేయబడుటనే తెలియజేస్తుంది. సామ్రాజ్యవాదం అణచివేస్తున్న అన్ని ప్రజాపోరాటాలను ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల సమావేశం బలపరచింది.

సమావేశం, వలస సామ్రాజ్యవాద వ్యతిరేక అన్నిపోరాటాలకు ఆసియా, ఆఫ్రికా ప్రజలకు తన సౌహార్థ సందేశాన్ని మద్దతును ప్రకటించింది. అల్జీరియా ప్రజాపోరాటాలకు అభినందనలు ఆఫ్రికాలోని జాతివిచక్షణను ఖండించింది. క్యూబా కాంగోలలో సామ్రాజ్యవాదులు కలుగజేసుకొనుటనుకూడ ఖండించింది. అన్ని సోషలిస్టు దేశాలు, అంతర్జాతీయ కార్మికవర్గం కమ్యూనిస్టు వుద్యమం స్వాతంత్ర్యాలకై పోరాడే ప్రజలకు పూర్తి నైతిక పాదార్థిక సహాయాలనందిచ్చుట తమ విద్యుక్త ధర్మంగా నెంచుతున్నవి అని ప్రకటించింది.

చైనా కమ్యూనిస్టు వర్గాలు వలస విముక్తి విప్లవోద్యమాలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ పూర్తిగ అన్ని విధాల బలపరచుట లేదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అంతేగాక సంస్కరణవాదాన్ని చేబట్టి పోరాటాలను నిరుత్సాహపరస్తున్నారు. పైగా బహిరంగంగా జాతీయవిముక్తి ఉద్యమాలను వ్యతిరేకించే ధైర్యంలేక వారిస్వప్రయోజనం కొరకు మద్ధతుదారులగ కన్పించుటకు కొన్ని చర్యలు తీసుకొంటున్నారు. అనేక సంవత్సరాలువారి చర్యలు నిశితంగా పరిశీలించిన వలస విముక్తి వుద్యమాల యెడల వారి వైఖరి వాస్తవస్వరూపం వెల్లడవుతుంది. విముక్తి వుద్యమాల యెడల విముఖ తేలిక వైఖరి పరోక్షంగా నియోవలసవాదుల అనుకూల వైఖరి కన్పడుతుంది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ జూలై 14, 1963 లేఖలో అనేక ఇతర వ్యాసాలలో ప్రకటనలలో జాతీయ విముక్తి ఉద్యమాల యెడల చైనా కమ్యూనిస్టు పార్టీ వైఖరిని నిశితంగా విమర్శించుదాడిచేస్తూ తమ తప్పుడు విధానాన్ని సమర్థించుకొన్నారు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ "పోర్చుగీసు అంగోలా మొజాంబిక్‌లాంటి ఆఫ్రికాదేశాలలో 50 మిలియనుల ప్రజలు వలస బానిసత్వంలో వున్నారని వలస

విధానపురద్దు చివరి ఘట్టానికి చేరిందని నేటి ప్రపంచాన్నుండి రద్దయి పోయిందని పోతూ వుందని ప్రచారం చేస్తున్నారు. వాస్తవమేమిటి? ఆసియా ఆఫ్రికా ఖండాలలో అనేక దేశాలు స్వతంత్రం ప్రకటించాయి. కాని సామ్రాజ్యవాదపు గుత్తపెట్టుబడి దారులు వలసాధిపతుల పెత్తనం బానిసత్వం, సంపదదోపిడి, దురాక్రమణ పురాతన నూతన వలసవాదులందరూ కొనసాగిస్తూనే వున్నారు. సాంప్రదాయ వలసదారుల స్థానం అత్యంత శక్తివంతం అపాయకరమైన అమెరికను నియోవలస విధానం ఆక్రమిస్తున్నది. ఆసియా ఆఫ్రికా ప్రజలు నియో అమెరికా వలసవాదుల పాలగుతున్నారు. "లాటిన్ అమెరికానేడు మిక్కిలి శక్తివంతం అతిక్రూరమైన స్పానిష్ వలసవాదుల వుంటు, నిర్దాక్షిణ్యం క్రూరమైన అమెరికన్ నియోవలస దుర్భర జీవితంలో వుందని రెండవ అంతర్జాతీయ హవన్నా సమావేశం ప్రకటించింది. సోవియట్ నాయకులు మాస్కో ప్రకటనలోని "నేడు వలస విధానానికి అమెరికా మూలవిరాట్టు" అని ఆమోదించుతు "పురాతన వలస విధానం వేగంగా శిధిలమగుతున్న సిద్ధాంతాన్ని" నొక్కి చెప్పుతు మాజీవలసలలో వలస విధానం నూతన పద్ధతుల కొనసాగుటకు ప్రాణం పోస్తున్నారు. నూతన రక్తాన్ని ఎక్కిస్తున్నారు. అందుకు సోవియట్ కమ్యూనిస్టునాయకులు "జాతీయ విముక్తి వుద్యమం ఆర్థిక కర్తవ్యాలు పునాదిగా నూతనదశలోనికి ప్రవేశించిందని" మరో సిద్ధాంతాన్ని కూడ రూపొందించారు. "గతంలో పోరాటం రాజకీయరంగంలో ప్రధానంగాను నేడు ఆర్థిక సమస్యలు కేంద్ర కర్తవ్యంగా విప్లవోద్యమాభివృద్ధిలో "కొలికపూస" (లింకు)గా అయిందనే వాదన తెస్తున్నారు.

జాతీయ విముక్తి ఉద్యమం. "నూతనదశలో ప్రవేశించుట వాస్తవం, కాని అది సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చెప్పు "నూతనదశ" కాదు. ఆసియ, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజల రాజకీయ చైతన్యం అత్యున్నంతంగా పెరిగి విప్లవోద్యమాలు వుప్పొంగి తీవ్రతను సంతరించుకొన్న "నూతనదశ" పోరాటం అతితీవ్రత్వంగా జరుగుచున్నది. పోరాటం రాజకీయ పోరాటంగానే కేంద్రీకరించబడి సామ్రాజ్యవాదులు నేరుగాకాని, పరోక్షంగాకాని సాయుధంగా అణచివేయ ప్రయత్నించినపుడు తప్పనిసరిగా సాయుధ పోరాటంగానే అభివృద్ధి చెందుతుంది. నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల ఆర్థిక స్వాతంత్ర్యాభివృద్ధి అవసరమేకాని యీ కర్తవ్యాన్ని సామ్రాజ్యవాదులు వారితొత్తుల వ్యతిరేక పోరాటనుండి వేరుచేయరాదు.

"వలసవాదం అంతమైంది" అనే సిద్ధాంతంతో పాటు" నూతన దశ" అని సోవియట్ పార్టీ చెప్పుట, ప్రపంచంలో నియోవలసవాదులరూపంలో అమెరికన్ సామ్రాజ్యవాదం చేయుదోపిడికి తెరవేయుటయేగాక వలసవిధాన వ్యతిరేక పోరాటాలకు వెన్నుపోటు అగుతుంది. వారి సిద్ధాంతం ప్రకారం వలసవాదం అదృశ్యమై

తున్నది, జాతీయోద్యమాల కేంద్ర కర్తవ్యం ఆర్థికాభివృద్ధి. సామ్రాజ్యవాద పాత, కొత్తవలసవాదంపై వారి తొత్తులుపై పోరాటం యే మాత్రం అవసరంలేదు. ఇది వారి సిద్ధాంత నిర్ధారణ

సోవియట్ కమ్యూనిస్టు యుద్ధ వ్యతిరేకత "ఒక చిన్న అగ్ని కణం ప్రపంచ యుద్ధానికి కారణమగుతుందనే" సిద్ధాంతంపై ఆధారపడి "ప్రపంచ యుద్ధం అణు యుద్ధమై మానవజాతి నాశనమౌతుంది" అనే ప్రాతిపదికపై లెనిన్ "న్యాయ, అన్యాయ యుద్ధాల సిద్ధాంతాల తేడాను మాడక, "స్థానిక యుద్ధాలు అతి ప్రమాదకర మైనవని "కృశ్చేవ్ "మేము అట్టి చిన్న అగ్నికణాలను యుద్ధజ్వాలలు రేపకుండా, ఆర్పి వేస్తాము" అని చాటి చెప్పాడు. న్యాయమైన వలసప్రజల స్వాతంత్ర్యపోరాటాలను బలపరచాలనే లెనినిస్టు అవగాహనకు దూరమయ్యాడు. అల్జీరియా ప్రజా విప్లవ పోరాటాలను, ఫ్రాన్స్ అంతర్గత విషయాలంటూ త్రోసిపుచ్చి, "మేము ఫ్రాన్సు బలహీనపడుటను కోరుకొనము, ఆదేశం యింకా గొప్పది కావాలి" అని వాంఛించాడు క్రుశ్చేవ్. సాంప్రదాయంగా జర్మనీ బలాన్ని సమతూకం చేయుటకు ఫ్రాన్సు బలపడునట్లు చేసినవారు ప్రభుత్వ విధానాలకు యిది భిన్నమైన విదేశాంగ విధానంకాదు. కాంగో విషయంలో సామ్రాజ్యవాదుల కుట్రలకు వ్యతిరేకంగా నిరవధికంగా అభ్యుదయకరశక్తులను బలపరచలేదు.

చైనా కమ్యూనిస్టు నాయకత్వం 14 జూన్ 1963 లేఖలో ఆసియా, ఆఫ్రికా లాటిన్ అమెరికాలోని విప్లవ పరిస్థితులు, జాతీయవిముక్తి ఉద్యమాలపాత్ర ప్రాముఖ్యత వివరించుటయేగాక యీ క్రింది సిద్ధాంత ప్రాతిపదికలను సూచించింది[2].

1) నేటి ప్రపంచంలో వివిధ వైరుధ్యాలు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలో కేంద్రీకరించబడ్డాయి. సామ్రాజ్యవాదంలోని అతి బలహీన ప్రాంతాలకు సామ్రాజ్యవాదాన్ని నేరుగా దాడికి గురిచేయు విప్లవకేంద్రాలు ఇవే.

ii) ఈ జాతీయ ప్రజాస్వామ్య విప్లవాలు, నేటి ప్రపంచ కార్మిక విప్లవంలో ముఖ్యభాగం.

iii) జాతీయ ప్రజాస్వామ్య విప్లవోద్యమం అంతర్జాతీయ సోషలిస్టు విప్లవోద్యమం రెండూ యీనాటి చారిత్రిక ప్రవాహాలు.

iv) ఈ ప్రాంతాలలోని సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవ పోరాటాలు సామ్రాజ్యవాద వలస విధానాల పునాదులను పెకలించి వేస్తున్నవి, యివే ప్రపంచ శాంతిపరిరక్షణకు బలోపేతమైన శక్తులు.

---

1. పెకింగ్ రేడియో కామెంటు నం. 4 అక్టోబరు 22, 1963 అపోలజిస్ట్స్ అఫ్ నియోకలొనియలిజం (ఆంగ్లంలో) పె. 6-10
2. .... .... అదే........పే. 14

v) ప్రపంచప్రజాసామాన్యంలో అత్యధికుల యీ ప్రజావిప్లవ పోరాటాల ఫలితాలపై అంతర్జాతీయ కార్మికవర్గ విప్లవ ప్రయోజనాలు చాలవరకు ఆధారపడి వుంటాయి.

vi) అంచేత, యీ ప్రాంతాల సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవ పోరాటాల ప్రాముఖ్యత ప్రపంచ కార్మికవర్గ విప్లవ ప్రాధాన్యతను కలిగివుంది.

ఇవి మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత నిర్ధారణలు, శాస్త్రీయ విశ్లేషణ ఫలితాలు, యీ కాలపు వాస్తవాలు. ఈ ప్రాంతాలలో ప్రపంచ వైరుధ్యాలు కేంద్రీకరించబడినందున, జాతీయ విముక్తి విప్లవ తుఫాన్లకు కేంద్రాలైనవి.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, చైనా పార్టీ నాయకత్వ విమర్శనల ఖండించుతు, సమర్థించుకొంటూ, తీవ్ర ప్రతి విమర్శనాపత్రాలను పెక్కింటిని ప్రకటించింది. స్థూలంగా తెలుసుకొందాము.

"ప్రపంచ విముక్తి వుద్యమం అభివృద్ధి నేడు ముఖ్య దశలో వుంది. సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధి బలం, సోషలిజానికి అనుకూలంగా అంతర్జాతీయ బలాల తూకంలో వచ్చిన అభివృద్ధికర మార్పులు, కార్మికవర్గ విప్లవ పోరాటాల అభివృద్ధికి అనువగు పరిస్థితులు యేర్పడినవి. సామ్రాజ్యవాదంచే అణచివేయబడుతున్న వివిధ వర్గాల, జాతుల శాంతి స్వాతంత్ర్యం ప్రజాస్వామ్య సోషలిజపు ప్రయోజనాలకు అనుకూలవాతావరణ మేర్పడింది!

"సామ్రాజ్యవాద సంఘటనను బద్దలు చేసే ప్రపంచ విముక్తిక్రమంలో జాతీయ విముక్తి వుద్యమం వొక భాగం. దీనినే ప్రపంచసోషలిస్టు వ్యవస్థ సిద్ధాంతం వివరిస్తుంది. ఆసియా ఆఫ్రికా లాటెన్ అమెరికా ప్రజల జాతీయ విముక్తి వుద్యమాలు మాత్రమే మహత్తర విప్లవ అవకాశాలను చూపెడుతున్నవి. వలస విధాన నిర్మూలనాన్ని, స్వాతంత్ర్య సంపాదన విముక్తి పోరాటాలను బలపరచుట సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అంతర్జాతీయ కర్తవ్యంగా నెంచుకుంది. సోవియట్ యూనియన్ ధర్మ యుద్ధాలను బలపరచింది, బలపరుస్తుంది.

చైనా కమ్యూనిస్టు పార్టీ "లెనినిజం వర్థిల్లాలి" అనే వ్యాసాలను 1960 వసంత కాలంలో ప్రకటించుటతో సిద్ధాంత వివాదం ప్రారంభమైంది. ఆ వ్యాసాలు ముఖ్యంగా 1957 మాసో-ప్రకటన సారాన్ని వ్యతిరేకించాయి. ఫిబ్రవరి 1963 జెన్‌మిన్‌జీపావో పత్రిక "భేదాభిప్రాయాలకు కారణమేమిటి?" అన్న వ్యాసంలో చైనా నాయకత్వం భేదాభిప్రాయాలకు భారత-చైనా సరిహద్దు వివాదంలో చైనా వైఖరిని సోషలిస్టు దేశాలు, కమ్యూనిస్టుపార్టీలు బలపరచనందున ప్రారంభమైనవని నిర్మొహమాటంగా చెప్పారు. సోవియట్‌యూనియన్ సోషలిస్టు దేశాలు బలపరచనందున చైనా నాయకత్వం సిద్ధాంత పోరాటాన్ని, ఆయుధంగా చేబట్టింది ప్రారంభిం

చింది. కమ్యూనిస్టు ఉద్యమంలోని క్లిష్ట పరిస్థితులకు అదే బాధ్యత వహించవలసి వుంటుంది.

చైనా కమ్యూనిస్టుపార్టీ 14 జూన్ 1963 లేఖలో మాస్కో 1960 ప్రకటన లోని కొన్ని సిద్ధాంత ప్రతిపాదనలను చైనా అధ్యయనాలుగ వ్రాసి జాతీయ విముక్తి ఉద్యమాల అభివృద్ధిని తప్పుడుగ చిత్రించి, ముఖ్యాంశాలను గుర్తించలేదు. "అక్టోబరు సోషలిస్టు విప్లవంతో తూర్పు వలస ప్రజలల్లో జాగృతికలిగి ప్రపంచ విప్లవోద్యమం ప్రధాన స్రవంతిలోనికి వచ్చారు." రెండవ ప్రపంచ యుద్ధంలో సోవియట్ విజయం తూర్పుయూరపు ఆసియాలలో అనేక జనతా ప్రజాస్వామ్య దేశాల ఆవిర్భావానికి, చైనా సోషలిస్టు విప్లవ విజయం ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ యేర్పాటు క్రమాన్ని త్వరితం చేయుట "సామ్రాజ్యవాద వలసలు ఆధారిత దేశాల పోరాటాలలో ప్రపంచ సోషలిస్టు శక్తుల తోట్పాటు నిర్ణయాత్మకపాత్ర వహించింది. అంతర్జాతీయ శ్రామికోద్యమం జాతీయ విముక్తి ఉద్యమాలను గణనీయంగా బల పరచుట 1960 ప్రకటనలోని సమస్యల సంబంధించిన ముఖ్యసిద్ధాంత ప్రతిపాదనలు. వీటినుంచి సోషలిస్టు విజయం ప్రపంచ విప్లవంలో నిర్ణయాత్మకపాత్ర అంతర్జాతీయ కార్మికోద్యమం ప్రపంచ సోషలిస్టు వ్యవస్థల అన్నిటి ఫలితంగా వలసదాస్య విముక్తి ఉద్యమంలో నూతనదశ వుద్భవించింది[1].

చైనా కమ్యూనిస్టుపార్టీ జూన్ 14 లేఖలో సామ్రాజ్యవాదం అంతర్గత అభి వృద్ధి నిరోధక వర్గాలు మార్క్సిస్టు లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీలలోని వర్గాలు కొన్ని జాతీయ విముక్తి ఉద్యమాలను వ్యతిరేకిస్తున్నవి అనుట నింద తప్పమరొకటి కాదు. ఈ అసంగతి నిందా ప్రచార కమ్యూనిస్టు ఉద్యమ సోషలిస్టు దేశాలనుజాతీయ విముక్తి ఉద్యమాల దృషిలో అప్రదిష్టపాలు చేయుటకు ఉద్దేశించబడింది. సోషలిస్టు దేశాలు సోషలిస్టువిప్లవాల జాతీయ విముక్తి ఉద్యమాల మధ్యగల అఖండ అవినావ భావ సంబంధాన్నిలెనిన్ సద్ధాతం స్పష్టంచేస్తున్నది. సోషలిస్టు విప్లవాల నిర్ణయాత్మక పాత్రను వివరించుచున్నది.

చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖ లెనిన్ నినాదాన్ని సరిగానే పునరుద్ఘాటించు చున్నది. "అన్నిదేశాల కార్మికవర్గం అణచివేయబడుతున్న ప్రజ ఐక్యమవ్వాలి." అన్న నినాదం సరిగానే యివ్వబడింది విముక్తి ఉద్యమ నాయకత్వం చేబట్టాలి. చైనా నాయకత్వం చెప్పినట్లు జాతీయవిముక్తి ఉద్యమం సోషలిస్టుదేశాలు అంతర్జాతీయ కార్మికవర్గంనుండి వేరు చేయరాదు అట్లు చేసిన నినాదానికి విరుద్ధంగా చేసినట్లు అగుతుంది.

---

1. ఎడిటోరియల్, కమ్యూనిస్టు నం. 11. 1963 (ఆంగ్లంలో) సోవియట్‌లాండ్ బుక్ లెట్స్ న్యూఢిల్లీ ప్రచురణ పే. 25-26.

జాతీయ విముక్తి విప్లవోద్యమం లేవనెత్తిన సమస్యలన్నిటికి మార్క్సిజం లెనినిజం పరిష్కారాలు చూపిస్తున్నవి. విదేశగుత్తాధిపత్యాన్ని నిర్మూలించుట, వ్యవసాయ సంస్కరణలు, జాతీయ పారిశ్రామికాభివృద్ధి తదితర ఆర్థిక సామాజికాభివృద్ధి సంస్కరణలు సామాజిక ప్రజాస్వామ్య జీవనం-తక్షణం చేపట్టవలసిన కర్తవ్యాలు.

నేటిజాతీయ విముక్తి ఉద్యమ సమస్యలన్నిటిని చైనా కమ్యూనిస్టుపార్టీ "పరిగణించలేదు" లేఖ "జాతీయ విముక్తి పోరాటాల అభివృద్ధిని యేకపక్షంగా పరిశీలించింది. అన్నిటిని వొకేగాటన చిత్రించి పొరపాటుగ సాయుధ పోరాటదృష్ట్యా చూస్తుంది." ఉద్యమాలు వివిధ దేశాల చారిత్రిక సామాజిక దశలలో పెట్టుబడిదారి విధానం అభివృద్ధిచెంది కార్మికవర్గం బలమైన కమ్యూనిస్టుపార్టీలుగలవి కొన్ని వ్యూహలు అర్థవ్యూహలు దశలోకార్మిక వర్గం కమ్యూనిస్టుపార్టీలు లేనివి నూతనంగా జాతీయ స్వాతంత్ర్యాన్ని పొందిన అనేక దేశాలు నూతన సంక్లిష్ట కర్తవ్యాలను ఎదుర్కొనవలసి వచ్చింది. మార్క్సిజం-లెనినిజం రాజకీయ స్వాతంత్ర్య సంపాదన విముక్తి ఉద్యమాల ప్రాధమిక కర్తవ్యంగా నెంచుకుంది. మాస్కో 1960 సమావేశం నూతన స్వాతంత్ర్య దేశాల అభివృద్ధి పెట్టుబడిదారేతర మార్గాలలో సాధ్యమని నిర్ధారించింది

చైనా కమ్యూనిస్టుల లేఖ నూతన స్వాతంత్ర్య దేశాలలో జనతా ప్రజాస్వామ్య స్థాపన తప్ప మరోమార్గం లేదంటూ కార్మికవర్గ నియంతృత్వ మరో రూపంగా జనతా ప్రజాస్వామ్యాన్ని యేర్పాటు చేయుట అంటే కొన్నిదశలను దాటవేయుటకు ఐక్యసంఘటనను సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని బలహీన పరుస్తుంది. కార్మికవర్గం అగ్రగామిదళం కమ్యూనిస్టుపార్టీ లేని దేశాలలో కార్మికవర్గ నియంతృత్వం దాని నాయకత్వం వహించేదెవరు. కార్మికవర్గమే లేనపుడు అది కార్మికవర్గ నియంతృత్వం ఎలా అగుతుంది. లేఖ రచయితలకే ఈ విషయం తెలియాలి.[1] ఈ విధంగా జాతీయ విముక్తి ఉద్యమాల సైద్ధాంతిక వ్యూహ రచన గుత్తాధికారాన్ని తామే స్వీకరించి చైనా మిత్రులు నేటి ఉద్యమస్థాయి నదవగా నాన సమస్యల స్పష్టత అభివృద్ధి అవకాశాలను ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ విజయాల దృష్టిలో చూడజాలకపోయారు అని విమర్శించింది.

"మార్క్సిస్టు-లెనినిస్టులు నిరంకుశ వలస సామ్రాజ్యవాద ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ఎల్లప్పుడూ సాయుధ తిరుగుబాటులను ప్రోత్సహించారు బలపరచారు."

1. ఎడిటోరియల్ కమ్యూనిస్టు నం 11;1963. (ఆంగ్లంలో) సోషియలిస్ట్ లాండ్ బుక్ లెట్స్ న్యూఢిల్లీ పే 29.

ఆ విధమైన ఎత్తుగడలు నేడు అనేక దేశాలలో జాతీయ ప్రభుత్వాలు ఏర్పడి సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని చేబట్టినపుడు అపాయకరమైనది. అల్జీరియా, ఘనా, మాలి తదితర దేశాలు సాయుధ పోరాటం తక్షణ పోరాట కర్తవ్యంగా నెంచుట పూర్తి తప్పు అగుతుంది. ఇట్టి పరిస్థితులలో సాయుధ పోరాటమే సర్వోత్తమంగా నెంచుట సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలను తప్పుడు మార్గం పట్టించుట అగుతుందోనని సోవియట్ అవగాహన.

"చైనా కమ్యూనిస్టు నాయకత్వం జాతీయ విముక్తి వుద్యమాన్ని తమప్రయోజనాలకు వినియోగించు ఆశలను పెంచుకొన్నారు" అని సుస్లోవ్ తీవ్ర విమర్శనను కొనసాగించారు[1].

ప్రపంచశాంతి సమితి, స్టాక్‌హోం సమావేశంలో చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధి లీనింగ్ఇ "అణచివేయబడుతున్న జాతులకు సంపూర్ణ స్వాతంత్ర్యానికి సాయుధ పోరాట పంధాయే మార్గం" అని స్పష్టం చేసాడు, చైనా నాయకుల, అతివాద సాయుధపోరాట నినాదం ప్రతిచోటా యిచ్చుట, కమ్యూనిస్టు ప్రజాస్వామ్య శక్తులను నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలను "సాహసిక వాదం" వైపు త్రోయుటతప్ప మరొకటి కాదు. గ్రుడ్డిగా అనుభవం, వాస్తవ పరిస్థితులను చూడక అట్టి పంధా ననుసరించుట శామ ప్రజలనుండి వేరగుట అనవసర త్యాగాలు చేయుట వారి సామాజికాభివృద్ధికి తోడ్పడకపోగా,దానికి అడ్డంకివి కలుగజేయుటయే అగుతుందని సుస్లోవ్ పేర్కొన్నారు[2].

"జూలై 1963 మాస్కో ద్వైపాక్షిక సమావేశంలో టెంగ్ సియోపింగ్ చైనా కమ్యూనిస్టు పార్టీ జనరలు కార్యదర్శి, పెట్టుబడిదారేతర పంధా సిద్ధాంతంపై మాట్లాడుతూ, "అర్ధంలేని మాట" అని కమ్యూనిస్టులందరికి అది లెనినిన్ సిద్ధాంతమని, గతవలనల అనుభవంలోనిదని ఎందరికో తెలిసినది అన్నారు"[3].

"ఆసియా, ఆఫ్రికా,లాటిన్ అమెరికా ప్రజల ప్రయోజనాలు తమకుచాలప్రియమైనవని, జాతీయ విముక్తి వుద్యమాల అభివృద్ధి వారికి పట్టిందని చైనా నాయకత్వం చెప్పుతుంది. వాస్తవాలు అవి అబద్ధాలని స్పష్టం చేస్తాయి. అవితదితరకారణాల వలన అవి, రోజురోజుకు స్పష్టమగుతున్నది. తన గుత్త నాయకత్వ ప్రణాళికలను అమలు చేయు సాధనంగా జాతీయ విముక్తి పోరాటాలపై తన నాయకత్వస్థాపనకై చేయు

---

1. సుస్లోవ్, యం.ఏ (1964) ఉపన్యాసం సి. పి. యస్. యు. కేంద్ర సమితి ప్లీనరీ సమావేశం 14 ఫిబ్రవరి 1964 సోవియట్ లాండ్ బుక్ లెట్సు. న్యూఢిల్లీ. (ఆంగ్లంలో) పే. 32
2. .... .... అదే పే. 33.
3. .... .... అదే పే. 34

ప్రయత్నమని స్పష్టం." అక్టోబరు 22, 1963 "జెన్‌మిన్ జిపావో" పత్రిక వ్యాసం లోని వాదనలు యింతకు ముందు చెప్పినట్లు యీ విషయంలో అక్షరాల అలాగే వున్నవి. ఆ పేపరు "నిజమైన మార్క్సిస్టులు" పెకింగులోనే వున్నారని రుజువు చేయ ప్రయత్నిస్తున్నది. జాతీయ విముక్తి వుద్యమం కీలకాంశాలను వారినుండే పొందాలని స్పష్టం చేస్తున్నది. ప్రతివిషయంలో ఆసియా, ఆఫ్రికా లాటిన్ అమెరికా ప్రజలు పెంకింగ్‌ను అనుసరించాలని చైనా నాయకత్వం పిలుపునిచ్చింది. యీ వ్యాసం జాతీయవిముక్తి వుద్యమాలలో చైనా కమ్యూనిస్టు నాయకత్వం వుండాలని వారి ప్రత్యేక ధ్యేయాలను అనుసరించి వుండాలనేవారి కోరికను సుస్పష్టం చేసింది[1].

"అదే బహుశా ప్రపంచసోషలిస్టు వుద్యమం నుండి అంతర్జాతీయకార్మిక వర్గాన్నుండి జాతీయ వుద్యమాలను వేరుచేయాలనే చైనా నాయకుల విధానాన్ని వాస్తవ ధ్యేయాన్ని గురించి మరేయితర దానికన్నా యెక్కువ వెలుగును ప్రసరిస్తుంది".[2]

ఆఫ్రో-ఏసియన్ మోషి ఐక్యతా సమావేశంలో చైనా ప్రతినిధి వర్గనాయకుడు లియోనింగ్‌ఇ, మాప్రతినిధులతో "ఆసియా ఆఫ్రికా సమస్యలలో తూర్పు యూరపు దేశాలు జోక్యం కలుగజేసుకొనరాదు. మీ రాక మాకు విచారాన్ని కలుగజేస్తున్నది" అన్నారు. సమావేశంలో చైనా ప్రతినిధులు యితర ప్రతినిధులకు రష్యనులు, జెక్‌లు, పోలులు, తెల్లజాతివారు, కాన వారిని నమ్మలేము" వారు "తెల్లజాతి వారైన అమెరికనులతో ఎప్పుడూ రాజీపడగలరు" ఆసియా, ఆఫ్రికా, ప్రజలు వారి ప్రయోజనాలు వారికున్నవి" అందువలన వారు వారి ప్రత్యేక సంస్థలను యేర్పాటు చేసుకొనాలి" అని సూచించారు.

"చివరకు చైనా నాయకులు వాస్తవంగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రత్యేక సంస్థలను, ట్రేడుయూనియన్‌లు, వార్తావిలేఖరుల రచయితల, విద్యార్థుల, ఆటలు సంస్థలను యేర్పాటు చేయ ప్రారంభించారు. ప్రపంచట్రేడు యూనియన్ ఫెడరేషన్ వగైరా పోటీ సంస్థలు స్థాపించబడినవి. అదే కాలంలో "పడమటి పవనంపై తూర్పు పవనం ఆధిక్యతను కలిగివుంది." అనే నినాదాన్నిచ్చి మరోమాటలలో "చైనా నాయకత్వం, నాయకత్వవాంఛలను, రాజకీయ సిద్ధాంతంగా వెలిబుచ్చింది[3]" అని సుస్లోవ్ వొక్కమాటలో చెప్పారు.

---

1. సుస్లోవ్ యం.ఏ (1964) ఉపన్యాసం. సి. పి. యస్. యు. కేంద్రసమితి, ప్లీనరీ సమావేశం 14 ఫిబ్రవరి 1964 సోవియట్ లాండ్ బుక్ లెట్స్ న్యూఢిల్లీ (ఆంగ్లంలో) పే. 34
2. అదే .... .... పే. 35-36.
3. .... .... అదే 34

ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ అగ్రనాయకులైన సోవియట్ యూనియన్ చైనా రిపబ్లిక్ల కమ్యూనిస్టుపార్టీల జాతీయ విముక్తి వుద్యమాలపై వారి వైఖరులను వారి వాగ్వివాదాలను చూచాము. ఇప్పుడు భారత కమ్యూనిస్టు వుద్యమంలోని వివిధవర్గాలు స్పందించిన తీరును చూద్దాము.

"సోషలిస్టుదేశాలు i) సామ్రాజ్యవాద దురాక్రమణలు, ముఖ్యంగా ప్రపంచ యుద్ధానికి దారితీసే సంఘర్షణలను నివారించుట, ii) జాతీయ విముక్తి వుద్యమాలను ఆసియా, ఆఫ్రికా లాటిన్ అమెరికాలలోని నూతనంగా స్వాతంత్ర్యం పొందినదేశాల సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలను అన్నివిధానాల బలపరచుట అనే రెండు కర్తవ్యాలను చైనా కూడ ఆమోదించుచున్నదని మనం ఆమోదించాము.

అంచేత, "సోషలిస్టుదేశం మొదట కేంద్రీకరించవలసినది, సామ్రాజవాద దురాక్రమణలను విరోధించుటకు. శాంతియుత సహజీవనాన్ని ప్రోత్సహించి. అభివృద్ధి చేసి ప్రపంచ యుద్ధప్రమాదాన్ని నివారించి ఆ విధంగా జాతీయ విముక్తి పోరాటాలకు సానుకూల పరిస్థితులను కల్పించాలని[1]" అధికారి అన్నారు.

"ఇంకా శాంతియుత సహజీవనాన్ని ప్రోత్సహించుట, సామ్రాజ్యవాదం సోషలిస్టు దేశాల ప్రధాన విదేశాంగ పంధాగ తప్పనిసరిగా చేయాలి. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సాధారణ పంధా దీనిని అనుసరించే వుంది, మాస్కో ప్రకటనలో స్పష్టంగా ఉదహరించబడివుంది" అని అధికారి" చైనా పార్టీ యీ వాదాన్ని, సాధారణ పంధాని ఆమోదించదు."అందుకేజూన్ 14 లేఖలో"ప్రత్యామ్నాయ సాధారణ పంధానురూపొందించింది"అనిఅన్నారు."ప్రత్యామ్నాయపంధానురూపొందించుట అంటేఅర్ధం" "పరిస్థితులలోని నూతనత్వాన్ని అదికలుగ జేసిననూతన అవకాశాలను" చూడ నిరాకరించుటగా వ్యాఖ్యానించారు, "ఇది పిడివాదమని" సోవియట్ యూనియన్ ప్రపంచకార్మికోద్యమము శాంతియుత సహజీవనాన్ని పెంపొందించుతు, యుద్ధ ప్రమాదాన్ని నివారించుటకై చేయు ప్రయత్నాలను వ్యతిరేకించుట "సాహసిక వాదం" అగుతుందన్నారు. చైనా యీ సాహసికవాద పంధాను చేబట్టినందువలనే కరేబియన్ సంక్షోభంలో సోవియటు స్పందనలను ప్రధమంలో "లొంగుబాటుగా" చైనా పరస్పర విరుద్ధంగా అవాస్తవంగా, తప్పుగా వ్యాఖ్యానించిందని అధికారి విమర్శించారు[2].

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి అక్టోబరు 1963లో అంతర్జాతీయ నూతన పరిస్థితిని, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో జరుగుతున్న బృహద్వి

---

1. అధికారి జి. (1964) కమ్యూనిస్టుపార్టీ అండ్ ఇండియన్ పార్ ఫర్ నేషనల్ జనరేషన్ అండ్ సోషలిజం (ఆంగ్లంలో) పే. 38.
2. .... .... అదే. పే. 39-40.

వాదంపై భూపేష్‌గుప్తా ప్రతిపాదించిన చిత్తు తీర్మానాన్ని చర్చించి చైనా పార్టీ జూన్ 14 లేఖలో లేవనెత్తిన వివిధ అంశాలను కరేబియన్ సమస్యపై వారి వైఖరిని తిరస్కరించి, తీర్మానాన్ని ఆమోదించింది. పార్టీలోని అతివాదవర్గం తీర్మానాన్ని ఆమోదించక రెండుపేజీల సంక్షిప్త ప్రకటనను రష్యా-చైనా కమ్యూనిస్టు పార్టీలు ద్వైపాక్షిక సంభాషణలు జరిపి, ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల సమావేశానికి సన్నాహాలు జరుపుతు, అభిప్రాయభేదాలను పరిష్కరించుకోవాలని ప్రతిపాదించారు. కేంద్ర సమితి యీ ప్రతిపాదనను తిరస్కరించి, భూపేష్ గుప్తా ప్రతిపాదించిన చిత్తు తీర్మానాన్ని ఆమోదించింది[1].

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని సిద్ధాంతవివాదంపై భారతకమ్యూనిస్టు పార్టీ కేంద్రసమితి ఆమోదించిన నివేదిక, "విడివాదుల విచ్ఛిన్నకర చర్యలకు వ్యతిరేకంగా సాహసికవాదానికి, అవకాశవాదానికి వ్యతిరేకంగా" పార్టీలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఐక్యత"లో పార్టీ వైఖరిని వివరించింది. అది 125 పేజీల సుదీర్ఘ నివేదిక, ముగింపులో సంగ్రహంగా యీ విధంగా చెప్పింది.

"వివాదాన్ని (సైద్ధాంతిక) సంఘర్షణ సారాంశపు మొత్తాన్ని సంగ్రహంగా యిలా చెప్పుకొన వచ్చును.

"మాస్కో-ప్రకటన సోదరపార్టీలు, శాంతి సోషలిజం, జాతీయ స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యలకై నూతనయుగం యిచ్చిన దృక్పధాన్ని అవకాశాలను వినియోగించుటకు తమ శక్తినంతా ఒడ్డి, సామాన్యమానవుడు కనీస వాస్తవికాంశాలతో మానవజాతి పురోగమనానికి పని చేస్తుంది. చారిత్రాత్మక యీ కర్తవ్యనిర్వహణలో కార్మికవర్గం, సాధ్యమైన అన్ని మార్గాలలో సహకారాన్నిపొందుటకై ప్రయత్నిస్తారు. వారు ప్రపంచ కమ్యూనిస్టు, ప్రజాస్వామ్య శాంతి జాతీయ స్వాతంత్ర్య ఉద్యమంలోని ప్రతివొక్క శక్తిని ఐక్యపరచుట అది ఎంత చిన్నదైనా, ఊగిసలాట గలదైనా, మానవజాతి ప్రయోజనం కొరకు చేస్తారు

"దీనికి విరుద్ధంగా చైనా కమ్యూనిస్టు నాయకత్వం ప్రపంచయుద్ధప్రమాదాన్ని, పెట్టుబడిదారి దేశాలలో అంతర్యుద్ధాలను, వలస పరాధీన దేశాలలో సాయుధ పోరాటాల దృక్పధాన్ని తప్పితే మానవజాతికి మార్గదర్శకంకాలేకపోయింది. ఈ ఆత్మహత్యా ధ్యేయసాధన మార్గంలో ప్రపంచంలోని అన్ని సోషలిస్టు అభ్యుదయ కరశక్తుల ఐక్యతను విచ్ఛిన్నం చేస్తుంది. ఈ లక్ష్యసాధనకు అవకాశవాద, దురహంకార, అభూతాల లోతులకు దిగజారుతుంది.

"ప్రపంచపు అన్నిమూలలో ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం శాంతిప్రియు లందరి ముందు చైనా కమ్యూనిస్టు నాయకత్వం వుంచిన సమస్య యిదే[1].

భారత కమ్యూనిస్టు పార్టీలోని అతివాదవర్గం, సామ్రాజ్యవాదం, సోషలిస్టు శిబిరాల మధ్య గల వైరుధ్యమే ప్రధాన వైరుధ్యమని ఆమోదించుచు, సామ్రాజ్య వాదం అణచివేయబడుతున్న జాతులమధ్యగల వైరుధ్యం తీవ్రతరమై జాతీయ విముక్తి విప్లవాలమైందని, యీ వైరుధ్యం అన్ని యితర వైరుధ్యాలను ప్రభావితం చేస్తున్నదని, మనకాలంలో అన్ని వైరుధ్యాలకు కేంద్రమైందని, ప్రపంచచారిత్రికాభి వృద్ధి యీ దశలో యీ వైరుధ్యఫలితంపై ఆధారపడివుందని[2] వివరించింది.

"మనకాలంలో జాతీయ విముక్తి విప్లవాలు ప్రపంచ సోషలిస్టు విప్లవంలో భాగమయ్యాయి. జాతీయ విముక్తి పోరాటాలు నేడు ఆ ప్రాంతాలలో సామ్రాజ్య వాద పాలన పునాదులను కదలించివేస్తున్నవి." ఈ విజయవంతమైన పురోగమనం పెట్టుబడిదారి దేశాలలో కార్మికవర్గ పోరాటాలను ప్రపంచ సోషలిస్టు విప్లవాభివృద్ధిని త్వరితం చేస్తున్నది. అంటే అంతర్జాతీయ కార్మికవర్గ విప్లవ విజయం వొకవిధంగా వీటిపై ఆధారపడి వుంది. ఈ జాతీయ విముక్తి పోరాటాలు ప్రాంతీయ ప్రాముఖ్యత నేగాక అంతర్జాతీయ సోషలిస్టు విప్లవ ప్రాముఖ్యతను కాంతి ప్రాముఖ్యతగలవి.

"నూతన సంస్కరణ వాదుల వైరుధ్యాల విశ్లేషణ వారు 1) సోషలిజం - సామ్రాజ్యవాదాలు ఒకే ఒక వైరుధ్యాన్ని గుర్తించుట 2) వైరుధ్యాలు గ్రుడ్డిగా శాంతియుత మార్గాలలో పరిష్కరించవచ్చుటనుట 3) నూతన యుగంలో సామ్రాజ్య వాదుల అంతర్గత వైరుధ్యాలు పరిష్కరింపబడుటగాని, రూపుమాపబడుటగాని జరుగు తుందనుట 4) సోషలిజం సామ్రాజ్యవాదం మధ్యగల వైరుధ్యం శాంతియుత ఆర్థిక పోటీద్వారా పరిష్కరింపబడుననే తప్పులనుచేయునట్లుచేసిందని తీవ్రంగా విమర్శించారు.

---

1. ఐడియలాజికల్ రిజల్యూషన్ (1968) భారతకమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) కేంద్ర సమితి. బర్ద్వాన్ ప్లీనంలో ఏప్రిల్ 1968లో ఆమోదించబడినది. (ఆం గ్లంలో) పే. 13.

2. .... .... అదే. పే. 14.

## VII

# వ్యక్తి పూజా విధాన సమస్య

స్టాలిన్ వ్యక్తి పూజా విధాన ఫలితాలకు వ్యతిరేకంగా జరిగిన సిద్ధాంత పోరాట సమస్యపై చైనాపార్టీ సోవియట్‌పార్టీల మధ్య తదితర కమ్యూనిస్టు మార్క్సిస్టు లెనినిస్టు పార్టీలమధ్య తీవ్ర భేదాభిప్రాయాలున్నవి.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి సభ్యులకు బహిరంగ లేఖలో మా పార్టీ శ్రామిక ప్రజాసామాన్య శక్తులపైగల యీ మోయరాని బరువును (వ్యక్తి పూజా విధానపు విషమ ఫలితాల బరువు) దించివేయుటకు యీ పని (20 కాంగ్రెసులో, 1957, 1960 ప్రపంచ కమ్యూనిస్టు సమావేశాలలో స్టాలిన్‌పై వ్యక్తి పూజా విధాన తీవ్ర విమర్శనను చేసి ఖండించుట) చేసిందని అందరకు తెలును ఆ విధంగా సోవియట్ సామాజికాభివృద్ధిని వేగిర పరచింది. సోషలిస్టు భావజాలాన్ని పరిశుద్ధం చేయుటకు పార్టీ ఆ పనిచేసింది. లెనిన్ వారసత్వాన్ని వ్యక్తి అధికారంతో అనాలోచితంగా భ్రష్టు పట్టించకుండా వుండగలందులకు చేసింది. అట్టి విషాదకర ఘటనలు పునరావృతం కాకుండా సోషలిజం కొరకు పోరాడేవారు మన అనుభవం నుండి పాఠాలు నేర్చుకొనగలందులకు చేసింది."

"కమ్యూనిస్టు వుద్యమం సరిగ అర్థం చేసుకొని మార్క్సిజం-లెనినిజంల వ్యతిరేకము, ప్రమాదకరము అయిన వ్యక్తిపూజా వ్యతిరేక పోరాటాన్ని బలపర చింది. ఒకప్పుడు చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంకూడ బలపరచింది. వారు సి.పి.యస్.యు. 20వ పార్టీ కాంగ్రెసుయొక్క అంతర్జాతీయ ప్రాముఖ్యతను విశే షంగా ప్రస్తుతించారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ 8వ కాంగ్రెసు సెప్టెంబరు 1956లో జరిగినపుడు "సోవియట్ కామ్రేడ్స్ సోవియట్ ప్రజలు లెనిన్ సూచనలను ఆచరణలో పెట్టారు కొద్దికాలంలో వారు ఉన్నత విజయాన్ని సాధించారు. మొదటి సి.పి.యస్.యు. 20వ కాంగ్రెసు అనేక రాజకీయ నిర్ధారణలు సరిగాచేసి పార్టీలోని లోపాలను విర సించింది. భవిష్యత్తులో వారి కార్యక్రమం మహోన్నత అభివృద్ధిని సాధిస్తుందని విశ్వాసంతో చెప్పవచ్చును[1]." అని మావోసియాంగ్ వ్యక్తి పూజా విధాన విషమ ఫలి తాలపై వ్యాఖ్యానించారు.

---

1. సి.పి.యస్.యు. కేంద్రసమితి సోవియట్‌యూనియన్‌పార్టీ కమిటీలకు సభ్యులకూ బహిరంగలేఖ. జులై 1963 (ఆంగ్లంలో) సోయట్‌లాండ్ బుక్‌లెట్స్ న్యూఢిల్లీ- పే 23-24 ఉదహరింపు.

చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి నివేదికను లీషౌచీ కాంగ్రెసులో ప్రవేశ పెట్టుతు పై అంచెనాను మరింత వివరించాడు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20వ కాంగ్రెసు యీ సంవత్సరం ఫిబ్రవరిలో జరిగినది. ప్రపంచ విస్తృతి ప్రాముఖ్యత గలది. మహోన్నత 6వ పంచవర్ష ప్రణాళికను ఆమోదించుట సోషలిజపు అభివృద్ధికి అనేక నిర్ణయాలను చేయుటయేగాక పార్టీని సంక్షోభంలోనికి దించిన వ్యక్తి పూజా విధానాన్ని నిరసించింది. శాంతియుత సహజీవనానికి ప్రతిపాదనలు చేసి, అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గించుటకు గొప్పయత్నం చేసింది.[1]" అని అన్నారు. అదేకాంగ్రెసులో నిర్మాణ నివేదికలో టెంగ్‌హిసియాపింగ్ అన్నిముఖ్యసమస్యలు పై వ్యక్తిగతంగా కాక తగిన స్థాయిలో సమిష్టి నిర్ణయాలు చేయుటనే లెనినిజం కోరుతుంది. సమిష్టి నాయకత్వ సూత్రాన్ని ఎట్టి మినహాయింపులు లేకుండా అమలు చేయుట వ్యక్తి పూజా వ్యతిరేక పోరాటంలో అత్యంత ప్రాముఖ్యతగల అంశము. ఈ వివరణ సి.పి.యస్.యు.పైనేగాక ప్రపంచ అన్ని దేశాల కమ్యూనిస్టుపార్టీలపై అమోఘమైన ప్రభావాన్ని కలిగించిందని వ్యాఖ్యానించారు.

జెన్‌మిన్ జిపావో సంపాదకీయంలో కార్మిక నియంతృత్వంపై చారిత్రికానుభవాలపై మరొకసారి అన్న సుదీర్ఘవ్యాసంలో 20వ పార్టీ కాంగ్రెసులో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ స్టాలిన్ పొరపాటులను వ్యక్తిపూజా విధానాన్ని వెల్లడించి ఖండించుటలో ధైర్యసాహసాలను ప్రదర్శించిందని ప్రశంసించింది.

ఈ ప్రశంశలను జూన్ 14 లేఖ లో చైనా కమ్యూనిస్టుపార్టీకేంద్ర సమితి వ్యాఖ్యలను నిష్పక్షపాతంగా పరిశీలించిన సోవియట్ 20వ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసును అంచెనా వేయుటలో పూర్తిగ 180 డిగ్రీలు వెనుతిరిగిపోవుట ప్రత్యక్షమగుతుంది[2].

చైనా కమ్యూనిస్టుపార్టీ తదనంతరకాలంలో "వ్యక్తిపూజా విధానాన్ని స్టాలిన్ తప్పుడు విధానాలను వ్యాప్తి చేయుపాత్ర తమంతట తాముగాచేబట్టింది. ఇతర పార్టీల పైన ఆ విధానాన్ని సిద్ధాంతాన్ని నైతిక సూత్రాలను నాయకత్వ పద్ధతులను రూపాలను ముఖ్యంగా స్టాలిన్‌కాలంలో పెంపొందిన వాటిని ప్రతిష్ఠించ ప్రయత్నించుచున్నారు. ఇది యెట్టి గౌరవాన్ని ప్రతిష్ఠను తెచ్చిపెట్టదని మనం స్పష్టంచేయాలి. మార్క్సిస్టు-లెనినిస్టులను అభ్యుదయవాదులను వ్యక్తిపూజా విధానాన్ని రక్షించే మార్గాన్ని చేబట్టమని వొత్తిడిచేసి విజయాన్ని పొందలేరు.

---

1. సి.పి.యస్.యు. కేంద్రసమితి సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కమిటీలకు సభ్యులకు బహిరంగ లేఖ జూలై (ఆంగ్లంలో) సోవియట్‌లాండ్‌బుక్‌లెట్స్ న్యూఢిల్లీ, పే. 24.
2. అదే........పే. 23

వ్యక్తిపూజా విధానం ప్రపంచ కార్మికవర్గ విప్లవోద్యమంలో అత్యంత ప్రాముఖ్యతగల అంశాలలో ఒకటిగా చైనా కామ్రేడ్స్‌కు తెలుసు. స్టాలిన్ కార్యక్రమాలను అంచెనా వేయుటకు మాత్రమే సంబంధించినదికాదు, నష్టదాయకమైన నాయకత్వ విధానాలను పద్ధతులను ముఖ్యంగా వ్యక్తి పూజా విధానంలో ప్రబలిన వాటిని రూపుమాపుటకు సంబంధించినది.

"చైనా కామ్రేడ్స్ వైఖరి జీవితాన్నుండి వేరుపడిపోయిన సిద్ధాంతాలను అజ్ఞాపత్రాలద్వారా అమలుచేయుటను పిడివాదాన్ని సెక్టేరియనిజాన్ని తెలియజేస్తుంది"[1] అని సోవియట్ కమ్యూనిస్టు పత్రిక చైనా వైఖరిని విమర్శించింది.

చైనా కమ్యూనిస్టులు వారి ప్రత్యేక పరిస్థితులలో మార్క్సిజం, లెనినిజాన్ని, సృజనాత్మకంగా అభివృద్ధిచేసి అమలుచేయుటలో సాధించిన విజయాలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ గుర్తించిందని, అయితే "తమస్వంత" మార్క్సిజాన్ని విశ్వసత్యంగా చివరిమాటగా యితరులపై రుద్దుటపేరస. "రష్యా" కమ్యూనిస్టుపార్టీ పత్రికా సంపాదకీయం, స్పష్టం చేసింది చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, తమ అనుభవం కార్మికవర్గ విప్లవసిద్ధాంతంలో ఉన్నత నూతన దశగా ప్రకటించుతు, మార్క్సిజం, లెనినిజంలను అభివృద్ధి చేయుటలో తమ వాక్కుకే గుత్తాధికారం వున్నట్లు ప్రవర్తించుట స్పష్టం అంతేగాక ప్రపంచ విప్లవోద్యమ వారసత్వాన్నంతా తామే పరిరక్షించుతున్నట్లు చైనా పార్టీ ప్రకటించుకొంటూ "మైనారిటీ" అయినప్పటికి "మెజారిటీ" కమ్యూనిస్టు పార్టీలు సంస్కరణవాదపు వూబిలో వున్నవంటూ, సూత్రబద్ధమైన వారిపై విమర్శనను పెడసరితనంతో త్రోసివేస్తున్నారని, కమ్యూనిస్టు" పత్రిక స్పష్టం చేసింది[2].

చైనా కమ్యూనిస్టు పార్టీ జూన్ 14, 1963 లేఖలో "అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమానికి, సాధారణపంథాకు ప్రతిపాదనలు" అన్న శీర్షికలో తన అభిప్రాయాలను వ్యక్తి పూజావిధానంపై యీక్రింది విధంగా తెలిపింది.

"గతకొద్ది సంవత్సరాలుగ కొందరు వ్యక్తులు పార్టీలు ప్రజలు వర్గాలు నాయకులు మధ్యవుండవలసిన పరస్పర సంబంధాలపై లెనిన్ సమగ్ర ఉపోద్ఘాటనలను అతిక్రమించి, వ్యక్తి పూజావిధానం విరోధించుట అనునమన్యను లేవనెత్తుటలోపభూయిష్టమేగాక నష్టదాయకమైనది". లెనిన్ ప్రవచించిన సిద్ధాంతంలో'' 1) ప్రజాసామాన్యం వర్గాలుగ విభజింపబడిందని 2) సామాన్యంగా వర్గాలు రాజకీయ పార్టీలలో

1. సంపాదకీయం కమ్యూనిస్టు నం 11, 1963 (ఆంగ్లంలో) సోవియట్ లాండ్ బుక్ లెట్సు న్యూఢిల్లీ పే. 35-36

2 సంపాదకీయం కమ్యూనిస్టు నం 11 (1963) సోవియట్ లాండ్, బుక్‌లెట్సు. న్యూఢిల్లీ (ఆంగ్లంలో) పే 37-39.

నాయకత్వాలలో వున్నవి. 3) సామాన్యసూత్రంగా రాజకీయపార్టీలు అనుభవజ్ఞులు బలమైన నాయకత్వాలచే అధికారికంగా నడుపబడుతున్నవి; వారు బాధ్యతాయుత స్థానాలకు ఎన్నికకాబడిన నాయకులు యిది అంతా ప్రాథమికమైనది" అన్నారు.

"కార్మికవర్గ విప్లవంలో కార్మికపార్టీ కేంద్రకార్యాలయము. ప్రతి కార్మిక పార్టీ ప్రజాస్వామ్యప్రాతిపదికగా కేంద్రీకృత విధానాన్ని ఆచరించి, బలమైన మార్క్సిస్టు-లెనినిస్టు నాయకత్వాన్ని, నిర్మాణయుతము, పోరాట సమర్థత గల అగ్రగామి దళ మగుటకు నిర్మాణం కొనసాగాలి." వ్యక్తి పూజావిధానానికి వ్యతిరేకంగా పోరాటం" అనే సమస్యను లేవనెత్తుట, నాయకత్వానికి వ్యతిరేకంగా ప్రజలను లబెట్టుట పార్టీనుండి నాయకత్వాన్ని తిరస్కరించుటయేగాక పోరాటశక్తిని నిర్వీర్యం చేసి, పార్టీ వర్గాలను చిన్నాభిన్నం చేస్తుంది.

నాయకత్వానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టే యీ తప్పుడు వైఖరిని లెనిన్ తీవ్రంగా విమర్శించి "హేళనాభరిత అసంగతం, బుద్ధిమాలినది" అని అన్నారు.

"వ్యక్తి పూజావ్యతిరేక పోరాటాన్ని ఆర్భాటంగా సాగిస్తూ నిజానికి కార్మికవర్గ నియంతృత్వాన్ని అప్రదిష్టపాలు చేస్తున్నారు. అదేకాలంలో కొద్దిమంది వ్యక్తుల పాత్రను అతిశయోక్తిగా చెప్పుతున్నారు. పొరపాట్లన్నిటిని తదితరులపై నెట్టుతూ, విజయాలన్నిటికి తామే బాధ్యులమంటున్నారు.

ఇంతకంటె తీవ్రంగా పరిగణించవలసినది "వ్యక్తి పూజావ్యతిరేక పోరాటం అనే ముసుగులో కొద్దిమంది వ్యక్తులు సోదర పార్టీల అంతర్గత విషయాలలో మొరటుగ కలుగజేసుకొంటున్నారు ఆ పార్టీలపై తమ తప్పుడు పంథాను రుద్దుటకై సోదర పార్టీల నాయకత్వాలలో మార్పుకు బలవంతం చేస్తున్నారు. ఇదంతా ఉన్నత జాతీయతత్వం సెక్టేరియనిజం, చీలికలతత్వం, అణచివేయుట కాక మరేమిటి?" అని రష్యా కమ్యూనిస్టు పార్టీని లేఖలో చైనా పార్టీ ప్రశ్నించింది.

"నాయకత్వాలు పార్టీవర్గం, ప్రజలు పరస్పర సంబంధాలపై లెనిన్ సమగ్ర బోధనలను వివరంగా ప్రచారం చేయవలసిన ముఖ్యకాల మాసన్నమైంది[1]" అని లేఖలో స్పష్టంగా అన్నారు.

"వ్యక్తి పూజా విధానంపై భారత కమ్యూనిస్టుపార్టీలోని నాటి వివిధ వర్గాల అభిప్రాయాలను చూద్దాము

భారత కమ్యూనిస్టుపార్టీలో అతివాద వర్గంగా గుర్తింపబడి 1964లో మార్క్సిస్టుపార్టీగ యేర్పడి. 1969లో మాత్రమే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని

---

1. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలోని సిద్ధాంత సమస్యలునెం. 8 (అంగ్లంలో పి. పి. బి. పబ్లికేషన్ జులై 1963, పే. 41-42

భేదాభిప్రాయాలను చర్చించి ఒక సిద్ధాంత తీర్మానాన్ని బర్ద్వాన్ ప్లీనంలో ఆమోదించిన దానిని వుదహరించవలసియుంది.

మార్క్సిస్టుపార్టీ, రష్యా కమ్యూనిస్టు పార్టీ 20వ, కాంగ్రెసు జరిగి దశాబ్ది మైనా స్టాలిన్‌పై కృశ్చేవ్ రహస్య నివేదిక అమెరికా ప్రపంచమంతటా పంచినా దానిపై అధికార పత్రంగా రష్యా ప్రకటించకుండుటపై అసంతృప్తిని వెల్లడించింది. ఆ నివేదిక కమ్యూనిస్టు వ్యతిరేకుల ఆయుధంగా అయింది. సోవియట్ పార్టి అధికారికంగా త్రోసిబుచ్చినా, నివేదికలోని అంశాలు అప్పుడప్పుడూ వువన్యాసాలలో సోవియట్ పత్రికలలోని వ్యాసాలలో బయటపెడుతున్నవి.

స్టాలిన్ సమస్యను సి. పి. యస్. యు" తమ స్వంత సమస్యగానెంచింది. కాని పొరపాటుల నుండి అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలు పాఠాలు నేర్చుకొనే అంతర్జాతీయ సమస్యగా నెంచలేదు.

లెనిన్ తరువాత మూడు దశాబ్దాలు సి.పి.యస్.యు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు నాయకత్వం వహించి అతివాద మితవాద కమ్యూనిస్టు వ్యతిరేకులనుండి మార్క్సిజం లెనిజాన్ని సంరక్షించి రెండవ ప్రపంచయుద్ధంలో నాజీయిజాన్ని భూస్థాపితం చేయగలినంతటి పారిశ్రామిక సైనిక శక్తివంతంగా సోవియట్ యూనియన్‌ను నిర్మించుట ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలన్నిటికి మార్గదర్శక సూత్రాలతో సలహా సహాయాలనందించి బలమైన ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమాన్ని నిర్మించిన మహోన్నత పాత్ర చరిత్రపుటలలో స్వర్ణాక్షరాలతో లిఖింపబడింది ఎవ్వరూ దీనిని తుడిచి వేయలేరు.

"వ్యక్తి పూజా విధాన వ్యతిరేక పోరాటమనే పేరుతో విప్లవోద్యమాలను వాటి నాయకత్వాలను అరాచక విధానాలతో తెగనారుటను స్వేచ్ఛగా ప్రోత్సహించారు సోవియట్ సంస్కరణవాద నాయకత్వం స్టాలిన్‌ను తెగనాడే నివేదిక ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంపై కలుగజేయు ప్రభావాన్ని గురించి ఆలోచించలేదు. కనీసం సోదర ప్రముఖపార్టీలతోనైనా సంప్రదించే ప్రయత్నం చేయలేదు. ఆ విధంగా ప్రపంచ సామ్రాజ్యవాదానికి బలమైన ఆయుధాన్నిచ్చారు.

స్టాలిన్‌ను పూర్తిగాత్రోసివేయుట మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలపై దాడి, సామ్రాజ్యవాదం యుద్ధం-శాంతి కార్మికవర్గ నాయకత్వం, కార్మిక నియంతృత్వం, వలస, అర్థవలస దేశాల విప్లవాల వ్యూహం, ఎత్తుగడలు, కమ్యూనిస్టు స్వభావ, లక్షణాల పాత్రలపైదాడి చేయుటకు సంబంధం కలిగివుంది. నవీన సంస్కరణవాదులు ఎన్నిచేసినా మార్క్సిజం-లెనినిజంలనుండి స్టాలిన్ పేరును పేరుచేయజాలరు.

భారత కమ్యూనిస్టుపార్టీ ఆగస్టు 1964లో చర్చల నిమిత్తం ప్రకటించిన

"అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని సిద్ధాంత వివాదంపై నివేదిక"లో వ్యక్తి పూజావిధానంపై తన వైఖరిని స్పష్టం చేసింది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ, పార్టీ కాంగ్రెసులో "స్టాలిన్ వ్యక్తి పూజా విధానాన్ని" ఖండించుటను 1956లో చైనా నాయకత్వం "కార్మికవర్గ నియంతృత్వం చారిత్రికానుభవం" అన్న వ్యాసంలో స్వాగతం చెప్పింది. అంతర్జాతీయ కమ్యూనిస్టువర్గాలు అభినందించాయి. చైనా పార్టీ జూన్ 14, 1963 లేఖలో పూర్తిగ భిన్నమైన అభిప్రాయాలను వెల్లడించుట జరిగింది. ఈ నూతన అవగాహన అంచెనా 20వ పార్టీ కాంగ్రెసులో స్టాలిన్ వ్యక్తి పూజా విధాన ఖండన "కార్మికవర్గ నియంతృత్వాన్ని పోషిస్తూ వ్యవస్థను మహోన్నత సోవియట్ కమ్యూనిస్టుపార్టీని సోవియట్ యూనియన్‌ను అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని అప్రదిష్టపాలు చేసింది" అని నివేదిక విమర్శించినా బలపరచింది.

కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి ఆగస్టు 1962 హైదరాబాద్ సమావేశం, 20వ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు "వ్యక్తి పూజా విధాన" వ్యతిరేక పోరాటాన్ని సాగించుట చాల సాహసోపేత చర్యగా గతంలో తెగతెంపులు చేసుకొనుట గత విధానాలు సిద్ధాంతాలు సోవియట్ ప్రజలకు వేసిన శృంఖలాలను త్రెంచి సోవియట్ సమాజం కమ్యూనిజ గమ్యానికి పురోగమించుట అగుతుందనే వైఖరి నవలంభించింది. అంతేగాక వ్యక్తి పూజావిధానానికి తత్ఫలితాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటం, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రయోజనాల ననుసరించి జరిగిందన్నది. "వ్యక్తి పూజావిధాన వ్యతిరేక పోరాట ఫలితంగా సోవియట్‌పార్టీ పని విధానంలో ప్రభుత్వం ఆర్థిక ప్రణాళికలు వాటి అమలులో న్యాయశాఖ విధానంలో విద్య, శాస్త్రీయ పరిశోధనలలో ప్రజాచొరవ పెంపొందిందనే సోవియట్ ప్రచారాన్ని పునరుద్ఘాటించింది. సోవియట్‌యూనియన్‌లో 1990 దశకంలోని సర్వతోముఖ సంక్షోభం" దాని పతనం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని కమ్యూనిజాన్ని సంక్షోభ సుడిగుండంలో పడిపోవుట నాటి 'గుడ్డి అనుసరణను', 'చారిత్రిక దృష్టి లోపించుటను స్పష్టపరుస్తున్నవి.

జాతీయ సమితి తీర్మానం స్టాలిన్ వ్యక్తి పూజా విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాట "సుముఖ వ్యతిరేకాంశాల రెండింటిని దృష్టిలో వుంచుకొని స్టాలిన్ నడత పాత్రలను పరిశీలించవలసిన అవసరముంది. స్టాలిన్ వ్యక్తిపూజా విధానంపై సి.పి.యస్.యు. నాయకత్వంచేయు విమర్శలను ప్రతిప్రకటనను మన పార్టీ ఆమోదించవలసిన అవసరంలేదు. పార్టీ స్థానం స్పష్టం వ్యక్తి పూజా వ్యతిరేక పోరాటం సమతూకంలో వాస్తవాలననుసరించాలని అంటూనే సోవియట్ నాయకత్వం చూపిన ధైర్య సాహసాలను వ్యక్తిపూజా విధాన బహిరంగఖండన మార్క్సిస్టు-లెనినిసు

ప్రమాణాలను తిరిగి పునరుద్ధరించుటగా భారత కమ్యూనిస్టుపార్టీ గుర్తించుచున్నదని స్పష్టం చేసింది.

"వ్యక్తిపూజా విధానాన్ని నిర్ద్వంద్వంగా ఖండించుటకు పోషలిజాన్ని కార్మిక వర్గ నియంతృత్వాన్ని అప్రదిష్టపాలు చేయుటకు యే విధమైన సారూప్యతలేదు" అని భారత కమ్యూనిస్టుపార్టీ సోవియట్ విధానాన్ని మినహాయింపులతో బల పరచింది.[1]

ఈ సిద్ధాంత వివాదంలో చైనా సోవియట్ భారత కమ్యూనిస్టుపార్టీ మార్క్సిస్టు పార్టీలు అన్నీ వ్యక్తిపూజా విధానాన్ని నిరసించాయి. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ వ్యక్తి పూజా విధానవ్యతిరేక పోరాటమనే పేరుతో పరోక్షంగా కార్మికవర్గ నాయకత్వానికి కార్మికవర్గ నియంతృత్వానికి వ్యతిరేకంగా జరిగే ప్రచారాన్ని చైనా కమ్యూనిస్టుపార్టీ, భారతమార్క్సిస్టు పార్టీలు వ్యతిరేకించాయి. భారత కమ్యూనిస్టుపార్టీ వ్యక్తి పూజా విధానాన్ని ఖండించుటయేగాక, దాని సుముఖ అంశాలను శ్లాఘించింది. కాని నష్టదాయకమైన అంశాలను, ఫలితాలను పేర్కొనుటలో విఫలమైంది.

## VIII

## మితవాద, అతివాద, సంస్కరణ వాదాలు

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాలలో అవకాశవాద, మితవాద సంస్కరణ వాదంపై తీవ్రవ్యతిరేకపోరాటాన్ని సాగించవలసిన ఆవశ్యకతను 1957, 1960 మాస్కో సమావేశాలు స్పష్టం చేసాయి. పిడివాద, అతివాద సంస్కరణవాదాన్ని ఖండించుతూ ప్రధాన ప్రమాదం మితవాద సంస్కరణవాదాన్నుంది అని కూడ స్పష్టం చేసాయి. అభివృద్ధి క్రమంలో యే పార్టీలోనైనా యేదశలోనైనా పిడివాదం, సెక్టేరియనిజం ప్రధానప్రమాదం కావచ్చుని హెచ్చరించాయి. అందుకే "మాస్కో 1957 ప్రకటన చెప్పినట్లుగా, కార్మికవర్గ కమ్యూనిస్టుపార్టీల ద్విగుణీకృత పురోగతికి ప్రధాన ప్రమాదకారియైన మితవాద సంస్కరణవాద వ్యతిరేక పోరాటంతోపాటు పిడివాద సెక్టేరియనిజం, అతివాద సంస్కరణవాద వ్యతిరేక పోరాటాన్ని యేక

---

1. పార్టీ అంతర్జాతీయకమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత-భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి,అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని సిద్ధాంత వివాదాలపై ఆమోదించిన నివేదిక (ఆంగ్లంలో) పి.పి.హెచ్. పబ్లికేషన్ 1964 పే 36-38.

కాలంలో దృఢతర ద్విముఖ పోరాటం సాగించుట అవసరమని[1]" 1960 సమావేశ స్పష్టంచేసింది. అతివాద, మితవాద సంస్కరణవాదాలు అంతర్జాతీయ సమస్యలని మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత అభివృద్ధిని, వాస్తవ పరిస్థితుల అధ్యయనాన్ని అరికట్టి ప్రజలను పార్టీ నుండి" వేరు చేస్తాయని తెలిపాయి.

నూతన మితవాద సంస్కరణవాదం, మార్క్సిజం-లెనినిజానికి ప్రస్తువట్టించి సామాజికాభివృద్ధికి దాని ప్రాధాన్యతను కోల్పోయిందని, కార్మిక విప్లవం యొక్క చారిత్రికావసరం గుర్తించక, కార్మికవర్గానికి సోషలిజంలో గల విశ్వాసాన్ని నాశనం చేస్తుంది. పెట్టుబడి దారి విధానం సోషలిజంలోనికి పరివర్తనకాలంలో కార్మిక వర్గ నియంతృత్వ అవసరాన్ని, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వపాత్ర, ప్రజాస్వామ్య కేంద్రీకరణ సూత్రాన్ని లెనినిస్టు నిర్మాణ సూత్రాలను గుర్తించక, "పార్టీని విప్లవ పోరాట పార్టీగా కాక చర్చా సంస్థగా చేస్తారని[2]" 1957 ప్రకటన సంస్కరణవాద వ్యతిరేక పోరాట ఆవశ్యకతను నొక్కిచెప్పినది. కాగా, "సంస్కరణ మితవాద అవకాశవాదం సైద్ధాంతికంగా ఆచరణలో బూర్జువా సిద్ధాంతాల ప్రతిబింబమే, మార్క్సిజం-లెనినిజంలకు తప్పుడు వ్యాఖ్యలు చేస్తుంది, కార్మికవర్గ విప్లవేచ్ఛను మంచం పట్టిస్తుంది, విప్లవసారాన్ని నిర్వీర్యం చేస్తుంది. శాంతి, ప్రజాస్వామ్యం జాతీయ విముక్తి సామ్రాజ్యవాద వ్యతిరేక, సోషలిస్టు పోరాటంలో కార్మికులను శ్రామిక ప్రజాసామాన్యాన్ని నిరాయుధులను చేసి, సమీకరణమువిచ్ఛిన్నం చేస్తుందని[3] 1960 సమావేశం స్పష్టం చేసింది. ఈ విధంగా రెండు సమావేశాలు మితవాద సంస్కరణవాద వ్యతిరేక పోరాటాన్ని నొక్కి చెప్పాయి.

ప్రపంచ కమ్యూనిస్టు సమావేశాలు రెండూ అతివాద సంస్కరణవాద రూపాలైన పిడివాదం సెక్టేరియనిజంలు సైద్ధాంతికంగా అభివృద్ధిక్రమ ఆచరణలో కొన్నిపార్టీలలో యేదశలోనైనా దానిని మూలంతోనే అణచివేయకుండిన ప్రధాన ప్రమాదకారిగ పరిణమించవచ్చని హెచ్చరించాయి. పిడివాదం మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంత అభివృద్ధిని అరికట్టుతుందని వాస్తవ పరిస్థితుల అధ్యయనానికి బదులు పుస్తకాలలోని సూత్రాలను వల్లెవేస్తుందని, ప్రజలనుండి పార్టీని వేరు చేస్తుందని 1957 ప్రకటన తెలుపగా; ప్రత్యేకపరిస్థితులలో శాస్త్రీయ విశ్లేషణతో సృజనాత్మకంగా మార్క్సిజం-లెనినిజాన్ని అభివృద్ధి చేయుశక్తి పార్టీలకు లేకుండా చేస్తుందని,

---

1. బేసిక్ డాక్యుమెంట్సు కమ్యూనిస్టు అండ్ వర్కర్స్ పార్టీస్, మాస్కో మిటింగ్సు 1957, 1960, 1969 సి. పి. ఐ. పబ్లికేషన్ 1972 (ఆంగ్లంలో). పే. 57,
2. ........ ........ పే. 10-11.
3. ........ ........ పే. 57.

ప్రజాసామాన్యాన్నుండి కమ్యూనిస్టులను వేరు చేస్తుందని ఆ మంచిరోజు కొరకు ఎదురుచూచునట్లు చేస్తుంది లేదా విప్లవ పోరాటాలలో అతివాద, సాహిసిక, దుందుడుకు చర్యలకు పొడిగట్టునట్లు చేస్తుంది, మారే పరిస్థితులలో నూతన అనుభవాలను సకాలంలో సరియైన విశ్లేషణ, అంచెనా వేయుటను నిరోధిస్తుందని ఆ విధంగా విప్లవ పోరాటాల విజయాన్ని అసాధ్యం చేస్తుందని 1960 సమావేశం స్పష్టం చేసింది.

ఈ విధంగా కమ్యూనిస్టు సమావేశాలు రెండూ మితవాద వ్యతిరేక పోరాటాన్ని చెబుతూ, పిడివాదాన్ని గురించి హెచ్చరించి, ద్విముఖ పోరాట అవసరాన్ని చెప్పాయి.

ఈ సమస్యపై చైనా సోవియట్ పార్టీల స్పందనలను చూద్దాము.

కమ్యూనిస్టుపార్టీల 1957 సమావేశంలో సోవియటు మొదటి ముసాయిదాపై తీవ్రచర్యల అనంతరం చైనాపార్టీ తనఅంగీకారాన్ని స్పష్టం చేసింది. ఫలితంగా సోవియటు రెండో ముసాయిదాను ప్రతిపాదించింది. "శాంతియేతర మార్గపువద జాలాన్నివాడినా, యీ ముసాయిదా కూడ శాంతియుత పరివర్తన సమస్యపై యింకా సంస్కరణవాద అవగాహననే ప్రతిబింబించుచున్నది. చైనా ప్రతినిధివర్గం తమ అంగీకారాన్ని స్పష్టం చేసింది. నవంబరు 10వ సోవియటుపార్టీ కేంద్ర సమితికి వ్రాత పూర్వకంగా సమర్పించింది. "సోవియటు పార్టి ప్రతినిధులు సమస్యపై వాదించజాలక తమ పార్టీ అంతర్గత అవసరాలకొరకు తమ 20వ, పార్టీ కాంగ్రెను అవగాహనకు కొంత సారూప్యతకొరకు, కొంత సౌలభ్యాన్నికలుగజేయమనికోరారు. "అంతర్జాతీయ ఐక్యతకు, సమిష్టిపోరాటానికి, సోవియటు కోరికను మన్నించి, వారి ముసాయిదాను భూమికగా కొన్ని సవరణలు ప్రతిపాదించి ఆమోదించాము" "కృశ్చేవ్ సంస్కరణవాదం పసిగుడ్డుగా వున్నందున సోవియటుపార్టీ బహిరంగ చర్చను రెచ్చగొట్టనందున అప్పటికి కృశ్చేవ్ పార్లమెంటరీ సంస్కరణవాద తప్పుడు విధానాలను బహిరంగంగా విమర్శించలేదు.[1]" కాని 1960లో తీవ్రవాగ్వివాదాలు జరిగాయి. సోవియటుపార్టీ పై ఖరిని, కృశ్చేవ్ని తీవ్రంగా విమర్శించుట జరిగింది. రెండు పక్షాలు తమ వాదనలు వదలలేదు, రాజీకుదరలేదు. సోదరపార్టీల కోరికపై సాధారణ చిత్తు తయారుచేయగా, చైనా పార్టీ చివరకు 1957 ప్రకటనలోని ఆ పేరాలను అదే విధంగా తిరిగి వ్రాయుటకు ఆమోదించి, 1957లో సోవియటుపార్టీ కేంద్ర సమితికి సమర్పించిన చైనా అభిప్రాయాల నోటును సమావేశంలోని ప్రతినిధులందరికి పంచుట జరిగింది. తిరిగి యిట్టివని జరగదని తెలిపింది" "ఇప్పుడు ఈ విషయమై కామ్రేడ్స్, ఆ విధంగా సోవియటు నాయకత్వానికి సౌలభ్యాన్ని కలిగించి

---

1. శాంతియుత సహజీవనం. రెండు పరస్పర వ్యతిరేక వ్యవస్థలు (ఆంగ్లంలో) పెకింగ్ రేడియో, పీపిల్సు డెయిలీ, 6వ, కామెంటు, 1963. పే. 8–9.

వుండవలసందికాదని విమర్శించితే దానిని ఆమోదించుటకు సిద్ధమే"[1]నని తెలిపింది

"నేటి మార్క్సిజం-లెనినిజం నవీన సంస్కరణవాదానికి మధ్య జరుగుతున్న చర్చ సారాంశం మార్క్సిజం-లెనినిజం విశ్వసత్యాన్ని ఆమోదించుటా ఆమోదించక పోవుటా" లేక "సోషలిస్టు విప్లవాన్ని చివరవరకు సాగించవలసిన వాస్తవాన్ని ఆమోదించాలా అనేదే సారాంశము." ఈ చర్చలలో చురుకైన పాత్ర వహించి మార్క్సిజం-లెనినిజం నూతనంగా అధ్యయనంచేసి నవీన సంస్కరణవాదాన్ని బూర్జువా సిద్ధాంతాలను అన్నిరూపాలలో తిరస్కరించి మార్క్సిజం-లెనినిజాన్ని అభివృద్ధి చేయాలి. ఇదే నేటిదైనా మార్క్సిస్టు-లెనినిస్టుల కర్తవ్యం.[2]

నవీన సంస్కరణవాదం తాత్వికరంగంలో సోషలిజం కమ్యూనిజంల సిద్ధాంత రంగంలో రాజకీయరంగంలో మార్క్సిస్టు-లెనినిస్టు మౌలిక సూత్రాలను యెలా వుల్లంఘించిందో చూద్దాము.

తాత్వికరంగంలో పూర్వపు సంస్కరణవాదం వలెనె నవీన సంస్కరణవాదం, భౌతికతత్వశాస్త్రాన్ని స్వీయ మానసిక ఆదర్శవాదంగా విప్లవతత్వ శాస్త్రాన్ని వికృత పరిణామవాదంగా మార్క్సిస్టు-లెనినిస్టు వర్గపోరాట సిద్ధాంతాన్ని మోసపూరిత "వర్గాతీత" మానవనైజ అతీత బూర్జువా సిద్ధాంతంగా ప్రదర్శించుచున్నది.

రాజకీయ ఆచరణలో నవీన సంస్కరణవాదం కార్మికవర్గతాత్విక భౌతిక వాదాన్ని సామ్రాజ్యవాద బూర్జువా తత్వశాస్త్రాన్ని అవసరకార్యవాదంగా మార్చుతున్నది. కళ్ళెదుట వాస్తవికత నిరాకరించి వాస్తవిక సూత్రాలు వాస్తవ సత్యాన్ని నిరాకరిస్తుంది. సత్యంలేక వాస్తవం తన తక్షణ అవకాశాలను పొందే ఆయుధంగా నెంచుతుంది. దాని గమ్యం అది వుపయోగకరమైనదిగాన సత్యమైనది లేక వాస్తవమైనది. నవీన సంస్కరణవాదులంతా రాజకీయంగా అమెరికా భక్తులు. వారు రాజకీయాలలో అనుసరించేది అమెరికాబ్రాండ్ తక్షణ ప్రయోజనకర వాదము. అవును బహిరంగంగా ప్రయోజనకరవాదాన్ని ఆమోదించరు కారణం వారి విప్లవ ముసుగు తొలగుతుంది.[3]

"కళ్ళయెదుట గల వాస్తవాన్ని నవీన సంస్కరణవాదులు తక్షణ ప్రయోజనకర దృక్పధంతోను" మార్క్సిస్టు-లెనినిస్టు మౌలిక సూత్రాలను వాస్తవంగా అనుస

1. శాంతియుత సహజీవనం. రెండు 'పరస్పర వ్యతిరేక వ్యవస్థలు (ఆంగ్లంలో) పెకింగ్ రేడియో, పీపిల్సు డెయిలీల 6వ, కామెంటు 1963. పే. 11-12).
2. ది ఫైటింగ్ టాస్క్ కన్ఫ్రంటింగ్ వర్కర్స్ ఇన్ ఫిలాసఫీ అండ్ సోషల్ సైన్స్ పెస్ (1963) పెకింగ్ రేడియో, పీపుల్సు డెయిలీ కామెంటు (ఆంగ్లంలో) పే19
3. ........అదే........పే. 21.

-రించవలసినవిగా చూడక ప్రయోజనకర ఆయుధాలుగ చూస్తారు వాటిని ఆలోచించి సంస్కరించి వారి తక్షణ ప్రయోజనాల కనుగుణంగా రూపొందించుతారు.

సంస్కరణవాదులు మార్క్సిస్టు సిద్ధాంతాలైన "ఏకా అనేకం" లేక ఐక్యత వైరుధ్యాల ఫలితంగా విచ్ఛిన్నమగుట. అనేకత్వంలోంచి ఏకత్వం వుద్భవించుట లేక వైరుధ్యాల సంలీనంతో ఐక్యతాభివృద్ధి సూత్రాలను కోరి వక్రీకరించి ప్రతిపక్షాల కలయికలకు రాజీమంతవాలకు తమ అభిప్రాయాలను బలపరచుకొంటూ వ్యాప్తిచేయు టకు వినియోగిస్తారు.

"సోషలిజం కమ్యూనిజంలోని పరివర్తన లక్షణాలు" అనే మిషతో భిన్న త్వాలను అధిగమించుటకు సంలీనం లేక ఐక్యత ప్రచారం చేస్తూ సోషలిజపు పరిస్థి తులలో "నూతనాంశం లేక నూతన పరిణామం" వుద్భవించిందంటూ తాత్విక ప్రతి పక్షాలు వైరుధ్యాలు పరిణామమొంది తిరిగి సంలీనం లేకఐక్యతాభివృద్ధి అగుతున్న దని" వివరిస్తున్నారు. వారి సిద్ధాంతవేత్తలు కొందరు ఐక్యతా సూత్రము, వ్యతిరేకా సంఘర్షణా సూత్రాలకు" సోషలిస్టు దేశాలలో కాలం చెల్లిందంటున్నారు. భౌతికవాద తత్వశాస్త్రాన్ని, మూలసూత్రాలను సంస్కరిస్తున్నారు.

"మార్క్సిస్టు-లెనినిస్టులు విరుద్ధ శక్తుల ఐక్యతా సిద్ధాంతాన్ని విశ్వజనీన సూత్రంగా, ప్రకృతి, సమాజం, భావజాలం గతానికి, వర్తమానానికి, భవిష్యత్తు అభివృద్ధిని శాసించునవియని నమ్ముతారు. అవగా వర్గ,వర్గరహిత సమాజాలకు వర్తిం స్తుంది అన్నిచోట్ల అన్నికాలాలలో వైరుధ్యాలున్నవి. వైరుధ్యాలు శతృభావం కలవి, లేనివి అని వున్నవిగాని, పరిష్కరించగలవి లేనివి అవికాదు. వైరుధ్యాలు పోరాటాలద్వారానే పరిష్కరింపబడుతవి. ఆ పోరాటాలే మానవ సమాజానికి చలన శక్తి నిచ్చేవి."[1]

"సోషలిస్టు సమాజంలోని వైరుధ్యాల తప్పుడు అవగాహన నవీన సంస్క రణవాదులకు యీ దారి చూపింది." వైరుధ్యాలు మిళితమగుట లేక పరిష్కరింపు కొనుట అనే సిద్ధాంతాన్ని నవీన సంస్కరణవాదులు రూపొందించారు. ఆ విధంగా వారి "సర్వప్రజాప్రభుత్వం" అనే సిద్ధాంతానికి తాత్విక పునాదిని: అంతర్జాతీయ పోరాటానికి విస్తరింపజేసి, "శాంతియుత సహజీవనం" "శాంతియుత పోటీ", "శాంతియుత పరివర్తన"లుగా వ్యాఖ్యానించి వాటికి తాత్విక పునాదుల నేర్పరచారు. "మానవ జీవనాభివృద్ధికి అణు ఆయుధాలకు వ్యూహాత్మక వైరుధ్యంతో వాస్తవ వర్గ వైరుధ్యాలను, జాతుల వైరుధ్యాలను తెరవేయుటకువయోగిస్తున్నారు, అణు ఆయుధాల ఆవిర్భావం వర్గ విశ్లేషణలను, వర్గపోరాటాలను, వాటి సూత్రాలను

---

1 దిఫటింగ్‌టాస్క్ కన్ఫ్రటింగ్ వర్కర్స్ ఇన్ ఫిలాసఫీ అండ్ ది సోషల్ సైన్స్‌స్ పెకింగ్ రేడియో, పీపిల్సు డెయిలీ కామెంటు 1963(ఆంగ్లంలో)పే.23

అర్థరహితం చేసిందని" అంటున్నారు. "ఆటంకాంబువర్గసూత్రాలను పాటించదు" అన్నారు. సామ్రాజ్యవాదం, సోషలిజంల మధ్య గల వైరుధ్యం, సామ్రాజ్యవాదం అణచబడే జాతుల మధ్యగల వైరుధ్యం, బూర్జువాలకు కార్మికులకు మధ్యగల వైరుధ్యం, సామ్రాజ్యవాద శక్తుల మధ్యగల వైరుధ్యం,సామ్రాజ్యవాద దేశాలలోని గుత్త పెట్టుబడిదారి వర్గాల మధ్య గల వైరుధ్యాలను మిళితం లేక పరిష్కారం చేయగల మని, చేయవచ్చుని అంటున్నారు సంస్కరణవాదులు వారి రాజకీయ ప్రయోజనాలకు అట్టి నిర్ధారణలు చేస్తున్నారు[1].

నవీన సంస్కరణవాదులు శాస్త్రీయ భౌతికవాదాన్ని, శాస్త్రీయసోషలిజాన్ని వదలి, వర్గపోరాటం, కార్మికవర్గ నియంతృత్వ స్థానంలో "మానవనైజం" "మానవీయత" అనే బూర్జువా సిద్ధాంతాలను ప్రతిష్ఠించు, దృక్పధపు జండాను చేబట్టారు. శాస్త్రీయ కమ్యూనిజాన్ని బూర్జువా 'మానవీయత'తో పూర్తిగ కలిపివేసారు[2] ఇది చైనా అవగాహన.

"ఇప్పుడు మితవాద, అతివాద సంస్కరణవాదాలపై రష్యా దృక్పధాన్ని, వైఖరిని చూద్దాము. "అంతర్జాతీయ కమ్యూనిస్టుఉద్యమం 1957 ప్రకటనలో, 1960 పత్రంలో సంస్కరణవాదం ప్రధాన ప్రమాద కారియని నొక్కి చెప్పాయి. వెన్వెంటనే మితవాద, అతివాద సంస్కరణవాదాలపై ద్విముఖపోరాటాన్ని సాగించ వలసిన అవసరముందన్నారు. మార్క్సిస్టు లెనినిస్టు పార్టీలు1950 దశకపు ఉత్తరార్ధ భాగంలో మితవాద, అవకాశవాద సంస్కరణవాదంపై విస్తృత పోరాటాన్నిచేసాయి. రష్యా కమ్యూనిస్టుపార్టీ నవీనసంస్కరణవాదాన్ని బహిరంగంగా విమర్శించి,యుగో స్లోవియాను వోడించుటలో తనవంతు పాత్రను నిర్వహించింది." అది యేమైనా, 1950ల చివరకు "అల్బేనియా, చైనా పార్టీల చర్యలకారణంగా పిడివాదం, సెక్టేరియ నిజం ప్రమాదం పెరిగిపోయింది. నేటి పరిస్థితులలో పిడివాదం సెక్టేరియనిజం సాహసికవాదం, విప్లవ పదజాలం వాడుట కమ్యూనిస్టు ఉద్యమానికి ప్రమాద కారి అయిందని[3]" సోవియట్"కమ్యూనిస్టు" సంపాకీయం పేర్కొంది. అంతేగాక పెట్టుబడిదారి విధానం వున్నంతవరకు కార్మికోద్యమంపై బూర్జువావర్గం తమ ప్రభా కాన్ని కొనసాగించునంతవరకు, ఏదో వొక పార్టీలో మితవాద అవకాశముంటుంది. గత సంవత్సరాలలో సంస్కరణ వాదాన్ని విమర్శించి తొలగించివేయుటలో విజ యాలు లభించాయ" అని వ్రాసింది.

1. ది ఫైటింగ్ టాస్క్ కన్ఫ్రంటింగ్ వర్కర్స్ ఇన్ ఫిలాసఫీ అండ్ ది సోషల్ సైన్సెస్, పెకింగ్ రేడియో, పీపిల్సుడెయిలీ కామెంటు 1963 (ఆంగ్లంలో) పే 25
2. .... .... అదే. పే. 26
3. సంపాదకీయం కమ్యూనిస్టు. నం 11, 1963. సోవియట్ లాండ్ బుక్ లెట్స్ న్యూఢిల్లీ. పే. 5-6.

"అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో అదేకాలంలో, 1960 సమావేశానంతరం, అతివాద అవకాశవాదం, పిడివాదం సెక్టేరియనిజం, సిద్ధాంత పోరాటంలో ముందుకు వచ్చింది. సమావేశం, కమ్యూనిస్టు వుద్యమం యేదశలోనైనా అతివాద సెక్టేరియనిజం ప్రమాదకారి కావచ్చని హెచ్చరించింది. ఈ వైఖరి వాదులకు చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించుతు, 1957 ప్రకటన, 1960 పత్రంలోని సాధారణ పంథాను పరిష్కరించాలంటున్నారు, సాహసికవాద పంథాను ప్రవేశ పెట్టకోరుతున్నారు. అంతర్జాతీయ ఉద్రిక్తతను పెంచుట సోషలిస్టు శిబిరంలో, ప్రపంచ విముక్తి వుద్యమ మొత్తంలో చీలికల చర్యలు సాగిస్తున్నారు. అధికారంలో వున్న ఒక సోదరపార్టీ 'అతివాద' అవకాశవాదంలోనికి దిగజారి యితర పార్టీలపై తన తప్పుడు విధానాలను రుద్ద ప్రయత్నించినపుడు, ఒక పార్టీకే గాదు మొత్తం కమ్యూనిస్టు వుద్యమానికి సంస్కరణవాదంకంటె పిడివాదం, సెక్టేరియనిజం ఏ మాత్రం తక్కువ ప్రధాన ప్రమాదకారిగ రూపొందదు." ఆ కారణంగానే, "మితవాద అవకాశవాదంపై బహిరంగ విమర్శనను యేమాత్రం సడలించకుండా, అతివాద అవకాశవాదం పిడివాద సెక్టేరియనిజం సాహసిక వాదాలపై పోరాటం సాగించుట అవసరం[1] బూర్జువా వ్యవస్థ వున్నంతవరకు దాని ప్రభావానికి లోనయ్యే వర్గాలున్నంతవరకు సంస్కరణవాదానికి భూమిక వుంటుంది. సదా రాజీలేని వాడియైన దాడిని సంస్కరణవాదంపై సాగించాలి.

కమ్యూనిస్టు ఉద్యమం పిడివాద సెక్టేరియనిజం ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నది. అన్ని శక్తుల ఐక్యమై సామ్రాజ్యవాదానికి గుత్తపెట్టుబడిశక్తుల అంతం చూడవలసిన సమయంలో అడ్డుపడుతున్నది. విప్లవ పోరాటాలలో సాహసికవాదాన్ని ముందుకుతెచ్చి, విప్లవ సిద్ధాంతాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి చేయకుండా అవకాశాలను విజయం కొరకు వినియోగించకుండా పిడివాదం కమ్యూనిస్టులను ప్రజలనుండి దూరం చేయ చూస్తున్నది. విప్లవ ప్రయోజనాలకు ప్రమాదకారి అయింది. ప్రపంచ కమ్యూనిస్టుల 1960 సమావేశం తీవ్రద్విముఖ పోరాటాన్ని నొక్కి చెప్పింది. సంస్కరణవాదం యింకా ప్రధాన ప్రమాదికారి పిడివాదం సెక్టేరియనిజం పార్టీలు పెంపొందునపుడు సడలని పోరాటం సాగించనిచో యేదో వొకదశలో ప్రధాన ప్రమాదకారి కావచ్చని హెచ్చరించింది.

భారత కమ్యూనిస్టు వుద్యమంలో 1957 మాస్కో ప్రకటన అనంతరం ఈ సమస్యపై పార్టీ అవగాహన, ఆచరణ పరిశీలించాలనే వొత్తిడి వచ్చింది. పాల్ఘాటు అమృతసర్ పార్టీ కాంగ్రెసులలోను మద్రాసు జాతీయ సమితి తదితర అనేక సమావేశాలలో యీ కర్తవ్యాన్ని నిర్వహించటంలో పార్టీ నాయకత్వం విఫల

---

1. సంపాదకీయం కమ్యూనిస్టు నం 11 1963. సోవియటులాండ్ బుక్‌లెట్సు న్యూఢిల్లీ ఆంగ్లప్రచురణ. పే. 6.

మైంది. పార్టీలో మితవాద అతివాద పెడధోరణులు, 1957 మాస్కో ప్రకటన సూచించిన సంస్కరణవాద ప్రమాదంపై పరిశీలనా ప్రయత్నం జరుగలేదు. పార్టీ రాజకీయ సిద్ధాంతరీత్యా తీవ్రంగా భిన్నాభిప్రాయాలను కలిగివున్నప్పుడు యిట్టి కర్తవ్యాన్ని చేబట్టక అనేక యితర అంశాలు, ఘటనల అనంతరం పరిస్థితి మరింత విషమించిన తరువాత అక్టోబరు 1963లో జాతీయ సమితి మెజారిటీ వోటు తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తీర్మానం అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సిద్ధాంత చర్చల లోని సోవియట్ పై బరిని ఎత్తి ప్రధాన విమర్శన లేకుండా ఆమోదించబడిన ఫలితంగా సమస్యలు పరిష్కరించబడలేదు. పార్టీలో ఐక్యత యేర్పడకపోగా చీలికలకు ప్రాతిపదికలలో మరో సమిధ అదనంగా తోడైంది.

"మార్క్సిస్టు-లెనినిస్టు అవగాహనలో పార్టీ కొంత వెనుకబడే వుంది. ఫలితంగా పార్టీ దీర్ఘ కాల చరిత్రలో అప్పుడప్పుడు మార్క్సిస్టు-లెనినిస్టు పంథానుండి వైదొలగి మితవాద, అతివాద తప్పులు చేస్తూవచ్చింది. పార్టీ చరిత్ర పరిశీలించిన ఈ విషయం స్పష్టమౌతుంది. పార్టీ 2వ కాంగ్రెసు పేరుకు పోయిన మితవాద సంస్కరణవాద పెడధోరణిని 1948లో సరిదిద్ది సరియైన మార్గంలో పెట్టుటకై చేసిన ప్రయత్నంలో 1948-57 కాలంలో పార్టీ అతివాద సెక్టేరియన్ దుందుడుకు విధానం లోనికి జారిపోయింది. పెట్టుబడిదారి సర్వసామాన్య సంక్షోభ ఫలితంగా వుద్భవించిన ప్రజాపోరాటాలకు పెడ అర్థాలుతీసి, ఎత్తుగడలు నిర్ణయించుకొనుట రోజురోజుకు ఎత్తుగడలు, పోరాటరూపాలు ప్రాప్తకాలజ్ఞతపై ఆధారపడి నిర్ణయించుట జరిగింది. అభరున, రష్యన్, చైనా విప్లవాల అనుభవాలను యాంత్రికంగా అనుసరించింది. అతివాద సెక్టేరియనిజాన్ని సరిదిద్దుకొను ప్రయత్నంలో అతివాద, మితవాద అవకాశవాద ధోరణులకు తావీయకుండా, పార్టీని మార్క్సిజం-లెనినిజం గట్టి పునాదిపై పెట్టుటకు సరియైన సిద్ధాంత పోరాటాన్ని సాగించలేకపోయాము. అతివాద సెక్టేరియనిజం వ్యతిరేక పోరాటంలోనే వచ్చి మితవాద సంస్కరణవాద స్వభావంగల అనేక అనారోగ్యధోరణులు, పద్ధతులు పార్టీలో చోటు చేసుకొన్నాయి. క్రమశిక్షణ మృగ్యమైంది, కేంద్రీకృత ప్రజాస్వామ్యం సవాలుచేయబడింది. పిడివాదానికి వ్యతిరేకమనే పేరుతో దానిని ఖండించుటతో సిద్ధాంత ప్రామాణిక గ్రంధాలను చదవటమంటేనే యేవగింపు ప్రారంభమైంది. అట్టి పరిస్థితులలో యేదోవొక సమయంలో మితవాద సంస్కరణవాదమో, అతివాద సెక్టేరియనిజమో ప్రధాన ప్రమాదంగా వెన్నాడుతునే వుంటుంది. సోవియటు 20వ,పార్టీ కాంగ్రెస్‌నిర్ణయాలతో యీ ధోరణులు మరింతబలపడి క్రమంగారివిజనిజంవైపు కొట్టుకొనిపోవుట ప్రారంభమైంది. అంతర్జాతీయకమ్యూనిస్టు ఉద్యమం సెక్టేరియన్ పిడివాద ధోరణులను సరిదిద్దు ప్రయత్నాలను చూచి సంస్కరణవాద వర్గాలు మన పార్టీలో మితవాద అవకాశవాదాన్ని సమర్థించు ప్రయ

త్నాలు సాగించాయి. స్పష్టంగా చెప్పాలంటే మార్క్సిజం-లెనినిజంలను, కార్మికవర్గ అంతర్జాతీయతకు తిలోదకాలు యిచ్చి మితవాద సంస్కరణవాదమూ రివిజనిజం తలయెత్తినవి. బూర్జువా జాతీయ దురభిమానానికి తలుపులు తెరవబడినవి[1]

కమ్యూనిస్టుపార్టీలోనికి బూర్జువా జాతీయ దురభిమానం యెలా ప్రవేశించింది. వివిధ రాష్ట్రాలమధ్య వివాదాలు చెలరేగినపుడు, ఆయా రాష్ట్రాలలోని పార్టీ శాఖలు ఎలా స్పందించి ఆయా బూర్జువావర్గం వెంటపోవుట, సోదర రాష్ట్ర పార్టీ శాఖలతో సంఘర్షణపడుట పార్టీ అనేక పర్యాయములు చర్చించి, ఆత్మ విమర్శ చేసుకొంది. తమ జాతుల బూర్జువావర్గం వెనుకపోవుట రాష్ట్రశాఖలు వివాదానికి దిగుట జరిగింది. రాష్ట్రాల సరిహద్దు, నదీజలాల సమస్యలు యిందుకు ఉదాహరణలు. ఉ॥ స్నా, ఆంధ్రుల మధ్య దేవీకులం, పీర్మేదుల, కేరళ, తమిళనాడులమధ్య సరిహద్దు, కొచ్చిన్ తిరువాన్కూరు విలీనంపై కర్ణాటక-మహారాష్ట్రల మధ్య బెల్గాం విలీను వగైరా సమస్యలపై వివాదాలు, మహారాష్ట్రవాదనను బలపరుస్తూ మహారాష్ట్రపార్టీకమిటి సత్యాగ్రహం వరకు వెళ్ళుట మద్రాసు జాతీయ సమితి సమావేశం విమర్శిస్తూ తీర్మానం ఆమోదించుట అందరకు తెలుసు. కృష్ణా, గోదావరి జలాల సమస్యలలో ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక పార్టీ శాఖలమధ్య వివాదాలలో ఆయా పార్టీ శాఖలు తమతమ బూర్జువా వర్గాన్ని బలపరచుట జరిగింది.

పార్టీలోని సంస్కరణవాదం పార్లమెంటరీ కార్యక్రమాలలో నగ్నంగా బయట పడింది. విప్లవ దృక్పథం బదులు సోషల్ డెమోక్రటిక్ వైఖరులు ప్రజాకార్యకలాపాలు, పోరాటాల బదులు మంత్రుల అధికారులతో సంప్రదింపులు ఎక్కువయ్యాయి. బూర్జువావర్గ ద్వంద్వ స్వభావం, సామ్రాజ్యవాదంతో దాని రాజీవిధానం పూర్తిగ పరిగణలోనికి తీసుకొనక, బూర్జువావర్గంతో ఎత్తుగడల పేరుతో చేతులు కలుపుటలో ప్రతిబింబించింది, పార్టీ స్వతంత్రపాత్ర, నిర్ణాయకపాత్ర విస్మరించుట జరిగింది. కార్మికరంగంలో వచ్చి ఆర్థికతత్వంగా సంస్కరణవాద ధోరణి వ్యక్తమైంది. పార్టీ కాంగ్రెసు, జాతీయ సమావేశాలలో కార్మికవర్గానికి రాజకీయ చైతన్యాన్ని కలుగ జేయాలని చెప్పినా ఆచరణలో శూన్యమైంది. వ్యవసాయ సంస్కరణలకై విస్తృత ప్రజా వుద్యమాన్ని ప్రజాతంత్ర సంఘటన పునాదిగా కార్మిక కర్షకమైత్రి ఆవశ్యకతను గుర్తించినా ఆచరణలో వైఫల్యం చెందింది. వ్యవసాయకూలి, పేద, మధ్య తరగతి రైతులపై కేంద్రీకరించుట జరుగలేదు.

"ప్రజాతంత్ర సంఘటన అవగాహనలలో సంస్కరణవాద, తప్పుడు దృక్పథం కన్పడుతుంది. ఎన్నికల పొత్తుందాలను, సంఘటన వర్గతత్వాన్ని మరచి

1. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో చర్చించబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు (తెలుగు) 1963 (?) కమ్యూనిస్టు పబ్లికేషన్ పే. 137-40.

గందరగోళపరచుట, విప్లవదశ కర్తవ్యాలను పూర్తిచేయుటలో ఆసక్తిగల వర్గాల సంఘటనగాకాక, కొన్ని పార్టీల గ్రూపుల, అసంతృప్తివారుల కలయికగానో, పాలక పార్టీ యెడల అవలంభించవలసిన దృక్పథంగానో చూచుట జరుగుచున్నది. పార్టీ స్వతంత్రపాత్ర, సంఘటనలో నాయకత్వపాత్ర, కార్మిక, కర్షక మైత్రి పునాదియని విస్మరించుట జరుగుచున్నది అనేక రాష్ట్రాలలో అట్టి సంఘటనలు ప్రాప్తకాలజ్ఞతా దృక్పథంతో ఏర్పడుట, ఎన్నికల అనంతరం అదృశ్యమగుట యీ ప్రాథమిక సత్యాన్నే గుర్తుచేస్తున్నవి. ఇట్టి సంస్కరణవాద దృక్పథంతోనే అంతర్జాతీయ సిద్ధాంత చర్చలను అర్థంచేసుకొనుట జరిగింది. పార్టీలోని సంస్కరణవాద వ్యతిరేక పోరాటమూ యిదే దృక్పథంతో కొనసాగింది. ఆదేకాలంలో పిడివాద, అతివాద ధోరణుల ప్రమాదాన్ని గుర్తించి, జాగ్రత్తవహించి, నిబ్బర ధృడతర తీవ్ర అంతరంగిక పోరాటాన్ని ఐక్యసంఘటనాభివృద్ధి మార్గంలో సాగించాలి.[1]" అంతర్జాతీయ సిద్ధాంత సమస్యల చర్చల ప్రభావం పార్టీలోని అతివాద వర్గంపై స్థూలంగా ప్రతిబింబించిన తీరు యిది.

భారత కమ్యూనిస్టుపార్టీలో మితవాద, మెజారిటీవర్గం మాస్కో 1957, 1960 సమావేశాల సిద్ధాంతాలపై చైనా కమ్యూనిస్టు పార్టీ అవగాహన వైఖరిని" విప్లవవాస్తవికతగాకాక పిడివాదము సాహసిక అవకాశవాద" మనే దృక్పథాన్ని చేబట్టింది. చైనా పార్టీ,సోవియట్ యూనియన్‌లో "పెట్టుబడిదారి విధానాన్ని పెంపొందించుచున్నారని" "నాయకత్వం దిగజారిపోయిందని" వీటన్నిటికి "సోషల్ డెమోక్రటిక్ పంథాననుసరించుటయే కారణమని" చేసిన విమర్శనను అదే విధంగా త్రోసిపుచ్చారు.

ప్రపంచ 81 కమ్యూనిస్టు పార్టీల సమావేశం సమిష్టిగా ప్రపంచ పరిస్థితులను పరిశీలించి, సాధారణ పంథా, వ్యూహంను రూపొందించింది. చైనా పార్టీ "చారిత్రిక అపరాధంగా" వుందని విమర్శించుట అవాస్తవమని వివరించింది. మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఆసియా, ఆఫ్రికాలలో ప్రజ్వరిల్లిన స్వాతంత్ర్యోద్యమాలను సామ్రాజ్యవాదం అణచివేయగలిగింది కాని, రెండవ ప్రపంచ యుద్ధానంతరం బలపడిన సోషలిస్టు వ్యవస్థ అండ కారణంగా కొరియా, ఈజిప్టు, సిరియా, ఇరాక్, యెమెన్, అల్జీరియాలలోని ప్రజలు సామ్రాజ్యవాద శక్తులను తిప్పి గొట్టగలిగారు. వియత్నాం, అల్జీరియా సోషలిస్టు దేశాల ఆయుధ సహాయంతో పోరాడి విజయం పొందాయి. అదేవిధంగా ఇండోనేషియా, డచ్ సామ్రాజ్యవాదంపై విజయాన్ని సాధిం

---

1. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చర్చించబడుతున్న కొన్ని సిద్ధాంత సమస్యలు (తెలుగులో) 1963 (?) పే. 143-4.

-చింది. క్యూబా రష్యా ఆయుధాలశక్తితోనే అమెరిక సైనిక శక్తిని నెదిరించగలిగింది. ఈ వాస్తవాలన్నీ మాస్కో సమావేశాల వాస్తవిక బలాన్నిరుజువు చేస్తున్నవి ప్రతీఘాతక విప్లవాలను, తిరుగుబాటులను సామ్రాజ్యవాదం యికయేమాత్రం విజయవంతంగా ఎగుమతి చేయజాలదనే అతిశయోక్తి అవగాహనకు దారితీసింది. వలస విముక్తి సాయుధ, సాయుధేతర పోరాటాలలో స్వాతంత్ర్యాన్ని సంపాదించగల అవకాశాలు పెంపొందాయనే సమావేశాల సమిష్టి అవగాహన చైనా దృష్టిలో మార్క్సిజాన్ని వదలి వేయుటగా నగుట యెంత అసంగతమో, పిడివాదమో వివరించారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ 1958 నుండి మితవాద సంస్కరణవాదంపైనే సిద్ధాంతపోరాటాన్ని కేంద్రీకరించింది ఒక్క 14 జూన్ 1963 లేఖలో మాత్రం పేరుకు "ప్రధాన ప్రమాదంగా మితవాద సంస్కరణవాదంపై పోరాడుతు, పిడివాదాన్ని కూడ వ్యతిరేకించాలి" అని పేర్కొన్నది. అంతేగాని, సిద్ధాంతపోరాటంలో భాగంగా విస్తృతంగా విడుదల చేసిన సాహిత్యంలో మరెక్కడా షుదహరింపులేక పోవుట గమనార్హము.

IX

## 8. కమ్యూనిస్టు పార్టీల, దేశాల మధ్య సంబంధాలు

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ద్వితీయ కాంగ్రెసులెనిన్ నాయకత్వంలో ఇంటర్నేషనల్ ధ్యేయాలను, నిర్మాణ సూత్రాలను రూపొందించింది. ప్రజాస్వామ్య కేంద్రీకరణ నిర్మాణ సూత్రాలపై "వివిధ దేశాలలోని స్వతంత్ర కమ్యూనిస్టుపార్టీలు శాఖలుగ ఒకేఒక ప్రపంచ కమ్యూనిస్టు పార్టీగ. అదేవిధంగా యంగ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, కార్మిక సంఘాల రెడ్ ఇంటర్నేషనల్ను యేర్పాటు చేసింది.[1] మార్క్సిజం,కమ్యూనిజం ప్రజాస్వామ్య కేంద్రీకరణ,కార్మికవర్గ నియంతృత్వం తదితర నిర్మాణ సూత్రాలను,కార్మికవర్గ అంతర్జాతీయ ఐక్యతను ఆమోదించి,ఆచరణలో పెట్టు కార్మిక వర్గ పార్టీలే కొమింటరను సభ్యత్వానికి అర్హులు. ఇంటర్నేషనల్ చర్చించి చేసిన నిర్ణయాలను సభ్యత్వపార్టీలు ఆమోదించి ఆచరించాలి. అదే విధంగా వివిధ పార్టీలలో పై కమిటీలు చేసిన నిర్ణయాలను ఆమోదించి ఆచరణలో పెట్టాలి.

---

1. జగ్లాడిన్, వి (1988) ఇంటర్నేషనల్ వర్కింగ్ క్లాస్ అండ్ ,కమ్యూనిస్టు మూమెంటు హిస్టారికల్ రికార్డు (1830 టు1940) ప్రోగ్రెస్ పబ్లిషర్స్ మాస్కో పే. 160.

విప్లవ కార్మికవర్గ పార్టీలకు యివి తప్పనిసరిగ అనుసరించవలసిన నిర్మాణ సూత్రాలు అంతేగాక "కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రపంచ విప్లవ కార్మికవర్గం యొక్క ఐక్య పార్టీ, బూర్జువావ్యతిరేకపోరాటాన్ని యింకా సాగించవలసి వుండుటతో యీ సామాన్యలక్షణాన్ని కలిగివుంది. బూర్జువావర్గంపై విజయాన్ని సాధించి, అధికారాన్ని అందరికొరకు స్వాధీనం చేసుకొనాలి" అని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 3వ, కాంగ్రెసు స్పష్టం చేసింది.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం లెనిన్ కొమింటర్న్‌ను నిర్మించుటపై జదనోవ్ యీక్రింది విధంగా పేర్కొన్నారు. "కమ్యూనిస్టుపార్టీలు బలహీనంగా వున్నవి, వివిధ దేశాల కార్మికవర్గాల మధ్య ఎట్టి ఐక్యతా సంబంధాలు ఆచరణలో లేవు. కార్మికోద్యమాలలో కమ్యూనిస్టు నాయకత్వం గణనీయంగా గుర్తింపబడలేదు. అట్టి పరిస్థితులలో కొమింటరను వివిధ దేశాలలోని కార్మికవర్గాల మధ్య సంబంధాలను, ఐక్యతను పెంపొందించి, బలపడునట్లు చేసి సిద్ధాంత నాయకత్వాలు అభివృద్ధి చెందుటకు యుద్ధానంతర పరిస్థితులలో కార్మికవర్గ నాయకత్వాలకు శిక్షణ యిచ్చుటకు తోడ్పడింది. శైశవావస్థలో వున్న కమ్యూనిస్టుపార్టీలు కార్మిక పార్టీలుగ అభివృద్ధిచెందుటకు పరిస్థితులను పెంపొందించింది. చిన్న కమ్యూనిస్టుపార్టీలు కార్మికవర్గ ప్రజాపార్టీలుగ అభివృద్ధి చెందుటతో వొకే కేంద్రం నుండి సూచనలు, సలహాలతో నడుపుట అసాధ్యమగుటయేగాక, వాటిని మరింత అభివృద్ధి చేయుటకు ఆటంకంగా రూపొందింది. పార్టీల అభివృద్ధి ఈ నూతన దశలో, పార్టీలమధ్య పరస్పర సంబంధాలలో నూతన రూపాల అవసరం యేర్పడింది. ఈ పరిస్థితులలో కొమింటర్న్‌ను రద్దుచేసి, పార్టీలమధ్య నూతన రూపాలలో సంబంధాలను యేర్పరచవలసిన ఆవశ్యకత ఏర్పడిందని వివరించారు. అంతేగాక "నాలుగు సంవత్సరాలలోనే యూరపు, ఆసియాలోని దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు గణనీయంగా పెరిగి, బలపడి విస్తరణ ప్రాపకాన్ని సంపాదించాయి. "కొంతమంది కామ్రేడ్స్ కొమింటర్న్ రద్దును అన్ని సౌహార్ద పార్టీల మధ్య సంబంధాలను రూపుమాపుటగా, ఎట్టి సంబంధం లేకుండుటగా అవగాహన చేసుకొన్నారు. అనుభవం,ఆ విధంగా పరస్పర సంబంధాలు లేకుండుటగాఅసహజంగాను,ప్రమాదకర తప్పుడు విధానంగా, పరస్పరం వేరుపడి దూరమగుటగా స్పష్టమైంది. కమ్యూనిస్టు వుద్యమం జాతీయ చట్టంలో

---

2. ప్రిన్స్‌పల్స్ ఆఫ్ పార్టీ ఆర్గనై జేషన్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 3వ,కాంగ్రెసు 1921లో కమ్యూనిస్టుపార్టీల నిర్మాణం చట్రంలపై ఆమోదించిన సిద్ధాంతము నేషనల్ బుక్ ఏజెన్సీ 1967 ప్ర. వి. (ఆంగ్లంలో) పే. 2.

అభివృద్ధ చెందుతున్నా వివిధ పార్టీల ఉమ్మడి ప్రయోజనాలు కర్తవ్యాలు వున్నవి[1]" అని కొమిన్‌ఫారం ఏర్పాటు సమావేశంలో, అంతర్జాతీయ పరిస్థితిపై నివేదికనిస్తూ పేర్కొన్నారు జడనోవ్.

యుద్ధకాలంలో ఫాశిస్టు వ్యతిరేక పోరాటాలలో వెనువెంటనే స్పదించవలసిన అవసరం, జాతీయ విముక్తి విప్లవ పోరాటాలలో కమ్యూనిస్టుపార్టీలు ప్రధానపాత్ర వహించుచున్నందున నిర్ణయాలు, స్వతంత్ర కార్యాచరణ అవసరం పార్టీల బలం, అనుభవం పెరిగినందున ఒకే కేంద్రం సమస్యలకు నిర్ణయాలు గైకొనుట, ఆచరణకు సరియైన సూచనలు, సలహాలునిచ్చుట అసాధ్యమేగాక ప్రతిబంధకంగా తయారైంది.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యేర్పడినపుడు కమ్యూనిస్టుపార్టీలు సైద్ధాంతికంగా నిర్మాణరీత్యా బలహీనంగానే గాక అనుభవం కలిగిన నాయకత్వం కలిగిలేవు. విప్లవోద్యమాలకు వ్యూహం ఎత్తుగడలు రూపొందించుటకు పోరాటాలకు నాయకత్వం వహించుటకు సమర్థత వరివక్వత గలిగిన నాయక శ్రేణులు లేవు. కాన అన్నిపార్టీల సమిష్టి ప్రయత్నాలు, కేంద్రనాయకత్వం అవసరమైనందున, ఇంటర్నేషనల్ ఆ పాత్ర వహించుటకు యేర్పడింది. దానికాలంలో కమ్యూనిస్టు కార్యక్రమాలు, నిర్మాణ వర్గ పోరాట అనుభవాలు అభివృద్ధి చెందాయి మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞానం పెరిగింది. కమ్యూనిస్టుపార్టీలు సంఖ్యలోను, సభ్యత్వ బలంలోను పెరిగి కొన్ని ప్రజాపార్టీలుగ అభివృద్ధి చెందాయి. పార్టీల కార్యకలాపాలు అనేకరంగాలకు విస్తరించి భిన్నత్వాన్ని వివిధ జాతీయ నిర్దిష్ట పరిస్థితులు సాంప్రదాయాలను పరిగణలోనికి తీసుకొని పరిశీలించవలసిన పరిస్థితులు యేర్పడినవి.[2]

అంతేగాక "మాస్కోనుండి కమ్యూనిస్టు యింటర్నేషనల్ వివిధ దేశాల కమ్యూనిస్టుపార్టీలకు ఆజ్ఞలు జారీచేస్తుందని నిందించే సోషలిస్టులు తమ అంతర్జాతీయ సంస్థ పునర్నిర్మాణం చేసారు. కాని కమ్యూనిస్టులు కలుసుకొనుటలేదు, పరస్పర సంప్రదింపులు లేవు, శత్రువులు 'మాస్కోహస్తం' అని నిందా ప్రచారం చేస్తారని భయపడుతున్నారు. శాస్త్రజ్ఞులు కార్మికసంఘాలు, యువజనులు, విద్యార్థులు, సహకార సంఘాల ప్రతినిధులు పరస్పర అనుభవాల మార్పిడి, అధ్యయనాలకు, పరస్పర సంబంధాలను పెంపొందించుకొనుటకు ప్రపంచ సమావేశాల ఆవశ్యకతను గుర్తించి

1. జడనోవ్, ఎ (1947) ది ఇంటర్నేషనల్ సిట్యుయేషన్. కమ్యూనిస్టుపార్టీల సమాచార సంస్థ కొమిన్‌ఫారం సమావేశంలో సెప్టెంబరు 1947లో పోలెండులో ఉపన్యాసం మాస్కో పే. 43-45
2. అదే .. ....పే.. ...45.

సమావేశాలు జరుపుకొంటున్నారు. కాని మిత్రరాజ్యాలలోని కమ్యూనిస్టులు అట్టి సమావేశాలు జరుపుకొనుటకు వేనుకాడుతున్నారు. పరస్పర సంప్రదింపులు, స్వచ్ఛందంగా ఆచరణ సమన్వయం వేటి పరిస్థితులలో కమ్యూనిస్టుపార్టీల మధ్య అత్యవసరం వేరువేరుగా ఉండుట పరస్పర అవగాహనల బలహీనతయేగాక, తీవ్రమైన పొరపాటుకాగలదు"[1] అని జదనోవ్ వివరించారు. అంతేగాక సమిష్టి సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామ్య వేదికపై కమ్యూనిస్టుపార్టీలు అన్ని ప్రజాస్వామిక దేశభక్త వర్గాలు ప్రజాశక్తులను సమీకరించాలని"[2] పిలుపునిచ్చారు. కొమిన్‌ఫారం తదనంతరం యేర్పడుట కమ్యూనిస్టు పార్టీల మధ్య సంబంధాలు పెంపొందుట తెలిసిన విషయమే.

ఈ సందర్భంలో పూర్వ చరిత్ర కొంత మననం చేసుకొనవలసి వుంది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 7వ కాంగ్రెసు కమ్యూనిస్టుపార్టీల పెరుగుదల వాటి స్వాతంత్ర్యాలను పరిగణించి పోరాటాలలో రోజువారి నాయకత్వం ఆయాపార్టీలే వహించాలని, అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కార్యవర్గం మౌలిక రాజకీయ విధానాలను, ఎత్తుగడలను, మార్గదర్శక సూత్రాలను మాత్రమే రూపొందించాలని ప్రతి దేశంలోని నిర్దిష్ట పరిస్థితులను పరిశీలించి ఆయా పార్టీలే నిర్ధారణలు, కార్యక్రమాలు రూపొందించుకొనాలని కొమింటరను నేరుగా వివిధ పార్టీల అంతర్గత నిర్మాణ సమస్యలలో కలుగజేసుకొనరాదని సూచించింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రధాన నాయకత్వాలు వివిధ దేశాల శాఖలతో అత్యంత సన్నిహిత సంబంధం కలిగి వుండాలని అది ఆచరణలో ఆయా పోరాటాలలో పాల్గొంటేనే సాధ్యమని అందుకు ఇంటర్నేషనల్ ప్రతినిధులు ఆచరణలో భాగస్వాములు కావాలని 7వ, కాంగ్రెసు కార్యవర్గానికి సూచించింది.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలోని పరిస్థితులు వివిధ కమ్యూనిస్టు పార్టీల స్థాయిల భేదాలు కమ్యూనిస్టులు ఎదుర్కొంటున్న భిన్న సమస్యలలోని వైరుధ్యాలు భిన్నత్వం పార్టీల ఆచరణ సౌలభ్యతరీత్యా యెక్కువ స్వతంత్రకార్యాచరణ స్వేచ్ఛను కలిగియుండు అవసరాన్ని స్పష్టచేస్తాయి. పార్టీలు బాల్యదశలో వున్నపుడు రూపొందించిన నిర్మాణ సూత్రాలకు కాలం చెల్లిందని వివిధ జాతీయ కమ్యూనిస్టు శాఖలు అభివృద్ధిచెందుటకు అడ్డుగా నిలచి ముఖ్యంగా ఫాసిస్టు వ్యతిరేక అన్నిదేశ భక్త శక్తులను సమీకరించుటకు పార్టీ స్వేచ్ఛా ఆచరణ స్వాతంత్ర ప్రాముఖ్యతా

---

1. జదనోవ్ ఎ. (1947) ది ఇంటర్నేషనల్ సిట్యుయేషన్. విదేశ భాషా పబ్లిషింగ్ హౌస్ మాస్కో పే.45
2. .........అదే.........పే. 47.

అవసరం స్పష్టమైంది. జాతీయ విప్లవ పోరాటాల ఘటనలు వెల్లువగుట, శత్రువుపై సత్వర విజయాన్ని పొందుటకు క్షణం క్షణం అత్యంత వేగంగా మారుతున్న పరిస్థితులలో ఆ యా కమ్యూనిస్టు పార్టీలు చొరవను పీడక కార్యాచరణను వుధృతం చేయవలసిన అవసరం గుర్తించబడింది. యుద్ధ పరిస్థితులలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఉనికిని అభివృద్ధి నిరోధకులు, శత్రువులు వివిధ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలపై నిందా ప్రచారంచేయుటకు, "కమ్యూనిస్టు ప్రమాదంగా" నాజీలు చిత్రించి అయా దేశాలలో బూర్జువా వర్గాలను భయభ్రాంతులను చేసి, ఫాశిస్టు వ్యతిరేక ఐక్య సంఘటనకు దూరం చేయుటకు ఫాశిస్టు ప్రతిఘటనోద్యమాలలో చీలికలు కలుగజేయుటకు వీలు కలిగింది. వివిధ దేశాలలోని అంతర్గత విషయాలలో మాస్కో కలుగజేసుకొంటున్నదని కమ్యూనిస్టు పార్టీలను "మాస్కో ఏజంట్లుగా" చిత్రించుటకు వీలు కలిగింది. ఈ పరిస్థితులన్నిటిని పరిగణించి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రెసిడియం 1943 వసంతకాలంలో ఇంటర్నేషనల్ రద్దుచేయు సమస్యను లేవనెత్తగా 13 మే 1943లో డిమిట్రావ్‌మనులిస్కీ, పెక్, థోరెజ్, మార్టి, కొప్లెనిగ్, కొలనోవ్ ప్రెసిడియం సభ్యులు, ప్రత్యామ్నాయ సభ్యులు ఇబరూరి రకోసి, అల్‌బ్రిక్ట్, సెర్మా, ఉల్ఫ్, అన్నాపౌకర్, వాలసోవ్, లేటినెన్ ప్రతినిధులు సమావేశమై చర్చలు జరిపారు.[1]

అధ్యక్షుడు డిమిట్రావ్, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను రద్దుచేయాలనే ముసాయిదా తీర్మాన సారాన్ని తెలిపి సంపూర్ణస్వేచ్ఛాభిప్రాయాలను చర్చలకు ఆహ్వానించాడు. ఇది మామూలు చర్చకాదని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మార్గదర్శక కేంద్రాన్ని రద్దుచేయుటయని పూర్వాపరాలు తీవ్రంగా చర్చించి యిప్పుడు రద్దుచేయు రాజకీయ నిర్ణయాన్ని తీసుకొనవలసి వున్నదా అని చర్చించాలని కోరాడు

మనులిస్కీ a) కొమింటరను రాజకీయంగా రద్దుచేయవలసిన అవసరముందా b) ఇట్టి నిర్ణయాన్ని తీసుకొనుటకు యిది సరియైన సమయమా c) ముసాయిదా తీర్మానంలో రద్దుచేయవలసిన అవసరం తగినంతగా వివరించబడినదా d) ఏమైనా సవరణలు ముసాయిదాలో చేయవలసిన అవసరముందా, అనే అంశాలను చర్చించవలసినదిగా ప్రతిపాదించాడు.

థోరెజ్, కొమింటర్న్‌ను రద్దుచేయుటను బలపరస్తూ "కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పూర్వరూపంలో తన ఉనికిని మించే ఉందని యుద్ధానికి పూర్వమే పాప్యులర్ ఫ్రంటు విధానాన్ననుసరించి ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ పెరిగి బలపడిందని

1 అవుట్‌లైన్ హిస్టరి ఆఫ్ ది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ (1971) ప్రోగ్రెస్ పబ్లికేషన్స్ (ఆంగ్లంలో) మాస్కో. పే. 512

నేడు నాజీలు ఫ్రాంసు నాక్రమించుటతో విస్తృత జాతీయ సంఘటనకు భూమిక ఏర్పడిందని యిది కొమింటర్న్‌ను రద్దుచేయుటకు తగిన సమయమని "ఫ్రాంసులో హిట్లర్ వ్యతిరేక విస్తృత జాతీయ ఐక్యసంఘటన ఏర్పాటుకు యెంతో తోడ్పడు తుందని" అన్నారు.

పెక్, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను రద్దుచేయాలనే ప్రతిపాదనను ఆమో దించి జర్మన్ కమ్యూనిస్టుపార్టీకి అనుభవజ్ఞులైన సోవియట్ కమ్యూనిస్టు స్నేహి తుల సైద్ధాంతిక సహాయం యేదో రూపంలో అవసరముందని తన అభిప్రాయ మన్నారు. కొలరోవ్, ఇబారురి, నెర్మా తదితరులు ఇంటర్నేషనల్‌ను రద్దు చేయ వలసిన అవసరాన్ని స్పష్టం చేసారు.

యుద్ధ పరిస్థితులలో అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసును పిలచి నిర్ణయాలు తీసుకొనుటకు గల పరిమితుల దృష్ట్యా,అంతర్జాతీయ కమ్యూనిస్టు కార్యవర్గపు ప్రెసి డియం, 15 మే 1943న కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను రద్దు చేయు నిర్ణయాన్ని తీసుకొంది. ఇంటర్నేషనల్ 31 శాఖలు మద్దతునిచ్చాయి, యే వొక్క పార్టీ వ్యతిరే కించలేదు[1].

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ దాని చారిత్రిక పాత్ర ముగియుటతో 1943లో రద్దు చేయబడిందని ప్రకటిత సాహిత్యం తెలుపుచున్నది. వాస్తవ పరిస్థితుల బట్టి కమ్యూనిస్టు వుద్యమ నాయకత్వ రూపాలు, పార్టీల మధ్య సంబంధాలు వుంటాయని మార్క్సిజం-లెనినిజం తెల్పుచున్నది. కమ్యూనిస్టు విధానాలను నిర్మాణ రూపాలను మౌలిక రాజకీయ ప్రయోజనాలకు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ మొత్తం మౌలిక రాజకీయ ప్రయోజనాలకు, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ మొత్తం మౌలిక రాజకీయ ప్రయోజనాలకుపరిస్థితులనుండివుద్భవించేకర్తవ్యాలకు కనుగుణంగా,సమన్వయ దృక్ప థంతోనే రూపొందించుతారు. ప్రపంచ కార్మికవర్గ విప్లవ కమ్యూనిస్టుపార్టీలు అభి వృద్ధి చెందుటతో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణరూపం కాలానికి తగి నదిగా లేదు, పైగా వివిధ దేశాలలోని జాతీయ కమ్యూనిస్టు పార్టీల అభివృద్ధికి ఆటం కంగా తయారైంది. కొమింటర్న్ ఆయా దేశాల పార్టీల చొరవను, బాధ్యతలకు కర్తవ్యాల నిర్వహణకు ఆటంకంగా పరిణమించింది. ఇంతేగాక అంతగా పరిగణించ నవసరంలేని "బూర్జువా వర్గాల నిందా ప్రచారాన్ని వమ్ము చేయవలసిన అవసరాన్ని" వుదహరించి, కొమింటర్న్‌ను రద్దు చేయబడింది.

---

1. అవుట్‌లైన్ హిస్టరి ఆఫ్ ది ఇంటర్నేషనల్ (1971) ప్రోగ్రెస్ పబ్లికేషన్స్ (ఆంగ్లంలో) మాస్కో పే. 513,

ద్వితీయ ప్రపంచ యుద్ధ చరమదశలో బహుశా అంతర్జాతీయ కమ్యూనిస్టు అగ్రనాయకత్వం ఎత్తుగడల సౌలభ్యంగా అవసరమనే అవగాహనకు వచ్చి ఇంటర్నేషనల్‌ను రద్దు చేస్తే కొన్ని అడ్డంకులు తొలగి వివిధ కమ్యూనిస్టు పార్టీలు చొరవతో ఆయా దేశాల కార్యక్రమాలలో పోరాటాలలో పార్టీని అభివృద్ధి చెందగల అవకాశాలున్నవని తలచబడింది. ఏమైనా కమ్యూనిస్టు పార్టీలు దూరమగుట మార్క్సిస్టు-లెనినిస్టు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఐక్యతకు అపస్మృతిగానెంచి నాలుగుసంవత్సరాలలోనే మరోరూపంలో పుష్పవించుట యుద్ధానంతర కాలంలో ఇటలీ ఫ్రాంసు కమ్యూనిస్టు పార్టీలు బలహీనపడుటకు 1943లోని కొమింటర్న్‌ను రద్దు చేయుట పరోక్షంగా పాక్షిక కారణమైందేమోననే సందేహం కలుగుటకు ఆస్కారం కలిగింది. అనాదే కొమింటర్న్‌ను కొమిన్‌ఫారం రూపాన్ని సంతరించుకొని వుండవలసిందని తర్వాత తీర్పుగా వచ్చు. సమిష్టి అవగాహన అనుభవాల పరస్పరమార్పిడి సహకార విధానాలు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి ప్రాణప్రదమైనవి. ప్రతి కమ్యూనిస్టుపార్టీ సృజనాత్మకంగా ఆచరణలో పాల్గొనుట మొత్తం కమ్యూనిస్టు ఉద్యమానికి అవసరం - సమిష్టి తత్త్వమైన సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటానికి జాతీయ అంతర్జాతీయ అంశాలు రెండూ వున్నవి. సృజనాత్మకసైద్ధాంతిక ఆచరణలో ఐక్యకార్యాచరణ అవసరం యెంతో వున్నది.

విప్లవసిద్ధాంతం లేకుండా కార్మికోద్యమ అభివృద్ధి వుండదు. జాతీయ పరిస్థితులలో అభివృద్ధి చెందుటయేగాక లెనినిస్ చెప్పినట్లు ప్రపంచదేశాల విప్లవ అవగాహనల అనుభవాల మొత్తం" విప్లవ సిద్ధాంతం. అంతర్జాతీయ ఐక్యతను సుస్థిరం చేయుటకు జాతీయ సంకుచిత తత్త్వంలో అది నిర్వీర్య ప్రమాదంలో పడకుండా, ప్రతి కమ్యూనిస్టుపార్టీ" తన ఎత్తుగడలను అంతర్జాతీయ దృక్పథంతో రూపొందించాలి.[1] అంటే ప్రతికమ్యూనిస్టుపార్టీ జాతీయ ఎత్తుగడలను అంతర్జాతీయ దృక్పథంతో రూపొందించగా వాటి మొత్తం సమగ్ర-అన్వయరూపమే అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ ఎత్తుగడలుగా వుండాలి గాని, విపర్యంగా కాదు. అనగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం నిర్ధారించిన ఎత్తుగడలను, వివిధదేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు తమ పరిస్థితులకు అన్వయించుకొని రూపొందించుటగాదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమానికి విధానాలకు, ఎత్తుగడలకు వాస్తవానికి ఆచరణ భూమిక, ఆయా దేశాల పరిస్థితులకు, ఆయాదేశాల పార్టీలకు అన్వయించుకొను అవసరముంది. కాన, జాతీయ భూమిక అంతర్జాతీయ షపటితలంగా చెప్పుకొనుట అంత ప్రమాది కారి కాకపోవచ్చు.

1. లెనిన్ వి. ఐ. కలెక్టెడ్‌వర్క్స్, వా. 21, పే. 354 సి. పి. యస్. యు. పార్టీ ఆఫ్ ప్రొలిటేరియన్ ఇంటర్‌నేషనలిజమ్ లాబర్‌స్లైపా. 241 పేజీలలోని ఉదహరింపు.

కమ్యూనిస్టుపార్టీలు స్వతంత్రంగా తమ విధానాలను, కార్యాచరణను నిర్ణయించుకొనుట, ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల సౌభాతృత్వ, ఐక్యతలకు ఆటంకం కాజాలదు. అయితే స్వతంత్రతను అంతర్జాతీయ కర్తవ్యాలనుండి దూరమగుట తప్పుగా వ్యాఖ్యానించరాదు. స్వతంత్రత పేరుతో సమిష్టి తత్వానికి దూరమగుట, జాతీయ దురభిమాన తత్వానికి దారితీయు ప్రమాదముంది. సమిష్టి సమన్వయ కర్తవ్యాలను కమ్యూనిస్టులు లెనిన్ చెప్పినట్లు మార్గదర్శికాలు కాన ఆచరించాలి.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఐక్యతను ద్వైపాక్షిక బహుపాక్షిక ప్రతినిధుల సమావేశాలలో సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణ సమస్యలను చర్చించుట, అనుభవాలను సిద్ధాంతీకరించుట ద్వారా పెంపొందించుటయే గాక, నేటి పరిస్థితులకనుగుణంగా మార్క్సిజం, లెనినిజంల అభివృద్ధికి తోడ్పడుతుంది. కార్మికవర్గ అంతర్జాతీయత యీ విధంగా కాపాడబడుతుందని కమ్యూనిస్టు పార్టీల అవగాహన. ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల సమావేశాలు కార్మికవర్గ అంతర్జాతీయ ఐక్యతా సూత్రాలకు, ఐక్యతకు ప్రాధాన్యత నిచ్చుట, దానిని కాపాడుట అన్నిపార్టీల కర్తవ్యంగా అంతర్జాతీయ సమావేశాలు రూపీకరించాయి.

చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, "మాస్కో ప్రకటనప్రేటు మెంట్లులలోని సౌహార్ద సోదర పార్టీల మధ్య సంబంధాలలో అనుసరించవలసిన మార్గదర్శిక సూత్రాలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వుల్లంఘించి, అగ్రరాజ్యతత్వాన్ని జాతీయతత్వాన్ని అవలంబించి సోషలిస్టు వ్యవస్థ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నదని" తీవ్రంగా విమర్శించింది. "సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, 20వ, పార్టీ కాంగ్రెసు తదనంతరం "వ్యక్తి పూజా విధానంపై పోరాటం" అనే పేరుతో సౌహార్ద సోదర పార్టీలలో తమ విధానాలకు అనుకూలంగా వివిధ పార్టీలలోని నాయకత్వాలలో మార్పులకై పార్టీలలో వొత్తిడి చేసారు. కమ్యూనిస్టు ఐక్యతను పునరుద్ధరించుటకు "వ్యక్తి పూజా వ్యతిరేక పోరాటం" చేయాలని అది కమ్యూనిస్టుల తప్పనిసరి కర్తవ్యత "ఆచరణ సూత్రమన్నారని" చైనా పార్టీ విమర్శించింది.[1] అంతేగాక: "ఏకపక్షంగా సౌహార్ద దేశాల సార్వభౌమాధికారాన్ని త్రోసిపుచ్చి ఆ దేశాల అంతరంగిక విషయాలలో కలుగజేసుకొంటూ వాటిని తమ గుప్పిటలో పెట్టుకొనజూసారు. అల్బేనియా దేశ పార్టీల నాయకత్వాలను త్రోసివేయాలని బహిరంగంగా పిలుపు నిచ్చారు. ఆ దేశంతో వార్సాసంధి రాజ్యాల చట్టబద్ధ హక్కులను పరస్పర ఆర్థిక సహకార సమితి సూచనలను అన్ని ఆర్థిక, రాజకీయ, రాయబార సంబంధాలను త్రెంచివేసారు. చైనా సోవియట్ స్నేహ ఒడంబడికను మిత్రకూటమిని, పరస్పర

1. చైనా డాక్యుమెంటు పెకింగ్ రేడియో కామెంటు "అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత" అనే 51 పేజీల ఆంగ్లపత్రం. పే 13-15

సహకారాన్ని వందల కాంట్రాక్టులను శాస్త్ర సాంకేతిక సహకార ప్రణాళికలను ఏకపక్షంగా చించివేసి, చైనా వ్యతిరేక నిరోధక విచక్షణ వ్యాపార విధానాన్ని చేబట్టుటయేగాక సరిహద్దు సంఘర్షణలను రెచ్చగొట్టారని చైనా పార్టీ తీవ్రంగా విమర్శించింది ఇంకా "అంతర్జాతీయ శ్రమ విభజన అనే పేరుతో సౌహార్ద సోదరదేశాల పారిశ్రామికాభివృద్ధిని త్రోసిబుచ్చి ముడిసరుకుల సప్లయికేంద్రాలుగ అదనపు వుత్పత్తుల మార్కెట్టులుగ ఆదేశాలు స్వతంత్ర ఆర్థికాభివృద్ధిని విడనాడి తమ ఆర్థిక ప్రణాళికల అనుబంధంగా చేయ వొత్తిడి చేసింది" అని విమర్శించారు.

"సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం సౌహార్ద పార్టీలు పరస్పర సంప్రదింపుల ఫలితంగా ఏకగ్రీవామోదాన్ని పొందు సూత్రాన్ని త్రోసిబుచ్చి నిరంకుశ నిర్ణయాలను ఆజ్ఞలను జారీ చేయుట అలవాటుగ చేస్తున్నారు. సౌహార్ద పార్టీల వొడంబడికలను నిర్లక్ష్యంగా త్రోసిబుచ్చుతు ముఖ్యసమిష్ఠ సమస్యలపై యేకపక్ష నిర్ణయాలుచేసి అవి తిరుగులేనివంటూ యితరులపై రుద్దుతున్నారు. సౌహార్దపార్టీలు భేదాభిప్రాయాలను పార్టీల అంతర్గత చర్చలద్వారా పరిష్కరించుకోవాలనే సూత్రాన్ని వుల్లంఘించుచున్నారు. మొదట తమ పార్టీ కాంగ్రెసును తదుపరిసౌహార్దపార్టీ కాంగ్రెసులను వేదికగాచేసి తమ విధానాలను ప్రశ్నించిన పార్టీలపై విస్తృత బహిరంగదాడిని సాగించారు.

చైనాపార్టీ నాయకత్వం "సంప్రదింపులద్వారా ఏకగ్రీవ నిర్ణయాన్ని రూపొందించు సూత్రాన్ని దాని అమలును సోవియట్‌పార్టీ నాయకత్వం వ్యతిరేకించుచున్నదని ఏ సోదరపార్టీ నిర్మాణ సూత్రాల ప్రకారం మెజారిటీ నిర్ణయాన్ని తప్పనిసరిగా అమలుచేయాలని ఎప్పుడు ఎక్కడ ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల ఏ సమావేశం నిర్ణయించిందని" ప్రశ్నించింది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం మాస్కో సమావేశాలలో నిర్ణయించిన విధానాన్ని సోషలిస్టుదేశాల పూర్తి సమానత్వం వారి స్వాతంత్ర్య సార్వభౌమాధికారాలను దేశసమగ్రతలను దేశాల అంతర్గత విషయాలలో కలుగజేసుకోనకుండుటకు సౌహార్దపార్టీల సోషలిస్టు అంతర్జాతీయ సహకారం పరస్పర సహాయాలను పెంపొందించుచున్నది. ఆర్థిక, శాస్త్ర-సాంకేతిక, సాంస్కృతిక సంబంధాలను అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యతను, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలోను శాంతికొరకు అంతర్జాతీయ సోషలిస్టు సామాన్యపంథాను అనుసరించుచున్నది అంతర్జాతీయ ఐక్యతకు అవరోధం కలిగించే యెట్టిచర్యనైనా వ్యతిరేకించుటను కొనసాగిస్తున్నదనే అభిప్రాయాన్ని ప్రవదా సంపాదకీయం సమర్థించుకొన్నది.

"సౌహార్ద పార్టీలతో తన సంబంధాలలో సోషలిస్టు సమాజాల ఐక్యతను సుస్థిరం చేయుటకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చేయగలిగినంత చేసింది చేస్తుంది.

కమ్యూనిస్టు వుద్యమంలో కొన్ని పార్టీలు భిన్నదృక్పధాలను చేబట్టినందున వారి అనుభవం భిన్నమైనందున భేదాభిప్రాయాలు విమర్శ ప్రతి విమర్శలు బహిరంగంగా సాగాయి. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో ఐక్యతకై ప్రయత్నాలు చేయుటకు బహిరంగ విమర్శనలను ఆపుచేయుట సహాయకారి కాగలదు. జర్మనీ సోషలిస్టు యూనిటీపార్టీ ఆరవ కాంగ్రెసు సమయంలో సోవియట్‌పార్టీ కేంద్రసమితి బహిరంగ ఖండనలను ఆపుజేయాలని ప్రతిపాదించింది. చైనాపార్టీ కేంద్రపత్రిక జెన్‌మిన్‌పావో సౌహార్దపార్టీలతో కలిసి ఐక్యతను బలపరచుటకు సాధ్యమైన అన్ని చర్యలు గైగొనుటకు ప్రపంచకమ్యూనిస్టు సమావేశం యేర్పాటు చేయుటకు తగిన వాతావరణాన్ని కలుగజేయుటకు సంసిద్ధతను ప్రకటించింది. దురదృష్టకరంగా అట్టి ప్రకటనతోపాటు సోషలిస్టు యూనిటిపార్టీ 6వ సమావేశంలో మాస్కో సమావేశాల నిర్ణయాలను యేకపక్ష దృక్కోణంలో తీవ్రంగా యితర పార్టీలను చైనాపార్టి యెట్టి కారణాలు ఉదహరించకుండా ఖండించింది. సోవియట్ కమ్యూనిస్టుల యుగోస్లోవియాతో సంబంధాలను పునర్పరిశీలన కావించి స్టాలిన్ మొరటు యేకపక్ష నిర్హేతుక ఖండన వలననే పరస్పర సంబంధాలు చెడిపోయాయని స్పష్ట పరచింది. సోవియట్ ప్రభుత్వం పార్టీ యుగోస్లోవియాతో పరస్పర సంబంధాలను మెరుగుపరచే ప్రయత్నాలు ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల ప్రకటనల ననుసరించే వుందని సమర్ధించుకొన్నది,[1]

ప్రధమ కొమింటరను కాంగ్రెసు సోవియట్ రక్షణకై ప్రపంచ కార్మికులకు పిలుపు నిచ్చింది. రెండవ కాంగ్రెసు హంగెరి విప్లవం అణచివేత రష్యాలో అంతర్యుద్ధ అనుభవాలతో 1920లో కొమింటరనులో చేరదలచిన సభ్యులు ఎట్టి షరతులు మినహాయింపులు లేకుండా సోవియటు యూనియన్‌లోని ఏ రిపబ్లిక్‌లోని విప్లవ ప్రతీఘాతక శక్తులకు మద్దతు నివ్వరాదనే నిబంధనను చేర్చించింది.[2] ఆవిధంగా కొమింటరను సభ్యత్వపార్టీలన్నీ ప్రపంచసామ్రాజ్యవాదానికి రష్యాలోని విప్లవ ప్రతీఘాతక శక్తులకు వ్యతిరేకంగా ఎట్టిమినహాయింపులు లేకుండా బలపరచాయి. ఆ కాలంలో "రష్యానుండి వైదొలగండి" అనే నినాదంతో అనేక దేశాలలో వుద్యమాలు కొనసాగాయి. ప్రతిగా లెనిన్ 1922లో "ప్రంపంచ కార్మికులకు వారు

1. ప్రవదా సంపాదకీయం ఫిబ్రవరి 10, 1963 "కమ్యూనిస్టు వుద్యమ మార్క్సిస్టు-లెనినిస్టు ఐక్యత సోషలిస్టు దేశాల ఐక్యత (ఆంగ్లంలో) సోవియట్‌లాండ్ బుక్‌లెట్స్ న్యూఢిల్లీ పే. 5-6.
2. లెనిన్ వి.ఐ, కలెక్టెడ్ వర్క్స్ వా. 33, 1973 పే. 417 లేబ్సన్, బి యం, ఐక్యత సౌభ్రాతృత్వం, అంతర్జాతీయత (ఆంగ్లంలో) ప్రోగ్రెస్ పబ్లిషర్స్ మాస్కో 1981 పే. 286 .

సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయు పోరాటాలకు సహాయాన్ని అందించుటకు సోవియ రష్యా గర్వపడుతుందని"[1] పేర్కొన్నారు. ఆ విధంగానే చైనా విప్లవ పోరాటాలకు 1930 దశకంలో స్పెయిన్ అంతర్యుద్ధంలో అన్ని విధాల సైనికసహాయంతో సహా సోవియట్ సహాయాన్నందించింది. కమ్యూనిస్టుపార్టీలు సోవియటు వ్యతిరేక ప్రచారాన్ని అన్ని విధాల యెదుర్కొన్నాయి. కమ్యూనిస్టుపార్టీలు మాస్కో అయుధాలు ఏజంట్లు అన్న విషప్రచారాన్ని "సోవియటు రిపబ్లిక్ యొక్క ఆయుధం కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కాదు సోవియట్ రష్యాయేకమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు ధృఢమైన "కోట అని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్పష్టం చేసింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 7వ కాంగ్రెసులో సోవియట్‌యూనియన్ యెడల యేపార్టీయైనా అవలంబించే వైఖరియే, అది కార్మిక వర్గపు సోషలిజపు మిత్రుడా శత్రువా అని నిర్ణయించగల ప్రధానాంశమని, మరి ఏ ఇతర కొలమానం అంతకంటె మంచిది కాదని" ఫాశిస్టు యుద్ధ వ్యతిరేక ఐక్య సంఘటన ప్రసంగములో వివరించారు.

రెండవప్రపంచయుద్ధం పొంచివున్నపుడు 1935లో సోవియటు యూనియన్ ఫ్రాంసుతో "పరస్పరసహాయ" ఒప్పందాన్ని చేసుకొను విషయమై విమర్శించుతు వొక వుత్తరం వ్రాయగా, రొమైన్ రోలండ్, విప్లవావసరాన్ని ఉపేక్షజనిత వుద్వేగంతో నైతిక ఆదర్శం పేరుతో త్రోసిబుచ్చుట అంత్యంత ప్రమాదకారి యని జవాబు యిచ్చారు[2]. జర్మనీతో సోవియటు యూనియన్ 1939లో నిరాక్రమణ సంధి చేసుకొనుట యిట్టి సందేహాలకే కారణభూతమై 1980 దశకంలోకూడ చర్చనీయాంశమగుట అందరెరిగిన విషయం సోషలిజం కమ్యూనిజాన్ని బలపరచుట కమ్యూ బలపరచుకొనుటయే అగుతుంది.

టాగ్లియాటి 7వ, అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసులో తన నివేదికను సమర్పిస్తూ సోవియటు యూనియను శాంతి విధానం పెట్టుబడిదారి దేశాలలోని కమ్యూనిస్టు పార్టీల విధానాలు సారూప్యతను కలిగి వుండునని చెప్పనవసరంలేదు అని అంటూ, "ఈ లక్ష్యాల సారూప్యత అంటే అర్థం ప్రతిసారి, ప్రతికార్యాచరణ;అన్ని సమస్యలపై, ప్రపంచ కార్మికవర్గ ఎత్తుగడలకు అన్నివిధాల, పెట్టుబడిదారి దేశాలలో అధికారం కొరకు పోరాటం జరిపే కమ్యూనిస్టుపార్టీల ఎత్తుగడలు, అధికారాన్ని పొందిన సోవియటు కమ్యూనిస్టుపార్టీ, కార్మికవర్గ ఎత్తుగడలను అన్ని విధాల అనుసరించి వుండాలని" కాదు అని స్పష్టంచేసారు. అంతేగాక "కాంగ్రెసు, భిన్న పరిస్థితులలో సామాన్యధ్యేయానికే పోరాడే కమ్యూనిస్టుపార్టీల అణచివేయబడుతున్న జాతుల కార్మికవర్గం, అణచివేస్తున్న జాతుల కార్మికవర్గం, జాతుల స్వయం నిర్ణయంపై వారివారి విధానాలు ఎత్తుగడలు వొకే విధంగా వుండజాలవని" స్పష్టం చేసింది.

---

1. లెనిన్, ఏ. బి. కలెక్టడ్ వర్క్స్ వా. 33, 1973 .... 286లోని ఉదహరింపు.
2. .... .... అదే .... పే 293 లో ఉదహరింపు

సోవియటు యూనియను -జర్మనీ నిరాక్రమణ 1939 ఒప్పందం,కమ్యూనిస్టు వ్యతిరేక సామ్రాజ్యవాదుల సంఘటనను భగ్నలుచేసి, సోవియటుపై యుద్ధాన్ని వాయిదా వేసి, సోవియటు యూనియన్ తన సైనిక, వ్యూహబలాన్ని పెంచుకొన్నట్లు చేసింది. కాని, అనేక కమ్యూనిస్టు పార్టీలలో గందరగోళం యేర్పడి, తమ విధానాలను వైఖరుల నిర్ణయించుకోవజాలకపోయాయి.

కమ్యూనిస్టులు కొందరు, ముఖ్యంగా క్లిష్టపరిస్థితులలో పనిచేస్తున్నవారు, సోవియటు యూనియను తమదేశాలతో నెరపుష్ట సంబంధాలు, వైఖరులు, తమదేశ ప్రభుత్వాలు కమ్యూనిస్టుల యెడల నవలంభించు వైఖరులను బట్టి వుండాలనుటయే గాక, తమపై నిర్బంధకాండ కొనసాగిస్తున్న దేశాలతో సోవియటు యూనియను వ్యాపార సంబంధాలు చేయుటను తీవ్రంగా విమర్శించారు. లక్ష్యాలు వొకటే అయినందున కమ్యూనిస్టులందరూ వొకే ఎత్తుగడల నవలంభించాలనుట, సమస్యను సంకుచితంగా, నామమాత్రంగా చేసి చూచుట తప్పవేరుకాదు. అభివృద్ధి నిరోధక, చిలీపినోచెటు నిరంకుశప్రభుత్వం, జాతివివక్ష దక్షిణాఫ్రికాలతో సూత్రప్రాయంగా సహకారాన్ని త్రోసిబుచ్చింది. సోవియటు యూనియను అదేవిధంగా అరబ్బుప్రాంతాలను ఆక్రమించిన ఇజ్రేలుతోను సంబంధాలు పెట్టుకొనలేదు. కాని, ఆయా దేశాలలోని కమ్యూనిస్టుల యెడల ఆయా ప్రభుత్వాలనుసరించు వైఖరుల బట్టి ఆయా ప్రభుత్వాలతో వ్యవహరించజాలదు. నాటి సంఘటనల బట్టి మాత్రమే గాక దూరదృష్టితో ఆశించే మార్పుల అవతరణాంశాలను పరిగణించి మార్గదర్శిక సూత్రాల ననుసరించుతుంది[1].

అతివాదులు సోవియటు పెట్టుబడిదారుల సరుకులను కొనుట, వారు ఆర్థిక సంక్షోభం నుండి బయటపడుటకు, పరోక్షంగా విప్లవ పోరాటాలు విజృంభించకుండా చేయుటకు తోడ్పడుతుందని నిందారోపణ చేస్తున్నారు. ఇది విప్లవాభివృద్ధి క్రమాన్ని వక్రీకరించిన దుష్ఫలితం నుండి వుద్భవించినది. ఆర్థిక సంక్షోభం, దాని కనుగుణంగా రాజకీయ, నిర్మాణ, ప్రజోద్యమాలు లేకుండా విప్లవం రాదు[2]. ఆ కారణంగానే, సోవియటు యూనియను వ్యాపారసంబంధాలు విప్లవాభివృద్ధికి, ఆటంకాలు కావని వివరించారు. శాంతియుత సహజీవనాన్ని రెండు భిన్న వ్యవస్థల మధ్యగానే కాక రెండు శత్రువైరుధ్యవర్గాల మధ్య నెరపుట తప్పిదమౌతుంది. జాతియవేదికలోని వర్గసంబంధాలను అంతర్జాతీయరంగంలోనికి బదలీ చేయుట, ఆ రంగంలో వర్గపోరాటం శాంతియుత సహజీవన పోరాట రూపంలో జరుగుచున్నందున అంతటి తప్పిదమే అగుతుంది.

1. లెబ్డిన్. వి. యం. (1981) ఐక్యత, సౌభాతృత్వం, అంతర్జాతీయ (ఆంగ్లంలో) ప్రోగ్రెస్ పబ్లిషర్స్ మాస్కో- పే. 298.
2. .... .... అదే .... పే. 303-4. 3. ....అదే.పే. 304.

జాతీయ ప్రయోజనాలకై' పోరాడే కమ్యూనిస్టుపార్టీల వైఖరులు వివిధ సమస్యలపై అంతర్జాతీయ సోవియటు కమ్యూనిస్టు విధానాలపై యేకీభావం లేక పోవచ్చు అయితే సోషలిస్టు దేశాల విదేశాంగ విధానాలకు విధిగాఅనుగుణంగా వుండాలని నిర్ధారించుట సరియైనది కాదు. ఆయాపార్టీలు ఆయా ప్రత్యేక పరిస్థితులననుసరించి తమ విధానాలను అనుసరించినప్పటికి, శాంతి పోరాటం, సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తులకు దృఢతర ప్రతిఘటన, మరో వినాశకర యుద్ధాన్నుండి మానవజాతిని పరిరక్షించుట సామాన్యసూత్రంగా వుండాలి. ఈ సూత్రాన్ని నిరపేక్షంగా అంటిపెట్టుకొన్న పెట్టుబడిదారి, సోషలిస్టు దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలలో సహజ భేదాభిప్రాయాలు తీవ్రమైన వైరుధ్యాలను కలుగజేయజాలవు. ఒక విశిష్ట సమస్యపై వొక కమ్యూనిస్టుపార్టీతో భేదాభిప్రాయాలేర్పడినపుడు "అట్టి వైరుధ్యాలు" పరస్పర అభిప్రాయాల మార్పిడితో తేలికగా తొలిగించుకొనవచ్చు[1].

అధికారంలో వున్న కమ్యూనిస్టుపార్టీలు, పెట్టుబడిదారి విధానంతో పోరాడుతున్న కమ్యూనిస్టుపార్టీల మధ్యనున్న సంబంధాలు శిలా సదృశ్యంగా వుండవు, కారణం అవి అభివృద్ధి చెందుతు మారుతు నూతన రూపాన్ని సోషలిజంతోపాటు నేడు బలోపేతమగుతున్న అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంతోపాటు ఏర్పడుతవి. ఏమైనప్పటికి పార్టీలమధ్య సంబంధాల రూపాలు మారుతుంటవి ఐక్యత సౌభ్రాతృత్వ పునాదులపై ఏర్పడుతాయి. అంతర్జాతీయ స్వచ్ఛతను, సరియైన దేశభక్తితో సంలీనం చేయు నైపుణ్యంతో తాత్త్విక సంబంధంకల మౌలిక సమస్యగా యెంచాలి.

కమ్యూనిస్టుపార్టీలమధ్య సోషలిస్టుదేశాల మధ్య వుండవలసిన సంబంధాలపైనా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ దృక్పథాలను తెలుసుకొన్నాం యిప్పుడు యీ సమస్యపై భారత కమ్యూనిస్టుల స్పందనలను తెలుసుకొందాము.

భారత కమ్యూనిస్టు వర్గాలలోని మితవాదపక్షం అనబడుతున్న కమ్యూనిస్టు శ్రేణులు కృశ్చేవ్ నాయకత్వం తదుపరి బ్రెజ్నేవ్ నాయకత్వాలు సోవియట్ యూనియన్‌లో అధికారంలోవున్న కాలంలో భారత ప్రభుత్వంపై ప్రధానంగా నెహ్రూ నాయకత్వం ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానాలను విదేశాంగ విధానాలను, ప్రపంచ శాంతి విధానాలను, రాయబారపక్ష సాంప్రదాయాలనుగురించి సందర్భ అసందర్భాలలో బలపరచుటయేగాక పొగడుట అనేక సందర్భాలలో ముఖ్యంగా దేశంలో ఎన్నికల సందర్భంలో శ్లాఘించుట కొన్ని సందర్భాలలో భారత ప్రభుత్వం యెడల దేశంలోని కమ్యూనిస్టులు చేబట్టవలసిన వైఖరులపై అన్యాపదేశంగా వచ్చిన సూచనలను బహిరంగంగా ఖండించకపోయినా పాటించజాలకపోవుట స్పష్టం చేయబడింది.

---

1. లేబ్నిన్, బి. యం. 1981 అంతర్జాతీయ ఐక్యత, సౌభ్రాతృత్వం అంగ్లంలో మాస్కో పే, 307-8.

ఇక అతివాద కమ్యూనిస్టు వర్గాలు భారతదేశానికి సోవియట్ యూనియన్ ఆర్థిక పారిశ్రామిక యాంత్రిక సాంకేతికరంగాలలో చేయు సహాయం భారత బూర్జువా వర్గాలను గుత్తపెట్టుబడిగివర్గాలతో సహా అందరూ బలపడుటకే తోడ్పడు తుందని ప్రజోద్యమాలకు అంతగా తోడ్పడుట లేదనే విమర్శనలను మరువజాలము.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీతో సహా విదేశ ప్రభుత్వాలతో యితర రాజకీయ సంస్థలతో యేర్పరచుకొనే సంబంధాలు కొన్ని పర్యాయములు ఆదేశాలలో కమ్యూనిస్టుపార్టీలను 'ఇరుకున'పడవేస్తున్నవనుట స్పష్టం. భారత కమ్యూనిస్టులకు యిట్టి యిబ్బందులు స్వానుభవంలోనివి.

# X

# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ నాయకత్వ సమస్య

బ్రిటన్‌లో కార్మికోద్యమం, ఫ్రాంసులో కార్మికవర్గ పోరాటం రాజకీయ యోద్యమంగా అంతర్జాతీయ కార్మికోద్యమ అగ్రభాగాన వున్నవని "విప్లవోద్యమాల అసమానాభివృద్ధి కారణంగా వొకానొక చారిత్రిక దశలో ఒకదేశంలోని కార్మికవర్గ పార్టీ వుద్యమం అగ్రభాగాన పురోగమించిందని అంతర్జాతీయ కార్మికవర్గ విప్లవోద్యమాల చరిత్ర తెల్పుచున్నదని" మార్క్సు ఎంజెల్సు వివరించారు. పారిస్ విప్లవ వోటమి అనంతరం జర్మను కార్మికవర్గం యిప్పుడు కార్మికవర్గ పోరాట వుద్యమాలలో అగ్రగామిదళంగా వుందని, ఎంకాలాలం వరకు చారిత్రిక పరిణామాలు వారిని యీ గౌరవనీయ స్థానంలో వుంచలవో ముందుగానే చెప్పజాలమని[1] కూడ ఎంజెల్సు అన్నారు.

రష్యన్ కార్మికవర్గం 20వ శతాబ్దపు ప్రారంభంలో ప్రపంచకార్మికవర్గ వుద్యమ అగ్రభాగాన పురోగమించి చరిత్రలో మొదటి కార్మికవర్గ విప్లవ విజయాన్ని పొందింది. "అంతర్జాతీయ కార్మికవర్గ విప్లవ నాయకత్వం ప్రస్తుతానికి ఎప్పటికీకాదు, రష్యన్ కార్మికవర్గం వహించింది. వివిధకాలాలలో ఇంగ్లీషు, ఫ్రెంచి జర్మన్ కార్మికవర్గాలు 19వ శతాబ్దంలో నాయకత్వం వహించినవి."[2] అని 1919లో లెనిన్ వివరించారు.

---

1. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత (1963) పెకింగ్ రేడియో కామెంటు (ఆంగ్లంలో) 51పేజీల పత్రం పే. 26లోని వుదహరింపు.
2. లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు మాస్కో వా. 2 పార్టు 2 పే 203

"అగ్రగామిదళం" అని ఏంజెల్సు, "నాయకత్వం- హెజిమొని" అని లెనిన్ పేర్కొనుటలో, అంతర్జాతీయ కార్మికవుద్యమ అగ్రగామిదళమనుటలో అర్థం యితర కార్మిక పార్టీలకు ఆజ్ఞలను జారీచేయగలదని అవి వాటిని శిరసావహించాలని అర్థంకాదు. కార్మికోద్యమ అగ్రభాగాన జర్మన్‌సోషల్ డెమొక్రటిక్ పార్టీ 19వ శతాబ్దంలో వున్నపుడు "యూరోపియన్ కార్మికవర్గం పేరుతో మాట్లాడేహక్కు ప్రధానంగా తప్పుడుగా వాఖ్యానించే హక్కు అసలేలేదని"[1] ఏంజెల్సు అన్నారు.

ఏంజెల్సు లెనిన్‌లు పేర్కొన్న యీ అగ్రగామిదళపాత్ర మార్పు లేకుండా ఎప్పుడూ వుండదు. చరిత్ర రూపొందించే పరిస్థితుల పరిణామాలతో మార్పు వస్తుందికాని ఒక వ్యక్తి లేక పార్టీ స్వీయ మానసిక వాంఛ మార్పులను నిర్ణయించ జాలదు. ఆ విధంగా అగ్రగామి దళపాత్ర మార్పులకు లోనగుతుంటుంది. అందువ అగ్రగామిదళంగా వున్న పార్టి సంస్కరణవాద పంధాను చేబట్టితే అది ఎంతబలం ప్రాపకం కలదైనా ఆస్థానాన్ని కోల్పోతుంది. అందుకు చరిత్రలో జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీయే తార్కాణము.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సంస్థ ఇంటర్నేషనల్ ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలకు కేంద్రీకృత నాయకత్వాన్నిచ్చుట చారిత్రికవసరం. అనేక దేశాలలో కమ్యూనిస్టుపార్టీల నిర్మాణానికి అభివృద్ధికి తోడ్పడుటలో ప్రముఖపాత్ర వహించింది. అవి అనుభవాలతో అభివృద్ధి చెంది, పెద్దవై అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం విస్తరించి, చిక్కులతోనైనపుడు ఇంటర్నేషనల్ కేంద్రీకృత నాయకత్వమివ్వ గలుగుట సాధ్యంకాలేదు అవసరమూ తప్పిందని కారణంగా 1943లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రెసిడియం రద్దుచేస్తూ తీర్మానాన్ని ఆమోదించింది. తదనంతర ఘటనలు తీర్మానం వాస్తవ పరిస్థితులకు తగినదిగా నిర్ధారణ చేసాయి. కొమిన్‌ఫారం మరో నిర్మాణరూపంలో కొద్దికాలంలోనే యేర్పడినా స్వభావంలో పూర్తి మార్పు కలిగినదైనది.

మాస్కో 1957 సౌహార్ద కమ్యూనిస్టు పార్టీల సమావేశంలో చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధివర్గం సోషలిస్టు శిబిరపు అగ్రగామిగ సోవియటు కమ్యూనిస్టు పార్టీ బాధ్యత స్వీకరించాలన్నది. తీవ్రచర్చల అనంతరం సోవియటు కమ్యూనిస్టు పార్టీ సోదర కమ్యూనిస్టు పార్టీలు యేకగ్రీవంగా ఆమోదించిన చైనా సవరణతో చివరకు ప్రకటన ఆమోదించబడింది. సోవియటు కమ్యూనిస్టుపార్టీ అగ్రగామిదళంగా వుండాలనే చైనా ప్రతిపాదన ప్రకటనలో చేర్చబడింది.

"సౌహార్దపార్టీల సమానత్వ సిద్ధాంత సూత్రానికి అగ్రగామిదళ ప్రాధాన్యతల

---

1. సెలెక్టెడ్ కరస్పాండెన్స్, మార్క్సు-ఏంజెల్సు మాస్కో పే 354 ఏజెల్‌కు 18, 28 మార్చి 1875లో ఏంజెల్సు వ్రాసిన జాబునుండి ఉదహరింపు

మధ్య వైరుధ్యమేమీ లేదు. దాని అర్థం సోవియటు కమ్యూనిస్టు పార్టీ భుజస్కం ధాలపై గొప్ప బాధ్యత కర్తవ్యం వుందని సోదరపార్టీలను అదుపులో పెట్టేహక్కు మాత్రంలేదని స్పష్టం.

అగ్రగామిదళపాత్రతో సోవియటు కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం సంతృప్తి చెందలేదు. అనేక సందర్భాలలో కృశ్చేవ్ అసంతృప్తిని వెల్లడించాడు. సోషలిస్టు దేశాల సౌహార్ధ ప్రతినిధుల గౌరవార్థం 4 ఫిబ్రవరి 1960న యిచ్చిన విందులో "వాస్తవంగా అగ్రగామిదళంగా మాకు వొరిగేదేమిలేదు" అనిజూన్ 24, 1960న 12 సౌహార్ధ పార్టీప్రతినిధుల సమావేశంలో "మాకు అగ్రగామిదళంగా మాకువచ్చేదే. ముంది బాదిద తప్ప" అని వుపన్యాసంలో అన్నారు.

"సోవియటు కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం అగ్రగామిదళ స్థానాన్ని వాం ఛించుట లేదని చెప్పవచ్చు. కాని ఆచరణలో సోదరపార్టీలన్నిటిపై పెత్తనం చేయ కోరుతున్నారు. మార్క్స్ ఎంజెల్సు పంథాననుసరించుటకు అంతర్జాతీయ కార్మికవర్గ కర్తవ్యాన్ని నిర్వహించుటలో ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ అగ్రభాగాన ఉండు టను కోరుటలేదు. కాని అన్ని సౌహార్ద పార్టీలు వారి సంస్కరణవాద చీలికల పంథాను అనుసరించి బలపరచాలని అనుకొంటున్నారు" అని చైనా కమ్యూనిస్టుపార్టీ విమర్శించింది.[1]

నేటి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం వున్న పరిస్థితులలో ఎవరు ఎవ రికి నాయకత్వం వహించి నడపాలనే ప్రశ్న వుదయించదు. సౌహార్ధ పార్టీలు సర్వ స్వతంత్రం సమానత్వం కలవి. ఐక్యంగా వుండవలసినవి. సర్వసాధారణ సమస్య లపై పరస్పర సంభాషణల ద్వారా యేకగ్రీవాంగీకార దృక్పధానికి వచ్చి అందరి గమ్యానికై పోరాటాలను సమన్వయం సంఘటితం చేసుకొనాలి పార్టీల మధ్యమార్గ దర్శకంగా వుండే సూత్రాలను మాస్కో 1957, ప్రకటన, 1960 నిర్ణయాలు స్పష్టం చేసాయి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమానికి తామే నాయకుడుగా సౌహార్ధపార్టీలు తమ అధ్వర్యంలోని పార్టీలుగ వ్యవహ రించుట ప్రకటన స్టేటుమెంటులలోని సూత్రాలను లెక్కచేయక వుల్లంఘించుట తప్ప మరొకటి గాదు[2].

---

1. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత (1963?) పెకింగ్ రేడియో కామెంటు (ఆంగ్లంలో) 51 పేజీల పత్రం పే 29-30
2. ........ అదే ........ పే 26.

"సౌహార్దపార్టీలు విప్లవ విజయాలు పొందినవి, పొందవలసినవి, ముఖ్యంగా చాల కాలం క్రిందట విప్లవ విజయాన్ని పొందినవి, యీ దశకంలో పొందినవిగా భిన్న నేపధ్య చరిత్రను కలిగివున్నందున సహజంగానే భిన్నస్థాయిలలో పరిస్థితులలో వుంటవి. అంతర్జాతీయ బాధ్యతలను, సౌహార్దపార్టీలకు సహాయాన్ని సహకారాన్ని అందించగల స్థాయిలలో సహజంగా భేదముంటుంది. అన్ని విధాల శక్తిసామర్థ్యం, వనరులుగల పార్టీలు అంతర్జాతీయ బాధ్యతలను అత్యధికంగా చేబట్టవలసి వుంటుంది. కాని వాటిపై పెత్తనం చేసే హక్కుయేమాత్రం వుండదు.

"సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తాము సహజంగా నాయకుల మనుకొంటున్నది. సౌహార్ద పార్టీలపై పెత్తనం చెలాయించవచ్చని అనుకొంటున్నది, వారి విధానాలు, కార్యక్రమాలు తీర్మానాలు, ప్రకటనలు న్యాయంగా ప్రశ్నించజాలనివి. కృశ్చేవ్ ప్రతిమాట, వ్యాఖ్య 'చక్రవర్తి' శిలాశాసనం, అవి యెంత తప్పు, అసంగతమైనా శిరసావహించి, ఆమోదించాలి. వ్యతిరేకించుటకు. విమర్శకు అతీరితమైనవి. ఇది స్వేచ్ఛమైన పూ్యడలు నిరంకుశ నియంత నగ్నసిద్ధాంతం, నగ్న నిరంకుశత్వం[1].

చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం,అంతర్జాతీయ కమ్యూనిస్టుఉద్యమం సంస్కరణవాదంలో పడిపోయిందని అంటూ తమధ్యేయాలను చేరుటకు,ముఖ్యంగా రాజకీయ లక్ష్యాలను సాధించుటకు, సోవియట్ కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకంగా అంతర్జాతీయ సిద్ధాంత పోరాటాన్ని పదునైన ఆయుధంగా చేబట్టింది. దానికి తోడుగా జాతీయ తత్వాన్ని ప్రకోపింపజేసి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంపై చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని ప్రతిష్ఠించతలచింది. "మార్క్సిస్టు సిద్ధాంత మౌలిక అంశాలను నిరవధికంగా త్రోసిబుచ్చుతు, విప్లవసిద్ధాంత మౌలిక ప్రాతిపదికలను నగ్నంగా సంస్కరించ మొదలుపెట్టింది. చివరకు "చైనీయ మార్క్సిజం"ను మావో-ఆలోచనా విధానం"ను మార్క్సిజం స్థానంలో ప్రతిష్ఠించ ప్రయత్నిస్తున్నది[2]"

చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం 1958లో "గొప్ప ముందడుగు", "ప్రజా కమ్యూనులనే" విధానాన్ని ప్రకటించి, సోవియట్ యూనియన్ "సోషలిజం ప్రారంభించి అదే దశలో "కూరుకొని పోయివుండగా, చైనా అత్యంతవేగంగా కమ్యూనిజానికి పురోగమిస్తున్నదనే "ప్రచారాన్ని మొదలుపెట్టింది. "కమ్యూనిజానికి దగ్గరి త్రోవ కనిపెట్టినవారిగ చెప్పుకుంటూ ఆనాడు "మూడు సంవత్సరాలు కష్టపడిపని,

---

1. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతా చైనా పెకింగ్ రేడియోకామెంటు (ఆంగ్లంలో) 51 పేజీల పత్రము పే. 28

2. ఇలియచోవ్ యల్. (1964) రివల్యూషనరీసైన్స్ అండ్ అవర్ యేజ్ కమ్యూనిజం నం. 11, 1966 అనే సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంత పత్రికనుండి, సోవియట్ బుక్‌లాండ్ న్యూఢిల్లీ వారి పునర్ముద్రితము (ఆంగ్లంలో) పే. 19.

పదివేల సంవత్సరాలు ఆనందమయ జీవితం" అనే వినాదాన్ని యిచ్చింది. వారి "గొప్పముందడుగు" కమ్యూనిజపు పంథా విఫలమగుటతో పూర్తి వ్యతిరేక దృక్పధాన్నుండి సోవియటు కమ్యూనిస్టుపార్టీ, కమ్యూనిస్టు నిర్మాణ ప్రణాళికను విమర్శించ మొదలు పెట్టారు. అంతకు ముందు చెప్పినమాటలన్నీమరచి, సోషలిజం, కమ్యూనిజపు నిర్మాణం అనేక తరాలు ఐదు బహుశా పదితరాలు పట్టుతుందని, ఏ విధంగానైనా పది సంవత్సరాలకు తక్కువ పట్టదని, కాని వంద లేక వందల సంవత్సరాలు కూడ పట్టవచ్చు, అంటున్నారు"

"స్వశక్తిపై ఆధారపడి సోషలిస్టు నిర్మాణం", "విప్లవ శక్తులు తప్పనిసరిగా చీలుట తధ్యం" అనే ప్రయోజనాంశాలు గల రెండు సిద్ధాంతాల ప్రచారాన్ని సాగించారు. కమ్యూనిస్టు ఉద్యమాల చరిత్రలలో యేపార్టీ నాయకులు యింత స్పష్టంగా "చీలికల సిద్ధాంతాన్ని'' తమ లక్ష్యంగా చెప్పలేదు. ''కలయికలు పోరాటం-చీలికలు నూతన కలయికలు-నూతనవిధానం" అనే వైకల్ప్య లేక వికృత సిద్ధాంతం ప్రతిపాదించారు. వీటి అర్థం "చీలికల సిద్ధాంతాన్ని" అమలుచేసి "ముఠాలు,గ్రూపులు-అన్ని పార్టీలలో ప్రాక్షనులు యేర్పాటు చేస్తున్నారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సమావేశాలు రూపొందించిన సమిష్టి నిర్ణయాలన్నిటిని వ్యతిరేకించే సిద్ధాంత పోరాటాన్ని చేబట్టి, ప్రారంభంలో తమ సిద్ధాంత నాయకత్వాన్ని ప్రతిష్టించి, మార్క్సిజం లెనినిజంలకు తామే గుత్త వారసత్వదారులం సిద్ధాంత వేత్తలమని సూచించుతున్నారు. ఇది నేరుగా రాజకీయరంగంలో గాక, పార్శ్వాలనుండి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ నాయకత్వం కొరకు సాగించే సిద్ధాంత పోరాట రూపము. అందులో భాగంగానే "కలయికలు-పోరాటం-చీలికలు-నూతన కలయికలు" అనే సిద్ధాంతం రూపొందించ బడింది.

"ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజల జాతీయ విముక్తి వుద్యమాలు చాల ప్రియమైన"వని అంటూ కమ్యూనిస్టు నాయకత్వం తన గుత్తనాయకత్వ ప్రణాళికలను అమలుచేయు సాధనంగా జాతీయ విముక్తి పోరాటాలపై తమ నాయకత్వ స్థాపన కై చేయు ప్రయత్నం స్పష్టమని" సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అంతర్జాతీయ శాఖాధిపతి వివరించినది మరోచోట వివరించాము. అంతేగాక జెన్‌మిన్‌జిపావో అనే చైనా వారపత్రిక "నిజమైన కమ్యూనిస్టులు పెకింగ్‌లోనే వున్నారంటూ," ఆసియా ఆఫ్రికా లాటిన్‌అమెరికా ప్రజలు "జాతీయ విముక్తి వుద్యమాలు పెకింగ్‌ను అనుసరించాలని పిలుపునిచ్చి వారి నాయకత్వవాంచ ధ్యేయాన్నిస్పష్టంచేసిందని"[1] సుస్లోవ్ అన్నాడు. ఇదే బహుశా అంతర్జాతీయ కార్మికవర్గ సోషలిస్టు వుద్యమాలనుండి

---

1. సుస్లోవ్ యం.ఎ (1964) సి పి.యస్.యు. కేంద్రసమితి 14 ఫిబ్రవరి 1964 ప్లీనరీ సమావేశంలోని ఉపన్యాసం. సోవియటు బుక్‌లాండ్స్ పబ్లికేషన్స్ న్యూఢిల్లీ (ఆంగ్లంలో) పే. 34

జాతీయ విముక్తి వుద్యమాలను వేరు చేయాలనే చైనా నాయకుల విధాన వాస్తవ ధ్యేయాన్ని మరేయితర దానికన్నా యెక్కువ వెలుగును ప్రసరిస్తుంది

"చైనా నాయకులు చివరకు, వాస్తవంగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ట్రేడు యూనియనులు, రచయితల వార్తావిలేఖరుల, విద్యార్థుల యువజనుల ఆటల ప్రత్యేక సంస్థలను యేర్పాటు చేయ ప్రారంభించి, ప్రపంచ ట్రేడు యూనియన్‌కు పోటీ సంస్థను యేర్పాటు చేయ ప్రారంభించారు. అదేకాలంలో "పడమటి పవనంపై తూర్పు పవనం ఆధిక్యతను కలిగివుందనే" నినాదాన్ని యిచ్చి మరోమాటలలో చైనా నాయకత్వం "నాయకత్వ వాంఛలను రాజకీయ సిద్ధాంతంగా వెలిబుచ్చించని"[1] సుస్లోవ్ విమర్శించారు.

ఈ అంశాల అధ్యయనం, సోవియటు కమ్యూనిస్టుపార్టీ చిరకాలంగా సంప్రాప్తించిన అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ నాయకత్వాన్ని తమదేశ ప్రయోజనాల ప్రధాన ప్రాతిపధికగా మరొకరితో కనీసం భాగస్వాములగుటను, తీవ్రంగా వ్యతిరేకించు విధానాన్ని అదేకాలంలో ప్రాగ్దేశాల చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం నూతనంగా పొందినఅఖండ విజయోత్సవాల ఉద్రేకంలోదేశ,ప్రాంతీయ ప్రయోజనాల ప్రధానప్రాతిపధికతో నాయకత్వంచేబట్టు ప్రయత్నంముఖ్యంగా సోవియట్‌లోని ప్రధమతరం నాయకత్వం కాలంచేసిన తరువాత అంతర్జాతీయ సిద్ధాంత పోరాటం సాంప్రదాయ పరిమితులనుదాటి, "రచ్చబండ" "చాకిరేవు" పోరాటంగానై, అంతర్జాతీయ ఉద్యమాన్ని బలహీన పరచిందనుటలో సందేహం లేదు. కాని యెంత వరకు బలహీనపడిందనుటలో భిన్నాభిప్రాయానికి తావుంది.

# XI

## సమీక్ష కొన్ని ముఖ్యాంశాలు

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలోని భేదాభిప్రాయాలు పార్టీల అంతర్గత సిద్ధాంత చర్చలకే పరిమితంగాక, బహిరంగ వాగ్వివాదలయ్యాయి. ప్రపంచ వర్గ పోరాటాలు తీవ్రతరమగుటచే అందుండి వుద్భవించిన భేదాభిప్రాయాలుగ నెంచాలిగాని, వాటిని ఆ పోరాటాలనుండి వేరుచేసి కారణాలను వెదుకుట శాస్త్రీయ పద్ధతికాదు, మార్క్సిజం అసలేకాదు.

మాస్కో 1960 ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల సమావేశంలో ప్రధానంగా, సోవియటు చైనా కమ్యూనిస్టుపార్టీలు రెండు విరుద్ధ దృక్పధాలనుండి సమస్యలను

1. సుస్లోవ్ యం. ఎ. ఉపన్యాసం ........అదే పే. 35-36

తీవ్రంగా చర్చించి, విభేదించాయి ఒక పార్టీలో మైనారిటీ, మెజారిటీ నిర్ణయాలకు కట్టుబడి వుండాలనే అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీల నిర్మాణసూత్రం, సమానత్వం స్వతంత్రం గల రెండు పార్టీల మధ్య ఆచరణయోగ్యంకాదని చైనా కమ్యూనిస్టు పార్టీ తన అభిప్రాయాన్ని బలంగా స్పష్టం చేసింది.

సమావేశపు పత్రం ర్యాడీగా సోషలిజంలోనికి పరివర్తన పోరాట రూపాలు సాయుధ పోరాటాన్ని శాంతియుత పార్లమెంటరీ పోరాట పంథాని రెండిటిని వుదహరించింది.

కమ్యూనిస్టుపార్టీలన్నీ చైనా సిద్ధాంత పత్రాన్ని చర్చించుట సోవియటు కమ్యూనిస్టుపార్టీ నూతన కమ్యూనిజం నిర్మాణకార్యక్రమాన్ని పరిశీలించుట జేసాయి.

సోవియటు రష్యా చైనాను కొంత అదుపులో పెట్టగలదని ఆశించే అమెరికా ప్రజల అభిప్రాయాలను పరిగణించి, "పట్టు విడుపుల" విధానాలను అనుసరించ అమెరికా ప్రారంభించింది.

కెయిరోలో ఫిబ్రవరి 1962లో జరిగిన ఆఫ్రో-ఏసియన్ రచయితల సమా సమావేశంలో చైనాకు లభించిన మద్దతుతో అమెరికా, చైనా సోవియటు యూని యనుల విధానాల జయాపజయాలు మూడవ ప్రపంచంలో తేల్చబడతవని స్పష్ట మైంది.

సోవియటు కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంత, రాజకీయ పంథా సంస్కరణవాదమని కొందరి అభిప్రాయంకాగా చైనా కమ్యూనిస్టుపార్టీ పంథా వొంటెత్తు పిడివాద పంథా యని పెక్కుర అభిప్రాయం కాలం మాత్రమే తీర్పు చెప్పింది.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సమస్యలను, పోరాటాల సమన్వయం. వొక్కే వొక కేంద్రం మార్గదర్శిక సలహాలను యివ్వజాలదని రుజువైనందున మూడవ ఇంటర్నేషనల్ 1943లో రద్దు చేయబడింది. కమ్యూనిస్టుపార్టీల మధ్య అభిప్రాయాల మార్పిడి అవసరాన్ని గుర్తించిన తదుపరి తిరిగి 1947లో కామిన్‌ఫారం నిర్మాణం జరిగింది. కాని ఆచరణలో దాని నిర్ణయాలలో అవకతవకలు ఆదేశాత్మకంగా వున్నందున అదికూడ రద్దు అయింది. సంప్రదింపులు, సన్నాహసమావేశాల తరువాత 1957, 1960, 1969 ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల సమావేశాలు జరుపుతు సమిష్టి ప్రకటనలు, పత్రాలు బహిరంగ ప్రకటనలుగా చేయు సంప్రదాయం నెలకొల్పబడింది కాని యెట్టినిర్మాణ స్వరూపమూ యివ్వబడలేదు.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం వివిధ సమస్యలపై 1960లో జరిపినచర్చలు ప్రధాన అభిప్రాయాలు యీ క్రింది విధంగా వున్నవి.

**(1)**

ఈ యుగాన్ని "శిధిల మగుతున్న పెట్టుబడిదారి విధానం, సామ్రాజ్యవాదాల

ప్రాంగణంలో సోషలిజం వున్నదని" లెనినిజం చెప్పుతున్నది. లెనినిన్ చెప్పిన యీ యుగ పరిధిలో కంటె గుణాత్మకంగా భిన్నమైన యుగంలో వున్నామా అన్నదే ప్రశ్న.

"సోషలిజం ఒకదేశపు సరిహద్దుల నుండి విస్తరించి, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థగా రూపొందుట యీ యుగపు ప్రధాన లక్షణంగా" సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20వ, కాంగ్రెసు చెప్పింది. ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల 1957 ప్రకటన "యీ యుగపు ప్రధాన లక్షణం పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనగా నిర్వచించి, అక్టోబరు విప్లవంతో యిది ప్రారంభమైందని వివరించింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ "సోషలిస్టు శక్తులు సామ్రాజ్యవాద శక్తులను అణచి వేసి ముందుకు సాగుట, మేల్కొన్న ప్రజలు అభివృద్ధి నిరోధకశక్తులను అణచి వేయుట యీ యుగపు ప్రధాన లక్షణమని "లెనినిజం వర్ధిల్లాలి" అను చిరుపుస్తకంలో నిర్వచించింది. చైనా పార్టీ లేఖలో "మన యీ యుగ లక్షణాలను 1957, ప్రకటన 1960 పత్రములలో తెలిపిన దానిని పునరుద్ఘాటించింది,"అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా మార్పుచెందింది"అని తెలిపింది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ జులై 1963 ప్రత్యుత్తరంలో "మన యుగసారాంశం, పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి పరివర్తన, రెండు సామాజిక వ్యవస్థల పోరాట యుగం సోషలిస్టు జాతీయ విప్లవాల యుగం, సామ్రాజ్యవాదపు వలస విధానం నమసిపోయే యుగం, ప్రపంచమంతటా సోషలిజం, కమ్యూనిజం విజయం పొందేయుగం అని వివరించింది.

ఒక్క మాటలో సామ్రాజ్యవాదం, కార్మికవర్గ విప్లవాల యుగం. ఫ్రెంచి, జర్మన్ కార్మిక విప్లవాలు, విజయం పొందిన అక్టోబరు విప్లవాల నేపథ్యంలో లెనినిన్ చెప్పినట్లు "సామ్రాజ్యవాదం, కార్మికవర్గ విప్లవాల యుగంగా'' మాత్రమే పేర్కొనుట సమంజసంగా కన్పడుతున్నది.

మాస్కో 1960 పత్రంలో ''యుగం'' అనే పదాన్నివదలి "మనకాలం'. "యీకాలం'' వాడారు. పెట్టుబడిదారి విధానం సోష లిజంలోనికి పరివర్తన, పరస్పర వ్యతిరేక రెండు సామాజిక వ్యవస్థల మధ్యపోరాటం, సోషలిస్టు జాతీయ విప్లవాల వలస విధాన పతనకాలంగా వివరించింది. ప్రపంచసోషలిస్టువ్యవస్థ నిర్ణయాత్మక పాత్ర, సమాజ చారిత్రికాభివృద్ధి స్వభావాన్ని లక్షణాలను నిర్ణయిస్తుందని, సోషలిస్టు పరివర్తన చారిత్రిక సత్యమని; సామ్రాజ్యవాదం యీ చారిత్రిక పురోగమనాన్ని ఆపజాలదన్నది మాస్కోపత్రం.

పెట్టుబడిదారి విధాన సంక్షోభం మూడవదశకు చేరిందని, ప్రపంచశక్తుల బలాబలాలలో సోషలిజానికి ఆధిక్యతలభించిందని,వైరుధ్యాలు మరింత అధిక మయ్యాయని తెలిపింది. ఈ యుగంలో అంతర్జాతీయంగా "సోషలిస్టు విజయం ఎజెండాలోనికి

వచ్చింది." యిది వాస్తవం. చైనా రచనలు యీ విషయాన్ని నొక్కి చెప్పాయి వివాదం లేదు. అలాగే యుద్ధోన్మాద శక్తులపై ప్రపంచశాంతి శక్తులు ఆధిక్యతను సంపాదించాయని, చైనా కమ్యూనిస్టు నాయకత్వం కూడ అదే అభిప్రాయాన్ని కలిగి వుందని వెలిబుచ్చింది.

మాస్కో ప్రకటనపై "నేడు వాస్తవంగా సమస్యలను ప్రజల శాంతికి, ప్రజాస్వామానికి, సోషలిజానికై పరిష్కరించే అవకాశాలున్నవని" భారతకమ్యూనిస్టు పార్టీ వ్యాఖ్యానించి, "ప్రపంచాభివృద్ధి పరస్పర వ్యతిరేక రెండు సామాజిక వ్యవస్థల మధ్య పోరాటక్రమ ఫలితాలపై ఆధారపడి వుందని మాస్కోపత్రం, 1960, స్పష్టం చేసిందన్నది. చైనా అధికారప్రకటనలు, పత్రాలు యీ విషయంగా యే అభిప్రాయం వెల్లడించలేదు.

భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) 1968 బర్ద్వాన్ ప్లీనంవరకు సిద్ధాంత సమస్యలపైచర్చ అధికార ప్రకటనను వాయిదావేసి చివరకు యుగపు స్వభావంపై యిచ్చిన వివరణ 1957, 1960 అంతర్జాతీయ వుద్యమ సమావేశాల అవగాహనను పూర్తిగపోలివుంది, భారత కమ్యూనిస్టుపార్టీ అవగాహనకూడ భిన్నంగాలేదు. కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టులు) మధురై పార్టీ కాంగ్రెసు సిద్ధాంత ముసాయిదా పత్రాన్ని వ్యతిరేకించుతు ప్రధాన సిద్ధాంత సమస్యలపై ఎట్టినిర్దిష్ట అభిప్రాయాన్ని పంథాను చూచించలేదని, పాలకొల్లు ప్లీనంలో ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు పార్టీ వొక తీర్మానాన్ని ఆమోదించింది. నూతన యుగాన్ని శాంతియుత పరివర్తన యుగంగా పరిగణించి దానిపై ఆధారపడి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం శాంతి, శాంతియుత సహజీవనము శాంతియుత ఆర్థికపోటీ శాంతియుత పరివర్తన రాజీ, సంప్రదింపులు, అమెరికాతోపొత్తు విధానం ప్రపంచ ఆధిపత్య భాగస్వామ్య విధానంగా రూపొందించిందని తీవ్రంగా విమర్శించింది.

ఈ యుగంలో సోషలిజానికి సామ్రాజ్యవాదానికి, సామ్రాజ్యవాదానికి జాతీయ విముక్తి ఉద్యమాలకు గల వైరుధ్యాలు ప్రపంచ వైరుధ్యాలు మౌలికమైనవి. అంతేగాక సామ్రాజ్యవాదుల మధ్యగల వైరుధ్యాలు వివిధ గుత్తపెట్టుబడిదారుల మధ్యగల వైరుధ్యాలు పెట్టుబడిదారి దేశాలలో బూర్జువావర్గానికి శ్రామిక వర్గానికిమధ్యగల వైరుధ్యాలు మౌలికమైనవి. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో యీ అవగాహనలో భేదాభిప్రాయాలులేవు. వివిధ దేశాల పరిణామ క్రమాలను, వైరుధ్యాల మధ్యగల సంబంధాలను, కీలకాంశాలను, స్వభావాలను విశ్లేషణచేసి పోరాట పంథాలను నిర్ణయించుటలోనే భేదాభిప్రాయాలున్నవి.

సామ్రాజ్యవాదం సోషలిజంల మధ్యగల వైరుధ్యం ప్రధాన మౌలికమైనదని సోవియట్ వైఖరికాగా, సామ్రాజ్యవాదం వలస దేశాల ప్రజలమధ్యగల వైరుధ్యం తుఫానుల కేంద్రమని చైనా వైఖరిగా వుంది. ఈ రెండు వైరుధ్యాలు ఒకేటాని

రెండు పార్శ్వాలుగ సమగ్రంగా చూడజాలకపోవుటలో అసలు పొరపాటు కన్పించు చున్నది. ఒక యుగం బహుదీర్ఘ కాలపరిమితిగలది కాన వైరుధ్యాల ప్రాధాన్యతా క్రమం పరిస్థితుల బట్టి మారుతు పోరాట కేంద్రాలలో అది ప్రతిబింబించుతుంది. సమస్యను యాంత్రికంగా కాక పరిణామక్రమంలో శాస్త్రీయంగా పరిశీలించిన స్పష్టమౌతుంది.

## (2)

యుద్ధం శాంతి సమస్యపై సామ్రాజ్యవాదం వున్నంత వరకు యుద్ధాలు అనివార్యం అనే లెనిన్ సిద్ధాంతాన్ని చరిత్ర రుజువు చేసింది. "శాంతి రక్షణ బాధ్యతను ప్రజలు హస్తగతం చేసుకొని దానిని ఆద్యంతమూ కాపాడగలిగితే శాంతినిపదిలంగా నిలబెట్టుట సాధ్యమని" స్టాలిన్ చెప్పారు. అయితే అమెరికా పెట్టుబడిదారి కూటమికి ఆధిపత్యం వహించినందున యుద్ధాలు అనివార్యం కావడం ఆగిపోయినట్లు కొందరు భావించుటను తీవ్రంగా విమర్శించారు. సామ్రాజ్యవాదం యుద్ధాలను సృష్టించుచున్నదనే విషయం యిక యే మాత్రం సరికాదనే లెనిన్ సిద్ధాంతంపైగల తప్పుడు అభిప్రాయాలను స్టాలిన్ తిరస్కరించాడు. స్టాలిన్ 1951-52 సిద్ధాంత చర్చల ముగింపుగా "పెట్టుబడిదారి దేశాల మధ్య యుద్ధాలు అనివార్యం అన్న సూత్రం చెల్లుతుందని" స్పష్టంచేయుటయేగాక యుద్ధం అనివార్యతను నివారించాలంటే సామ్రాజ్యవాదాన్ని నాశనం చేయుట అవసరం అన్నారు. "నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారించుట సాధ్యం" అని మావో జూన్ 1950లో స్పష్టం చేశారు.

మాస్కో 1957 ప్రకటన "నేడు శాంతి శక్తులు అత్యంతబలాన్ని గలిగి యుద్ధ ప్రమాదాన్ని అరికట్టగలిగిన శక్తిని, అవకాశాలను కలిగివున్నవని" తెలిపింది. యుద్ధం శాంతి సమస్యను 1960 ప్రపంచ కమ్యూనిస్టుల సమావేశం లోతుగా పరిశీలించి 1957 ప్రకటనను స్థూలంగా పునరుద్ఘాటించింది పెట్టుబడిదారి విధానం-యుద్ధం విడదీయరాని కవల పిల్లలు అని, కార్మికవర్గ శ్రేణులు ఐక్యమై యుద్ధ వ్యతిరేక పోరాటానికి పిలుపునిచ్చి శాంతిని పరిరక్షించాలని కోరింది.

చైనా-భారత దేశాలు ప్రవచించిన పంచశీల సూత్రాలు బాండుంగు సమావేశంలో అసియా-ఆఫ్రికా శాంతి ప్రియుల ఆమోదం పొంది ప్రపంచ యుద్ధ వ్యతిరేక శాంతి పోరాటానికి అత్యంత బలాన్ని చేకూర్చాయి. తద్విరుద్ధంగా అమెరికా దాని "మిత్ర సైనిక కూటాలు", "శీతలయుద్ధం" బలమైన స్థానాలనుండి అనే సిద్ధాంతాలు అణుయుద్ధంలో మానవాళిని నాశనం చేస్తాయి.

సామాన్య సంపూర్ణ నిరాయుధీకరణ, యుద్ధ అవకాశాలను నిర్మూలించుట సామ్రాజ్యవాద శక్తులనుండి తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొనవలసి వచ్చింది, ప్రతిగా

ఆయుధ నిర్మాణపోటీ ప్రపంచ అణుయుద్ధ ప్రమాదాన్ని చేరువకు తెస్తుంది, కాని సామ్రాజ్యవాదులు, చెబుతున్నట్లు యుద్ధాన్ని నిరోధించజాలదు.

మావో 1955లోనే ఫిన్లండు రాయబారితో "చైనా-ఫిన్లండు సంబంధాలు పంచశీల సూత్రాలపై ఆధారపడి వున్నవి" అని "నేడు ప్రపంచ యుద్ధ ప్రమాదం అమెరికా యుద్ధోన్మాదులు చైనాను బెదరించుటతోను మా తైవాన్‌ను తైవాన్ జలాలను ఆక్రమించి అణుబాంబుల యుద్ధాన్ని ప్రస్తావించుటతో కలుగుచున్నది. మేము యుద్ధాన్ని కోరము మాపై దాడి జరిపితే, ఎదురుదాడి చేస్తాము. అమెరికా మూడవ ప్రపంచ యుద్ధాన్ని ప్రారంభించితే వారు భూమిపై నుండి తుడిచి వేయబడతారని హెచ్చరించారు.

కృశ్చేవ్ 20వ పార్టీ కాంగ్రెసులో 1957 మాస్కో కమ్యూనిస్టు సమావేశంలో స్టాలిన్‌ను తెగనాడి "శాంతియుత పరివర్తన" సిద్ధాంతాన్ని ప్రతిపాదించి **అణుయుద్ధం మానవజాతిని నిర్మూలనం చేస్తుంది. కాన ఎంతటి మూల్యమైనా చెల్లించి అణుయుద్ధాన్ని నిరోధించాలి" అన్నాడు.**

కృశ్చేవ్ అణుసాంకేతిక విజ్ఞానాన్ని చైనాకు **అందచేయకుండుటయేగాక** అమెరికాతో గాలిలో అణుఆయుధ ప్రయోగాల నిషేధపు ఒడంబడికచేసుకొన్నాడు. "చైనా స్వంత అణు ఆయుధాలను చేయకుండుటకు చైనాను అణుస్టెరిలైజేషన్" చేయాలని వాషింగ్టన్ వర్గాల తలపు అడిఆశ అయింది.

"యుద్ధాన్ని నిరోధించుటకు మంచిమార్గం రక్షణకు సరియైన వ్యూహం, ఎత్తుగడలు, అవసరమైన ఆయుధ సంపద, మూడవ ప్రపంచ మధ్యస్థమండలంలో జాతీయ విముక్తి వుద్యమాలకు పూర్తి మద్దతువిచ్చుట. "సామ్రాజ్యవాద బలం తృతీయ ప్రపంచంలోని ముడిసరుకుల లభ్యతపై ఆధారపడి వున్నందున దానిని నిరోధించుట సామ్రాజ్యవాదాన్ని నిర్వీర్య చేయుట అగుతుంది. శత్రువును వ్యూహరీత్యా తేలికగాను, ఎత్తుగడల రీత్యా తీవ్రంగా పరిగణించుటనే "అలంకారికంగా", పశ్చిమ పవనంపై తూర్పు పవనం ఆధిక్యతను కలిగి వుందని" మావో చెప్పారు. చైనాపాల్గొనని సంతకం చేయని అంతర్జాతీయ ఎట్టి ఒడంబడికలకు చైనా కట్టుబడి వుండజాలదని నిజమైన నిరాయుధీకరణను బలపరస్తుందని చైనా ప్రభుత్వం ప్రకటించింది.

కృశ్చేవ్ "అన్ని యుద్ధాలను నివారించవచ్చని" "ఆయుధాలు సాయుధసైన్యం యుద్ధాలులేని ప్రపంచాన్ని "సామ్రాజ్యవాదం వున్నపుడే ఆవిష్కరించ వచ్చని తీవ్ర ప్రచారం" చేసారు. ప్రపంచ యుద్ధాన్ని నివారించుటవేరు. అన్ని రకాల యుద్ధాలను నివారించుట అంటే వలస ప్రజల స్వతంత్ర పోరాటాలను, దోపిడి

వ్యవస్థపై ఆదేశ శ్రామిక ప్రజానీకపు తిరుగుబాటు పోరాటాలను వ్యతిరేకించుటగా చైనా అభిప్రాయము.

భారత కమ్యూనిస్టు మార్క్సిస్టు వర్గాలు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ కాంగ్రెసు "యుద్ధం అనివార్యం కాదు" అని చెప్పుట సరియైనదేయని, సామ్రాజ్య వాద దురాక్రమణ యుద్ధాలు, సోషలిజాన్ని నాశనం చేయాలని సామ్రాజ్యవాదం చేయు యుద్ధాలు, సామ్రాజ్యవాద వ్యతిరేక వలస ప్రజల పోరాటాలు, ప్రజలుదోపిడి వ్యవస్థపై చేయు పోరాటాలు అన్నిటిని వొకే గాటనకట్టి, వేరువేరుగా చూడజాలక పోవుటను తీవ్రంగా విమర్శించి, చైనా అవగాహనను బలపరచారు. సామ్రాజ్య వాదుల మధ్య యుద్ధలు అనివార్యం అని లెనిన్ సిద్ధాంతాన్ని వొకవైపు వల్లిస్తూనే, మరోవైపు యుద్ధాలు విధిగా అనివార్యం కాదు అని చెప్పుట తీవ్రమైన అనుమానా లకు తావిస్తుందని విమర్శించారు. మాస్కో 1957 ప్రకటన, 1960 ప్రపంచ కమ్యూ నిస్టుపార్టీల సమావేశ పత్రం, సోవియట్ 20 వ పార్టీ కాంగ్రెసు సిద్ధాంతాలను మెరుగుపరచి, సరియైన అంశాలను, మొత్తం సద్ధాంతాన్ని విశదీకరించి, నూతనాంశా లను చేర్చి సమగ్రతను చేకూర్చింది. సామ్రాజ్యవాదం, యుద్ధం, శాంతి సమస్యలపై రివిజనిజానికి, అవకాశవాదానికి తావులేకుండా చేసినదని మార్క్సిస్టుపార్టీ అభి ప్రాయము." సోవియట్ నాయకత్వం 1960 మాస్కో పత్రం అవగాహన నుండి వైదొలగినట్లు మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ విమర్శించింది.

భారత కమ్యూనిస్టుపార్టీ మాస్కో ప్రకటన ప్రపంచయుద్ధం అణుయుద్ధమగు తుందని మానవజాతి నాశనానికి దారితీస్తుందని, కాన నివారించాలని, అది సాధ్యమని చెప్పిన దానిని బలపరచింది. చైనా నాయకత్వం అణుబాంబును కాగితపు పులి, అంత భయంకరమైనది కాదనుట ఆశ్చర్యాన్ని కలుగజేస్తున్నదని అంది. అంతేగాక "అణు యుద్ధంలో సామ్రాజ్యవాదం సర్వనాశనమవుతుందని, ఆ శిధిలాలపై విజయం పొందిన ప్రజలు పెట్టుబడిదారి సంస్కృతికంటె వెయ్యిరెట్లు మిన్నయైన సంస్కృ తిని అత్యంత వేగంగా సృష్టిస్తారని చైనా "లెనినిజం వర్థిల్లాలి" అనే కరపత్రంలో చెప్పుటకు మించిన ఘోరం లేదన్నది. మాస్కో ప్రకటన పత్రం సామ్రాజ్యవాదం వున్నంత వరకు యుద్ధాలకు సారవంతమైన క్షేత్రముంటుందని అంగీకరిస్తూనే, నేటి యుగంలో యుద్ధ వినాశనం అనివార్యం కాదని చెప్పింది. సామ్రాజ్యవాద నైజం మారకపోయినా, అది యుద్ధాన్ని తీసుకొని రాగలిగిన రోజులు గతించాయనే అనే అభిప్రాయాన్ని కలిగి వుంది. శాంతిశక్తుల బలమైన నిర్మాణ కార్యాచరణ ప్రపంచ శాంతిని సమర్థవంతంగా పరిరక్షించగలవని భారత కమ్యూనిస్టుపార్టీ విశ్వాసం.

యుద్ధం అనివార్యం కాదనే అవగాహనతో ప్రపంచ శాంతి, ప్రజాస్వామ్య శక్తులు నిరవధికంగా శాంతి ప్రజాపోరాటాన్ని సాగించాలి, కాని యుద్ధం అనివార్యం అన్న లెనిన్ సిద్ధాంతాన్ని మరచి వేమరుపాటున వుండరాదు.

## (3)

శాంతియుత సహజీవన సిద్ధాంతాన్ని, అక్టోబరు విప్లవ విజయానంతరం నూతన సోషలిస్టు ప్రభుత్వపు విదేశాంగ విధానపు మౌలిక సూత్రంగా లెనిన్ ప్రతిపాదించాడు. "విభిన్న సామాజిక వ్యవస్థల, దేశాల పరస్పర సంబంధాలు, శాంతియుత సహజీవనం" అనే సూత్రంపై ఆధారపడి వుండాలని, అది సాధ్యం, మన కర్తవ్యం" అని లెనిన్ అన్నారు.

లెనిన్ కామింటరను 4 వ కాంగ్రెసులో "పెట్టుబడిదారి విధానాన్ని కూలద్రోయుటకు, ప్రపంచ కార్మికులు సాగిస్తున్న పోరాటంలో, ప్రధానంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో పీడిత ప్రజలందరితోను చేతులు కలుపుటయే కార్మిక ప్రభుత్వ విదేశాంగ విధానమని" స్పష్టం చేసారు. ఇదే విషయాన్ని లెనిన్ తదనంతరం స్టాలిన్ బోల్షివిక్ పార్టీ 15 వ కాంగ్రెసు రాజకీయ నివేదికలో "పరస్పర విరుద్ధమైన రెండు సామాజిక వ్యవస్థల మధ్య సహజీవనం సాధ్యమన్న భావం, పెట్టుబడిదారి దేశాలతో మన సంబంధాలకు ఆధారం, ఆ దేశాలతో శాంతి, సహజీవన సంబంధాలు కొనసాగించుట మన కర్తవ్యం" అని అన్నారు.

దీర్ఘ కాల అవగాహనపై లెనిన్ "యుద్ధం-శాంతి సమస్య"పై నివేదికలో "అంతర్జాతీయ సామ్రాజ్యవాదం, సోవియట్ రిపబ్లిక్‌తో దాని సరసన నివసించలేదు. దీనికి రెండు కారణాలున్నవి. ఒకటి దాని భౌతిక పరిస్థితి, రెండు పెట్టుబడిదారి వర్గపు అర్థిక ప్రయోజనాలు. సోవియట్ యూనియన్, సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఒకదాని సరసన మరొకటి మనగలుగుట అసూహ్యం, చివరకు యేదో వొకటి జయించి తీరాలి." రెండింటికి చివరి రోజువరకు "మధ్య భీషణ సంఘర్షణలు అనేకం జరుగుట అనివార్యం" అని 8 వ పార్టీ కాంగ్రెసు నివేదికలో పేర్కొన్నారు. కావున సదా జాగరూకులమై వుండాలని హెచ్చరించారు, శాంతియుత సహజీవన సిద్ధాంత ఆచరణ 'కత్తిమీద సాములాంటిదనే' అర్థం స్పష్టము.

శాంతియుత సహజీవనం, రెండు వర్గవ్యవస్థల మధ్య జరిగే వొక వర్గపోరాట రూపంగా వివరించబడింది. మాస్కో 1957 సమావేశంలో శాంతియుత సహజీవనం, శాంతియుత పరివర్తన, శాంతియుత పోటీలపై సంయుక్తంగా చర్చలలో, తదనంతర కాలంలో వచ్చిన తీవ్ర వ్యతిరేక విమర్శనల దాడి నుండి సమర్థించుకొనుటకు శాంతియుత సహజీవనాన్ని మరో వర్గపోరాట రూపంగా సోవియట్, వారినమనరించే కమ్యూనిస్టుపార్టీలు ప్రచారంలో పెట్టాయి. కాని ఆచరణలో పూర్వ విధానాలే కొనసాగాయి. సోషలిస్టు ప్రభుత్వం సామ్రాజ్యవాద దేశాలతో శాంతియుతంగా జీవించుట పోరాటం ద్వారానే సాధ్యమని లెనిన్ స్పష్టపరచారు. శాంతియుత సహజీవనమే

సర్వస్వమని లెనిన్ చెప్పలేదు. ఆ పేరు జెప్పి జాతీయ విముక్తి విప్లవాలకు, కార్మి కోద్యమాలకు చేయు సహాయాలపై పరిమితులు, షరతులు విధించు ప్రయత్నాలు జరుగలేదు. రెండు సామాజిక వ్యవస్థల మధ్య అంతర్జాతీయంగా జరుగుతున్న వర్గ పోరాటాన్ని, "కేవలం భావాల మధ్య పోరాటంగా" రూపొందించవలసిన అవసర ముందని చెప్పే ప్రయత్నం జరిగింది. ప్రపంచ సోషలిస్టు, పెట్టుబడిదారీ వ్యవస్థల వర్గ పోరాటాన్ని కేవలం భావాల పోరాటంగా పరిమితం చేయు ప్రయత్నం మార్క్సి జం, లెనినిజంల నుండి దూరం చేయుట అనునది స్పష్టం.

సోషలిస్టు, సామ్రాజ్యవాద దేశాల శాంతియుత సహజీవన సిద్ధాంత, ఆచర ణలో ఆర్థిక, రాజకీయ, సామాజిక, సైద్ధాంతిక రంగాలలో పోరాటం అనివార్యం కాన, కేవలం "భావాల మధ్య పోరాటంగా" చిత్రించుట తప్పు. ఇతరుల వ్యవహారా లలో జోక్యం కలిగించుకొనకుండా వుండుట అనే సాకుతో ప్రజల విప్లవ విముక్తి పోరాటాలను, వుద్యమాలను, అంతర్జాతీయ బాధ్యతలను కొంతవరకు విస్మరించుట జరిగింది.

సామ్రాజ్యవాదశక్తులు శాంతియుత సహజీవనం మరో వర్గపోరాట రూపాన్ని ప్రపంచాధిపత్య లక్ష్యాన్ని చేబట్టుటకు "ఆటంబాంబు కన్న మంచి ఆయుధమని" అదే శాంతి వ్యూహంగా అనుసరించారు. ఐసెన్‌హోవర్ "ఈనాడు నియంతృత్వ దౌర్జన్య పద్ధతుల ద్వారా అణచబడియున్న ప్రజలు స్వేచ్ఛగా వోట్లద్వారా తమ మార్గాన్ని నిర్ణయించుకోనే హక్కు సంపాదించుకొనుటకు అమెరికా శాంతి పద్ధతుల ద్వారా చేయగలిగినదంతా చేస్తుందని" అన్నాడు. కెన్నడీ యింకా స్పష్టంగా "సోవి యట్ సామ్రాజ్యంలో యీనాడు జరుగుతున్న మార్పులు ప్రజల స్వాతంత్ర్యానికి, ప్రపంచ శాంతికి దోహదమిస్తాయి, కాన మనం చేయగలిగినదంతా చేయాలి" అన్నాడు. "తూర్పు యూరపులోని సోషలిస్టు దేశాలలో స్వాతంత్ర్యం కొరకు ఓపికతో అక్కడి శక్తులకు ప్రోత్సాహమివ్వటం, నియంతృత్వ ప్రభుత్వంపై (జనతంత్ర ప్రభుత్వాలపై) వొత్తిడి తేవటం తన పవిత్ర విధానంగా అవలంభించా లని ఆ విధంగా యీ దేశాలలో స్వేచ్ఛతో కూడిన అవకాశాన్ని కలుగజేస్తానని కూడ కెన్నడీ అన్నాడు. ఈ మాటల అర్థం స్పష్టం. సోషలిజాన్ని నియంతృత్వమనీ సోషలిస్టు అధికారాన్ని సోవియట్ సామ్రాజ్యమనీ నిందించి, విప్లవ ప్రతిఘాతక శక్తులకు ప్రోత్సాహమివ్వటాన్ని స్వేచ్ఛాపూరిత అవకాశమివ్వటమని అమెరికన్ సామ్రాజ్యవాదులంటున్నారు. వారి శాంతియుత సహజీవనాన్ని నాశనం చేయుటతప్ప మరొకటి గాదు.

సోవియట్ యూనియన్ తూర్పుయూరపు సోషలిస్టు మితవాద శక్తులు శాంతి యుత సహజీవనాన్ని ప్రాక వర్గ పోరాట రూపంగా చిత్రించినా, ఆచరణలో పూర్తి వైఫల్యాల ఫలితంగా, యీ శతాబ్దపు చివరి దశకాలలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ

అంతర్గతంగా మితవాద ప్రతిఘాతక శక్తుల విజృంభణ, బాహ్యంగా సామ్రాజ్యవాద శక్తుల, కుట్రలు సహాయాల ఫలితంగా కుప్పగా కూలిపోయింది. సామ్రాజ్యవాదుల సహాయంతో పెట్టుబడిదారి విధానం పునరుద్ధరించబడుతున్నది. లెనిన్, స్టాలిన్ హెచ్చరించిన సోషలిస్టు జాగరూకత లోపించిన ఫలితంగా మితవాద, సంస్కరణవాద శక్తుల అంతర్గత కుట్రలతో, కార్మికవర్గ సోషలిస్టు శక్తులను నిర్వీర్యంచేసి విజయాన్ని సాధించాయి. సామ్రాజ్యవాదులు నిజంగానే శాంతియుత సహజీవనాన్ని ఆటంబాంబు కన్న శక్తివంతమైన ఆయుధంగా వారి వర్గపోరాటంలో శ్రామికవర్గంపై వుపయోగించి, హిట్లరు రెండవ ప్రపంచ యుద్ధంతో సాధించలేని, 'కమ్యూనిజపు నాశనాన్ని' గణనీయంగా సాధించారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ వైఖరిని బలపరచే మార్క్సిస్టు పార్టీ వర్గాలు సోవియట్ యూనియన్ శాంతియుత సహజీవన సిద్ధాంత ఆచరణ పద్ధతులను తీవ్రంగా విమర్శించినా చివరకు బలపరచారు. భారత కమ్యూనిస్టుపార్టీ మితవాద సంస్కరణవాద వర్గాలు సోవియటు కమ్యూనిస్టుపార్టీ విధానాలను పూర్తిగ బలపరచుటయేగాక, భారతీయకరణకు ప్రయత్నాలు జరిగాయి. మాస్కో ప్రకటనలు వలన విముక్తి విప్లవ పోరాటాలకు నైతిక, భౌతిక సహాయాలను చేయుట అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ కర్తవ్యంగాని విస్మరించారు. అట్టి పరిస్థితులలో అట్టి సహాయాన్నివ్వటానికి శాంతియుత సహజీవనానికి వైరుధ్యమెక్కడా లేదనేది స్పష్టం.

## (4)

సోషలిజంలోనికి పెట్టుబడిదారి విధానం శాంతియుత పరివర్తన సిద్ధాంతం అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో అత్యంత వివాదగ్రస్తమైన అంశమైంది.

మార్క్స్ 1870లో గుత్తపెట్టుబడి సామ్రాజ్యవాదంగా రూపొందనప్పుడు కార్మికవర్గం గణనీయంగా వున్న దేశాలలో శాంతియుత పరివర్తనమార్గాలు యేర్పడవచ్చునని, లెనిన్ ఫిబ్రవరి అనంతరం "సోవియట్లకే సర్వాధికారాలని ప్రకటించి,విప్లవం శాంతి మార్గంలో పురోగమించునని ఆశించారు. బూర్జువారాజ్యాంగ యంత్రాన్ని యధాతధంగా సోషలిజం వినియోగించజాలదన్నారు.

మాస్కో 1957 ప్రకటన "సోషలిజంలోనికి వివిధ పరివర్తన రూపాలున్నవని" "శాంతియుత పరివర్తన" కార్మికవర్గ ప్రయోజనాలకు అనుగుణమైందని తెలిపింది. అంతర్జాతీయంగా సోషలిజం నిర్ణయాత్మక శక్తి యగుట బలాబలాలలో వచ్చిన మార్పులవలన "అంతర్యుద్ధం లేకుండా రాజ్యాధికారాన్ని పొందగల అవకాశాలు యేర్పడినవని, అంతేగాక "కార్మికవర్గం నేడు అభివృద్ధి నిరోధకశక్తుల ప్రతిఘటనను చిత్తుగావించి, పార్లమెంటులో ఆధిక్యత సంపాదించి, బూర్జువా పార్లమెంటును కార్మికవర్గ ఆయుధంగా చేసి, ప్రజల ప్రయోజనాలకు వుపయోగించగల అవకాశాలు

యెక్కువయ్యాయి. అభివృద్ధి నిరోధకులు పార్లమెంటేతరమార్గంలో ప్రతిఘటించిన్లు అణచివేసి సోషలిస్టు విప్లవాన్ని శాంతియుతంగా కొనసాగించుటకు తగిన పరిస్థితులను సృష్టించగలరని"వివరించింది. మాస్కో 1960 సమావేశం 1957 ప్రకటనను పునరుద్ఘాటించి, వివరించింది. అంతేగాక "పాలకవర్గాలు ప్రజలపై హింసాకాండను సాగించితే సోషలిస్టు పరివర్తన శాంతియేతర మార్గాలలో సాధ్యమని గుర్తుపెట్టుకోనాలని హెచ్చరించింది.

చైనా కమ్యూనిస్టు ప్రతినిధివర్గం మావో నాయకత్వంలో 1957 సమావేశంలోనే, సోషలజంలోనికి పెట్టుబడిదారి విధాన శాంతియుత పరివర్తన, సిద్ధాంతాన్ని వ్యతిరేకించింది. తిరిగి 1960 సమావేశంలో పెట్టుబడిదారివిధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన సిద్ధాంతాన్ని పూర్తిగ వ్యతిరేకించింది. సౌహార్ధ ప్రతినిధుల కోరికపై సాధారణ అవగాహన పత్రాన్ని సమావేశం తిరిరి తయారుచేసింది. ముఖ్య వివాదంశమైన శాంతియుత సహజీవన, శాంతియుత పరివర్తన. శాంతియుత పోటీ సిద్ధాంత అంశాలను 1957 ప్రకటనలోని వాటినే యధాతధంగా వుదహరించుటను ఆమోదించింది. అదే కాలంలో 1957లో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితికి సమర్పించిన డిశెంటుపత్రాన్ని సమావేశపు ప్రతినిధులందరికి చైనాపార్టీ పంచింది. అంతర్జాతీయ ఐక్యతకై ఆమోదించింది. చైనా కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకత ఫలితంగా పరివర్తనరూపాలలో "శాంతియేతర మార్గాలలో" అని కూడ చేర్చినా "విప్లవంలో బలప్రయోగం విశ్వసూత్రంగా" నొక్కి చెప్పటంలో విఫలమైంది. సోవియట్ కమ్యూనిస్టు నాయకత్వం 1957 ప్రకటన 1960 పత్రాలలోని యీ లోపాలను అవకాశంగా తీసుకొని, కృశ్చేవ్ మితవాదాన్ని చేబట్టుటకు సాకుగా వుపయోగపడింది.

రెండవ ప్రపంచ యుద్ధనంతరం చిలీ, ఫ్రాంసు, ఇటలీలలో కమ్యూనిస్టులు పార్లమెంటరీ పోరాటాలలో గణనీయమైన విజయాలు సాధించి, ఫ్రాంసులో బూర్జువావర్గపాలనలో భాగస్వాములగుట, అమెరిక సామ్రాజ్యవాదుల వొత్తిడితో ప్రభుత్వం నుండి తొలగించుట, తదనంతరం ఫ్రెంచి రాజ్యాంగ,ఎన్నికల చట్టాలలో మార్పులు చేర్పులతో కమ్యూనిస్టులు గత ఎన్నికలలో వచ్చినన్ని వోట్లను సంపాదించినా, ప్రాతినిధ్యబలాన్ని కోల్పోవుటాది అనుభవాలు మరువరానివి. చిలీలో అభివృద్ధి నిరోధకులు అమెరికా మద్దతుతో ముఖ్యావసరాల సంక్షోభాన్ని సృష్టించి, పార్లమెంటేతర మార్గాలలో తిరుగుబాటును, సైనికవర్గాల లాలూచీతో కావించి, చిలీ శాంతియుత పరివర్తన, మరోవర్గపోరాట రూపాన్ని రక్తపుచేరులలో ముంచినాశనం చేయుట చేదునిజం. తూర్పు యూరపు అక్టోబరు మార్గాన్ననుసరించి విజయం పొందింది. చైనా నుండి క్యూబా వరకు ప్రజాసాయుధ పోరాటవిజయాలతోనే బూర్జువా వర్గాన్ని త్రోసివేసి నిజమైన రాజ్యాధికారాన్ని పొందుట మరువరాని నేటి అనుభవం. పార్ల

మెకటరీ, సాయుధ పోరాట మార్గాలు రెండు మౌలికంగా భిన్నమార్గాలు. బూర్జువా రాజ్యాంగ యంత్రాంగాన్ని యధాతథంగా అధిరోహించుట వొకటి, ఆ రాజ్యాంగ యంత్రాంగాన్ని రూపుమాపి, అధికారాన్ని స్వాధీనం చేసుకొని నూతన రాజ్యాంగ నిర్మాణం మరొకటి, రెండు మౌలిక భిన్నమార్గాలు, రెండుమౌలిక భిన్న ఫలితాలు అనుభవ సత్యాలు, పేమరుపాటు ప్రమాదకరము. విశితంగా అధ్యయనం చేయవలసిన అంశాలు.

భారత కమ్యూనిస్టు వుద్యమంలోని మితవాదవర్గం, మాస్కో సమావేశాల శాంతియుత సహజీవనం, సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన, శాంతియుత పోటీ సిద్ధాంతాలపై వచ్చిన తీవ్ర విమర్శనల దాడిని ఎదుర్కొనుటకై సోవియట్ కమ్యూనిస్టుపార్టీ మరో వర్గ పోరాట రూపాలుగ యిచ్చిన నూతన వ్యాఖ్య, వివరణలను పూర్తిగ భుజాన వేసుకొని, భారతదేశంలో అట్టి 'శాంతియుత పరివర్తన రూపాలకై' పరిశీలన, ప్రయత్నాలు ప్రారంభించారు.

భారత కమ్యూనిస్టు వుద్యమంలోని అతివాదవర్గం 1957 నుండి చైనా అవగాహనలను ప్రధానంగా మరో మాటలలో బలపరస్తూ వచ్చింది. మార్క్సిస్టుపార్టీగ యేర్పడి తదనంతరం బర్ద్వాన్ 1968 ప్లీనంలో మాత్రమే అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సిద్ధాంత సమస్యలపై తన వైఖరిని స్పష్టం చేసింది. లెనిన్ "రాజ్యాంగం విప్లవం" అన్న సిద్ధాంత మౌలికాంశాలను పునరుద్ఘాటించి, ఒక వర్గాన్ని అణచివేసే హింసాపూర్వక నిర్మాణమే రాజ్యాంగమని, అదే బూర్జువావర్గ నియంతృత్వం, అదే విధంగా కార్మికవర్గ రాజ్యాలు యే రూపంలో వున్నా సారాంశం, కార్మికవర్గ నియంతృత్వాలనుట సత్యదూరం కాదన్నది. పరోక్షంగా చైనా అవగాహనను బలపరచింది.

చరిత్రలో "ప్రజాస్వామ్య నినాదంతో ప్రజాస్వామ్యాన్ని నాశనం చేసి నియంతృత్వాలను స్థాపించిన వుదంతాలు", "జాతీయ సోషలిజం" పేరుతో "నాజీ నియంతృత్వం" నెలకొల్పుట, ప్రజాస్వామ్య పునరుద్ధరణ పేరుతో సామ్రాజ్యవాద శక్తులు, "మానవత్వ సోషలిజం" అన్న పేరుతో సంస్కరణవాద కమ్యూనిస్టులు సోవియట్ యూనియన్, తూర్పు యూరపు దేశాలలో వున్న "సోషలిస్టు వ్యవస్థ"ను నాశనం చేసి పెట్టుబడిదారి విధానాన్ని పునరుద్ధరించు ప్రయత్నాలు మననం చేసుకొనునపుడు మనం వింటున్న "శాంతి, అహింసా మార్గంలో సోషలిజం" "దేశీయ సోషలిజం" అన్న నినాదాలలోని ప్రమాదాన్ని అతివాద వర్గాలు గమనించాలి. ఇట్టి ప్రయత్నాలలోని భాగంగానే "హిందూ సోషలిజం" అన్న నినాదాన్ని మతతత్వవాదులు చేబట్టి నియంతృత్వ స్థాపన ప్రయత్నాలు జరిపినా ఆశ్చర్యపడనక్కరలేదు. వాస్తవానికి గతంలో జనసంఘం, ఆ నినాదాన్ని యిచ్చి వుండుట మరువరాదు.

# (5)

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం వలస సామ్రాజ్యవాద పతనంతో ఆసియా స్వరూపం అనేక స్వతంత్ర దేశాలు యేర్పడుటతో మారిపోయింది. పాత వలసలలో అమెరికా నియోవలసవాదం విస్తరించ ప్రయత్నించుటతో కొన్ని దేశాలలో సాయుధ విముక్తి ప్రజోద్యమాలు సాగుతున్నవి. ఆఫ్రికాలో వలసతత్వం కూలిపోతున్నది. దక్షిణ అమెరికాలో సామ్రాజ్యవాద వ్యతిరేక సాయుధ పోరాట మరోరంగం తెరవబడింది. మాస్కో 1957 ప్రకటన 1960 పత్రం జాతీయ విముక్తి వుద్యమాలను సమీక్షించి సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక కార్మిక, కర్షక, జాతీయ బూర్జువా, నగర గ్రామీణ మధ్యతరగతి బడుగు వర్గాల ఐక్య సంఘటనా నిర్మాణానికి పోరాటాలకు పిలుపునిచ్చాయి.

సామ్రాజ్యవాదం వున్నంతవరకు దురాక్రమణ యుద్ధాలకు భూమిక ఉంటుందని వలస ప్రజాసామాన్యం సామాన్యంగా సాయుధ పోరాటం ద్వారానే స్వాతంత్ర్యాన్ని పొందగలరని ప్రత్యేక పరిస్థితులలో సైనికేతర మార్గాలలో స్వాతంత్ర్యాన్ని పొందినా అన్ని వర్గాల ఐక్య సంఘటన ద్వారా వలస ఆర్థిక పారిశ్రామిక వ్యవస్థను జాతీయం చేయుట వ్యవసాయ సంస్కరణల ద్వారా తప్ప మరే విధంగా నియోవలస విధానాన్ని కూడ నిర్మూలనం చేయుట సాధ్యం కాదని స్పష్టం చేసింది.

మాస్కో 1960 సమావేశం ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలకు సౌహార్ధ సందేశాన్ని, మద్దతును ప్రకటించింది. జాతి విముక్తికై పోరాడే ప్రజలకు పూర్తి నైతిక, పాదార్థిక సహాయాన్ని అందించుట అన్ని సోషలిస్టు దేశాల, ప్రపంచ కార్మిక కమ్యూనిస్టు పార్టీలు విద్యుక్త ధర్మంగా నెంచుతున్నవని ప్రకటించింది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టి వలస విముక్తి పోరాటం "అంత్యఘట్టానికి" చేరిందని "ఆర్థిక కర్తవ్యాలు పునాదిగా నూతనదశలోనికి ప్రవేశించిందని" అంటూ "గతంలో ప్రధానంగా రాజకీయ పోరాటమని నేడు ఆర్థిక సమస్యలు కేంద్రకర్తవ్యం విప్లవాభివృద్ధిలో 'కొలికిపూస' అయిందనే నూతన సిద్ధాంతాన్ని రూపొందించింది. జాతీయ విముక్తి వుద్యమం "నూతన దశలో ప్రవేశించుట వాస్తవం" కాని సోవియట్ కమ్యూనిస్టు నాయకత్వం చెప్పునట్టి "నూతనదశ" కాదని, "రాజకీయ చైతన్యం అత్యున్నతమై విప్లవోద్యమాలు వుప్పొంగి వెల్లువై తీవ్రతనొంది, భీభత్సంగా జరుగుచున్న పోరాట నూతనదశ" యని చైనా కమ్యూనిస్టుపార్టీ తీవ్రంగా విమర్శించి వ్యతిరేకించింది.

"ఒక చిన్న అగ్నికణం ప్రపంచయుద్ధం-అణుయుద్ధమై మానవజాతి నాశన మౌతుందనే" సత్యాన్ని వక్రీకరించి కృచ్ఛేవ్ "అవి యుద్ధ జ్వాలను రేపకుండా ఆర్పివేస్తామంటూ "లెనిన్" న్యాయ, అన్యాయ యుద్ధాల విచక్షణ సిద్ధాంతాన్ని విడనాడుటను,వలస విముక్తి పోరాటాలకు అన్నివిధాల సహాయాన్నందిచ్చుటలో వెను కాడని చైనా కమ్యూనిస్టుపార్టీ విమర్శించింది. వలస స్వాతంత్ర్య పోరాటాలు ప్రపంచ అణుయుద్ధాన్ని రేకెత్తించజాల వనుటకు వియత్నాం విముక్తి పోరాటమే సరియైన తార్కాణము.

ఇంకా చైనా కమ్యూనిస్టుపార్టీ, నేడు ప్రపంచ వైరుధ్యాలు వలసలలో కేంద్రీ కరించబడినవని, విముక్తి విప్లవ పోరాట కేంద్రాలు సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవ పోరాటాల తుపాన్ల కేంద్రాలయ్యాయని,ప్రపంచకార్మిక సోషలిస్టు విప్లవంలో సామ్రా జ్యవాద పునాదులను పెకలించి వేస్తున్నవని, అంతర్జాతీయ కార్మిక విప్లవ ప్రయోజ నాలు విముక్తి విప్లవ ఫలితాలపై ప్రధానంగా ఆధారపడి వున్నవని; ఇదే సోవి మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంత శాస్త్రీయ విశ్లేషణ అనే వైఖరిని అవలంబించి, సోవి యట్ అవగాహనపై విస్తృత విమర్శనా దాడిని సాగించింది

సోవియటు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, చైనా పార్టీ నాయకత్వ విమర్శ వలను ఖండించుతు, తమ అంతర్జాతీయ విధానాన్ని సమర్థించుకోంటూ, తీవ్ర ప్రతి విమర్శనా పత్రాలను పెక్కింటిని ప్రకటించింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ "లెనినిజం వర్థిల్లాలి" అనే వ్యాసాలలో 1957 మాస్కో ప్రకటన సారాన్ని 1960 వసంతకాలంలో వ్యతిరేకించుటతో సిద్ధాంత పోరాట వివాదం ప్రారంభమైంది. చైనా పార్టీ పత్రిక జెన్‌మిన్‌పావో ఫిబ్రవరి 1963లో "భేదాభిప్రాయాలకు కారణమేమిటి ?" అన్నవ్యాసంతో, భారత-చైనా సరి హద్దు సంఘర్షణలో సోవియట్ యూనియన్, సోషలిస్టుదేశాలు చైనా వైఖరిని ఖలా పరచనందున ప్రారంభమైందని, చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం "సిద్ధాంత పోరాట ఆయుధాన్ని చేబట్టుటలోని ఆంతర్యాన్ని స్పష్టం చేసిందని, సోవియటు నాయకత్వం తీవ్రంగా విమర్శించి, దీనికంతటికి చైనా పార్టీ బాధ్యత వహించవలసి వుందని వివరించింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ జూన్ 14, 1963లేఖలో,మాస్కో 1960 పత్రంలోని కొన్ని సిద్ధాంత ప్రతిపాదనలను, చైనా అధ్యయనాలుగ తిరుగవ్రాసి, జాతీయ

విముక్తి వుద్యమాల అభివృద్ధిని తప్పుడుగ చిత్రించి, ముఖ్యాంశాలను గుర్తించ నిరాకరించిందని సోవియట్ నాయకత్వం విమర్శించింది. లేఖ ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలోని కొన్ని పార్టీలు జాతీయ విముక్తి వుద్యమాలను వ్యతిరేకిస్తున్నవనుట నిందతప్ప మరొకటి కాదన్నారు. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమాన్ని అప్రదిష్టపాలు చేయుటకు వుద్దేశించబడిందన్నారు.

జాతీయ విముక్తి వుద్యమాల సమస్యలను సమగ్రంగా పరిశీలించక, యేకపక్షంగా చైనా పార్టీ పరిశీలించి, అన్నిటిని వొకేగాటన కట్టి, సాయుధ పోరాట దృష్టితో పొరపాటుగ చూస్తున్నదని వాటి చారిత్రికాభివృద్ధిననుసరించి, వుద్యమాలు కొన్ని పూర్తి అర్థ పూర్తి విభిన్న దశలలో వున్నవి, కార్మికవర్గం కమ్యూనిస్టు పార్టీలు యేర్పడలేదు. అంచేత నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు సంక్లిష్ట సమస్యలను నూతనంగా ఎదుర్కొనవలసి వచ్చింది. మార్క్సిజం రాజకీయ స్వాతంత్ర్య సంపాదన వలన వుద్యమాల ప్రథమకర్తవ్యంగా నెంచుతుంది. మాస్కో 1960 సమావేశం యీ దేశాలలో పెట్టుబడిదారేతర మార్గాలలో అభివృద్ధి సాధ్యమని నిర్ధారించిన దానిని చైనా పరిగణించుట లేదని సోవియటు విమర్శన.

చైనాపార్టీ జూన్ 1963 లేఖ, నూతనస్వాతంత్ర దేశాలలో కార్మిక వర్గ నియంతృత్వపు మరో రూపమైన జనతా ప్రజాస్వామ్యం తప్ప మరో మార్గం లేదంటూ కొన్ని దశలను దాటవేయుట, ఐక్యసంఘటనను, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని బలహీనపరుస్తుందని, సోవియటు పార్టీ 'కమ్యూనిస్టు' పత్రిక విమర్శించింది. కార్మికవర్గం, దాని అగ్రగామిదళమైన కమ్యూనిస్టు పార్టీలు లేకుండా, వున్నా నామమాత్రంగా వున్నపుడు కార్మికవర్గ నియంతృత్వం గూర్చి నొక్కి చెప్పుట అసంగతమని పత్రిక విమర్శించింది. అంతేగాక అనేక దేశాలలో జాతీయ ప్రభుత్వాలు యేర్పడి సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని పరిమితులలోనైనా అవలంభించినపుడు సాయుధపోరాట ఎత్తుగడలు ప్రమాదకరమన్నది. అల్జీరియా, ఘనా, మాలి దేశాలలో సాయుధ పోరాటం తక్షణకర్తవ్యంగా నెంచుట, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలను తప్పుడు మార్గం పట్టించుట అగుతుందని సోవియటు అవగాహన చైనా నాయకత్వం జాతీయ విముక్తి వుద్యమాలను తమ ప్రయోజనాలకు వినియోగించు ఆశలను పెంచుకొన్నారని సుస్లోవ్ తీవ్రంగా విమర్శించారు. వాస్తవ పరిస్థితులను, అనుభవాలను చూడక గ్రుడ్డిగా సాయుధపోరాటాలు చేబట్టుట అనవసర త్యాగాలకు, ప్రజలనుండి వేరగుటకు దారితీస్తుందని సామాజికాభివృద్ధికి తోడ్పడక పోగా అడ్డంకి అగుతుందని సుస్లోవ్ అన్నారు.

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సమితి అక్టోబరు 1963లో అంతర్జాతీయ

నూతన పరిస్థితిని, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలోని సిద్ధాంత బృహద్వివాదంపై సోవియటు అవగాహనలను బలపరుస్తూ, చైనా పార్టీ జూన్ 14 లేఖలోని వివిధాంశాలను,కరేబియన్ సమస్యపై వారి వైఖరిని తిరస్కరిస్తూ తీర్మానాన్ని ఆమోదించింది. పార్టీలోని అతివాదవర్గ తీర్మానాన్ని ఆమోదించక సోవియటు చైనా పార్టీల ద్వైపాక్షిక సంభాషణలు జరిపి, అంతర్జాతీయ సమావేశానికి పన్నాహాలు జరుపుతూ అభిప్రాయభేదాలను పరిష్కరించుకోవాలనే సంక్షిప్త ప్రకటనను ప్రతిపాదించగా, కేంద్రసమితి తిరస్కరించింది. కేంద్రసమితి విడివాద,సాహసికవాదానికి వ్యతిరేకంగా "పార్టీలో అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో ఐక్యత" అనే మదీర్ఘ నివేదికను ఆమోదించింది.

భారత కమ్యూనిస్టుపార్టీలోని అతివాద వర్గం, మార్క్సిస్టుపార్టీగ యేర్పడి బర్ద్వాన్ ప్లీనంలో "జాతీయ విముక్తి విప్లవాలు ప్రపంచ సోషలిస్టు విప్లవంలో భాగమయ్యాయి", "సామ్రాజ్యవాద పునాదులను కదలించి వేస్తున్నవి", "ఈ పురోగమనం పెట్టుబడిదారి దేశాలలో కార్మికవర్గ పోరాటాలను, ప్రపంచ సోషలిస్టు విప్లవాభివృద్ధిని త్వరితం చేస్తున్నది" అంటే "అంతర్జాతీయ కార్మికవర్గ విప్లవ విజయం" వొక విధంగా ఆధారపడి వుంది. ఈ జాతీయ విముక్తి పోరాటాలు ప్రాంతీయ ప్రాముఖ్యతనే గాక అంతర్జాతీయ సోషలిస్టు విప్లవ ప్రాముఖ్యతను, కాంతి ప్రాముఖ్యతగలవని వివరించింది. సామ్రాజ్యవాదం, సోషలిస్టు శిబిరాల మధ్యగల వైరుధ్యం ప్రధానమని అమోదించుతు, సామ్రాజ్యవాదంచే అణచివేయబడుతున్న జాతులమధ్యగల వైరుధ్యం తీవ్రతరమై జాతీయ విముక్తి విప్లవాల వెల్లువై, అన్ని వైరుధ్యాలను ప్రభావితం చేస్తున్నదని, మన కాలంలో అన్ని వైరుధ్యాలకే కేంద్రమైందని, ప్రపంచ చారిత్రికాభివృద్ధి యీ వైరుధ్య ఫలితంపై ఆధారపడి వుందని వివరించింది.

(6)

వ్యక్తి పూజా విధానం, స్టాలిన్ వ్యతిరేక సిద్ధాంత పోరాటంలో చైనా, సోవియట్ కమ్యూనిస్టుపార్టీల మధ్య తీవ్ర భేదాభిప్రాయామున్నవి. సోవియట్ పార్టీ కేంద్ర సమితి సభ్యులకు బహిరంగ లేఖలో శ్రామిక ప్రజాసామాన్యం, పార్టీపైగల స్టాలిన్ వ్యక్తి పూజా విధాన విషమ ఫలితాల బరువును దించివేయుటకు, 20 వ పార్టీ కాంగ్రెసు, ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల 1957, 1960 సమావేశాలలో స్టాలిన్ వ్యక్తిపూజా విధానాన్ని తీవ్రంగా ఖండించి, సోషలిస్టు భావజాలాన్ని పరిశుద్ధం చేయుటకు, లెనినిజాన్ని పునఃప్రతిష్ఠించుటకు, సోషలిజాన్ని కాపాడుటకు, అనుభవాల పాఠాలు అందరి అందుబాటులో వుంచుటకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రయత్నించింది. మావో చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ కాంగ్రెసుతో వ్యక్తిపూజా

విధానంపై సోవియట్ వైఖరిని శ్లాఘించారు, అదే కాంగ్రెసులో లీషాచీ "సోవియట్ గొప్ప ప్రయత్నం చేసిందని", టెంగ్ హిసియాపింగ్ "వ్యక్తిపూజా విధాన ఖండన సమిష్టి నాయకత్వాన్ని పూర్తిగా పునరుద్ధరించిందని" వ్యాఖ్యానించారు. చైనా పత్రిక జెన్‌మిన్‌పావో సంపాదకీయంలో సోవియట్ పార్టీ వ్యక్తిపూజా విధానాన్ని వెల్లడించి, ఖండించి ధైర్యసాహసాలను ప్రదర్శించిందని ప్రశంసించింది. ఈ ప్రశంశలను 1963 జూన్ 14 చైనా పార్టీ కేంద్ర సమితి లేఖలలోని వ్యాఖ్యలను నిష్పక్షపాతముగా పరిశీలించిన, చైనా సిద్ధాంత అవగాహనలలో 180 డిగ్రీల మార్పు స్పష్టమని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తన బహిరంగ లేఖలో విమర్శించింది. చైనా పార్టీ వైఖరి జీవితాన్నుండి, వాస్తవ పరిస్థితుల నుండి వేరుపడిపోయి సిద్ధాంతాలను అజ్ఞాపత్రాలుగా, పిడివాదంగా, సెక్టేరియన్ దృక్పథంతో అమలు చేయుటను తెలియజేస్తున్నదని సోవియట్ 'కమ్యూనిస్టు' పత్రిక విమర్శించింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ 1963 జూన్ 14 లేఖలో, కొందరు వ్యక్తిపూజా విధాన నిరోధమన్న పేరుతో ప్రజలు, పార్టీలు, నాయకుల మధ్య వుండవలసిన సంబంధాలపై లెనిన్ సమగ్ర ఆలోచనా విధానాన్ని అతిక్రమించి, సిద్ధాంత పోరాట పరిమితులను దాటి, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి నష్టం కలుగజేసారని తీవ్రముగా విమర్శించింది. కార్మికవర్గ విప్లవంలో కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యాలయం. ప్రతి కార్మిక పార్టీ ప్రజాస్వామ్య ప్రాతిపదికగా కేంద్రీకృత విధానాన్ని అనుసరించి బలమైన మార్క్సిస్టు-లెనినిస్టు నాయకత్వాన్ని నిర్మించుతుంది. వ్యక్తిపూజా వ్యతిరేక పోరాటమనే పేరుతో పార్టీ శ్రేణులను, ప్రజలను నాయకత్వానికి వ్యతిరేకంగా నిలబెట్టుట, కేంద్రీకృత ప్రజాస్వామ్య సమిష్టి నాయకత్వాన్ని ధిక్కరించుటయే గాక, పోరాటశక్తిని నిర్వీర్యం చేసి, పార్టీ వర్గాలను చిన్నాభిన్నం చేస్తుందని యీ వైఖరిని లెనిన్ "హేళనాభరిత అసంగతం బుద్ధిమాలినదని" అన్నారని పేర్కొన్నది. వ్యక్తిపూజా వ్యతిరేక పోరాటమనే ముసుగులో, సోదరపార్టీల విషయాలలో నాయకత్వ మార్పులలో కలుగజేసుకొంటూ, తమ తప్పుడు విధానాలను రుద్దుతు, సెక్టేరియనిజం, చీలికల తత్వాలను పెంచుతున్నారని విమర్శించింది.

లెనిన్ తదనంతరం మూడు దశాబ్దాలు సి. పి. యస్. యు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు నాయకత్వం వహించి అతివాద, మితవాద, అవకాశవాదాలకు వ్యతిరేకంగా పోరాడి మార్క్సిజం-లెనినిజంలను సంరక్షించి, రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీయిజాన్ని భూస్థాపితం చేయగలిగినంతటి సైనిక శక్తిని సోవియట్ యూనియనులో నిర్మించుట, ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలన్నిటికి మార్గదర్శక సూత్రాలు, సలహా, సహాయాలనందించి, బలమైన ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమాన్ని నిర్మించిన మహోన్నత పాత్ర, చరిత్ర పుటలలోని స్వర్ణాక్షరాలను ఎవ్వరూ తుడిచివేయలేరని భారత కమ్యూనిస్టు-మార్క్సిస్టుపార్టీ స్పష్టం చేసింది.

భారత కమ్యూనిస్టుపార్టీ 1956 సోవియట్ 20 వ పార్టీ కాంగ్రెసు విధానాలను స్టాలిను వ్యక్తిపూజా విధానానికి వ్యతిరేకంగా సోవియట్టు యూనియను చేబట్టిన వైఖరిని సమర్థిస్తూనే వచ్చింది జాతీయ సమితి 1962 ఆగస్టు తీర్మానం సోవియట్టు 20 వ పార్టీ కాంగ్రెసు వ్యక్తిపూజా వ్యతిరేక పోరాటాన్ని సాహసోపేత చర్యగా, సోవియటు సమాజాన్ని కమ్యూనిజం గమ్యానికి చేర్చు వైఖరిగ పేర్కొంది. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ ప్రయోజనాలకు తగివున్నది. వ్యక్తి పూజా వ్యతిరేక పోరాట ఫలితంగా సోవియటు యూనియను బహుముఖపురోగమనం, పనిలో ప్రజా చొరవ పెంపొందించుటనే సోవియట్ ప్రచారాన్ని పునరుద్ఘాటించింది. వ్యక్తి పూజా వ్యతిరేక పోరాటం సమతూకంలో వాస్తవాలననుసరించి వుండాలంటూనే సోవియట్ నాయకత్వం చూపిన ధైర్య సాహసాలను ప్రశంసించుట అన్నిరంగాలలో దాని ఖండన మార్క్సిస్టు-లెనినిస్టు ప్రమాణాలను పునరుద్ధరించుటగా సోవియట్ వైఖరిని బలపరచింది.

భారత కమ్యూనిస్టుపార్టీలో అతివాదులుగ యీ సమస్యపై పార్టీ అవగాహనను వ్యతిరేకించుతు, 1964లో భారతకమ్యూనిస్టుపార్టీ-మార్క్సిస్టుగా ఏర్పడి 1968 బర్ద్వాన్ ప్లీనంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సిద్ధాంత సమస్యలపై తీర్మానాన్ని ఆమోదించింది. సోవియట్ 20వ పార్టీ కాంగ్రెసు జరిగి దశాబ్దాలైనా కృశ్చేవ్ రహస్య నివేదిక అమెరికాచే ప్రపంచమంతటా పంచబడినా దానిపై అధికారికంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ యెట్టి ప్రకటన చేయకుండుటపై అసంతృప్తిని తెలియజేసింది. స్టాలిన్ సమస్యను సోవియటు కమ్యూనిస్టుపార్టీ తన స్వంత సమస్యగా నెంచింది. వివిధ దేశాల కమ్యూనిస్టుపార్టీలు తప్పులనుండి గుణపాఠాలు నేర్చు కొనుటగా నెంచలేదు. స్టాలిన్ అధ్యయనం అంతర్జాతీయ సైద్ధాంతిక సమస్యగా మార్క్సిస్టుపార్టీ చెప్పింది.

ఈ సిద్ధాంత వివాదంలో చైనా సోవియటు కమ్యూనిస్టుపార్టీలు; భారత కమ్యూనిస్టుపార్టీ ,మార్క్సిస్టుపార్టీలన్నీ వ్యక్తి పూజా విధానాన్ని నిరసించాయి. సోవియటు కమ్యూనిస్టు పార్టీ వ్యక్తి పూజా వ్యతిరేక పోరాటమనే పేరుతో పరోక్షంగా కార్మికవర్గ నాయకత్వాన్ని కార్మికవర్గ నియంతృత్వాన్ని వ్యతిరేకించుటను చైనా కమ్యూనిస్టుపార్టీ భారత కమ్యూనిస్టు-మార్క్సిస్టు పార్టీ ఖండించాయి. భారత కమ్యూనిస్టుపార్టీ, వ్యక్తి పూజా విధానాన్ని ఖండించుటయేగాక సుముఖాంశాలంటూ కొన్నింటిని శ్లాఘించింది. కాని నష్టదాయకమైన విరుద్ధ అంశాలను ఫలితాలను పేర్కొనుటలో విఫలమైంది.

# (7)

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ 1957, 1960 సమావేశాలు అవకాశవాద, మితవాద, అతివాద సంస్కరణ వాదాలను ఖండించుతు ప్రధాన ప్రమాదం మితవాదం వలన అని స్పష్టంచేసి అభివృద్ధి క్రమంలో ఎప్పుడైనా ఏ పార్టీలోనైనా పిడివాదం సెక్టేరియనిజం ప్రధాన ప్రమాదం కావచ్చని హెచ్చరించి ద్విముఖ ధృఢతర పోరాటాన్ని ఏకకాలంలో సాగించాలని స్పష్టం చేసాయి.

మితవాద సంస్కరణవాదం ఆచరణలో బూర్జువా సిద్ధాంతాల ప్రతిబింబమని, కార్మికవర్గ విప్లవ చారిత్రికావసరాన్ని పరివర్తనకాలంలో కార్మికవర్గ నియంతృత్వ అవసరాన్ని కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని ప్రజాస్వామ్య కేంద్రీకరణ లెనినిస్టు నిర్మాణ సూత్రాలను గుర్తించక విప్లవ సారాన్ని నిర్వీర్యం చేస్తుందని నిరాయుధులను చేస్తుందని నొక్కి చెప్పాయి. అంతేగాక పిడివాదం సెక్టేరియనిజం సిద్ధాంతాభివృద్ధిని వాస్తవ పరిస్థితుల అధ్యయనాన్ని అరికట్టుతుందని ప్రజలనుండి పార్టీని వేరు చేస్తుందని విప్లవ పోరాటాలలో అతివాద సాహసిక దుందుడుకువాదాన్ని ప్రవేశ పెడుతుందని వివరించాయి.

చైనాపార్టీ 1957 సమావేశంలోనే ప్రకటనపై తన వ్యతిరేకతను తెలిపిందని సవరణలు చేసినా మితవాద ధోరణిలోనే వుందని నాడు సోదర పార్టీల కోరికపై ఐక్యతకు ఆమోదించామని 1960లోను సోవియటు ముసాయిదాను వ్యతిరేకించామని 1957 ప్రకటనలోని ఆపేరాలను అదే విధంగా తిరిగి వ్రాయుటకు సోదర పార్టీల ఐక్యతావాంఛనుమన్నించి ఆమోదించామని 1957నాటి అనంగీకార పత్రాన్ని ప్రతినిధులందరకు పంచామని వివరించింది. ఇట్టి "బిట్టిర్పోలు పంచాయితి" రాజీ జరగదని ఆ విధంగా సోవియటు నాయకత్వానికి సౌలభ్యాన్ని కలిగించి వుండవలసింది, కాదని విమర్శించితే దానిని ఆమోదించుతామని చైనా పార్టీ తెలిపింది.

నవీన సంస్కరణవాదం తాత్వికరంగంలో భౌతికతత్వశాస్త్రాన్ని స్వీయ మానసిక ఆదర్శవాదంగా విప్లవతత్వశాస్త్రాన్ని వికృత పరిణామవాదంగా మార్క్సిస్టు-లెనినిస్టు వర్గపోరాట సిద్ధాంతాన్ని మోసపూరిత "వర్గాతీత" మానవ, నైజ అతీత బూర్జువా సిద్ధాంతంగా చెప్పుతున్నది. రాజకీయ ఆచరణలో కార్మికవర్గ తాత్విక భౌతిక వాదాన్ని బూర్జువాతత్వ శాస్త్రాన్ని అవసర కార్యవాదంగా, ప్రయోజనకర దృక్పధంతో మౌలికాంశాలను ఆయుధాలుగ చూస్తుంది. మార్క్సిస్టు సిద్ధాంతాలైన "ఏకత్వంలో భిన్నత్వం" "భిన్నత్వంలో ఏకత్వం"వుద్భవించుటలను కోరి వక్రీకరించి రాజీమంతనాలకు ప్రతి పక్షాల కలయికలకు తమ అభిప్రాయాలను ప్రచారం చేయుటకు బలపరచుకొనుటకు నూతన సంస్కరణవాదులు వినియోగిస్తారు. వారి

సిద్ధాంత వేత్తలు కొందరు "ఐక్యతా సూత్రము వ్యతిరేకాల సంఘర్షణాసూత్రాలకు" సోషలిస్టు దేశాలలో కాలం చెల్లిందంటున్నారు. భౌతికవాదాన్ని తత్వశాస్త్ర మూల సూత్రాలను సంస్కరిస్తున్నారు. ఆ విధంగా వారి "సర్వప్రజాప్రభుత్వం" "శాంతియుత సహజీవనం, శాంతియుతపోటీ, శాంతియుత పరివర్తన" సిద్ధాంతాలకు తాత్విక పునాదులు యేర్పరచి వివరించారు. "అణు ఆయుధాల ఆవిర్భావం వర్గవిశ్లేషణలను వర్గ పోరాటాలను వాటి సూత్రాలను అర్థరహితం చేసిందని" అంటున్నారు. ప్రపంచంలోని వివిధ వైరుధ్యాలను సంలీనం లేక పరిష్కారం చేయవచ్చని, చేయగలమనేగాక "మానవవైజం", "మానవీయత" అనే బూర్జువా నూతన మానవతా వాదాన్ని సంస్కరణవాదులు చేబట్టారు. ఇదీ సంగ్రహంగా చైనా కమ్యూనిస్టు పార్టీ వాదన, అవగాహన.

మార్క్సిస్టు, లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీ 1950 దశకపు ఉత్తరార్థ భాగంలో మితవాద అవకాశవాద సంస్కరణవాదాలపై విస్తృత పోరాటాన్ని జరిపింది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, యుగోస్లావియా సంస్కరణవాదంపై బహిరంగ తీవ్ర సిద్ధాంత పోరాటాన్ని సాగించింది. అల్బేనియా, చైనా పార్టీలు సెక్టేరియనిజం పిడివాదాన్ని చేబట్టాయని 1950 దశకం చివరనుండి, అతివాద సంస్కరణవాదంపై ప్రధానంగా కేంద్రీకరించి సిద్ధాంత పోరాటాన్ని కొనసాగించింది. "మితవాద అవకాశవాదంపై బహిరంగ విమర్శనను యే మాత్రం సడలించకుండా, అతివాద అవకాశవాదం, సెక్టేరియనిజం, పిడివాద, సాహసిక వాదాలపై పోరాటం అవసరం" అని సోవియట్ పార్టీ సిద్ధాంత పత్రిక "కమ్యూనిజం" చైనా కమ్యూనిస్టుపార్టీపై విమర్శనా దాడిని చేసింది. అన్ని శక్తులు ఐక్యమై సామ్రాజ్యవాదానికి, గుత్తపెట్టుబడిదారి శక్తుల అంతం చూడవలసిన సమయంలో, సాహసిక వాదాన్ని ముందుకు తెచ్చి, విప్లవ సిద్ధాంత సృజనాత్మకాభివృద్ధితో పాటు విప్లవ పోరాటాలు అభివృద్ధి చెందకుండా అడ్డుపడుతున్నది. ప్రజలను పోరాటాల నుండి కమ్యూనిస్టుల నుండి దూరం చేస్తున్నది. ప్రపంచ కమ్యూనిస్టుల 1960 సమావేశం మితవాద, అతివాద సంస్కరణ వాదాలపై తీవ్ర ద్విముఖ పోరాటాన్ని కొనసాగించాలని నొక్కి చెప్పినా పోరాటాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రధానంగా అతివాద సెక్టేరియనిజం, పిడివాదాలపైనే ఆచరణలో ఆల్బేనియా, చైనా పార్టీలపై కొనసాగించింది. అదేకాలంలో మితవాద సంస్కరణ వాదంపై పోరాటాన్ని తెరమరుగునకు నెట్టివేసింది.

భారత కమ్యూనిస్టుపార్టీ 1940 దశకంలో పేరుకొనిపోయిన మితవాద సంస్కరణ వాదాన్ని సరిదిద్దు ప్రయత్నం పార్టీ 2 వ కాంగ్రెసు అతివాత సెక్టేరియనిజం, సాహసిక దుందుడుకు వాదాలతో ముగిసింది. తదనంతర కాలంలో అతివాద సెక్టేరియనిజాన్ని సరిచేయు ప్రయత్నంలో, సోవియట్ పార్టీ 20 వ కాంగ్రెసు

ధోరణి ప్రోత్సాహంతో మితవాద సంస్కరణవాదం వైపు దీర్ఘకాలం పయనించింది. ఈ అవగాహనతోనే "భారత కమ్యూనిస్టుపార్టీలో మితవాద వ్యతిరేక సిద్ధాంత పోరాటము పిడివాదంతోను, పిడివాద వ్యతిరేక పోరాటం మితవాదంతోను చేయుట జరిగింది" కాని, మార్క్సిజం-లెనినిజం భారత వాస్తవ పరిస్థితులకు అన్వయించి, మితవాద, పిడివాద వ్యతిరేక పోరాటాలు జరుగలేదనుట, అందరి ఆమోదం పొందక పోయినా, యిది చారిత్రిక వాస్తవం. అంతేగాక, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని అతివాద, మితవాద వ్యతిరేక సిద్ధాంత పోరాటాలకు అనుబంధంగా జరిగినవే గాని, స్థానిక వాస్తవికతపై ఆధారపడి జరుగలేదు.

## (౪)

మొదటి ప్రపంచ యుద్ధానంతరం, కమ్యూనిస్టుపార్టీలు శైశవావస్థలో బలహీనంగా వుండి, వివిధ కమ్యూనిస్టుపార్టీల మధ్య ఎట్టి స్నేహ, ఐక్య, సోదర సంబంధాలు లేనప్పుడు, కార్మికోద్యమాలలో బలమైన నాయకత్వాలు అభివృద్ధి చెందనపుడు, కమ్యూనిస్టుపార్టీలు ఛిన్నవిగా వుండి, సిద్ధాంత నిర్మాణ నాయకత్వ శ్రేణులు, అభివృద్ధి చెందని దశలో లెనిన్ అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీని ఏర్పరచి, రెండవ కాంగ్రెసులో ఆశయాలు, ధ్యేయాలు నిర్మాణ సూత్రాలు రూపొందించారు. ఒకే కేంద్రాన్ని యేర్పరచి, వివిధ కమ్యూనిస్టుపార్టీల సమస్యల అధ్యయనం చేసి, చర్చించి నిర్ణయాలు గైకొని, మార్గదర్శిక సూత్రాలను, సలహాలను, సూచనలను చేయు సంప్రదాయాన్ని యేర్పరచారు. విప్లవోద్యమాలకు సమిష్టిగా వ్యూహాలు, ఎత్తుగడలు, రాజకీయ విధానాలు రూపొందించుట, పోరాటాలకు సమర్థత, పరిపక్వత కలిగిన నాయకత్వం లేని కారణంగా అన్ని పార్టీల సమిష్టి ప్రయత్నాలు, కేంద్ర నాయకత్వం అవసరమైనందున ఇంటర్నేషనల్ ఆ పాత్ర వహించింది.

ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల నిర్మాణం, కార్యక్రమాలు, వర్గపోరాట అనుభవాలు, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞానం అభివృద్ధి చెందుటకు ఇంటర్నేషనల్ యెంతో తోడ్పడింది. కమ్యూనిస్టుపార్టీలు సంఖ్యలోను, సభ్యత్వం పెరిగి ప్రజాపార్టీలుగ అభివృద్ధి చెందుట, పార్టీ కార్యక్రమాలు బహుముఖంగా విస్తరించి, భిన్నత్వాన్ని, వివిధ జాతీయ నిర్దిష్ట పరిస్థితులు, సాంప్రదాయాలను పరిగణలోనికి తీసుకొనవలసిన పరిస్థితులు ఏర్పడినవి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 7 వ కాంగ్రెసు, వివిధ పార్టీల పెరుగుదల, వాటి పాత్ర, బాధ్యతలను పరిగణించి, పోరాటాలకు ఆయా పార్టీలే నాయకత్వం వహించాలని, ఇంటర్నేషనల్ ప్రతినిధులు ఆయా పోరాటాలలో భాగస్వాములు కావాలని, అప్పుడే ఆయా పార్టీల రాజకీయ విధానాలు ఎత్తుగడలను, మార్గదర్శిక సూత్రాలను వాస్తవ దృక్పథంతో రూపొందించుటకు తోడ్పడగలరని సూచించింది.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో వివిధ కమ్యూనిస్టుపార్టీలు ఫాసిస్టు వ్యతిరేక గెరిల్లా పోరాటాలు జరుపుచున్న పరిస్థితులలో, తమ తమ స్థాయి భేదాలు, భిన్న సమస్యలు, భిన్న వైరుధ్యాలను ఎదుర్కొనవలసి వచ్చుట, మారుచున్న పరిస్థితులలో విప్లవ పోరాటాలలో సత్వర నిర్ణయాలు చేయవలసినందున, ఆచరణలో స్వేచ్ఛ, స్వతంత్ర నిర్ణయాలు, కార్యాచరణ చేబట్టుటకు, ఇంటర్నేషనల్ నిర్మాణం, పని విధానం, విప్లవ పోరాటాలకు ఆటంకంగా పరిణమించింది. నిర్మాణ రూపము కాలానికి తగినదిగా మార్పు చెందక, కమ్యూనిస్టుపార్టీల చొరవ, బాధ్యతలు, కర్తవ్య నిర్వహణలకు ఆటంకంగా పరిణమించింది. యుద్ధ చరమదశలో బహుశా, అంతర్జాతీయ కమ్యూనిస్టు అగ్రనాయకత్వంచే ఎత్తుగడల సౌలభ్యం, బూర్జువా వర్గాల నిందా ప్రచారాన్ని వమ్ము చేయుట కొరకు కొమింటర్న్ 1943 లో రద్దు చేయబడింది. అయితే ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలు పరస్పర సంబంధాలు, సంభాషణలు, చర్చలు, సమిష్టి విధానాలు రూపొందించుట దుర్గమ్యమగుటతో దూరమగుట, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఐక్యతకు అపస్మృతియగుట, యుద్ధానంతర కాలంలో ఇటలీ, ఫ్రాంసు కమ్యూనిస్టుపార్టీలు బలహీనపడుటతో సమిష్టి అవగాహన, అనుభవాల పరస్పర మార్పిడి, సహకారం, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమానికి ప్రాణప్రదమైనవిగా, సమిష్టి శత్రువైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి సృజనాత్మక సైద్ధాంతిక ఆచరణ, ఐక్యకార్యాచరణ అవసరాన్ని చరిత్ర గుర్తించునట్లు చేసి, నాలుగు సంవత్సరాలలోనే మరో రూపంలో 1947 లో కొమిన్‌ఫారంగా అవతరించింది. ఆచరణలో ఏకపక్ష నిర్ణయాలు, ఆజ్ఞాబద్ధ నిర్ణయాలు, సంప్రదింపుల శూన్యతతో వెలివేతలు, బహిరంగ ఖండనలు, స్టాలిన్, తదుపరి కాలంలో సర్వసాధారణమగుటతో కొమిన్ ఫారంలో అభిప్రాయభేదాలు ఎక్కువై, 1957 నుండి వివిధ దేశాల పార్టీల మధ్య, ఏజండా, ప్రధానాంశాల మధ్య సూత్రప్రాయంగా యేకాభిప్రాయం యేర్పడిన తరువాత అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీల సంప్రదింపుల సమావేశాలు జరుపు సాంప్రదాయం యేర్పడి, 1960, 1969 సమావేశాలు జరిగాయి. కాని గతంలో వలె యెట్టి నిర్మాణ స్వరూపం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం చేబట్టు అవగాహన, సిద్ధాంతం, వుద్యమ పురోగతికి ఆటంకంగా నెంచబడింది.

కమ్యూనిస్టుపార్టీలు సర్వస్వతంత్రంగా తమ విధానాలను, కార్యాచరణను రూపొందించుకొనుట పార్టీల మధ్య సౌభాతృత్వం ఐక్యతలకు ఆటకం కాదు. స్వతంత్రతను అంతర్జాతీయ కర్తవ్యాలకు తటస్థత దూరముగ వుండుటగా విర్వచించరాదు. స్వతంత్రత పేరుతో సమిష్టితత్వానికి దూరమగుట జాతీయ దురభిమాన తత్వానికి లోనగు ప్రమాదానికి దారి తీయరాదు. సమిష్టి అవగాహన సమన్వయ కర్తవ్యాలను కమ్యూనిస్టులు లెనిన్ చెప్పినట్లు మార్గదర్శికాలు కావ స్వచ్ఛందంగా

ఆచరించాలి. ద్వైపాక్షిక బహుపాక్షికి కమ్యూనిస్టుపార్టీల సమావేశాలలో సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణ సమస్యల చర్చించుట అనుభవాలను సిద్ధాంతీకరించుట ద్వారా ఐక్యకార్యాచరణను పెంపొందించుటయేగాక నేటి పరిస్థితుల కనుగుణంగా మార్క్సిజం, లెనినిజంల అభివృద్ధికి తోడ్పడుతుంది.

చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం మాస్కో ప్రకటన స్టేటుమెంటులలో సౌహార్ధపార్టీల మధ్య సంబంధాల మార్గదర్శక సూత్రాలను వుల్లంఘించి "అగ్రరాజ్య తత్వాన్ని జాతీయ తత్వాన్ని అవలంభించి సోషలిస్టు ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నదని" "వ్యక్తిపూజా వ్యతిరేక పోరాటమనే పేరుతో వివిధ పార్టీలలో తమకనుకూల నాయకత్వాలు యేర్పడునట్లు వాటి అంతర్గత విషయాలలో సోవియటు కమ్యూనిస్టు పార్టీ కలుగజేసుకొంటున్నదని విమర్శించింది. ఆ పార్టీలలో నాయకత్వ మార్పులకు వొత్తిడి చేస్తున్నదని విమర్శించింది. "సంప్రదింపుల ద్వారా ఏక గ్రీవ నిర్ణయాన్ని రూపొందించు సూత్రాన్ని దాని అమలును సోవియటు పార్టి నాయకత్వం వ్యతిరేకించుచున్నదని "మెజారిటీ పార్టీ నిర్ణయాన్ని తప్పనిసరిగా అమలుచేయాలని ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల యే సమావేశం నిర్ణయించలేదని" చైనాపార్టీ స్పష్టం చేసింది.

క్లిష్ట పరిస్థితులలో పనిచేస్తున్న కొందరు కమ్యూనిస్టులు సోవియట్ యూనియన్ తమ దేశాలతో నెరపు సంబంధాలు, తమ ప్రభుత్వాలు కమ్యూనిస్టుల యెడల నవలంభించు వైఖరులను బట్టి వుండాలనుటయేగాక తమపై నిర్బంధకాండ సాగిస్తున్న దేశాలతో సోవియట్ "యూనియన్ వ్యాపార సంబంధాలు యేర్పరచుట తీవ్రంగా విమర్శించారు. పార్టీలమధ్య సంబంధాలను దేశాలమధ్య సంబంధాలను ఒకే దృక్పధంతో చూచుట వాస్తవ శాస్త్రీయ అవగాహనకాజాలదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంతోపాటు అభివృద్ధి చెందుతున్న కమ్యూనిస్టుపార్టీల మధ్య అధికారంలో వున్న కమ్యూనిస్టుపార్టీల మధ్య సంబంధాలు, రూపాలు మారుతుంటవి, సౌభాతృత్వ ఐక్యత పునాదులు యేర్పడుతున్నవి. అవి శిలా సదృశ్యంగా వుండాలని ఆశించుట మార్క్సిస్టు శాస్త్రీయ అవగాహనకాదు.

సోవియట్ కమ్యూనిస్టు నాయకత్వం భారత ప్రభుత్వం ప్రణాళికలను నెహ్రూ నాయకత్వం విదేశాంగ విధానాలను దేశాల రాయబార సాంప్రదాయలను మించి, బలపరచుట పొగడుట ముఖ్యంగా ఎన్నికల సమయంలో శ్లాఘించుట భారత ప్రభుత్వం యెడల కమ్యూనిస్టులు చేబట్టవలసిన వైఖరులపై అన్యాయపదేశంగా వచ్చిన సూచనలను బహిరంగంగా ఖండించకపోగా హర్షించజాలకపోవుటను భారత కమ్యూనిస్టుపార్టీ స్పష్టం చేసింది. అతివాద కమ్యునిస్టు మార్క్సిస్టుపార్టీ భారత దేశానికి సోవియటు యూనియాను చేయు ఆర్థిక పారిశ్రామిక యాంత్రిక సాంకేతిక సహాయం భారత బూర్జువా వర్గాలను గుత్తపెట్టుబడి వర్గాలతో సహా బలపడుటకే తోడ్పడుతుంది ప్రజోధ్యమాలకు తోడ్పడదని తీవ్రంగా విమర్శించింది.

(6)

బ్రిటన్ ఫ్రాంసులలో 19వ శతాబ్దంలో కార్మికవర్గ పోరాటంగా పరిణామ మొంది, అంతర్జాతీయ కార్మికోద్యమ అగ్రభాగాన వున్నవని చరిత్ర తెల్పుటను మార్క్సు, ఎంజెల్సు వివరించారు. పారిస్ విప్లవపతానంతరం జర్మన్ కార్మికవర్గం అగ్రగామిదళంగా రూపొందిందని చారిత్రిక పరిణామాలు ఆ దేశాలను యీ గౌరవ నీయ స్థానంలో ఎంతకాలం వుంచగలవో ముందుగానే చెప్పజాలమని ఎంజెల్సు పేర్కొన్నారు. ఇదే విషయాన్ని "అంతర్జాతీయ కార్మికవర్గ విప్లవ నాయకత్వం, ప్రస్తుతానికి ఎప్పటికీకాదు, రష్యన్ కార్మికవర్గం వహించింది" అని లెనిన్ 1919లో అన్నారు.

"అగ్రగామిదళం" అని ఎంజెల్సు "హెజిమొని-నాయకత్వం" అని లెనిన్ పేర్కొనుట అంతర్జాతీయ కార్మికోద్యమంలోని అగ్రగామిదళం ప్రపంచ కార్మికో ద్యమ నాయకత్వం వహించి యితర కార్మికవర్గ పార్టీలకు ఆజ్ఞలను జారీ చేయగా అవి వాటిని శిరసావహించాలని అర్థంకాదు. జర్మన్‌కార్మికవర్గ పార్టీ 19వ శతా బ్దంలో ప్రపంచ కార్మికోద్యమ అగ్ర భాగాన వున్నపుడు "యూరోపియన్ కార్మిక వర్గం పేరుతో మాట్లాడేహక్కు లేదని" ఎంజెల్సు అన్నారు. అంతేగాక ఎంజెల్సు లెనిన్ పేర్కొన్న యీ అగ్రగామిదళపాత్ర మార్పుచెందుతు వుంటుందని చరిత్ర స్పష్టం చేసింది. అగ్రగామి దళంగా వున్న పార్టీ సంస్కరణవాదం చేబటితే అది ఆ పాత్రను కోల్పోతుంది. జర్మన్ సోషల్ డెమోక్రటిక్‌పార్టీ గత చరిత్ర, 1990 దశకంలో సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ వర్తమాన చరిత్రలే ఇందుకు తార్కాణాలు.

మాస్కో 1957 యూరోపియన్ కమ్యునిస్టు సమావేశపు ప్రకటన ముసాయి దాలో ప్రపంచ సోషలిస్టు శిబిరపు నాయకత్వం సోవియటుయూనియనుగా వహించుట పేర్కొనుటకు మారుగ "సోవియట్ యూనియన్ సోషలిస్టు శిబిరపు అగ్రగామి దళం" అన్న చైనా సవరణ సుదీర్ఘ చర్చల అనంతరం ఆమోదించబడింది. ఆచర ణలో సోవియటు కమ్యునిస్టుపార్టీ సోదర పార్టీలన్నిటిపై పెత్తనం చేయప్రయత్నిం చుట కొత్తగాదు. "నాయకత్వ" వుదహరింపునకు బదులుగా "అగ్రగామిదళం"గా వుదహరింపబడుటపై సోవియటు యూనియన్ అసంతృప్తిని స్పష్టంగా వెల్లగి చేసంది.

సోవియటు కమ్యూనిస్టుపార్టీ సౌహార్ద పార్టీలపై తమ నాయకత్వం సహజ మని, తమ విధానాలు, తీర్మానాలు ప్రశ్నించజాలనివని కృచ్చేవ్ ప్రతిమాట

వ్యాఖ్య చక్రవర్తి శిలాశాసనమని అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం సంస్కరణ వాదంలో పడిపోయిందని అంటూ తమ ధ్యేయాలను రాజకీయ లక్ష్యాలను నాయకత్వాన్ని చేరుటకు సోవియటు కమ్యూనిస్టుపార్టీ అవగాహనలకు వ్యతిరేకంగా పదునైన ఆయుధంగా అంతర్జాతీయ సిద్ధాంత పోరాటాన్ని చైనా కమ్యూనిస్టుపార్టీ చేబట్టిందని, సోవియటు కమ్యూనిస్టుపార్టీ తీవ్రంగా విమర్శించింది. అంతేగాక చైనా కమ్యూనిస్టుపార్టీ "గొప్పముందడుగు" "ప్రజాకమ్యూనులు" విధానాలను చేబట్టి: సోవియటు యూనియన్ సోషలిజం ప్రారంభించి అదే దశలో కూరుకొని వుండగా చైనా కమ్యూనిజంలోని అత్యంత వేగంగా పురోగమిస్తుందని ప్రచారం మొదలుపెట్టింది. "కమ్యూనిజానికి దగ్గరిత్రోవ కనిపెట్టబడిందని, మూడు సంవత్సరాలు కష్టపడి పని, పదివేల సంవత్సరాల ఆనంద జీవితమనే నినాదాన్ని యిచ్చారు. తమకు "జాతీయ విముక్తి వుద్యమాలు చాల ప్రియమైన"వని అంటూ కమ్యూనిస్టు నాయకత్వం వలస విముక్తి పోరాటాలపై "తమ నాయకత్వం స్థాపించు ప్రయత్నం" స్పష్టమని సోవియట్ నాయకత్వం విమర్శించింది.

సాంప్రదాయకంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ నాయకత్వం వహించుతున్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఒకవైపు తమ నాయకత్వాన్ని కాపాడుకొను ప్రయత్నం మరోవైపు వలస విముక్తి పోరాటాల నాయకత్వం పేరుతో చైనా అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ నాయకత్వం చేబట్టు ప్రయత్నం స్పష్టం.